## అకారాది పట్టిక

# ఆంధ్ర క్రైస్తవ కీర్తనలు

## దైవారాధన

### దైవస్తుతి

## 1 సృష్టికర్త ప్రస్తుతి

రా – కాంభోజి తా – ఆట

అన్ని కాలంబుల – నున్న యెహోవా ని – నెన్నఁదరంబయో – కన్న తండ్రి – వన్నె కెక్కిన మోక్ష – వాసాళి సన్నుతు – లున్నతమై యుండ – మున్నె నీకు ॥నన్ని॥

1. నిన్నుఁ బ్రకటన సేయ – నిఖిల లోకములను– బన్నుగఁ జేసిన – బలుఁడ వీవె = ఉన్న లోకంబుల – నుడుగక కరుణా సం–పన్నతతో నేలు – ప్రభుఁడ వీవె = అన్ని జీవుల నెఱిఁగి – యాహార మిచ్చుచు – నున్న సర్వజ్ఞుం – డవు నీవే = ఎన్న శక్యముగాక – ఉన్న లక్షణముల – సన్నుతించుటకు నేఁ – జాలుదునా ॥యన్ని॥

2. పుట్టింప నీవంచుఁ – బోషింప నీవంచుఁ–గిట్టింప నీవంచు – గీర్తింతును = నట్టి పనికి మాలి – నట్టి మానవుల చే – పట్టి రక్షింపఁ బా–ధ్యుండ వంచు = దట్టమైన కృపను దరిఁజేర్చ నాకిచ్చి – పట్టయి నిలచియుండు – ప్రభుఁడ వంచుఁ = గట్టడచేఁ గడ – ముట్టుదనుక నా – పట్టుకొలఁది నిన్నుఁ – బ్రస్తుతింతు ॥నన్ని॥

3. కారుణ్యనిధి వీవు – కఠినాత్ముఁడను నేను – భూరి శుద్ధుఁడ వీవు – పాపి నేను = సార భాగ్యుడ వీవు – జగతిలో నాకన్న – దారిద్రుఁడే లేఁడు – తరచి చూడ = సార సద్గుణముల – సంపన్నుఁడవు నీవు – ఘోర దుర్గుణ సం– చారి, నేను = ఏ రీతి స్తుతియింతు – నే రీతి సేవింతు – నేర మెన్నక ప్రోవ – నెర నమ్మితి ॥నన్ని॥

– బేళాళ జాన్





## 2 దేవుడు సర్వస్తోత్ర పాత్రుడు

రా – ఆనందభైరవి (ఛాయ : యెహోవ భజన) తా – త్రిపుట

గానముఁ జేయుఁడు సుకీర్తనను = యెహో – వాను గూరిచి క్రొత్తఁ – గాను రక్తిగను ॥గానము॥

1. తన్నామము నుతించి యతని – రక్షఁ – జెన్నుఁగ సారెఁ బ్ర – సిద్ధముఁ జేసి = పన్నుగ నన్యులలో దన్మహిమ – యం – దున్నత చిత్రము – లను జాటండి ॥గానము॥

2. ఘనతయు మహత్త్వమును – ద – ద్ఘనని యెదుటనుండు – ఘనబలమును= వినతమౌ సౌందర్యమును – న – తనివి నిర్మల స్థల –మున విలసిల్లు ॥గానము॥

3. పరిశుద్ధాలంకారముతో – నా – పరమాత్మారాధన – పరులై యుండండి = ధరణి సకల జనులారా – లోక – గురుని యెదుట భీతిఁ – గొనుచు నుండండి ॥గానము॥

4. పరిపాలించుచున్నాఁ డనుచు తోడి – నరులతోఁ జెప్పుఁడి – ధ్ధరఁ గదకుండ = స్థిరముగఁ జేయు సత్యముగా – జనుల – కరిమురిగాను న్యా – యము విమర్శించు ॥గానము॥

5. ఏమనిన నా మహాత్ముండు – వచ్చు – నీ మహికి న్యాయము – నేర్పరచుటకు = భూమి జనులకు నీతి సత్య – ముల – తో మించు న్యాయ మెం – తో విమర్శించు ॥గానము॥

6. జనులారా యా యెహోవాకు – మహి – మను బలమును సమర్పణము జేయండి వినయముతోఁ గానుకలను – తీసి – కొని తత్ప్రాకారమందున వసియింపండి ॥గానము॥

– విలియం డాసన్

## 3 యేసు సహాయమునకై ప్రార్థన

రా – మారువ (ఛాయ : తనువు నాదిదిగో) తా – ఆది

యేసు నాయకుఁడ –యెల్ల వేళలను నీ – దాసుల నేలుమయ్యా = మోసము లన్నిటి – మునగఁద్రోతునని – బాసలు జేసిన – ప్రభుఁడవు నీవెగా॥యేసు॥

1. రేయింబవలు మా – న్యాయము చెరిపెడి – మాయ పిశాచిని = ద్రోయుమి దూరము –బాయక భక్తుల – చేయి విడువని బహుశ్రేష్ఠుఁడ నీవెగా ॥యేసు॥

2. హృదయము లోకము – మది పాపము మమ్ము – సతతము శ్రమ పెట్టును = సదయుఁడ మమ్మును – వదలక నిత్యము – మది తలపులలో – మహిమగ నేలుమీ ॥యేసు॥

3. కాపాడుమి మమ్ము – మాపు రేపు నీ – శ్రీ పాదము లొద్దను = ఏ పాపములును ఏలకుండగ నీ – ప్రాపునఁబెంచుము – మాపాలకుఁడవో ॥యేసు॥

4. మా కొరకై నీ – మేనును మ్రానున – మేకులతోఁగొట్టగ – మానము మహిమలు – మనుజుల కియ్యను – భానుఁడ రాజుగ – బ్రతికిలేచితివి ॥యేసు॥

5. చెఱను చెఱనుగా – మరి పట్టుక నీవు – పరమున కరిగితివే – వరముల నిడితివి – ధరలో నరులకు – పరముఁడ నీ దయ మరువశక్యమా ॥యేసు॥

– *గొల్లపల్లి నతానియేలు*

## 4 దేవుని యనూనత్వములు

రా – కేదారగౌళ  తా – ఆది

దేవా –[1]దివ్యానంత ప్ర – భావ – [2]మాంపాహి ఘన యె – హోవా= [3]స్థావర జంగమ – సహిత [4]నిఖిల జగ – [5]దావన పావన – భావ నిరంతర ॥ దేవా॥

1. [6]సార – కారుణ్యపారా – వారా – సర్వజ్ఞ నిర్వి – కారా – యేసు నామావ – తారా – దీన జనోప – కారా = ఘోరమైన సం – సారటవిఁ బడి – దారిఁ గనని ననుఁ – జేరఁబిలిచితివి ॥దేవా॥

2. [7]అక్షీ – ణ విభవానంద – మోక్ష – రాజ్య మహిమా – ధ్యక్ష – సంతత సుజన రక్షా – కపట దుర్మనుజ – శిక్షా = [8]పక్ష విపక్ష వి – లక్షణ రహితక – టాక్షము నాదెస – దీక్షను నిలుపవె ॥దేవా॥

[1]మితిలేని దివ్య మహిమగలవాఁడా. [2]నన్ను రక్షించుము. [3]చలింపనివాటితోను చలించువాటితోను గూడుకొనిన. [4] సమస్తలోకమును. [5]రక్షింపవలెనను పరిశుద్ధభావము నిరంతరము కలవాఁడా, [6]సారమైన కరుణకు సముద్రుఁడా. [7]తరగని భాగ్యమును ఆనందమును గలవాఁడా. [8]శత్రుమిత్త్రభావములనెడు విరుద్ధ గుణములు లేనివాడు.



3. సుంద – రాశ్చర్య [1]గుణ – బృందా –[2]బంధుర నిత్యా – నందా – సాధు సజ్జన [3]వంద్యా – [4]ఖండిత కలుష బృందా = మంద మతిని నా – డెందము కడుఁ దెలి – వొందఁ జేసి నీ – యందు నిలుపఁ గదె ॥దేవా॥

4. నీవు – నన్ను సృష్టించి – నావు – నా గురురాడ్దేవుఁ డవు – క్రీస్తు యేసుని – చావు – వలన నన్మనిపి – నావు = పావన జనక సు – తాత్మలతోడను గేవల మొక్కఁడ – వై వెలిఁగెడి ప్రభు ॥దేవా॥

5. ప్రేమ స్వరూప నిత్య – క్షేమ – [5]పతిత పావన – నామ – [6]దాస లోకాబ్ధి – సోమ సర్వేశ పరమ – ధామ = నేమ మెఱుంగని – నీచుఁడ నధముఁడ – నోమహాత్మ దయ – తో మన్నింపవె ॥దేవా॥

– పురుషోత్తము చౌదరి

## 5 దైవ స్తుతి

రా – నవరోజు  తా – త్రిపుట

నీతిగల యెహోవా స్తుతి మీ – యాత్మతో నర్పించుఁడి – మీయాత్మతో నర్పించుడి దాతయౌ మన క్రీస్తు నీతిని – దాల్చుకొని సేవించుఁడి ॥నీతి॥

1. [7]చదలఁ బుడమియు రవియు జలధియు – నదులు గిరులును జక్కఁగా = [8]సదమలంబగు దైవనామము – సర్వదా నుతిఁజేయను ॥నీతి॥

2. సర్వశక్తుని కార్యముల కీ – సర్వరాష్ట్రము లన్నియు = గర్వములు విడి తలలు వంచుచు – నుర్విలో నుతిఁజేయను ॥నీతి॥

3. గీత [9]తాండవ వాద్యములచేఁ – బ్రీతి పరచెడు సేవతో = పాతకంబులు పరిహరించెడు – దాతనే సేవించుఁడి ॥నీతి॥

4. పరమదూతలు నరులు పుడమిని – మొరలుబెట్టుచు దేవుని= పరము నందున్నట్టి యేసుని – పాదములు సేవింతురు ॥నీతి॥

[1]గుణానమూహము కలవాఁడా. [2]దట్టమైన నిత్యానందముకలవాఁడా. [3]సమస్కరింపఁ బడదగినవాఁడా. [4]ఎంతమాత్రము పాపము లేనివాఁడా. [5]పాపులను పవిత్రపర్చువాఁడనుపేరు కలవాఁడా. [6]దానసమూహమను సముద్రమునకు చంద్రుని వంటివాఁడా. [7]ఆకాశము [8]పరిశుద్ధము. [9]నాట్యము.

5. ఇలను భక్తులు గూడుకొనియా – బలము గల్గిన దేవుని = వెలయు స్తుతి వే నోళ్లతోడను – విసుగు జెందక జేయుడి ॥నీతి॥

6. ఆత్మ నీవిఁక మేలుకొని శు – ద్ధాత్మఁ యేసునిఁ దండ్రిని = త్రిత్వమగునా యేక దేవుని – హర్షమున సేవింపవే ॥నీతి॥

– పసుపులేటి దావీదు

## 6 యెహొూవా స్తుతి

రా – యమన్ తా – ఆది

భీకరుండౌ మా యెహోవా – [1]పీఠ మెదుటం గూడరే – యేకమై సాష్టాంగపడి సర్వేశ్వరుని గొనియాడరే ॥భీకరుండౌ॥

1. మట్టితోనే మమ్ము నెల్ల – మానవులుగ సృజించెను = ఇట్టి శక్తుండౌ ప్రభు న్మే మెచ్చుగా మది నెంతుము ॥భీకరుండౌ॥
2. [2]ఏరితోడు లేక మము స – ర్వేశ్వరుఁడు సృష్టించెను – ధారుణిం దా నొక్కఁడే మా – దైవమని పూజింతుము ॥భీకరుండౌ॥
3. [3]పుట్టగిట్టంజేయఁదానై – నట్టి దేవుని శక్తిని = బట్టుగా లోకస్థులారా – ప్రస్తుతింపరె భక్తిని ॥భీకరుండౌ॥
4. మేటి సంగీతంబులుపై – మింట [4]నారవ మొందను = జాటరే వేవేల నోళ్ళన్ సన్నుతుల్ ప్రభు వందను ॥భీకరుండౌ॥
5. మిక్కిలి కష్టంబులతో – [5]మిత్తికిని బాల్పొందను = దిక్కులేని గొఱ్ఱె లట్లుఁ – దిరుగఁ జేర్పన్ మందను ॥భీకరుండౌ॥

## 7 దైవ నామ స్తుతి

(చాయ : దేవుడా , నను గావుము)

రా – శంకరాభరణము తా – తిశ్రజాతి ఏక

1. సన్నుతింతుమో ప్రభో – సదమలమగు భక్తితో
కన్నతండ్రి కావుమా – కలుషము నెడబాపుమా॥

[1]సింహాసనము [2]ఎవ్వరి. [3]చంపను [4]మ్రోత. [5]చావు



2. నీతిసూర్య తేజమా – జ్యోతిరత్న రాజమా
పాతకజన రక్షకా – పతితపావన నామకా॥
3. మానవ సంరక్షకా –దీన నిచయ పోషకా
దేవమానవ నందనా –దివ్య సుగుణ మందనా॥
4. ప్రేమ తత్వబోధకా – క్షేమదాత వీవెగా
కామిత ఫలదాయక – స్వామి యేసు నాయక॥
5. పాపచింతలన్నిటిన్ – పారదోలుమో ప్రభో
నీ పవిత్ర నామమున్ – నిరతము స్మరియించెదన్॥

– బొంతా సమూయేలు

## 8 సర్వశక్తుని స్తోత్రగానము

రా – బిలహరి (చాయ: యేసునాధ కథా సుధారస) తా – త్రిపుట

సర్వ శక్తుని స్తోత్రగానము – సల్పరే జగ మెల్లను= నిర్వహించును దాస భారము – నిత్య మెద రాజిల్లను ॥సర్వ॥

1. ముదముతో నిర్మాణకుండగు – మూల కర్తను బాడరే = వదన [1]మీక్ష్మాన్వంచి దేవుని వందనముతో వేఁడరే ॥సర్వ॥
2. వేదపారాయణము సేయుచు – విశ్వ మంత జయింపరే = సాదరముగా దేవు నిఁక మీ – స్వాంతమునఁ బూజింపరే ॥సర్వ॥
3. ఎదను విశ్రాంతిన్ పరేశుని – హెచ్చుగా నుతిఁజేయరే = సదమలంబగు భక్తితో మీ – సర్వ మాయన కీయరే ॥సర్వ॥
4. చావు పుట్టుక లేనివాఁడుగ – సంతతము జీవించును = ఈవు లిచ్చుచుఁ దన్ను వేఁడు మ – హేష్టులను రక్షించును ॥సర్వ॥
5. దాసులై దేవునికి నెదలో – [2]దర్పమును బోఁగాల్పరే = యేసుక్రీస్తుని పుణ్యవస్త్రము – నే మరక మైంఁదాల్పరే ॥సర్వ॥

– మిక్కిలి సమూయేలు

[1]భూమిపై వంచి. [2]గర్వమును.

## 9 స్తుతి గీతము

రా – శంకరాభరణము  తా – ఏక

ప్రబలముగనే – ప్రస్తుతించెద – ప్రభుని కృపలన్ని = ప్రతి దినము
నిను – ప్రచురపరచెద – ప్రభుడ నావిభుడా ॥ప్ర॥

1. పొందుగోరి నా – యందు నిలిచిన – బంధుమిత్రుడవు = మందమతి కా – నందమొసగిన – మహిమతేజుడవు ॥ప్ర॥
2. చింతదీర్చి నా – భ్రాంతి మార్చితి – వెంత వింతదియో = స్వాంతమున కడు – శాంతిగూర్చితి – వెంత కరుణదియో ॥ప్ర॥
3. నీతి కరపిన – జాతి మరపిన – ఖ్యాతి యేసునిదే = నీరసుడ నను – గారవించిన నీతిరాజితడే ॥ప్ర॥
4. జీవమిచ్చిన – జావవచ్చిన – దేవసుత నీవే = జీవదాయక – బ్రోవరా యిక – జాలమేలనురా ॥ప్ర॥
5. నిమిషనిమిషము – నిను భజించెద – నెమ్మనంబునను = శమదమాది – సుగుణశోభిత – సమ్మదిని నిమ్మా ॥ప్ర॥

– చెట్టి భానుమూర్తి

## 10 దేవుని ప్రేమ

రా – జంఝూటి  తా – ఆది

ఎంత ప్రేమ యెంత ప్రేమ యెంత ప్రేమయా – దేవుఁ = డెంత
గొప్ప ప్రేమయై వెలుంగుచుండునే ॥ఎంత॥

1. ఎంత లోతు ఎంత నిడివి యెంత విరివయా – దాని = నింత యంతయని వచించు మనుజుఁ డెవ్వఁడు ॥ఎంత॥
2. మనమునఁ దలపోయ నూహకంద దెంతయున్ – దానిఁ = జనువుఁగ జగమందుఁ బొగడ మాట లందవే ॥ఎంత॥
3. దేవదూతలైన దానిఁ బాడలేరట – యింక = దేవుఁడే తన సుతు నొసంగి ఇంత యది యనెన్ ॥ఎంత॥
4. ఇంత గొప్ప ప్రేమఁ జూప నూరకుందునే – ప్రభు = జెంతఁజేరి సంత తంబు ప్రీతిఁ జేసెదన్ ॥ఎంత॥



## 11 దేవుని వైపు చూచుట

రా – కమాసు  తా – త్రిపుట

చూచుచున్నాము నీ వైపు – మా ప్రియ జనక – చూచుచున్నాము
నీవైపు = చూచుచు నీ ప్రేమ – సొంపు సువార్తను – జాఁచుచుఁ గరములు – చక్కఁగా నీవైపు ॥చూచు॥

1. మే[1]మరులమై యుంటిమి – మార్గము వీడి – మేమందరము పోతిమి = ప్రేమచే నప్పుడు – ప్రియ తనయు నంపించి – క్షేమమార్గము మాకుఁ – బ్రేమను జూపితివి ॥చూచు॥
2. నిను నమ్ము పాపులకు – వారెవరైన – నీ శరణుఁ జొచ్చువారలకు = [2]ఇనుఁడవు [3]కేడెంబు – నీ జగతిలో నగుచుఁ – గనుపరచుచుందువు – ఘన మైన నీ కృపఁ ॥చూచు॥
3. నీ భయము మాయెదలను – నిలుపుము నీదు – ప్రాభవ మొనరంగను = నీ భయముచే మేము – వైభవ మొందుచు – నే భయము లేకుండ – నీ భువిని గొన్నాళ్ళు ॥చూచు॥
4. దయఁజూచి మము నెప్పుడు – మంచివి యన్ని – దయచేయు మెల్ల ప్పుడు దయచేయరానివి దయచేయుమని కోరఁ – దయజూపి మన్నించు – దయగల మా తండ్రి ॥చూచు॥

– పులిపాక జగన్నాథము

## 12 యెహోవా దేవుని స్తుతి

(103–వ దావీదు కీర్తన)

రా – ఆనందభైరవి  తా – ఆది

దేవ సంస్తుతి చేయవే మనసా – శ్రీ – మంతుడగు యెహోవా సంస్తుతి చేయవే మనసా = దేవ సంస్తుతి చేయుమా నా – జీవమా యెహోవా
దేవుని – పావన నామము నుతించుమా – నా యంతరంగము – లో వసించు నో సమస్తమా ॥దేవ॥

---

[1]శత్రువులము.  [2]సూర్యుఁడవు.  [3]డాలు

1. జీవమా, యెహోవా నీకుఁ - జేసిన మేళ్లన్ మరవకు = నీవు చేసిన పాతకంబులను - మన్నించి జబ్బు - లేవియున్ లేకుండఁ జేయును - ఆ కారణముచే ॥దేవ॥
2. చావు గోతినుండి నిన్ను - లేవనెత్తి దయను గృపను - జీవ కిరీటముగ వేయును - నీ శిరసుమీద జీవ కిరీటముగ వేయును - ఆ కారణముచే ॥ దేవ॥
3. యౌవనంబు పక్షిరాజు - యౌవనంబు వలెనె క్రొత్త = యౌవనంబై వెలయునట్లుగా - మే లిచ్చి నీదు-భావమును సంతుష్టిపరచునుగా - ఆ కారణముచే ॥దేవ॥
4. ప్రభువు నీతి పనులు చేయున్ - బాధితులకు న్యాయ మిచ్చున్ = విభుండు మార్గము తెలిపె, మోషేకుఁ - దన కార్యములను - విప్పె నిశ్రా యేలు జనమునకు - ఆ కారణముచే ॥దేవ॥
5. అత్యధిక ప్రేమ స్వరూపి-యైన దీర్ఘ శాంతపరుండు - నిత్యము వ్యాజ్యంబు చేయఁడు - ఆ కృపోన్నతుఁడు - నీ పయి నెపుడు కోప ముం చఁడు - ఆ కారణముచే ॥దేవ॥
6. పామరుల మని ప్రత్యుపకార - ప్రతి ఫలంబుల్ పంపలేదు = భూమి కన్న నాకసంబున్న - యెత్తుండు దైవ - ప్రేమ భక్తి జనులయందున ఆ కారణముచే ॥దేవ॥
7. పడమటికిఁ దూర్పెంత యెడమో - పాపములకును మనకు నంత = యెడము కలుగజేసియున్నాఁడు - మన పాపములను - ఎడముగానే చేసియున్నాఁడు - ఆ కారణముచే ॥దేవ॥
8. కొడుకులపైఁ దండ్రి జాలి - పడు విధముగా భక్తిపరుల = యెడల జాలి పడును దేవుండు - తన భక్తిపరుల -యెడల జాలిపడును దేవుండు - ఆ కారణముచే ॥దేవ॥
9. మనము నిర్మితమయిన రీతి- తనకుఁ దెలిసియున్న సంగతి = మనము మంటి వారమంచును - జ్ఞాపకముచేసి - కొనుచు కఱుణ జూపుచుండును ఆ కారణముచే ॥దేవ॥



10. పూసి గాలి వీవ నెగిరి - పోయి బసను దెలియని వన - వాస పుష్పము వలెనె నరుఁడుండు - నరు నాయువు తృణ - ప్రాయము మన దేవ కృప మెండు - ఆ కారణముచే ॥దేవ॥
11. పరమ దేవ నిబంధ నాజ్ఞల్ - భక్తితోఁ గైకొను జనులకు = నిరతమును గృప నిలిచి యుండును - యెహోవా నీతి-తరములు పిల్లలకు నుండును - ఆ కారణముచే ॥దేవ॥

*- ముంగమూరి దేవదాసు*

## 13 నీవే నా సహాయుడవు

రా - శంకరాభరణము (చాయ: మన మొదటి తలిదండ్రుల్) తా - త్రిపుట

నా కాలగతు లెవ్వి - నా చేతులను లేవు - నాదు దేవ = యెపుడు - నీకే వాని మీద - నిత్యాధికారంబు - నిల్చియుండు ॥నా॥

1. తల్లిగర్భంబున - దసర సృజించితివి - ధరణి నన్ను = నీవు - తల్లికన్నను మిగుల - దయచేతఁ జూచితివి - తండ్రి నన్ను ॥నా॥
2. పాప కూపమునందుఁ - బడియుండఁగా నన్నుఁ - బారఁజూచి = చేయి - చాపి యేసునిద్వార - చక్కఁగాఁదెచ్చితివి - చాలు దేవ ॥నా॥
3. సుఖఃదుఃఖ కాలములు - శోధింపఁ - బంపుదువు - శోభాయుక్త = నాకు - సుఖముఁ గల్గజేయు - సొంపుగ వానిచే - స్థూల శక్తి ॥నా॥
4. సకల కాలంబులఁ - జక్కఁగ లోఁబడి - నన్నుతింతు = నన్ను - ఆకలంకునిగాఁ జేయు - మనుచు వేఁడుచునుందు - నధికాసక్తి ॥నా॥

*- పులిపాక జగన్నాథము*

## 14 యెహోవా నా కాపరి

(23-వ దావీదు కీర్తన)

రా - సావేరి రా - త్రిపుట

నాకేమి కొదువ - నాథుఁడుండ నిఁక = శ్రీకరుండగు దేవుఁడే నా - శ్రేష్ఠ పాలకుఁడు - నా - యేక రక్షకుఁడు గనుక ॥నాకేమి॥

1. తనివి దీరఞ మే-ళ్లనుభవింప - నేను = నను సదా మేళ్లనెడి పచ్చిక -
నదిమి మృదువుగఁ - బండు - కొనఁజేయును గనుక ॥నాకేమి॥
2. ఎంత శోధన - యెండ యున్న - నాకు = నెంతకు నోరిగర దెపుడు -
శాంత జలములు - నా చెంతనే యుండుఞ గనుక ॥నాకేమి॥
3. తప్పిపోయిన నన్ - దారిం బెట్టి - నన్ను = తెప్పరిల్లఁజేసి నాకుఁ దీరు
నలసటను - నా - తప్పు మన్నించున్ కనుక ॥నాకేమి॥
4. నీతి మార్గమునన్ - నిల్పున్ నన్ను - ప్రభువు = నీతి లేని నాకుఁ దననం
- నీతి దయ చేయున్ - స్వ - నీతిని ద్రుంచున్ గనుక ॥నాకేమి॥
5. చావు చీఁకట్ల - శక్తియుండు - ఆహా = లోయలోఁబడి పోవలసినను -
నే వెరవకుందు - నా - దేవుండే తోడు గనుక ॥నాకేమి॥
6. మీఁదఁబడునట్టి - శోధనలన్ - ధరను = నా దరికి రానీక దండము -
నన్ను బ్రోచుచును - నా - కాదరణ యౌను గనుక ॥నాకేమి॥
7. పగవారల్ సిగ్గు - పడునట్లుగ - నా =జగము యెరుఁగని సౌఖ్యభో జన
మగపరుచును - హా - తగినదే పెట్టున్ గనుక ॥నాకేమి॥
8. తన యాత్మానంద - తైలంబుతో - ప్రభువు = ననుదినము తలయంటి
విసుగ - కొనక తుడుచును - నా కన్నీళ్లన్ని గనుక ॥నాకేమి॥
9. పలువిధములైన భాగ్యములతో - తండ్రి = వెలుపలికి దిగవెడలునట్టి -వెల
గల గిన్నె - నా కలిమిగాఁ జేయున్ గనుక ॥నాకేమి॥
10. బ్రదుకంతటన్ గృ - పా క్షేమములు - నా = వదలకుండగ వచ్చు
నాతో - సుదినములు గల్గ - నా - పదలు సంపదలౌ గనుక ॥నాకేమి॥
11. దురితంబు లుండు - ధరణి నాకు నిజము = నిరవు కాఁదిక నెప్పటికి
నా - పరమ దేవుని - మం - దిరమె నా యిల్లు గనుక ॥నాకేమి॥

*- ముంగమూరి దేవదాసు*

## 15 యెహోవా నా కాపరి

(23వ దావీదు కీర్తన)

రా - శంకరాభరణము (చాయ: ఎంత ప్రేమ) తా - ఏక

యెహోవా నా కాపరి లే - మేమి గలుగదు = తన - మహా కృపతోఁ
బ్రోచి నన్ను - మనుపు నాతఁడే॥



1. పచ్చికగల చోట్ల నను ప-రుండజేయుచుఁ - గడు - హెచ్చుగు సౌఖ్యములు
సదా - యిచ్చు నాతఁడే ॥
2. శాంతికర జలములకు నను-సాగజేయుచు = వి-శ్రాంతి ప్రాణమున కొసంగు
- విభుఁడు ఆతఁడే ॥
3. గాఢాంధకారమైన లోయల - గుండ బోయిన = నే-కీడుకు భయపడ నిఁక
నా - తోడు ఆయనే ॥
4. దుడ్డుకఱ్ఱతో శత్రువులఁ - దరుమఁగొట్టుచుఁ = దన - దొడ్డ దండముతో
నీతి - దారిలో నడుపు ॥
5. అందరిలో నన్ను నెంచి - యధిక ప్రేమతోఁ = గడు - విందు లొసఁగి
తృప్తిపరుచు - విభుఁడు - ఆయనే ॥
6. ముఖము కళగా నుండునట్లు - మంచితైలమున్ = నా - సఖుఁడు నాకుఁ
బూయుచుండు - సకల వేళలన్ ॥
7. బ్రదుకు దినము లన్నిట నాకు - బంటులవలెనే = నను - వెదకి కృపా
క్షేమములు నా - వెంటవచ్చును ॥

*- సరెళ్ల నమూయేలు సుబ్బయ్య*

## 16 యెహోవా ప్రేమ

(23వ దావీదు కీర్తన)

రా - శంకరాభరణము తా - ఆది

యెహోవా నా మొఱ లాలించెను - దన - మహా దయను నను [1]గణిం
చెను = [2]అహర్నిశల దీనహీనుఁడగు నా - దు [3]హాయనెడు ధ్వని -
గ్రహించి [4]మనిపెను ॥యెహోవా॥

1. పిశాచి గడిమిఁబడఁగొట్టెను - దన - వశాన నను నిలువఁ బెట్టెను =
[6]ప్రశాంత మధుర సు - విశేష [7]వాక్ఫల - [8]నిశాంతమునఁ జే - ర్చి [9]సేదఁ
దీర్చెను ॥యెహోవా॥

---

[1]సంపాదించెను. [2]రాత్రియందు పగటియందు. [3]దుఃఖము చేతగలిగిన. [4]రక్షించెను.
[5]శక్తి. [6]మిగుల నెమదిగల. [7]వాక్కుయొక్క ఫలమైన [8]గృహమున [9]అలత.

2. [1]మదావళముఁ బోలు నామదిన్ – దన – [2]ప్రదీప్త వా[3]క్యాం కూశా హతిన్ = యధేచ్ఛలన్నిటి గుదించి పాపపు – మొదల్ తుదల్ నరి – కి దరికిఁ జేర్చెను ॥యెహోవా॥
3. అనీతి వస్త్ర [4]మెడలించెను – యే – సునాథు రక్తమున ముంచెను = [5]వినూత్న యత్నమె – ద నూని యెన్నఁడు – గనన్ వినన్ బ్రే – మ నాకుఁ జూపెను ॥యెహోవా॥
4. విలాపములకుఁ జెవి నిచ్చెను – శ్రమ – కలాపములకు సెలవిచ్చెను = శిలానగము పై – కిలాగి నను సుఖ – కళావళుల్ మన – సులోన నిలిపెను ॥యెహోవా॥
5. అగణ్య పాపియని త్రోయక – న – న్ను గూర్చి తన సుతుని దాఁ చక = తెగించి మృతి కొ – ప్పగించి పాపపు – నెగుల్ దిగుల్ సోగ – సుగా నణంచెను ॥యెహోవా॥

– పురుషోత్తము చౌధరి

## 17 దైవారాధన

రా – నాదనామక్రియ తా – అట

యెహోవా భజన చేయండి – పాప – నరులారా యీ రీతి మరచి పోకండి ॥యెహోవా॥

1. యేసు పేరిట ప్రార్థనంబు – మన దోసములను బోగొట్టను వెరవు = భాసుర పరలోక సుఖము – కోటి – బాధలు – మనకున్న –సంతోషకరము ॥ యెహోవా॥
2. యేసు క్రీస్తును గొలువండి – యేసు – దాసులతో వాదము లాడ కండి = మోసపు దారి విడువండి – దోష – రాసుల నుర్విలోఁ – జేసికొన కండి ॥యెహోవా॥
3. జీవ రక్షకుని నమ్మండి – నిత్య – సేవలో మెలఁగక చెడిపోవకండి = భావించి యాత్మన్ వేఁడండి – దేవ – దేవుని నెడఁబాసి తెరవు విడకండి ॥ యెహోవా॥

[1]మదించిన యేనుగు. [2]ప్రకాసమైన. [3]అంకుశపు దెబ్బ చేత. [4]పోగొట్టెను. [5]క్రొత్త.



4. మాయ లోకపు భ్రాంతు ల్విడిచి – మను – ష్యాయువు భువిలోన జెల్లుటఁ దలఁచి = మాయ మార్గము లెల్ల మరచి – మోక్ష – మార్గము మన మున – మరవక తలఁచి ॥యెహోవా॥
5. కాయము నొసఁగిన ప్రభుని – యయిదు – గాయంబు లాత్మలోఁ గానంగ రాదా = ఆయు వస్థిర మని తెలిసి – మీరు – కాయ మాత్మయు నిపుడు – కర్తకు నిచ్చి ॥యెహోవా॥

– యేసుదాసు నర్సయ్య

## 18 క్రైస్తవారాధన

రా – సురటి తా – త్రిపుట

కూడికొని యున్నాము – సంఘ ప్రభో – కూడికొని యున్నాము = తోడ నుండెద ననుచు నమ్ముచు – దొడ్డ దగు నీ పాద సన్నిధి ॥కూడి కొని॥

1. ఎచట నా ప్రియ భక్తు – లెలమిఁ గూడియున్న నచటికి నేతెంతు – నని పల్కితి = విచట నుండు మమ్ము – వీక్షించి కృపచేత – నిపుడు దీవించు మీ – యేసు క్రీస్తునాధా ॥కూడికొని॥
2. గత కాలమందున – గాని చేఁతలచే దు – ర్గతి నొంది యుండఁగాఁ – గనుఁగొంటివి = శత సంఖ్య గల పాప – చయ మీవు క్షమియించి – యతి శాంతి నిడితివి – యాత్మస్వరూపా ॥కూడికొని॥
3. నిరతము నీ ప్రేమ – నెనరున ధ్యానించి –పరమ ధర్మములందుఁ – బరతఁ గల్గి = యరులకు శుభములు – నిరతంబుఁ జేయఁగఁ – దిరత మా కొసఁగు ము – దేవుని ప్రియ తనయా ॥కూడికొని॥
4. అన్ని శోధనముల – నన్ని విపత్తుల – నన్ని కాలములందు – నాదరించి నిన్ను నమ్మిన జనుల – నీ సందిటను జేర్చి – పన్నుగఁ గాపాడు – ప్రభు యేసు క్రీస్తు ॥కూడికొని॥
5. అమలుఁడ నగు న – న్న నుకరించుం డనుచు – నాన తిచ్చినాఁడ–వాత్మ జులకు = నమల మార్గము నందు – నరుగంగ మాకీవు – విమలాత్మ దయ సేయు – వేగంబు మా తండ్రీ ॥కూడికొని॥

– పులిపాక జగన్నాథము

## 19 దేవుని మందిరావరణములు

(దావీదు కీర్తన 84)

రా - హిందుస్థాని ముఖారి తా - జుల్వ

(చాయః సాక్ష్యమిచ్చెద)

చూడ గోరెద - దేవ - మంది రావరణములను - చూడ గోరెద = చూడ నాకు నాశ గలదు - సుంద రావరణము లవి = చూడ నాదు ప్రాణమెంతో - సొమ్మసిల్లుచున్నదహో ॥చూడ॥

1. నీదు నివాసములు జూడ - నెంతో రమ్యమై తనర = నాదు హృదయమునకు నా - నంద మిచ్చు నిపుడు నెపుడు ॥జూడ॥
2. జీవము గల ప్రభుని జూడ - జీవి నాలో కేక వేసె = కోవెలలకు దొతికె గూటి - తావు నీ మందిరమున ॥చూడ॥
3. పిచ్చుకలకు దొతికె స్థలము - ముచ్చట బలిపీఠ మెదుట = పెట్టు కుతూహలముతోను - పిల్లల నవి మందిరమున ॥చూడ॥
4. నీదు మందిరంబులోన - నిత్యవాసులైనవారు = నిక్కముగను ధన్యులగుచు - నిన్ను నన్నుతింతు రహో ॥చూడ॥
5. ప్రభుని వలన బలము నొందు - ప్రజలు ధన్యులగుదు రిల = ప్రాణ ప్రియము యాత్ర సేయు ప్రజల మార్గ మమర ధరను ॥చూడ॥
6. నీదు యావరణములలో - నేను నొక్క దినము గడుప = నెంతో విలువ గల నాకు - వేయినాళ్ల బ్రతుకు కన్న ॥చూడ॥
7. కానరందు మనము నిపుడె - మనము లలర ప్రభుని జూడ = మందిరమున కేగి నిండు - మనశ్శాంతి బొంది బ్రతుక ॥జూడ॥

- ఎం. జే రామాంజులు

## 20 త్రైక దేవుని స్తుతి

రా - శంకరాభరణము తా - అట

పరిశుద్ధ పరిశుద్ధ - పరిశుద్ధ ప్రభువా = వరదూత లైన నిన్ - వర్ణింపc గలరా ॥పరిశుద్ధ॥



1. పరిశుద్ధ జనకుcడ - పరమాత్మరూపుcడ = నిరుపమ బలబుద్ధి - నీతి ప్రభావా ॥పరిశుద్ధ॥
2. పరిశుద్ధ తనయుcడ - నరరూపధారుcడ = నరులను రక్షించు - కరుణా సముద్రా ॥పరిశుద్ధ॥
3. పరిశుద్ధ మగు నాత్మ = వరము లిదు నాత్మ = పరమానందప్రేమ - భక్తుల కిడుమా ॥పరిశుద్ధ॥
4. జనక కుమారాత్మ - లను నేక దేవా = ఘనమహిమ చెల్లును - దనర నిత్యముగాc ॥పరిశుద్ధ॥

- యెషయా వీరమార్టిన్

## 21 త్రిత్వమునకు స్తుతి

రా - కాంభోజి (చాయః యేసు నీ నామామృతము) తా - ఆది

త్రిత్వమై నిత్యత్వమున నే - కత్వమగు దేవా - నీ = సత్యసామర్థ్యత్వముల నిజ - తత్వము గణించి నిను నిత్యము స్తుతించెదను ॥త్రిత్వమై॥

1. ఎల్లలోకంబుల సృజించిన - చల్లని తండ్రి - నా = యుల్లమున నీ గొప్ప వింత - లెల్ల సంతసిల్ల శో - భిల్లc దలంచెదను ॥త్రిత్వమై॥
2. వాసి కెక్కిన పరమరాజ్యని - వాసమును విడిన - శ్రీ = యేసునాధుం డను కుమారా దోషుల దోసంబులెల్లc - గాచి రక్షించినావు ॥త్రిత్వమై॥
3. ఆదరణకారుండ వగు శు - ద్ధాత్ముడా దేవా - యా = మోద నామము నంపcబడి యేసు - నాధుని సుబోధ లెల్ల - బోధపరచి పాదుకొల్పు ॥త్రిత్వమై॥
4. ఓపితా సుతా శుద్ధాత్మ - ఒక్క దేవుcడవు - ఎల్ల - పాపులను రక్షింప మిగుల - నోపికతో నాపదలు - బాపి కృపc జూపినావు ॥త్రిత్వమై॥

## 22 దేవుని ప్రభావ వర్ణన

రా – నాట (చాయః యేసుక్రీస్తు దొరికెనేని) తా – అట

[1]వ్యోమ సింహాసనస్థుఁడ – [2]యుర్వి పాదపీఠస్థుఁడ [3]మామకీన దయామయుఁడ – మమ్ముఁగావుమో దేవుఁడ ॥వ్యోమ॥

1. [4]అంతరిక్ష లోకదీప – యద్భుతాదృశ్య స్వరూపా = యింత నీ మహిమనోప – నెంతది నా నాల్క చూప ॥వ్యోమ॥
2. గాలి ఱెక్కల పైనెక్కి – గాఢాంధకారమునందు = నేలికవై సంచరించు – నట్టి నిన్ను మ్రొక్కుచుందు ॥వ్యోమ॥
3. నీతి న్యాయ దీర్ఘశాంతా – నిర్మల [5]దయా నితాంతా = ప్రీతినుంచవే [6]శ్రీమంతా – పెద్దఁగా నా కాలమంతా ॥వ్యోమ॥
4. సర్వ భూలోక పూజితా – సత్య సద్గుణ రాజితా = గర్వ దుస్స్వభా[7]వాహితా – కావునన్నీ నాట పితా ॥వ్యోమ॥
5. నమ్మిన యీనన్నుఁ తూల – నాడవు దీనాత్మపాలా = క్రమ్మి నీ ప్రేమతోఁ జాల – బ్రోతువు దయాలా [8]వాలా ॥వ్యోమ॥

– మిక్కిలి సమూయేలు

## 23 దేవుని స్తుతి

రా – ముఖారి (చాయః ఓ మా తండ్రి నీదు నామము) తా – చాపు

ఎటుల నీకు స్తుతు లొనర్తుము – యెహోవ తనయ – యెటుల నీకుఁ నుతు లొనర్తుము = పటుతర పాపంబులనెడి – పంకమందుఁజిక్కి మదిని – దిటముఁ జెడిన మమ్ముఁబ్రోచి – దిక్కుఁజూపినట్టి యేసూ ॥యెటుల॥

1. పాపకూపమందు నుండగాఁ బాపావిమోచ – దాపుఁజేర్చి కాపుఁ జూపితి = శాపగ్రస్తులైన మా – శాపము విముక్తిఁజేయ – నీ పవిత్ర రక్తమే నా – ప్రాపుగా నొసంగితివి ॥యెటుల॥

[1]ఆకాశము. [2]భూమి. [3]నాది. [4]ఆకాశము. [5]విస్తార దయగలవాడా. [6]సంపదగలవాడా. [7]పగవాడు. [8]ఉనికిపట్టు.



2. భార భరితమైన యాత్మల – భారమును దీసి – భూరి సౌఖ్యములతో నింపను = భారకుండ – ఘోరమైన శ్రమలనొంది – మరణమొంది తిరిగిలేచి నీవు ధాత్రి – మహిమ నొందినట్టి దేవ ॥యెటుల॥
3. నీతిహీనులమై యుండఁగా – నో కర్త మాదు – భీతులన్నిఁబాపి నీ కృపన్ = నీతి రక్షణవస్త్రములను – భాతిగ ధరింపజేసి – భూతలంబునందు నిన్ను – ఖ్యాతిగ సేవింపఁజేసితి ॥యెటుల॥
4. నిన్నుఁజేరి నిర్భలుండనై – యీ భూమియందు – నిన్నుఁ బోలి నడుచుకొనుటకై = తిన్నని మార్గమును జూపి – అన్ని కీడులను జయింపఁ – బన్నుఁగ విమలాత్మశక్తి – నున్నతముఁగ నిడిన యేసూ ॥యెటుల॥
5. పరమ రాజ్యమందు నిరతము – నీతోడనుండఁ – కరుణతోడ నెంచుకొంటివి = తిరిగి వచ్చి మమ్మును మీ – చిరప్రకాశ పురమునందుఁ – త్వరగఁ జేర్చియందు సుఖము – దిరముగా నొసంగుదేవ ॥యెటుల॥

– మాముదూరి సైమన్

## 24 సర్వము దేవుని సొత్తు

(దావీదు కీర్తన 24)

రా – హరికాంభోజి (చాయః సఖులార సంఘంపుబడి) తా – ఆది

భూమండలము దాని సం – పూర్ణత యును లోకమును = భూమండల వాసులను – బొల్పార యెహోవావే ॥భూ॥

1. యెహోవ సంద్రము మీఁద – భూమి పునాది వేసె = మహాజలముల మీఁద – మనదేవుఁడది స్థిరపర్చె ॥భూ॥
2. యెహోవ పర్వతమునకు – నెక్కంగఁ బాత్రు డెవఁడు = మహాలయంబునందు – మరి నిల్వ యోగ్యుం డెవఁడు ॥భూ॥
3. అపవిత్ర మనసులేక – కపట ప్రమాణము లేక = సుపవిత్రమౌ చేతులను – శుద్ధాత్మ గల్గినవాఁడే ॥భూ॥
4. ఆలాటి వాఁడు ప్రభుని యాశీర్వచనము నొందు = భూలోకమున రక్షణ దేవుని నీతి మత్త్వముపొందు ॥భూ॥

5. ప్రభునాశ్ర యించు నట్టి – వారు యాకోబు దేవ = ప్రభుసన్నిధానము వెదకు – ప్రజలెల్ల రట్టివారే ॥భూ॥
6. ద్వారంబు లార యిఁక మీ తల లెల్లబైకెత్త వలెన్ = రారాజు కొరకుఁతలుపు – లారా మిమ్మెత్తుకొనుఁడి ॥భూ॥
7. ఇలలో మహా మహిమంబు – గలిగిన యీ రాజెవఁడు = బలశౌర్య ముల యెహోవ – బహుశూరుడౌ యెహోవ ॥భూ॥

– మల్లెల దావీదు

## 25 రక్షణకొరకు కృతజ్ఞత

రా – జంఝూటి తా – ఏక

పరలోకమున నుండు దేవ – నీ పదముల కొనరింతు సేవ = దురితంబులకు నేను – వెఱచి యున్నానని – కరుణించి నీ సుతుని – ధర కంపితివి గాదా = అరయఁగా నీ ప్రేమ యింతనఁ – దరము గాదో పరమ జనక – మరణ పర్యంతంబు నిను నే – మరువఁ జాలను – వరకృపా నిధి ॥పరలోక॥

1. యేసుక్రీస్తుని దయసేయ – కున్న – మోస మొందెద నెందుకన్న = దోసంబులకు నేను – దాసుండనై ప్రతి – వాసరంబును నీదు – భాసు రాజ్ఞలు విడిచి = వేసటలు గల నరకమునఁ బడ – ద్రోసిన నది న్యాయమౌ గద – నా సునాథా పేర్మిచేతను – నీ సుతుని నంపించినావు ॥పరలోక॥
2. ఎన్నరాని మహిమ నుండి – యేసు – నన్నుఁ బాలింప నేతెంచి = యెన్న శక్యము గాక – యున్న పాపము లన్ని – ఛిన్నాభిన్నము జేసి = నన్ను సమ్మతిపరప – నన్న యగు నా రక్షకుండు – తన్ను తానర్పించి వెండియు – నున్నతుండై లేచి యిప్పుడు – సన్నిధానం బొసఁగె నాకుఁ ॥బరలోక॥

– పురుషోత్తము చౌధరి

## 26 95–వ దావీదు కీర్తన

రా – శంకరాభరణము తా – ఆది

రండి యుత్సహించి పాడుదము – రక్షణ దుర్గము మన ప్రభువే॥

1. రండి కృతజ్ఞత స్తోత్రముతో – రారాజు సన్నిధి కేగుదము = సత్ప్రభు నామము కీర్తనలన్ – సంతోష గానము చేయుదము ॥రండి॥



2. మన ప్రభువే మహా దేవుండు – ఘన మాహాత్మ్యముగల రాజు = భూమ్య గాధపులోయలును – భూధర శిఖరము లాయనవే ॥రండి॥
3. సముద్రము సృష్టించె నాయనదే – సత్యుని హస్తమే భువిఁజేసెన్ = ఆయన దైవము పాలితుల – మాయన మేపెడి గొఱ్ఱెలము ॥రండి॥

4* ఆ ప్రభు సన్నిధి మోఁకరించి – ఆయన ముందర మ్రొక్కుదము = ఆయన మాటలు గైకొనిన – నయ్యవి మనకెంతో మేలగును ॥రండి॥

5. తండ్రి కుమార శుద్ధాత్మకును – దగు స్తుతి మహిమలు కల్గుఁగాక = ఆదిని నిప్పుడు నెల్లప్పుడు – నయినట్లు యుగముల నౌను ఆమేన్ ॥తండ్రి॥

– నమూయేలు పాక్యవాధము

## 27 దైవస్తుతి

రా – బిలహరి తా – త్రిపుట

కలుగునుగాక – దేవునికి మహిమ – కలుగునుగాక = కలుగు నున్నతమైన – ఘన స్థలములందున – నిలకు సమాధానం – నరుల కాయన దయ ॥ కలుగును॥

1. ప్రభువైన దేవా – పరమరాజా – సర్వపరిపాలా = పరిపూర్ణ శక్తిగల – పరమ జనక నిన్ను – మహిని స్తుతించుచు – మరి పొగడుచున్నాము ॥కలుగు॥
2. మహిమపర్చుచు – ఆరాధించు – చున్నాము నిన్ను = మహిమాతిశయమును – మదిఁ దలంచియు నీకు – మహిని మా స్తుతి కృత – జ్ఞత నిచ్చు చున్నాము ॥కలుగును॥

3* ఏక కుమారా – యేసు ప్రభువా – యెహోవా తనయా = లోక పాపము మోయు – ఏక దేవుని గొఱ్ఱె – పిల్ల మమ్మును కనిక – రించుము చల్లఁగ ॥గలుగును॥

4* లోకపాపములు – మోయుచుఁ బోవు – యేసు రక్షకా = వాసిగ జనకుని – కుడివైపునఁ గూర్చుండి – యేసూ మా ప్రార్థన నా – లించి కని కరించు ॥కలుగును॥

5. పరిశుద్ధుఁడవు – ప్రభుఁడవు నీవో – ప్రభువైన క్రీస్తూ = పరిశుద్ధాత్మతోఁ తండ్రి – యైన దేవునియందుఁబరిపూర్ణ మహిమతోఁ – బ్రబలుచున్నామ వామేన్ ॥కలుగును॥

– వీర్పుల మోషే

## 28 దేవుని మహిమ

రా – ఆనందభైరవి తా – ఝంపె

మహిమ సర్వోన్నత – మైన దైవమునకి – మ్మహి సమాధానానుగ్రహము గల్గుగ్రప్రభో ॥మహిమ॥

1. నిన్ను స్తోత్రించుచు – నిన్ను బూజించుచు – నిన్ను మహిమపర్చుచు – న్నాము లోక ప్రభో ॥మహిమ॥
2. ప్రభువైన దేవుండా – పరమండలపు రాజా – ప్రబలంబు గల తండ్రి పరిశుద్ధంబగు ప్రభో ॥మహిమ
3. వినయంబుతో నీదు – ఘన మహిమార్థంబై – వందనము లర్పించి విను – తింతుము సత్ప్రభో ॥మహిమ॥
4. జనితైక పుత్రుడగు – ఘన క్రీస్తేసు ప్రభు దే – వుని గొర్రెపిల్ల జనకుని కుమారుడ ప్రభో ॥మహిమ॥
5. ధర పాపములమోయు – వరపుణ్య శీలుండా – కరుణించి మా బీద – మొరలాలించుము ప్రభో ॥మహిమ॥
6. తండ్రియైన దేవుని – దక్షిణ భాగమున గూ – ర్చుండి యున్నావు కృప – జూపుమి సత్ప్రభో ॥మహిమ॥
7. పరిశుద్ధుడవు నీవే – పరమ ప్రభుడవు నీవే – దురితాత్ములను గాన – మరణంబైతివి ప్రభో ॥మహిమ॥
8. పరమ జనకుని మహిమన్ – పరిశుద్ధాత్మైక్యంబై – సరణి మాకై యున్న – సర్వోన్నత ప్రభో ॥మహిమ॥

– బేతాళ జాన్

## 29 ఓ దేవా, నిన్ను స్తుతించుచున్నాము

రా – ధీరశంకరాభరణము తా – ఆది

పాహిలోక ప్రభో – పాహి లోక ప్రభో = పాహి యని వేఁడు
మాం – పాహిలోక ప్రభో ॥



1. నిన్ను స్తుతియించుచు – నీవు ప్రభుఁడ వని = చెన్నుమీరఁగ నమ్మి – యున్నాము సత్ప్రభో ॥
2. నిత్య మా తండ్రి భూ లోకం బంతయు నిన్ను = భక్తితో నారాధించు – చున్నది మా ప్రభో ॥
3. దేవ లోకాధిపతులు – దూతల సమూహము = దేవా యని కొల్చుచు – న్నారు నిన్నుఁ బ్రభో ॥

4* పరిశుద్ధ పరిశుద్ధ – పరిశుద్ధ ప్రభువా = పరలోక సేనాధి – పతి వైన మా ప్రభో ॥

5. ఇహలోకం బంతయుఁ – బరలోకం బంతయు నీ = మహి మహాత్మ్యముతో నున్నవని ప్రభో ॥
6. కెరూబులను దూతలు – సెరూపులను దూతలు = తిరముగా నిన్ గొనియాడు – చున్నారు మా ప్రభో ॥
7. నీ దపొస్తలుల – మహిమగల సంఘము = ప్రోదిగా నిన్నుతించు – చున్నది మా ప్రభో ॥
8. నిత్యము ప్రవక్తల – యుత్తమ సంఘము = సత్యముగ నిన్నుతించు – చున్నది మా ప్రభో ॥
9. ధీర హత సాక్షుల – వీర సైన్య మంతయు = సారెకు నిన్నుతించు – చున్నది మా ప్రభో ॥
10. నిత్య మహాత్మ్యముగల – తండ్రి వైన నిన్నును = నీదు పూజ్యుఁడగు నిజ – అద్వితీయ సుతినిన్ ॥
11. ఆదరణ కర్తయై – నట్టి శుద్ధాత్ముని = నంతట నుండు సభ – యొప్పుకొనును నిన్ బ్రభో॥

– బన్యన్ జోసఫ్

*ఈ గుర్తు గల చరణములను దీనస్వరముతో పాడదగును.

## 30 ఓ దేవా, నిన్ను స్తుతించుచున్నాము

రా – మిశ్రమ తా – ఆది

మా యేసు క్రీస్తు నీవే – మహిమగల రాజవు = నీవు నీవే తండ్రికి – నిత్యకుమారుడవు – ఓ క్రీస్తూ॥

1* భూనరులన్ రక్షింపఁ – బూనుకొనినప్పుడు = దీన కన్యాగర్భముఁ – దిరస్కరింపలేదుగా – ఓ క్రీస్తూ॥

2* విజయము మరణపు – వేదనపై నొందఁగా = విశ్వాసులందరికిన్ – విప్పితివి మోక్షమున్ – ఓ క్రీస్తూ॥

3. నీవు తండ్రిదైనట్టి – నిత్య మహిమయందు = దేవుని కుడివైపుఁ – దిరముగాఁ గూర్చున్నావు – ఓ క్రీస్తూ॥

4. నీవు న్యాయాధిపతివై – నిశ్చయముగా వచ్చెదవు = కావున నీ సాయంబు – కానిమ్ము నీ దాసులకు – ఓ క్రీస్తూ॥

5* దివ్యమౌ రక్తంబు చిం – దించి నీవు రక్షించిన = సేవకులకై మేము – చేయు మనవి నాలించు – ఓ క్రీస్తూ॥

6* నీ వారి నెల్లప్పుడును – నిత్య మహిమయందు = నీ పరిశుద్ధులతోను – నీ వెంచుకొను మయ్య – ఓ క్రీస్తూ॥

7* నీదు జనముఁ రక్షించి – నీ దాయము దీవించుము = నాథా వారలను నేలి – లేవనెత్తు – మెప్పుడును – ఓ క్రీస్తూ॥

8. దిన దినమును నిన్ను – మహిమ పర్చుచున్నాము = ఘనముగా నీ నామముఁ – గొప్పచేయుచున్నాము – ఓక్రీస్తూ॥

9* నేఁడు పాపము చేయకుండ – నెనరుతో మముఁ గావుమయ్యా = పాడెడి నీ దాసులకుఁ బరమ దయ నిమ్మయ్య – ఓ క్రీస్తూ॥

10. ప్రభువా కరుణించుము – ప్రభువా కరుణించుము = ప్రార్థించు నీ దాసులపై – వ్రాలనిమ్ము దీవెనలఁ – ఓ క్రీస్తూ॥

---

*ఈ గుర్తుగల చరణములను దీనస్వరముతో పాడదగును.



11. నిన్ను నమ్మి యున్నాము – నీ కృప మా పైఁ జూపుము – మేము మోసపోకుండ – నీవే కాపాడు మయ్యా – ఓ క్రీస్తూ॥

– నమూయేలు పాక్యనాధము

## 31 ఓ దేవా, నిన్ను స్తుతించుచున్నాము

రా – శంకరాభరణము తా – ఆది

1. I. ఓ ప్రభుండా నిన్ నుతించు – చున్నాము వినయముతోడ –
II. మా ప్రభుండ వంచు నిన్ను – మానక మేమొప్పుకొందు ॥మో॥
2. I. నిత్యుఁడవౌ తండ్రి లోకము – నిన్నారాధించుచు నుండు –
II. సత్యదూతల్ మోక్షమందు – సర్వ ప్రధానుల్ సుభక్తిన్ –
I. నిత్య మేక కంఠముతోడ – నిన్ గొనియాడుచున్నారు ॥ఓ॥
3. III. పరిశుద్ధ, పరిశుద్ధ – పరిశుద్ధ, సేనల దేవా –
ధరపరలోకంబులు నీ – వర మహిమతో నొప్పునటంచు ॥నో॥
4. I. కెరూబుల్ సెరూపుల్ – నిన్నుఁ గీర్తించుచున్నారహహా –
II. సారెకుఁ నిన్నపొస్తలుల – సంఘము స్తోత్రించుచుండుఁ –
I. కూరిమిఁ బ్రవక్తల సంఘము – కొనియాడుచు నిన్ నుతియించు ॥నో॥
5. IV. మా మహా జనకా – నిను – మాన్యుఁడౌ పుత్రున్ – బహు – ప్రేమగల మా పరిశుద్ధాత్మను – బ్రీతితో సంఘము భువి నొప్పుకొనున్ ॥ఓ॥
6. V. నీవే క్రీస్తు రాజవు – నిత్య కుమారుఁడవు – నీ విలలో మానవులను – గావఁగఁ బూనినయపుడు – పావన కన్యా – గర్భంబున బుట్టుట – బహుదీనంబనక – చావు శ్రమ నోడించి – సజ్జనులకు దివిఁ దెరచితివే॥ఓ॥

---

చాయలోని భాగము లీవిధముగా పాడఁదగును:–

I. పా, రిగాపా । దా సానీదా । పా దపమగరిస । రిసని దసా,, ।

II. పా, రిగసా। మా, గపాదా । రీ, సనీదా । పా మగారీ।

III. సపపరిరీ,, । గపమగగా,, । గపమగమగరిస । రిగరిససా,, । మొ,,

IV. పా,రిగాగగ । గా,,,,, రిగ। పా,ససాసా । పా,,,,, దప । సా,ససససస । మొ॥

V. పా,,మగరిగ । దా,,మగరిగ । సా,,మగరిగ । పాపససా, । మొ॥

7. I. నీవు దేవుని కుడి పార్శ్వంబున – నిత్యము మహిమాసీనుండవు –
II. నీవు మా న్యాయాధిపతివై – రావలయునని నమ్ముచుందుము –
I. పావనంబౌ నీ రక్తంబున – సేవకులకుం దోడ్పడు మిపుడే ॥ఓ॥
8. IV.నిత్య మహిమములో – నిఁక – నీదు భక్తులతో – న – గత్యముగ లెక్కించుము
వారలఁ – గని రక్షించుమి నీ సుజనంబుల్ ॥ఓ॥
9. IV. నీవు దీవించి – నీ నిత్య స్వాస్థ్యంబు – సు – జీవ మిడి వారలఁ
బాలించి – లేవఁగ నెత్తుము సతతము ప్రీతిన్ ॥ఓ॥
10. III. ఓ ప్రభువా పాపములో – నుండ కుండఁగఁ దోడ్పడుము –
మా ప్రభువా కరుణించు – మముఁ గరుణించుము దయతోడన్ ॥ఓ॥
11. II. ఓ ప్రభుండా నిన్ను నమ్మి – యున్న మాకుఁ బ్రేమఁ జూపు –
I. శ్రీ ప్రభుండా నిన్నే నమ్మితి – సిగ్గునొంద నీయకుము ॥ఓ॥

– మల్లెల దావీదు

## 32 అర్పణ కీర్తన

(దావీదు కీర్తన 51:16-19.)

రా – హిందూస్థాని తోడి (చాయ: ఆహా, ఎంతటి శ్రమలు) తా – త్రిపుట

దహన బలి నీకు ననిష్టము – మరియు – దైవ బలులు విరిగిన యాత్మయే = యెహోవ దేవ విరిగి నలిగిన – యట్టి – హృదయం బలక్ష్యంబు సేయవు ॥ దహన॥

1. నీ కటాక్షముతో సీయోనున – కిపుడే – నెనరుతోడను మేలు చేయుమి = ప్రాకటంబుగను యోరూషలే – మునకుఁ – బ్రాకారములను గట్టించుమి ॥దహన॥

2. అంతట నీతియుక్తంబు లౌ – బలుల – యాగముల సర్వాంగ హోమ ముల్ = ఎంతో యిష్టంబౌ బలిపీఠము – మీఁద – నెన్నో కోడెల జనులర్పించు తురు ॥దహన॥

– మల్లెల దావీదు



## 33 *Before Jehovah's throne*

1. యెహోవ గద్దె ముందట
జనంబులార మ్రొక్కుఁడి
యెహోవ దేవుఁడే సుమీ
సృజింపఁ జంపఁ గర్తయే.
2. స్వశక్తిచేత నాయనే
మమున్ సృజించె మట్టిచే
భ్రమించు గొఱ్ఱె రీతిగాఁ
దప్పంగ మళ్లీ చేర్చెను.
3. సుకీర్తి పాడి గుంపులై
ప్రసిద్ధిచేతు మాయనన్
జగత్తు వేయి నోళ్లతో
స్తుతించు దివ్యమౌ ధ్వనిన్.
4. ప్రభుత్వ ముందు నంతకున్
అగున్ నీ ప్రేమ నిత్యము
చిరంబు నీదు సత్యము
వసించు నెల్లకాలము.

– ఐజక్ వాట్స్

అను: ఈ. న్యూవెల్

## 34 *Come,Thou Almighty King*

1. సర్వేశా! రమ్ము నీ
సన్నిధి కాంతి నొ
సంగు మాకు
సత్య సనాతన
సర్వాధికారుఁడా
సదా మమ్మేలుము
సర్వోన్నతా!
2. నిత్యంపు వాక్యమా!
నీదగు ఖడ్గము
నిమ్ము మాకు
నీ నిజ భక్తులన్
నీ వాక్య ప్రియులన్
నింపు నీ యాత్మతో
నింపు మీర.
3. రమ్ము మహాత్మ! మా
కిమ్ము నీ యాత్మను
రమ్ము వేగ
రక్తితో నిప్పుడు
రమ్ము మా మధ్యకు
రక్షించు మమ్మును
రంజిల్లఁగన్.
4. స్తోత్రం పవిత్రుఁడా!
స్తోత్రంబు త్రేకుండా!
స్తోత్రం సదా
ధాత్రి నీమహిమ
నేత్రంబులు గను
మీ, "త్రాహిమాం" యని
వేఁడు వారిన్.

– చార్లెస్ వెస్లీ

అను: ఒంగోలు దావీదు

## 35 *O God our help in ages past*

1. ఇన్నాళ్లు మాకు సాయమై
యీ ముందుకును మా
యున్నత గృహ మండవై
యెప్పెడు దైవమా!

2. ఏలాటి యీతిబాధయు
నీవచ్చు యేఁటిలో
కలుగకుండఁ బ్రోవవే
ఘనంపు ప్రేమతో

3. నీ సింహాసన నీడలో
నిలుచు భక్తులు
భయంబు చింతబాధలౝ
జయించి మన్దురు.

4. చరాచరంబు లెల్లను
జనించుకంటె ముౝ
దరతరాలనుండియుౝ
నీరాజ్య ముండెదుౝ

5. ఇన్నాళ్లు మాకు సాయమై
యేలుచుఁ గాచిన
ఉన్నత ప్రభు ప్రేమతో
మన్నించు మింకనుౝ.

*– ఐజక్ వాట్స్*

*అను: ఆల్ఫ్రెడ్ త్యాగరాజు సామర్*

## 36 *Now thank we all our God*

1. సర్వాద్భుతంబులౝ
సర్వత్రఁ జేయుకర్తౝ
సర్వాత్మ లింతటౝ
శ్లాఘింపఁ జేరరండి!
మా రాకపోకలన్
మమ్ వీడకుండను
మా రక్షకుండిట్లే
మమ్మాదరించును.

2. మహా దయాళుఁడే
మా జీవకాలమంత
సహాయమూరటౝ
సంతోషమిచ్చుగాక!
మహత్తు ప్రేమను
మాయందు నుంచును
ఇహంబునన్ మమ్ముౝ
ఎన్నండుఁ బ్రోచును.

3. ప్రపంచపాలకా!
ప్రసిద్ధుఁడైన తండ్రీ!
సుపుత్ర దేవుడా!
సుజీవమిచ్చు నాత్మ!
సంపూర్ణ త్ర్యేకుఁడా!
ప్రఖ్యాతికల్గగా
అపారసన్నుతి
నర్పింతు సర్వదా.

*– మార్టిన్ రిన్కార్ట్*

*అను:లెచ్. హార్న్బ*



## 37 *A mighty fortress is our God*

1. మాకర్త గట్టి దుర్గము
నే నమ్ము ఆయుధంబు
సంప్రాప్తమైన కష్టము
లనన్నిటి నణంచు
ఆ పాత శత్రు
వెంతో క్రూరుఁడు
తదాయుధము
లుపాయ శక్తులు
అతం డసమానుండు.

2. మేమో నశించిపోదుము
మా శక్తి నిష్ఫలంబు
మాకై ప్రభుని శూరుఁడు
యుద్ధంబు చేసిపెట్టు
అతం డెవ్వఁడు?
యేసు క్రీస్తను
మా రక్షకుండు
మరొక్కఁ డెవ్వడు?
ఆతండె గెల్పుపొందు.

3. ప్రపంచ మంతటన్ గ్రమ్ము
పిశాచు లేమి చేయు?
మమ్మెల్ల మ్రింగనున్నను
మాకేల భీతివేయు?
ఈ లోకాధిపుఁ
డుగ్రుఁడైనను
దానేమి చేయుఁ?
దీర్పొందె నతఁడు
నశించు మాటతోనే.

4. వాక్యంబు నిత్యమే గదా
విరోధి వంచ లేఁడు.
దైవాత్మ తోడగుం గదా
తా నిన్న నేఁడు రేపు.
మా కుటుంబము
మా కీర్తి, యాస్తి,
ప్రాణంబు పోయినన్
నష్టంబు వానిదె
రాజ్యంబు మాది యౌను.

*– మార్టిన్ లూథర్*

*అను: ఈ. పాల్*

## 38 ***Let us, with a gladsome mind***

1. కృపగల దేవుని
సర్వదా నుతించుఁడి
దివ్య కృపా ప్రేమలు
ఎల్లకాల ముండును.

2. సర్వశక్తుఁడాయనే
సర్వదా చాటించుఁడి
దివ్య కృపా ప్రేమలు
ఎల్లకాల ముండును.

3. పగటి నేలునట్లు
సూర్యునిౝ సృజించెను
దివ్య కృపా ప్రేమలు
ఎల్లకాల ముండును.

4. సర్వజీవకోటిని
బ్రోచు దేవుఁ డెన్నఁడు
దివ్య కృపా ప్రేమలు
ఎల్లకాల ముండును.

5. కర్త మనయందును
కనికర ముంచెను
దివ్య కృపా ప్రేమలు
ఎల్లకాల ముందును.

6. దైవ ఘన మహిమః
జాటుచుండుఁడి యిలః
దివ్య కృపా ప్రేమలు
ఎల్లకాల ముందును.

– జాన్ మిల్టన్

అను: బర్నార్డ్ లూకాస్

## 39 *O for a thousand tongues to sing*

1. నృపా! విమోచకా! ప్రభూ
వేలాది నోళ్ల నీ
కృపా జయప్రభావముల్
నుతింతు నెంతయున్.
2. కృపాధికార! దేవ! నీ
సాయంబు జేయుమా
భవత్ప్రభావ కీర్తులన్
జాటంగ నెల్లెడన్.
3. భయంబు చింతఁ బాపును
హర్షంబు పాపికి
సౌఖ్యంబు జీవశాంతులు
నీ నామ మిచ్చును.
4. విముక్తి జేయు ఖైదిని
పాపంబు బాపును
పాపాత్ము శుద్ధుజేఁయును
శ్రీయేసు రక్తము.
5. జనాళి! పాపు లెల్లరు!
శ్రీయేసున్ నమ్మఁడి
కృపావిముక్తులందుఁడి
సంపూర్ణ భక్తితో.
6. అర్పించె యేసు ప్రాణమున్
నరాళిఁగావను;
యజ్ఞంపు దేవు గొఱ్ఱెపై
నఘంబు వేయుఁడి.
7. సత్కీర్తి స్తోత్ర ప్రేమల
నభాన భూమిని
సర్వత్ర దేవుఁడొందుగా
సద్భక్త పాళిచే.

– చార్లెస్ వెస్లీ

## 40 *Holy, Holy, Holy, Lord God Almighty*

1. శుద్ధి, శుద్ధి, శుద్ధి! సర్వశక్త ప్రభు
ప్రాత:కాలస్తుతి నీకే చెల్లింతుము
శుద్ధి, శుద్ధి, శుద్ధి! కృపగల దేవా!
ముగ్గురైయుండు దైవత్రేకుఁడా!

2. శుద్ధి, శుద్ధి, శుద్ధి! అని పరమందుఁ
బరవాసు లెల్ల నిన్నేశ్లాఘింతురు
శెరపుల్ ఖెరూబులు సాష్టాంగపడి
నిత్యుఁడవైన నిన్ నుతింతురు.





3. శుద్ధి, శుద్ధి, శుద్ధి! తేజరిల్లు దేవ
పాపి కన్ను చూడలేని మేఘ
వాసివి
అద్వితీయప్రభు, నీవు మాత్రమేను
కరుణ, శక్తి, ప్రేమరూపివి.

4. శుద్ధి, శుద్ధి, శుద్ధి! సర్వశక్త ప్రభు
సృష్టిజాలమంత నీ కీర్తిఁబాడును
శుద్ధి, శుద్ధి, శుద్ధి! కృపగల దేవ
ముగ్గురైయుండు దైవత్రేకుఁడా!

– రెజినాల్డ్ హెబర్

అను: జేకబ్ చేంబర్లేన్

## 41 ఉదయారాధన

ప్రాత:కాల కీర్తన

రా – బిలహరి తా – త్రిపుట

మేలుకొనరే మీ మనంబుల – మేలిమిగ మీ మేరఁ దప్పక = పాలు
మాలక లేచి దేవుని – పాదములు పూజింప గ్రక్కున ॥మేలుకొనరే॥

1. దిక్కు లెల్లను దేజరిల్లెను – దినకరుం డుదయింపనయ్యెను = మ్రొక్కులకు
ప్రతిఫలము నిచ్చెడు – మూల కర్తకుఁ గొలువసేయఁగ ॥మేలుకొనరే॥
2. పక్షు లెల్లను గిలకిలంచును – ప్రభుని మహిమలు బల్కఁ దొడఁగెను =
రక్షకుని సకలోపకృతులను – రమ్యముగ నుతియించి పాడఁగ ॥మేలుకొనరే॥
3. నిదుర బోయిన వేళ మిమ్మొక – నిమిషమైనను బాసియుండక = పదిలముగ
రక్షించు దేవునిఁ – బ్రస్తుతింప మహాముదంబున ॥మేలుకొనరే॥
4. మేటియౌ హృదయాబ్జములలో – మీ కృతాజ్ఞతా భూషణంబులు = నేటుగా
ధరియించుకొని యిటు – నిర్మలాత్మునిఁ బూజసేయఁగ ॥మేలుకొనరే॥
5. తెల్లవారఁగఁ దెలియరే యిది – తెలివిగల మానవ సమాజము = యుల్లసిల్లుచు
నీతి భాస్కరుఁ – డుదయ మయ్యెను హృదయముల పై ॥మేలుకొనరే॥

– మిక్కిలి నమూయేలు

## 42 ప్రాతస్తవము

రా – కాంభోజి తా – కురురుంపె

తెల్లవారిన వేళc – దెలి వొంది మన క్రీస్తు – దివ్య నామముc బాడరె – యో ప్రియులార – దివస రక్షణ వేcడరే = తల్లి రొమ్మున దాcచు – పిల్ల రీతిని మనలc జల్లదనముగ రాతి – రెల్లc గాచిన విభునిc ॥దెల్లవారిన వేళ॥

1. నిద్రపోయిన వేళ – నిఖిలాపదులcబాపి – నిశ లన్ని గడుపు విభునిన్ = భద్రముగ వినతించి – భయభక్తితో మనము – ముద్రి తాక్షులc గేలు – మోడ్చి మ్రొక్కుమను ॥దెల్లవారిన వేళ॥
2. భానుc డుదయం బయ్యెc – బద్మములు వికసిల్లె – గానమలు జేసెc బక్షుల్ = మానసాబ్జము లలర – మనము కల్వరి మెట్ట – పై నెక్కు నినుc డనెడి – ప్రభుc జూచి వేద్కన్ ॥దెల్లవారినవేళ॥
3. దిట్టముగ మానసేం – ద్రియ కాయ శోధనలు – పట్టుకొని,యుండు దినమున్ = దట్టముగ మన నాల్గు – తట్ల యేసుని కరుణc జుట్టుకొని రక్షించు – శుభ మడుగుకొనుచున్ ॥దెల్లవారిన వేళ॥
4. పాప భారము మనము – ప్రభుని పై నిడి గురుని – పాదములు చెంత నొరగి – కాపు కర్త విశాల – కరము మాటున దాcగి – యాపదలc దొలc గించు – మని వేcడుకొనుచున్ ॥దెల్లవారిన వేళ॥

– పురుషోత్తము చౌధరి

## 43 ప్రాతఃకాల స్తుతి

రా – యమునాకళ్యాణి తా – రూపకము

శ్రీ యేసు కర్తను – సేవc జేయుటకు మేల్కొను – శ్రీయేసు కర్తను = శ్రేయముల నెటింగి – నీకు రేయిపవ లొసంగి – యెడc – బాయని యంత రంగి – య – పాయంబుc ద్రోయ స – హాయంబుcజేయ ॥శ్రీ యేసు॥

1. నిదురయందు నేcడు – క్షేమ – మొదవc గాచినాcడు – సూర్యుc – డుదయ మాయెcజూడు – నీ – హృదయమున సదమల – పదవులుదయింప ॥శ్రీ యేసు॥



2. అంధకార మణcగెన్ – హృద – యాంధకార మణcగన్ – ప్రభు – నందుc దెలివి గలుగన్ ని – బంధనలు డెందమున – కందముగc గూర్చి ॥శ్రీ యేసు॥
3. కంటిపాప వలెను – నిను – గాయువాని దయను – గనుc – గొంటివి స్తోత్రమును – జేయు – మింటి కినిమంటిక–న్నింటికిని కర్త యని॥శ్రీ యేసు॥
4. కలకల ధ్వనిcజేయు – పక్షి – గములు లయను గూయు – స్వర – ములు ప్రభు స్తుతిcజేయు – నీ – వలయక సొలయక – వెలయcగc బాడు ॥శ్రీ యేసు॥
5. సేవయందు నీకు – మంచి – యీవు లిడుపరాకు – గల – భావముcబడc బోకు – నేcడుc – కానవే కావవే – కావవే యంచు ॥శ్రీ యేసు॥
6. పగటివార మంచు – ని – ష్ఫలపు గ్రియలు ద్రుంచు – యుగ – యుగములు జీవించు – పురి – కెగయ నీ దిగులు విడు – తగు నమ్మకమున ॥శ్రీ యేసు॥
7. మింటి నంటc బాడు – నీ – యొంటి బలిమి నేcడు – ప్రభు నంటియుండ వాcడు ని – న్నొంటి నెన్నంటి కె – న్నింటికి నీ్వడcడు ॥శ్రీ యేసు॥

– బేతాళ జాన్

## 44 ఉదయారాధన

రా – బిలహరి తా – అట

సకల జగజ్జాల కర్తా – భక్త – సంఘ హృదయ తాప హర్తా యకలంక గుణమణి – నికర పేటీ కృత – ప్రకట లోకచయ – పరమ దయాలయ ॥సకల॥

1. నాదు నెమ్మది తొలcగించుచుc – బ్రతి – వాదు లీమెయి నెంతో పాదుకొన్నారు – బాధలందైనను –సాధులcబ్రోవ న – నాది యైనట్టి నీ – వాధారమైయుండ ॥సకల॥
2. దినకృత్యములc గష్టమంత – చీcక – టిని నే నీ కడ భక్తి – మనవిజేయ = వినుచు నా కష్టము – వెస నష్టముగc జేయ – ఘనముగ నాయందుc గరుణc జేసితివి ॥సకల॥

3. తమ కాపు నన్నుc కాపాడcగ – నేను – త్తమ నిద్రc బొందితిc – దనివిc దీరc = కొమ రొప్ప మేల్కొన్నc గూలిన మృత్యు భ – యముబొంద నా డెంద – మందు నెల్లప్పుడు ॥సకల॥
4. రాతిరి సుఖనిద్ర జెందc – జేసి – రక్షింప నను నీకె – చెల్లు – ప్రాతస్తుతుల్ జేయc – బగలు – జూచు తెల్వి – ఖ్యాతముగా నాకుc – గలుగcజేసితివి ॥సకల॥

– విలియం దాసన్

## 45 ప్రాతఃకాల ప్రస్తుతి

రా – నాథనామక్రియ  తా – ఆది

వేcడెద నాదగు వినతిని గైకొన – వే జగదీశ ప్రభో = నేcడు ప్రతిక్షణ మెడబాయక నా – తోడ నుండవె ప్రభో ॥వేcడెద॥

1. ప్రాతస్తవము [1]భవత్సన్నిధి స – ర్వంబున నగు నాదౌ = [2]చేతస్సున ధర్మాత్మను [3]సంస్థితి – జేయవె సత్కృపను ॥వేcడెద॥
2. నేc బాతకి నజ్ఞానుcడc ప్రభువా – నీవు కరుణజేయు = పా [4]పాచరణము నందున జిత్తము – బాపుము నాకెపుడు ॥వేcడెద॥
3. పాపముc గని భీతుcడనై [5]శంకా – పరత సతము నుండన్ = నా పై నుంచుము నీదగు సత్కరు – ణా దృష్టిని బ్రేమన్ ॥వేcడెద॥
4. నాదగు పాప భరం బంతయు నీ – మీcదనె యిడుచుందున్ = నీదు మహా కృప నుండి యొసంగుము – నిర్మల గతి నాకున్ ॥వేcడద॥
5. అవిరత మతి నిటు లతులిత గతి నీ – స్తుతి నుతు లొనరింతున్ = భవదంఘ్రులపై నాదగు భక్తిని – బ్రబలింపవే యేసు ॥వేcడద॥

– విలియం దాసన్

## 46 ఉదయారాధన

రా – ఫీల్  తా – రూపకము

ప్రభువా నిన్నారాధింపను జేరితిమి యుదయ శుభకాంతి ప్రభవింపcగా – దేవా నేcడు – శుభకాంతి విరజిమ్మcగా = విభవముగను ప్రభాకరముగను – విరియు నీ తేజంబెలర్పcగ – నభి దనంబులcగూడి భక్తిని యాత్మతో సత్యంబుతోడను ॥ప్రభువా॥

[1]సన్నిధి. [2]మనస్సు [3]ఉంచథె. [4]చేయుట. [5]శంకయందాసక్తి



1. ఇరులుం గమ్మిననుండి – యరుణోదయము దనుక – నరిగాపు నీవే కాదా – దేవా రాత్రి – యరిగాపు నీవేకాదా =విరివిగా మా హృదయసీమల – నెరసి యుండిన చీcకటులుcబో –దరిమి శాంతంబైన మనసుల – దయcబ్రసాదింపను భజింతుము ॥ప్రభువా॥
2. అనఘా నీ సాన్నిధ్య – మున నుండcగా మా దు – ర్మనసుల నరి కట్టుమో – దేవా మా దు – ర్మనసుల శుచి జేయుము = వినయ భయ భక్తులుcద లిర్పగ – వినుచు నీ వాక్యోపదేశము – లనిశమును ధ్యానింపనాత్మను – బనిచి తుదకుc బ్రసన్నమగుము ॥ప్రభువా॥
3. పనిపాటలలో మేమీ – దినము నీ కే మహిమ నొనcగూర్ప నడిపించుమో – దేవా నిన్నే – ఘన పరచన్నడిపించుము = తనువు శ్రమచేబడలినను మా – దారి దుర్గమమైన కనంబడ – వనటcజెందక నేది జేసినc – బ్రభువు కొఱకని చేయ నడుపుము ॥ప్రభువా॥

– మొలతాటి విద్యానందము

## 47 ప్రాతస్తవము

రా – పంతువరాళి  (చాయ: ఇదుగో గొర్రెల కాపరి)  తా – అట

లేచి స్తుతింపc బూనుcడి – లోకేశ్వరుని – లేచి స్తుతింపc బూనుcడి = లేచి స్తుతించెదము – చూచుచు మనలను – బ్రోచి ప్రేమతోc గరము – జాచి కాపాడు విభుని ॥లేచి॥

1. రాత్రి జాముల యందున – రంజిలcదన – నేత్రము తెరచినందున = మైత్రితో దేవ దయకు – పాత్రులమైతిమి – [1]శ్రోత్రముల కింపుసcబ – విత్ర గీతము పాడుచు ॥లేచి॥
2. నిదురcబోయిన వేళను – నిర్మలమైన – హృదయము మనకు నియ్యను = ముదముతో నిదురcబొంది – యుదయాన లేచితిమి – సదయుcడైన క్రీస్తు – పదముల దరిcజేర ॥లేచి॥
3. [2]నిగమ వేద్యుcడు మనలనుc – దనలోన నీ – పగలు కాపాడcబూనెను = దిగులు బొందక పనులు – తెగువతోc జరుపుకొనుచు – వగపుతో లేచి మ్రొక్కి – మిగుల శుద్ధాత్మనడిగి ॥లేచి॥

[1]చెవులు [2]వేదము నెరిగినవాడు.

4. నేటి పాతములయందు - నిర్భయముగ - దాటివెలసి యుందు = సూటిగ నీదు తెక్కల - చాటుగను నిలుపు మనుచు - నీటుగా నెల్లవార - నిత్యము ప్రేమనేల ॥లేచి॥

## 48 ఉదయగీతి

రా - ఆనందభైరవి (చాయ: ఎందుకు మరచితివి) తా - త్రిపుట

స్తోత్రము స్తోత్రము ఓ దేవా - ఈ వేకువనే - స్తోత్రము జేతుము మా దేవా = రాత్రియందున మమ్ము రక్షించి గాపాడి - ధాత్రి మరియొక దినముఁ - దయతో నిచ్చిన దేవా॥

1. పాపశోధనలనుండి - ప్రభువా మమ్ము కాపాడి బ్రోవుమయ్య = ఏ పాపము మమ్మున్ - ఏల నియ్యకుండ - మాపు రేపులుమమ్ము - మనిపి బ్రోవుమయ్య॥
2. కన్న తండ్రికంటెను - కనికరమున - కాపాడెడి మా దేవా = అన్న దమ్ములవలె మే మందరిని ప్రేమించి - మన్ననతో నీదినము - మన నియ్యుమో దేవా॥
3. పితా సుతా శుద్ధాత్మ - లనెడి దేవా - ప్రీతితో గావుమయ్యా = నీతిమార్గములందు నిరతము మముగాచి - ఖ్యాతిగా నీకొరకు బ్రతుకనిమ్మో దేవా॥

- బన్యన్ జోసఫ్

# సాయంతనారాధన

## 49 సాయంతన సమర్పణము

రా - నాథనామక్రియ తా - ఆది

వినవే నా వినతి నివేదన దయ - వెలయఁగ నో ప్రభువా = నిను శర ణొందితి ననుఁ గుశలంబున - నునుపవె యో ప్రభువా ॥వినవే॥

1. నిర్మల గతి సంధ్యా కాలంబున -నీ స్తవ మగు ప్రభువా = [1]ధర్మదీప్తి నా కొసఁగి చేయు - [2]దీప్తవంతునిగ నన్ను ॥వినవే॥

[1]పరిశుద్ధమైన వెలుఁగు. [2]వెలుఁగుగలవానిగా.



2. నీ మహదాశ్రయ మొసఁగి దుర్గతిని - నేఁబడకుండఁగను = నా మది [1]తన్వాది సమస్తముతో - ననుఁ గావవె ప్రభువా ॥వినవే॥
3. ఎన్ని దినంబులు జగతి నున్న నీ - కన్న వేరే గలవా = పన్నుగ మది నీ [2]పద సంగతమై - యున్నది రేవగలు ॥వినవే॥
4. పాప కరుండను నే [3]సుకృతా - పాది కర్మ మెఱుఁగ = నీ పాద [4]సరోజము నా కొసఁగుము - నాపై నీ కృపఁ జెలఁగ ॥వినవే॥
5. నీ కొరకై నా మనము దృఢంబౌఁ - గాక యేసు ప్రభువా = నాకుఁ బిశాచముచే భ్రమ జన్మము - గాకుండఁగ నేలు ॥వినవే॥

- మిక్కిలి సమూయేలు

## 50 సాయం ప్రార్థన

రా - మధ్యమావతి తా - ఆది

దేవ నీకు స్తోత్రము - ఈ రాత్రిలో - నీ వెలుఁగు దీవెనకై = కావుము నన్నిప్పుడు - రాజుల రాజా - ప్రోవు రెక్కల నీడలో ॥దేవ॥

1. పూని యేసుని పేరిటన్ - మన్నించుము - కాని పనులను జేసినన్ = నేను నిదురపోవక - ముందే సమా - ధాన మిమ్ము నాకు ॥దేవ॥
2. చావు నొందుట కెన్నడు - భీతి లేక - జీవింప నేర్పించుము = జీవ పునరుత్థానము - లో మహిమతో - లేవ మడియ నద్భుము ॥దేవ॥
3. నేను జీఁకటి నిద్రను - రోయుచుఁ దుద - లేని దినంబునందు = మానకుండగ దూతలన్ - గూడి చేయ - గాన మెప్పుడు గల్గునో ॥దేవ॥

- మత్తయి సమూయేలు

## 51 సాయంతన స్తవము

రా - శంకరాభరణము (చాయ: విమల హృదయ) తా - త్రిపుట

దినము గతియించెను - దిననాథుఁడ పరాద్రి - వెనుకడాఁ గె - నిఁకమా - మునిమాపు సంస్తవముఁ గొనుము సంప్రీతిమై - ఘనుఁడ దేవా ॥ దినము॥

[1]శరీరము మొదలైన. [2]పాదములతో గూడుకొనునది. [3]సత్కార్యములను పుట్టించు. [4]పద్మము.

1. సరవినంబరవీధి – సంజ కెంజాయలు – మురువుꣳజూపె – ప్రభువా – దొరము నీ ముఖకాంతి – కిరణ జాలము మాపై – నెఱపరమ్ము ॥దినము॥

2. కటికి చీꣳకటులు ది – క్తటములꣳ గలిపియు – త్కటములైన – నీ చెం – గట నున్న నెట్టి సం – కటమేని మమ్ముꣳ – దాꣳకుటకు జంకు ॥దినము॥

3. తలꣳపువలనను నోటి – పలుకువలనను జెనꣳటి – పనులవల్ల – మేము –వలచి చేసిన పాప – ముల నెల్ల క్షమియింపు – మ లఘుక్షాంతి ॥దినము॥

4. ముమ్మరమ్మగు శోధ – నమ్ములపై విజ – యమ్మునొంద – నీ ది నమ్ము మాకు సామ – ర్థ్య మ్మొసꣳగితివి వంద – నమ్ము దేవ ॥దినము॥

5. ఈ దినము మాకు స – మ్మోదంబుతో నిచ్చి – యాదుకొన్న – వరమౌ – నీ దివ్యదానముల – కై దేవ! మా కృత – జ్ఞతను గొమ్ము ॥దినము॥

6. అలసిన మా దేహ – ములకు వలసిన నిదురꣳ – గలుగꣳజేసి – నీదూ – తల హస్తములలో మ – మ్ములను దాꣳచుము భద్ర – ముగను దేవ ॥దినము॥

7. అరుణోదయమునని –న్నర్చించు కొఱకు నీ – కరము సాꣳచి – మమ్ము – త్వరగా మేల్కొల్పుము – స్వాస్థ్య ప్రదాతవై – పరమదేవ ॥దినము॥

8. దాత వీవె లోక – త్రాత వీవె మాకు – నేత వీవె – యేసు – నీతి సూర్యుండవి – ఖ్యాతి మహిమలు నీకె – కలుగుꣳగాక ॥దినము॥

– దాసరి మోజెస్

## 52 సాయంతన ప్రార్థన

రా – శంకరాభరణము తా – ఆది

1. ఆకాశంబు భూమియు – అంతట చీకటి యాయెను= ప్రాకెడు చీకటి సమయమున – ప్రార్థన చేతుము మా దేవా ॥

2. చక్కని చుక్కలు మింటను –చక్కగా మమ్మునుజూడగ = ప్రక్కకు రావె వేగముగా – ప్రభువా గావుము గావుము నీ నీడన్ ॥

3. చిన్న చిన్న పక్షులు – చిన్న చిన్న పూవులు = ఎన్నో ఎన్నో జీవులు – నిన్నే గొలిచి నిద్రించున్ ॥

4. చిన్ని చిన్ని పాపలు – చిన్ని చిన్ని పడకలలో = చిన్ని కన్నులు మూయంగా – చెన్నుగ యేసూగావుమా ॥



5. నేలను బోయెడి బండ్లలో – నీటను బోయెడి ఓడలలో = గాలి విమానంబులలోన – కావుము దేవప్రయాణికులన్ ॥

6. రాత్రిలో నీదు దూతలు – రమ్యంబైన రెక్కలతో = చిత్రంబుగ మమ్మును గ్రమ్మన్ – నిద్రించెదము మాదేవా ॥

7. తెల్లవారుజామున – తెలివొంది మే మందరము = మెల్లగలేచి నుతియింపన్ – మేల్కొల్పుము నా ప్రియతండ్రి ॥

8. జనక తనయా శుద్ధాత్మా – జయము మహిమ స్తోత్రములు = అనిశము నీకే చెల్లునుగా – అనిశము చెల్లును నీ కామెన్ ॥

– ఏ. చార్లెస్ కిన్సింగర్

## 53 సాయంతన ప్రార్థన

రా – కాంభోజి తా – ఆది

ఈ సాయంకాలమున – యేసు ప్రభో వేꣳడెదము = నీ సుదయారస మొల్క – నిత్యంబు మముꣳగావు ॥మీ॥

1. చెడ్డ కలల్ రాకుండ – నడ్డగించుమి ప్రభో = బిడ్డలము రాత్రిలో – భీతి బాపుము తండ్రీ ॥యీ॥

2. దుష్టుండౌ శోధకునిꣳ – ద్రొక్కుటకు బలమిమ్ము = భ్రష్టత్వమున మేము – పడకుండꣳ గాపాడు ॥మీ॥

3. నీ యేక పుత్రుండౌ – శ్రీ యేసు నామమున = సాయం ప్రార్థన లెల్ల – సరగ నాలించుమా ॥యీ॥

4. జనక సుత శుద్ధాత్మ – ఘనదేవా స్తుతియింతుం = అనిశము జీవించిరా – జ్యంబుꣳ జేయు మామేన్ ॥ఈ॥

– మల్లెల దావీదు

## 54 *Sun of my soul, Thou Saviour dear*

1. నా యేసూ, ఆత్మ సూర్యుꣳడా
నీవున్న రాత్రి కమ్మదు
నా యాత్మలో నీ విప్పుడు
వసించి పాయకుండుమీ.

2. నేను నిద్రించు వేళలో
నాకు నభయ మియ్యుము
నే లేచి పనిచేయꣳగా
నా యొద్ద నుండు రక్షకా.

3. నాతోడ రాత్రింబగళ్లు
నీ వుండి నడిపించుము
నీవు నాతో లేకుండినఁ
జీవింపఁ జాలఁజాలను.
4. నేఁడు నీ దివ్య వాక్యము
వినిన పాపు లెల్లరిన్
క్షమించి గుణపఱచి
నీ మందలోకిఁ జేర్చుము.
5. రోగిని స్వస్థపఱచి
బీదలను పోషించుమీ
దుఃఖించువారి దుఃఖముఁ
బాపి యానంద మియ్యుము.

*– జాన్ కెబిల్*

*అను: జేకబ్ చేంబర్లేన్*

## 55 *Day is dying in the west*

1. ప్రొద్దు గ్రుంకుచున్నది
సద్దణంగుచున్నది
యాకసంబు దివ్వెలు
లోకమున్ వెల్గింపఁగా
స్తుతించుఁడి.
॥ శుద్ధ, శుద్ధ, శుద్ధ
సర్వేశుఁడా
యిద్ధరాకాశంబులు
సన్నుతించుచున్నవి
సర్వోన్నతా ॥
2. జీవితాంతమందున
నీ విచిత్ర జ్యోతులఁ
జూచుచుండఁగాను మా
కీవొసంగు నీ కృపఁ
నిత్యోదయం.
3. నిన్ను గోరువారము
నన్ను తేశ నీ దరిఁ
మమ్ముఁ జేర్చుకొమ్ము నీ
విమ్ము నిత్య సౌఖ్యముఁ
స్తోత్రం నీకు.

*– మేరీ లాల్ బరీ*

*అను: ఒంగోలు దావీదు*

## 56 *Abide with me, fast falls the eventide*

1. రాత్రియయ్యెన న్నెడఁబాయకు
ధాత్రిపైఁ జీఁకటులుఁ గ్రమ్మెను
సహాయ మేమి లేనివారికి
సహాయుఁడా, నన్బాసిపోకుమీ.
నీకంటె నాకు లేదుగా
లోక ప్రకాశుఁడా, నన్బాయకు.
2. ఏకాలంబైన నీ సహాయము
లేక పిశాచిన్ గెల్వఁజాలను
3. నా చెంత నీవు చేరియుండఁగ
ఏ చింతయైన నన్ను సోకునా
ఏ శత్రువైన నన్ను గెల్చునా?
నా శైలమా, నన్బాసి పోకుమా.
4. సమృద్ధుఁడు సహాయుఁ డాయెను
ఓ మృత్యువా నీ ముల్లు గెల్చునా?
సమాధి నీకు జయమబ్బునా?
మా మధ్యమున్ సర్వేశ పాయకు.
5. రేవు నేఁ జేరఁబోవు వేళలోఁ
కావుమయ్యా నీ దీప్తిఁ జూపుచుఁ
చావు జీవంబులందు నైనను
నీవు తోడై నన్బాసిపోకుము.

*– హెన్రీ ఫ్రాన్సిస్ లైట్*

*అను: ఆల్ ఫ్రెడ్ త్యాగరాజు పామర్*

## 57 *Saviour, again to Thy dear Name we raise*

1. ఓ రక్షకా, నీ దివ్య నామము
ఐక్యంబుతోను స్తుతియింతుము
ఆరాధనాంత మెందు వేళయం
దను గ్రహించు నీదు దీవెనఁ.
2. గృహంబుఁ జేర నాత్మ శాంతిని
ఒసంగి మాతో నుండుము సదా
ఇచ్చట సేవఁ జేయు మమ్మును
పాపంబుఁ జేయకుండఁగాయుము.
3. మా చుట్టు నుండు మబ్బునఁ ప్రభో
నీ దివ్యకాంతిన్ మాకు నియ్యుమా
పాపాంధకా బాధ నుండి నీ
బిడ్డల మైన మమ్ముఁ బ్రోవుమా.

*– జాన్ ఎల్లెర్టన్*

*అను: బర్నార్డ్ లూకాస్*

# ప్రభు దివసము

## 58 ప్రభు దినము

రా – యదుకుల కాంభోజి తా – ఆది

ఇది యెహోవా కలిగించిన దినము = సుదివసంబునను – జొప్పడు గడియలు – కొదువలేని దయ – గుల్కెడు వానివి ॥యిది॥

1. మోక్షము భూమియు స – మ్మోద మంది నుతు – లక్షరు గద్దె చుట్టు – నాక్రమింతురు గాక ॥నిది॥
2. అతఁడీ దినమం – చంత మొందు నర = వితతి నుండి వే – వేగ వచ్చెను॥ ఇది॥
3. ఆ పిశాచ రా – రాజ్యంబు కూలినది = ఆ పరేశు విజ – యము లీ దినమున ॥నిది॥

4. సేవక వరులు విల - సింపఁగఁ జేసి యా = పావనాద్భుతములఁ - ప్రచురముఁ జేయుదు ॥యిది॥

5. దావీదుని వర - తనయుఁడై యభిషే = కావృతుఁడౌ రాజా - గ్రణికి హోసన్నా ॥యిది॥

- పురుషోత్తమ చౌధరి

## 59 *O day of rest and gladness*

1. సుక్షేమ శుభకాల
విశ్రాంతి దినమా
విచారమెల్ల తీర్చు
దైవాదివారమా
ఈనాడు మేము కూడి
దేవాలయంబున
మా త్రైక దేవ స్తుతిఁ
గావింతు మెంతయు.

2. నీయందు సృష్టికర్త
విశ్రామ మొందెను
నీయందు యేసుక్రీస్తు
మృత్యు బంధమును
త్రెంచుచు తాను లేచి
చావుఁ జయించెను
నీ యందు పావనాత్మ
మాకియ్యఁ బడెను.

3. భూవాసు లీ దినంబు
సంతోషపడుచు
సువార్త విని, పాడి
మా యేసు స్తోత్రము
పితృపుత్ర శుద్ధాత్మ
త్రిత్వంబౌ దేవుని
ఉత్సాహ ధ్వనితోడ
నెంతో స్తుతింతురు.

- క్రిస్టఫర్ వర్డ్స్‌వర్త్
అను: జేకబ్ చేంబర్లేన్

# తండ్రియగు దేవుడు

## 60 నీవు నా తండ్రివి

రా - ఆనందభైరవి తా - ఆది

గొప్ప దేవ నాకు తండ్రివి - యాకాశమందు - గొప్ప దేవ నాకుఁ దండ్రివి = తప్పకుండ వత్తు నీ - దరికి యేసు నామమందు - గొప్ప కరుణ చేత న - న్నిప్పుడు తగఁ జేర్చుకొనుము ॥గొప్ప॥

1. నీవు మిగుల గొప్ప వాఁడవు - నా సృష్టి కర్త - యీవు లెపుడు నిచ్చు వాఁడవు = భావమందు నినుఁ దలంచి - పావనాత్మ నాకు నిచ్చి - జీవమార్గమందు నిలిపి - కావు మనుచు వేఁడుకొందు ॥గొప్ప॥

2. చిన్నవాని నంగి ప్రార్థన - నీ లోకమందు - మున్ను దయను విన్న వాఁడవు = సన్నుతుఁడగు యేసు నీదు - సన్నిధి నున్నాఁడు గాన - నన్నుఁ గనికరించు మనుచు - నిన్ను నమ్మి వత్తు నిపుడు ॥గొప్ప॥

3. విలువ గల్గు నీదు నాజ్ఞలు - నా హృదయమందు - బలు విధములఁ దలఁచు చుందును = బలుకులందుఁబనులయందు - బలముఁ జూపి నిన్నుఁ గొలిచి - యిలను నిన్నుఁ బ్రీతిపరుతు - నలయక నీ కరుణ మెయిని ॥గొప్ప॥

4. మీఁది రాజ్యమందుఁ జేర్చుము - కరుణాసముద్ర - బీద నైన నన్నుఁ గరుణచే = సోదరులను గూడికొనుచు - మోద మొప్పఁగ నీదు సేవఁ - బాదుకొనుచు నుందును నీ పాదపద్మములనుబట్టి ॥గొప్ప॥

- పులిపాక జగన్నాథము

## 61 సృష్టికర్త స్తుతి

రా - కాంభోజి తా - ఝంపె

ఘనుఁడైన యెహోవా - గద్దె ముందట మీరు - [1]వినతు లిప్పుడు చేయుడి - యోజనులార - వినయంబుగా నిర్మ - లానంద [2]రసలహరి - మన మనం బొప్పుచుండ - నో జనులార ॥ ఘనుఁడైన॥

[1]స్తోత్రములు. [2]ఆల

1. ఒక్కఁడే మన కర్తయుందు దేవుడని యున్ – జక్కగాను సృజియించు – సంహరించు ననియున్ – నిక్కముగఁ దెలిసికొండీ మన సహాయమే – మక్కరలేకుండ మనల = మిక్కుటపు పరిపాలనపు బలముచేఁ జేసె – మృత్తుచే మానవులఁగ – దిక్కు = గానక తిరుగు గొ – (గెల వలె మనము చెదరఁ – దిరుగఁదన దొడ్డిఁబెట్టె – నో జనులారా ॥ఘనుఁడైన॥
2. మే మందరము వందనపు పాటతో మూగి – మించు నీ గుమ్మములలో – మామా స్వరము లెత్తుదుము నభము పొదవుగా – మధురలయ సహితముగను – భూమియున్ దనదు పదివేల జిహ్వల వలఁ – బొందైన నీ నగరి కా – ధామంబులను గాన సన్నుతి వితతిపూరి – తమ్ములుగఁ జేయు దేవా యో జనులార ॥ఘనుఁడైన॥
3. ధరయంత విస్తారమైయున్నది నీ యాజ్ఞ – తగ విరహితాద్యంతమై – స్థిరమైన కాలంబువలెనె యున్న దయదయ – పొరలిపోవుచు నున్నవ = త్సరముల్ నిలిచిపోయి నప్పటికిని నీదు – సత్యంబు నిలిచియుండున్ – వర శిలా ఖండ పర్వతము తోడను సాటి – వన్నె కెక్కుచు నెంతయున్ ఓ జనులార ॥ఘనుఁడైన॥

– విలియం దాసన్

## 62 అనంత సహాయుడగు దేవుడు

రా – శహన తా – మి(శచాపు

1. గతకాలములయందు – ఘనసహాయుడ దేవా – హితనిరీక్షణ నీవే – యెన్నేండ్లకైన = అతిగా వీచినగాడ్పు – లందు దుర్గంబీవై – నిత్యాంత గృహమీవె – నిత్యఁడౌ (ప్రభువా ॥గత॥
2. నీ సింహాసన ఛాయ – లో సురక్షితముగ – వాసము సేయుదుము – భవ్యగుణతేజా = నీ సుబాహువేచాలు – నిశ్చయ సురక్షా – వాసముఁగా నొప్పు – (ప్రభువా ఘన దేవా ॥గత॥
3. నగముల్ వరుసనిలిచి – నగధరనిర్మాణ – మగుటకు మున్నేయ – నంత (ప్రభు నీవు – అగణితవత్సరము – నీవే మా –భగవంతుడవు నిన్ను (ప్రణుతింతు మేము ॥గత॥
4. వేయి యుగములు నీకు – దెసగతించిన యొక్క – సాయం(త సదృశము = సవి(తుడురు శో – భాయుతముగ లే – వక ముందు రా(త్రిలో – (ప్రహరము సుమియవ్వి ॥గత॥



5. గతకాలములయందు – ఘన సహాయుడ దేవా – హితనిరీక్షణ నీవే – యెన్నేండ్లకైన = క్షితిజీవితాంతము – గతిగానుండుము దేవా – నితాంత గృహ మీవె – నిత్యుడౌ (ప్రభువా ॥గత॥

– జాన్ చౌధరి

## 63 (త్రైక దేవునికి స్తుతి

రా – శంకరాభరణము (చాయ: అన్నామన యేసు) తా – ఏక

పరమపురి కల్పభూజ – నిరత భూనరుల పూజ = యురుతరచిత మహిమతేజ – వరస్తుతి సల్పెదము రాజ ॥పరమ॥

1. జనక సుత శుద్ధాత్మ – యను పేరిట యేకాత్మ = ఘనతర సంరక్ష (ప్రేమ – ననిపి మము కనికరించు ॥పరమ॥
2. నీవే మా (ప్రాపువంచు – నెరనమ్మి యుందు మంచు = భావంబున దలఁచు వారిఁ – బావనులఁ జేయు సదా ॥పరమ॥
3. కలుషంబులను హరింప – నిల సైతానును జయింప = బలుమారు నిను దలంచు – బలము గల (ప్రభుఁడ వీవే ॥పరమ॥
4. ఈ లోక పాపనరులు – చాల నిను నమ్మి మరల = దూలిచే దారుణ సై – తానును బడఁ(దొక్కివేయు ॥పరమ॥
5. అల్పా ఓ మేగయును – నాద్యంతంబులును = కల్పాంత స్థాయువైన = కర్తా కరుణించు మమును ॥పరమ॥

– పాలపర్తి యాకోబు

## 64 దేవుని (ప్రేమ

రా – సురటి (కూడికొని యున్నాము) తా – ఆది

ఎంత (ప్రేమించెనో – దేవుఁడు మనపై – నెంతదయఁజూపెనో = వింతగల యీ దైవ(ప్రేమను – సొంతమున ధ్యానింపరే ॥ఎంత॥

1. పనికిమాలిన పాపాత్ములమైన మనము ఆ – ఘనదేవునికి పిల్లలమనబడుటకై = తన కుమారుని మరణ బలిరక్తమున మన – లను స్వీకరించుకొనెను దీనిని జూడరే ॥ఎంత॥

2. పెంటకుప్పమీఁద పడియున్న యీ నీచ – మంటి పురుగులను లేవనెత్తి = మింటిపై ఘనులతోఁ గూర్చుండఁజేయ నీ – మంటి కేతెంచె మన – వంటి దేహము దాల్చి ॥ఎంత॥
3. ద్రాక్షారసపు మధురమును మించి యీ ప్రేమ – సాక్షాత్తుగా మనపయినుండగా – ఈ క్షితినా ప్రేమ ద్రాక్షారసముకంటె – దీక్షగవేడి యపేక్షింపతగునాహో ॥ఎంత॥
4. మనలను ప్రేమించి తన ప్రాణమిచ్చిన – ఘనుఁడా కాశమునుండి మరలి వచ్చి = మన దైన్యదేహమును తనరూపముకు మార్చి – కొనిపోయి తన రాజ్యమును మనకీయును ॥ఎంత॥
5. గట్టిగ మనమునం దిట్టి నిరీక్షణ – పెట్టియున్న సత్ క్రైస్తవులూ ప్రభు = దెట్టివాఁడొ మనమునట్టి వారుగ ప్రభుని – కట్టడలను మదిని బెట్టియుందము వేడ్క ॥నెంత॥

*– చదలవాడ జకర్యా*

## 65 *The Love of God*

1. దేవుని గొప్ప ప్రేమను
కలంబు తెల్పజాలదు
అత్యున్నత నక్షత్రమున్
అధోగతిన్ ఆవరించున్
నశించు జాతిన్ రక్షింపన్
సుతుని బంపెను –
పాపంబు నుండి పాపికి
విశ్రాంతి జూపెను.
॥దేవుని ప్రేమ సంపద
అపారమైనది
నిరంతరంబు నిల్చును
ప్రేమ సంగీతము॥
2. యుగాంతకాల మందున
భూరాజ్యముల్ నశించగా
యేసున్ నిరాకరించువారు
చావును కోరు వేళను
దేవుని ప్రేమ గెల్చును
అనంత జీవము –
నశించు వారి కాశ్రయంబు
ప్రేమ సందేశము.
3. సముద్రము సిరాతో నిండి
ఆకాశమె కాగితమై
కొమ్మల్లె కలంబులె
ప్రతి నరుండు కరణమై
దేవుని ప్రేమన్ చిత్రింపన్
సంద్రంబు యింకును
ఆకాశ వ్యాప్తి యంతయు
చాలక పోవును.

*– అను: ఏ.బి. మాసిలామణి*



## 66 *Love Divine, all love excelling*

1. దైవ ప్రేమ పృథ్విలోని
యన్నిటిని మించును
యేసు మాలో నివసించు
యది మా విముక్తియే
నీ కమూల్య ప్రేమ యుండు
నీవు దాసుల మైన మమ్ముఁ
గృపతో రక్షించుము.
2. మమ్ము సంరక్షించు శక్తి
నీకుండు, మా ప్రభువా
ఎన్నఁ డెన్నఁ డేని నీదు
సన్నిధిని బాయుము
నిన్ స్తుతించుచుండి మేము
సర్వదా సేవింతుము.
నిన్ బ్రార్థించి పూర్ణప్రేమ
మే మతిశయింతుము
3. క్రొత్తగా మమ్ము సృజించి
పాప మెల్లఁ బాపుము
మాకు స్వస్థత నొసంగి
గొప్ప రక్షఁ జూపుము
భక్తి యభివృద్ధి పొంది
స్వర్గమందుఁ జేరగా
వింత నొంది ప్రేమ స్తుతి
నీకర్పింతు మెప్పుడు.

*– చార్లెస్ వెస్లీ*

*అను: ఎచ్. హెన్రి డేవిడ్*

## 67 *How Great Thou Art*

1. శాశ్వతుడా! విస్మయమొంది నేను
నీ స్వంతహస్త సృష్టిజూడగా
నీ స్వరం విందున్ ఉరుములయందు
యేసు ప్రభూ నిన్నారాధింతును
॥ఓ రక్షకా! నీ స్తుతి పాడెదన్
నూరంతలన్ మహాదేవా
నా రక్షకా! నమస్కరింతునిన్
మారని యో మహాదేవా॥
2. వృక్షంబులందున్, అడవులలోనే
పక్షుల పాటలాలకింతును
తక్షణ మగ్రపర్వతంబు నుండి
అక్షులతో నీ మహిమ గందున్.
3. మహాదేవా! నీయేక పుత్రుండిలన్
నా హేయపాపముల్ భరించి, నా
సహాయుడై తా మరణించె నంచు
ఓహో! యాశ్చర్యపడి స్మరింతున్.
4. క్రీస్తు విజయార్భాటముతో వచ్చి
నీ స్థలమందు నన్ను జేర్చగా
నే స్థిరతుష్టితో సాష్టాంగపడి
నీ స్తుతి జేతునో మహాదేవా.

*– కార్ల్ బోబెర్గ్*

*అను: ఏ. నేస్మిత్*

# కుమారుడగు దేవుడు

## యేసుక్రీస్తు స్తుతి

### 68 ప్రభువైన యేసునకు స్తుతి

రా – ఆనందభైరవి (చాయ: యేసువంటి ప్రియబంధుఁడు) తా – ఆది

[1]ఘన [2]భవ దుపకృతు – లను మాటికి నే – వినుతింతును దే – నిజసుత= యొనరఁగ నాపై – [3]ననుక్రోశముఁ దగ – [4]నునుపవే క్రైస్తవ – జన విహిత ॥ ఘన॥

1. ధోరణిగా నా – దోసము లెంచకు – సారెకు నాశ్రిత – జనవరదా = [5]పారముఁ దప్పిన – పాతకు నగు నే – నారడివడ నీ – కది బిరుదా॥ఘన॥
2. జలబుద్బుదముతో – సమ మని నాస్థితి – తెలియద నీకది – దేహధరా = ఖలమయ మగు నీ – కర్మినిఁ బ్రోవను – సిలువను బొందిన – శ్రేయఃకరా ॥ ఘన॥
3. మందమతిని నా – యందు నలక్ష్యము – నొందకు దేవ [6]సు – నంద నా = యందముగా నా – డెందము కదుఁ దెలి – వొందఁగ నీ దయ – నందు మా ॥ఘన॥

– మిక్కిలి నమూయేలు

### 69 దైవ స్తుతి

రా – శంకరాభరణము (చాయ: యెహోవా సన్నిధి) తా – ఆది

సర్వదేశములారా – శ్రీ యేసే దేవుండు = ఉర్వి నుత్సాహముతో – గురుస్తోత్రము జేయను రండి ॥సర్వ॥

---

[1]గొప్పయైన [2]నీ ఉపకారములను. [3]ప్రేమ [4]ఉంచుము [5]గట్లు, లేక మేర. [6]సుపుత్రుఁడా. [7]హృదయము.





1. ఆ ప్రభువే దేవుండు – అధికస్తోత్రార్హుండు = భూప్రజలు నందరిని – బుట్టించిన భగవంతుండు ॥సర్వ॥
2. మనము దేవుని వార – మును మరి యాయన ప్రజల = మనయము నా ఘనప్రభువు – నెనరుతో మేపెడి గొఱ్ఱెలము ॥సర్వ॥
3. కృతజ్ఞతార్పణలు – కొల్లగను జెల్లింప = నాతని యావరణములో – నతి వినయముతోఁజేరండి ॥సర్వ॥
4. ఆయన దయామయుఁడు – ఆయన కృపామయుఁడు = ఆయన ప్రేమ సత్యం – బనవరతం బుండును నిజమే ॥సర్వ॥
5. శుభనామం మదినుంచి – ప్రభునామం స్తుతియించి = ఘననామం బతిభక్తిన్ – అనయము గొలువుడి జనులారా ॥సర్వ॥
6. పితృపుత్రాత్మకును – ప్రియ మహిమ మగుగాక = ఆదిని నుండినరీతి – ననవరతంబుండును గాక ॥సర్వ॥

– నరెళ్ల నమూయేలు సుబ్బయ్య

### 70 దేవకుమారునికి స్తోత్రము

రా – శంకరాభరణము తా – ఆది

దేవ కుమారా – దీనోపకారా = నా వంక దయఁ జూప – నా యన్న రారా ॥దేవ॥

1. వృక్షముఁ బాసిన – పక్షి నేనయ్యా = అక్షీణ కరుణచే – రక్షింపవయ్యా ॥దేవ॥
2. పాపుల పాలిటి – పరమదయాళూ = దీవించు నీ దయ – దీనునికిపుడు ॥దేవ॥
3. వినుతింతు సద్గుణ – విమల విచారా = ననుఁ బ్రోవవే యేసు – నామావతారా ॥దేవ॥
4. భజనఁ జేసెద నిన్ను – నిజ రక్షకుండ = విజయముఁ జేయవే – నజరేతు వాఁడా ॥దేవా॥
5. కనికర మత్యంత – కరుణయుఁగలదు = నిను నమ్ము వాని చే – తిని వీడ వలదు ॥దేవ॥

6. మహనీయ గుణమణి – మండిత దేవా = ఇహబాధ బాపవే – ఇమ్మానుయేలా ॥దేవ॥

– మిక్కిలి నమూయేలు

## 71 క్రీస్తును స్తుతించుట

రా – ముఖారి తా – త్రిపుట

నీవు నా దేవుండవై యు – న్నావు యేసు నాథ నీవిలఁ – బ్రోవవే। నన్నుఁ – గావవే ॥నీవు॥

1. పాప మానవ – శాప భారము – నోపి సిల్వను – బడిన క్షేమా – ధిపతి సర్వ – భూపతి ॥నీవు॥
2. శ్రేయమౌ కా – యంబు భక్తుల – కీయ సిద్ధముఁ జేయు యేసు – నాయకా – మోక్ష – దాయకా ॥నీవు॥
3. జీవ మారెడి – త్రోవ నేఁబడి – చావనై యున్నాను పతిత – పావనా యాత్మ – జీవనా ॥నీవు॥
4. జాగుసేయక – బాగుసేయను – రాఁగదె నే ఘోర పాప – రోగిని – దుఃఖ – భాగిని ॥నీవు॥
5. పాపమున నా – రూపు మాపితి – ప్రాపు నీవని నమ్మితిని నను లేపనా – కృపను – జూపవా ॥నీవు॥

## 72 క్రీస్తునకు మంగళార్చన

రా – బిలహరి (చాయ: గీతములు పాడరె) తా – త్రిపుట

మంగళముఁ బాడరె – క్రీస్తుకు జయ – మంగళముఁ బాడరె – యో ప్రియులారా – మంగళముఁ బాడరె = మంగళముఁ బాడి దు – స్సంగతిని వీడి ప్రభు – [1]సంగులను గూడి మదిఁ – బొంగుచుఁ [2]జెలంగుచును ॥మంగళము॥

1. రాజులకు రాజని – దూతలచేత – పూజఁగొనువాఁడని – తేజమున సూర్యునికి – దీప్తి నిడు సద్గుణ వి – [3]రాజితుని సాధుజన – రక్షకుని పక్షముగ ॥మంగళము॥

[1]ప్రభువుతో నున్నవారిని. [2]సంతోషించుచు. [3]ప్రకాశించువానిని



2. కరుణ గల వాఁడని – పాపులఁ బ్రోచు – బిరుదుఁగొనినాఁడని = మరణమును దానిఁ [1]బరి – మార్చు ఘన శక్తిగల – పరమ గురుఁడితఁడె మన – పాలి వాఁడని శుభ ॥మంగళము॥
3. సంగీతము పాడుచు – సువార్త ప్ర – సంగములఁ గూడుచు = [2]నింగికిని భూమికిని – నిత్యముగ నేలఁ దగు – శృంగారపు రాజునకు – క్షేమ మగు ఆమేనని ॥మంగళము॥

– పురుషోత్తము చౌధరి

## 73 క్రీస్తునకు స్తోత్రము

రా – తోడి తా – ఆది

మంగళమే యేసునకు – మనుజావతారునకు = శృంగార ప్రభువునకు – క్షేమాధిపతికి ॥మంగళమే॥

1. పరమ పవిత్రునకు – వరదివ్య తేజునకు = నిరుపమానందునకు – నిపుణ వేద్యునకు ॥మంగళమే॥
2. దురిత సంహారునకు – వరసుగుణోదారునకు = కరుణా సంపన్నునకు – జ్ఞానదీప్తునకు ॥మంగళమే॥
3. సత్య ప్రవర్తునకు – సద్ధర్మశీలునకు = నిత్యస్వయంజీవునకు – నిర్మలాత్మునకు ॥మంగళమే॥
4. యుక్తస్తోత్రార్హునకు – భక్తరక్షామణికి = సత్యపరంజ్యోతి యగు – సార్వభౌమునకు ॥మంగళమే॥
5. నరఘోర కలుషముల – నురుమారంగ నిల = కరుదెంచిన మాపాలి – వర రక్షకునకు ॥మంగళమే॥
6. పరమపురి వాసునకు – నరదైవ రూపునకు = పరమేశ్వర తనయునకు – బ్రణుతింతుము నిన్ను ॥మంగళమే॥

– పురుషోత్తము చౌధరి

[1]నశింపజేయు. [2]ఆకాశము

## 74 క్రీస్తునకు మంగళార్చన

రా – ఆనందభైరవి తా – ఆది

వందనమే యేసునకు – వరుసుగుణోదారునకు = సౌందర్య ప్రభువునకు సర్వేశ్వర నీకు ॥వందనమే॥

1. యెహోవా తనయునకు – ఇమ్మానుయేలునకు = బహు కరుణాభరణునకుఁ – ప్రభువుల ప్రభువునకు ॥వందనమే॥
2. ఆశ్రిత జనపాలునకు – నకలుష వర దేహునకు = ఇశ్రాయేల్ రాజునకు – యెహోవా నీకు ॥వందనమే॥
3. మరియాతనూజునకు – మహిమ గంభీరునకుఁ = పరిశుద్ధాచరణునకుఁ = బరమేశ్వర నీకు ॥వందనమే॥
4. రాజులపై రాజునకు – రవికోటి తేజునకుఁ = పూజార్హపదాబ్జునకు – భువనావన నీకు ॥వందనమే॥
5. ప్రేమ దయా సింధునకు – క్షేమామృత పూర్ణునకు = ఆమే నని సాష్టాంగము – లర్పింతుము నీకు ॥వందనమే॥

– పురుషోత్తము చౌధరి

## 75 క్రీస్తుకు మంగళ స్తోత్రము

రా – మారువ (చాయ: సందియము వీడవే) తా – అట

మంగళంబని పాడరే – క్రీస్తుకు జయ – మంగళంబని పాడరే – యేసుకు జయ – మంగళంబని పాడరే= మంగళంబని పాడి [1]సజ్జ – నాంగ పూజితుఁడై [2]కృపాత – రంగిలోక సమూహ పాపవి – [3]భంగుడని యుప్పొంగి జయజయ ॥మంగళ॥

1. ఘన యూద దేశంబులో – బెత్లెహే – మున యూదా గోత్రంబులో = వినుఁ డు యేసేపునకు సతియై – తనరుచుండెడి మరియ కడుపున – జననమై యీ మర్త్య వరులకు – సద్గతిని గల్గించు వానికి ॥మంగళ॥

---

[1]సజ్జన సమూహముచేత పూజింపబడిన వాడై. [2]అలలవంటి కృపగలవాడు [3]నాశనము చేయువాడు.



2. సోదరాళి భంగిని – భక్తుల నెల్లఁ – జూచి ప్రోచెదు వానిని = యూద దేశపు వారలధిక – బాధఁ బెట్టుచు హింసఁజేసిన – సాదరంబున [1]త్రిదినములకు ముదముతో గనుపడిన ప్రభునకు ॥మంగళ॥
3. ధరణి న్గొల్చెడి దాసజ – నములనుఁబ్రోచు – దైవ తనయుఁడని నిజ = [2]మరయ నిలను స్మరించువారికి – గురుతరంబగు [3]కలుష జలనిధి – దరికిఁ జేర్చు పరమ పదమే – [4]యిరు వొసర్చెద ననిన ప్రభునకు ॥మంగళ॥

– పురుషోత్తము చౌధరి

## 76 క్రీస్తు యేసునకు మంగళహారతి

రా – ఆనందభైరవి (చాయ: తెలుగు తల్లికి వందనం) తా – అట చాపు

క్రీస్తుయేసుకు మంగళం మా – కీర్తి రాజుకు మంగళం = క్రీస్తుయేసే దైవమంచును – కూడి పాడుదు మంగళం॥

1. ప్రవచనంబులు బల్కినట్టి – ప్రాణనాథుడవీవె నీదు = స్తవము జేయుచు మెలగు మనుజుల – సత్ప్రభువుకిదె మంగళం ॥క్రీస్తు॥
2. జగమునేలెడు జీవనాథుడ – జపములందెదు గృపకటాక్ష = అగణీ తంబగు ప్రేమజూపిన – అమరతేజుడ మంగళం ॥క్రీస్తు॥
3. ఖలుల బ్రోచెదు కనికరాత్మ – కేంద్ర స్థానము నీ పదాబ్జము = కలుషమును కడమార్చినట్టి – సిలువ నాథుడ మంగళం ॥క్రీస్తు॥
4. మనము గోరెడు మా హృదీశుడ – మార్గదర్శుడ వీవెగావ = అనయము నినుగొల్చు జనముల – ఆది దేవుడ మంగళం ॥క్రీస్తు॥
5. జనకసుత శుద్ధాత్మ దేవుడ – గనని వినని ప్రేమ పూర్ణుడ = తనివితీరగ పాడుదము యీ – ధాత్రి నీకగు మంగళం ॥క్రీస్తు॥

– సి. రవివర్మ

---

[1]మూడురోజులకు. [2]విచారింపగా [3]పాపసముద్రము [4]నివాసము.

## 77 రక్షకునియందలి విజయము

రా – శహన తా – త్రిపుట

విజయగీతముల్ పాడరే – క్రీస్తుకు జయ – విజయగీతముల్ పాడరే = వృజిన మంతటి మీఁద – విజయ మిచ్చెడు దేవ – నిజకుమారుని నామమున్ – హృదయములతో – భజన జేయుచు నిత్యమున్ ॥విజయ॥

1. మంగళముగ యేసుఁడే – మనకు రక్షణ – శృంగమై మరి నిల్చెను – నింగిన్ విడిచి వచ్చెను – శత్రుని యుద్ధ – రంగమందున గెల్చెను = రంగు మీరఁగఁదన – రక్తబలము వలనఁ – పొంగు నణఁగఁజేసెను – సాతానుని బల్ – క్రుంగ నలిపి చీల్చెను ॥విజయ॥

2. పాపముల్ దొలఁగింపను – మనలను దన స్వ – రూపంబునకు మార్పను – శాపం బంతయు నోర్చెను – దేవుని న్యాయ – కోపమున్ భరియించెను = పాప మెరుఁగని యేసు – పాపమై మనకొరకు – పాపయాగము దీర్చెను – దేవుని నీతిన్ – ధీరుఁడై నెరవేర్చెను ॥విజయ॥

3. సిలువ మరణము నొందియు – మనలను దనకై – గెలువన్ లేచిన వానికి – చెలువుగన్ విమలాత్ముని – ప్రేమను మనలో – నిలువన్ జేసిన వానికిఁ = కొలువుఁ జేతుమెగాని – ఇలను మరువక వాని – సిలువ మోయుచు నీ కృపా – రక్షణ చాల విలువ గలదని చాటుచు ॥విజయ॥

– అల్లూరి పెదవీరాస్వామి

## 78 క్రీస్తు సేవా సాఫల్యత

రా – జంఝూటి తా – ఏక

యేసు భజనయే మనలను ఆ సుగతికిఁ దీయు – జనులారా = దాసజనులు జేయు పలు – దోసములు మోయు ॥యేసు॥

1. మేల [1]కులశీల వ్రత – [2]జా [3]లాధిక మేల = చాల మన మీలాగునఁ – [4]గాలావధిఁ గూల ॥యేసు॥

[1]కులాచారము. [2]సమూహము. [3]మొదలైనవి. [4]కాలాంతముందు.



2. [1]అక్షయ కరుణేక్ష [2]భువన – రక్షణ [3]ఖల శిక్షా = ధ్యక్ష [4]బుధ పక్ష కృత – మోక్ష యను [5]దీక్షన్ ॥యేసు॥
3. మాటికి [7]మిన్నేటికిఁ బో – నేటికిఁ గాల్ నొవ్వ = సూటిగ నరకోటి [8]దురిత – వాటములను [9]మీటు ॥యేసు॥
4. [10]శ్రోత్రమ యపవిత్ర నర చ – రిత్రలు వినఁబోక = మైత్రిని బరమాత్ముని కథ – మాత్రము విను మనుచున్ ॥యేసు॥
5. మన జీవనమునకు మారుగఁ – తన ప్రాణము నిచ్చెన్ = తన రక్తముచేఁ బావన మొనరించెను మనలన్ ॥యేసు॥

– విలియం డాసన్

## 79 యేసు భజన

రా – జంఝూటి తా – ఆది

శ్రీ యేసునే – భజించు – నా మనసా – శ్రీ యేసునే భజించు = శ్రీ యేసు ప్రభునే భజించు – నా మనసా – శ్రీ యేసునే భజించు ॥శ్రీ యేసు॥

1. యేసు త్రిత్వమం – దీశ కుమారుఁడు = భాసురుఁ డాతఁడు – భూషిత రక్షకుఁడు ॥శ్రీ యేసు॥
2. నరుల దురితస్థితిఁ – గరుణించి వారికిఁ = పరమ సుఖము లిడ – పరికించి వచ్చిన ॥శ్రీ యేసు॥
3. స్వామికి మహిమయు – భూమికి నెమ్మది = క్షేమము నియ్యను – లేమిడిఁ బుట్టిన ॥శ్రీ యేసు॥
4. నరులను తండ్రితో – నైక్యము జేయగ నిరతము వేఁడెడి – నిజప్రాపకుఁ డగు ॥శ్రీ యేసు॥
5. మూఁడవ దినమున – మృత్యువు నోడించి = తడయక పునరు – త్థానము నొందిన ॥శ్రీ యేసు॥

– యెషయా వీరమార్టిన్

[1]శాశ్వతమైన కరుణ గల చూపుగలవాఁడా. [2]లోకమును రక్షించువాఁడా. [3]పాపులను శిక్షింపనధికారి. [4]జ్ఞానుల పక్షమైనవాఁడా. [5]మోక్షస్థానమునుచేసినవాఁడా. [6]నిలకడచేత. [7]గంగానది? [8]పాపములను అడ్డులను, లేకపాపము యొక్క యభివృద్ధులను. [9]పోఁగొట్టు [10]చెవి.

## 80 క్రైస్తవ విశ్వాసమునకుఁ బ్రేరేపణ

రా – యదుకులకాంభోజి    తా – ఆది

యేసుని భజియింపవే మనసా – నీ దోసములు చనఁ – జేసి కృపతోఁ బ్రోచునే మనసా = వాసి కెక్కిన క్రీస్తు మోక్షని – వాసిగా కిఁక వేరేలేరని – దోసిలొగ్గి నుతించితే నిను – త్రోసివేయఁడు దోసకారని ॥యేసు॥

1. ఏటికే నీ కీదురాశలు – నీ – కెప్పుడును చెవి – నాటవుగ ప్రభు యేసు వాక్యములు = వాటముగ నా తుది దినమున – నీటుమీఱఁగ నిత్యజీవ కి – రీటమును నీకిత్తు నని తన – నోటఁ బల్కిన మాటఁ దప్పఁడు ॥యేసు॥

2. ఖండనగ నిను చెండియాడఁడు – యెల్లప్పుడుందన మిత్రుడని రక్షించు నతఁడితఁడు = అండఁబాయక నిన్ను ప్రతి దిన – గండములను హరించునని నీ – వుండ గోరిన నిండు నెమ్మది – దండిఁగ నీకుండఁ జెప్పును ॥యేసు॥

3. లోక సైతాను దుర్భోధలు – నీ వాలింపక యా – లోకరక్షకుని సుబోధలు = ఏక మనసుతో రాత్రిఁబగలు ప – రాకులేకను గాచు నా ప్రభు – రాకడను నీవెఱింగినను పర – లోకశుభ సుఖసౌఖ్య మొసఁగును ॥యేసు॥

4. వంచనలు మది నుంచకే మనసా – నీ – దుర్గుణము తలఁ ద్రుంచి ప్రభుని సేవింపవే మనసా = అంచితముగా క్రీస్తుఁ డీప్ర – పంచ జనుల భవాబ్ధినావగ – నెంచి నీ భవభార మతనిపై – నుంచి సతము ప్రార్థించు మనసా ॥యేసు॥

5. నిన్ను పాప బంధముల నుండి – రక్షించుటకు స – ర్వోన్నతుని కుమారుఁడై వెలసి = ఎన్నఁగ నీవొందు దుఃఖము – లన్నిటిని తా ననుభవించెను – విన్న తక్షణ మేసుక్రీస్తుని – విశ్వసించి సుఖించు మనసా ॥యేసు॥

– రావూరి లక్ష్మయ్య

## 81 యేసు నామ భజన

రా – హిందూస్థాని తోడి    తా – ఆది

భజనచేయుచు భక్తపాలక – ప్రస్తుతింతు నీ నామమును = వృజినములపై జయము నిచ్చిన – విజయుఁడా నిను వేఁడుకొందు॥



1. దివ్యపదవిని విడిచి నీవు – దీనుఁడవై పుట్టినావు = భవ్యమైన బోధలెన్నో – బాగుగా ధర నేర్పినావు ॥భజన॥
2. నరులఁ గావను పరమునుండి – ధరకు నీవు వచ్చినావు – పరుఁడ నైన నా కొరకు నీ – ప్రాణము నర్పించినావు ॥భజన॥
3. చెడినవాఁడ నైన నన్నుఁ – జేరఁదీసి ప్రోచినావు = పడిన నాదు గోతి నుండి – పైకి లేవనెత్తి నావు ॥భజన॥
4. ఎంత ప్రేమ యెంత దయ – యెంత కృప యేసయ్య నీకు = ఇంతయని వర్ణింప నిలలో – నెవనికిని సాధ్యంబుకాదు ॥భజన॥

– దొరసామి ఆరోగ్యము

## 82 యేసు నామ భజన

రా – ముఖారి    తా – ఆది

యేసుభజనసేయవే – దోసపుమనసా! = వాసిగ నేనే, వరరక్షకుఁడు – వేసారి = వసుధ – నెవ్వారినిఁ గానము ॥యేసు॥

1. ధారుణపాప – భరణా! హరణా! = కారుణ్యకరయని కోరిభజింపవె ॥యేసు॥
2. శాంతిసునీతి – సదములభక్తిన్ = వింతగనిడు మన – శ్శాంతిసుధాకరుఁ ॥డేసు॥
3. అనఘా! నీవే – అవనితలంబున – ననుఁగనుఁగొంటివి – నా ధనమంటివి ॥యేసు॥
4. మనసా! నీదు – మలినంబును తా = మనుగడ, సిల్వపై – మాపెమహాత్ముఁడు ॥యేసు॥

– ఓగిరాల గాబ్రియేలు

## 83 క్రీస్తును చూడ రండి

రా – శంకరాభరణము    తా – ఆది

రారే మన యేసు స్వామిని – జూతము కోర్కె – [1]లూర ప్రియులారా [2]పేర్మిని = [3]గూరిమి భక్తులఁ – [4]విందట – భూరిద [5]యామృత –

---

[1]వృద్ధిపొందినట్లు [2]ప్రేమచేత [3]ప్రేమచేత [4]బంధువుఁడు. [5]అమృతము యొక్క రసము

సారము లొలికెడు – [1]చారు కటాక్ష [2]వి – శాలేక్షణుఁడఁట – [3]నారకులగు [4]నర – నారీజనులకు – [5]దారక మొసఁగను – దానె పిలుచునఁట – [6]దారుణ పాప మ – హారణ్యమునకుఁ – [7]గారుచిచ్చు గతి – గన్పడువాఁడట – ఘోరదరిద్రతఁ – గూల్చెడివాఁడట = సారం బగు తన – సభకు [8]మకుటమఁ ట ॥రారే॥

1. [9]పతిత పావనమౌ వేల్పఁట – అనాది దేవ – సుతుడై యిలఁ జేరి నాఁడఁట = [10]సతతము కడు [11]దురి – తతమోయుతమగు – ప్రతి దేశమునకు – [12]హితభాస్కరుఁడఁట – [13]అతులిత [14]మోక్షో –న్నత గుణగణుఁడఁట – [15]కుతలంబున [16]స – ద్గతి రహితంబగు – పతితులఁ గావను – మృతుడైనాఁ డఁట – అతిపుణ్య [17]తను – క్షత శోణితమును – [18]వ్రతముగ సిలువను – నతడొసంగెనఁట – మృతిని జయించుచు – బ్రతికి లేచెనఁట = మతి నమ్మిన మన – గతి యితఁడేనఁట ॥రారే॥

2. తుదలేని మహిమవాఁడఁట – తనుఁగొల్చు సాధు – హృదయుల సొమ్ము మూటఁట = చెదరిన గొఱ్ఱెల – [19]వెదకవచ్చెనఁట – చిదురుపలగు జన హృదయము లన్నిటఁ – బదిలముగా నె – మ్మది నిడువాఁడఁట – [20]నదితట [21]మఠ [22]జన – వదనముల [23]స – మ్మద శుభవార్తనుఁ – బలికినవాఁడఁట – సదయత [24]నంధుల – [25]కక్షుల [26]నిడెనఁట – వెదకి [27]బధిరులకు – [28]వీను – లొసఁగె నఁట – [29]సదమల [30]మోక్ష – ప్రదుఁడగు విభుఁడఁట = యిదిగో మనకిత – డేలినవాఁడఁట ॥రారే॥

– పురుషోత్తమ చౌధరి

---

[1]సుందరమైన. [2]పెద్దనేత్రములుగలవాఁడు. [3]నరకసంబంధులు. [4]పురుషుల. స్త్రీలునగు. [5]ఆధారము [6]భయంకరమైన. [7]అడవినిప్పు. [8]కిరీటము. [9]పాపులను పవిత్రముచేయు. [10]నిత్యము. [11]పాపమనెడు చీకటితో గూడుకొనిన. [12]అనుకూలమైన సూర్యుడు. [13]సమానములేని. [14]మోక్షమకంటె ఉన్నతమైనగుణ సమూహముగలవాఁడు [15]భూమియందు [16]సదతిలేని [17]శరీరముయొక్క గాయపు రక్తమును. [18]పట్టుదలగా. [19]ముక్కలు. [20]నదీతీరములయందు. [21]గుళ్లలో. [22]గ్రామములలో. [23]సంతోషముతో [24]గ్రుడ్డివారికి. [25]కన్నులు. [26]ఇచ్చెను. [27]చెవిటివారికి [28]చెవుడు [29]పరిశుద్ధమైన. [30]మోక్షమిచ్చువాఁడు



## 84 నీతి సూర్యుఁడు

రా – బేహాగ్ తా – ఏక

ఇదిగో నీతిభాస్కరుండు – ఉదయమాయె నతని నీతి హృదయ కమలమునను నిలిచి = మది తమోగుణంబులణపె – సదమల జ్ఞానంబు నొసఁగె ॥ఇదిగో॥

1. ఎవని జ్ఞానమహిమ విభవ – మెవనినీతి బలప్రకాశ – మెవని మనుజ రూపమాయె = నవవినీత సత్యవర్తి రవినిమించు తేజమూర్తి ॥ఇదిగో॥
2. నరజనముల నీతియెవడో – ధరణిపతుల దీప్తియెవడో – దురితఋణము దీర్చునెవఁడో = పరమపురుషు డేసుఁడతఁడె – నిరతజీవ మొసగునిపుడె ॥ఇదిగో॥
3. కలుష మెల్ల బాపదలఁచి – కలువరి గిరివరకు నడచి – యలవికాని ముక్తి గూర్చన్ = సిలువమీద బలియై మరణ – బలమునణఁచి తిరిగిలేచె ॥ఇదిగో॥
4. మదితమం బదెచటికరిగె – యెదను కఠినతనము కరిగె – హృదయరసము లతిశయించి = సాధుగుణముగలిగి యేసు – పాదములను గొలుతు నిపుడె ॥ఇదిగో॥
5. జనగణముల జీవమతఁడె – ధనఘనముల దాతయతఁడె – యనుభవమున నెఱుఁగుమతని = యనుపమ ప్రేమా మృతంబు – ననవరతా నందకరము ॥ఇదిగో॥

– చెట్టి భానుమూర్తి

## 85 క్రీస్తును కొలుచుట

రా – జంఝూటి తా – ఆది

చేరికొల్వుఁడి – క్రీస్తుని పాదములఁ – జేరి కొల్వుఁడి = చేరి కొల్వుఁడి – స్థిరమతితో మీ – నోరు నిండ మది – కోరికఁ దీరఁ ॥జేరి॥

1. [1]ధీరకలితుఁ డుప – కారకుఁ డితఁ డని – [2]యారూఢిగ మదిఁ – గోరి ప్రియమునఁ ॥జేరి॥
2. జనకుని యుగ్రం – బును దా నోరిచి – జనులకు మేలు నొ – సంగి ఘనునిఁ ॥జేరి॥

---

[1]ధైర్యవంతుఁడు [2]నిశ్చయముగా.

3. [1]సార చరిత్రో – దారుఁడు [2]పాతక – ధీరుఁడు [3]శుద్ధా – చారుండితఁడని ॥జేరి॥

4. దేవుని కొమరుఁడు – [4]ధీవిస్తారుఁడు – [5]సేవ కావనుఁడు క్షేమకరుండని ॥జేరి॥

5. యేసుని వారల – [6]నీశుఁడు మన్నన – జేసి తప్పు క్షమ – చేయునుగానఁ ॥జేరి॥

6. మరణము నొందిన – నరులను గృపఁ [7]గ్ర – మ్మరఁ బ్రతికించిన – [8]మహిమోజ్వలునిఁ ॥జేరి॥

7. పలు దయ్యంబులఁ – బారఁదరిమి రో – గుల రక్షించిన – [9]మలినాపహునిఁ ॥జేరి॥

8. జను [10]లచ్చెరు వొం – దను మూఁగకు నో – రును గన్నులు [11]చీఁ – కునకిడినాఁ డని ॥చేరి॥

– కాజా అనంతము

## 86 యేసున కేమి సమర్పించుదును?

రా – ఆనందభైరవి తా – అట

ఏమి నేను సమర్పింతు – యేసూ – యెట్లు నిన్ను స్తుతియింతు = ఏమి సమర్పింతు – హీనుఁడ నగు నేను – గామితార్థము లెల్ల – గలుగఁజేయు నీకు ॥నేమి॥

1. నేను మార్గముఁ దప్పియుండఁగ – నన్ను – నీవు కంటివి కరుణ నిండఁగ = దీనపాపులను – దృఢముగఁ బ్రోవను – దాన మిచ్చితివి – తనర నీ ప్రాణము ॥నేమి॥

2. అందరి కొఱ కీవు తెచ్చిన – మిగుల – అందమైన నిత్య రక్షణ = అంది నిన్ను వినతి – పొందుగఁ జేసెద – నొందు మా నా నుతి – నుత్తమ ప్రభు క్రీస్తు ॥ఏమి॥

---

[1]మంచి చరిత్రగలవాఁడు. [2]పాపమును జయించువాఁడు. [3]పరిశుద్ధమైన గురువు. [4]మిక్కిలి జ్ఞాని. [5]సేవకులను రక్షించువాఁడు [6]దేవుఁడు [7]తిరిగి. [8]మహిమతో ప్రకాశించున్నవాని. [9]పాపమును పోగొట్టువాని [10]ఆశ్చర్యము [11]గుడ్డి.



3. నీ యందే యానంద మొందఁగ – యేసు – నీదైన యాత్మ నాకందఁగ = జేయు మంచు నీకుఁ జేసెదఁ బ్రార్థన–నాయందు దయచేసి – నా మనవి నాలించు ॥మేమి॥

4. నేను జేసిన యఘము లెల్లను – గర్త – నీ యెదుటఁ దలంచు కొందును = నేను సిగ్గు నొంది – నిజముగఁ గుందుచు – నేను వేఁడుకొందు – నీ క్షమాపణ కొరకు ॥నేమి॥

5. నన్ను నీవు స్థిరపరచుము – కర్త – యన్నిట నను బలపరుచుము = తిన్నని మార్గమున – దృఢముగ నేగుచు – నిన్ను నే స్తుతియింతు – నిండుగ నెల్లప్పు ॥డేమి॥

– పులిపాక జగన్నాథము

## 87 క్రీస్తుకు నమోనమః

రా – శంకరాభరణము తా – అట

1. సర్వ లోక సం పూజ్యా – నమోనమో – సర్వ జ్ఞాన సంపూర్ణా – నమోనమో – సర్వ సత్య సారాంశా – నమోనమో – దేవా గావో ॥

2. దీన భక్త మందారా – నమోనమో – దోష శక్తి సంహారా – నమోనమో – దేవ యేసావతార – నమోనమో – దేవా గావో ॥

3. దేవలోక ప్రదీపా – నమోనమో – భావలోక ప్రతాపా – నమోనమో – పావనాత్మ స్వరూపా – నమోనమో – దేవా గావో ॥

4. వేదవాక్యాదర్శ మీవె – నమోనమో – వేద జీవమార్గం బీవె – నమోనమో – వేదవాక్కును నీవే – నమోనమో – దేవా గావో ॥

5. శాపగ్రహివైతివి నాకై – నమోనమో – ప్రాణత్యాగివైతివి. నాకై – నమోనమో – ప్రాయశ్చిత్తమైతివి నాకై – నమోనమో – దేవా గావో॥

– చెట్టి భానుమూర్తి

## 88 యేసును స్తుతించుట

రా – కానడ తా – ఆది

నమో యేసునాథా – నాథా – నమో జీవనాథా = సమాన విరహిత సనాతనాత్మా – సమున్నతోజ్వల ప్రశాంత ధామా ॥నమో॥

1. స్థావర జంగమ జగమందున నీ శక్తి స్వరూపము ప్రతిఫలింపగ = భూవలయాకాశంబుల మించుచు – భువన పాలనముజేసెటి ప్రభువా ॥నమో॥
2. ధరణీ మానవ విమోచనార్థము – కరుణను జీవము లొసగిన ప్రభువా = పరమ కృపాభరితా మృతసారా వరసజ్జన హృదయాబ్జ విహారా ॥నమో॥
3. సుందర మలయజ గంధ ధూపముల – చందముననుమా వినుతులు గొనుమా = వందే దేవ దయాసందీప = వందే శుభదానంద స్వరూపా ॥నమో॥

– ఇ.జి. ఆనందము

## 89 యేసునకు వందనము

రా – శంకరాభరణము (చాయ: ఉదయించినాడు) తా – అట

వందనమయ్యా – యేసు నీకు – వందనమయ్యా – మా కోరిక – లందియ్యవయ్యా = వందనమయ్య నీ సుందర పాదార – విందములకు భక్తి – వినతులు గావింతు = సందియంబులులేని పరమానందమున నీయందు డెందము – పొందుపడఁ జేయవె యెహోవా – నందనా [1]పాపేంధనాగ్ని ॥వందనమయ్యా॥

1. నర దైవత్వములు – రెండుగూడి – పరిపూర్ణమైన – దేహాత్మలు – ధరియించియందు – లేశంబయిన – దురితంబులేని – యవతారము – నెరవుగా దాల్చి = ధరణికి నేతెంచి [2]నిరయార్హులగు సర్వ – నరుల రక్షింప నీ కరుణా ప్రవాహము = విరివిగా పరుగెత్తఁ జేయుచు – విమలమగు నీ ప్రాణరక్తము – లరుదుగా సమర్పణము ,చేసియు – తిరిగి లేచితివో మహా ప్రభూ ॥వందనమయ్యా॥

2. నీ పుణ్యమందు – నమ్ముకొనెడి – యే పాపియైన – తక్షణమున – శాపంబుఁ బాసి – [3]త్రాణగలిగి – నీ [4]సజ్జనుండు – కృపవానిని – కాపాడుచుండు = దీపించు భవ దీయ దివ్య వాగ్దత్తంబు – లాపత్పరంపరల కడ్డుపడుచు నుండి = నీ పయిందన భారమెల్లను – వోపి యోపికనుండ నేర్చిన – పాపిపుణ్యుండగుచు నాత్మను – [5]భవ్య సుఖ [6]మఖిలంబుఁ బడయును ॥వందనమయ్యా॥

[1]పాపమనే కట్టెలకు నిప్పువంటివాడా. [2]నరపాత్రులు. [3]బలము. [4]సమీపము. [5]శుభమైన. [9]సకల



3. శమదమ ప్రేమ – కృపా వినయ – సద్గుణములనెడి – భూషణముల – నిమిడియున్నట్టి – తనువు దాల్చి – క్రమముగానందు – దైవత్వము – కనుపఱచినావు = విమలోపదేశముల్ వివిధంబుగా శిష్య – సముదయమునకు నుత్తముగా బోధించి – యమిత పాపహరంబునకు భువినవతరించిన మేను సిలువను – శ్రమను మృతికల్పించి మృత్యువుఁ – జంపి జీవించిన మహాత్మా ॥వందనమయ్యా॥

– పురుషోత్తము చౌధరి

## 90 యేసుక్రీస్తుకు స్తుతి

రా – బిలహరి (చాయ: యేసునాధ కథా) తా – త్రిపుట

క్రీస్తునాయక నీ దయాళిని – కీర్తనలుగా బాడుదున్ – [1]నేస్తుతులతోఁ దండ్రి దేవుని – నిత్యమును [2]గొండాడుదున్ ॥క్రీస్తు॥

1. సిలువ మోసిన నీ ప్రయాసను – జెప్పుటకు నోరాడదు = [3]అలుకునొందక స్వామి నీ [4]ది – వ్యాంఘ్రి చెంతను గూడుదు ॥క్రీస్తు॥
2. నిమిషమైన న్యాయకెదలో – నిన్ను నే స్మరియింతును = అమితమౌ దేవా [5]ను క్రోశము – హర్షముగ వర్ణింతును ॥క్రీస్తు॥
3. యేసుప్రభు నా కాలమంతయు – నేమఱక నీ నామము = దాసునిగ భజియంతు నిఁక నేఁ – దప్పకుండను నీమము ॥క్రీస్తు॥
4. చచ్చి నే నరుదెంచి మోక్షము – స్వామి నీ యుపకారముల్ = హెచ్చు ప్రేమను బాడుచుందును – యెప్పుడును [6]గైవారముల్ ॥క్రీస్తు॥
5. మలినమౌ నా నత్తి నాల్క స – మాధిలోఁ గృశియింపను = బలిమితోనేఁ బాడుచుందును – భక్తి [7]యుజ్వలింపను ॥క్రీస్తు॥
6. కన్ను మూతలుగాను నీ సము – ఖంబు కేను బిరాలను = తెన్ను తప్పకవత్తు శ్రీకర – దేవ నను నీవేలను ॥క్రీస్తు॥
7. ముగ్గురొకఁడై వెల్గుచుండెడి – మోక్షరాజ్య [8]గరిష్ఠుఁడా = యొగ్గుచేయక నన్నుఁ బ్రోవవే – యేసునాధ [9]మహేశుఁడా ॥క్రీస్తు॥
8. భూతలములో నీ సమానముఁ – బోల్చ నేదియుఁ గానము = దాతవై మము సలుపవే నీ – తండ్రికిని [10]సంధానము ॥క్రీస్తు॥

– మిక్కిలి నమూయేలు

[1]స్నేహితులతో. [2]స్తుతింతును. [3]భయము. [4]పరిశుద్ధపాపదము. [5]కనికరము [6]స్తోత్రములు [7]ప్రకాశింపను. [8]గొప్పవాడా. [9]గొప్పదేవుడా. [10]కూడిక.

## 91 క్రీస్తునకు స్తుతి

రా - శహన తా - ఆది

నా రక్షకా యేసునాథ ఇమ్మానుయేలు - ఘోర పాపుల పాప భార విమోచక ॥నా రక్షకా॥

1. నిత్యకాలమునందు - నిజమైన దేవుని = సత్యవాక్యమై యున్న - స్వామి నిన్నుతియింతు ॥నా రక్షకా॥
2. సర్వ లోకంబులను - సత్యవాక్యమై యుండి = నిర్వహించిన దేవుని - నిజబాహువా స్తుతింతు ॥నా రక్షకా॥
3. దేవజనులకు - సువార్త దెలుప నభిషేకంబు =పూని నొందిన దేవపుత్రుడ నుతియింతు ॥నా రక్షకా॥
4. దేవ మహిమ ప్రకాశ - దీనరక్షక మాను = ష్యావతారము దాల్చి - యావదాజ్ఞల దీర్చిన ॥నా రక్షకా॥
5. పావనాద్భుతుడవై - పరమ జ్ఞానము దెల్పిన = దేవస్వభావ ముద్ర - దేదీప్యుడా స్తుతింతు ॥నా రక్షకా॥
6. పాపాత్ములను గావ - శాపభారము క్రింద = నోపికతో నిల్చి - ప్రాపు జూపిన ప్రభువా ॥నా రక్షకా॥
7. ఈ వసుధను ప్రేమ - నెసగునట్లుగ జూపి =చావు గెల్చిన సర్వ సామర్థ్యుడా స్తుతింతు ॥నా రక్షకా॥
8. ఘన దేవుని కుడి పార్శ్వమున - గూర్చుండి విజ్ఞప్తి = నొనరించు నా యేసు - వినయ స్తోత్రంబిదిగో ॥నా రక్షకా॥

- తిరుకోవళ్లూరి స్టీవెన్

## 92 యేసు శరణు

రా - జంఝూటి తా - ఆది

యేసు పదాంబుజ శరణం - నర - దోష మహాంబుధి - హరణం = యేసే మార్గము యేసే సత్యము - యేసే జీవము యేసుకు - శరణం॥

1. దేవకుమారశరణం - నర - జీవప్రదాత - శరణం = దేవదేవ జగదావతారమము - బ్రోవరావె ప్రభు నీవే-శరణం ॥



2. పాపవినాశక శరణం - నర శాపవిమోచక - శరణం = పావనాత్మ భవదీయ ప్రాణమిడి - ప్రాపువైతివో ప్రభువా-శరణం
3. పరమపురుషుడా శరణం - ఓ - నిరుపమప్రేమడ - శరణం = మరణ మొంది మరి మృత్యుంజయుడై - పరమున జరిగిన ప్రభువా-శరణం॥
4. నీతిపూర్ణమా శరణం - జగ - జ్యోతి రత్నమా - శరణం - జాతిభేదరాహిత్యుడ హితుడా - నీతిప్రబోధక నీవే-శరణం
5. తేజోమూర్తికి శరణం - విభ్రాజిత కీర్తికి - శరణం = రాజరాజ యో భారత రాజ్య - ప్రజాత్మ రక్షక ప్రభువా - శరణం

- చెట్టి భానుమూర్తి

## 93 యేసు దీనదయాళుడు

రా - మాయామాళవగౌళ తా - ఆది

దేవాత్మ జయో దీనదయాళూ పావనాత్మ - మము బ్రోచితహో - నీవే గదా మా - నిజరక్షణకై జీవమియ ధర - జేరితహో॥

1. సుగుణాత్ములలో - సుగుణము నీవే నిగమము లెరుగని - నీతివహో = సుజనాత్ముల కిల - సుజ్ఞానాత్మవు - సవినయ భక్తికి సారమహో॥
2. పేదలలో నిరు - పేదవు నీవే సాధులలో ఘన - సాధువహో = మోదమలర మా - ముక్తిని గూర్చిన సాధు పేదజన సోదరహో॥
3. దీనాత్ములలో - దీనుడవై భవదీయ దయారస - ధారలహో = దినదిన మొసగిన - దేవాత్మజ యిమ్మాను యేలు వం - దనములహో॥
4. పరమ పూజ్యుడా - పరిమిత ప్రేమాభరితుడ సంస్థవ - పాత్రుడహో = నిరతము నిన్నేమరక - నుతిం - చెద నరజన గణముల - నేస్తడహో॥

- చెట్టి భానుమూర్తి

## 94 యేసునకు సమానులెవరు?

రా - శంకరాభరణము తా - ఆది

సమానులెవరు ప్రభో - నీ - సమానులెవరు ప్రభో =సమస్త మానవ - శ్రమాను భవమున్ - సహించి వహించి - ప్రేమించగల నీ ॥సమాను॥

1. సమాన తత్వము - సహోదరత్వము = సమంజసము గాను - మాకు దెలుప నీ ॥సమాను॥
2. పరార్థమై భవ - శరీర మొసగిన = పరోపకారా - నరావ తారా॥సమాను॥
3. దయా హృదయ యీ - దురాత్ము లెల్లరిన్ = నయాన భయాన - దయాన బ్రోవ నీ ॥సమాను॥
4. ఓ పావనాత్ముడ - ఓ పుణ్య శీలుడ = పాపాత్ములను బ్రోవ - పరమాత్మ సుతనీ ॥సమాను॥

- చెట్టి భానుమూర్తి

## 95 క్రీస్తు దైవత్వము

రా - శంకరాభరణము (చాయ: దేవుడిచ్చిన దివ్య వాక్యము) తా - అట

యేసు క్రీస్తుఁడు నిత్య దేవుఁడు - ఎఱిగి నమ్ముఁడి మనుజులారా = మోస మొందక మోక్షపతికిఁక - దాసులై - బ్రతుకండి రండి ॥యేసు॥

1. ఆరు దినములలోపలనే - యాకసము భూలోకములను = ప్రాకటముగఁ జేసి నాఁడు - ప్రకాశుఁడాయన ప్రజ్ఞవంతుఁడు ॥యేసు॥
2. ఆది పురుషుని యాదిస్త్రీనిఁక - హస్తములతో నంటి చేసెను = మేదినిన్ ఫలవనములో న - సాధులై నివసింప నిచ్చెను ॥యేసు॥
3. వార లిద్దపు దేవునాజ్ఞను - కోరికలతో మీరినప్పుడు= గారడీ పిశాచ తంత్రము - వారి పరమై పాపులైరి ॥యేసు॥
4. వీరలందఱు వారి సంతతి - వేరెలేరీ ధరణిలో దు = ష్కార్యులై దేవుని యాజ్ఞలు - మీరి రందఱు నరక పాత్రులు ॥యేసు॥
5. ఇంత పాపభరితులై కా - సంతసత్యము లేని నరుల = నెంతగాఁ బ్రేమించెనో తన - సొంత ప్రాణముఁ బలిగఁబెట్టెను ॥యేసు॥
6. పాపమించుకలేని కరుణా - పావనుడు నరుఁడాయెను = శాపగ్రస్తులమైన మన - శాపములు తాఁజేతఁ బూనెను ॥యేసు॥
7. ఎన్నరాని బాధలొందుచు - పుణ్యరక్తము జిందెనిలను = ఎన్నఁడు నీలాటి ప్రేమ - వన్నెలేదో యన్నలారా ॥యేసు॥



8. మనలఁ బాపమునుండి బాపను - మనుజుఁడై మరణంబునొంది = మన ప్రభువె మూఁడవ దినంబున - మహినిలేచి పరము వెళ్లెను ॥యేసు॥

- గొల్లపల్లి నతానియేలు

## 96 యేసుక్రీస్తు దేవుడు

1. దేవుని నీతి ప్రతాపం
భువి యేసుని సిల్వ ప్రభావం
దేవుల దేవుని అపురూపం
భువి యేసుని నామ స్వరూపం
దేవ యెహోవ సువాక్యం
-సౌభాగ్యం
దైవ జనుల హృదయానందం.
॥యేసుక్రీస్తు దైవ సుతుండు
యేసుక్రీస్తు మనుజసుతుండు
యేసుక్రీస్తు దేవుండు
యేసే ప్రభువు
- స్తుతిపాత్రుడు॥

2. ఆద్యంత రహిత కీర్తి
అవతార శ్రమార్జన మూర్తి
ఆకస రాసుల ఆదిపతి
అవనీ సృజనాత్మ ప్రతీతి
అఖిల ప్రపంచ ప్రదాత - అధినేత
అనుదిన కృపాలిడు సుఖదాత.

3. పాపము భయపడు నామం
పాపాత్ముడు కృపగను హోమం
పతితుల వెదకిన ప్రేమస్వరం
పరలోక సుఖాల విహారం
పాప క్షమాపణ గానం - బహు
అనవరతము నిజబలిదానం. [మానం

4. జనముల జీవాధిపతి
జగమంతటి నేలెడిజ్యోతి
జీవుల అంతిమ న్యాయపతి
జీవాత్ములు క్రోలెడి నీతి
జనన మరణ జయశీల - నరపాల
జగతిని మార్చెడి శుభజ్వాల.

- ఏ.బి. మాసిలామణి

## 97 *All hail the power of Jesus Name*

1. శ్రీ రక్షకుని నామము
కీర్తించి కొల్వుఁడీ
కిరీట ముంచి చాటుఁడి
- శ్రీ రాజా, రాజా, రాజా,
రాజాధిరాజా!

2. పరేశుహత సైన్యమా
మీ రాజు ఈయనే
కిరీట ముంచి చాటుఁడి
- శ్రీ రాజా, రాజా, రాజా,
రాజాధిరాజా!

3. నరులారా! మీ కోసము
చావును నొందెను
కిరీట ముంచి చాటుఁడి
– శ్రీ రాజా, రాజా, రాజా,
రాజాధిరాజా!

4. సర్వ జనాంగములారా!
శరణ్యుఁ డీయనే
కిరీట ముంచి చాటుఁడి
– శ్రీ రాజా, రాజా, రాజా,
రాజాధిరాజా!

5. పరంబునందు యేసుకుఁ
కిరీట ముంచుచు
హర్షంబుతోఁ గీర్తింతుము
– శ్రీ రాజా, రాజా, రాజా,
రాజాధిరాజా!

– ఎడ్వర్డ్ సెర్రొనెట్
అను: జాన్ ఎడ్మండ్ షార్కి

## 98 *Beautiful Saviour*

1. సుందర రక్షకా!
సృష్టియొక్క నాథా
దేవమానవ పుత్రుఁడా
నిన్నుఁ బ్రేమింతున్
సదా సేవింతున్
మదాత్మతోఁ గిరీటమా.

2. మైదాన మంతయుఁ
పచ్చిక బయళ్లు
నొప్పుగఁ బూచుచున్నవి
ఐనను యేసుతో
నాయన కాంతిలో
దుఃఖములేనివారము.

3. సూర్యుని కాంతియుఁ
చంద్రుని శాంతియు
ఎంతో శ్రేష్ఠమైయున్నవి.
అట్లవి యున్న
అన్నిటి కన్న
యేసుని కాంతి గొప్పది.

4. ఆనంద రక్షకా!
ప్రజల నాథుఁడా
దేవమానవ పుత్రుఁడా
మహిమ, ఘనత
స్తుతి, యారాధన
నిరంతరంబు నీకగున్.

– ఎం.గెసాంగ్‌బుచ్
అను: పి. షూల్ట్జె



## 99 *Praise Him, Praise Him*

1. స్తుతి స్తుతి సదయుఁడైన యేసు
నూటి న్నీకుసృష్టి చెల్లించును
నీతిమంతా నిఖిల దూతలు చేరి
నీకే కీర్తి భక్తిఁజెల్లింతురు.
చేతనుంచి పిల్లల నెల్లను యేసు
మితిలేని ప్రేమను గాచును.
॥స్తుతి స్తుతి సదయుఁడైన యేసు
ఖ్యాతితో నీకెన్నఁడొనర్తుము॥

2. స్తుతి స్తుతి సదయుఁడైన యేసు
స్తోత్రముల్ మా స్వామికి
చెల్లును
ప్రీతిన్ మాకై మరణమొందుచు
(యేసు
ప్రేమఁ జూపి ప్రజలఁ బ్రోచితే
రాతి కోట వైతివి మాకు నీవు
రక్షకుండ కరుణసాగరా.

3. ఆకాశంపు గవునులారా మీరు
ఆనంద పాటలను పాడుఁడీ
ప్రాకటంబౌ ప్రవక్త గురువు రాజు
లోకాంతంబుల్ వెలుఁగ నేలును
వీఁక తోడవేగ వచ్చును యేసు
వాకంబెల్ల నదురునట్లుగాన్.

– ఫేనీ క్రాస్బీ
అను: జేకబ్ చేంబర్లేన్

## 100 *All glory, land, and honour*

1. పాపల్ హోసన్నా పాటల్
పాడిన రీతిగన్
నృపాలస్తుతి కీర్తుల్
నీకుఁ జెల్లింతుము
దావీదు పుత్రకుండా
యిశ్రాయేల్ పాలకా
దేవుని పేర వచ్చు
ధీరుండా ధన్యాత్మ.

2. దూత లాకాశమందు
దొడ్డగఁ గొల్తురు
భూతలమందు సృష్టి
పూజించును నిన్ను
హెబ్రీయుల్ ఖర్జూరంపు
శాఖల్ చేఁబూనుచు
హెచ్చించి మొక్కినట్లు
నిను స్తోత్రింతుము.

3. నీ శ్రమలకు ముందు,
నిన్ గౌరవించిరి
నీ జయమొందువెన్క
మా కీర్తన స్తుతి
అవ్వారి స్తుతుల్ నీవు
అంగీకరించితి
మా కీర్తంబుగూడ
మన్నన జేయుమీ.

– తియోడల్ఫ్ అర్లియన్స్
అను: ఆల్‌ఫ్రెడ్ త్యాగరాజు పామర్

## 101 *Awake my soul is joyful lays*

1. నా యాత్మ నీలో మేల్కొని
దయాళుని కీర్తింపుము
ప్రియంబుతో నీరక్షకున్
ప్రపూర్ణ ప్రేమబాడుము.

2. నే పాపమందుఁ గూలగన్
కాపాడి నన్ను లేపెనే
నా పాలి పుణ్యరక్షకున్
ప్రపూర్ణ ప్రేమఁ బాడుము.

3. ఏ పాటి శత్రువైనను
ఏపాట్లు పెట్టలే రిఁకన్
నాపుణ్య మార్గదర్శకున్
ప్రపూర్ణ ప్రేమఁబాడుము.

– ఎస్. మెడ్లే

## 102 *Rejoice, the Lord is King*

1. మమున్ సృజించిన
దేవుండు ప్రాణము
నొసంగి యెప్పుడు
కాపాడు మమ్మును
సంతోష స్వర మెత్తుచు
స్తుతించుచుండుఁడాయనన్.

2. పలువిధాలుగ
బాధించు రోగముల్
పోఁగొట్టి మీఁదకు
రాకుండఁ జేసెను
సంతోష స్వర మెత్తుచు
స్తుతించుచుండుఁ డాయనన్.

3. దేవుండు మాత్రమే
రక్షణ మార్గము
ఆయత్తపఱచి
చూపించె మాకును
సంతోష స్వర మెత్తుచు
స్తుతించుచుండుఁ డాయనన్.

4. మా నిత్యబాధలు
వారించుకొరకుఁ
దా సొంత పుత్రుని
పంపెన్ సుప్రేమతో
సంతోష స్వర మెత్తుచు
స్తుతించుచుండుఁ డాయనన్.

5. ఆనంద మొందుఁడి
శ్రీ యేసు మోక్షము
స్వసేవకాళికి
అనుగ్రహించును
సంతోష స్వర మెత్తుచు
స్తుతించుచుండుఁ డాయనన్.

– చార్లెస్ వెస్లీ



## 103 *Hali to the Lord's Anointed*

1. నమస్కరింప రండి
దావీదు పుత్రుని
శ్రీ యేసు రక్షకుండు
ఏతెంచె భూమికి
న్యాయంబు లోకమందు
స్థాపించి నిత్యము
అన్యాయ మంతఁ దాను
పోఁగొట్టవచ్చెను.

2. వర్షంబు పడునట్లు
శుష్కించు నేలను
దుఃఖించు వారి కెల్ల
హర్షంబు నిచ్చును
శ్రీ యేసు రాజ్యమందు
సద్భక్తులందఱు
ఖర్జూర వృక్ష రీతిన్
వర్ధిల్లుచుందురు.

3. దిగంతవాసు లైన
భూరాజు లందఱు
శ్రీ యేసు చరణంబుల్
నమస్కరింతురు
భూలోకవాసులైన
జనంబు లందఱు
క్రీస్తు స్వాధీనమందు
జీవింతు రెప్పుడు.

4. విరోధులైన వారిన్
జయింప నెన్నఁడున్
సింహాసనంబుమీఁద
ఆసీనుఁడగును
అత్యంత ప్రేమమూర్తి
శ్రీ యేసు ప్రభువు
ఆ దివ్య నామకీర్తి
వ్యాపించు నీ భువిన్.

– జేమ్సు మాంట్‌గోమరీ
అను: బర్నార్డ్ లూకాస్

# యేసు జన్మము

## 104 క్రీస్తు నరావతార సందేశము

రా – యదుకులకాంభోజి తా – ఆది

వినరే యో నరులారా – వీనుల కింపు మీర – మనల రక్షింప క్రీస్తు – మనుజావతారుఁ డయ్యె – వినరే = అనుదినమును దే – వుని తనయుని [1]పద – వనజంబులు మన – మున నిడికొనుచును ॥వినరే॥

[1]తామరపువ్వులవంటి పాదములు.

1. నరరూపుఁ బూని [1]ఘోర - నరకుల రారమ్మని - దురితముఁ బాపు దొడ్డ - దొరయౌ మరియా వరపుత్రుఁడు = [2]కర మరు దగు క - ల్వరి గిరి దరి [3]కరి - గి [4]రయంబున ప్రభు - కరుణను గనరే ॥వినరే॥

2. ఆనందమైన మోక్ష - మందరి కియ్య [5]దీక్ష - బూని తనమేని సిలువ - మ్రాను నఁణచి మృతిఁ బొందెను = దీన దయా పరుఁ - డైన మహాత్ముఁడు - జానుగ - యాగము సలిపిన తెరంగిది ॥వినరే॥

3. [6]పొందుఁ గోరిన వారి - [7]విందా పరమోపకారి - యెంద రెందరిఁ బరమా - నందపద మొందఁగఁ జేసెను = అందమునన్ దన - [8]బొంది సురక్తము - జిందెను భక్తుల - డెందము గుందఁగ ॥వినరే॥

4. ఇల మాయావాదుల మాని - యితఁడే సద్గురు డని - తలపోసి చూచి మతి ని - శ్చల భక్తిని గొలిచిన వారికి=నిల జనులకు [9]గలు-ములనలరెడు ధని-కుల కందని సుఖ - ములు మరి యొసఁగును ॥వినరే॥

5. దురితము లణఁప వచ్చి - మరణమై తిరిగి లేచి - నిరత మోక్షానంద సుం-దర మందిరమున కరుదుగఁ [10]జనె = [11]బిరబిర మన మం - దర మా కరుణా - [12]శరనిధి [13]చరణ మె - శరణని పోదము ॥వినరే॥

- పురుషోత్తమ చౌధరి

## 105 గొల్లల గానము

రా - ఆనందభైరవి తా - త్రిపుట

రారె గొల్లవారలారా - నేటి - రాత్రి బేత్లెహేము నూర = జేరి మోక్షదూత - కోరి దెల్పెను క్రీస్తు - వారి జాడకన్ను - లారా జూతము వేగ ॥రారె॥

1. పుట్టు చావులు లేనివాడఁట - పసుల తొట్టిలోపలఁ బుట్టెనేడఁట = ఎట్టి వారలను జే - పట్టి పాపము లూడఁ - గొట్టి మోక్షపుత్రోవఁ - బెట్టు వాడట వేగ ॥రారె॥

2. బహుకాలమాయెను వింటిమి - నేడు - మహికివచ్చుట కనుగొంటిమి = విహితముతోడ - సేవించి వత్తము మోక్ష - మహితుని [14]గని దుఃఖ - రహితులమవుదము. ॥రారె॥

[1]భయంకరులగు. [2]మిక్కిలి ఆశ్చర్యకరమైన. [3]వెళ్లి. [4]త్వరగ. [5]శ్రద్ధతో. [6] సహవాసము. [7]బంధువు. [8]శరీరము యొక్క. [9]సంపదలతో నొప్పుచున్న. [10]వెళ్లెను. [11]త్వరగ. [12]సముద్రము. [13]పాపమే. [14]మోక్షమందు పూజ్యుని.



## 106 దూత మరియను దర్శించుట

రా - ఆనందభైరవి తా - త్రిపుట

వచ్చిగాబ్రియేలు పల్కెను - మరియ - [1]మచ్చుకంటిడెంద [2]ముల్కెను = హెచ్చైన శుభముల - [3]నెనలేని కృప దేవుఁ డిచ్చి [4]యింతులలోని - న్నెచ్చు జేయునటంచు ॥వచ్చి॥

1. భయ మాత్మలో వీడు కన్యకా - నీవు - దయబొంది యున్నావు ధన్యగా = [5]రయముగ నిదిగోగ - ర్భముఁ దాల్చెదవు [6]పుత్రో - దయమౌ యేసను పేర - తని కిడు మంచును ॥వచ్చి॥

2. అతఁడెన్నఁబడును మహాత్ముడై - సర్వో - న్నతుఁడైన దైవకుమారుఁడై = హిత మొప్పు దేవుండు - న్నతిఁ జేసి దావీదు - [7]వితత సింహాసన - మతని కిచ్చునంచు ॥వచ్చి॥

3. ఘనతరుఁడగు వాని రాజ్యము - అంత - మొనగూడ దది నిత్యపూజ్యము = [8]వనితమగు యాకోబు - వంశ మెల్లపు డేలు - కొను నాతఁ డనుంచుఁ దె - ల్పెను దూత మరియతో ॥వచ్చి॥

- పురుషోత్తమ చౌదరి

## 107 'నేడు రక్షకుడు మీకు పుట్టియున్నాడు'

రా - సురటి తా - త్రిపుట

ఉదయించినాఁడు - క్రీస్తుఁడు నేఁడు - ఉదయించినాఁడు = విదితయౌ మరియ [9]నందనుఁడై యిమ్మానుయేల్ = [10]సదయుఁడై చెడియున్న [11]పృథివికి - [12]నొదవ [13]సమ్మద మల పిశాచికి - [14]మద మణంగను సాధు జనముల - హృదయముల [15]ముద మెదుగునట్లుగ ॥నుదయించి॥

1. ఏ [16]విభునివలన - నీ జగ మయ్యె - నా విభుఁ డీయిలను = దైవత్వమగు మను - ష్యావతారముఁ దాల్చె = జీవులకు జీవనముపై తగ - దేవుఁడును దా

[1]స్త్రీ. [2]ఉలికిపడెను. [3]సాటిలేని. [4]స్త్రీలలో. [5]శీఘ్రముగ. [6]కుమారుఁడు పుట్టెను. [7]వెడల్పైన. [8]స్తుతింపబడదగినది. [9]కుమారుఁడు [10]కృపగలవాఁడు. [11]భూమి. [12]కలుగునట్లు. [13]సంతోషము [14]గర్వము అణగులాగున. [15]సంతోషము పెరుగునట్లు. [16]ప్రభుని.

నొక్కఁడు చిర–జీవియగు ప్రభు పాపి జీవులఁ – గావఁ దనుఁ జావునకు నొడఁబడి ॥యుదయించి॥

2. యూదుల నడుమన్ – బెక్కగు భేదా – భేదముల్ బొడమన్ = వాదించి ప్రభు రాకఁ – గాదంచు మది నెంచి = మీదుఁ జూడని వారి కారుండ వారుండై స్వీయ జనులకు మెదమగు రొత్తంగ [1]మద్ధనుఁ – డౌ దయాళుఁడు ప్రాణ మిదుటకు ॥నుదయించి॥

– పురుషోత్తమ చౌదరి

## 108 బాలయేసునకు స్వాగతము

రా – కమాసు తా – త్రిపుట

కొనియాడఁ దరమె నిన్ను – కోమల హృదయ – కొనియాడఁ దరమె నిన్ను = తనరారు దినకరుఁ – బెనుతారలను మించు – ఘనతేజమున నొప్పు – కాంతిమంతుఁడ వీవు ॥కొనియాడ॥

1. ఖెరుబులు సెరుపులు – మరి దూతగణములు = నురుతరంబుగఁ గొలువ – నొప్పు శ్రేష్ఠుఁడ వీవు ॥కొనియాడ॥

2. సర్వలోకంబులఁ – బర్వు దేవుఁడ వయ్యు = నుర్వి స్త్రీ గర్భాన – నుద్భవించితి వీవు ॥కొనియాడ॥

3. విశ్వమంతయు నేలు – వీరాసనుఁడ వయ్యుఁ = పశ్వాళితోఁ దొట్టిఁ – పండియుంటివి నీవు ॥కొనియాడ॥

4. దోసంబులను మడియు – దాసాళిఁ గరుణించి = యేసు పేరున జగతి కేగుదెంచితి నీవు ॥కొనియాడ॥

5. నరులయందునఁ గరుణ – ధర సమాధానంబు = చిరకాలమును మహిమ పరఁగఁ జేయుదు వీవు ॥కొనయాడ॥

6. ఓ యేసు పొన్పుగ – నా యాత్మఁ జేకొని = శ్రేయముగ బవళించు శ్రీకర వరసుత ॥కొనియాడ॥

– వంతగాని పరదేశి

[1]నా.



## 109 కరుణగల రక్షకుడు

రా – బిలహరి తా – త్రిపుట

చింత లేదిఁక యేసు పుట్టెను – వింతగను బేత్లెహేమందునఁ = చెంత జేరను రండి సర్వజనాంగమా – సంతస మొందుమా ॥చింత॥

1. దూత తెల్పెను గొల్లలకు శుభ – వార్త నా దివసంబు వింతగా – ఖ్యాతి మీరఁగ వారు యేసును గాంచిరి – స్తుతు లొనరించిరి ॥చింత॥

2. చుక్కఁ గనుగొని జ్ఞాను లెంతో – మక్కువతో నా ప్రభుని గను గొన = చక్కఁగా బెత్లెముపురమున జొచ్చిరి – కానుక లిచ్చిరి ॥చింత॥

3. కన్యగర్భమునందుఁ బుట్టెను – కరుణగల రక్షకుఁడు క్రీస్తుఁడు = ధన్యులగుటకు రండి వేగమె దీనులై – సర్వమాన్యులై ॥చింత॥

4. పాప మెల్లను పరిహరింపను – పరమ రక్షకుఁ డవతరించెను = దాపుఁ జేరిన వారి కిదుఁ గదు భాగ్యము – మోక్షభాగ్యము ॥చింత॥

– ఎన్.డి. ఏబెల్

## 110 యేసు జన్మము

రా – హరికాంభోజి తా – త్రిపుట

పుట్టె యేసుఁడు నేఁడు – మనకు – పుణ్యమార్గము జూపను = పట్టి యయ్యెఁ బరమ గురుఁడు – ప్రాయశ్చిత్తుఁడు యేసుడు ॥పుట్టె॥

1. ధరఁ బిశాచిని వేఁడిన – దు – ర్నరులఁ బ్రోచుటకై యా = పరమవాసి పాపహరుఁడు – వరభక్త జన పోషుఁడు ॥పుట్టె॥

2. యూద దేశములోను – బేత్లె – హేమను గ్రామమున = నాదరింప నుద్భవించె – నధములమైన మనలఁ ॥బుట్టె॥

3. తూర్పు జ్ఞానులు కొందఱు – పూర్వ – దిక్కు చుక్కను గాంచి = సర్వోన్నతుని మరియు కొమరుని – కర్పణము లిచ్చిరి ॥పుట్టె॥

– ఫేలిక్స్‌ఆంధ్రు

## 111 మెస్సీయా జన్మము

రా – ఆనందభైరవి (చాయ: వచ్చి గా[బ్రియేలు పల్కెను) తా – త్రిపుట

[1]ఱేఁడు మెస్సీయ జన్మించెను – శ్రీదా – వీదు పురమున నుద్భవించెను = వేడుకతోడను – బాడుఁడి పాటలు = రూఢిగ సాతాను – కాడిని దొలఁగింప ॥ఱేఁడు॥

1. మనకొఱకై శిశువు పుట్టెను – అతఁడు – మన దోషములను బోగొట్టెను = అనయంబు నతనిమీఁ – దను రాజ్యపు భార – ము నుంచఁబడె విమో – చనకర్త యితఁ డౌను ॥ఱేఁడు॥
2. పరలోక సైన్యంబు గూడెను – మన – వర శిశువును గూర్చి పాడెను = నరులయందున గరుణ – ధర సమాధానంబు – చిర దేవునికి బహు – మహిమ యటంచును ॥ఱేఁడు॥
3. కొమ్మ యెష్షయినుండి పుట్టెను – చిగురు – క్రమ్మర మొద్దున బుట్టెను = కమ్మెను దేవుని యా – త్మమ్మును తెలివి జ్ఞా – న మ్మాలోచన మహ – త్వ మ్మొక్కుమ్మడినాతని ॥ఱేఁడు॥
4. సర్వశక్తి గల దేవుఁడు – మరియు – నుర్వియందు దయాస్వభావుఁడు = సర్వమహిమము గల్గు – స్వర్గ లోకము వదలి – గర్వముతో నిండిన – సర్వంసహా [2]స్థలిపై ॥ఱేఁడు॥
5. వింతైన వాఁడుగ నుండెను – కోరినంత సుందరత లేకుండెను = చింతతోడను మాయా – సంగతులగు వారి – యంతములేనట్టి – యాపదను వీక్షించి ॥ఱేఁడు॥
6. చెదరిన గొఱ్ఱెల వెదకును – వాని – ముదమున మందలోఁ జేర్చును = సదయత యేసుండు – జనితైక సుతుఁడు [3]భా – స్వదధిక విభుఁడాలో చన కర్త జన్మించె ॥ఱేఁడు॥
7. అక్షయుండగు యేసు వచ్చెను – మన – రక్షణమ్మును సిద్ధపర్చెను = మోక్షముఁ సరుణా క – టాక్షముతో నియ్య – నీక్షితియందున – హెబ్రీ వంశమునందు ॥ఱేఁడు॥

– ఎస్. జేమ్సు

---

[1]రాజు. [2]భూమి. [3]ప్రకాశించు.



## 112 రక్షకుని జననము

రా – మధ్యమావతి తా – అట

రక్షకుండుదయించినాఁడఁట – మనకొరకుఁబరమ – రక్షకుం డుదయించి నాఁడఁట = రక్షకుం డుదయించినాఁడు – రారె గొల్లబోయలార – తక్షణమునఁ బోయి మన ని – రీక్షణ ఫల మొందుదము ॥రక్షకుండు॥

1. దావీదు వంశమందు ధన్యుడు జన్మించినాఁడు = దేవుఁడగు యెహోవా మన – దిక్కుఁ దేరి చూచినాఁడు ॥రక్షకుండు॥
2. గగనమునుండి డిగ్గి – ఘనుఁడు గబ్రియేలు దూత = తగినట్టు చెప్పె వారికి – మిగుల సంతోషవార్త ॥రక్షకుండు॥
3. వర్తమానము జెప్పి దూత – వైభవమున పోవుచున్నాఁడు = కర్తను జూచిన వెనుక – కాంతుము విశ్రమం బప్పుడు ॥రక్షకుండు॥
4. పశువుల తొట్టిలోన – భాసిల్లు వస్త్రములజుట్టి = శిశువును గనుగొందురని – శీఘ్రముగను దూత తెల్పె ॥రక్షకుండు॥
5. అనుచు గొల్ల లొకరి కొక – రానవాలు జెప్పుకొనుచు = అనుమతించి కడకుఁ క్రీస్తు – నందరికినీ దెల్పినారు ॥రక్షకుండు॥

– మోచర్ల రాఘవయ్య

## 113 క్రీస్తు జన్మదినోత్సవము

రా – శంకరాభరణము తా – ఆది

సంతోషించుఁడి – యందరు నాతో – సంతోషించుఁడి – యొక = వింతయగు కీర్తనఁ బాడ వచ్చితిని – సంతోషించుఁడి – నాతో ॥సంతో॥

1. అంధకార మయమైన భూమి నా – ద్యంతము వెలిఁగింప – దాని యా – వేశముఁ దొలఁగింప = వందితుండు క్రీస్తేసు నాథుఁడు – వచ్చెఁ బ్రకాశుండై – భూమికి – నిచ్చె ప్రకాశంబు ॥సంతో॥
2. కాన నంధకారంబు దొలఁగఁ ప్ర – కాశించెను లెండు – మీరు ప్ర – కాశింపను రండు = మానవులను సంతోషపర్చనై – మహిని నవతరించె – భక్తుల – మనము సంతసించె ॥సంతో॥

3. మిన్ను నుండి సంతోషోదయము – మిగుల ప్రకాశించె – హృదయములం – దగులం ప్రకాశించె = మున్ను జేయఁబడిన వాగ్ధత్తము – తిన్నగ నెరవేరె భక్తుల – కన్ను లాస దీరె ॥సంతో॥

4. ప్రీతియైన నీ పండుగ గూర్చి – నూతన కీర్తనను – గలసికొని – నాతోం పాడుచును = నీ తరి దూరస్థుల కీ వార్తను – నే తీరును నైనం – దెలుపంగ – నాతురపడవలెను ॥సంతో॥

5. పాపులపై దేవునికిం గలిగిన – ప్రబలమైన దయను – లోకమునం – జూపింపం గవలెను = జూపకపోయిన లోపము మనపై – మోపంబడును నిజము – వేగము – జూపుద మా పథము ॥సంతో॥

– బేతాళ జాన్

## 114 జ్ఞానులు క్రీస్తును ఆరాధించుట

రా – శంకరాభరణము తా – ఆది

జ్ఞాను లారాధించిరి – యేసు ప్రభునిం – బూని పాపులం బ్రోవ మెనిం దాల్చిన తరి ॥జ్ఞాను॥

1. చాల కాలము నుండి – మేలు వార్త నాసక్తి – నాలకించి నక్షత్ర – కాల చిహ్నముం గూడి = మేలు మేలని – మ – మ్మేలు వాఁడని – మంచి – బోళము సాంబ్రాణి వేసి ॥జ్ఞాను॥

2. దూర మనక యాత్ర – భార మనక బయలు – దేరి సంతోషముతోం – జేరి మేలిమి బం = గార మిచ్చిరి – మన – సార మెచ్చిరి జో – హారు జోహారటంచు ॥జ్ఞాను॥

3. ఈ దివసంబున – బేత్లెహేమను నూర – యూదుల రాజుగాం – బాదుకొన్నయేసు = నాథ స్వామిని – స – మ్మోద మిమ్మని – య – య్యూదజనుల మధ్య ॥జ్ఞాను॥

4. ఈ సమయము మన – మా సమయంబుగం – జేసి స్తుతింపను – జేరితి మిచ్చోట = భాసురంబగు – శ్రీ – యేసు నాథుని – హృద – యాసనంబునం జేర్చి ॥జ్ఞాను॥

– బేతాళ జాన్



## 115 బాల యేసుకు గీతాంజలి

రా – భైరవి (చాయ: సందియము వీడవె) తా – త్రిపుట

గీతములు పాడుఁడీ – యేసునికి సం – గీతములు పాడుఁడీ = పాతకుల మగు మనల దారుణ – పాతకము తన విమలరక్త – స్నాతులనుగాం జేసి పాపను – భాతకులలో నవతరించెను ॥గీతములు॥

1. రాజులకు రాజుగా – నేలుచు మోక్ష – రాజ్యమున కర్తగా = బూజలందుచు దూత పరిగణ – పూజితుండౌ ఘనుఁడు తన దగు – తేజ మెల్లను విడిచి యీయిలం – దేజహీనులలోనం బుట్టెను ॥గీతము॥

2. దాసులగు వారలన్ – దమ పటు దోష – త్రాస విముక్తులన్ = జేసి వారల నెల్ల మోక్ష ని – వాసులుగం జేయంగ రక్తముం – బోసి కృపచేంగావ వచ్చెను – యేసు నాథుఁడు దీన వృత్తిని ॥గీతములు॥

3. మానవుల కెల్లను – దేవుని ప్రేమ – మానుగాం జూపను = ప్రానిపై దన రక్త మొసంగఁగ – మానవుండై పుట్టె యూదుల – లోన యేసను పేరుచేఁదా – దీనుఁడై యిమ్మానుయేలు ॥గీతములు॥

4. ఆదిం దన వాక్యము – నందున యేసు – మోదమున్ నిట్లనెన – మేదినిందా మనుజుఁడై యిఁక – సాదరమ్మునం బ్రోవ మనుజుల – నా దయాళుఁడు తనదు దేహము – సాధుగా నర్పింతు ననుచును ॥గీతములు॥

– మురారి దావీదు

## 116 రారాజు జన్మదినము

రా – హిందుస్థాని తోడి తా – ఆది

రారె చూతము – రాజసుతుడీ – రేయి జనన మాయెను = రాజులకు రా – రాజు మెస్సియ – రాజితంబగు తేజమదిగో ॥రారె॥

1. దూత గణములన్ – దేరి చూడరే – దైవ వాక్కులన్ – దెల్పగా = దేవుడే మన – దీనరూపున – ధరణి కరిగెనీ – దినమున ॥రారె॥

2. కల్లగాదిది – కలయు గాదిది – గొల్ల బోయల – దర్శనం = తెల్లగానదె – తేజరిల్లెడి – తారగాంచరె – త్వరగ రారే ॥రారె॥

3. బాలు డదుగో – వేల సూర్యుల – బోలు సద్గుణ – శీలుడు = బాల బాలికా – బాలవృద్ధుల నేల గల్గిన – నాథుడు ॥రారె॥

4. యూద వంశము – ను ద్ధరింప దా – వీదుపురమున – నుద్భవించె = సదమలంబగు – మదిని గొల్చిన – సర్వ జనులకు సార్వభౌముడు ॥రారె॥

– చెట్టి భానుమూర్తి

## 117 క్రిస్మసు వర్తమానము

రా – రేగుప్తి తా – ఏక

యేసునాధుని యోధులందరు వాసిగ నిటరండు – వేగమె – వాసిగ నిటరండు = భాసురముగ ప్రభు జన్మము బాడుచు – నాసతోడ రండు – వేగమె – యాసతోడ రండు ॥జే జయం॥

1. దూతలమాదిరి గాత్రము లెత్తుచు – గీతము బాడుండి – వేగమె – గీతము బాడుండి = దాతయౌ మన క్రీస్తుని నీతిని – ఖ్యాతిగ బలుకుండి – వేగమె ఖ్యాతిగ బలుకుండి ॥జే జయం॥

2. గొల్లలు ప్రభు కడకేగిన రీతిని – నెల్లరు నడువుండి – వేగమె – యెల్లరు నడువుండి = ఉల్లములందున సంతసించి ప్రభు – నెల్లెడ దెలుపుండి – వేగమె – యెల్లడ దెలుపుండి ॥జే జయం॥

3. జ్ఞానుల భంగిని మానవులందరు – కానుక లియ్యుండి – వేగమె – కానుక లియ్యుండి = మానవకోటికి రక్షణ భాగ్యము – దానము బొందుండి – వేగమె – దానము బొందుండి ॥జే జయం॥

4. మరియ రీతిగను మనసు లోపలను – మురియుచు నుండుండి – వేగమె కానుక లియ్యుండి = మానవకోటికి రక్షణ భాగ్యము – దానము బొందుండి – వేగమె – దానము బొందుండి ॥జే జయం॥

5. జయజయ శబ్దము జేయుచు ప్రభునకు – జయమని పాడుండి వేగమె – జయమని పాడుండి = జయజయ మంచును – జయ శబ్ధముతో జయముల నొందుండి – వేగమె – జయముల నొందుండి ॥జే జయం॥

– మత్తయి నమూయేలు



## 118 బాలయేసు దర్శనము

రా – జంఝూటి తా – ఆది

మేము వెళ్లిచూచినాము – స్వామి యేసుక్రీస్తును = ప్రేమ మ్రొక్కి వచ్చినాము – మా మనంబులలరగ ॥మేము॥

1. బేదలేము పురములోన – బీద కన్యమరియకుఁ = బేదగా సురూపుఁ దాల్చి – వెలసెఁ బశులపాకలో ॥మేము॥

2. జ్ఞానులమని గర్వపడక – దీనులమై నిత్యము = వాని ప్రేమ సకల ప్రజకు – మానక ప్రకటింతము ॥మేము॥

3. తద్దరిశనమందు మాకుఁ – బెద్ద మేలు గలిగెగా = హద్దులేని పాపమంత – రద్దుపరచబడెనుగా ॥మేము॥

4. మరణమెపుడొ రేపొమాపొ – మరియెపుడో మన మెరుగము = త్వరగా పోయి పరమగురుని – దరిశనంబుఁ జేతము ॥మేము॥

5. పరిశుద్ధాత్మ జన్మ మాకు – వరముగా నొసంగెను = పరమపురము మాకు హక్కు – పంచెదాను నిరతము ॥మేము॥

6. మాకు సర్వగర్వమణిగి – మంచి మార్గమబ్బెను = మాకు నీ సువార్తఁ జెప్ప మక్కువెంతోఁ గలిగెను ॥మేము॥

## 119 యేసు లోకమునకు వెలుగు

రా – ముఖారి తా – ఆది

లోకమంతట వెలుగు ప్రకాశించెను – యేసు జన్మించినపుడు = ఆకాశమునందు గొప్ప నక్షత్రంబు బుట్టినపుడు – లోకజ్ఞానులు గొల్లలు వెళ్లి లోక రక్షకుదేసుకు మ్రొక్కిరి ॥లో॥

1. నేను వెలుగై చీకటిలో వెలుగుచున్నాను – చీకటి దాని గ్రహింప లేదు = నేను లోకమునకు వెలుగై యున్నాను నను వెంబడించు – వాడు చీకటిలో నడువక జీవపువెలుగై యుండుడనె యేసు ॥లో॥

2. ఆ పట్టణములో వెలుగుటకు సూర్యుడైనను – చంద్రుడైన నక్కరలేదు = ఆ పట్టణములో దేవుని మహిమయే – ప్రకాశించుచున్నది యెపుడు – ఆ పట్టణమునకు దేవుని గొఱ్ఱెపిల్లయే దీపమై వెలుగుచుండు ॥లో॥

3. మీరు లోకమునకు వెలుగై యున్నారు గనుక – మీరు వెలుగు సంబంధులు = మీరు కొండపైన కట్టబడిన పట్టణంబువలెనే – మరుగై యుండక నరులందరికి – వెలుగై యుందురనె యేసుండు ॥లో॥

4. చీకటిలో నడుచుజనులు గొప్ప వెలుగును – చూచిరి ధన్యులై = లోక మందు మరణచ్ఛాయగల దేశనివాసుల మీద – ప్రకాశించెను గొప్ప వెలుగు ప్రభువు యేసుకు జేయని పాడరే ॥లో॥

– ఆర్. దేవదాసు

## 120 రక్షకుని రాక

రా – యదుకుల కాంభోజి తా – ఆది

చూడరే మాతేఁడు – పుట్టి – నాఁడు బెత్లెహేములో = నేఁడీ భూమి వాసులకు – నిండు రక్షణబ్బెను ॥చూడరే॥

1. ఎన్నరాని దేవ దీప్తి – మున్ను మిన్ను గ్రమ్మెను = పన్నుగా రేయెండ కాంతి – కన్ననది మించెను ॥చూడరే॥

2. దూత తెల్పె వ్రేల కొక – ప్రీతియగు ముచ్చటన్– ఖ్యాతిగ దావీదు పురిని – కర్తయేసు పుట్టుటన్ ॥చూడరే॥

3. తూరుపున జ్ఞానులొక్క – తార దివిని గాంచిరి = వారు వీరు వచ్చి సేవ – వరుసగాను జేసిరి ॥చూడరే॥

4. మక్కువతో మనమెల్ల – మ్రొక్కి సేవఁ జేతము = మిక్కుటముగ మనకు శాంతిఁ – గ్రక్కున నొసంగును ॥చూడరే॥

– జాన్ చౌధరి

## 121 యేసుని జననము

రా – ముఖారి తా – అట

శ్రీ యేసుండు జన్మించె రేయిలో – నేఁడు – పాయక బెత్లెహేమ యూరిలో ॥శ్రీ యేసుండు॥

1. కన్నియ మరియమ్మ గర్భమందున – ని – మ్మాను యేలనెడి నామమందున ॥శ్రీ యేసుండు॥



2. సత్ర మందునఁ బశువుల సాలయందున – దేవ – పుత్రుండు మనుజుం డాయెనందున ॥శ్రీ యేసుండు॥

3. పట్టి పొత్తిగుడ్డలతోఁ జుట్టఁబడి – పసుల – తొట్టిలోఁ బరుండబెట్టఁబడి ॥శ్రీ యేసుండు॥

4. గొల్లలెల్లరు మిగుల భీతిల్లఁగ – దెల్పె – గొప్ప వార్త దూత చల్లఁగ ॥శ్రీ యేసుండు॥

5. మన కొఱకొక్క శిశువు పుట్టెను – ధరను – మన దోషములఁ బోఁగొట్టను ॥శ్రీ యేసుండు॥

6. పరలోకపు సైన్యంబుఁ గూడెను – మింట – వర రక్షకుని గూర్చి పాడెను ॥శ్రీ యేసుండు॥

7. అక్షయుండగు యేసు వచ్చెను – మనకు – రక్షణంబు సిద్ధపర్చెను ॥శ్రీ యేసుండు॥

– కొమ్ము కృప

## 122 క్రీస్తుని మహిమ

రా – మధ్యమావతి తా – అట

లాలిలాలి లాలి లాలమ్మ లాలీ – లాలియని పాడరే – బాలయేసునకు ॥లాలి॥

1. పరలోక దేవుని తనయుఁడో యమ్మా = పుడమిపై బాలుఁడుగఁ – బుట్టెనో యమ్మా ॥లాలి॥

2. ఇహ పరాదుల కర్త యీతఁడో యమ్మ = మహి పాలనముఁ జేయు – మహితుఁడో యమ్మా ॥లాలి॥

3. ఆద్యంతములు లేని దేవుఁడో యమ్మా = ఆదాము దోషమున – కడ్డు పడె నమ్మా ॥లాలి॥

4. యూదులకు రాజుగాఁబుట్టెనో యమ్మా = యూదు లాతని తోడ – వాదించి రమ్మా ॥లాలి॥

5. నరగొఱ్ఱెల మంద కాపరో యమ్మా = గొఱియల ప్రాణంబు క్రీస్తు తానమ్మా ॥లాలి॥

– తిరుకోవళ్లూరి స్టీవెన్

## 123 జెకర్యా పాట

రా - బ్యాగు తా - ఆది

ఇశ్రాయేలీయుల దేవుండే - యెంతో స్తుతి నొందును గాక = యాశ్రితువౌ తన జనులకు దర్శన - మాత్మ విమోచన కలిగించె ॥నిశ్రా॥

1. తన దాసుఁడు దావీదు గృహంబున - ఘన రక్షణ శృంగము నిచ్చె = మన శత్రువు లగు ద్వేషులనుండియు - మనలన్ బాపి రక్షణ నిచ్చె ॥నిశ్రా॥
2. దీనిని గూర్చి ప్రవక్తల నోట - దేవుఁడు పలికించెను దొల్లి = మానవ మన పితరులఁ గరుణింపఁగ - మహిలోన నిబంధనఁ జేసె ॥నిశ్రా॥
3. జనకుం దగు నబ్రాహాముతోఁ - జేసిన యా ప్రమాణముఁ దలఁచి = మనము విరోధులనుండి విమోచన - గని నిర్భయులమై మెలఁగ ॥నిశ్రా॥
4. ఆయన సన్నిధానమునందు - నతి శుద్ధిగ నీతిగ నుండఁ = పాయక తన సేవను నిత్యంబును - జేయఁగ నీ రక్షణ నిచ్చె ॥నిశ్రా॥
5. ధర నో శిశువా దేవుని దీర్ఘ - దర్శి వనెడు పేరొందెదవు = పరమేశ్వరుని వాత్సల్యతతోఁ - పాపవిముక్తిఁ బ్రజ లొంద ॥నిశ్రా॥
6. మానుగ రక్షణ జ్ఞాన మొసంగఁగ - మార్గము సిద్ధపరచుటకై - దీన మనస్సుతోఁ బ్రభునకు ముందు - గా నడిచెదవు భయభక్తి ॥నిశ్రా॥
7. మరియును సమాధాన సరణిలో - మన మిఁక నడువఁ జీఁకటిలో = మరణచ్ఛాయలో నుండిన వారికి - నరుణోదయ దర్శన మిచ్చె ॥నిశ్రా॥
8. జనక పుత్రాత్మ దేవుని కిలలో - ఘనత మహిమ కల్గును గాక = ముని పిపు డెప్పుడు తనరి నట్లు యుగ - ములకును దనరారునుగా కామేన్ ॥నిశ్రా॥

- మల్లెల దావీదు

## 124 కన్య మరియ పాట

రా - హిందుస్థాని తోడి తా - ఆది

నాదు ప్రాణము ప్రభుని మిగుల ఘ - నంబు చేయుచున్నది = నాదు నాత్మ దేవునం దా - నం మొందెను నిరతము ॥నాదు॥



1. దేవుఁడు తన భృత్యురాలి - దీనస్థితి లక్షించెను = ఈ వసుంధరఁ దరము లన్నిఁక - నెన్ను నను శుభవతి యని ॥నాదు॥
2. సర్వ శక్తుఁడు మహాకృత్యము - సంభవింపఁ జేసెను = ఉర్విలో నా ప్రభుని నామం - బోప్పు బరిశుద్ధంబుగా ॥నాదు॥
3. భయము భక్తియుఁ గల్గి దేవుని - భజనఁ జేసెడి వారికి = నయముగాఁ దన కృప నొసంగు న - నయమును దరతరములు ॥నాదు॥
4. విదిత బాహువు చేత శౌర్యము - విభుఁడు కనపర్చెను = హృదయపుఁ దలఁపులను గర్వులఁ - జెదరఁ గొట్టెను నిజముగ ॥నాదు॥
5. ఆసనాసీనులై యున్న - యతిశయాత్ములన్ బడఁ = ద్రోసి దేవుఁడు దీనులను సిం - హాసనంబుల నునిచెను ॥నాదు॥
6. క్షుధితులను దన మధురములచేఁ - గోరి తృప్తి పర్చెను = అధిక ధనవంతులను రిక్త - హస్తములతో ననిపెను ॥నాదు॥
7. ఆది పితరులైన యబ్రా - హాము కతని సంతున = కద్వితీయుఁ డాదిలోక - నాన తిచ్చినట్లుగా ॥నాదు॥
8. నిరతమును దన కరుణఁ జూప = నిజముగా మది నెంచెను = వరదుఁ డిశ్రాయేలునకుఁ దన - వర సహాయ మొనర్చెను ॥నాదు॥
9. పరమ తండ్రికి దైవ సుతునకు - పావనాత్మకు నిఁక నిహ = పరము లందును యుగయుగంబులఁ - బరఁగు మహిమ మామేన్ ॥నాదు॥

- భవవాసి నమూయేలు

## 125 సుమెయోను పాట

రా - శంకరాభరణము (చాయ: నాకాలగతు లెవ్వి) తా - త్రిపుట

నీ సమాధానము - దాసుని కిప్పుడు - నాథా దేవా = యిచ్చి - నీ మాటచొప్పున - పోనిచ్చుచున్నావు - నాథా దేవా ॥నీ సమాధానము॥

1. అన్యులకు నిన్ను - బయలు పరచెడి - వెలుగుఁగాను = నీకు - నణఁగు ప్రజలైన - యిశ్రాయేల్ వారికి - మహిమ గాను ॥నీ సమాధానము॥

2. నరులకై నీవు ఏ – ర్పరచిన రక్షణన్ – నాథా దేవా – యిదిగో – నాకనులు
చూచి యా – నందించుచున్నవి – నాథా దేవా ॥నీ సమాధానము॥
3. తండ్రికి సుతునికిఁ బరిశుద్ధాత్మకును – గలుగుగాక = మహిమ – తరుగక
సదాకాలము – యుగయుగములకును – గలుగు నామేన్ ॥నీ సమాధానము॥

– నమూయేలు పాక్యవాధము

## 126 *O come all ye faithful*

1. ఓ సద్భక్తులారా !
లోకరక్షకుండు
బెత్లెహేమందు నేఁడు జన్మించెన్
రాజాధిరాజు
ప్రభువైన యేసు
నమస్కరింప రండి
నమస్కరింప రండి.
నమస్కరింప రండి యుత్సాహముతో.
2. సర్వేశ్వరుండు
నరరూప మెత్తి
కన్యకుఁ బుట్టి నేఁడు వేంచేసెన్
మానవ జన్మ
మెత్తిన శ్రీ యేసూ
నీకు నమస్కరించి
నీకు నమస్కరించి
నీకు నమస్కరించి పూజింతుము.
3. ఓ దూతలారా!
ఉత్సహించి పాడి
రక్షకుండైన యేసున్ నుతించుఁడి
పరాత్పరుండా
నీకు స్తోత్ర మంచు
నమస్కరింప రండి
నమస్కరింప రండి
నమస్కరింపరండి యుత్సాహముతో
4. యేసూ! ధ్యానించి
నీ పవిత్ర జన్మ
మీ వేళ స్తోత్రము నర్పింతుము
అనాది వాక్య
మాయె నరరూపు
నమస్కరింప రండి
నమస్కరింప రండి
నమస్కరింప రండి యుత్సాహముతో

– ఫ్రెడెరిక్ ఓకెలీ

అను : బర్నార్డ్ లూకాస్

## 127 *Hark! the herald Angles sing*

1. దూత పాట పాడుఁడీ
రక్షకున్ స్తుతించుఁడీ
ఆ ప్రభుండు పుట్టెను
బెత్లెహేము నందునన్
భూజనంబు కెల్లను
సౌఖ్యసంభ్ర మాయెను
ఆకసంబునందున
మ్రోగు పాట చాటుఁడీ
దూత పాట పపాడుఁడీ
రక్షకున్ స్తుతించుఁడీ.



2. ఊర్ధ్వలోకమందునఁ
గొల్వఁగాను శుద్ధులు
అంత్యకాలమందున
కన్యగర్భమందున
బుట్టినట్టి రక్షకా
ఓ యిమ్మానుయేల్ ప్రభో
ఓ నరావతారుఁడా
నిన్ను నెన్న శక్యమా?
దూత పాట పాడుఁడీ
రక్షకున్ స్తుతించుఁడీ
3. దావె నీతి సూర్యుఁడా
రావె దేవపుత్రుఁడా
నీదు రాకవల్లను
లోక సౌఖ్య మాయెను
భూనివాసు లందఱు
మృత్యుభీతి గెల్తురు
నిన్ను నమ్మువారికి
ఆత్మశుద్ధి కల్గును
దూత పాట పాడుఁడీ
రక్షకున్ స్తుతించుఁడీ

– చార్లెస్ వెస్లీ

అను : జే. ఈ. ఫాడ్ ఫీల్డ్

## 128 *Silent night, Holy night*

1. శుద్ధరాత్రి! సద్దణంగ
నందఱు నిద్రపోవ
శుద్ధ దంపతుల్ మేల్కొనఁగాఁ
బరిశుద్ధుఁడౌ బాలకుఁడా!
దివ్య నిద్ర పొమ్మా
దివ్య నిద్ర పొమ్మా.
2. శుద్ధరాత్రి! సద్దణంగ
దూతల హల్లెలూయ
గొల్లవాండ్రకుఁ దెలిపెను
ఎందు కిట్టులు పాడెదరు?
క్రీస్తు జన్మించెను.
క్రీస్తు జన్మించెను.
3. శుద్ధరాత్రి! సద్దణంగ
దేవుని కొమరుఁడ!
నీ ముఖంబున ప్రేమ లొల్కు
నేఁడు రక్షణ మాకు వచ్చె
నీవు పుట్టుటచే
నీవు పుట్టుటచే.

– బోసెఫ్ మోర్

## 129 *It came upon the midnight clear*

1. శ్రీ రక్షకుండు పుట్టఁగా
నాకాశ సైన్యము
ఇహంబున కేతెంచుచు
ఈ పాట పాడెను.
'పరంబునందు స్వామికి
మహా ప్రభావము
ఇహంబునందు శాంతిని
వ్యాపింపనీయుఁడు'.

2. ఆ రమ్యమైన గానము
ఈ వేళ మ్రోగును
సంతుష్టులైన భక్తులు
ఆ ధ్వని విందురు
ప్రయాసపడు ప్రజల
దుఃఖంబు తీరఁగా
ఆ శ్రావ్యమైన గానము
ఈ వేళ విందురు.

3. పూర్వంబు దూతగానము
భువిన్ వినంబడి
రెండువేల వర్షములు
గతించిపోయెను
భూప్రజలు విరోధులై
యుద్ధంబు లాడి యా
మనోజ్ఞమైన గానము
నలక్ష్యపెట్టిరి.

4. పాపాత్ములారా, వినుఁడి
శ్రీ యేసు ప్రభువు
మీ పాపభార మంతయు
వహింప వచ్చెను
తాపత్రయంబు నంతయుఁ
దానే వహించును
సంపూర్ణ శాంతి సంపద
లను గ్రహించును.

5. సద్భక్తులు స్తుతించిన
ఈ సత్యయుగము
ఈ వేళ నే నిజంబుగా
సమీప మాయెను
ఆ కాలమందు క్షేమము
వ్యాపించుచుండును
ఆ దివ్య గాన మందఱు
పాడుచు నెప్పుడు.

– ఎడ్మండ్ హేమిల్టన్ పియర్స్

అను : బర్నార్డ్ లూకాస్

## 130 *Christians awake, salute the happy morn*

1. క్రైస్తవులారా! లెండి యీనాడు
క్రీస్తు పుట్టెనంచు పాడుఁడి;
ప్రసన్నుఁడైన తండ్రి ప్రేమను
ఆసక్తిపరులై కీర్తించుఁడి
క్రీస్తేను మానవాళితోడను
నశింపవచ్చెనంచు పాడుఁడి.

2. దేవుని దూత గొల్లవారికి
ఈ రీతిగాను ప్రకటించెను:–
'ఈ వేళ మహా సంతోషంబగు
సువార్త నేను ఎరిగింతును.
దావీదు పట్నమం దీదినము
దైవరక్షకుఁడు జన్మించెను.'

3. త్వరగానే ఆకాశ సైన్యము
హర్షించుచు నీలాగు పాడెను
'సర్వోన్న తాకాశంబునందుండు
సర్వేశ్వరునికి ప్రభావము
నరులయందు సమాధానము
ధరణిలో వ్యాపింపనియ్యుఁడు'.



4. పరమతండ్రి దయారసము
నరులకెంతో నాశ్చర్యము
నరావతారుఁడగు దేవుఁడు
నిరపరాధిగాను జీవించి
నిర్దోషమైన త్రోవ చూపించి
విరోధులన్ ప్రేమించుచుండెను.

5. శ్రీ మాత సైన్యముతో మేమును
వాద్యములు వాయించుచుందుము;
ఈ దినమందు నుద్భవించిన
యా దివ్యకర్తను వీక్షింతుము;
సదయుఁడైన యేసు ప్రేమను
సదా స్తుతించి పాడుచుందుము.

– జాన్ బైరొం

అను : బర్నార్డ్ లూకాస్

## 131 *Joy to the world, The Lord is come*

1. హోయి, లోకమా! ప్రభువచ్చెన్
అంగీకరించుమీ
పాపాత్ములెల్ల రేసునున్
కీర్తించి పాడుఁడీ.

2. హోయి రక్షకుండు ఏలును
సాతాను రాజ్యమున్
నశింపఁజేసి మా యేసే
జయంబు నొందును.

3. పాప దుఃఖంబులెల్లను
నివృత్తిఁ జేయును
రక్షణ్య సుఖక్షేమముల్
సదా వ్యాపించును.

4. సునీతి సత్యకృపలన్
రాజ్యంబు నేలును
భూజనులార మ్రొక్కుఁడీ
స్తోత్రార్హుఁడాయెనే.

– ఐజక్ వాట్స్

అను : జేకబ్ చేంబర్లేన్

## 132 ***Angles from the realms of glory***

1. రండి పాడ దూతలారా
నిండు సంతోషంబుతో
యేసుని జన్మంబు గూర్చి
ఈ భూలోకమంతట
రండి నేడు పుట్టినట్టి
రాజు నారాధించుడి.

2. మందగాయు గొల్లలార!
మనుష్యులతో నేడు
వాసంబు జేయుచున్నాఁడు
వాసిగాను దేవుండు
రండి నేడు పుట్టినట్టి
రాజు నారాధించుడి.

3. జ్ఞానులారా! మానుడింక
యోచనలం జేయుట
మానుగాను వెదకుడేసున్
చూచుచు నక్షత్రమున్
రండి నేడు పుట్టినట్టి
రాజు నారాధించుడి.

4. పరిశుద్ధులారా! మీరు
నిరీక్షించుచుండిన
యేసు ప్రభువాలయంబు
యేతెంచెను చూడుడి
రండి నేడు పుట్టినట్టి
రాజు నారాధించుcడి.

5. పశ్చాత్తాప మొందియున్న
పాపులార! మీకు వి
ముక్తి గల్గె; శక్తి నొంది
రక్తి నేసుంజేరుడి
రండి నేడు పుట్టినట్టి
రాజు నారాధించుడి.

– జేమ్సు మాంట్ గోమరీ
అను : ఒంగోలు దావీదు

## 133 *O Little Town of Bethlehem*

1. ఓ బెత్లెహేము గ్రామమా!
సద్దేమిలేకయు
నీవొంద గాఢనిద్రపై
వెలుంగు తారలు
కానేమి, నిత్యజ్యోతి
జ్వలించు నీతమిన్
పెక్కేండ్ల భీతివాంఛలీ
రాత్రి తీరె నీలోన్.

2. మరియకేసుపుట్టెను
నిద్రింప మర్త్యులు
పై గూడి దూతల్వింతయౌ
ప్రేమన్వీక్షింతురు
చాటుడో వేగుచుక్కల్
ఈ శుద్ధజన్మము
దైవానకు నున్నతుల్ భువిన్
శాంతంచు పాడుడీ.

3. సద్దేమి లేక వచ్చెగా!
ఈ వింత దానము
ఆరీతి దేవుడిచ్చుపై
వరాల్ నరాళికి
నరుండెరుంగకున్నన్
ఈ పాపధాత్రిలో
దీనులంగీకరించిన
యేసుండుజొచ్చును.

4. ఓ బెత్లెహేము పావన
వత్సా! మా పై దిగు
పోగొట్టి పాపముల్ మాలో
నీ వేళ పుట్టుము
సువార్త క్రిస్మస్ దూతల్
చెప్పంగ విందుము
మా యొద్ద నుండరమ్ము మా
ప్రభూ! ఇమ్మానుయేల్, ఆమేన్.

– ఫిలిప్ బ్రూక్స్

## 134 *Brightest and Best of the Sons*

1. వేకువచుక్కల శ్రేష్ఠమౌ దానా!
మా యిరుల్ బాపి నీ సాయమిమ్ము
ప్రాగ్దిశ తార దిఙ్మండల భూషా
మా బాలరక్షకు జూపింపుమా.



2. చల్లమంచాయన తొట్టిపై నొప్పు
పశులతో భువిబరుండెను
కున్నెడు నాయన దూతలు మ్రొక్కు

నందర స్రష్ట, రాజు, రక్షణ.

3. ఆయనకు మంచికాన్కలిత్తమా!
ఏదోం సువాసనల ద్రివసుల్
వార్ధి ముత్యాల్ కానబోళంబుఖని
స్వర్ణము నిత్తమా యాయనకు.

4. నిష్ఫలమే యన్ని శ్రేష్ఠార్పణలు
కాన్కల నాయన ప్రేమరాదు
అన్నిట డెందము బీదల మొరల్
దేవుని కిష్టము లౌకాన్కలు.

5. వేకువ చుక్కల శ్రేష్ఠమౌదానా
మాయిరుల్ బాపి నీ సాయమిమ్ము
ప్రాగ్దిశతార! దిఙ్మండల భూషా
మా బాలరక్షకు జూపింపుమా.

– రెజినాల్డ్ హెబర్

# క్రీస్తు నామములు – బిరుదులు

## 135 సువార్త సునాదము

రండి సువార్త సునాదముతో
రంజిలు సిలువ నినాదముతో
తంబుర సితార నాదముతో
ప్రభుయేసు దయానిధి సన్నిధికి

1. యేసే మానవ జాతి వికాసం
యేసే మానవ నీతి విలాసం
యేసే పతిత పావన నామం
భాసుర క్రైస్తవ శుభనామం
॥రండి॥

2. యేసే దేవుని ప్రేమ స్వరూపం
యేసే సర్వేశ్వర ప్రతిరూపం
యేసే ప్రజాపతి పరమేశం
ఆశ్రిత జనముల సుఖవాసం
॥రండి॥

3. యేసే సిలువను మోసిన దైవం
యేసే ఆత్మల శాశ్వత జీవం
యేసే క్షమాపణ అధికారం
దాసుల ప్రార్థన సహకారం
॥రండి॥

4. యేసే సంఘములో మనకాంతి
యేసే హృదయములో ఘనశాంతి
యేసే కుటుంబ జీవన జ్యోతి
పసిపాపల దీవెన మూర్తి
॥రండి॥

5. యేసే జీవన ముక్తికి మార్గం
యేసే భక్తుల భూతల స్వర్గం
యేసే ప్రపంచ శాంతికి సూత్రం
వాసిగ నమ్మిన జనస్తోత్రం.
॥రండి॥

– ఏ.బి. మాసిలామణి

## 136 వేరొక నామమున రక్షణ లేదు

రా - యమునా కల్యాణి తా - త్రిపుట

యేసు నామామృతము కన్నను - వేరే మాకిఁక లేదుగా = దోసముల నెడబాపి పరమని - వాస పదవికిఁ జేర్చుఁగా ॥యేసు॥

1. నిత్య రక్షణ నిత్య జీవము - నిజముగా మాకిచ్చును = సత్యసువిశేషార్థసారము - సతము గ్రోలుట కొసఁగెను ॥యేసు॥
2. దురిత భవ మను నంధకారము - దూరముగఁ బోఁదోలెఁగా = అరయఁ దన విమలాత్మ వరమున - మరల మము వెలిఁగించెఁగా ॥యేసు॥
3. గొప్ప కుల గర్వముల మెప్పను - తప్పుల న్విడఁగొట్టెను = చెప్ప శక్యముగాని రక్షణ - సృష్టిలో మము నిల్పెను ॥యేసు॥
4. అడ్డు పరచు పిశాచి మార్గపు జిడ్డులను ఛేదించెను = దొడ్డ కాపరి యేసు తన దగు - దొడ్డిలో మముఁ జేర్చెను. ॥యేసు॥

- గొల్లపల్లి నతానియేలు

## 137 యేసు నామము మధురము

రా - మారవ తా - ఆది

యేసు నామ - మెంతో మధురం - యేసు నామ - మెంతో మధురం = దోసములు మోసములు - నాథ మొనరించు ప్రభు ॥యేసు॥

1. స్వాంతమునను - శాంతి నిడును = చింతలను భ్రాంతులను - వింతలుగఁ ద్రుంచు ప్రభు ॥యేసు॥
2. నెమ్మి జేయు కమ్మివేయు = నమ్మికలు సొమ్ములుగ - ముమ్మరము జేయు ప్రభు ॥యేసు॥
3. ప్రేమ లెదుగు - క్షేమ మొదవు = కామ గుణ పామరతి - లేమి చొరనీదు ప్రభు ॥యేసు॥
4. మోక్ష దశకు - సాక్ష్య మొసఁగు = నక్షయ సురక్షణకు - దక్షత వహించు ప్రభు ॥యేసు॥



5. శీల మతుల - పాలి వెతలఁ = తూలఁ జనఁదోలి తన - జాలి కనపరచు ప్రభు ॥యేసు॥

- పురుషోత్తము చౌధరి

## 138 యేసు నామము పావనము

రా - ఆనందభైరవి తా - అట

యేసు నామమే పావనము - మాకు - యేసు గద నిత్య జీవనము = దాస జన [1]హృద్వికాసమైయెల్ల - దోసములకు వి - నాశకరమైన ॥యేసు॥

1. సాధు మానసోల్లాసములు యేసు - నాధు గుణ చిద్విలాసములు = బోధఁ గొను వారి - బాధ వెడలించి - మాధుర్యమగు ముక్తి - సాధనములిచ్చు. ॥యేసు॥
2. [2]భక్త జన లోక పూజ్యములు [3]రక్త - సిక్త పాదపయోజములు = [4]ముక్త రాజ్యాభి - షిక్తుఁడౌ సర్వ - శక్తి యుతుఁడైన - సామియగు క్రీస్తు ॥యేసు॥
3. దీన జన నిత్య [5]తోషణము - సిల్వ - మ్రాని ప్రభు మృత్యు ఘోషణము = [6]పానకము జుంటి - తేనియల [7]స్వాదు - వీనులను [8]గ్రోలు - మానవుల కెల్ల ॥యేసు॥
4. పాపులకు మంచి [9]పక్షములు - ముక్తిఁ జూపు క్రీస్తు కటాక్షములు = పాప [10]సందోహ - కూపమునఁ గూలు - కాపురుషు నన్నుఁగాచుకొనిప్రోచు ॥యేసు॥

- పురుషోత్తమ చౌధరి

## 139 యేసు నామస్మరణ

రా - అసావేరి (చాయ: భజో మధుర) తా - ఆది

యేసే, భగవన్నామం భజింపను - యేసే, భగవన్నామం = భజింప నిరంతర ॥మేసే॥

---

[1]మనస్సును వికసింపజేయునది. [2]భక్తజనుల సమూహముచేత పూజింపబడదగినది. [3]రక్తముచేత తడపబడిన పాదపద్మములు. [4]ముక్తి రాజమునకు రాజుగా నభిషేకింపబడినవాఁడు. [5]సంతోషము. [6]పానకముయొక్క పూదీనెయొక్క. [7]మధురము [8]త్రాగు. [9]సహాయములు. [10]సమూహమనెడు నూతిలో.

1. యేసే సుగుణం - యేసే శాంతం - యేసే మనశ్శాంతం = యేసే మనశ్శాంతి భజింపను ॥యేసే॥
2. యేసే ప్రేమం - యేసే క్షేమం - యేసే పరంధామం = యేసే పరంధామ భజింపను ॥యేసే॥
3. యేసే తెరవు - యేసే పరువు - యేసే సద్గురువు = యేసే సద్గురువు భజింపను ॥యేసే॥
4. యేసే నిత్యం - యేసే సత్యం - యేసే సుఖదాయం = యేసే సుఖదాయ భజింపను ॥యేసే॥
5. యేసే జీవం - యేసే జ్ఞానం - యేసే జగదీశం = యేసే జగదీశం భజింపను ॥యేసే॥

- పి. రవివర్మ

## 140 యేసునామ మాధుర్యము

రా - కాంభోజి తా - ఆది

యేసు నీ నామామృతము మా - కెంతో రుచి యయ్యా - దేవ = మా - దోసములను హరించి మోక్షని - వాసులుగఁ జేయుటకు - భాసుర ప్రకాశమైన ॥యేసు॥

1. వేదు కలరఁగఁ గూడి నినుఁ గొని - యాదు వారికి - దేవ = యెంతో - కీడు జేసిన పాదు వైరిని - గోదుగో డనంగ వాని - తాడనము జేసితివి ॥యేసు॥
2. పాపములు హరింప నీవే - ప్రాపు మాకయ్యా - దేవ = నీ - దాపుఁ జేరిన వారి కందరి - కాపదలు బాపి నిత్య। కాపుగతిఁ జూపినావు ॥యేసు॥
3. అక్షయ కరుణేక్ష భువన - రక్షకా నీవే - దేవ = మమ్ముఁ - పక్షముగ రక్షించి మోక్షసు - రక్షణకు దీక్షఁ గొని - వీక్షితులమైన మాకు ॥యేసు॥
4. అందమగు నీ మందిరమున - బొందుగా మేము - దేవ = నీ - సుందర కరుణామృతము మా - డెందముల యందు గ్రోలు - టందుకు సుందరమైన ॥యేసు॥

- యోసేపు దానియేలు



## 141 క్రీస్తు నామమే మన శరణము

రా - శ్రీ రాగము తా - అట

[1]వరనామమే - [2]శరణము శరణము - క్రీస్తు - వరనామమే - శరణము శరణం ॥వర॥

1. పరమభక్త [3]వ్రాత - దురిత [4]సంఘాత [5]దు = స్తర వన జాత [6]భీ - కరకీలి యౌ క్రీస్తు ॥వర॥
2. సారహీన సం - సార [7]పారావార = [8]తారణ కారణ - [9]తరణి యైన క్రీస్తు ॥వర॥
3. యూద దేశమునందు - నుండు బేత్లేహేమున = యూదు లను జనులలో - పాదుకొన్న క్రీస్తు ॥వర॥
4. ఇలలో పాపపు మాన - వుల నెల్ల మోక్ష [10]సం = కలితులఁ జేయఁగ - సిలువ నొందిన క్రీస్తు ॥వర॥
5. [11]ఏచియున్నట్టి పి - శాచభారపు కాడి = మోసి దుఃఖించెడు - నీచులకును క్రీస్తు ॥వర॥
6. కొల్లగాను బాప - మెల్లఁ జేసి దాని = కుల్లములోఁదల్ల - డిల్లువారికిఁ క్రీస్తు ॥వర॥

- విలియం దాసన్

## 142 యేసు నామస్మరణ

రా - హిందుస్థాని కాపి (చాయ: ఆహా మహాత్మ! హాశరణ్య) తా - రూపకము

శ్రీ యేసు దివ్య నామస్మరణ - చేయవే మనసా =
పాయక స్మరియించి పరము - పొందవే మనసా ॥ శ్రీ ॥

1. నరుల పాప హరణమునకై - నరుడయ్యె మనసా
పరమ పుర ద్వారంబు మనకు - తెరచెనే మనసా ॥ శ్రీ ॥

---

[1]శ్రేష్ఠమైన. [2]రక్షకము. [3]సమూహము యొక్క. [4]సమూహమనెడు. [5]దాటశక్యముగాని అడవుల సమూహమునకు. [6]భయంకరమైన అగ్ని. [7]సముద్రము. [8]దాఁటుటకు. [9]ఓడ. [10]కూడుకొన్నవారిని. [11]బాధపెట్టి.

2. నరుల పాప శాప ఫలము - నరకమే మనసా
ఆ - మరణమును తొలంచ ప్రభువే - నుడిసె నేమనసా ॥ శ్రీ ॥
3. పాపమునకు ప్రాయశ్చిత్తం - భవ్యమే గదా
ప్రభువే ప్రాయశ్చిత్త బలియై - పరగెనే మనసా ॥ శ్రీ ॥
4. సిలువవేసి ప్రభుని ప్రజలు - చంపిరే మనసా
ఆ - బలుడు తిరిగి లేచి మృతిని - గెలిచేనే మనసా ॥ శ్రీ ॥
5. గెలిచి యేసు హితులమధ్య - నిలిచెనే మనసా
నిలిచి సమాధాన మంచు - పలికెనే మనసా ॥ శ్రీ ॥
6. పునరుత్థాన మేసు దేవ - పుత్రుడని మహా
ఘనముగా ప్రకటించుచుండ - కాననే మనసా ॥ శ్రీ ॥
7. తానె మార్గం తానెసత్యం - తానెజీవము
ఈ - ఘన సత్యంబు నమ్మునరులు - ధన్యులే మనసా ॥ శ్రీ ॥
8. నిన్ను నీ వెరింగి ప్రభుని - నెరుగ వే మనసా
సన్నుతు దందుల కొసంగె - సత్యవేదము ॥ శ్రీ ॥
9. పాపములకు పరితపించి - ప్రభుని జేరవే
దాపునకు రమ్మంచు కరము - చాపెనే మనసా ॥ శ్రీ ॥
10. ఎంత ఘోరపాపమైన - నెంచదే మనసా
ఎంత మొత్తమైనను క్షమి - యించునే మనసా ॥ శ్రీ ॥
11. బ్రతుకు శాశ్వతంబు కాదు - పరికించు మనసా
ఈ - బ్రతుకునందె ప్రభుని పదము - పట్టుకో మనసా ॥ శ్రీ ॥
12. జనక కుమారాత్మ దేవున్ - జపియించు మనసా
అనయమును స్మరించు స్వర్గ - మద్దియే మనసా ॥ శ్రీ ॥

- వంతగాని పరదేశి

## 143 రారాజగు యేసు

రా - బేహాగ్ తా - ఆది

రారాజగు యేసునినామం - రమ్యంబగు దేవుని నామం
ఈశుండగు యేసునినామం - ఈధర నిదె పావననామం
యేసునినామం - దేవునినామం - రమ్యంబగు దేవుని నామం ॥ రారాజ ॥
1. గగనమువీడిన గురునామం - కలుషాత్ములబ్రోచెడు నామం ॥ రారాజ ॥



2. స్లీవాంకముగల యినామం - సుజనుల జేసెదు స్థిరనామం ॥ రారాజ ॥
3. విజయం బొసగెడు నిజనామం - విమలాత్ముల కిదివరనామం ॥ రారాజ ॥
4. మనమున కిది యుజ్జ్వలనామం - జనములకిదియే బుజునామం॥ రారాజ ॥
5. ఈధరస్తుతులను గొనునామం - ఈయేసుని యమృతనామం ॥ రారాజ ॥

- పి. రవివర్మ

## 144 యేసే సర్వాధిపతి

క్రీస్తే సర్వాధికారి - క్రీస్తే మోక్షాధికారి
క్రీస్తే మహోపకారి - క్రీస్తే ఆ సిల్వధారి ॥
1. ముక్తి విధాతనేత - శక్తి నొసంగుదాత
భక్తి విలాపశ్రోత - పరమంబు వీడె గాన ॥ క్రీ ॥
2. దివ్యపథంబురోసి - దైవంబు తోడుబాసి
దాసుని రూపుదాల్చి - ధరణి కేతెంచెగాన ॥ క్రీ ॥
3. శాశ్వత లోకవాసి - సత్యామృతంపురాశి
శాప భారంబు మోసి - శ్రమల సహించెగాన ॥ క్రీ ॥
4. సైతాను జనము గూల్చన్ - పాతాళమునకు బంపన్
నీతి పథంబు బెంప - రుధిరంబు గార్చెగాన ॥ క్రీ ॥
5. మృత్యువు ముల్లు తృంపన్ - నిత్యజీవంబు బెంపన్
మర్త్యాళిభయము దీర్పన్ - మరణంబు గెలిచెగాన ॥ క్రీ ॥
6. పరమందు దివిజులైన - ధరయందు మనుజులైన
ప్రతి నాలుక మోకాలు - ప్రభునే భజించుగాన ॥ క్రీ ॥
7. ఈ నామమునకు మించు - నామంబు లేదటంచు
యెహోవా తండ్రి యేసున్ - హెచ్చించినాడు గాన ॥ క్రీ ॥

- రావూరి రత్నము

## 145 యేసే మార్గము

రా - మోహన తా - మిశ్రచాపు

నీవేయని నమ్మిక - యేసునాకు - నీవేయని నమ్మిక = నీవే మార్గంబు -
నీవే సత్యంబు - నీవే జీవంబు - నీవే సర్వంబు ॥నీవే॥

1. పెడదారిని బోవగ - నామీదికి - ఇడుమలెన్నియొరాగ = అడవిలోబడి నేను - ఆడలుచు నుండగ - తడవకుండ దొరుకు - ధన్యుమౌ మార్గంబు ॥నీవే॥
2. కారుమేఘముపట్టగ - నా మనస్సులో - కటిక చీకటిపుట్టగ = ఘోరాపదలుచేరి - దారియని భ్రమపడగ - తేరిచూడగల్గు - తేజోమయ మార్గంబు ॥నీవే॥
3. లేనిపోని మార్గంబు లెన్నోయుండ - జ్ఞానోపదేశంబు = మానుగజేయుచు - వానినిఖండించి - నేనే మార్గంబన్న - నిజమైన మార్గంబు ॥నీవే॥
4. నరలోకమునుండి పరలోకంబు - వరకు నిచ్చెనగా నుండి = నరులకు ముందుగ - నడచుచు ముక్తికి - సరిగా కొనిపోవు సు - స్థిరమైన మార్గంబు ॥నీవే॥

*- ముంగమూరి దేవదాసు*

## 146 క్రీస్తే రారాజు

రా - శంకరాభరణం తా - ఆది

1. క్రీస్తేసు శక్తినామమెల్లరు - కీర్తించి కొల్వుడిలన్ యెపుడు = కీర్తి కిరీటము ధరియింప జేయుడి - క్రీస్తే రారాజనుడి ॥క్రీస్తే॥
2. సాష్టాంగపడి దూతల్ పరమున - నిష్ఠతో గొలుచుచును యేసుని = కీర్తి కిరీటము ధరియింప జేయుడి - క్రీస్తే రారాజనుడి ॥క్రీస్తే॥
3. హతసాక్ష్యపు జనమా యేసుడె - హితమతితో బిలుచున్ మిమ్ముల = కీర్తి కిరీటము ధరియింప జేయుడి - క్రీస్తే రారాజనుడి ॥క్రీస్తే॥
4. ఇశ్రాయేల్ ప్రజలారా యిచ్చెను - ఆశ్రయ రక్షణను యేసుడే = కీర్తి కిరీటము ధరియింప జేయుడి - క్రీస్తే రారాజనుడి ॥క్రీస్తే॥
5. పాపుల రక్షించెన్ సిలువపై - శాపము దొలగించెన్ యేసుడే = కీర్తి కిరీటము ధరియింప జేయుడి - క్రీస్తే రారాజనుడి ॥క్రీస్తే॥
6. సర్వజనంబులారా క్రీస్తుని - సర్వజగంబులలో దీవిగ = కీర్తి కిరీటము ధరియింప జేయుడి - క్రీస్తే రారాజనుడి ॥క్రీస్తే॥
7. పరమందున్నట్టి ప్రభుదగు - పరిశుద్ధ సంఘముతో మనము = కీర్తి కిరీటము ధరియింప జేయుచు - క్రీస్తు నారాధింతము ॥క్రీస్తే॥

*- ఎ. చార్లెస్ కిన్సింగర్*



## 147 *How Sweet the Name of Jesus Sounds*

1. నా యేసు నామ శబ్దము
ఎంతో యింపైనది
భయాదులెల్ల దీరిచి
విశ్రాంతి నిచ్చును.
2. ఆకలిగొన్న యాత్మకు
అదే మన్నాయగు
ప్రయాసపడ్డవారికి
ఫలము నిచ్చును.
3. ఈ ప్రియమైన నామము
నిరీక్షణిచ్చును
నాదుర్గమైన స్థానము
కృపానిలయము.
4. నా యేసు దివ్యనామము
సుక్షేమ నిధియౌ
నా దిక్కులేని యాత్మకు
సమృద్ధినిచ్చును.
5. యేసూ నీవే నాకాపరి
నా రక్షకా, రాజా,
నా ప్రభువా, నా జీవమా!
నా స్తుతి పొందుము.
6. నీ ప్రేమ ప్రకటింతును
నా చావు వరకు
నీ నామ సంకీర్తనము
నన్నాదరించును.

*- జాన్ న్యూటన్*

## 148 *Take the Name of Jesus with you*

1. యేసు నామము స్మరించు
బాధ నీకుఁ గల్గఁగా
నద్ది క్షేమ సౌఖ్య మిచ్చు
దాని స్మరియించుము.
॥శ్రేష్ఠమౌ నామము
ఆదరించు నిలను
శ్రేష్ఠమౌ నామము
మోక్షసౌఖ్య మద్దియే॥
2. యేసు నామము స్మరించు
శోధనంబు లుండఁగా
డాలుగాను దాని నెంచి
వేఁడుమా సునామమున్
3. మమ్ముఁ జేరఁదీయు యేసు
నామము స్తుతింపఁగా
మాధుర్యంపు నామ మౌను
ఆత్మ కద్ది తుష్టియే
4. మ్రొక్కుచుందు మేసు నాథ
నీదు పాద పద్మముల్
మోక్షమందుఁజేరఁగాను
హెచ్చుగా నుతింతుము

*- ఎల్. బాక్స్టర్*
*అను : జాన్ అబెర్లీ*

# క్రీస్తు జీవితము - ఉపదేశములు

## 149 క్రీస్తునందు ప్రత్యక్షమైన దేవుని ప్రేమ

రా - ఆనందభైరవి తా - కురుఝంపె

దేవుని ప్రేమ యిదిగో - జనులార - భావంబునం దెలియరే = కేవలము నమ్ముకొనినఁ - పరలోక - జీవంబు మన కబ్బును ॥దేవుని॥

1. సర్వలోకము మనలను - తన వాక్య - సత్యంబుతోఁ జేసెను = సర్వోపకారుడుండే - మన మీద - జాలిపరుఁడై యుండెను ॥దేవుని॥
2. మానవుల రక్షింపను - దేవుండు - తన కుమారునిఁ బంపెను = మన శరీరముఁ దాల్చెను - ఆ ప్రభువు - మన పాపమునకు దూరుఁడే ॥దేవుని॥
3. యేసుక్రీస్తను పేరున - రక్షకుఁడు వెలసి నాఁడిలలోపల = దోసకారి జనులతో - నెంతోను - భాషలను బల్కినాఁడు ॥దేవుని॥
4. పాపభారంబు తోడ - నే ప్రొద్దు - ప్రయాసములఁ బొందెడి = పాపులందఱు నమ్మిన - విశ్రాంతి - పరిపూర్ణమిత్తు ననెను ॥దేవుని॥
5. సతులైన పురుషులైనన్ - యా కర్త సర్వ జనుల యెడలను = సత్ప్రేమగ నడిచెను - పరలోక సద్బోధలిక జేసెను ॥దేవుని॥
6. చావు నొందిన కొందఱిన్ - యేసుండు - చక్కఁగా బ్రతికించెను = సకల వ్యాధుల రోగులు - ప్రభు నంటి - స్వస్థంబు తా మొందిరి ॥దేవుని॥
7. గాలి సంద్రపు పొంగులన్ - సద్దణపి - నీళ్లపై నడచినాఁడే = మేలు గల యద్భుతములు - ఈలాగు - వేలకొలఁదిగ జేసెను ॥దేవుని॥
8. చేతుల కాళ్లలోను - రా రాజు - చేర మేకులు బొందెను = పాతకులు గొట్టినారే - పరిశుద్ధ - నీతి తా మోర్వలేకన్ ॥దేవుని॥
9. ఒడలు రక్తము గారఁగ - దెబ్బలు - చెడుగు లందఱుఁ గొట్టిరి = వడిముళ్లు తలమీఁదను - బెట్టిరి ఓర్చెనో రక్షకుండు ॥దేవుని॥
10. ఇన్ని బాధలు బెట్టుచుఁ - దనుఁ జంపు - చున్న పాప నరులను = మన్నించు మని తండ్రిని - యేసుండు - సన్నుతితో వేఁడెను ॥దేవుని॥



11. రక్షకుడు శ్రమఁ బొందఁగా - దేశంబు - తక్షణము చీఁక టయ్యెన్ = రక్షకుఁడు మృతి నొందఁగఁ - తెర చినిఁగి - రాతి కొండలు పగిలెను ॥దేవుని॥
12. రాతి సమాధిలోను - రక్షకుని - నీతిగల దేహంబును = పాఁతి పెట్టిరి భక్తులు - నమ్మిన - నాతు లందఱుఁ జూడఁగా ॥దేవుని॥
13. మూఁడవ దినమందున - యేసుండు - మృతి గెల్చి లేచినాఁడు = నాఁడు నమ్మిన మనుజులు - చూచిరి - నలువది దినములందున్ ॥దేవుని॥
14. పదునొకండు మారులు - వారలకుఁ - బ్రత్యక్షుఁ డాయె నేసు = పర లోకమున కేగెను - తన వార్తఁ - బ్రకటించు మని పల్కెను ॥దేవుని॥
15. నమ్మి బాప్తిస్మమొందు - నరులకు - రక్షణ మరి కల్గును = నమ్మ నొల్లక పోయెడు - నరులకు - నరకంబు సిద్ధమనెను ॥దేవుని॥

*- గొల్లపల్లి నతానియేలు*

## 150 లాజరును తిరిగి బ్రతికించుట

రా - శంకారాభరణము తా - ఆది

వినరె మనుజులార క్రీస్తుఁ - [1]డిలనుఁ జేయు ఘనములైన = పనులలోనఁ జిత్రమొక్క - పని [2]వచించెద ॥వినరె॥

1. మన మనంబు [3]లలరుచుండ - దినదినంబు ప్రభుని నిండు = ఘన మహాద్భుతములు వినినఁ - [4]దనివిఁ దీరదు ॥వినరె॥
2. ఇలను బేతనియపురంబు - గలదు మరియ మార్తలక్క = సెలియలందు వాసముండి - [5]రెలమితోడను ॥వినరె॥
3. పరిమళంపు తైలమేసు - చరణములకుఁ బూసిన యీ = మరియ సోదరుండు రోగ - భరితుఁడయ్యెను ॥వినరె॥
4. వ్యాధిచేత లాజరుండు - బాధనొందుచుండఁ గ్రీస్తు = నాథుఁ బిలువనంపి రపుడు - [6]నాతు లిరువురు ॥వినరె॥
5. తమ్ము డక్క సెలియలును బ్రి - యమ్ము తనకుఁ గలిగియుండ = నమ్మహాత్ముఁ డైన క్రీస్తుఁ [7]డరిగె నచటికి ॥వినరె॥

---

[1]భూమిలో. [2]చెప్పెద. [3]ప్రకాశించుచుండు. [4]తృప్తి. [5]సంతోషము. [6]స్త్రీలు. [7]పోయె.

6. యేసువచ్చు టెఱిగి మార్త – యెదురు గానుఁ బోయి తనదు = దోసిలొగ్గి మ్రొక్కి ప్రభువు – తోడఁ బల్కెను ॥వినరె॥

7. కర్త నీకు దేవుఁడిచ్చు – ఘనబలమెఱుగుదును సత్య = వర్తి విచట [1]లేని కతన – [2]వ్రాలె లాజరు ॥వినరె॥

8. పిదప మరియవచ్చి క్రీస్తు – [3]పదయుగమున [4]కొరిగి యేడ్చి = మొదట మార్త పలికినట్లు – [5]సుదతి పలికెను ॥వినరె॥

9. అపుడు కర్త వారిపలుకు – లాలకించి మదిని మూల్గి = కృపకుఁ బాత్రు రాలితోడ – నపుడు నడిచెను ॥వినరె॥

10. నడిచి లాజరుని సమాధి – కడకుఁ జేరి గుహను మూయఁ = బడిన రాయి తీయుఁడనుచుఁ – ప్రభువు చెప్పెను ॥వినరె॥

11. యేసుతోడ మార్తపలికె – నీ సమాధినునిచి నాల్గు = [6]వాసరంబులయ్యెఁ గంపు – పట్టి యుండదా ॥వినరె॥

12. దాని నమ్మి చూడుమని మ – హానుభావుఁ [7]డాత్మబలము = [8]నూని తండ్రికపుడు స్తోత్ర – మొనరఁజేసెను ॥వినరె॥

13. లాజరు సమాధినెడలి – రమ్ము లెమ్మటంచు [9]లోక = పూజితుఁడు మహా [10]రవంబుఁ – [11]బూని పల్కెను ॥వినరె॥

14. మరణమైనవాఁడు ప్రాణ – భరితుఁడగుచు లేచి వచ్చెఁ = [12]తరుణులధిక [13]హర్షలైరి – [14]పెదజనంబుతో ॥వినరె॥

15. కన వినంగ రాని యిట్టి – ఘన మహాద్భుతంబుఁ జూచి = జనులు క్రీస్తు యేసునాథు – ననుసరించిరి ॥వినరె॥

16. కనుక మనము వానిఁ జేరు – కొని సుఖంబుఁ బడయవచ్చు = మనసు నిలిపి యతనియందు – [15]మనుట మేలగున్ ॥వినరె॥

– పురుషోత్తము చౌధరి

[1]లేనందున. [2]మరణమొందెను. [3]రెండు పాదములకు. [4]మ్రొక్కి. [5]స్త్రీ. [6]దినములు. [7]స్వకీయమైనబలము. [8]వహించి [9]లోకముచేత పూజింపబడదగినవాఁడు. [10]ధ్వని [11]వహించి [12]స్త్రీలు. [13]సంతోషించిరి. [14]ఇతర. [15]బ్రతుకుట.



## 151 పుట్టుగ్రుడ్డికిఁ జూపునిచ్చుట

రా – నవరోజు తా – త్రిపుట

అందమైన క్రీస్తు కథ మీ – రాలింపరయ్య ॥అందమైన॥

1. పొందుగ శిష్యులతో యేసు – పోవుచుండు మార్గమందు – ముందుగ [1]వీక్షించి రొక్క పు [2]ట్టంధకుని = అందుఁ గొందఱు శిష్య – లాత్మలో భావించి – రెందు కీతఁడు [3]చీక – య్యెను దీని విధమేమో – డెందములనుఁ గల్గు – సందియములు వీడ – విందమనుచు లోక – [4]వంద్యుని సంతతా = నందుని మనుజ – [5]నందనుని నడిగిరప్డు ॥డందమైన॥

2. చీకువాఁడై జన్మించుటకుఁ జేసెనా దుష్కృతము నితఁడు – లేక వీని [6]జననీ జనకు – లేమి చేసిరో = యీ కారణముఁ దెల్పు – మోకర్త యిపుడీవు – మాకంచు తను వేఁడ – లోకేశ్వరుండు ని – రాకారుఁ డితనియం – దీకార్యములుఁ జూపఁ – బ్రాకటముగఁ జేసెఁ – గాక వేరొకవిధము = లేకున్నదని తెల్పి – చీకుఁ బ్రోవఁ దలంచె ॥నందమై॥

3. బురద వాని కన్నులందుఁ – [7]గరములతోఁ [8]జమిరియొక్క – చెఱవులో [9]బ్రక్షాళించుటకు – సెలవిచ్చెఁ బ్రభువు = బిరబిర నయ్యంధుఁ – డరిగి యేసుని పల్కుఁ – దిరముగ మదినమ్మి – [10]సరసిలో మునిఁగి సుం – దరమైన నేత్రముల్ – ధరియించి యానంద – భరితుడై చనుదెంచు – [11]తతివాని పొరుగింటి = నరులబ్బురముగఁ జూ – చిరి మార్మోమగువాని ॥నందమైన॥

4. చూపులేని గ్రుడ్డివానిఁ – జూడఁ గలుగఁజేయువాఁడే – పాపాంధకార [12]మగ్నుల నా – ప్రభువే రక్షించు = పైపైని మనకన్ను – చూపు చూపది గాదు – లోపలి కనుగుడ్డి – యైపోయి యున్నది – యాప [13]త్పరంపర – లోఁ బొరలుచున్నాము – కాపాడుమని యేసు – శ్రీ పాదములుఁ బట్టి = చూపు లోపలి చూపుఁ – జూచి యానందింత ॥మందమైన॥

– పురుషోత్తము చౌధరి

[1]చూచిరి. [2]గుడ్డివాని. [3]గుడ్డి. [4]స్తోత్రింపబడిన. [5]కుమారుని. [6]తలిదండ్రులు [7]చేతులతో. [8]వ్రాసి. [9]కడుగుకొనుటకు. [10]చెఱవులో. [11]సమయమున. [12]మునిగిన. [13]సమూహము.

## 152 యేసుక్రీస్తు ప్రత్యక్షత

రా - నాదనామక్రియ (చాయ: యెహోవా భజన,చేయండి) తా - ఆది

కనరె యేసుని ప్రత్యక్షంబు - అన్య - జనులకు గల్గిన, విధమెట్లొ తరచి ॥కనరె॥

1. నక్షత్రమార్గాన జ్ఞానుల్ - బోయి - రక్షకుని జూచిరి - రక్తిమీరంగ = కాంక్షతో ప్రభునికి మ్రొక్కి - కాన్కల్ - కాంతిమీరగ నిచ్చి - తరలిరి పరగన్ ॥కనరె॥

2. పదియు రెండేడ్ల, ప్రాయమున - ప్రభువు - పస్కాపండుగునకు - పరగబోయెనుగ = ముదమొప్ప దేవాలయములో - జేరి - ముద్దుగ బోధించె - బోధకులకును ॥కనరె॥

3. కానాయూరి పెండ్లికరిగి - ప్రభువు - ఘనముగ నీళ్ల ద్రాక్షా - రసముగజేసెన్ = తనరమహిమను బయలుపరచి - శిష్యుల - మనములబలపర్చె - ఘన విశ్వాసమున ॥కనరె॥

4. కుష్ఠరోగి యొకడువచ్చి - తనదు - కుష్ఠరోగము బాప - ప్రభునివేడంగ = ఇష్టబుద్ధితో ప్రభువువాని - ముట్టి కుష్ఠురోగము బాపె - కోర్కెలూరంగ ॥కనరె॥

5. శతాధిపతి విశ్వాసమును - ప్రభువు - తరచి చూచి మెచ్చి - దయజూపె గనరె = హితవుగవాని దాసుని - పక్ష - వాతంబు స్వస్థత మరిగావించెనుగ ॥కనరె॥

6. గాలివానల విప్లవంబు - ప్రభువు - గద్దించి సద్దణిపి - ఘనమహిమజూపె = గాలిసంద్రముపైన హక్కు - ప్రభునికి - గలదంచు శిష్యులు - ఘనపరచిరిగ ॥కనరె॥

7. ఇట్టిశక్తిగల ప్రభుని - మనము - గట్టిగనమ్మిన - గలుగు రక్షణము = పట్టువీడక ప్రభునినెపుడు - గుల్పి - పరమశాంతిని బొంది - మరివెలుగగలము ॥కనరె॥

- తూలూరి ప్రకాశము



## 153 యేసును అనుకరించుట

రా - బిలహరి (చాయ: మేలుకొనరే) తా - త్రిపుట

నేర్చుకొనరే - యేసువాడుక - లనుదినము మీ బ్రతుకునందున - నేర్చుకొనిన - మీరలాయన జనముగ నొప్పుదురు - ఇలలో ॥నేర్చుకొనరే॥

1. ఆలయ - ఆరాధనలకు - బోయెడియలవాటుగలిగియు - చాలమారులు ఆలయమునకు అరగిన యా ప్రభుని వాడుక ॥నేర్చుకొనరే॥

2. దేవవాక్య పఠనమందున - దీక్షగలిగియు మరియ సుతుడు - దివ్యముగ నా గ్రంథ పఠనము - జేసినవిధంబు మీరలు ॥నేర్చుకొనరే॥

3. పరమ తండ్రికి - ప్రార్థనలు - ప్రతివేళ జేయుట పరమవిధియని మరువకను - ప్రార్థించి మనలను - నిరతమును ప్రార్థింపమనెను ॥నేర్చుకొనరే॥

4. బీద పాపులు - బాధితులు - బంధింపబడిన వారి కెల్లను - ఆదరము జూపించి మేలును - జేసిన విధంబు మీరలు ॥నేర్చుకొనరే॥

5. సువార్త ప్రకటనజేయుట - సుభాగ్యముగ దానెంచి - యీ భువి సేవలో సువార్త జాటుచు సంచరించిన - యేసు వాడుక ॥నేర్చుకో॥

6. అక్కరలలో దన్నుజేరి - మక్కువతో బ్రార్థించి వేడిన - పెక్కు జనముల - యక్కరలను - జక్కగ దీర్చిన విధంబును ॥నేర్చుకొనరే॥

7. దైవచిత్తము దీర్చుటయే తన - ధర్మ విధిగ నెరిగి యాయన - ధరణిలో నా ధర్మమునకై - మరణమొందిన - విభుని మాదిరి ॥నేర్చుకొనరే॥

- ఈతకోట ప్రకాశము

## 154 ధన్యతలు

రా - యదుకుల కాంభోజి తా - ఆది

ఎవరు భాగ్యవంతు లౌదు - [1]రవని లోపల = మోక్ష - [2]వివరమైన క్రీస్తు బోధ - చెవులొగ్గి వినువారికన్న ॥ఎవరు॥

1 భూమిపైన. 2స్పష్టమై.

1. [1]కవులు లాభ [2]మరసి చేయు – కపట మంత్రముల్ = విధులు – [3]దవులఁ బోవఁ దరిమి యేసు – [4]తత్వముఁగొనువారికన్న ॥నెవరు॥

2. దీనమానసుల కిట్టి [5]యుప – దేశ మిచ్చెను = దివ్య – మైన మోక్ష రాజ్యము వారి దౌనటంచు – ప్రభువు తెల్పె ॥నెవరు॥

3. [6]వృజినములకై దుఃఖించెడి – సుజను లెవ్వరో = వారు – నిజముగ నోదార్పుఁ బొంది నిత్య [7]సంతోషితు లని తెల్పె ॥నెవరు॥

4. శాంతి నీతికరుణల యందా – సక్తిగల వారు = భూస్వతంత్రులై పరి తృప్తినొంది – దయఁ బడసెద రని ప్రభువు తెల్పె ॥నెవరు॥

5. పరిశుద్ధ హృదయులు [8]పరా – త్పరునిఁ జూతురు = సర్వ – నరుల సమాధానపరచు – నరులె పరమ జనకుని సుతులు ॥నెవరు॥

6. నీతికొర కాపద నొందెడి – నిశ్చ లాత్ములు = వారు – [9]ఖ్యాతిగఁ బర లోక రాజ్య – ఘన సౌఖ్యము లెల్లను [10]బడయుదురు ॥ఎవరు॥

– పురుషోత్తము చౌధరి

## 155 క్రీస్తు వాక్యము పతితపావనము

రా – శంకరాభరణము (చాయ: మన మొదటి తలిదండ్రుల్, తా – త్రిపుట

విని రయ్య నరులారా – విశ్వాసమున క్రీస్తు – విమల బోధ = పాప మనుజుల కెల్ల పా – వన జీవనము సేయు – వసుధ మీఁద ॥వినరయ్య॥

1. పాపాత్ములను పశ్చా – త్తాపము పడుఁడంచు – బ్రభువు దెల్పెన్ = దన – దాపు గోరినవారిఁ – గాపాడుటకుఁ దానే [11]దక్షుడయ్యెన్ ॥వినరయ్య॥

2. భారాక్రాంతులైన – పాపులఁ – దనుఁ జేరఁ – బ్రభువు పిల్చెన్ = శ్రమలు – దూరంబుఁ జేసిత – ద్దురితముల్ బాపి సం – తోష మియ్యన్ ॥వినరయ్య॥

3. అనుమానింపక నెవ్వ – రైన వచ్చినఁ ద్రోయ – ననుచుఁ బల్కెన్ = పెక్కు – మనుజుల కొఱకు జీ – వన మియ్యనే వచ్చి – తనుచుఁ దెల్పెన్ ॥వినరయ్య॥

---

[1]కవిత్వము చెప్పువారు. [2]విచారించి. [3]దూరముగ. [4]వాస్తవము. [5]బోధ. [6]పాపములకై. [7]సంతోషింప చేయబడువారు. [8]దేవుని. [9]ప్రసిద్ధిగా. [10]పొందుదురు. [11]సమర్థు.



4. మనసారదేవునిన్ – మానక ప్రేమింపు – మనుచునేర్పెన్ = ఇంకఁ దన పోల్కె – నొరులను దాను బ్రేమింపగ దనర దెల్పెన్ ॥వినరయ్య॥

5. తన శిష్యులకు నైక్య – మును బ్రేమించుట కాజ్ఞ – లొనర నిచ్చె = నెంతో – ఘన సత్ప్రభువు కాళ్లు – గడిగి భక్తులచోట – వినతుఁ డయ్యెన్ ॥వినరయ్య॥

– పురుషోత్తము చౌధరి

## 156 క్రీస్తు తుఫానును నిమ్మళపర్చుట

రా – ముఖారి తా – త్రిపుట

ఏలాటివాఁడో కాని – యీ యేసుని – నేమని వివరింతుము = గాలివాన యేసుని – గద్దింపునకుఁ చాల భయపడి నిలిచెను ॥ఏలాటి॥

1. ముద్దు శిష్యులతోడను – సముద్రపు – టద్దరికి వెళ్లెను = కొద్ది పడవనెక్కెను = ఇంతలోనె – పెద్దగాలి రేగెను ॥ఏలాటి॥

2. అల్లకల్లోలముగా – సముద్రము – అల్లలాడు నప్పుడు = చల్లఁగ దోనె వెనుక – తలగడపైని – మెల్లన నిదుర్వోయెన్ ॥ఏలాటి॥

3. చింత లేదా యేమయ్యా – బోధకుఁడా న – శించిపోవుచున్నాము = ఎంతో వేదన పడితిమి – కాపాడుమ – టంచు శిష్యులు లేపిరి ॥ఏలాటి॥

4. దిగ్గునఁ బ్రభువు లేచి – యా గాలిని – గద్దించిన వెంటనే = తగ్గి నిమ్మళించెను – సమస్తము – సద్దు ఉడిగిపోయెను ॥ఏలాటి॥

5. ఏల భీతు లైతిరి – యింతలోనే – యెంత నమ్మిక లేదని = యీలాగు నోదార్చెను – యేసు తన – సొంత శిష్యుల నప్పుడు ॥ఏలాటి॥

– తూసిలి బెంజిమిన్

## 157 వ్యాధి బాధితురాలిని స్వస్థపర్చుట

రా – ఆనందభైరవి (చాయ: దేవుని ప్రేమ యిదిగో) తా – కురుఝంపె

యేసు వస్త్రపు చెంగును – మాత్రమే – యాసించి ముట్టినట్టి = దోసకారుల రోగముల్ – వెంటనే – తొలఁగి పోయెను నిజముగ ॥యేసు॥

1. గుంపుకూడిన జనులతోఁ - బ్రభు యేసు - సొంపుతోఁ బోవునపుడు = తెంపుతో రమణి యొకతె - ప్రభు చెంగు - తెలియకుండను ముట్టెను॥యేసు॥

2. అంతటను రక్తధార - యామె కొ - కింతైన లేకపోయె = ఇంతలోఁ ప్రభువు యెఱిఁగి - తనయొక్క - వింతఁ జూపెను జనులకు ॥యేసు॥

3. ప్రజలార మీలో నొకరిన్ - నాదు ప్ర - భావంబు స్వస్థపరచె = నిజమంచుఁ ప్రభువు చెప్ప - వణఁకుతో - గజయాన వచ్చి నిల్చె ॥యేసు॥

4. ఒదుగుచుండిన వనితతో - శ్రీయేసు - అదురు మానుమి యింకను = ఇదిగో నీ విశ్వాసము - రక్షించె - ముదిత నెమ్మదిని వెళ్లు ॥యేసు॥

5. ఏపుమీరగ యేసును - మీ యొక్క - ప్రాపుగా నమ్ముకొనుఁడి = ఆపదలు దొలఁగించును - నిజముగఁ - పాపముక్తులఁ జేయును ॥యేసు॥

- *తూపిలి బెంజిమిన్*

## 158 ఇదిగో నీ రాజు నీ యొద్దకు వచ్చుచున్నాడు

రా - యమునాకళ్యాణి (చాయ: కలుగును గాక) తా - అట

సీయోనుకన్యా - సంభ్రమపడుచు - వేయుము కేకల్ = పాయక నీ రాజు - భారవాహక మెక్కి - బాలస్తోత్రములతో - బైలుదేరి వచ్చె ॥సీయోను॥

1. హెబ్రాయిలోను - నీ రాజు పేరు - యూదులరాజు = హెబ్రీయ జనులను - అబ్రాము కొడుకులను - విభవదేశము జేర్చు - శుభరాజు యీతండే ॥సీయోను॥

2. హెల్లేనీలోను - నీ రాజు పేరు - యూదులరాజే = యెల్లపాపులఁ బ్రోచు - తాల్మిరక్షకుఁడితఁడు - చల్లని ప్రభువని - గొల్గొత మ్రోగెను ॥సీయోను॥

3. ఉర్వి రోమాలో - నీ రాజు పేరు - యూదులరాజే = సర్వరాష్ట్రికులకు - బూర్వపితరులతోను - వరసింహాసన మిచ్చు - వరదేశాధిపుఁ డితఁడు ॥సీయోను॥



4. వాసిగ హెబ్రీ - హెల్లేనీలో రోమాయిలోను = హోసన్నా హోసన్నా - ప్రభుని పేరట వచ్చు - మెస్సీయ్యదావీదు - కొడుకా శ్రీశుభములు ॥సీయోను॥

## 159 ద్రాక్షావల్లి, తీగెలు

రా - శంకరాభరణము (చాయ: సర్వదేశములారా) తా - ఆది

ద్రాక్షావల్లిని నేను - ద్రాక్షాతీగెలు మీరు = అక్షయు దేసిటు బలికె అతిముదమునను వినరండి ॥ద్రాక్షా॥

1. నాయందుండని తీగె - నాశనమొందును నిజము = నాశనమొందక మీరు - నాయందుండుడి ఫలియింపన్ ॥ద్రాక్షా॥

2. ఫలముల నివ్వని తీగె - పనికిరాదని నరికి = పారవేయంబడును - నిరతము తథ్యము నిప్పులలో ॥ద్రాక్షా॥

3. ఫలించు ప్రతి తీగె - ఫలముల పెక్కుగ నివ్వన్ = పరిశుద్ధి చేయబడున్ - యెఱుగరే మీరది అనవరతం ॥ద్రాక్షా॥

4. నాయందుండినగాని - నయమగు కాపుండదిలన్ = నాయందుండిన వాడు - నాణ్యపు ఫలములనిచ్చు నాహా ॥ద్రాక్షా॥

5. మీరు యేదియు చేయ - లేరు నాకు వేరై = వేరుగ మీరుండినచో - వెంటనే యెండిపోయెదరు ॥ద్రాక్షా॥

6. కాన యేసుని యందు - మానకనుందుము స్వేచ్ఛన్ = మాన్యుడేసుని పలుకుల్ - మదిదలచెద మిల మరువకను ॥ద్రాక్షా॥

- *ఎం.జే. రామాంజులు*

## 160 క్రీస్తుని గూర్చి ప్రవచనములు

రా - పంతువరాళి (చాయ: ఇదుగో గొఱ్ఱెల కాపరి) తా - అట

ఇదిగో శుభద రక్షణము - దేవుఁడు పంపె - నిదిగో శుభద రక్షణము = [1]సదమలంబగు పూర్వ - సత్యవాక్యమునందు - మృదువుగా దీర్ఘ ద - ర్శుల చేతఁ బలుకఁబడె ॥ఇదిగో॥

---

[1]మిక్కిలి పరిశుద్ధమైనది.

1. [1]అలపిశాచముతోడను – దేవుఁడు తొల్లిఁ – బలుకు వాక్యము జాడను = [2]పొలతి సంతతి నిన్ను – తలఁగొట్టఁ బుట్టునని – తెలియఁజేసెను మోషె – దీర్ఘ దర్శన వాక్య ॥మిదిగో॥

2. ఘన దివ్య బలిచేయను – పాపములెల్లఁ – [3]దునిమి పుణ్యము లియ్యను = [4]ఒనరఁగ నీ కాల మునఁ గ్రీస్తు వచ్చునని – ముని దానియేలు బ – ల్కెను దీర్ఘ దర్శనము ॥ఇదిగో॥

3. యూద రాజ్యములోపట – బెత్లేమనెడి – యూరఁ గ్రీస్తుడు బుట్టుట = ఆదిలోన మీకా – యను దీర్ఘ దర్శిచే – మోదమునఁ దెల్పబడె – ముందు వేదమునందు ॥ఇదిగో॥

4. మన దోషముల కొఱకునై – యేసుని కాయ – మది గాయముల [5]హ్రస్వమై = మన రక్షకుని పాట్లు – గనినట్టుల యెషయ్య – ముని దెల్పె దీర్ఘద – ర్శన వాక్యముల నిచ్చి ॥ఇదిగో॥

– పురుషోత్తమ చౌధరి

# క్రీస్తు కృపా ప్రేమలు

## 161 యేసు ప్రేమను స్తుతించుట

రా – బిలహరి తా – అట

వింతగల మా యేసు ప్రేనుమ – సంతసమున స్తుతింతును = పంతముగఁ దన ప్రాణమును పా – పులకు నియ్యను వచ్చి సిలువను – జచ్చి నను రక్షించె నహహా ॥వింత॥

1. ప్రీతిగల మా ప్రభుని కృప బహు – ప్రియముతోఁ జాటింతును = సాధుగా నాకొఱకు సిలువను – చాల శ్రమల భరించి చావు జ – యించి నను రక్షించె నహహా ॥వింత॥

[1]ఆ. [2]స్త్రీ. [3]నాశనముచేసి [4]చక్కగా. [5]క్షీణించి.



2. పాడుఁడీ మా యేసు ప్రేమను – వేఁడుఁడీ మదిఁ గూడుఁడీ = పాడుఁడీ తన దివ్యరక్తము – పాప క్రయముగ నిచ్చి శాపముఁ – బాపి నను రక్షించె నహహా ॥వింత॥

3. నిత్య జీవము నిండు నెమ్మది – నిరతముగ నాకియ్యను = రక్తస్వేదము గార్చె నహహా – నరక శాపముఁ ద్రుంచి యాపద – నుంచి నను రక్షించె నహహా ॥వింత॥

– *తూపిలి బెంజిమిన్*

## 162 యేసే రక్షకుఁడు

రా – శంకరాభరణము తా – రూపకము

అన్నా మన యేసు ప్రభుని – కన్న రక్షకుఁడు లేఁడు = ఎన్న రాని మన యఘము – లన్ని సడలించి ప్రోచు ॥నన్న॥

1. మన దోషములకు బదులుగ – మరణావస్థల నొందెను = తన దివ్యావయవముల ర – క్తము చిందించెను భువిపై ॥నన్న॥

2. నిజ రక్షకుఁడితఁడే మన వృజినాదులఁ బరిమార్పను = విజయం బగు నతని పాద – రజయుగ్మమును స్మరించు ॥మన్న॥

3. దిక్కు మాలిన వారికి – దిక్కై మార్గముఁజూపెను = చక్కనీ గుణముల సొం – పెక్కి వర్తించె నహహ ॥యన్న॥

4. ఈలాటి దయాసముద్రు – నిల నెందైనను గానము = నీలోఁ గల దుర్గుణాది – జాలంబులఁ గడఁ ద్రోయును ॥అన్న॥

5. మృతి గెల్చిన వాఁడే దు – రిత జీవులఁ బ్రోవఁ దగును = మృతి నొంది నశించు లోక – మూఢాత్ముల కేలఁ గల్గు ॥నన్న॥

– రావూరి లక్ష్మయ్య

## 163 యేసు గొఱ్ఱెల మంచి కాపరి

రా – పంతువరాళి తా – చాపు

ఇదుగో గొఱ్ఱెలకాపరి – సోదరులారా – యిదుగో గొఱ్ఱెలకాపరి = కడగానరాని – కారడవిలో నలసటఁ – పడెడు గొఱ్ఱెలను – పేరిడిబిల్చి రక్షించు ॥నిదుగో॥

1. చెదరిపోయిన గొఱ్ఱెనై - దొడ్డికిఁబోవ - [1]ముదములేనివాడనై = మృదుమధురంపు నీ - [2]నాదమా లించక కర్త - [3]కొదిఁగి యుండక మూఢ - హృదయుఁడనైతి ॥నిడుగో॥

2. దూరంబునకుఁబోతిని - జనకుని కృపా - సారంబుఁ [4]గొననైతిని = [5]కారు మూర్ఖపుపిల్ల - గా సంచరించినా - [6]కూరిమి యిలుఁబాసి - దారి దొలగిపోతి ॥నిడుగో॥

3. తనదు గొఱ్ఱెను జూచెను - బోయఁడు తండ్రి - తనశిశువును గాంచెను = కనికరమెదలో నిం - డినవారలై నన్ను - వన [7]గిరికటకాదు - లను వెంబడించిరి ॥ఇడుగో॥

4. ప్రాణావసర మప్పుడు - యేకాకినై - క్షీణించియున్నప్పుడు = [8]త్రాణార్థమగు [9]నెనరు - త్రాళ్లతో ననుగట్టి - నాణెంబుగాఁదెచ్చి - నన్ను రక్షించెను ॥ఇడుగో॥

5. చెడుగు మెకములవల్లను - బాధలనొంది - కడుమలినమై యుండను = కడిగి గాయములన్ని - గట్టి శుభ్రముచేసి - [10]తడయక నాయింట - నిడి నెమ్మది యొసంగె ॥నిడుగో॥

6. ప్రభుయేసు నా బోయఁడు - యీతఁడె భూమి - [11]నభము లేలెడి [12]రాయఁడు = శుభమైన తనదివ్య - [13]శోణిత మొసఁగియ - [14]విభుఁడు ప్రేమించి దీ - వించి స్వస్థముఁజేసె ॥నిడుగో॥

7. నన్ను దొడ్డిని బెట్టెను - పోయినగొఱ్ఱె - తెన్ను వెదకిపట్టెను = సన్నంపు పచ్చిక - యున్న జీవనపూట - లున్నఁ గల్గెడిచోట్ల - నన్నుంచి రక్షించె ॥నిడుగో॥

8. నేను మూర్ఖపుగొఱ్ఱెనై - లోబడకుంటి - మానసమున వెఱ్ఱినై = పూని యిప్పుడు కాచే - వాని శబ్దము ప్రేమ - తో నాలింపుచు దొడ్డి - నానందముననుందు ॥నిడుగో॥

9. చెడ్డబిడ్డనై యుంటిని - యిటునటుబోవ - [15]నెడ్డెతనముఁ గొంటిని = [16]మెడ్డులేకిపుడు ప్రే - మింతు నా ప్రియజనకు - దొడ్డ శబ్దము వాంఛిం - తును ముక్తి [17]నిలయంబు ॥ఇడుగో॥

- పురుషోత్తము చౌధరి

---

[1]సంతోషము. [2]శబ్దము. [3]లోబడి. [4]పుచ్చుకొను. [5]మోట. [6]ప్రేమగల ఇల్లువిడిచి. [7]పర్వతప్రక్కలు. [8]బలమైన. [9]ప్రేమ. [10]ఆలస్యముచేయక. [11]ఆకాశము. [12]రాజా. [13]రక్తము. [14]ప్రభువు. [15]మోటతనము. [16]ఆటంకము. [17]నివాసము.



## 164 ఆశ్చర్యకరమగు క్రీస్తు ప్రేమ

రా - ఆనందభైరవి (చాయ: ఈలాటిదా యేసు ప్రేమ) తా - కురుఝంపె

ఈయనా యేసు రక్షకుడు - తన - దాయమని రక్షింపఁ - దలఁచెనా నన్ను - నీయనా యేసు రక్షకుఁడు = ఆయాసమగు నొక్క మోపు - నే - మోయలేకుండ నా - మూపుపై నుండ - శ్రేయ:కరపు సిలువఁజూపి - నాకు - హాయి నిచ్చెను భార - మంత వెడలించి ॥యీయనా॥

1. దురితాత్ముఁడని త్రోయకుండ నన్నుఁ - బరిశుద్ధుఁడా యేసు - ప్రభుఁడు కరుణింప = ధరణిలో నిది మహాద్భుతము - నే - మరుతునా యీ ప్రేమ - మరణమౌ దాఁక ॥ఈయనా॥

2. ఓపఁగూడని దుష్కృతంబుల్ - నేను - తేపతేపకుఁ జేసి - ద్వేషినై యుండఁ = గోప మింతైన రానీక - నన్నుఁ - గాపురుషుఁ డని తాను - ఖండింపఁ డాయె ॥నీయనా॥

3. మనస్తమో గుణము లెడబాపెన్ - నా - దినకరోదయ మట్లు - దీప్తిమది మించెన్ = తన పాదములఁ జూడ లబ్బెన్ - సదా - వినుతి కెక్కిన వాని విమలాత్మ వెలుఁగు ॥నీయనా॥

4. హతుఁ డయ్యె నాయేసు నాకై - దు - ర్గతి తొలఁగి నాకు మో - క్షమే గల్గు కొఱకు = అతి దయాదీర్ఘశాంతుండే - దైవ - సుతుఁ డని యెఱిగితి - శోధింపఁగాను ॥ఈయనా॥

5. దీవింపఁదగు నతని సిలువ - నా - జీవాంతమగు దనుక - చెలఁగి మోయుచును = ఈ వసుంధర జనుల కెల్ల మీరు - సేవించుఁ డేసునని - చెప్పి చాటుదును ॥ఈయనా॥

- మిక్కిలి నమూయేలు

## 165 యేసుని నిరుపమాన ప్రేమ

రా - ఆనందభైరవి తా - అట

ఈలాటిదా యేసు ప్రేమ - నన్ను = తూలనాడక తనదు - జాలి జూపినదా ॥ఈలాటిదా॥

---

[1]చుట్టము. [2]భూలోకమందు. [3]దుష్క్రియలు. [4]మాటి మాటికి. [5]చంపఁబడినవాడు.

1. ఎనలేని పాపకూపమున – నేను – తనికి మినుకుచును నే – దరిఁ గానకు డన్ = కనికరముఁ బెంచి నా యందు – వేగఁ – గొని పోవ నా మేలు – కొర కిందు వచ్చె ॥ఈలాటి॥
2. పెనుగొన్న దుఃఖాబ్ధిలోన – నేను – మునిఁగి కుములుచు నేడు – పునగుందు నపుడు = నను నీచుఁడని త్రోయలేక – తనదు – నెనరు నా కగుపరచి – నీతిఁజూపించె ॥ఈలాటి॥
3. నెమ్మి రవ్వంతైన లేక – చింత – క్రమ్మిపొగలుచు నుండ – గా నన్ను ఁ జూచి = సమ్మతిని ననుఁ బ్రోవఁ దలఁచి – కరముఁ – జాఁచి నా – చేయిబట్టి – చక్కఁగా బిలిచె ॥ఈలాటి॥
4. పనికిమాలిన వాఁడనైన – నేను – కనపరచు నాదోష – కపటవర్తనము = మనసు నుంచక తాపపడక యింత – ఘనమైన రక్షణ – మును నాకుఁ జూపె ॥ఈలాటి॥
5. నా కోర్కె లెల్ల సమయములన్ – క్రింది – లోక వాంఛల భ్రమసి – లొంగెడు వేళన్ = చేకూర్చి దృఢము చిత్తమునన్ – శుభము – నా కొసంగె జీవింప – నా రక్షకుండు ॥ఈలాటి॥
6. శోధనలు ననుఁ జుట్టినపుడు – నీతి – బోధ నా మనసులోఁ – బుట్టించి పెంచి = బాధ లెల్లను బాపి మాపి – యిట్టి యాదరణఁ జూపెనా యహహ యేమందు ॥ఈలాటి॥

– రావూరి రంగయ్య

## 166 పాపియెడల యేసు ప్రేమ

రా – యదుకుల కాంభోజి (చాయ: ధరణిలోని ధనము) తా – ఆది

యేసురాజు నీదు ప్రేమ – నెంచ తరముగాదయా = దోషియైన నన్ను బ్రోవ – నీసుప్రాణమిడితివా ॥యేసురాజా॥

1. మంచివాని కొరకు నొకఁడు – మరణ మొందుటరుదుగా = అంచితమగు ప్రేమ చేత – మించి గాయము లొందినా ॥యేసు॥
2. చెయ్యరాని దుష్కర్మములుఁ – చేసి నే చెడియుండగా = అయ్యో ప్రాసుమీఁ దికీవు – ఇయ్యకొని మోసితివా ॥యేసు॥



3. గెత్సేమనె వనములోకిఁ – జొచ్చి తండ్రికి చిత్తమై = యిచ్చిన నా శ్రమలపాత్రన్ – బుచ్చుకొని భరించినా ॥వేసు॥
4. హస్తము,పాదము, ప్రక్కలు – మస్తకపు గాయములలో = విస్తరించి చిందె నీ ప్ర – శస్త రక్తమంతయున్ ॥యేసు॥
5. కొండమీద నిన్నుఁజూడ – గుండెలదిరిపోవునే = నిందు ప్రేమ చేత నావగు – మెండుబాధల నోర్చినా ॥వేసురాజా॥
6. మరువలేను నీదు ప్రేమ – మరణపరియంతంబు నా = నరక బాధలన్ని నీవా – కొరతపై వహించినా ॥వేసురాజా॥
7. నిన్నుదలఁచ నా నిరీక్షణ – యున్నతము గానుండును = యెన్నడు నీ మహిమను నా – కన్నులారఁజూతునో ॥యేసురాజా॥

– చదలవాడ తామస్

## 167 క్రీస్తుని అద్భుత ప్రేమ

రా – భైరవి తా – ఆది

ఓ వింత! నా రక్షకుఁడా నాకై – నీ విలువ రక్తము కార్చితివా = జీవాధిపతి మృతిఁ జెందె నహహా పురుగు – వంటి నాకై నీ – జీవ మర్పించి నావా ॥ఓ వింత॥

1. నేను జేసిన పా – పములకు నాయన – ప్రానిమీఁదను మూల్గినావా = నేను గ్రహింపలేని – నీ జాలి కరుణ మితి – లేని ప్రేమ దీని – వలనను గనుపడుచు నున్నది ॥ ఓ వింత॥
2. పరమ శరీరుఁడు తా – మరణ రక్తంబుచేతఁ – గరుణతో నన్నుఁ బ్రోచినాఁ డా = మరుతునా యీ ప్రేమ నా – మరణంబు నందు సహా – కర్తృ కటాక్షములు – కలకాల ముందు నాతో ॥ఓ వింత॥
3. నా యేసు నాథ నీకు – నేనచ్చియున్న దెల్ల – నా లేమితోఁ బ్రేమ గదా = నియమంబు గల ప్రభువా – నీకెట్లు చెల్లించెదను – నన్ను నేనే నీకు – నర్పించుకొనుట గాక ॥ఓ వింత॥

– తామస్ హీలిన్

## 168 క్రీస్తు పాపికి ఆశ్రయము

రా – అసావేరి (చాయ: ఉన్నపాటున) తా – త్రిపుట

పరమ రక్షక యేసు – ప్రభువా నే నీ పాలఁ పడితి పాలన సేయవే = ధరజనంబులుసేయు బహువిధ – దురితములు క్షమియించి సద్గతి తెరవు జూపి తరింపఁజేసెడి – దొరవటంచును మరుగుజొచ్చితి ॥పరమరక్షక॥

1. క్షితి [1]నబ్ధి తీర [2]పై కతయైన నెన్ననా – [3]యితియౌను లెక్కింపఁగా = [4]కుతల జన్మంబెత్తియేనిట – బ్రతుకు దినముల – జేయునఘములు – మతి దలపనిమితా [5]యుతంబులు – పతితు డనునాగతి యెరుంగను ॥పరమరక్షక॥
2. [6]పసలేని మాయా దు – ర్వ్యసనంబులను జెంది – దెసదప్పి యున్నాడను = వసుధలో దుష్టునికి లోఁబడి – మసలజాలని బలహీనత – [7]గసటు కన్నులగప్పి కడు మా – నసము దూలి విలాపినైతిని ॥పరమరక్షక॥
3. మదితప్పి గొఱ్ఱెల – మంద బాసినగొఱ్ఱె – చెదరి చలించినట్లు = వదలకెపుడు దురాత్మలైరి స – ముదయమునఁ బడితిరిగి వడిచెడి – మదికి విశ్రమమేమి లేమిని – హృదయ సంతాపముల సుడిఁబడి ॥పరమరక్షక॥
4. [8]మదపున్నాగము భంగి – మత్తిల్లి దుర్భావ – హృదయుఁడనై చెడితిని = గొదగొనుచు గాయములతో నా – యెద దృఢంబించుకయు లేమినిఁ – గదల శక్యము గాక మూల్గుచు – గొదువలకు లోనైతి ద్రోహిని ॥పరమరక్షక॥
5. అమిత దురాత్ముఁడ – నని కడఁ ద్రోయక – క్షమియింపు మీ కరుణచే = తమిని మిక్కిలి దుర్విషయగుణ సముదంబులు జుట్టి పాపపు – తమము గప్పియు గలుషకానన – సమితిలోఁబడి శ్రమలు నొందుచు ॥పరమరక్షక॥

– రావూరి రంగయ్య

## 169 యేసు పాపికి ఆశ్రయుఁడు

రా – శంకరాభరణము తా – అట

పాపి కాశ్రయుఁడవు నీవే – యేసు నీవే

1. ఉన్నత లోకము విడిచిన నీవే = కన్నియ గర్భమునఁ బుట్టిన నీవే యేసు నీవే ॥పాపి॥

[1]సముద్రము. [2]ఇసుక. [3]సాధ్యమాను. [4]భూమి. [5]పదివేలు. [6]కాంతి. [7]మాలిన్యము. [8]ఏనుగు.



2. అజ్ఞాన నాశన [1]బ్రధ్నుఁడవు నీవే = విజ్ఞాన దాయక పరగురువు నీవే – యేసు నీవే ॥పాపి॥
3. చెదరిన పాపుల వెదకెడు నీవే = చెదరిన గొఱ్ఱెల కాపరివి నీవే – యేసు నీవే ॥పాపి॥
4. రోగిష్ఠులకు [2]స్వస్థ ప్రదుఁడవు నీవే = మ్రోగు నార్తుల యొక్క మొఱవిను నీవే – యేసు నీవే ॥పాపి॥
5. నర పుత్రులకు నీతిఁ గరపించు నీవే = కరము చాఁపి కష్టములు ద్రోయు నీవే – యేసు నీవే ॥పాపి॥
6. శాత్రవాంతరమున మృతుఁడవు నీవే = మైత్రిఁ జూపఁగ మృత్యుర్ధతుఁడవు నీవే – యేసు నీవే ॥పాపి॥
7. భవ దీయ పదకంజ దాసుండ నేనే = [3]భవ మగ్ను నను ముక్తుఁ జేయుము నీవే – యేసు నీవే ॥పాపి॥

– మిక్కిలి నమూయేలు

## 170 క్రీస్తుని దయ

రా – ముఖారి తా – ఆది

యేసుక్రీస్తు ప్రభువా – మేము నీ – మోక్షముఁ బొందుటకు = దోసపు లోకము – లోనికి వచ్చితి – దోషులఁ బ్రోచుటకు ॥యేసు॥

1. పరిశుద్ధుఁడ వీవు – ఇలలో – పాపుల నందరిని = పరిపరివిధ – కృప – వాక్కులతోడను – పిలిచితి వెల్లప్పుడు ॥యేసు॥
2. సత్యపు నడతలతో – జగతిని – సర్వాద్భుతములను = నిత్యముఁ జేయుచు – నీ కృప చాల – యిలలోఁ దెల్పితివే ॥యేసు॥
3. అతి పుణ్యాత్ముఁడవే – [4]క్షితిలో – [5]వెతలను బొందితివే = మృతిని బొందియు – మూఁడవ దినమున – బ్రతికియు లేచితివే ॥యేసు॥
4. పాపుల మని తెలిసి – నీదగు దాపున జేరఁగనే = పాపముఁ బాపుచు ప్రాపుగ నుండెడి – ప్రభుఁడవు నీవెగదా ॥యేసు॥

[1]సూర్యుఁడవు. [2]ఆరోగ్యము నిచ్చువాఁడవు. [3]పాపములో మునిగినవాఁడనగు. [4]భూమిలో. [5]కష్టములను.

5. [1]దురిత వితతి దూరా - నమ్మిన - దురితుల స్నేహితుఁడా = నిరతము మమ్మును - నీ కృప లోపల - నిలకడగాఁ బెంచు ॥యేసు॥

6. నోరు నిండ నెదలో - నీ కృప - ప్రేరేపణఁగలిగి = సారెకు వేఁడెద - [2]ముర్వికి రక్షణ - కారకుఁడా నిన్ను ॥యేసు॥

- *గొల్లపల్లి నతానియేలు*

## 171 యేసుని గొప్ప ప్రేమ

రా - ముఖారి తా - త్రిపుట

యేసూ నన్ను ప్రేమించినావు - పాపినైన - నన్ను ప్రేమించినావు॥

1. నన్ను ప్రేమింపమా - నవరూప మెత్తి దా - నముగా జీవము సిల్వపై - నిచ్చి = కన్న తలిదండ్రుల - యన్నదమ్ముల ప్రేమ - కన్న మించిన ప్రేమతో ॥యేసూ॥

2. తల్లి గర్భమున నే - ధరియింపఁబడి నపుడే - దురితుండనై యుంటిని - నా = వల్లఁజేయఁబడెడు - నెల్ల కార్యము లెప్పు - డేహ్యంబులై యుండఁగ ॥యేసూ॥

3. మంచి నాలోఁ పుట్ట - దంచు నీ వెరిఁగి నన్ - మించఁ బ్రేమించి నావు - ఆహా = యెంచ శక్యముగాని - మంచి నాలోఁ బెంచ - నెంచి ప్రేమించినావు ॥యేసూ॥

4. నన్నుఁ బ్రేమింప నీ - కున్న కష్టము లన్ని - మున్నె తెలిసియుంటివి - తెలిసి = నన్నుఁ బ్రేమింప నీ - కున్న కారణమేమో - యన్నా తెలియదు చిత్రము ॥యేసూ॥

5. నా వంటి నరుఁ డొకఁడు - నన్నుఁ ప్రేమించిన - నావలన ఫలముఁ గోరు - ఆహా - నీవంటి పుణ్యునికి - నా వంటి పాపితో - కేవలంబేమి లేక ॥యేసూ॥

- *బేతాళ జాన్*

[1]పాపసమూహమున దూరమైనవాఁడా. [2]భూలోకమునకు



## 172 యేసే మన సమస్తము

రా - నవరోజు తా - ఆది

యేసుక్రీస్తు దొరికె నేని - యేమికొదువింకేమి భయము = [1]దోసకారి జనుల కెంతోఁ - [2]గ్రాసమవునా యేసు పేరు ॥యేసు॥

1. తల్లిదండ్రులకన్న చాలాఁ దన ప్రేమ మనమీద = నెల్లకాలమందు నుంచు - యేసుఁడే మా తండ్రియౌను ॥యేసు॥

2. వల్లగాని వశములేని - యెల్ల మేళ్లన్నిటి నెల్లపుడు = [3]కొల్లగా మన కిచ్చెడి దేవ - కొమరుఁడే వేరెవరు లేరు ॥యేసు॥

3. [4]దండియైన గండములు - మెండుగాను మముఁజుట్టిన = తండ్రివలె మా దరికి వచ్చి - గండములను గదిమిఁ బ్రోచున్ ॥యేసు॥

4. సత్యము మార్గముతానె - నిత్యజీవమింకా తానే = [5]భ్రుత్యుల మనకీయ మోక్షము - భువిని రక్తమంత గార్చె ॥యేసు॥

5. ఎన్నరాని పాపాత్ముల = కన్నులారా కనికరించి = పున్నెమైన తన ప్రాణము- [6]భువిని బలిపెట్టినాఁడు ॥యేసు॥

6. [7]ఒడలు నిండా గాయములతో - [8]నడరు చుండమరల లేచి = [9]వెడలి పరమందునుండి - [10]వేడుకలు మాకంపినాఁడు ॥యేసు॥

7. ఆశతోడఁ తన్ను నమ్ము - యాత్మలకు దర్శనమిచ్చెడి - యేసుతో నింకెవరు సాటి - లేశమైనా లేరుసుండీ ॥యేసు॥

- *గొల్లపల్లి నతానియేలు*

## 173 యేసుని ప్రేమ స్మరణ

రా - శంకరాభరణము తా - ఆది

యేసుని ప్రేమను - నేమారకను - నెప్పుడు దలఁచవే యో మనసా = వాసిగ నాతని - వరనామంబును - వదలక పొగడవె యో మనసా॥

[1]పాపజనులు. [2]ఆహారము. [3]విస్తారముగా. [4]గొప్ప. [5]వకులునే. [6]భూమియందు. [7]శరీరము. [8]ప్రకాశించు. [9]బైలుదేరి. [10]సంతోషములు.

1. పాపులకొరకై – ప్రాణముఁ బెట్టిన – ప్రభు నిలఁ దలఁచవె యో మనసా = శాపము నంతయుఁ – జక్కగ నోర్చిన – శాంతుని పొగడవె యో మనసా ॥యేసుని॥

2. కష్టములలో మన – కండగ నుండిన – కర్తను దలఁచవె యో మనసా = నష్టములన్నియు – నణఁచిన యాగురు – శ్రేష్ఠుని పొగడవె యో మనసా ॥యేసుని॥

3. మరణతతిని మన – శరణుగ నుండెడు – మాన్యునిఁ దలఁచవె యో మనసా = కరుణను మన క–న్నీటిని దుడిచిన – కర్తను పొగడవె యో మనసా ॥యేసుని॥

4. ప్రార్థనలు విని – ఫలముల నొసఁగిన – ప్రభు నిఁక దలఁచవె యో మనసా = వర్థనఁ గోరుచు – శ్రద్ధతో దిద్దిన – వంద్యుని పొగడవె యో మనసా ॥యేసుని॥

5. వంచనలేక – వరముల నొసఁగిన వరదునిఁ దలఁచవె యో మనసా = కొంచెము కాని – కూర్మితో దేవుని – కొమరుని పొగడవె యో మనసా ॥యేసుని॥

– దొరసామి ఆరోగ్యము

## 174 యేసు మన ప్రియబంధువు

రా – ఆహిరి తా – ఆది

యేసువంటి ప్రియ బంధుఁడు నాకిఁక – నిహ పరములలో లేఁడన్న = [1]భాసురముగ నిజ భక్తుల కది యను – భవ [2]గోచర మెపు డగు నన్న ॥యేసు॥

1. ఊరుపేరు పరువులు [3]మురువులు మరి – యూడఁగొట్టబడినను గాని = [4]కూరిమితో క్రీస్తుడు మాకుండినఁ – కొదువరాదు గొప్పయు పోదు ॥యేసు॥

2. [5]ఆడికలు తిరస్కారంబులు మా – కవమానము లున్నన్ గాని = తోడు క్రీస్తుఁడు మాకుండినను త్రోవఁ దప్పము ఓడిపోము ॥యేసు॥

[1]శ్రేష్టతరము. [2]తెలియబడినది. [3]సొగసులు [4]ప్రేమ. [5]అపకీర్తులు.



3. తగ్గుపాటులును సిగ్గుపాటులును – దలమీఁదను వ్రాలినగాని = దగ్గర మా పాలిటఁ ప్రభువుండగ – సిగ్గును బొందుము తగ్గునఁ [1]గుందము ॥యేసు॥

4. ఎన్నెన్నో శోధన బాధలు చెల – రేగి మనలఁ జుట్టిన యపుడు = కన్న తండ్రివలె నోదార్చుచుఁ దన –ఘన వాగ్బలమున దునుమును వానిని ॥యేసు॥

5. మనసు క్రుంగి పలు చింతలచేత – మట్టఁబడిన వేళను మాకుఁ = తన వాగ్దత్తములను జేతుల లే – వనెత్తి యెంతో సంతస మొసఁగును ॥యేసు॥

6. తల్లిదండ్రులు విడిచిన గాని – తాను వదలఁ డెప్పుడు మమ్ము = ఉల్లమునెత్తి పిలిచిన వేళ – నోహో యనుచు దరికి వచ్చు ॥యేసు॥

7. అతఁ డుండని పరమండలము ఇక – వెదకినగాని యగపడదు = క్షతినాతఁడు మా మతిని వసించిన – అతులిత సౌఖ్యం బదియే మోక్షము ॥యేసు॥

– పురుషోత్తమ చౌధరి

## 175 క్రీస్తు ప్రేమ సాటిలేనిది

రా – మారువ (చాయ: ఉన్న పాటున వచ్చు) తా – అట

ఏమి లేదు సుమీ జగములో యేసుని – ప్రేమ సారము కన్నను = [2]పామరం బేటికి వృధా కను[3] – దామరలు మూయగనె చీకటి – యౌ మనంబున నెల్ల సత్యము – గామి గని సర్వంబు విడువుఁ ॥దేమి॥

1. [4]దార పుత్రాది బంధు [5]శ్రేణిపై మమ – కార భావము జెందుచుఁ – దద్విషయమై – కోరి దుఃఖము లొందుచు – భ్రమఁ గుందుచు = భూరి మాయా జాల బంధా – కార మిది యని తెలియ కీ సం – సార మంతయు నాది నాదని – యూరకే చెడిపోవ నేటికి ॥నేమి॥

2. ఈ దేహమునకుఁ బ్రాణమునకు సంబంధ – మించు కైనఁ గలదా – దేహాత్మలకు – భేదము గన వలదా – బుద్ధి గొన వలదా = యాది నే దేహము – నాత్మ [7]స – మాదరంబున నుందు నా తను – వీ ధరిత్రిని విడచి చను నపుడే [8]దయామృతవార్ధి దిక్కగు ॥నేమి॥

[1]దుఃఖింపము. [2]మోహము. [3]పద్మములవంటి కన్నులు. [4]భార్య. [5]సమూహము [6]వలతాళ్లవంటిది. [7]మిగుల నాదరణయందు. [8]దయారసమునకు సముద్రమువంటివాఁడు.

3. [1]జాయా పుత్రోద్యాన [2]గృహ విత్తా ట్టాలక – సకల వస్తు జాలము – [3]ప్రతిష్ఠాను – భూతి విధేయులు – నఖిల సంపదలు = నీ యవని లోపల సమర్పణఁ – జేయఁగా బడుఁ గాని యించుక – [4]తోయమును గొని పోవశక్యము – లేద హా భ్రమ నొంద నేటికి ॥నేమి॥

– విలియం డాసన్

## 176 *One There is above all others*

1. శ్రేష్ఠుఁడెల్లవారిలోను
మా యేసువే
తల్లికంటె ప్రియుడౌను
మా యేసువే
లోకస్నే హమస్థిరంబు
నేఁడు ప్రేమరేపు కక్ష
స్థిరుడైన మిత్రుడౌను
మా యేసువే.

2. నాకు నిత్యజీవమౌను
మా యేసువే
సర్వమందు సర్వమౌను
మా యేసువే
నన్ను మేలుకొల్పి ప్రోచి
శుద్ధిచేసి ప్రేమతోడ
నన్ను తన మందఁజేర్చె
మా యేసువే.

3. ప్రేమమూర్తి సత్యవర్తి
మా యేసువే
ఇహపరభాగ్యమిచ్చు
మా యేసువే
క్రీస్తుకిమ్ము నీదుయాత్మ
నీకు శాంతినిచ్చి కాచి
తుదిఁజేర్చు మోక్షమందు
మా యేసువే.

4. బాధనొందు మేము చేర
మా యేసువా!
మాకు హర్ష మిచ్చినావు
మా యేసువా!
ఇహమందు నడిపించు
అవసానకాలమందు
మోక్షసౌఖ్య మొందనిమ్ము
మా యేసువా!

– జాన్ న్యూటన్
అను : జె. హే.

[1]భార్య. [2]కోటవాకిటి మీఁది యిల్లు. [3]అనుభవమునకు. [4]జలమును



# క్రీస్తు శ్రమలు – మరణము

## 177 క్రీస్తు తన శ్రమలను గూర్చి ప్రవచించుట

రా – ఆనందభైరవి (చాయ: నాకై చీలిన) తా – అట

యేసు శిష్యులకు – నెరుక జేసిన – భవిష్యోక్తులు వినరే = కైసరయన – గర ప్రాంతములను – ఘనుఁడు చేరి తన – గతి మతిఁ దలఁచుచు ॥యేసు॥

1. యెరూషలే మనెడి – పురమునఁ దన కిఁక – కలిగెడు దుఃఖములు = దురితాత్ములు యూ – దులు కడు బాధలు – పరచి తన్ను సిలు – వను చంపుదు రని ॥యేసు॥

2. నీతి బోధకు ల – నేకులు పెద్దలు – ఖ్యాతిగ నర్చకులు = అతరిఁదన నప – హాస్యము లాడుచుఁ – బోతరించి యుమి – వేతుర టంచును ॥యేసు॥

3. మనుజ కుమారుఁడు – మరణమై సమా – ధిని వేయంగఁబడున్ = దన రఁగ మూఁడవ – దినమునఁ బునరు – త్థానమొంది ద – ర్శన మిడు మీకని ॥యేసు॥

– పురుషోత్తమ చౌధరి

## 178 ఆయన అప్పగింపఁబడిన రాత్రి

రా – అసావేరి తా – రూపకము

ఆ యంధకారంపు – రేయిలో క్రీస్తు పడు – నాయాసములు దలఁచరే = సాయంతనము శిష్య – [1]సమితితో భోజనముఁ – జేయఁగూర్చున్న ప్రభువు – భక్తుల కనియె ॥నా యంధ॥

1. ఒకఁడు మీలో నన్ను – యూద [2]గణముల చేతు – లకు నప్పగింపఁ దలఁ చెన్ – [3]మొక మిచ్చకము గల్గు – మూర్ఖుఁడగు యూదాను – [4]మొనసె వీడనుచుఁ దెలిపి యికఁ మిమ్ముఁగూడియుం – డకయుందునని రొట్టె – విరిచి స్తోత్రంబుజేసి = ప్రకటంబుగా – దీని భక్షించుఁడని పిదప – నొక పాత్ర [5]నాన నిచ్చెన్ – ద్రాక్షారసం ॥బా యంధ॥

[1]సమూహము. [2]సమూహముల. [3]ముఖస్తుతిచేయు. [4]సిద్ధపడెను. [5]త్రాగుటకు.

2. తన మేని గురుతు రొ – ట్టెను జేసి పాపవిమో – చనమైన రక్తమునకు – నొనరంగ ద్రాక్షారస – మును గురుతుగాఁ దెలిపి – నెనరుగల కర్త యపుడు – చనె గెత్సెమను వన – స్థలిలోన శిష్యుల – నునిచి తానొక్కరుండు = మనసు వ్యాకులము చే–తను నిండియుండఁగా – ఘనుడు ప్రార్థించెఁదండ్రిన్ – గాఢముగాను ॥ ఆ యంధ॥

3. శ్రమచేతఁ దన శరీ – రము నుండి దిగజారెఁ – జెమట రక్తపు బొట్లుగా – [1]నమితమౌ లోకపా – పముఁ జూచి నిట్టూర్పులప్పటప్పటికిఁ బుచ్చి – క్రమముగా దూత తన – కడ [2]కరుగుదెంచి శాం – తముఁ బల్కి చనిన [3]పిదపం = తమ మనంబులఁ బోలు – [4]తమసమున యూద సై – న్యము [5]లేగుదెంచె నపుడు – గెత్సెమను వనికి ॥నా యంధ॥

4. పరశాంతి [6]శీల స – ర్వజ్ఞతలు గల ప్రభుం – డెరిఁగి తనకున్న పాట్లు – [7]పరిపంథి గణముతోఁ – బలికె మీరిచ్చోట – నరయుచున్నా రెవనిని – నరులు నజరేతు యే – సను వాని ననఁగఁ దా – నెఱిఁగించె నేనేయని = [8]గురుదీప శిఖల [9]సో – కు [10]పతంగముల భంగి – ధరణిపైఁ బడిరి వారల్ – [11]దర్పము లణఁగి ॥యా యంధ॥

5. తన శిష్యులను విడువుఁ – డని రిపులచేఁ దానె పట్టువడియెన్ – [13]కినిపి పేతురు యాజ – కుని దాసు [14]కర్ణంబు – [15]దునుమంగ క్రీస్తుఁడపుడు – కనికరంబున స్వస్థ – తను జేయు నావిభుని – కరములను విరిచి కట్టి = వెనుక ముందరఁ జుట్టు – కొని యెరూషలేము పుర – మునకుఁ దీసుకఁ బోయిరి – రాణువవార ॥లా యంధ॥

– పురుషోత్తమ చౌధరి

## 179 సిలువ యెదుట హృదయవేదన

రా – ధన్యాసి   తా – ఆది

నా యన్న రాఁగదే – ఓ యేసు తండ్రి – నా యన్న రాఁగదే = నా ప్రాణ ధనమా – నా పట్టుకొమ్మా – నా ముద్దు మూట – నా ముక్తిబాట – నా యన్న రాఁగదే = నా యన్న సిలువలో నీ – వాయాసపడిన నాఁటి – నీ [16]యంఘ్రియుగమునిపుడు – నా యాసఁదీరఁజూతు ॥నా యన్న॥

[1]అపరిమితమైన [2]వచ్చి. [3]పిమ్మట. [4]చీకటిలో. [5]వచ్చెను. [6]మంచి స్వభావము. [7]శత్రువుల. [8]గొప్పదీప జ్వాలలు. [9]తగులు. [10]మిడతలవలె [11]గర్వములు. [12]శత్రువులచేత. [13]కోపించి. [14]చెవి. [15]కోయగా. [16]రెండు పాదములు.



1. ఒక తోఁట లోపట – నాఁడు నీవు పడిన – సకల శ్రమ లిచ్చోట = [1]నికటమై యున్నట్లుగా – నిట్టూర్పులతోఁ దలంతు – నకట నా రాతి గుండె – [2]శకలంబై పోవునట్లుగా ॥ నా యన్న॥

2. పరమాశ్చర్యము గాదా – యీలాటి ప్రేమ – ధరణిలో నున్నదా = చురుకౌ ముల్లుల పోట్లకు నీ – శిరము నా వంటి నీచపు – పురుగు కొరకం దిచ్చెదు నీ – కరుణన్ దర్శింతు నేఁడు ॥నా యన్న॥

3. ఇచ్చక మిది గాదు – మిగులఁ దలపోయ – ముచ్చట దీరదు = అచ్చి వచ్చిన నా – యవతారుఁడ నీ ప్రక్క – గ్రుచ్చు గాయము లోపల నేఁ – జొచ్చి నీ ప్రేమఁ జూతు ॥నా యన్న॥

4. తల వంచి సిగ్గున – నేఁ జేయు నేర – ముల నెంతు నాలోనఁ = బలు మారు నీ గాయములఁ – గెలికి నిన్ శ్రమపరచు నా – [3]ఖల దోషములకై యిపుడు – విలపించి వేఁడుకొందు ॥నాయన్న॥

– పురుషోత్తము చౌధరి

## 180 క్రీస్తు సిలువ బాధ

రా – గాంధారి   తా – ఏక

మనస యేసు మరణ బాధ – లెనసి పాడవే – తన – నెనరుఁ జూడవే యా – ఘనునిఁ గూడవే = నిను మనుప జచ్చుటరసియే – మరక వేఁడవే ॥మనస॥

1. అచ్చి పాపములను బాప – వచ్చినాఁడఁట – వా – క్కిచ్చి తండ్రితో – నా – గెత్సెమందున = తాఁ – జొచ్చి యెదను నొచ్చి బాధ – హెచ్చుగనెనఁట ॥మనస॥

2. ఆ నిశీథ రాత్రి వేళ – నార్భటించుచు – న – య్యో నరాంతకుల్ – చేఁ – బూని యీటెలన్ = ఒక – ఖూని వానివలెను గట్టి – కొంచుఁబోయిరా ॥మనస॥

3. పట్టి దొంగవలెను గంత – గట్టి కన్నులన్ – మరి – గొట్టి చెంపలన్ – వడిఁ – దిట్టి నవ్వుచున్ = నినుఁ – గొట్టి రెవ్వ రదియు మాకుఁ – జెప్పుమనిరఁట ॥మనస॥

[1]సమీపము. [2]ముక్క. [3]దుష్టమైన.

4. ముళ్లతోడ నొక కిరీట – మల్లి ప్రభుతలన్ – బెట్టి – రెల్లు కఱ్ఱతో నా – కల్ల జనములు = రా – జిల్లు మనుచుఁ గొట్టి నవ్వి – గొల్లు బెట్టిరా ॥మనస॥

5. మొయ్యలేక సిల్వ భరము – మూర్ఛ బోయెనా – అ – య్యయ్యో జొక్కెనా – యే – సయ్య తూలెనా = మా – యయ్యనిన్ దలంపగుండె – లదరి పోయెనా ॥మనస॥

6. కాలు సేతులన్ గుదించి – కల్వరి గిరిపై – నిన్ – గేలిఁజేయుచు – నీ – కాళ్లమీఁదను = నినుప – చీలలతోఁ గ్రుచ్చి నిన్ను – సిల్వఁ గొట్టిరా ॥మనస॥

7. దేవ సుతుఁడ వైతి వేని – తీవరంబుగా – దిగి – నీవు వేగమే – రమ్మ్ము – గావు మనుచును = ఇట్లు – గావరించి పల్కు పగర – కరుణఁజూపెనా ॥మనస॥

8. తన్నుఁ జంపు శత్రువులకు – దయను జూపెనా తన – నెనరు జూపెనా – ప్రభు – కనికరించెనా = ఓ – జనక యీ జనుల క్షమించు – మనుచు వేఁడెనా ॥మనస॥

9. తాళలేని బాధ లెచ్చి – దాహ మాయెనా – న – న్నేలువానికి – నా – పాలి స్వామికి = నే – నేల పాపములను జేసి – హింస పరచితి ॥మనస॥

10. గోడు బుచ్చి సిలువపైన – నేడు మారులు – మా – ట్లాడి ప్రేమ తో – నా – నాఁడు శిరమును = వంచి – నేఁడు ముగిసె సర్వ మనుచు – వీడె బ్రాణము ॥మనస॥

11. మరణమైన ప్రభుని జూచి – ధరణి వణఁకెనా – బల్ – గిరులు బగిలెనా – గుడి – తెరయుఁ – జీలెనా = దివా – కరుఁడు చీఁక టాయె మృతులు – తిరిగి లేచిరి ॥మనస॥

12. ఇంత జాలి యింత ప్రేమ – యింత శాంతమా – నీ – యంతఃకరుణను – నేఁ– జింత చేయఁగా = నీ – వింత లెల్ల నిత్య జీవ – విధము లాయెనా ॥మనస॥

– మిక్కిలి నమూయేలు



## 181 క్రీస్తుని శ్రమల ధ్యానము

రా – కాంభోజి తా – రూపకము

రాజులకు రాజైన యీ – మన విభుని – పూజసేయుటకు రండి = యీ జయశాలి కన్న – మన కింక – రాజెవ్వరును లేరని ॥రాజులకు॥

1. కరుణగల సోదరుండై – యీయన – ధరణి కేతెంచె నయ్యా = తిరముగా నమ్ముకొనిన – మన కొసఁగుఁ – బరలోక రాజ్యమ్మును ॥రాజులకు॥

2. నక్కలకు బొరియ లుండె – నాకాశ – పక్షులకు గూళ్లుండెను = ఒక్కింత స్థలమైనను – మన విభుని – కెక్కడ లేకుండెను ॥రాజులకు॥

3. అపహాసములు సేయుచు – నాయన – యాననము పై నుమియుచుఁ = గృప మాలిన సైనికు – లందరును – నెపము లెంచుచుఁ గొట్టిరి ॥రాజులకు॥

4. కరమునం దొక్క రెల్లు – పుడకను – దిరముగా నునిచి వారల్ = ధరణీపతి శ్రేష్ఠుడా – నీకిపుడు – దండ మనుచును – మ్రొక్కిరి ॥రాజులకు॥

5. ఇట్టి శ్రమలను బొందిన – రక్షకునిఁ – బట్టుదలతో నమ్మిన = అట్టహాసముతోడను – బరలోక – పట్టణంబున జేర్చును ॥రాజులకు॥

6. శక్తిగల రక్షకుండై – మన కొరకు – ముక్తి సిద్ధముఁ జేసెను = భక్తితోఁ బ్రార్థించిన – మనకొసగు – రక్తితో నాముక్తిని ॥రాజులకు॥

7. త్వరపడి రండి రండి – యీ పరమ – గురుని యొద్దకు మీరలు = దరికిఁ జేరిన వారిని – యీ ప్రభువు – దరుమఁ డెన్నడు దూరము ॥రాజులకు॥

– ఎన్. జేమ్సు

## 182 సిలువలోని దైవ ప్రేమ

రా – ముఖారి తా – త్రిపుట

ఎంతో దుఃఖముఁ బొందితివా – నాకొర కెంతో – దుఃఖము పొంది తివా = యెంతో దుఃఖము నీకు – ఎంతో చింతయు నీకు – ఎంతో దిగులయ్యా నాకు – ఆ – పొంతి పిలాతు యూ – దులు నీకుఁ బెట్టిన – శ్రమలను దలపోయఁగా ॥నెంతో॥

1. వచ్చిరి యూదులు – ముచ్చట లాడుచు – నెచ్చట వాఁడనుచు = నిన్ను – మచ్చరముతో వారి – యిచ్చ వచ్చినట్లు – కొట్టి దూషించినారా ॥యెంతో॥

2. సుందరమగు దేహ – మందున దెబ్బలు – గ్రంధులు గట్టినవా = నీవు – పొందిన బాధ నా – డెందము తలఁపనా – నందములే దాయెను ॥ఎంతో॥

3. కొట్టుకొట్టుమని – తిట్టికేల్ దట్టిని – న్నట్టిట్టు నెట్టుచును = వారు – పెట్టుశ్రమలు తుద – మట్టున కోర్చియుఁ – బెట్టితివా ప్రాణము ॥నెంతో॥

4. నెపముఁ బెట్టుచుఁ దిట్టి – యపహసించుచు యూద – చపలులు గొట్టి నారా = నా – యపరాధములకు నా – పదలను బొంది నీ – కృప నాకుఁ జూపినావా ॥యెంతో॥

5. చక్కని నా యేసు – మిక్కిలి బాధ నీ – కెక్కువ గలిగె నయ్యా = ఆహా – యొక్క దుష్టుఁడీటె – ప్రక్కను గ్రుచ్చి తన – యక్కస దీర్చుకొనెనా॥యెంతో॥

6. అన్నదమ్ములైన – అక్క సెల్లెం డ్రైనఁ – కన్న పిత్రాదు లైన = నన్ను – ఎన్నఁ డైనఁ బ్రేమించలే రైరి నా – యన్నా ప్రేమించినావా ॥యెంతో॥

– బూదాల లైమన్

## 183 క్రీస్తుని సిలువ

రా – ముఖారి (చాయః ఎంతో దుఃఖము బొందితివా) తా – త్రిపుట

సిలువను మోసితివా – నా కొఱకై – కలువరి మెట్టపైకి = సిలువ నా యాత్మలోఁ – బలుమాఱు దలఁపఁగాఁ – దాలిమి లేదాయెను – హా యీ – జాలికి మారుగా – నేనేమి సేయుదు – ప్రేమను మరువఁజాల ॥సిలువ॥

1. ఘోరమైనట్టి యీ – భారమైన సిలువ – ధరియించి భుజముపైని = నా – దురితముల్ బాపను – కరుణచేఁ జనుదెంచి – మరణము నొందితివా ॥సిలువ॥

2. కలువరి మెట్టపైఁ – కాలు సేతు లెల్ల – చీలలతోఁ గ్రుచ్చిపట్టి = యా – సిలువకుఁ గొట్టఁగ – విలువైన నీ మేని – రక్తము ప్రవహించెనా ॥సిలువ॥

3. మెట్టపైన నిన్నుఁ – పెట్టిన బాధ నేఁ – బట్టి తలంపఁగను = ఆహా పట్టైన నీ ప్రేమ – నెట్టుల మఱతును – కష్టముల్ గలిగినను ॥సిలువ॥



4. పంచగాయములను – నెంచి యాత్మలోన – నుంచి తలంపఁగను = హానా – మించిన దురితముల్ – ద్రుంచి నన్నెంచిర – క్షింపవచ్చెను భూమికి ॥సిలువ॥

## 184 ఆశ్చర్యకరమైన సిలువ

రా – పున్నాగ తోడి (చాయః ఎంతో సుందరమైనవి) తా – త్రిపుట

ఏమాశ్చర్యము ప్రియులారా – క్రీస్తు మరణము – ప్రేమజూడరెమనసార = ఆ మహాత్ముఁడు మరణ – మగు రీతిఁ గనుకొన్న – సామాన్యమగు నొక్క – జనుని చందము గాదు = ఈ మహిని గల పాప జీవుల – పై మహాకృపఁ జూపి నిత్య – క్షేమ మొసఁగెడు కొరకు బలు శ్రమ – చే మృతుండైనాఁడు స్వేచ్ఛను ॥ఏమాశ్చర్యము॥

1. కొండవలె భారమై – లోక పాపములు – దండింపఁబడె ఘోరమై = నిండు భారము క్రింద – నిలుచున్న వేళను – గుండె దిగులునఁ దనువు – నిండె రక్తపుఁ జెమట = మెండుకొని దుఃఖములతో నా – తండ్రి యీ పాత్రమును నా కడ – నుండి తొలగించుటకు మనపై – యుండినను జేయమని వేఁడెను ॥ఏమాశ్చర్యము॥

2. కడు దుర్మార్గులచేతను – క్రీస్తుఁడు పట్టు – వడె దానంతట తాను = చెడుగు లెందరు నింద – జేసి మోముపై [1]నుమిసి – వడిముళ్లతో నల్లఁ – బడిన కిరీటము = [2]తడయ [3]కొదల బెట్టి కరముల – నడుగులను సిలువ నిడి మేకులు – [4]దొడిపి ప్రక్కను రక్తజలములు – [5]దొరగ [6]గుంతము గ్రుచ్చి రహహా ॥ఏమాశ్చర్యము॥

3. ఇరు పార్శ్వముల నిద్దరి – దొంగల నునిచి – మరణావస్థలఁ బెట్టిరి = నిరపరాధి ప్రభువు – దురితాత్ము లొనరించు – తరుచు బాధల కోర్చి – మరి వారిఁ గరుణించి = యెరుఁగ రేమి యొనర్తురో యీ – దురిత జీవులు వీరి నోహో – పరమ [8]జనక క్షమించు మని తన – [9]యరుల కొరకై వేఁడు కొనియెను ॥ఏమాశ్చర్యము॥

– పురుషోత్తము చౌధరి

[1]ఉమ్మివేసి. [2]ఆలస్యముచేయక. [3]తలమీఁద. [4]గ్రుచ్చి. [5]దొర్లునట్లు. [6]ఈటె. [7]ప్రక్కల. [8]తండ్రీ. [9]శత్రువులు.

## 185 సిలువ

రా – ఆనందభైరవి (చాయ: వచ్చి గాబ్రియేలు) తా – త్రిపుట

అపు దర్చకాదు లుప్పొంగిరి – ప్రభుని – విపరీతముగఁ జంపసాగిరి = కృపమాలినట్టి పా – పపు జిత్తమున నిష్ఠు – రపు సిల్వమానిపైఁ – బ్రభుని వేయుట కొప్పి ॥రపు దర్చ॥

1. యెరూషలేమను నూరి బైటను – దుఃఖ – కరమైన కల్వరిమెట్టను = పరమ సాధుని సిల్వ – పైఁ బెట్టి తత్పాద – కరమధ్యముల మేకు – లరుదుగ దిగఁ గొట్టి ॥రపు దర్చ॥
2. చిమ్మె నిమ్మగు మేని రక్తము – దాని – నమ్ము వారల కెంతో యుక్తము = నెమ్మోము వాడి కెం – దమ్మి పూవలె మస్త –కమ్ము వేటులను ర – క్తము జారి కనుపట్టె ॥నపు దర్చ॥
3. గడి దొంగ లిరువురుని బట్టిరి – ప్రభుని – కుడి యెడమలను సిల్వఁ గొట్టిరి = చెడుగు యూదులు బెట్టు – కడు బాధలను మరియ – కొడు కోర్చుకొని వారి – యెడ దయ విడఁడయ్యె ॥నపు దర్చ॥

– పురుషోత్తము చౌధరి

## 186 సిలువపై క్రీస్తుని ప్రేమ

రా – నాధనామ క్రియ తా – కురుజంపె

ఏ పాప మెఱుఁగని – యోపావన మూర్తి – పాప విమోచకుండ = నా పాలి దైవమా – నా పాపముల కొఱ – కీ పాట్లు నొందినావా ॥యే పాప॥

1. ముళ్లతోఁ గిరీట – మల్లి నీ శిరముపై – జల్లాటమున మొత్తిరా = ముళ్లపోట్లకు శిరము – తల్లడిల్లగ సొమ్మ – సిల్లిపోతివ రక్షకా ॥యే పాప॥
2. కలువరి గిరి దనుక – సిలువ మోయలేక – కలవరము నొందినావా = సిలువ నీతో మోయఁ – తులువలు వేతొకనిఁ – దోడుగా నిచ్చినారా ॥యే పాప॥
3. చెడుగు యూదులు బెట్టు – పడరాని పాట్లకు – సుడివడి నడచినావా = కడకుఁ కల్వరి గిరి – కడ కేగి సిల్వను – గ్రక్కున దించినావా ॥యే పాప॥



4. ఆ కాల కర్ములు – భీకరంబుగ నిన్ను ఆ కొయ్యపై నుంచిరా = నీ కాలు సేతులు – ఆ కొయ్యకే నూది – మేకులతో గ్రుచ్చినారా ॥యే పాప॥
5. పలువిధంబుల శ్రమలు – చెలరేగఁ దండ్రికి – నెలుగెత్తి మొఱలిడితివా = సిలువపైఁ బలుమాఱు – కలుగుచుండెడి బాధ – వలన దాహము నాయెనా ॥యే పాప॥
6. బల్లిదుండగు బంటు – బల్లెమున నీ ప్రక్క ఁ – జిల్లిఁ బడఁ బొడిచి నాఁడా = ఉల్లోలములవలె – నల్ల నీరుబుకంగఁ – జల్లారెఁగద కోపము ॥యే పాప॥
7. కటకటా పాప సం – కటముఁ బాపుట కింత – పటుబాధ నొంది నావా = ఎటువంటి దీ ప్రేమ – యెటువంటి దీ శాంత – మెటుల వర్ణింతు స్వామి ॥యే పాప॥

– యర్మణశెట్టి దావీదు

## 187 క్రీస్తుని యద్భుత ప్రేమ

రా – సౌరాష్ట్ర తా – ఆది

పాపులయెడ క్రీ – స్తుని ప్రియ మెట్టిదో – పరికింపరె క – ల్వరిగిరిపై = నాపదలను దన – కీగతిఁ బెట్టెడు – కాపురుషుల దెసఁ గనుగొను కృపతోఁ ॥బాపుల॥

1. యెరుషలేము క – న్యలు కొందరు తన – యెదుట వచ్చి యేడ్చుచు నిలువన్ = వరుస నప్పురికి – వచ్చు నాశన గతు – లెరుఁగఁ బలికి వా – రల నోదార్చెను ॥బాపుల॥
2. శత్రువు లటు తనుఁ – జంపుచు నుండఁగ – మైత్రిఁ జూపె సమ్మతి తోడన్ = స్తోత్రముఁ జేసెను – దండ్రీ వీరల – దురిత మెల్ల క్షమి – యింపవె యనుచును ॥బాపుల॥
3. తన ప్రక్కను సిలు – వను వేసిన యొక – తస్కరుఁ డించుక వేఁడు కొనన్ = కనికరము మన – మునఁ బెనగొన ని – చ్చెను మోక్షము తన – తో యుండుటగున్ ॥బాపుల॥

4. మితిలేని దురిత = జీవుల లోపల - మించి యున్న పతితుల కైనన్ = హితముగ మోక్షం = బిచ్చుటకై శో - ణిత మిచ్చెను నా - మతి కది సాక్షిగఁ ॥బాపుల॥

- పురుషోత్తము చౌధరి

## 188 సిలువ ధ్యానము

రా - ముఖారి తా - త్రిపుట

చూడరే క్రీస్తుని జూడరే - నా సఖులార - చూడరే క్రీస్తుని జూడరే = చూడరే నాముక్తి పదవికి - ఱేఁడు యేదశఁ గూడినాఁడో ॥చూడరే॥

1. మించి పొంతి పిలాతు సత్య మొ - కించుకైనఁ దలంప కక్కట - వంచనను గొట్టించి యూదుల - మంచితనమే కోరి యప్ప - గించెనా - మేలు గ - ణించెనా = ఇతనిఁ గాంచి కాంచి భక్తులెట్లు స - హించిరో పరికించి మీరిది ॥చూడరే॥

2. మంటికిని నాకాశమునకును - మధ్యమున వ్రేలాడుచుండఁగ - నంటఁ గొట్టఁగ సిలువ మ్రాని - కప్పగించుటకొరకు నిన్నుఁ - గాంచెనా - యిది మది - నెంచెనా = హో నా - కంట నే నిటువంటి యాపదఁ - గంటిఁ బ్రాణము లుండునే యిఁకఁ ॥జూడరే॥

3. ఊటగా రక్తంబు కారుచు - నుండ బల్లెపుఁ బ్రక్కపోటు - మాటిమాటికిఁ జూడ దుఃఖము - మరలునే తలమీఁద ముళ్లకి - రీటమా - యితనికి - వాటమా = యూదులు - మోటులై బాహాటమున నీ - పాటులను గాటముగఁ జేసిరి ॥చూడరే॥

- పురుషోత్తమ చౌధరి

## 189 గాయపర్చఁబడిన పరిశుద్ధ శిరస్సు

రా - ముఖారి (చాయ: చూడరే క్రీస్తుని) తా - త్రిపుట

వందనం నీకే వందనం - పరిశుద్ధ శిరమా - వందనం - నీకే - వందనం = వందనం బొనరింతు నీ దౌ - నందమగు ఘన నామమునకె ॥వందనం॥

1. సుందరుఁడ నీ శిరసు హేళనఁ - బొందె ముండ్ల కిరీట ముంచగ - నెందుఁ జూచిన రక్త బిందులు - చిందుచుండెడి గాయములతో - గ్రందెనా - మోము - కుందెనా = యిఁక నే - నెందుఁ బోవక నిన్నుఁ గొలిచెద - నందముగ మహిమ ప్రభావా ॥వందనం॥

2. భీకరుఁడ నీ యెదుట సర్వ - లోకములు వణికెడు ఘనముఖ - మే కరణి నుమి వేయఁబడియె వి - కార రూపము నొందికందెను - శ్రీకరా - శ్రీ శు - భాకరా = నే నీ ముఖ ప్రకాశము పాడుజేసితి - నో కరుణ భాస్కర క్షమించుము ॥వందనం॥

3. మించు నీ ముఖ లక్షణము లహ - మంచి పెదవుల రంగుఁ జూడఁగఁ - గొంచెమైనను గనుపడక కృ - శించి దౌడలు క్రుంగిపోవుట - నెంచఁగా నాలో - చించఁగా = ఆ నీ - యంచితపు బల శౌర్యములు హ - రించి పోయెను మరణ బలమున ॥వందనం॥

4. సిలువ యెదుటను నిపుడు నేనిఁక - నిలిచి నినుఁ బ్రార్థింతుఁ బ్రభువా - ఖలుఁడ నని ననుఁ ద్రోయకుము నే - నలసి సొలసిన నిన్ను విడువక - పిలిచెద - నిన్నేఁ - గొలిచెద = నీ తల - బలిమి చావున వాల్చగను నా - యేసు నినుఁ జేతులతో నాపెద ॥వందనం॥

5. నిన్ను నేఁ గొనియాడుటకు నిపు - డున్న భాషలు చాల విఁక ని - న్నెటుల నే నుతియింతునో హో - సన్న రక్షక ప్రోవు న న్నెడ బాయకు - ఖిన్నునిఁ - జేయకు = నా కొర - కిన్ని బాధల నొందితివి నా - యన్న నా జీవంబు నీదే ॥వందనం॥

6. మరణ దినమున భయము పడి నీ - కొర కెదురు జూడంగఁ గృపతో - వరబలుండా నా విరోధుని - కరకు శరములఁ ద్రుంచ రావె - శూరుఁడా - దేవకు - మారుఁడా = అటు నీ - మరణ రూపము సిలువపై నా - తరుణమునఁ జూపుము యెహోవా ॥వందనం॥

- రావూరి దావీదు

## 190 క్రీస్తు మరణము

రా - హిందుస్థాని తోడి తా - త్రిపుట

ఆహా యెంతటి శ్రమలఁ బొందితి - వయ్యో - దాహ మాయెను నీకు సిల్వపై = ద్రోహు లందరు గూడి రయ్యయ్యో - నీదు - దేహంబు బాధించి రయ్యయ్యో ॥యాహా॥

1. దుష్కర్ములకు నప్పగించెనా – యూద – యిస్కరి యోతనెడి శిష్యుడు = తస్కరించినవాని భంగిన నిన్ను – నిష్కారణముగాను బట్టిరా ॥ఆహా॥
2. కలుషాత్ములందరు గూడిరా – నిన్ను – బలువిధంబుల హింసబెట్టిరా = తలపై ముళ్ల కిరీటముంచి యా – సిలువ నీతోనే మోయించిరా ॥ఆహా॥
3. కాలుసేతులయందు వారలు – ఇనుప – చీలల దిగగొట్టిరయ్యయ్యో = జాలి – సుమంతైన జూపక – వారు – గేలిజేయుచు బాధపెట్టిరా ॥ఆహా॥
4. బాధ తగ్గింపరాణువవారలు – నీకు చేదు ద్రాక్షారసము నివ్వగా = నీదు మనస్సు దానినొల్లక గొప్ప – వేదనలను భరియించెనే ॥ఆహా॥

– కొత్తపల్లి జాన్

## 191 సిలువ ధ్యానము

రా – శోకవవళి తా – ఆది

ఎంతో వింత యెంతో చింత – యేసునాథు మరణ మంత = పంతము తోc జేసి రంత – సొంత ప్రజలు స్వామి నంత ॥ఎంతో॥

1. పట్టి కట్టి నెట్టి కొట్టి – తిట్టి రేసు నాథు నకటా = అట్టి శ్రమల నొంది పలుకc – డాయె యేసు స్వామి నాcడు ॥ఎంతో॥
2. మొయ్యలేని ప్రాను నొకటి – మోపి రేసు వీపుపైని = మొయ్యలేక ప్రానితోడ – మూర్ఛcబోయె నేసు తండ్రి ॥యెంతో॥
3. కొయ్యపై నేసయ్యన్ బెట్టి – కాలుసేతులలోc జీలల్ = కఠిను లంత గూడి కొట్టిరి – ఘోరముగc క్రీస్తేసున్ బట్టి ॥యెంతో॥
4. దాహముగొనc జేదు చిరకc – ద్రావ నిడిరి ద్రోహు లకటా = ధాత్రిc ప్రజల బాధ కోర్చి – ధన్యుcడా దివి కేగె నహహా ॥యెంతో॥
5. బల్లెముతోc బ్రక్కన్ బొడవన్ – పారె నీరు రక్త మహహా = ఏరై పారె యేసు రక్త – మెల్ల ప్రజల కెలమి నొసcగు ॥నెంతో॥



## 192 క్రీస్తు మరణ శ్రమల ధ్యానము

రా – ముఖారి (చాయ: ఎంతో దుఃఖము) తా – అట

ఐదు గాయము లొందినావా – నాకొరక! కైదు – గాయము లొంది నావా = ఐదు గాయముల నా – యాత్మc దలంప నా కారాట మెచ్చినదే – నీ – మైదీగె నావంటి – మర్త్యుల పాల్జేసి – మరణ మొందితివి గదే ॥ఐదు॥

1. గార మైన నీ శ – రీర రక్త మిలను – ధారయై కారినదా – నా = నేరమా యయ్యది – భారమై నీ పైని – ఘోరమై యొరిగినదా ॥ఐదు॥
2. అందమౌ నీ తనువు – కంది రక్త స్వేద – బిందువులై రాలెనే – యీ = చంద మూహింప నా – డెందమ్ము భీతిచేc – గొందలమై తూలెనే ॥ఐదు॥
3. ఎల్ల పాపము మోయు – అల్ల దేవుని గొఱ్ఱె – పిల్లవు నీవేగదా – నా = వల్లనా నీ కింత – యల్లాట పుట్టెనే – చెల్ల తాళునె నా యెద ॥ఐదు॥
4. భంగమౌనట్టి దు – ష్పాపులc గావ నీ – ప్రాణ మర్పించితివా – యీ = సంగతిc జూడ నీ – సాహస మింక నే – భంగి నీ జగతి మరవ ॥నైదు॥
5. ఆయాసమైన నీ – యాపదలెల్ల నే – నాలోచింపcగ నాత్మలో – నెడ = బాయక తద్దివ్య – పాదసరోజముల్ – భాసిల్లు నా యాత్మలో ॥నైదు॥
6. తల్లికైన మరి – తండ్రి కైన నన్న – దమ్ముల కైన లేదే – కన్న = పిల్లలకైన నీ – ప్రేమc పోల్చుద – మన్నc – బృథివిలోc గానరాదే ॥ఐదు॥
7. ఈ ప్రీతి నీ యోర్మి – నీ మహాత్మ్యం బిల – నెవ్వ రూహింతు రొగి – నో = హో ప్రభువా తద్ద – యోత్కట గాంభీర్య – మూహింప నీకే తగు ॥నైదు॥

– బేతాళ్ జాన్

## 193 సిలువమీcది క్రీస్తు

రా – హిందుస్థాని కాపి తా – త్రిపుట

చూడరే సిలువను వ్రే – లాడు యేసయ్యను = పాడు లోకంబునకై – గోడు జెందెc గదా ॥చూడరే॥

1. నా చేతలు చేసినట్టి – దోషంబులే గదా = నా రాజు చేతులలో ఘోరంపు జీలలు ॥చూడరే॥

2. దురితంపు దలంపులే – పరమగురిని శిరముపై = నెనరు లేక మొత్తెనయ్యో – ముండ్ల కిరీటమై ॥చూడరే॥

3. పరుగెత్తి పాదములు – చేసిన పాపంబులు = పరమ రక్షకుని – పాదములలో మేకులు ॥చూడరే॥

4. పాపేచ్ఛ తోడఁ గూడు – నాదు చెడ్డ పడకలే = పరమగురుని ప్రక్కలోని – బల్లెంపు పోటులు ॥చూడరే॥

– ఒంగోలు అబ్రహాము

## 194 యేసు పై మనదోషము మోపబడెను

రా – సావేరి (చాయ: ఎందుకే నా డెందమా) తా – ఆది

యేసునాథుని సిలువపైని – వేసి శ్రమఁబొందించినది నా – దోసమే – దుస్సహ – వాసమే ॥యేసు॥

1. [1]కంటక కిరీట [2]మౌదల – నంటగొట్టించినది నాచెడు – తలఁపులే – పాపపు పలుకులే ॥యేసు॥

2. మృదుకరంబుల మేకులందింపి – నదితలఁప నా హస్తకృత కా – ర్యంబులే దుష్క – ర్మంబులే ॥యేసు॥

3. పాదయుగమున నాటిచీలలు – బాధ నొందించినది నా చెడు – నడకలే – దోసపు – పడకలే ॥యేసు॥

4. దాహముం గొనఁజేదు చిరకను – ద్రావదలఁచినది మధుపానా – సక్తియే – యందను – రక్తియే ॥యేసు॥

5. హెచ్చుగ లోహిత పతనముగఁ – గ్రుచ్చిన కుంతంబు నా పా – పేచ్ఛలే – హృదయదు – రేచ్ఛలే ॥యేసు॥

[1]ముండ్ల. [2]తల



6. పావనగాత్రంబు క్షతమయ – మై వెతలపాల్జేసినది నా – దేహమే – యఘ సం – దోహమే ॥యేసు॥

7. దీనిఁగని నా మానసాబ్జము – లోని కలుషము దూరపర్చక – నడుతునా – ధారుణిఁ – గడుతు నా ॥యేసు॥

– జుటిక దావీదు

## 195 క్రీస్తు శ్రమల ధ్యానము

రా – ముఖారి (చాయ: పాపము దలచు సుమీ) తా – ఆది

ఎన్నఁడు గాంచెదమో – యేసుని – నెన్నఁడు గాంచెదమో = యెన్నఁడు జూతుము – కన్నె కుమారుని – సన్నుతి జేయుచును ॥నెన్నఁడు॥

1. అంధుల గాచె నఁట – యెహోవా – నందనుఁ డితఁడౌనట = పొందుగఁ బాపాత్ములకొర – కై తన – ప్రాణము విడిచెనఁట ॥యెన్నఁడు॥

2. వేసిరి సిలువనఁట – క్రీస్తుని – జేసిరి హేళనఁట = దాసిరి యూదులఁట – బల్లెము – దూసిరి ప్రక్కనఁట ॥యెన్నఁడు॥

3. చిందెను రక్తమఁట – పరమ – సంధులు దెల్పెనఁట = నిందల కోర్చె నఁట – మన దగు – నేరము గాచెనఁట ॥యెన్నఁడు॥

4. ఆపద కోర్చెనఁట – పాపపు – మోపులు మోసెనఁట = కోపము మాన్పెనఁట – యెహోవా – కొడుకై వెలసెనఁట ॥యెన్నఁడు॥

5. అక్షయుఁ డితఁడెనఁట – జగతికి – రక్షకుఁ డాయెనఁట = దీక్షగ నమ్మిన నరులం – దరికి ని – రీక్షణ దేవుఁడఁట ॥యెన్నఁడు॥

– గొల్లపల్లి నతానియేలు

## 196 క్రీస్తు సిలువమీఁద పల్కిన యేడు మాటలు

రా – హిందుస్థాని కాపి తా – రూపకము

ఆహా మహాత్మ హా శరణ్యా – హా విమోచకా = ద్రోహ రహిత చంపె నిను నా – దోషమేగదా ॥యాహా॥

1. "వీరలను క్షమించు తండ్రి – నేర రేమియున్" = కోరి తిటులు నిన్నుఁ జంపు – క్రూరజనులకై ॥యాహా॥

2. "నీవు నాతోఁ బరదైసున – నేఁడె యుందువు" = పావనుండ యిట్లుఁ బలికి – పాపిఁ గాచితి ॥వాహా॥

3. "అమ్మా! నీ సుతుఁడ" టంచు మరి – యమ్మతోఁ బలికి = క్రమ్మర "నీ జనని" యంచుఁ – గర్త నుడివితి ॥వాహా॥

4. "నా దేవ దేవ యేమి విడ – నాడితి" వనుచు = శ్రీదేవ సుత పలికితివి శ్రమ – చెప్పశక్యమా ॥యాహా॥

5. "దప్పికొనుచున్నా న" టంచుఁ – జెప్పితివి గద = యిప్పగిదిని బాధ నొంద – నేమి నీకు హా! ॥యాహా॥

6. శ్రమ ప్రమాదములను గొప్ప – శబ్ద మెత్తి హా = "సమాప్తమైన" దంచుఁ దెలిపి – సమసితివి గదా ॥యాహా॥

7. "అప్పగింతుఁ దండ్రి నీకు – నాత్మ" నంచును = గొప్ప యార్భాటంబు చేసి – కూలిపోతివా ॥యాహా॥

– పంతగాని పరదేశి

## 197 సిలువ ధ్యానము

రా – నాధనామక్రియ తా – ఆది

అయ్యో నాదగు ఘోరపాపము గదా – భారమై నీపై నొరిగె = నెయ్యము వీడి మెస్సీయ్య నిన్ సిలువ – కొయ్యపైని గొరత కప్పగించిన ॥దయ్యో॥

1. నిరతము దూతానీక మూడిగము – నెరపుచుండఁ దండ్రి పజ్జనుండియు = నిరుపమాన సౌఖ్యములఁ దేలు నినుఁ – బరమునుండి క్రిందికి దిగలాగిన ॥దయ్యో॥

2. కోరి నిన్నుఁ గడుపారఁ గనియుఁ గను – లారఁ చూచుకొన నేరనట్టి యల = మేరి గర్భమున దూయఁబడిన కడు – ఘోరమైన ఖడ్గంబు నిజముగ ॥నయ్యో॥



3. మొయ్యరాని పెనుకొయ్య నొందు నీ – మూపుపైన భారముగ మోపి = రయ్యయ్యో యింత బాధ సల్పినది యూ – దయ్య వాసులెంత మాత్రమునుగా ॥రయ్యో॥

4. కోలలచే నెన్నెన్నొ పెట్లు పెను – గోలగాక యెన్నెన్నొ తిట్లు కృప = మాలి నీదు వదనమ్ముపై నుమియ –నేల నింత కోపంబురాదు నిజ ॥మయ్యో॥

5. ముండ్లతోడ మకుట మొక్క టల్లి కడు – మూర్ఖత నీ తలపైనిఁ బెట్టి నీ = కండ్ల కొక్క గంతఁ గడ – గండు పెట్టఁ గారణము నిజముగా ॥నయ్యో॥

6. ఈవు ప్రాణమును నీవిగ నొసఁగ – నీటెతోడఁ బ్రక్కను బొడుచుట హా = భావమందుఁ దలపోసి చూడ నల – బంటు గాదు బల్లెంబు గాదు నిజ ॥మయ్యో॥

– యెద్దు దానియేలు

## 198 సిలువ బలము

రా – కురంజి తా – ఆది

సిలువే నా శరణాయెను రా – నీ – సిలువే నా శర ణాయెను రా = సిలువ యందే ముక్తి బలముఁ – జూచితి రా ॥నీ సిలువే॥

1. సిలువను వ్రాలి యేసు – పలికిన పలుకు లందు = విలువలేని ప్రేమామృతముఁ గ్రోలితి రా ॥నీ సిలువే॥

2. సిలువను జూచుకొలఁది – శిలసమానమైన మనసు = నలిగి కరిగి నీరగుచున్నది రా ॥నీ సిలువే॥

3. సిలువను దరచి తరచితి – విలువ కందఁగ రాని నీ కృప = కలుష మెల్లను బాపఁగఁ జాలును రా ॥నీ సిలువే॥

4. పలు విధ పథము లరసి – ఫలిత మేమి గానలేక = సిలువయెదుటను నిలచినాఁడను రా ॥నీ సిలువే॥

5. శరణు యేసు శరణు శరణు – శరణు శరణు నా ప్రభువా = దురిత దూరుఁడ నీ దరిఁ జేరితి రా ॥నీ సిలువే॥

– చెట్టి భానుమూర్తి

## 199 క్రీస్తు సిలువయే మన మహిమ

రా – ఆనందభైరవి (చాయ: నాకై చీలిన యుగ) తా – కురుజంపె

సిరులెల్ల వృథ కాఁగఁ – [1]పరికించి నాకున్న – గురువముఁ దిరస్కరింతున్ = [2]వెర మహిమ రారాజు – మరణాద్భుతపు సిలువ – [3]నరయుచున్నట్టి వేళన్ – ముఖ్యము లైన ॥సిరు లెల్ల॥

1. ఓ కర్త నా దేవుఁ – డౌ క్రీస్తు మృతియందుఁ – గాక మరి [4]మురియ నీయకు = [5]ప్రాకట [6]భ్రమకారి – వ్యర్థ వస్తువులను – ప్రభుని రక్తంబు కొరకై – త్యజించెదను ॥సిరు లెల్ల॥

2. చారు మస్తక హస్త – పాదములవలన వి – చారంబు దయయుఁ గలసి = సారెఁ బ్రవహించుచున్నది చూడు మెపుడిట్టి – దారి గలదా ముళ్లు – తగు కిరీటం బౌన ॥సిరు లెల్ల॥

3. వాని నిజ రక్తంబు – వస్త్రంబువలె సిలువ – పై నతని తనువు గప్పె = ఐననేనీ లోక – మంతటికి మృతుఁడనై – తిని నా కీ లోకము – మృతంబయ్యె ॥సిరు లెల్ల॥

*– విలియం డాసన్*

## 200 స్త్రీలు సిలువచెంత ధ్యానించుట

రా – సారంగ (చాయ: వచ్చి గాబ్రియేలు) తా – త్రిపుట

చేడియలు గుంపుగూడిరి – క్రీస్తు – జాడఁ గని[7]తాల్మి నీడిరి = [8]ఆడికలనోర్చి నేఁడు మన పాఁలి – వాఁడుసిలువ ను – న్నాడు గదె యంచు ॥చేడియలు॥

1. వారి మొగములు వాడెను – యేసు – వారి వెత లెల్ల జూడను = [9]నీరు [10]దృక్సర – సీరుహములందు – జార తమ కొన – గోరులను [11]మీటి ॥చేడియలు॥

---

[1]విచారించి. [2]ఆశ్చర్యమైన. [3]విచారించుచు. [4]అతిశయింపనియ్యకుము. [5]ప్రసిద్ధముగా. [6]మోసపుచ్చు. [7]ఓర్పు. [8]నిందలు. [9]కన్నీళ్లు. [10] కమలములవంటి కన్నులనుండి. [11]చిమ్మి.

2. రొమ్ములను జేతు లుంచుచు - [1]చింత - గ్రమ్మి [2]నిట్టూర్పు లిచ్చుచు = [3]కొమ్మలట [4]నిల్పు - బొమ్మలన [5]చేష్ట - లిమ్ముచెడి [6]యబ్బు - రమ్ముతో నిల్చి ॥చేడియలు॥

## 201 యేసు శాంతికరుడు

రా - శ్యామ (చాయ : శాంతము లేక) తా - ఆది

కలవరి మెట్టపై - కలవర మెట్టిదొ - [7]సిలువెటులోర్చితివో - పలుశ్రమ లొందినీ - ప్రాణము బెట్టితి ॥కల॥

1. తులువలుజేరినిన్ - తలపడి మొత్తిరో - అలసితి సొలసితి - నాత్మను గుందితి ॥కల॥
2. పాపులకొరకై - ప్రాణముబెట్టితి - ప్రేమ ది యెట్టిదో - నామదికందదు ॥కల॥
3. దారుణ పాప - భారము మోసితి - దీనుల - రక్షణ దానమైతివి గద ॥కల॥
4. జనకున భీష్టమున్ - జక్కగ దీర్చితి - జనముల బ్రోవనీ - జీవము నిచ్చితి ॥కల॥
5. శాంతిని గోరి ది - శాంతముల్దిరిగిన - భ్రాంతియె గాని వి - శ్రాంతెవరిత్తురు? ॥కల॥

- చెట్టి భానుమూర్తి

## 202 సిలువ ధ్యానము

రా - సురటి తా - ఆది

కల్వరి గిరిజేరు మనసా - సిల్వ సరస ॥కల్వరి॥

1. సిలువపైన జూడు మదేమి శ్రీ కరుడు ప్రభుయేసు స్వామి = తలను ముండ్ల కిరీటంబదేమి తరచి చూడుమీ ॥కల్వరి॥
2. పరులకుపకారంబు సల్ప - ధరను వెలసిన వరపాదముల = కఱకు మేకులు గొట్టెద రేల - కరుణాలవాల ॥కల్వరి॥

---

[1]దుఃఖముచేత నిండుకొని. [2]ఉస్సురనుచు. [3]స్త్రీలు [4]నిలువబెట్టిన [5]బొమ్మలవలె కదలమెదలక [6]ఆశ్చర్యముతో. [7]శ్రమలు.



3. కరముపట్టి దరిని జేర్చి - వరములిడి దీవించిన యా = కరుణగల చేతులలో చీల - గుచ్చెద రేల ॥కల్వరి॥
4. ప్రేమ, కృప, నిర్మలత్వమును - నీమమును గల మోముపైన = పామరులుమి వేసెదరేల - పాటించరేల ॥కల్వరి॥
5. ఘోర యాతనలును నీదు - క్రూరమరణము చూడ గుండె = నీరు నీరైపోవదె దేవ - క్రూరునికైన ॥కల్వరి॥
6. పాపమేమిచేసి యెరుగవు - పావన పరమదేవుడవు = ఓ పరాత్పర నీకేమి యింత - ఉత్కట బాధ ॥కల్వరి॥
7. స్వామి మాకై పూటపడను నీ - ప్రేమయే కారణము నిజము = భూమి యది గుర్తింపగ నిమ్ము - పూజ్యుండ దేవ ॥కల్వరి॥
8. పావనాత్మ నీవు జావ - పాపి కబ్బును నిత్యజీవ = మావచన సత్యంబు దెల్పుము - మానవాళికిన్ ॥కల్వరి॥
9. సిలువ దరికాకర్షించుము - ఖలుడను ఘోరపాపిని = కలుషములు విడ శక్తినీయుము - సిలువ ధ్యానమున ॥కల్వరి॥

- పంతగాని పరదేశి

## 203 సిలువమోయు యేసు

రా - ముఖారి (చాయ: కలుగును గాక) తా - చాఫ్

ఎందుఁబోయెదవో - హా ప్రభురాయ ఎందుఁబోయెదవో = ఎందుఁ బోయెదవయ్య - యీ దుర్మానవశ్రేణి - బొందఁదగిన భరంబుఁ బూని రక్షక నీవు ॥ఎందు॥

1. వడగాలిలోను - నీ నెమ్మోము - వాడికందఁగను - నొదలఁ జెమటయు నీరు - నొడిసివర దయ్యె పార - నడుగులు తడఁబడ - నయ్యా యిప్పుడు నీవు ॥ఎందు॥
2. మూఁపుపై సిలువ శత్రు స - మూహముల్ నడువఁ = కాపు ప్రచండమౌ కారెండ కాయఁగ - నేపున నా పాప - మీ పాటు పెట్టఁగ ॥ఎందు॥

3. విరువు గట్టివియో – జనుల రక్షించు – బిరుదలయ్యవియో = పరమ రక్షకుండా నా – పాపబంధము లవియో – పరిశోదించెడి వారి – పట్టుకొమ్మలవియో ॥ఎందు॥

4. ఆకాశమందు – దూతలు కొల్వ – నతితేజ మొందు = ప్రాకటమైన నీ సదముల్ పగులురాల – తాఁకునఁబగిలి ర – క్త ధారలొల్కఁగను ॥నెందు॥

5. పరమందుఁగల్గు – పరిమళముచేఁ – బసమించి వెల్గు = చిరమౌ దేహమునకు నా – యెరుష లేమను నట్టి – పురములోపలి మన్ను – పూత మయ్యెనా ప్రభువా ॥ఎందు॥

6. ఒక పాలివెతలా – రవ్వంతైన – సుకరమౌ స్థితులా = యకటా చెదరి గుండె – లదరి ఝుల్ ఝుల్మని – యొకటిఁ బొందక తాప – మొంది కుందునే కర్త ॥ఎందు॥

– రావూరి రంగయ్య

## 204 సిలువను జూడుఁడి

రా – బిళహరి (చాయ : మేలుకొనరే) తా – త్రిపుట

సిలువగనుఁడీ

సిలువలో వ్రేలాడు ప్రభువే – విలువ కందఁగ రాని యీవుల = నెలమి మనకై – కొనియెఁగల్వరి – నిపుడు సాష్టాంగము లొనర్చుచు ॥సిలువ॥

1. కొరత చావయినను మరణము – వఱకుఁదనుఁ దగ్గించుకొని మన = కొఱకు దాసుండగుచు రిక్తుని – కరణి నిట జీవము నొసంగెడు ॥సిలువ॥

2. తనను నమ్మినవారు చావక – యనిశ జీవమునొంది బతుకను = దన స్వపుత్రుని నిచ్చునంతఁగఁ – దండ్రి ప్రేమించెను జగంబును ॥సిలువ॥

3. పాప మెఱుగని వాని మనకై – పాపముఁగ నొనరించి దేవుఁడు = శాపగ్రస్తులలోన నొకఁడుగ – మా ప్రభుండెంచంగఁ బడియెను ॥సిలువ॥

4. లోకమాంస పిశాచులని యెడి – భీకారుల పొంగుఁ గృంగను = శ్రీ కరుఁడు మన దేవతనయుం – డౌ కృపానిధి దీనుడయ్యెను ॥సిలువ॥

5. ఘోరయుద్ధముఁ జేసివైరిని – గూలఁద్రోసిన తావిదే మన = పారమార్థిక బలము కిరువగు – ధీర శ్రేష్ఠుఁడు దిశలు ఘళ్లన ॥సిలువ॥
దేశ మిత్తు నని – శ్రీకరుం డెహోవా సెలవిచ్చెను ॥దశమ॥



6. శరణు గలదిఁక పాపకోటికి – స్వామి ద్రోహపు శత్రులకు సహ = కరుణ రుధిర కణాగతంబున – కలుష రహిత మనంత రక్షణ ॥సిలువ॥

7. మాకు ప్రేమ సారమయ్యెను – మాకు జీవనాధారమయ్యెను = మాకుఁ దృప్తి సునీరమయ్యెను – మాకుఁ బరమ విచారమయ్యెను ॥సిలువ॥

8. నమ్ముదము సైన్యముల ప్రభువును – చిమ్ముదము సందియము లాత్మను = క్రమ్ముదము మోక్షపురి బాట సు – ఖమ్ము మన హృదయమ్ము లొందను ॥సిలువ॥

– రావూరి రంగయ్య

## 205 సిలువ ధ్యానము

రా – ముఖారి తా – ఆది

ఏమి నేరంబులేక – యా మరణస్తంభము – నేల మోయ నాయెను – నా యేసు – ఎంత ఘోరము లాయెను = ఈ మానవులు యెరుషలేము బైటకు దీయ – నేమి నేరము దోచెను ॥ఏమి॥

1. మున్ను దీర్ఘదర్శు – లెన్నిన రీతిని – కన్నెకడుపున బుట్టిన – నా యేసు – వన్నె మీరంగ బెరిగిన = చెన్నైన నీ మేను – చెమట బుట్టంగ నీ – కిన్ని కడగండ్లాయెను ॥ఏమి॥

2. కన్నతల్లి యిట్టి – కడగండ్లు గాంచిన – కడుపేరీతినోర్చును – నా యేసు – గాంచనేలను గూలును = నిన్నెరిగి నట్టివారు – నీ పాట్లు గని యేడ్చు – చున్నారలీ వేళను ॥ఏమి॥

3. అయ్యయ్యో యూదు – లింత నెయ్యంబు దప్పిదైన – భయంబు విడిచి పూని – నా యేసు – మోయ శక్యంబు గాని = కొయ్యమూపు నెత్తి – రయ్య నీకెంత భార – మయ్య వెతజూడ జాలను ॥ఏమి॥

4. పిల్ల లాట్లాడినట్లు – ముల్లులతో కిరీట మల్లి నెత్తిన గొట్టిరి – నా యేసు – పల్లరుపు లధికమాడిరి = ఎల్లవారిలో నిన్ను – ఎగతాళి గావించి – మొగము మీ దెల్లనుమిసిరి ॥ఏమి॥

5. కొరడాలతో నిన్ను – గొట్టి కండ్లకు గంత – గట్టి చేజరిచి వేడ్కను – నా యేసు – అట్టి వారెవ్వరంచును = విరగ భావంబునడిగి – నెక్కిరించుచు నీ – వెంబడి వత్తురేలను ॥ఏమి॥

6. ఏలెడివారు నడువ – మ్రోలవస్త్రంబులను – నేల బరిచిన రీతిగా – నా యేసు – మ్రోలబరిచిరియట్లుగ = ఏల యీ కోడిగంబు – లేల నీమీద కంటు – ఏమి నేరంబు లేదుగ ॥ఏమి॥

7. చాల బాధించి క – పాల స్థలమునకు వచ్చి – నేల బాతిరి కొయ్యను – నా యేసు – జాలి రవ్వంత లేకను = కాలు సేతులినుప చీలలతో బిగించ – జిమ్మి రక్తంబు గారెను ॥ఏమి॥

8. నాదేవ నా దేవ – నన్నెందుకై విడిచి – నా వంచు మొరబెడితివి – నా యేసు – నమ్మితివి లోబడితివి = వేదనధికంబాయె – నే దిక్కులేనట్టు – యూదాళి కగుపడితివి ॥ఏమి॥

9. అంధకారము దేశ – మంతట గలిగెను – ఆవరించెను సూర్యుని – నా యేసు – ఆలయపు తెరచినిగెను = బంధ స్తంభమునుండి – బహు గొప్ప శబ్దముతో బిలిచెద వేమిట్లను ॥ఏమి॥

10. ఓ తండ్రి నీ చేతి – కొప్పగించుచున్నాను – ఒనరంగ నా యాత్మను – నా యేసు – అని ప్రాణమును వీడెను = ఏ తప్పిదంబు లేక – నీ పాటునొందితివి – ఎంతో వింతై నిలుచును ॥ఏమి॥

11. నీ చాత్మ డొకడు నిజ్జి – నీళ్లి బల్లెంబుతోడ – నీ ప్రక్క బొడిచె చావను – నా యేసు – నీరు నెత్తురు గారెను = ఏచియున్నట్టి కస్తి – కెట్లు నీ యొడలుసైచె – నెంతో చోద్యంబు చూడను ॥ఏమి॥

12. పాపాత్ములకు పూట – బడిన వల్లనే యింత – పరితాపమరణమాయెను – నా యేసు – ఎరిగే యనుభవించెను = నా పాప ఫలము నిన్ను – వేపాట్లు బెట్టి చంప – నోపితివయ్య ప్రేమను ॥ఏమి॥

13. ఎంత యమూల్యమైన – దెంతయనంతమైన – దెంతయగాధమైనది – నా యేసు – ఎంతో యుచితమైనది = ఎంతో వింతైన ప్రేమ – ఏహ్యులమైన మాకు – ఏల కనుపర్చబడ్డది ॥ఏమి॥

14. ప్రేమాతిశయుడనేను – ఏ మాత్రుడను నెన్న – నా మానసమున కందను – నా యేసు – ప్రేమ సారంబు తెలియను = పామరాళిని బ్రోచు – క్షేమాధికారి నిన్ను – యేమంచు వర్ణింతును ॥ఏమి॥

– బేతాళ జాన్



## 206 సిలువ శ్రమలు

రా – రేగుప్తి తా – అట

1. [1]కరుణసాగర వీవేకావా – మరణమొంద సిల్వ మెట్టకు మోసినావా = కరుణ సాగర వీవెకావ = మరియు కల్వరి మెట్టమీఁదను కడకు మేకులుఁ గొట్టబడి నీ – మరణరక్తము చేత నరులకు – పరమరక్షణఁ దెల్పినావా ॥కరుణ॥

2. నజరేతు పుర [2]విహారా – నరులఁ బ్రోవ [3]నరు దెంచినావా = నజరేతు పురవిహారా = ప్రజలపాపముఁ బరిహరించియు – ప్రజల [4]సద్గతి నొందఁ జేయను – విజయమునుఁ బొందితివి యిలలో – సజనులందరు భజనసేయఁ గ ॥నజరేతు॥

3. మరియయనే కన్యకుమారా – నరకబాధఁ దప్పించినావా = మరియయనే కన్యకుమారా = మార్గసత్యము జీవనములీ – మహిని నమ్మిన వారి కెల్లను – మీరెగాకిఁక వేరేలేరని – సారెసారెకుఁ జెప్పినావా ॥మరియయనే॥

4. మహిలోను మనుజకుమారా = యహో తండ్రిని వేడినావా = మహిలోను మనజకుమారా = యిహములోనిను నమ్మువారిని – బహు నీ కటాక్షంబుచేతను – మహిమజనకా గావుమనుచు – [5]త్రాహియని బ్రార్థించి నావా ॥మహిలోను॥

5. పరమతండ్రి ప్రియకుమారా – [6]పావనముజేయ మీరేకారా = పరమతండ్రి ప్రియకుమారా = పరముడా నీ పంచగాయము [7]లరయగా రక్తముతో నిండెను – ధరను మా పాపములుఁ – గడుగను – [8]చిరముగా ను[9] త్త రమునాయె ॥పరమతండ్రి॥

– గొల్లపల్లి నతానియేలు

## 207 సిలువ మరణము

రా – పంతువరాళి తా – అట

ఎంత గొప్ప బొబ్బ పుట్టెను – దానితో రక్షణ మంతయును సమాప్త మాయెను = ఎంత గొప్ప బొబ్బ పుట్టెను – యేసునకుఁ కల్వరి మెట్టను – సంతసముతో సిల్వఁ గొట్టఁగ – సూర్యుఁ దంధకారమాయెను ॥ఎంత॥

---

[1]ప్రేమయనే సముద్రము. [2]సంచరించినవాడా. [3]వచ్చినావా. [4]మంచిస్థితి. [5]కృప చూపించుము. [6]పరిశుద్ధులుగాజేయు. [7]చూడగా. [8]స్థిరముగా [9]ఆదర్శ మాయెను.

1. గలిబిలి గలిగె నొకప్పుడు – శిన్యారు బాబెలు కట్టడము కట్టునప్పుడు = పలుకు భాషయు నొక్క టైనను – పలువిధములగు భాషలాయెను – నలుదెసలకును జనులు పోయిరి – కలువరి పై కలిసికొనిరి ॥యెంత॥

2. పావనుండగు ప్రభువు మనకొరకై – యా సిలువమీఁద చావునొందెడు సమయమందున = దేవుఁడా నా దేవుఁడా నన్నేల చెయివిడిచితివి యనియా – రావముగ మొఱబెట్టెను యె – హోవయను దన తండ్రితోను ॥ఎంత॥

3. అందు దిమిరము క్రమ్ము గడియయ్యె – నా నీతి సూర్యుని నంత చుట్టెను బంధకంబులు = నిందవాయువు లెన్నో వీచెను – కందు యేసుని యావరించెను – పందెముగ నొక కాటువేసెను – పాత సర్పము ప్రభువు యేసును ॥ఎంత॥

4. శాంతమాయె నటంచుఁ బలుకుచును – ఆ రక్షకుఁడు తన – స్వంత విలువగు బ్రాణమును వీడెన్ = ఇంతలో నొక భటుఁడు తనదగు – నీటెతోఁ ప్రభు ప్రక్కఁ బొడువఁగ – చెంతఁజేరెడి పాపులను ర – క్షించు రక్తపు ధారఁ గారెను ॥ఎంత॥

– ముంగమూరి దేవదాసు

## 208 క్రీస్తుని యాశ్చర్యమైన మరణము

రా – ముఖారి (చాయ : చూడరే క్రీస్తుని) తా – త్రిపుట

[1]హర్షమే యెంతో హర్షమే – క్రీస్తును కార్యము – హర్షమే యెంతో హర్షమే = హర్షమే తద్భక్తవరులకు – నద్భుతంబగు యేసు క్రియలా – కర్షమై హృదయంబు నందలి – కలుషముం ధ్వంసింపఁజేయు ॥హర్షమే॥

1. [2]ఆర్యుఁడై భాసిల్లు మన ప్రభు – నార్త ధ్వనితో జీవమీయఁగ = సూర్యరశ్మి దొలంగి [3]యిరలై [4]క్షోణియును గంపంబు నొందుట ॥హర్షమే॥

2. మారణముఁ దానొందునయ్యెడ – మంగళముగా మృతులనేకుల్ దారుణిం జీవించి మఱలను – దామెరుసలేమందుఁ జొచ్చుట ॥హర్షమే॥

[1]సంతోషమే. [2]పూజ్యుడై. [3]చీకటియై. [4]భూమి.



3. పొరిపొరిం గాసించు చొక త – స్కరుఁడు వధ్యాస్తంభమున న = నర్మువ కోస్వామియన స్ర్పభు – కరుణతో మోక్షం బొసంగుట ॥హర్షమే॥

4. ఏలి [1]కనువిడ సాలమోన్బా – పొలు నా దేవాలయపు తెర = జీలిపోవను రెండుగా జన – జాల మాశ్చర్యమునఁ బొందుట ॥హర్షమే॥

5. సిలువపై యేసున్ శపించిన – ఖలులకై దేవునిఁ బితాయని = పిలిచి వీరింగావు మంచును – ప్రేమతో జీవంబు విడుచుట ॥హర్షమే॥

6. నెయ్యమున విభుఁ డేసునాధుం – [2]డి య్యరులకై ప్రాణమీయఁగ = ప్రయ్యలాయె ధరాధరంబులు – నయ్యరాతులు భీతినొందుట ॥హర్షమే॥

7. కీటకముతో సాటి యగునా – ఘూటమగు పెనుబాటులెల్ల = మాటికిని దామీట నేనిఁక – మేటి జీవకిరీట మొందుట ॥హర్షమే॥

– మిక్కిలి సమూయేలు

## 209 యేసుక్రీస్తు మరణావస్థ ధ్యానము

రా – ముఖారి (చాయ : ఈయన యేసు రక్షకుఁడు) తా – అట

నా కొఱకుఁ చనిపోయి నాఁడ – ఆద – యాకరుండిరు [3]వంక దొంగలతోడ ॥నా కొఱకు॥

1. ఆలకింపగను మనసార – నాకు – [4]నానదే యా దయామృత సారధార – భూలోకమునఁదనివిఁ దీర – నిట్టి – పుణ్యాత్మ నేమఱక – పూజింతు [5]మీర ॥నా కొఱకు॥

2. కన్న తలిదండ్రులకు నైన – యింత ఘన [6]వత్సలత నేఁ – గల్గుటంగాన – విన్నదియులేదు చెవులూన – స్వామి – విక్రయంబై కొర్త – వేదనలతోను ॥నా కొఱకు॥

3. కీటకమువంటి ననుఁ బ్రోవ – సొంత – [7]కీలాలమర్పించి – [8]ఖేదపడిచావ – [9]వాటమా తన కిటులఁ గావ – నేను – వర్ణింపఁ గన్నీరు – వరదలైపోవ ॥నా కొఱకు॥

[1]ప్రాణము. [2]శత్రువులకు. [3]ప్రక్కల. [4]త్రాగు. [5]ఎక్కువగా. [6]ప్రేమ. [7]నెతురు, నీళ్లు [8]దుఃఖము. [9]తగునా.

4. ఘోరముగ నినుపమేకులను - గ్రుచ్చి - [1]కొంకకానిర్దయుల్ - గొల్గొతా [2]మనలను - మారణంబగు నవస్థలను - బెట్ట - మాదృశాత్మన్గావ - మౌనమైయిలను ॥నా కొఱకు॥

5. ఏమి బహుమతుల నర్పింతు - నట్టి - స్వామిమేళ్లెల్ల నా - స్వాంతమున నుంతున్ - ప్రేమ భావమున వర్తింతున్ - నిత్య - [3]కామితార్థం బిడు - కర్తను భజింతున్ ॥నా కొఱకు॥

6. చేయనిఁక పాప [4]సంగతము - నాఁడు - సిలువపైఁ జచ్చిన - శ్రీకరుని [5]కతము - పాయ కాౘ్రభుసత్యవ్రతము - నాధు - ప్రాణాంత మౌదాఁక ప్రార్థింతు సతము ॥నా కొఱకు॥

- మిక్కిలి సమూయేలు

## 210 *O Sacred Head once wounded*

1. గాయంబుతో నిండారు
ఓ శుద్ధ శిరాస్సా!
హా! ముండ్ల కిరీటంబు
భరించు శిరస్సా!
నీకిప్పుడు డపకీర్తి
హాస్యంబు గల్గెఁగా
కర్తా! ఘనంబు కీర్తి
ఎన్నడు గల్గుఁగా

2. లోకంబు భీతి నొందు
ప్రకాశపూర్ణుడా!
ఆ యూదులైన వారు
నీ మొము మీఁదను!
నాఁడుమ్మి వేసినారా?
నీ ముఖకాంతికి
సమాన కాంతి లేదు
కురూపి వైతివా.

3. నీవోర్చినట్టి బాధ
నా క్రూర పాపమే!
నాకోస మింత బాధ
వహించినావుగా!
దైవోగ్ర బాధ కేను
పాత్రుండ నైతిని
దృష్టించి నన్నుఁ జూఁచి
కటాక్ష ముంచుమీ.

4. నేఁ బాపి నైతి గాని
నన్ నీవు చేర్చుము!
నీ నిత్యయూటనుండి
మేళ్లన్ని పారును!
నీ నోరు మాధుర్యంపు
సుబోధఁ జెప్పెను
నీ పావనాత్మ మోక్ష
సుఖంబు లిచ్చును.

---

[1]భయపడక. [2]కొండను. [3]కోరిన. [4]స్నేహము. [5]కొరకు



5. నా కోస మింత బాధ
వహించి నందుకు!
యధార్థమైన స్తుతి
నిత్యంబు నీదగున్
నీ నామమందు నేను
విశ్వాస ముంతును
నా యంత్యకాలమందు
నా యొద్దనుండుము.

- బెర్నార్డ్ క్లైర్ వాక్స్
అను: విలియం గియోనింగ్

## 211 *I am coming to the Cross*

1. సిల్వయొద్దఁ జేరుదున్
బీద హీనయంధుఁడన్
లోకమున్ త్యజింతును
పూర్ణముక్తి నొందుదున్
॥కర్త, నిన్నె నమ్ముదున్
కల్వరీ గొఱ్ఱెపిల్లా
మోకరించి వేఁడెదన్
నన్నుఁ గావుమో ప్రభో!॥

2. నిన్ నేఁజేరఁ గోరఁగా
నన్నుఁ బాయు పాపము
శుద్ధిఁజేతునంచును
యేసు మాటనిచ్చెను.

3. నన్ను ను నా మిత్రులన్
లోక యాస్తిఁ గాలమున్
దేహయాత్మయంతయు
నీకర్పింతునిప్పుడు.

4. యేసుమాట నమ్మెదన్
క్రీస్తు రక్త పుణ్యముఁ
జూచి మ్రొక్కి యేసుతో
నేను మృతినొందితిన్.

5. యేసు తాను వచ్చును
నాకు నిచ్చు పూర్ణతన్
శుద్ధ సౌఖ్య మొందుదున్
జయస్తోత్ర మేసుకు.

- డబల్యు. మెక్డోనాల్డ్
అను: జె. ఆబెర్లీ

## 212 *When I survey the wondrous Cross*

1. మహాత్ముఁడైన నా ప్రభు
విచిత్ర సిల్వఁ జూడ నా
యాస్తిన్ నష్టంబుగా నెంచి
గర్వం బణంగఁ ద్రొక్కుదున్.

2. నీ సిల్వ గాక యో దేవా
దేనిన్ బ్రేమింప నీయకు
నన్నాహరించు సర్వమున్
నీ సిల్వకై త్యజింతును.

3. శిరంబు పాద హస్తముల్
నూచించు దుఃఖ ప్రేమలు
మరెన్నడైన గూడెనా
విషాదప్రేమ లీ గతిన్?

4. ముండ్లన్ దుర్మార్గులల్లిన
కిరీట మేసు కుండినన్
ఈ భూకిరీటములన్నీ
దానం దూగంగc జాలు నే?

5. లోకంబు నే నర్పించిన
నయోగ్యమైన యీవి యౌ
వింతైన యేసు ప్రేమకై
నా యావజ్జీవ మిత్తును.

6. రక్షింపc బడ్డ లోకమా
రక్షింపc జావుc బొందిన
రక్షకుc డేసునిన్ సదా
రావంబుతోడc గొల్వుమా

– ఐజక్ వాట్స్

అను: ఎచ్. హెన్రీ డేవిస్

# క్రీస్తు పునరుత్థానము

## 213 క్రీస్తు పునరుత్థాన చరిత్రము

రా – ఆనందభైరవి (చాయ: ఓ మా తండ్రి) తా – ఏక

మరణమున్ జయించి లేచెను – మన ప్రభువు నేcడు – మహిమ దేహ [1]మొనరc దాల్చెను = ధర సమాధి బంధములను – ధన్యముగను త్రెంచి లేచి – కొఱత లన్ని తీర్చి జీవ – వరము లియ్య వసుధపైని ॥మరణమున్॥

1. మరియయును సలోమి మొదలగు – మగువలు సబాతు – మరు దినోదయమునc బ్రియ మగు = గురుని దేహమునకుc బూయc – బరిమళంపుc దైలములను – సరగc దీసికొని సమాధి – కరుగుదెంచి కనులcజూడ ॥మరణమున్॥

2. నేcడు ప్రభుసమాధి ముఖముపై – నున్న రాయి – నెవcడు దీయు కరుణను మనకై – [2]చేడియ లిట్లనుచు వేగc – జేరి యా సమాధి మూcత వీడి యుంటc జూచి మిగుల – విస్మయమ్ము నంది రపుడు ॥మరణమున్॥

3. వారు తెల్ల నిలువుటంగిcతో గూర్చున్న పడుచు – వానిc జూచి మిగుల భయముతోc = జేరరాక నిలిచియున్న వారి నతడుగాంచి యమ్మ – లార భయపడకు డటంచు – [3]నూరడించె నుచితముగను ॥మరణమున్॥

[1]చక్కగ. [2]స్త్రీలు. [3]ఆదరించెను.



4. కొరత పైని మరణ మొందిన – నజరేయుc డేసు – కొరకు మిగుల వెదకు చుండిన = [1]తరుణులార మీ ప్రభుండు – తిరిగి బ్రతికె నిక్క మిద్ది – సరగపేతు రాది శిష్య – సమితితోడc జెప్పుడనియె ॥మరణము॥

5. మానితముగ మీకిటు ముందు – ప్రభు వనిన యట్లు – కానcబడును గలిలైయ మందుc = గాన వెళ్లుcడంచు భాసి – తానరుండు పల్క వినుచు – దీన జనులు జడిసి మిగుల – దిగులు నొంది వణకి రపుడు ॥మరణమున్॥

6. మొదట మగ్దలేనే మరియకుc – గనcబడె నటంచు – సుదతి దెల్పె శిష్య వరులకు = కొదువలేని సంతసమునc – గోర్కె దీరc బ్రభునిc జూడc – బదిలమైన యత్నములకుc – బరcగc జేసి చూచి రపుడు ॥మరణమున్॥

7. అంతఃశత్రు వైన మరణమును – ప్రభువు గెల్చె – సంతసించి సన్నుతింతము = వంత లేల భక్తులార – వాస్తవముగ మనల నిటుల – నంత్య దినము నందు లేపు – నమల దేహముల నొసంగు ॥మరణమున్॥

– మురారి దావీదు

## 214 పునరుత్థాన విజయము

రా – శంకరాభరణము తా – ఆది

రండు విశ్వాసులారా – రండు విజయము నూచించు – చుండెడు సంతోషంబును గల్గి – మెండుగ నెత్తుడి రాగముల్ = నిండౌ హర్షము మనకు – నియమించె దేవుcడు – విజయం, విజయం, విజయం, విజయం ॥విజయం॥

1. నేటి సమయ మన్ని యాత్మలకును – నీ టగు వసంత ఋతువగును – వాటముగc జెరసాలను గెలిచె – వరుసగ మూన్నాళ్ నిద్రించి = నూటిగ లేచెన్ – యేసు – సూర్యుని వలెన్ ॥విజయం॥

2. కన్ను కన్నుకానని చీcకటి – కాలము క్రీస్తుని కాంతిచే – నిన్నాళ్లకు శీఘ్రముగc బోవు – చున్నది – శ్రీ యేసుని = కెన్నాళ్ల కాగని – మన – సన్నుతుల్ భువిన్ ॥విజయం॥

3. బలమగు మరణ ద్వారబంధ – ములు నిన్ బట్టకపోయెను – వెలుతురు లేని సమాధి గుమ్మ – ములు నిన్నాపక పోయెను = గెలువ వాయెను – కా – వలియు ముద్రయు ॥విజయం॥

[1]స్త్రీలారా.

4. పన్నిద్దరిలోపల నీ వేళ – సన్నుతముగ నీవు నిలిచి – యున్నావు మానవుల తెలివి – కెన్నఁడైన నందని = యౌన్నత్య శాంతిని – న – నుగ్రహింతువు ॥విజయం॥

– ముంగమూరి దేవదాసు

## 215 క్రీస్తు పునరుత్థానము

రా – మధ్యమావతి (చాయ: నీకన్న యికవేరే వేల్పులు) తా – త్రిపుట

సుదతులార మీ – రిచ్చోట నెవ్వరి – వెదుకుచునున్నారు = మృదువుగాను – జీ – వించు వాని పెద్ద – నిదుర బోయినటు – లెదలందు భావించి ॥సుదతులార॥

1. ఇచట లేఁడు లేచి – యున్నాఁడు ప్రభు క్రీస్తు – యేసు స్వతంత్రుఁడై = ప్రచురంబుగఁ దన – పాట్లు లేచుటయును – వచియించె గలిలయ్య – వర దేశమున మీతో ॥సుదతులార॥

2. మనుజ కుమారుఁ డె – క్కుడు పాపిష్ఠులచేత – మరణ మొందుట సిల్వ పైఁ = దనకుఁ దానె మూఁడవ – దినమందు లేచుట – యును దెల్పెఁ గద మీరు – వినుచుండఁగఁ దొల్లి ॥సుదతులార॥

3. ఎదలలోన జ్ఞాప – కము చేసికొనుఁడింక – యేసు తెల్పిన మాటలు = ముదముతో జీవముఁ – గని లేచె నను వార్త – సుదతు లాలకించి – రది నిక్కముగఁ దోఁచఁ ॥సుదతులార॥

– పురుషోత్తము చౌధరి

## 216 ప్రభు పునరుత్థానము

రా – అసావేరి (చాయ: ఇప్పటి నరులారా) తా – త్రిపుట

విజయంబు విజయంబు – విజయంబు మా యేసు – నిజమె మృత్యువు గెల్చి – నేఁడు వేంచేసె = యజమానుఁ డెల్ల ప్ర – యాసము లెడఁబాప – స్వజనుల రక్షింప – సమసె సిలువమీఁద ॥విజయంబు॥





1. విజయంబు విజయంబు – విజయంబు మానవుల – [1]వృజిన నివృత్తిని – విభుఁ డొనరింపన్ = గుజనులచే నతఁడు క్రూర మరణము నొంది – [2]విజిత మృత్యువు నుండి – విజయుండై వేంచేసె ॥విజయంబు॥

2. విజయంబు విజయంబు – విజయంబు మా యేసు భుజము మీఁదను మోయుఁ – బరిపాలనంబు = [3]కుజము మీఁదను ప్రాణ – త్యజనము జేసెను – ధ్వజము మోయుచు సిల్వ – పాప మోడింతము ॥విజయంబు॥

3. విజయంబు విజయంబు – విజయం బిఁకను మా క – పజయము కాకుండఁ – ప్రభు యేసు క్రీస్తు = సుజనత్వమున వైరి – [4]వ్రజము గెల్వఁగఁజేసి – నిజముగఁ బరలోక – నిలయంబులో నిల్పు ॥విజయంబు॥

4. విజయంబు విజయంబు – విజయం బనెడి పాట – నిజభక్తితో మనము – నేర్చిన వాని = భజియించుదము భూన – భములు తాఁ బాలించు – అజిత జీవ ప్రదుఁ – డమరత్వ మిడు మనకు ॥విజయంబు॥

– జాన్ ఫ్రాన్సిస్ స్పెన్సర్

## 217 ఆయన యుగయుగములు జీవించుచున్నాఁడు

రా – బిలహరి (చాయ: గీములు పాడుడీ) తా – త్రిపుట

హలెలూయ యని పాడుఁడీ – సమాధిపై – వెలుఁ గేమొ పరికించుఁడీ = కలఁడు యేసు సజీవుఁడయి, లే – ఖనముల లవి నెరవేరెను – కలిమి మోదము గులగ, దివి నుతి – సలుప మహిమను వచ్చును ॥హలెలూయ॥

1. హలెలూయ యని పాఁడుడీ – యీ జగతికిఁ – కలిగె రక్షణ చూడుఁడీ = శిలఁ దొలంగెను, ముద్ర విడె, కా – వలి సమాజము దేవుని – బలిమి కాగక పారిపోయెను – గలిబి లాయెను నరకము ॥హలెలూయ॥

2. హలెలూయ యని పాడుఁడీ – చీఁకటిపైని – వెలుఁగే జయ మొందుసుండీ = యిలను మృత్యువు గూలె, బ్రతికెఁగా – యల విశ్వాసము మరలను – బలనిరీక్షణ మనకుఁ గలిగెను – బ్రతిహృదయము బలపడెన్ ॥హలెలూయ॥

---

[1]పాపము [2]జయింబడిన. [3]చెట్టు. [4]సమూహము

3. హలెలూయ యని పాడుఁడీ – దు:ఖించు నో – చెలియలారా వినుఁడీ = సొలయకుండcగ మీర లటునిటు – చూచుచుండుట యెవరిని – ఫలము లేదిcక బ్రతుకు యేసు – ప్రభుని వెదకుట మృతులలో ॥హలెలూయ॥

4. హలెలూయ యని పాడుఁడీ – యేసు ప్రభుని – వలననే గలిగెcగనుఁడీ = యిలయుc బరమును సఖ్యపడియెను – గలిగె హర్షము చావుచే – సిలువ చింతలు మాని, పొందుఁడి – కలకలంబగు మోదము ॥హలెలూయ॥

5. హలెలూయ యని పాడుఁడీ – మీ భూరి చిం – తలుతీరె మది నమ్ముఁడీ = బలహీనపు చిన్న మందా!– ప్రభుని చెంతకు మరలుము – కలుగు జీవము మిమ్ము నాయన – కరుణతో నడుపును సదా ॥హలెలూయ॥

6. హలెలూయ యని పాడుఁడీ – సంఘము సదా – నిలిచి యుండును సుమండీ = పలు తెరంగుల రిపుల వలనను – బాధ లెన్నియుc గలిగినన్ దొలcగ కేమియు నన్ని యడ్డుల – గెలిచి వర్ధిల్లుచుండును ॥హలెలూయ॥

7. హలెలూయ యని పాడుఁడీ – దేవుని బోధ – కులు సర్వరాష్ట్రంబుల = నెలమి మహిమకుc బ్రథమ ఫలమగు – యేసు రక్షణ వార్తను – వెలుc గువలెc బ్రసరింపc జేయుదు – రిలను ధృతితో నేర్పుతో ॥హలెలూయ॥

8. హలెలూయ యని పాడుఁడీ – భక్తులారా – విలపింపవలదు సుండీ = కలుగకుండుఁడి సందియంబులు – గడుచు కాలము శీఘ్రమే – కలుగు మీకు సమాధి మిమ్మును గౌcగిలింప నెమ్మది ॥హలెలూయ॥

9. హలెలూయ యని పాడుఁడీ – గోధుమ గింజ – వలె బ్రతుకుదురు మీరలు = ఇల ప్రభువు తన పంటc గూర్పను – నేగుదెంచును జివరను – తొలcగc జేయును గురుగులను గో – ధుమలనుండి నిజంబుగా ॥హలెలూయ॥

– కడియం గాబ్రియేలు

## 218 క్రీస్తు పునరుత్థానము

రా – ముఖారి తా – అట

యేసు లేచెను – ఆదివారమున – యేసు లేచెను – వేకువజామున – యేసు లేచెను ॥

1. వేకువజామున – చీcక టుండcగానే = యాకాశదూతలు – వీకతో రాc గానే ॥యేసు॥



2. సమాధిపై రాతిన్ – స్వామి దూత లిద్దరు = సమముగc దీయను – స్వామి లేచె నహహ ॥యేసు॥

3. మృతులలో సజీవున్ – వెతకు టేల నని = దూతలు వారితో – దాత లేcడని తెల్పి ॥యేసు॥

4. స్త్రీలు వేగ వెళ్లి – శిష్యులకుc దెల్ప = జింత మారిపోయి – సందేహము తొల్గ ॥యేసు॥

5. పేతురు యోహానుల్ – పరుగెత్తుకొని వచ్చి = ప్రవేశించి గుహలో పరమానంద మొంద ॥యేసు॥

6. యేసు చచ్చి లేచె – యేసు శిష్యులట్లే = దోసంబులకుc జచ్చి – వాసిగ లేతురండి ॥యేసు॥

– బస్యన్ జోసఫ్

## 219 క్రీస్తు లేచెను

రా – యమన్ కళ్యాణి (చాయ: నేనును నాయింటివారును) తా – త్రిపుట

క్రీస్తు లేచెను హల్లెలూయ – క్రీస్తు నన్నులేపును = ఇద్దియె సునాద సత్యము – ఇలను చాటుడి నిత్యము ॥

1. మృతుల పునరుత్థాన పంటకు – ప్రథమ ఫలమగు క్రీస్తులో = మృతులు లేతురు నేను లేతును – నాదువరుసలో నిజమిది॥

2. పాపమరణ నరకబలములు – ప్రభుని శక్తికి ఓడెను = పాపినగు నను బ్రోవ క్రీస్తుని – ప్రాణదాన ప్రభావము॥

3. మరణమా! నీముల్లు యెక్కడ? – మరణమా! జయమెక్కడ? = మరణమా! నీముల్లు విరిగెను – మహిమ క్రీస్తులో నిప్పుడు ॥

4. శిలయు ముద్రయు బలిమికావలి – గలిబిలాయెను రాత్రిలో = ఇలయు పరమును కలుసుకొనియెను – గెలపునొందిన క్రీస్తులో ॥

5. మృతులు నీదగువారలందరు – బ్రతికి లేతురు సత్యము = ప్రేతలను జీవింపచేయును – పృథివి క్రీస్తుని విజయము ॥

6. స్తుతియు మహిమయు ఘనత నీకె – స్తుతికి పాత్రుడ రక్షకా = స్వంత రక్తము చిందితివి నా – స్వామి యిదెనా యంజలి ॥

– బి. సూర్య ప్రకాశరావు

## 220 క్రీస్తు పునరుత్థానము

రా – తోడి (చాయ: వారు భాగ్యవంతు లౌదురు) తా – ఆది

యేసు పునరుత్థానమాయెను – చావునొంది క్రీ – స్తేను పునరుత్థానమాయెను = యేసు పునరుత్థానమాయె – దాసులెల్ల నుతింప వింతగ – భాసురంబుగ భక్తలన్బర – వాసులుగఁ దాఁజేయు నిప్పుడు ॥యేసు॥

1. బేధపడి యా సిల్వమీఁదను – దుష్టాత్మ లాయన – నాదరంబుగఁ బట్టి మోదను = పాదుకొని ప్రేమన్మతిన్పరి – పంధి జనుల గావుమంచును – సాదరంబుగ వేఁడె తండ్రిని – శత్రులను రక్షింప నిప్పుడు ॥యేసు॥
2. దుష్టజను లేతెంచుచున్నారు – నన్నుఁబట్టి చాలఁగ – గష్టపెట్టఁ దలంచు కొన్నారు = విష్టపంబున సిల్వమీఁదను – వేదన క్రూరముగ బెట్టుచు – భ్రష్టులైనను బాసిమీరఁక – పారిపోయెదరంచు నిప్పుడు ॥యేసు॥
3. ఆమహిన్పరి శుద్ధవంతుఁడై – జన్మించె దేవుని – నీయందున నీతిమంతుఁ డై = యీ మహిని బోధింప దోష వి – హీనుఁడైన నిరపరాధిని – స్వామి ద్రోహిగ నెంచి యూదులు – చంపి పూడిచిపెట్ట నిప్పుడు ॥యేసు॥

– మిక్కిలి నమూయేలు

## 221 *Low in the Grave He Lay*

1. యేసు సమాధిలో
పరుండియుండి
వాసిగ మూఁడవ
నాఁడు లేచెన్.

॥ లేచెన్ సమాధినుండి
మృత్యువుపై విజయమొంది
శత్రువు నోడించి జయశాలియై
నాత్యముం జీవించ
మధ్యవర్తియై;
లేచెను! లేచెను
హల్లెలూయ! లేచెను ॥

2. వ్యర్థమే కావలి
సమాధియొద్ద
వ్యర్థంబు ముద్రయు
యేసూప్రభూ!

3. మృత్యుబంధంబులన్
నిత్యుండు త్రెంచెన్
స్తుత్యుండు జయించెన్
జయం! జయం!

– రాబర్ట్ లౌరీ
అను : ఒంగోలు దావీదు



## 222 *Christ the Lord is Risen Today*

1. క్రీస్తు నేడు లేచెను
ఆ ఆ ఆ హల్లెలూయ
మర్త్యదూత సంఘమా
ఆ ఆ ఆ హల్లెలూయ
భూమి నాకసంబులో
ఆ ఆ ఆ హల్లెలూయ
బాడుమిందు చేతను
ఆ ఆ ఆ హల్లెలూయ.

2. మోక్ష మియ్య నాథుడు
ఆ ఆ ఆ హల్లెలూయ
యుద్ధమాడి గెల్చెను
ఆ ఆ ఆ హల్లెలూయ
సూర్యుఁడుద్భవింపగ
ఆ ఆ ఆ హల్లెలూయ
చీకటుల్ గతించెను
ఆ ఆ ఆ హల్లెలూయ.

3. బండ, ముద్ర, కావలి
ఆ ఆ ఆ హల్లెలూయ
అన్ని వ్యర్థమైనవి
ఆ ఆ ఆ హల్లెలూయ
యేసు నరకంబును
ఆ ఆ ఆ హల్లెలూయ
గెల్చి ముక్తిఁ దెచ్చెను
ఆ ఆ ఆ హల్లెలూయ.

4. క్రీస్తు లేచినప్పుడు
ఆ ఆ ఆ హల్లెలూయ
చావుముల్లు త్రుంచెను
ఆ ఆ ఆ హల్లెలూయ
ఎల్లవారిఁ బ్రోచును
ఆ ఆ ఆ హల్లెలూయ
మృత్యువింక గెల్వదు
ఆ ఆ ఆ హల్లెలూయ.

5. యేసు మృతి గెల్చెను
ఆ ఆ ఆ హల్లెలూయ
మేము కూడ గెల్తుము
ఆ ఆ ఆ హల్లెలూయ
యేసుఁడుండు చోటుకు
ఆ ఆ ఆ హల్లెలూయ
మేము కూడఁ బోదుము
ఆ ఆ ఆ హల్లెలూయ.

6. భూమి నాకసంబులో
ఆ ఆ ఆ హల్లెలూయ
యేసు, నీకు స్తోత్రము
ఆ ఆ ఆ హల్లెలూయ
మృత్యు సంహారకుండ
ఆ ఆ ఆ హల్లెలూయ
నీదె నిత్యజయము
ఆ ఆ ఆ హల్లెలూయ.

– చార్లెస్ వెస్లీ
అను: జాన్ అబెర్లీ

## 223 ప్రభుని ప్రత్యక్షతలు

రా – శంకరాభరణము (చాయ: యేసుని ప్రేమను నేమారకను) తా – ఆది

క్రీస్తు ప్రభుని ప్రత్యక్షతలను వివ – రించెద వినరే ప్రియులార = వాస్తవముగ మరణించి బ్రతికెనని – వసుధలోఁ బ్రకటింపరె యూరూరఁ ॥గ్రీస్తు॥

1. మరియ మగ్దలేనెకుఁ బ్రథమంబున – మన గురువర్యుం డగపడియెఁ = తరుణీమణులకు రెండవ మాఱొక – దర్శనము దయతో నిడియెఁ ॥గ్రీస్తు॥
2. సీమో నను పేతురును గూడ ద – ర్శించె నతఁడు మూఁడవ మాఱు = ప్రేమతోడ నిమ్మాయి శిష్యులకుఁ – బ్రియ మొనరించె మఱొక తీఱు ॥క్రీస్తు॥
3. తోమాలేని తరుణమునఁ బదుగురి – తో వచించె గృహమునఁ జేరి = తోమాకు కనపడి యతని సంశయముఁ – దొలఁగించెను బ్రభుఁ డొకసారి ॥క్రీస్తు॥
4. సందరంపు దరి నేడుగురికి మ – త్స్యంబులు వింతగ సమకూర్చె = సందర్శించియు యాకోబునకును – సంతోషము నెంతయుఁ గూర్చెఁ ॥క్రీస్తు॥
5. ప్రభుఁ డొక మాఱే నూరుగురిఁ దాఁ – బ్రత్యక్షుం డయ్యెను పేర్మి = నషయ మొసంగి యపొస్తులులకుఁ క్రీ – స్తారోహణుఁ డయ్యెను గూర్మిఁ ॥క్రీస్తు॥
6. హత్యఁ జేయ నేగెడు తార్సీయున – కగపడి రక్షించెను సుమ్ము = మృత్యుంజయు డిప్పుడు మన కాత్మలో – దృశ్యుం డగు నిది సత్యమ్ము ॥క్రీస్తు॥

– మల్లెల దావీదు

## 224 క్రీస్తు కడపటి హెచ్చరిక

రా – ముఖారి తా – ఆది

ఇదిగో నా శిష్యులారా – యెఱుక లుంచుఁడి = మోక్ష – [1]సదనమున కేను బోదు – సంతోషించుఁడి ॥ఇదిగో॥

[1]నివాసమునకు.



1. యెరూషలేమందుండి మీ – రెదురు చూడుఁడి – మీపైఁ – బరిశుద్ధాత్మయు దిగివచ్చి – పనులు దెల్పును ॥ఇదిగో॥
2. దిక్కులేనట్లు మిమ్ము – దిగనాడి పోను = మీతో – [1]మక్కువైయుండఁ బరిశు – ద్ధాత్మను బంపెదను ॥ఇదిగో॥
3. [2]నిర్యాణమున మీకొరకై [3]నెలవులు గల్పింతు = నాతో – సర్వకాలము నిత్య – [4]సామ్రాజ్యము నేల ॥నిదిగో॥
4. ఒకరితో నొకరు ప్రియము – లొప్పి యుండుఁడి = నాదు – సకలాజ్ఞలందు నిదియె – సార మనుకొనుఁడి ॥యిదిగో॥
5. ఏదైననా పేరిటమీ – రించుక వేఁడినను = మీకు – [5]మోదముతోడదాని – ముందే చేయుదును ॥ఇదిగో॥
6. [6]ఉల్లము లందుఁ గలఁత – లెల్ల విడువుఁడి = నేను – మళ్లి వచ్చెడి విధము – మరువకుండుఁడి ॥యిదిగో॥

– పురుషోత్తము చౌధరి

# క్రీస్తు ఆరోహణము

## 225 ఆరోహణ దినము

రా – ఆనందభైరవి (చాయ: ఓ మా తండ్రి నీదు నామము) తా – ఏక

పరమ ప్రభో యేసురక్షకా – ధననరుల బ్రోచి = పరమ కారోహణంబైతివా = మరియయందు జననమొంది – వరము లిడుచు దిరిగిధరను – మరణమొంది తిరిగిలేచి – పరము కేగితివా ప్రభో ॥పరమ॥

1. ఘోర పాపభారముతోడ – దరిగానలేకఁ – దిరుగుచుండినట్టి మమ్మును = కూరిమితోఁ దరికిఁబిలిచి – భారమును నీవేమోసి – ఊరకమము క్షమియించి – నేరములను బాపిన ప్రభో ॥పరమ॥
2. సిలువమరణమొందినఁ ప్రభువా – ఇలనరుల ఘోర – కలుషములను బాపిన ప్రభువా = విలువలేని నీదు బ్రతుకు – బలముగల నీ ప్రేమ సేవ – సలలితముగ ననుకరించి – ఇలను మేము బ్రతుకునట్లు ॥పరమ॥

[1]స్నేహము. [2]మోక్షమందు. [3]నివాసస్థలములు. [4]ప్రభుత్వము. [5]సంతోషము. [6]మనమవి.

3. చెఱను చెఱగఁబట్టిన ప్రభువా – ధనరులకెల్ల – వరములను విరివి నిడితివా = పరముకేగి పరమతండ్రి – పరమున కుడిపార్శ్వమందుఁ – దిరముగాఁ గూర్చుండి యుండి – తిరిగి ధరకు వచ్చెదవా ॥పరమ॥

4. నీదు రాక కెదురుజూచెడి – నీ దాసులను – సదయతతో జూడుమో ప్రభో = మాదినపు ప్రార్థనలను – మాదు స్తోత్రములను మిగులఁ – బ్రోదిగా గైకొనుచు నేడు – బ్రోవుమయ్య మమ్ములను ॥పరమ॥

5. పంపుమయ్య నీదు ఆత్మను – పదిలముగ దయతో – సొంపుగ నీ శుద్ధాత్మను – నింపుమయ్య నీదు కృపతో – ఇంపగు నీవరములతో – సొంపు గాను నీదు సేవ – జేయనిలను నెల్లపుడు ॥పరమ॥

– బన్యన్ జోసఫ్

## 226 క్రీస్తు ఆరోహణము

రాగము – ఆనందభైరవి (చాయ: నీకన్న యిక వేరే) తా – త్రిపుట

మేఘంబుపై నెక్కి – మేలుగ ప్రభు క్రీస్తు – యాకసంబున కేగెను = ప్రాకటముగను ఆత్మనంది – ప్రజ్ఞ మీరగ సాక్ష్యమిచ్చి – యేక దీక్షను యేసు రాకకు – నెదురు జూడుడటంచు ప్రభువు ॥మేఘంబు॥

1. యూదయ్య – సమరయ్య – ప్రాంతంబులంతట – నాదు వార్తను జాటరే = భూదిగంతము వరకు మీరు భూరి సాక్షులగుచు నాకు – సాదరంబుగ సత్య విశ్వా – సంబులన్ మనుడంచు ప్రభువు ॥మేఘంబు॥

2. గలిలయ్యులార మీ – రాశతో నెందుకు – తిలకించు చున్నారట్లు = వెలయపరమున కెట్లు నేగెనొ – యిలకు నా ప్రభువట్లెమరల – యలర వచ్చుట మీరు గాంచెద – రంచు దూతలు బల్కిరపుడె ॥మేఘంబు॥

3. శ్రీ సంఘ మిదివిను మా యేసు ప్రభు క్రీస్తే – భాసిల్ల మఱి వచ్చును = యేసు ప్రభుని యడుగు జాడల – యేపు మీరగ నడచు కొనుచు – నీసు రక్షణ నిలకుజాటుచు – నెదురు జూడుము యేసు కొఱకే ॥మేఘంబు॥

– తూలూరి ప్రకాశము



# క్రీస్తు పునరాగమనము

## 227 క్రీస్తు రెండవ రాకడ

రా – కమలామనోహరి తా – ఆది

కోలాహలముగఁ – గూరిమితోఁ గూడి – కోలాటమాడను రా రా – మా – పాలిటి యేసుని పేరఁ – మాపాలిటి యేసుని పేర – మ – మ్మేలెడి దేవుని పేరఁ ॥గోలాహలముగ॥

1. మా సామి యా మోక్ష – వాసుండు నైనట్టి – యేసయ్య పోకను జూడు – మా యేసయ్యరాకను బాడు – యేసయ్య రాకను బాడు – నీ హోసన్న – యని మదివేడు ॥కోలాహలముగ॥

2. పాపంబులన్ మోసి – ప్రాణంబు బలి యిచ్చి – తాఁ బరమున కేగలేదా – నీ – జ్ఞాపకములోనికి రాదా – జ్ఞాపకములోనికి రాదా – నీ ప్రాపకుఁడై యుండలేదా ॥కోలాహలముగ॥

3. ఏలినవాడైన – యేసుని రాకను – నాలించి చూడవదేర – నిను పాలించు వాడనుకోర – పాలించువాడనుకోర – పరి – శీలించువాడనుకోర ॥కోలాహలముగ॥

4. అంతములో భువి – కా యేసునాథుండు – చెంతను దూతలతోడ – బల్ – వింతగ వచ్చును జూడ – వింతగ వచ్చును జూడ – న – త్యంత బలముతోడ రాఁడ ॥కోలాహలముగ॥

5. ఆకాశ భూమ్యాదు – లార్భటిలు దూతల – మూకలతోఁ గూడినాఁడు – ఈ ۱ లోకాని కేతెంచుఁవాడు – లోకాని కేతెంచువాఁడు – ఇఁక వీకతోఁ బ్రభుని బాడు ॥కోలాహలముగ॥

6. భీకర సింహపు – టాకారముతోను – ఢీకొని మేఘములతోడ – బల్ – బాకారవంబులు బాడ – బాకారవంబులు బాడ – నిటు – ఢీకొని వచ్చెను జూడ ॥కోలాహలముగ॥

7. భాసురమైనట్టి – యేసయ్య రాకను – ఈ సూర్యుఁడు జూడలేఁడు తన వి – కాసము జీఁకటౌను వి – కాసము జీఁకటౌను – నీ కా సుగతిఁ జూపువాఁడు ॥కోలాహలముగ॥

– మిక్కిలి నమూయేలు

## 228

### క్రీస్తు యొక్క రెండవ రాకడ – అవిశ్వాసుల భయము

రా – ముఖారి (చాయ: హృదయమనెడు) తా – ఆది

నాఁడు వచ్చినట్లు గాదు – నేఁడు వచ్చుట = తేరి – చూడరాదు క్రీస్తు నింకఁ – జొత్తు మెచ్చుట ॥నాఁడు॥

1. మొదట గొఱ్ఱెపిల్ల రీతి – నొదిగి వచ్చెఁగా = యిపుడు – కొదమ సింహమయ్యె మనకు – గుండె దిగులుగా ॥నాఁడు॥

2. దాసునివలె దొల్లిఁ – జూచినాముగా = యిపుడు – దోసము లెంచి దండింప – దొరయైనాఁడుగా ॥నాఁడు॥

3. ఏ తట్టు బోయిన మనకు – నెదురు వచ్చెఁగా = పిడుగు – రీతి వాని యుగ్రమైన – దృష్టి హెచ్చెఁగా ॥నాఁడు॥

4. కొండ వండ లందు దాగి – యుండలేముగా = వాని – యండనుండి మండు నగ్ని – యదిగో వచ్చెఁగా ॥నాఁడు॥

5. దిక్కుగా నున్నట్లు నితర – దేవతలను నమ్మి = వట్టి – పుక్కిటి పురాణములకుఁ బోయి చెడితిమి ॥నాఁడు॥

6. వీధుల బోధించు వారి – వినక పోతిమి = యిపుడు – బాధఁ బొంది నరకాగ్నిలోఁ బడఁబాలైతిమి ॥నాఁడు॥

– పురుషోత్తము చౌధరి



## 229 క్రీస్తు మహిమతో వచ్చుట

రా – ఘంటా తా – అట

మహిమతో మన యేసు – ఇహమునకు వేంచేయున్ = సహోదరులారా మన మా – మహిమలో వెలుఁగుదుము ॥మహిమతో॥

1. మోములు వంచి యేసు – నామము నుతియించు = పామరులమైన మనలఁ – బ్రేమతోఁ గప్పినాఁడే ॥మహిమతో॥

2. పాత్రులమా మనము – శత్రులమే కాదా = మిత్రులన్ జేసిన వి – చిత్రము తెలియలేము ॥మహిమతో॥

3. శిరముల పైని జీవ – కిరీటములతోను = బరమ దేవుని వరములు – మురి యుచు మరువలేము ॥వచుహిమతో॥

4. వీణెలతో మనము – నాణెమైన పాట = ఋణము చెల్లింపలేమని – యణఁ గి మణఁగి పాడుదుము ॥మహిమతో॥

– గొల్లపల్లి నతానియేలు

## 230 అంత్య దినము

రా – వంతువరాళి తా – ఆది

అయ్యో యిది యెంత దుఃఖము – ప్రభు తీర్పువేళ – నయ్యో యిది యెంత దుఃఖము = చయ్యన యెహోవా సింహా – సనము చుట్టు వహ్ని మండు – నయ్యెడ విశ్వాసులకు దు – రాత్మల కగు నిత్య ఖేద ॥మయ్యో॥

1. తల్లి పిల్లలు గూడుదు రచటఁ – దండ్రి తాత లచటఁ గలియుదు రెల్ల కాల మటుల నుండ – కెడబడి మరి యెపుడు చూడ ॥రయ్యో॥

2. అన్నదమ్ములచటఁ – గూడుదురు రక్క సెలియలందుఁ గలియుదు = రెన్నఁ డు మరి చూడ రాని – యెడఁగల స్థలములకుఁ బోదు ॥రయ్యో॥

3. భార్యాభర్తలు గూడుదురు రచట – బంధు మిత్రులు కలియుదురు రందుఁ = కార్య భేదమువలన సర్వ – కాలము మరి కూడఁజాల ॥రయ్యో॥

4. క్రీస్తు మత ప్రబోధకులు స - మస్త శిష్యులు కూడుదు రచట = వాస్తవ స్థితు లెరుఁగఁబడిన - వలనను విడఁబడుదు రంద ॥రయ్యో॥

5. శిష్టులు దుష్టులు కూడుదు రచట - స్నేహవంతు లందుఁ గలియుదు = రిష్టము గాని భిన్నులగుచు - నిఁక మరి యెన్నటికిఁ గూడ ॥రయ్యో॥

6. అల పిశాచి పాపు లందరు - నడుపు కర్తకు భిన్ను లగుచు = పలుగొరుకుల నిత్య నరక - బాధల పాల్బడక పోరు ॥అయ్యో॥

7. సాధు సజ్జనంబు లెల్ల - సకల దూతలతోడఁ గూడి = మోదముతో - ప్రభుని వెంట - ముక్తి కేగి నిత్యులగుదు = రాహా యిది యెంత విజయము ప్రభు తీర్పు వేళ - నాహా యిది యెంత విజయము ॥అయ్యో॥

- పురుషోత్తమ చౌధరి

## 231 క్రీస్తు శరణు గోరుట

రా - ముఖారి (చాయ: నాదు వచ్చినట్లు గాదు) తా - ఆది

ఓహోహో మా యన్నలారా - యుద్యోగింపండి = యిపుడే - [1]త్రాహి త్రాహి యనుచుఁ క్రీస్తుని - దయను గోరండి ॥ఓహో॥

1. అంత్యదినము నాటి బాధ - లాలకించండి = నరక - ప్రాంతమునకుఁ బోకమునుపే - ప్రభువును వేడండి ॥ఓహో॥

2. మింట ప్రభువు [2]తేజోమయమౌ - మేఘారూఢుండై = యగ్ని - మంట వీను సింహాసనము - నంటి కూర్చుండు ॥ఓహో॥

3. అంధకారమగును సూర్యుఁడా దినమందు = [3]కుముద- బాంధవుడు మిగుల రక్త- వర్ణము నొందును ॥ఓహో॥

4. కడు భీతిగ సర్వసృష్టి - కంపించుచు నుండున్ = భూమి [4]కడలి [5]యభ్రము తాపమున - కరిగి పోవుచుండున్ ॥ఓహో॥

5. నరక ప్రచండాగ్ని గుండ - మరదై గన్పడును = దానిఁ - జొరక మరి యే తెరువు పాపా - త్ములకు గలుగును ॥ఓహో॥

[1]రక్షించుము. [2]తేజోవికారము. [3]చంద్రుడు. [4]సముద్రము. [5]ఆకాశము.



6. ప్రేమతో నడిగెదను నా - ప్రియబంధువులార = మీర - లామహా దినమందున దిరమై - యట నిలువంగలర ॥ఓహో॥

7. కామక్రోధ లోభమోహ - గర్వగుణములను = మీరు - ప్రేమించి చేసితిరి గద - పెక్కు విధములను ॥ఓహో॥

8. కల్లలాడుచుడి ప్రొద్దుఁ - గడుపుచుంటిరే = యింక - చిల్లర వేల్పుల పూజ - చేయుచుంటిరే ॥ఓహో॥

9. ప్రకటంబుగ నైన మరి [1]గు - ప్తస్థల మందైన = చేయు - సకల క్రియలు ప్రభువున కెఱుక - సంపూర్ణముగాను ॥ఓహో॥

10. జాతి గోత్రమడుగఁ బోడు - సర్వేశ్వరుండు = క్రియల - రీతి మనసు మాత్రమె విచా - రించు ప్రభువతఁడు ॥ఓహో॥

- పురుషోత్తము చౌదరి

## 232 పాపాత్ముల యొక్క శిక్ష

రా - పంతువరాళి (చాయ: ఇడుగో గొఱ్ఱెల కాపరి) తా-ఆట

కోప దినము వచ్చును - పాపుల గుండె - పగులు కాలము వచ్చును = శ్రీ పాల యేసుని - దాపునఁ జేరక - మాపు రేపులు మహ - పాపులకును గొప్ప ॥కోప॥

1. భువిలో రాల కఱ్ఱల - పూజలఁజేయు - చవి దేవుండ్లని చెప్పెడి = అవిగాక తమవంటి - నరులదేవుండ్లని - యవివేకముగ నమ్ము - నరులందరికి నెంతో ॥కోప॥

2. నరహంతకులు దొంగలు - వ్యభిచారులు - మరి యబద్ధికు లందఱు ఇరుగు పొరుగు వారి - నిఁక మోసములు చేయు - నరులందఱు చెడ్డ నరకములోఁ బడునట్టి ॥కోప॥

3. ఆట పాటలవల్లను - పాపము చాల - వేటాడుకొను వారలు = బూట కముల వారలు - భువిలో యక్షిణిగాండ్రు - మాటలాడక యగ్ని - మడుగులో బడి కాలే ॥కోప॥

[1]రహస్యమైన.

4. కులభేదములు గల్పించి - కుటిలమందు - బలముగ బ్రతుకుచుండు = ఇల మాయవాదుల - కిఁక నేమి గతిలేక - పలుగొరుకులు నుండె - బాధల పాలయ్యెదు ॥కోప॥

5. మీఁది దేవునివలనను - యియ్యంబడెడు - వేద మొక్కటి సత్యము = ఆధారమైయుండు నాత్మరక్షణ కది - సాధులైనమ్మని భేదకులకు నెంతో ॥కోప॥

## 233 క్రీస్తుని రెండవ రాకడ

రా- పంతువరాళి (చాయ: వందనం నీకె) తా - చాపు

వచ్చును క్రీస్తు వచ్చును - భూలోకమునకు - వచ్చును - క్రీస్తు వచ్చును = చెచ్చెరను మేఘములపె రవ - మిచ్చు బూర సునాదములతో - హెచ్చుగను దూతస మూహము - లచ్చుగను సేవింపగ్రక్కున ॥వచ్చును॥

1. అంతటను సకల భూజనులు - వింతగను బూర ధ్వనియు విని - నంతలోనె సజీవులై ప్రభు - చెంత నిల్తు రపార మహిమను ॥వచ్చును॥

2. ఒనరగనుఁదన మేఘ సింహా - సనముపైఁ గూర్చుండి పావన - జనుల బారుల నిరుపార్శ్వము - లను విభజనముఁ జేయు నిక్కము ॥వచ్చును॥

3. అదను నిది యని హృదయముల ప్రభు - పదయుగళ సున్నతియెఱుంగక - మద దు రేచ్ఛల గెదరు పాపుల - హృదయములు చెదరి భీతిల్లఁగ ॥వచ్చును॥

4. అమిత పాపాత్ముల నరకలో - కమునఁ బడవైచి సుజన సమూ - హముల దనవెను వెంటఁ గొని చను - విమల నిత్య కిరీటము లొసఁగఁ ॥వచ్చును॥

5. తల్లి పిల్లల నెడబాసియు - నల్లకల్లోలముగ భువిపై - తల్లడిల్లుచు నొకరి నొక్కరు - నెల్లకాలము జూడని గడియ ॥వచ్చును॥

- రావూరి లక్ష్మయ్య



## 234 ఆయన వచ్చు వేళాయెను

రా - కళ్యాణి (చాయ: సంతోషింపరె) తా - అట

యేసు వచ్చెడి వేళాయె సోదరులారా - కాశమేఘములతోను = భాసురమగుతన నివాసంబునకుమనల - దీసుకపోయిప్రకాశితులను జేయ ॥యేసు॥

1. నిద్రమేల్కొను వేళాయె సమయము దెలిసి-ఓరిమితో నుండరే = భద్రముగా శత్రుయుపద్రవమును దాటి - సిద్ధపడుఁడి ప్రభునియొద్ద నివసించుటకు ॥యేసు॥

2. తనువును బలిపెట్టిన మన రక్షకుఁడు- ఘన మహిమలోకి వెళ్లి = తన యింట స్థలములు మనకు సిద్ధముఁజేసి - చనుదెంచు వేళాయె కనిపెట్టి యుందాము. ॥యేసు॥

3. చాలారాత్రి గతించెను సోదరులారా - వెలుగు సమీపించెను = వేల దూతలతోడ యేసయ్యవచ్చును - కాలగురుతులగని మేలుకొనరెవేగ ॥యేసు॥

4. శోధన కాలమిదే యీధరణిలో - బాధలురావచ్చును = నాధుఁడైన యేసుపాదముల కడనుండ - యేది కీడుచేయలేదు మనపై నెపుడు ॥యేసు॥

5. మనలను ప్రేమించుచూ మన పాపముల-దనరక్తమున గడుగుచు = ఘన దేవునికి నర్చకులనుజేసిన ప్రభుని - కొనియాడి బలమహిమలను జెల్లింతుము నిరత ॥యేసు॥

- చదలవాడ తామస్

## 235 ప్రభు పునరాగమన గీతిక

(చాయ: ఇదియే సమయంబు)

ప్రభు - పునరాగమరీతి విను - మో ప్రభాతగీతి - చయ్యన రానయె జ్యోతి - సమయంబులేదు ధాత్రి ॥ప్రభు॥

1. పవలు పదియురెండు ఘంటలు – పాపతమోహేళి – భువనంబులు తెల్వి దేల్చి ప్ర – బోధ సుప్రభాళి = కువలయు త్రాణముకై కడపట – కుధర ముపై వ్రాలి చన – దవిలిన శోకమున ద్విజాతివి – తతి గుండెవిరాళి ॥ప్రభు॥
2. గతియించెను సంధ్యచీకటి – కారుకొనెంధాటి – మతి స్వాస్థ్యము నెడగా క్రీస్తు స – మాజప్రజాకోటి = క్షితితలాన రాజుప్రభవెలి – గెన్నొ కింతపాటి అట–మృతిభయంకరంబై వడినడి – రేయిపోయెదాటి ॥ప్రభు॥
3. తొలి జాముస్తవముజేసె విహంగమ – సంఘములలవోక కడు దీమసమున మింట చటుక్కున = దేవేగురుజుక్క జగతీమహోదయంపు చలనము – దెచ్చెవేగ బోక కనుభ్రామిక విడవేర భళీతెలవారె తూర్పురేఖ ॥ప్రభు॥

## 236 క్రీస్తు పునరాగమనము

రాజాధి రాజా రారా – రాజులకు రాజువై రారా – రాజయేసు రాజ్యమేల రారా – రవికోటితేజ యేసురారా॥
ఓ ...మేఘ వాహనంబుమీద వేగమే – ఓ.. మించు వైభవంబుతోడ వేగమే ॥రాజాధి॥

1. ఓ...భూజనంబులెల్ల తేరిచూడగా–ఓ...నీ జనంబు స్వాగతంబునీయగా = నీ రాజ్యస్థాపనంబుసేయ–భూరాజులెల్ల గూలిపోవ – భూమియాకసంబు మారిపోవ–నీ మహా ప్రభావమునవేగ ॥రాజాధి॥
2. ఆ....ఆకసమున దూత లార్భటింపగా – ఆ ...ఆదిభక్త సంఘసమేతంబుగా = ఆకసంబు మధ్యవీధిలోన – ఏకమై మహాసభజేయ – యేసునాథ! నీదు మహిమలోన – మాకదే మహానందమౌగ ॥రాజాధి॥
3. ఓ...పరమ యెరుషలేము పుణ్యసంఘమా – ఓ...గొఱియపిల్ల క్రీస్తు పుణ్యసంఘమా – పరమదూతలార! భక్తులారా! పౌలపోస్తులారా! పెద్దలారా! గొఱియపిల్ల యేసురాజుపేర – క్రొత్త గీతమెత్తి పాడరారా ॥రాజాధి॥

–ఈ.డి.నిత్యానందము

# పరిశుద్ధాత్మudagu దేవుడు

## 237 పరిశుద్ధాత్మ స్తుతి

రా – బిలహరి తా – అట

పరిశుద్ధాత్మ నిత్యాత్మ – పరమ పావురమా =దురతేచ్ఛలను దూర– పరచు సత్యాత్మా ॥పరిశుద్ధాత్మ॥

1. నిత్యంపు వెల్గుచే – నింపు జ్ఞానాత్మ = సత్యంపు శుభ వార్త – సంధించు నాత్మ ॥పరిశుద్ధాత్మ॥
2. జీవమార్గంబున – జీవింప నేర్పి = త్రోవc దప్పిన వారి – భావంబు మార్చు ॥పరిశుద్ధాత్మ॥
3. పాపాంధకారంబుc – బాపు నీ వెలుcగుc = జూపి మింటికి నడిపి – కాపాడి మెలcగు ॥పరిశుద్ధాత్మ॥
4. భక్తుcడు శోధింపc – బడుచుండునేని = యుక్తిc దెల్పెడి సర్వ – శక్తి నీదౌను ॥పరిశుద్ధాత్మ॥
5. తిన్ననైన తెలివి – తేట నాకిమ్ము = నిన్ను సేవించెద – నిజము స్తోత్రమ్ము ॥పరిశుద్ధాత్మ॥

– బేతాళ జాన్

## 238. పరిశుద్ధాత్మకొరకు వేcడుట

రా – ముఖారి (చాయ: యేసు క్రీస్తుని గొల్వరన్న) తా – ఆది

దైవాత్మా దిగుము దాసుల పైని – నీ దయా దృష్టిc – పారజేయుము ప్రేమన్ నింపు = దేవా యాత్ముండ–దిగుము మమ్ముల – శుద్ధీకరించుము – దయారసముచే ॥దైవాత్మా॥

1. దైవాత్మా దిగుము ప్రవక్తలు - పూర్వంబు నీదు -ప్రేరణవలనఁ బ్రవచించిరి = పావురమా దిగి - మాలో వసించుము-పాపుము చీఁకటి- వెలుఁగుచు మాలో ॥దైవాత్మా॥

2. రమ్ము ఓ యున్నతంపు ఆత్మా - నాలుగు దెసల-నుండి మమ్ముల నావరించు= రమ్ము రమ్ము దిగి = యెండిన యెముకలు-గానగు లోకుల -మీదికి ముదమున ॥దైవాత్మా॥

3. మే మజ్ఞానాంధకారమునను - మునిఁగితిమి గాన - చెదరఁగఁజేయు మంధకారము = పామర జనులకుఁ-బేర్మితొ నొసఁగు సు- జ్ఞాన ప్రకా శము - నిల్పుము మాలో ॥దైవాత్మా॥

- మామిళ్ల యెషయా

## 239 పరిశుద్ధాత్మకొరకుఁ బ్రార్థించుట

రా - ముఖారి (చాయ: యేసు కరుణ) తా- అట

ఆత్మా నడుపు స-త్యము లోని కిపుడే - యాత్మా నడుపు = ఆత్మా నీ సాయంబు - నధికంబుగా నిచ్చి -ఆత్మానందముతో దై-వారాధనమున॥ కాత్మా॥

1. ఘోర కలుషంబుల- దూరంబుగాఁ దోలి = పారమార్థిక బుద్ధిఁ-గోరు నట్టులను ॥ఆత్మా॥

2. అంధత్వంబు వలన - మందమైయుండు మా = డెందంబు లెల్ల నీ యందు వెలుఁగుటకు ॥ఆత్మా॥

3. నిర్మల హృదయంబు - నిరతంబు మా కిచ్చి = కూర్మిన్ నీ వరములఁ- గూర్చి దీవించి ॥ఆత్మా॥

4. సకల మానవులతో - అకలంక శుభవార్తఁ = బ్రకటించు బలజ్ఞాన - నికరంబు నిచ్చి ॥ఆత్మా॥

5. దీవించి పంపు మో దైవాత్మా మమ్మును భావజ్ఞాన మొసంగి - ప్రభు సేవలోన ॥ఆత్మా॥

-తూలూరి కొర్నేలియస్



## 240 *Our Blest Redeemer, ere He Breathed*

1 శ్రీ యేసు స్వామి తిరిగి
మోక్షంబుఁ జేరగా
ఒక్కాదరణకర్తను
ఒసంగెను.

2. ఆ దేవునాత్మ ప్రీతిగా
మదిన్ వసించుచు
విధేయులైన మనల
పాలించును.

3. సద్గుణ మున్న మనకు
ఆ యాత్మ దానము
శోధించు దుష్టుని సహా
జయించును.

4. ఓ దేవునాత్మ, మమ్మును
విశుద్ధిపర్చుము
మా హృదయంబులో సదా
వసించుము.

-హేరియట్ ఆబర్
అను జేకబ్ చేంబర్లేన్

## 241 *Gracious Spirit, Holy Ghost*

1. దివ్య పావనాత్మ, నీ
యీవు లన్ని మంచివి
నీదు ముఖ్యదానమీ
-దివ్య ప్రేమయే-

2. ప్రేమ దయచూపును
ప్రేమ దీర్ఘశాంతము
మృతికన్న బలము
- దివ్య ప్రేమయే-

3. కాలజ్ఞాన మంతయు
కొట్టి వేయబడును
ప్రేమ నిత్య ముండును
- దివ్య ప్రేమయే -

4. దృష్టిగా విశ్వాసము
మాఱఁగా నిరీక్షణ
యనుభవమౌఁ గాని
- ప్రేమ నిత్యమే-

5. విశ్వాస నిరీక్షణ
ప్రేమ లీ మూడుండును
కాని శ్రేష్ఠమయినది
-దివ్య ప్రేమయే-

6. పావనాత్మ! స్తోత్రము
నీకుఁ జేయు వారము
మాకు దయచేయుము
-దివ్య ప్రేమయే -

క్రిస్టఫర్ వర్డ్స్ వర్త్
అను: బర్నార్డ్ లూకాస్

## 242 *Come Holy Spirit Heavenly Dove*

1. దైవాత్మ పరిశుద్ధుడా
ధారాళ ప్రేమను
దండిగ నిచ్చి మమ్మును
దయన్ దీవించుము.

2. మా యజ్ఞానాంధకారము
ప్రయము జేయుము
నీ యెక్కువైన తేజము
మా యందు పోయుము.

3. మా దుర్గుణంబు లెల్లను
చెదరఁ గొట్టుము
మా పాప మణుపుటకై
నీ శక్తిఁ జూపుము.

4. సన్మార్గమందు నిత్యము
మమ్ము నడుపుము
నీ మోక్షమందు పిమ్మట
మమ్మాదరింపుము.

– ఐజక్ వాట్స్
అను: జాన్ స్మిత్ వార్డా

## 243 పరిశుద్ధాత్మకొరకైన మన యక్కర

రా – కళ్యాణి తా– త్రిపుట

పరిశుద్ధాత్మను గోరుము – జీవమ యేసు – ప్రభుని పేరట వేడుము = నరు లందరి మీఁద – నా యాత్మ నుంతు నని – పరలోకపు తండ్రి – పలికె వేదమునందు ॥పరిశుద్ధాత్మను॥

1. పరిశుద్ధాత్మ లేనిది – వేదాగమ – పఠన పఠనము గాదది = నెర చీఁక టింట సర – కులు వెదకు రీతి ప – ల్మరు వెదకినను నిర – ర్థకమై పోవును వేగఁ ॥పరిశుద్ధాత్మను॥

2. పరిశుద్ధాత్మ లేనిది – వర్షము లేని – పైరు చందంబే యది = పరబోధక ముల వ – ర్తితమైన పనులు జీ – వ రహితములై యను – భవము గానివై యుండుఁ ॥పరిశుద్ధాత్మను॥

3. పరిశుద్ధాత్మ లేనిది – యేసు ప్రభుని –నెఱుఁగు టెఱఁగుట గాదది = నర రూపుఁ దాల్చి దు – ర్నరుల రక్షణకొరకు – మరణ మొందిన ప్రభుని– కరుణాధికము వడయఁ ॥పరిశుద్ధాత్మను॥



4. పరిశుద్ధాత్మ లేనిది – జీవము లేని – బ్రతుకే బ్రతుకుగాదది = దురితేచ్ఛ – లను గొప్ప – యురులం దగిలి భక్తి – తరిగి పోవుట కద్ది – దొరకనందున మమ్ము ॥పరిశుద్ధాత్మను॥

5. పరిశుద్ధాత్మను బొందుట – అన్నిటి కన్నఁ –ప్రబలంబైన మేలిట = నెర నమ్మి మొఱబెట్టు – పరమ పావనఁ డద్ది – కరుణించి నీ కొసఁగు – మరణాంత మగు దనుక ॥పరిశుద్ధాత్మను॥

– బేతాళ జాన్

## 244 పరిశుద్ధాత్మా, రమ్ము

రా – ఆనందభైరవి (చాయ: తనువునాదిదిగో) తా– అట

పరిశుద్ధాత్ముఁడ దేవ!– ప్రభువా నీ కరుణ మా – పైన వర్షించు మయ్య= వరుఁడా నీ భక్తుల–మనముల నాత్మల – బలపర్చి రక్షించి–మరి స్వస్తి నిడు మయ్య ॥పరి॥

1. బలమౌ నీ వెలుఁగుచేఁ – బలు దేవ భాషల – ప్రజల కందర కైక్యముఁ= గలిగించి విశ్వాస – మున వారి నొనఁగూర్చి – వెలయుచుండెడు నీకే – విన తుల్ సల్పుదు మయ్య ॥పరి॥

2. బలమౌ దుర్గమా మిగుల – పావనంబగు వెలుఁగా!– ప్రభువా దేవుని జ్ఞానము = కలిగించి మదితోడఁ– బిలువఁ దండ్రీ యంచు – వెలుగు సత్య మునౌ నీ – బల వాక్య మిదు మాకుఁ ॥పరి॥

3. విపరీత బోధలను –వేరౌ బోధకులను – విడువ మా కిదు సాయము = కృప నొప్పు యేసే మా – గురు వంచు మది నమ్మి – యపనమ్మికను మాని – యవనిం బ్రతుక నిమ్ము ॥పరి॥

4. పరిశుద్ధతకు నూటా – నెర నెమ్మదికి కర్తా – జరిగింప నీ యాజ్ఞలన్ = త్వర నొందు చరణములు – స్థిర దెందమును నిమ్ము – పరిశోధనలు గలుగ – భయమొంద నీయకుము ॥పరి॥

5. మరణ జీవంబు ల – స్థిర యోధులను బోలి – పరుగెత్త నీ దారినే = తిరతఁ దప్పిన వేళ – దేహంబునకు శక్తి – గరిమతో నిడి సిద్ధ – పరచుము మము ప్రభువా ॥పరి॥

– కడియం గాబ్రియేలు

## 245 పరిశుద్ధాత్మా, రమ్మి

రా – శ్రీరాగము తా – ఆది

రమ్మి రమ్మి పరిశుద్ధాత్మా – రమ్మి రమ్మి = రమ్మి దీవింపఁగ – నిమ్మి నీదు కృపను – నింపు మా డెందముల్ – నెమ్మదిఁ బొందంగ ॥రమ్మి॥

1. జీవంపు టూటవు – ప్రేమ జ్వాల వీవె = దేవ దాన మీవె – యాద రించువాఁడ ॥రమ్మి॥
2. దేవహస్త మీవె – వరము లన్ని నీవె = నీవె తండ్రి వాగ్ధ – త్తమ్మయి వెలుంగుచుండు ॥రమ్మి॥
3. మాటలాడు శక్తి – నిచ్చి నాయాత్మను = మేటిల్ల నను నభి – షేకించుమీ దేవ ॥రమ్మి॥
4. ఇమ్మి నీదు వెలుఁగు – నింపు నీ ప్రేమతో = కమ్మి నాకుఁ తోడు = నన్ను బలపర్చుమా ॥రమ్మి॥
5. పారదోలు దవ్వ – నాత్మ శత్రువుల నిం = పార నీదు నెమ్మ – దిచ్చి ప్రోవు నన్ను ॥రమ్మి॥
6. ముందు నీవు నడువ – నన్ను దాయ దేది = యిందు నన్ను c జెరచు – వారు లేరు భువిని ॥రమ్మి॥
7. జనకుఁ జూపు నాకు – నట్లె చూపు సుతుని = ననయ మెటిఁగి దేవ నిను నమ్మి జీవింప ॥రమ్మి॥
8. జనక సుతాత్మయౌ – ఘనత్రిత్వమౌ దేవా = నిను సన్నుతింపను నీదు దయ నంపుమా ॥రమ్మి॥

– మేడికాయల సాధువు

## 246 పరిశుద్ధాత్మకొఱకైన ప్రార్థన

రా – యదుకులకాంభోజి (చాయ:తనువునాదిదిగో గైకొనుమీ) తా –త్రిపుట

పరిశుద్ధాత్ముఁడ ప్రభువ! – వరదా! మా హృదయమం – దిరముల వసి యింపుమా = అరుదైన నీదివ్య – తరశక్తులను దాల్చి – త్వరగా మాపై దిగుమా కరుణాబ్ధివై యిపుడు ॥పరిశుద్ధాత్ముఁడ॥



1. పరమండలాగ్నివై – యరుదెంచి మా హృదయాం – తర దురితతూలం బును = దరికొల్పి పరిశుద్ధ పఱచి మా యాత్మల మా–వరరక్షకునకు న – ర్పణ ముగా నిడుమయ్య ॥పరిశుద్ధాత్ముఁడ॥
2. కాంతులీనెడు దీప – కలికవైవచ్చి మా – స్వాంతంబులఁగప్పిన = యంతు లేని యవిద్యా – ధ్వాంతంబుఁ జోపి సు – స్వాంతులేగెడు సత్య – సరణిఁ జూపింపుమా ॥పరిశుద్ధాత్ముఁడ॥
3. చలువఁ గూర్చెడు మంచు–జల్లురూపమున మ – మ్ముల నెల్ల దీవింపుమా = ఫలశూన్యంబైన యా – ఆత్మలకు నీ బల మొసఁగి–ఫలవంతములుగ గే–వలుఁడా యొనరింపుమా ॥పరిశుద్ధాత్ముఁడ॥
4. పరమ పారావతమా!–పక్షములు విప్పి మా – శిరములపైని చాఁచి = పరమందు నీ సంఘ – పరిశుద్ధులకువలెనె – ధరనున్న మాకు నీ – వరముల నిడుమయ్య ॥పరిశుద్ధాత్ముఁడ॥
5. దివినుండి భువికి నా – రవముతో వీతెంచు –పవమానాకారుండవై = నవ జన్మసంప్రాప్తికవరోధమొనరించు – భవదుఃఖాంబుద పటలిఁ బాఱఁ దోలుము కృపచేఁ ॥పరిశుద్ధాత్ముఁడ॥
6. అందమౌ నీమోము – నందుఁ జిందెడు తేజ–మందఱు వీక్షింపగా = విందవై వచ్చి మా – డెందంబులకు నిత్యా – నందంబుఁగూర్చి మా – వందనంబులు గొనుమా ॥పరిశుద్ధాత్ముండ॥

–దాసరి మోజెస్

## 247 పరిశుద్ధాత్ముని ప్రాపు

రా – కాంభోజి (చాయ: అన్ని కాలంబుల) తా – అట

పరిశుద్ధాత్మ ప్రభుని – వరదివ్యశక్తిబం – ధురము ధరణికిజీవ – సంజీవము – పరమౌన్నత్యంబైన – పరలోక సువిశేష – పరమార్థములు దెలుపు నెటిమార్గము ॥పరి॥

1. ఆపత్కాలమునందు - ప్రాపయి మానవజాతి - కాపయి సంరక్షించి - ఏపారును = పాపాంధకారమున బడి ప్రమ్రగ్గి శోకించు - పాపజాతికి దీప రాశియై రహియించు - కృపయు కనికరములు గుంఫించి - మధురాతి- ప్రభగా భాసిల్లెడు పరమార్థము - అపభ్రంశకార్యముల కెపుడు తావీయక- సుపురోగతిని జూపి శోధించును ॥పరి॥

2. బండలనుపమించు - గుండియల కదలించు - నిండుశక్తి ఘటించు నీతి బెంచు = ఎండిన యెదలను నిండించు రక్షణో - ద్దండ విలసిత భాగ్య దానమ్ములు - దండిగానసమాన ధైర్యోత్సాహములిచ్చి- మెండుగా నాదరము మేళవించి - మండుచున్న పాప మరణాగ్ని జ్వాలల - నుండి పాపిని గాచు నండయౌచు ॥పరి॥

3. శాంతి సమాధాన -సౌజన్యభావమ్ము- కాంతిమంతము గల్గు కారుణ్యము= అంతములేనట్టి - ఆనంద శుద్ధాత్మ శాంతిదాంతియొసంగి సంరక్షించు = ఎంతో సంతోషముతో - అంతుబొంతులేని వి -క్రాంతి బలత్యాగముల - గావింప జేయు - చింతా ధ్వాంతములోన - చెదరికొట్టుకపోవు - శాంతిలేని జనతకు - సౌఖ్యాస్పదము ॥పరి॥

- నురగాల తిమోతీ జ్ఞానానందము

## 248 పరిశుద్ధాత్ముడా - దిగిరమ్ము

రా - కమాసు (చాయ: చూచుచున్నాము నీ వైపు) తా - త్రిపుట

పరిశుద్ధాత్మా పావురమా - నీ దాసులపై - కరుణతో నరుదెంచుమా = పరిశుద్ధుడగు యేసు - పరమున కరిగి యా - దరణకర్తగ నిన్ను - దయచేసె గద మాకు ॥పరి॥

1. తండ్రి కుమారాత్మల - యేకాత్మవై - యుండిన పావనుడా = నిండార నీ యాత్మ - నండగ మాకొసగి - దండిగ వరముల -దయచేయు మోదేవ ॥పరి॥

2. విధిగ వేదము జదివిన - వేమారుసద్బోధల నాలించినా = సదయుడ నీ శక్తి - హృదయాల లేకున్న - కదలింపబడలేని -కలుషాత్ములము తండ్రి ॥పరి॥



3. సత్యస్వరూపా రమ్ము - మమ్ముల సర్వ - సత్యములో నడుపుము = సత్యాత్మా నీ శక్తి-సంపత్తితో దైవ - కృత్యము లొనరింప -గ్రుమ్మరింపుమా శక్తి ॥పరి॥

4. వాక్యమందలి భావముల్ - లోతుగ దరచి - వచియింప దరమె మాకు = వాక్యోప దేశివిగా - వచ్చి మాలో నిలచి - వాక్యమందలి జీవ - భావాలు దెలుపుమా ॥పరి॥

5. సాధక బాధకముల - నిలయంబైన - సంసార సాంద్రములో= ఆదరణ కర్తవుగా - నరుదెంచి మా సర్వ - బాధల దొలగించి - మోదంబు గూర్చుమా ॥పరి॥

*-వి.డి. జాన్ సుందరరావు*

## 249 మార్గదర్శియగు పరిశుద్ధాత్ముఁడు

రా - ఆనందబైరవి (చాయ: ఓ మా తండ్రి నీదు నామము) తా - ఏక

రమ్ము పరిశుద్ధాత్మ దేవుఁడా- మమ్మును గృపాస - నమ్ముకడకు - నెమ్మి నడుపుమా = మమ్ము నడుపు దీక్షతోఁబ - రమ్ము విడిచి యాత్మస్వరూ- పమ్మున నరుదెంచిన దై - వమ్ము నీవెకద యెహోవ ॥రమ్ము॥

1. లోకయాత్ర చేయునప్పుడు చీ - కాకుపడిన - మాకు నీవె మార్గ దర్శివై = వీఁక నొసఁగి - మాకరంబుఁ - జేకొని పరిశ్రమముఁబాపి - సిలువఁ బడినవానికడకు - శ్రేకమూని మమ్ముఁజేర్ప ॥రమ్ము॥

2. భక్తవన వసంతదైవమా- నీయందుఁ బ్రేమా - సక్తివృద్ధిచేసి మనుపుమా= ముక్తిదాత యేసువిభుని - రక్తమహిమఁ దెల్పియఘ వి-ముక్తులనుగఁజేసి మమ్ము - యుక్తమార్గమందు నిలుప ॥రమ్ము॥

3. జీవితంపుబాధ లెన్నియో - పెనుఁబ్రోవులగుచు - నావరించి మమ్ముఁ దాకిన = మాకు నీవె హితుఁడవగుచు - భావమిచ్చి భయముఁదీర్చి - జీవ మైన యేసుపాద - సేవకు మముసిద్ధపఱుప ॥రమ్ము॥

4. పలువిధంబులైన చింతలు - చెలరేఁగి మమ్ము - కలఁతపెట్టు నవసరంబున = వలనుచెడిన మామనముల - మలయు వ్యాకులతను మాన్పి - వలయు నాదరణము నిచ్చు - పలుకుదోడు వీవెయగుచు ॥రమ్ము॥

5. తొలిప్రవక్త లెంద రెందఱో – నీ ప్రేరణమునఁ –బలికినట్టి వేదమందునఁ= గల నిగూఢ భావములను – దెలుపు నొజ్జవీవెయగుటఁ – దెలిపి వాని మమ్ము జ్ఞాన – కలితమతులఁ జేయుకొఱకు ॥రమ్ము॥

6. సడలివాడిపోవుచున్న మా – విశ్వాసలతను – బలసమృద్ధి నుద్ధరించి మా = యెడఁదశోధనములకతనఁ బొడము సంశయాంకురంబు – లడఁచి ప్రేమఁ జ్యోతిమాలోఁ – గడుస్థిరముగ వెలుఁగజేయ ॥రమ్ము॥

7. స్తుతులు నుతులు నీకెచెల్లుఁగా – వుత యుగయుగంబు – లతులభక్తిని న్నె కొలుతుము = క్షితినివీడ మమ్ము మోక్ష గతికి నడిపి చేర్పుమయ్య – మృతికి మృత్యువైనవాని వితతసింహపీఠిపైని ॥రమ్ము॥

– దాసరి మోజెస్

## 250 పరిశుద్ధాత్మునిఁ బొందుడి

రా – కళ్యాణి (చాయ: పరిశుద్ధాత్మను గోరుము జీవమా) తా – అట

పరిశుద్ధాత్మునిఁ బొందుము – ప్రభువిచ్చెడు – వరసహాయునిఁ బొం దుము = పరిశుద్ధవర్తనకు – పరమసాహాయ్యంబుఁ – పరముఁజేరువఱకు –పరి పూర్తిగా దొరకు ॥పరి॥

1. పరిశుద్ధాత్మునిఁ గల్గిన – మన రక్షణ – పరిపూర్ణమై యుండును = పరమ రక్షకుఁడిచ్చు – పరిపూర్ణ రక్షణను – పరమానందముతోడఁ– పరగఁగైకొను మిపుడే ॥పరి॥

2. పరిశుద్ధాత్మునిఁ గల్గిన – బైబిలువాక్య – పరమసారము తేటగుఁన్ = పర మండలపుఁ తండ్రి – పరిశుద్ధచిత్తంబు – పొరపాటులేకుండ – విరివిగాఁ దెలియును ॥పరి॥

3. పరిశుద్ధాత్మునిఁ గల్గినఁ – బ్రార్థనలందుఁ – పరమ పాటవ మబ్బును = సరిగాఁ బ్రార్థించెడు – సరణియుఁ దెలియును– వరములను బొందుటకు – తెరువులభియించును ॥పరి॥

4. పరిశుద్ధాత్మునిఁ గల్గిన – శోధనములఁ–పరమ విజయము గల్గును = దురితంపు శోధనలఁ – దొలగింప నా ప్రభువు – పరమశక్తినొసంగి – కరుణతో జయమిచ్చు ॥పరి॥



5. పరిశుద్ధాత్మునిఁ గల్గిన – జీవితమెల్లఁ–పరిశుద్ధముగ నుండును = పరిశుద్ధ జీవితము – కరము సాధ్యంబగును – పరిశుద్ధాత్ముని శక్తిన్ – వర్తింపఁగలమట్లు ॥పరి॥

– మండపాక కేశవరాయశర్మ

## 251 పరిశుద్ధాత్మ కుమ్మరింపు

రా – ఆనందభైరవి (చాయ: రారే గొల్లవారలారా) తా – ఆది

వినరే యపోస్తలుల కార్యముల్ – క్రైస్తవు –లను వారి కవి యెంతో ధైర్యముల్ = మనసు లొక్కటిఁ జేసి – కొని యట్లు ప్రార్థింప – ఘన ముగ విమలాత్మ – చనుదెంచె వారిపై ॥వినరే॥

1. పరమండలమునుండి వచ్చెను – పెద్ద – కరువలివలె శబ్ద మిచ్చెను = తిర ముగ వార లం– దరుఁ గూడి యున్న మం–దిర మెల్ల నిండె బం–ధురమై తన్నాదము ॥వినరే॥

2. అనలార్చులను దీప్తి మించుచు–బీఁట–లగు జిహ్వల్వలె గనుపించుచు = ఘనముగ నొక్కొక్క – జనునిపై – నవి నిల్వఁ – గను బరిశుద్ధాత్మచే – తను నింపఁబడి రంత ॥వినరే॥

3. వారన్య భాషలతోడను – నాత్మ – ప్రేరణమును జేయు జాడను = ధారా ళముగ భాషాం–తరము లాడిరి విన్న–వారి కబ్బురమై వి – చారము ల్పొడమంగ ॥వినరే॥

4. ముందట వారిటుల గుంపుగ – మోద–మందుచు దేవునిఁ గొల్చి తా = మందరు చూడఁగ – వింత వింత పనుల – నందందు జేసిరి – దేవుని దయచేత ॥వినరే॥

5. మనము నా రీతిగ గుంపుగాఁ గూడి – మన దేవుఁ గొల్వఁగ భూమిలో = మనుజుల కాశ్చర్య – మగు కార్యములఁ జేయ – నొనగూడు మనసు కా–నందమును గల్గు ॥వినరే॥

–పురుషోత్తము చౌదరి

# పరిశుద్ధ లేఖనములు

## 252 దేవుని వాక్యము

రా – ఖరహరప్రియ తా – అట

దేవుఁ డిచ్చిన దివ్యవాక్య మి – దేను మన కో యన్నలారా = భావ శుద్ధిని జేయు ఘన శుభ – వర్తమానము దీని పేరు ॥దేవుఁ డిచ్చిన॥

1. భయముతో భక్తితో ఁ జదివినఁ – బ్రాపు క్రీస్తుఁ డటంచుఁ దెల్పును = దయా మయుఁడగు దేవుఁడే మన – తండ్రి యని బోధించు నెల్లెడ ॥దేవుఁ డిచ్చిన॥
2. సత్యశాంతము లంకురించును – సత్క్రియా ఫలములును బొడమును = నిత్యజీవము గలుగు దానన్–నిస్సందేహముగ నుండును ॥దేవుఁ డిచ్చిన॥
3. ఈ సుమంగళ దివ్యవాక్యము–నిప్పుడే మీ రనుసరించుఁడు = దోసములు నెడబాసి మోక్షపుఁ – ద్రోవఁ గోరిన వారలెల్లరు ॥దేవుఁ డిచ్చిన॥
4. పాపములలో నుండి విడుదలఁ – పరమ సుఖ మని దలఁతు రేనియుఁ = తాప మార్పును లేచి రండి – త్వరగఁ క్రీస్తుని శరణు బొందను ॥దేవుఁడిచ్చిన॥
5. దురిత ఋణములు దీర్చు మధ్య – స్థుండు గావలె నన్న వారలు = త్వరగ రండీ త్వరగ రండీ – వరదుడౌ క్రీస్తు కడ కిపుడె ॥దేవుఁ డిచ్చిన॥
6. మరణమునకై భయము నొందెడి – మానసము గల వార లెల్లరు = పరమ శాంతి యొసంగు క్రీస్తుని – పజ్జ దాయఁగ రండి వేగము ॥దేవుఁ డిచ్చిన॥
7. నిర్మలాంతఃకరణ సౌఖ్యము –నిజముగా నిలవెదకువారు = ధర్మచిత్తుండైన క్రీస్తుని – దరికి రండి రండి వేగము ॥దేవుఁ డిచ్చిన॥
8. మోక్ష రాజ్యముఁ జేరఁ గోరెదు – బుద్ధి గలిగిన వార లెల్లరు = రక్ష కుండగు యేసు నొద్దకు – రండి రండి విశ్వసించుచు ॥దేవుఁ డిచ్చిన॥

–పురుషోత్తము చౌదరి





## 253 పరిశుద్ధగ్రంథము

రా – హి॥ భైరవి తా – చాపు

దేవుని గ్రంథము–దినదినము చదువుము = పావనమార్గము – జీవము సత్యము ॥దేవుని॥

1. ఎంచి తలంచుము – మించిన గ్రంథము = అంచితముగను రెం – డంచుల ఖడ్గము ॥దేవుని॥
2. తేనియమధురము – తినుము ప్రతిదినము = ధ్యానముసేయుము – దానన బ్రదుకుము ॥దేవుని॥
3. నాథుని వాక్యము – అరయుము భాగ్యము = పాదపు దీపము – భక్తుల కవచము ॥దేవుని॥
4. ఆత్మల శాంతము – అభయము శ్రేయము = ఆత్మలకు బలము – అనయము సౌఖ్యము ॥దేవుని॥
5. పాపము శాపము – పలువిధతాపము = పాపును వేగము – దాపున జేరుము ॥దేవుని॥
6. మదినిది నిరతము – పదిలము చేయుము = సదమల జ్ఞానము – సవిధము మోక్షము ॥దేవుని॥

## 254 ప్రభుని వాక్యామృతము

రా – ఖరహరప్రియ తా – ఆది

ప్రభువా పంపుమా – నీ– శుభవర్షము నిమ్మా = ప్రబలంబుగ నీ వాక్యం బనెడి– విభవామృతము కురియఁజేసి ॥ప్రభువా॥

1. వాడియున్నట్టి – యీ – మోడు వృక్షములే = వడిగాఁ జిగురు పెట్టి పూచి – గాఢంబుగను ఫలము లియ్యఁ ॥ప్రభువా॥
2. నీ వాక్యానల – శ్రీ – దేవా పంపుము = భావాఘముల మాడ్చి మనముల్ – పావనంబు బొందునటులఁ ॥ప్రభువా॥

3. ధరc జీకటి కిదియే – వే – గురుc చుక్క ప్రభువా = సరళంబుగ యాత్రికులు నడచి – పరమపదంబును బొందcగc జేయుచుc ॥ప్రభువా॥

– ఆల్‌ఫ్రెడ్ త్యాగరాజు పామర్

## 255 దేవుని వాక్యానందము

రా – మోహన తా – అట

సుఖ మిచ్చెగద మాకు – ప్రభుయేసువా నీ – సురుచిరమగు వాక్కు = నిఖిలకల్మష వనమునకు దవ – శిఖి శిఖలవలె గాల్చు నీదగు – ముఖవికాసిత వాక్యములు బహు – సుఖము లొసcగు తవాశ్రితాళికి ॥సుఖ మిచ్చె॥

1. జగతిలోపల మెందుగ – నుండిన వివిధ – మగు శాస్త్రములు జూడcగ = మిగుల గందరగోళమై మరి – యొకటి కొకటి విరుద్ధముగ మ –ర్త్యగణ కల్పిత మగుచు నున్నవి – తగని వని ద్రోచితిమి వాటిని ॥సుఖ మిచ్చె॥

2. నీ వాక్యముల భావము – నమ్మిన పాపి – జీవుల కది జీవము = కేవలం బగు ధర్మశాస్త్రము – దేవుc డిచ్చిన దొకటి బైబిలు – ఈ వసుధcగల సర్వ పాపులc బ్రోవ వచ్చిన నిన్నుc జూపెను ॥సుఖ మిచ్చె॥

– పురుషోత్తము చౌదరి

## 256 దైవ వాక్యము

రా – యదుకులకాంభోజి (చాయ: ధరణిలోని ధనము లెల్ల) తా – ఆది

మమ్ముc బ్రేమc జూచి దేవుcడు – మాకు బోధపరపcగ = ఇమ్ముగాను లేఖనముల – నిచ్చె మాకు భూమిపై ॥మమ్ము॥

1. మా మొగంబు నద్దమందు – మేము చూచునట్లుగ = మేము గాన వచ్చు మాస్థితి – మిగులc దేటగ నందులో ॥మమ్ము॥

2. పాప మనెడు బురద గోతిని – బడిన మమ్ము నెత్తcగా = పాప రహితుండైన యేసు – ప్రాణ మిచ్చెను బ్రేమచే ॥మమ్ము॥



3. పాప మంతయు వీడి మేము – భక్తి సరణిని నడువcగc = ప్రాపుగాc దన యాత్మ నిచ్చెc – ప్రాణసఖుcడగు యేసుండు ॥మమ్ము॥

4. సకల జనులు లేఖనముల – సత్యములను దెలియుచు = అకలుషముగ వానినమ్మcగ – నంపు మాత్మను రక్షకా ॥మమ్ము॥

– జేకబ్ చేంబర్లేన్

## 257 దేవుని వాక్యము

రా – కాపి తా – ఏక

శ్రీ వినోద దాయకంబు – దేవుని వాక్యంబు – జీవమునకు నాస్పదంబు – చిరమగు ధనంబు = భావంబుల మార్చు నంబు – బహుళ సాధనంబు ॥శ్రీ॥

1. పాప తతికి నాయుధంబు – పాపి కాశ్రయంబు – భూపతులకు దుస్తరంబు –పుణ్య సాధనంబు = శాప మడంచెడు శరంబు – జగతికి విభవంబు ॥శ్రీ॥

2. స్వాతంత్ర్య మిడు దనంబు – సర్వశ్రేయంబు – ఘాతకులకు ఖడ్గంబు – నీతికినిలయంబు = ప్రీతిని గరపెడు విధంబు – ఖ్యాతికిc బథంబు ॥శ్రీ॥

3. సత్య విరాజితంబు – నిత్య శోభితంబు – భృత్య వరుల సంచకరము – భీతున కభయంబు = చేతో విభవంబు సుగుణ – శిష్యుల హారంబు ॥శ్రీ॥

4. కర్తc జూపు నద్దంబు – ఘనమహాద్భుతంబు – దురితతతికి నస్త్రంబు– దుఖశోషణంబు = పరమోపదేశంబు – బహుళమానితంబు ॥శ్రీ॥

5. సర్వజనులకును హితంబు – సౌఖ్యసాధనంబు– శాంతికి నిజమార్గంబు– జగడముల హరంబు = జగము నంతకును వరంబు – సత్యవిజయంబు ॥శ్రీ॥

6. కోలాహల కారణంబు –చాల ప్రాచీనంబు–మూలమౌ ధనంబు జగము–నేలెడి తంత్రంబు = జాలియె దన సూత్రంబు – మేలు భూషణంబు ॥శ్రీ॥

7. జ్ఞానికి దుర్ గ్రాహ్యంబు–దాని బోధనంబు–దీనజనుల కర్థంబు – దివ్య శోభితంబు = మానితభక్తిని దినంబు – మానని పఠనంబు ॥శ్రీ॥

– గున్నాబత్తుల సమూయేలు

# క్రైస్తవ సంఘము

## 258 సంఘము

రా – మధ్యమావతి తా – ఆది

యెహోవ పురి పునాది – యిల – మహా స్థిరంబైనది

1. మహా సీయోను గుమ్మములు – అవి – యెహోవాకు నతిప్రియములు = ఇఁక – నిహ జను లెల్లరు గొనియాడి – నిను – బహు కీర్తింతురు పట్టణమా ॥యెహోవా॥

2. భూమిలో సర్వజనాంగముల్ – తమ – నామము లచ్చుట వ్రాయన్ = ఆ – స్వామి యెహోవా వారిన్ – అట – జన్మించిరి యని వ్రాయన్ ॥యెహోవా॥

3. పాటలు పాడి జనాంగమా – తమ – యూటలు నీ కడ గలవే = యని స్తుతియింతురు నిను స్తుతిపాత్రా – యిఁక – భజియింతురు నిను నిజభక్తిన్ ॥యెహోవా॥

4. ఇది క్రైస్తవ సంఘంబే – కడు – శుభముల నిచ్చు స్థలంబే = ధర–బుధులేసుని నిటఁ గనుచు – నతి–ముదమును బొందుట నిజమే ॥యెహోవా॥

5. జనః కుమా రాత్మకును – నిఁక – ఘనమహిమలు గల్గనుగాక = ఆ – దిని నుండిన రీతిని నిపుడు – నిఁక – ననవరతముందును ఆమేన్ ॥యెహోవా॥

– సరెళ్ల సమూయేలు సుబ్బయ్య

## 259 సంఘము క్రీస్తుని దేహము

రా – ఆనందభైరవి (చాయ: ఓ మా తండ్రి) తా – ఏక

యేసు దేహమైన సంఘము – ప్రభు క్రీస్తుపై వి–శ్వాస మమరి క్రా లెదు జనము = యేసు ప్రాయశ్చిత్త రక్తము – దోసములను బాపు నంచు – నాసతోడ నమ్మి తమ ప్ర – యాసములను దీర్చుకొన్న ॥యేసు॥





1. స్థాపకుఁడు యెహోవా దేవుఁడు – పాపులను గావ – నోపి సుతునిఁ బంపె కరుణుఁడు = ఈ పవిత్ర సంఘమునకు – దీపము పరిశుద్ధ వేద – మేపుమీఱు శిరసు క్రీస్తు – కాపుకర్త పావనాత్మ ॥యేసు॥

2. వరుఁడు క్రీస్తు యేసునాథుని – మురువంపు వధువై – పరఁగు నహ విశేషఖ్యాతిని = సరిగెపట్టు నారచీర – లరయ నీతి న్యాయము లవి–యురుతరాభరణముల సుం–దరము భక్తి వర్తనంబు ॥యేసు॥

3. తన యమూల్య రక్తముఁ దెచ్చి – యనురక్తుఁ డీమె – కనిశ శుల్క దానమునిచ్చి = ఘనుఁ డగు నా పావనాత్మ – తనకుఁ దోడుజేసి మంచి – పని తనమున నీమె కొక్క – భవనముఁ గట్టంగఁ బోయె ॥యేసు॥

4. మరణ విజయుఁ డైన వీరుఁడు – మహాస్త్రములపై – నరుగుదెంచు మహిమ శూరుఁడు = నిరతప్రేమ కాముఁ డీమె – కరముబట్టి పెండ్లి యాడఁ – ద్వరగ వచ్చుఁ గాన భక్తి – పెరుగ బ్రతుకు టుత్తమంబు ॥యేసు॥

–పట్టాభి ప్రసంగి

## 260 సంఘీభావము బలము

దావీదు కీర్తన 133

రా – కమాసు (చాయ: కొనియాడతరమే) తా – ఆది

ఎల్ల సోదరు లైక్యత – వసియించుట – యెంత మేలు మనోహరము ॥ఎల్ల॥

1. ధరణిలో నహరోను – తలనుండి దిగ జారు = పరిమళ తైలంబు – వలె నద్ది తనరారు ॥ఎల్ల॥

2. వెలయు సీయోను కొం – డల పైకి దిగి వచ్చు = నల హెర్మోను మంచు వలె నద్ది చెల్వారు ॥ఎల్ల॥

3. తరంతరం బాశీర్వా – దము నిత్య జీవంబు = స్థిరముగా నందుండ – సెల విడెను దేవుండు ॥ఎల్ల॥

4. జనక తన యాత్మకును – ఘన మహిమ మగుఁగాక = మును పిప్పుడున్ యుగ – ముల కగును గా కామేన్ ॥ఎల్ల॥

– మల్లెల దావీదు

## 261 ఐక్యత

రా – ఖరహర ప్రియ (చాయ: తన యత్రముములకు) తా – ఆది

సమకూర్చుము తండ్రి – క్రైస్తవ – సభలో నైక్యతను – ద్వరలోc = దమ ప్రియ కొమరుcడు – శ్రమలకుc బూర్వం – బమితాసక్తితో – నడిగిన విధ మున ॥సమ॥

1. దేశము రక్షణకై – తండ్రి – దేవుని మహిమార్థం – నిజముగ = వాసిగc గూర్పను – భాసుర ఐక్యం – బాశతో నిన్నిటు – నడుగుచునుండcగ ॥సమ॥
2. యేసుని నామమున్ – మమ్ముల – నేకముజేయు మిcకc – దండ్రి = నీ సిలువను జూ – చుచు మే మిలలో – వాసిగc బ్రేమతో – వర్థిల్లుటకై ॥సమ॥

– సరెళ్ల సమూయేలు సుబ్బయ్య

## 262 క్రైస్తవ సంఘ బాధ్యతలు

రా – ఆహిరి (చాయ: యేసువంటి ప్రియ బంధుడు) తా – ఆది

ప్రభుక్రీస్తు యేసు ప్రేమించె సంఘమును – పరిమళ వాసనగానుండ= ప్రభువు చిత్తమును పరిగణించుటయె – సంఘము నీ బాధ్యతగాదా! ॥ప్రభు॥

1. దేవుడిచ్చు బహుమానమె బిడ్డలు – గర్భఫలమె మన కిదు స్వాస్థ్యం ఇంపుగ ప్రతిష్టింపను వారిని – సంఘమ – నీ బాధ్యతగాదా? ॥ప్రభు॥
2. యువకులు రేపటి సంఘము నందున – నాయుకు లౌదురు నయముగను పావనులుగ నిలc జేయను వారిని – సంఘము – నీ బాధ్యత గాదా? ॥ప్రభు॥
3. బాప్తిస్మమును కృపా ప్రసాదములు – ప్రభు వెంచెను పరిశుద్ధముగ = ఘనముగ వాటిని గైకొన నిరతము – సంఘము – నీ బాధ్యతగాదా! ॥ప్రభు॥
4. దేవుడు జతపర్చిన దాంపత్యము – భావములర బంధుత్వములున్ = సవ్యంబుగ సరి జేయcగ వాటిని – సంఘ మ – నీ బాధ్యతగాదా? ॥ప్రభు॥



5. పామర జనములు ప్రభు నెఱుంగక – పెడ మార్గంబుల దిరుగగను = మానుగ రక్షణ మార్గము జూపుట – సంఘ మ – నీ బాధ్యతగాదా? ॥ప్రభు॥
6. క్రైస్తవ దాతృత్వము నందెదుగుట – కర్తను కీర్తించుట యౌను = దశమ భాగములు దాత కొసంగను – సంఘ మ – నీ బాధ్యత గాదా? ॥ప్రభు॥

– ఎం.ఎల్. మోజెస్

## 263 క్రీస్తు సంఘమునకు శిరస్సు

రా – బేహాగ్ తా – ఆది

సంఘ శిరసై వెలయు ప్రభువా – సత్యకృప సంపూర్ణ ప్రభావా = సర్వ క్రైస్తవ సంఘ మహి మా – స్తోత్రగీతల్ స్వీకరింపుమా ॥సంఘ॥

1. సంఘ యస్థిభారము వీవే – సంఘ జీవాధారము నీవే = సర్వ జనరక్షణము నీవే – సర్వలోక నిరీక్షణ నీవే ॥సంఘ॥
2. తరణి చుట్టు తారాగ్రహములు – పరివృత్తంబై తిరుగు రీతిని = తల యె క్రీస్తయి తనువే భక్తులై – తగిన సఖ్యత నైక్యత నుందురు ॥సంఘ॥
3. నూతనాత్మ నూతన జన్మ – నీతి సేవా నిరతియు గలిగి = నిత్య మాతనియందు నిలచి – నెగడు వారే నిజక్రైస్తవులు ॥సంఘ॥
4. ఆత్మశుద్ధి – అనుపమబుద్ధి అమలవర్తన మనిశము గలిగి = ఆత్మఫలములు జూపగ నేర్చిన –యను భవంబే క్రైస్తవంబు ॥సంఘ॥
5. విశ్వసింతుము నిన్నే మేము – విమల జీవ ప్రదాయకుండ = వరుడనీవై వరదుడ వీవై – విశ్వ భారతి నుద్ధరింపుమా ॥సంఘ॥

– చెట్టి భానుమూర్తి

## 264 *The Church's one foundation*

1 ఈ సంఘం పునాది
క్రీస్తే సాధీశుcడే
దక్కించె యేసు దీని
వాక్కాపుల్ రెట్టించే

పై నుండి వచ్చి యేసు
పెండ్లాడె నీమెనే
కోరుచు రక్త మిచ్చి
కొనె నీ కన్యనే

2 ఒక్కఁడే దేవుఁడిందు
ఒక్క విశ్వాసము
ఒక్కటే జన్మ మిందు
ఒక్క కుటుంబము

ఒక్క ప్రసాద విందు
ఒకే సునామము
నిరీక్షణొక్క టిందు
నిరంత ప్రాప్తికే

3 అసత్య మార్గమంచు
అనేకుల్ నవ్వినన్
విభాగ మై శ్రమంబుల్
విశేష మొందినన్

సుభక్తుల్ వేడుచుంద్రు
అభయ కాంతికై
యీ నింద లెల్లఁ బోయె
ఆనంద నాటికై

4. కఠిన దుఃఖ బాధల్
కల్గిన నోర్చుచు
విభ వానంద ప్రాప్తి
లభింపఁ గోరుచు

ఆ స్వర్గ పంక్తిఁజేరి
యానంద మొందుచున్
యీ సంఘ మేసుఁ గూడి
విశ్రాంతి బొందును

– సామ్యూల్ జాన్ స్థాన్

అను: ఆల్‌ఫ్రెడ్ త్యాగరాజు పామర్

## 265 *Glorious Things of Thee are spoken*

1 దేవుని సీయోన్ పురమా!
శ్రేష్టమౌ పట్టణమా !
స్థావరంబైన పురమా !
దేవుని నివాసమా!

యుగముల శిలయైన
దేవుడే నీ పునాదీ!
శత్రువు జయించలేని
రక్షణ నీ దుర్గము.

2 కాంచుమా సజీవధారల్
శాశ్వత ప్రేమధారల్
నీదు పుత్రికా పుత్రులన్
తృప్తిపర్చు ధారలన్

అలసి సొలయకుండ
దాహమున్ దీర్చుధార
దాతయౌ దేవుని కృప
సర్వకాలంబు పారున్

3 కాంచుమా నీ యిండ్లమీద
అగ్ని మేఘంబుల్దిగె
ప్రభుని రాక సమయం
బని మహిమ దెల్ప!

ప్రార్థన ఫలంబులిచ్చి
మన్నా నిచ్చిన ప్రభు
సింహాసనాసీనుడై సు
నాదుస్తోత్రంబుల్ వినెన్

–జాన్ న్యూటన్

అను : పి.సి బెన్నో





# సంఘసేవకులు

## 266 నిజసేవకుని లక్షణములు

దావీదు కీర్తన 15

రా – ధీరశంకరాభరణము (చాయ : భజన చేయుచు) తా – ఆది

ఘన యెహోవా నీ గుడారం – బున నతిథియౌ వాడెవండు = తనర
నీ పరిశుద్ధ పర్వత – మున వసించెడు వాఁడెవండు ॥ఘన॥

1. వెలఁయగను యథార్ధ వర్తన – గలిగి నీతి ననుసరించుచు = నెలమితో మనసార నిజము – పలుకు చుండువాఁడై సుమ్మ ॥ఘన॥

2. తనదు నాల్కతోఁగొండె మాడఁడు – తన సఖునకును గీడు చేయఁడు = తనదు పొరుగు వానిపై నిం–దలను మోపఁడించు కేనియు ॥ఘన॥

3. వానికిని నీచుం డసహ్యుడు – వాఁడు భక్తుల గౌరవించును = హాని కలిగిన నాతఁడును బ్ర – మాణ మాడియు మాట తప్పఁడు ॥ఘన॥

4. మరియు ద్రవ్యము – వడ్డి కీయఁడు – నిరపరాధినిఁ జెఱప లంచము = అరయఁ డిట్టులఁ జేయువాఁడే – ధర నెపుడు గదల్పఁబడఁడు ॥ఘన॥

5. జనక తనయ పావనాత్మకు – ఘన మహిమయు కల్గుఁగాక = ముని పిపుడు నెల్లప్పుడున్ యుగ – ములకుఁ గల్గునుగాక యామేన్ ॥జనక॥

–మల్లెల దావీదు

## 267 సువార్తికుల ఘనత

రా – కళ్యాణి తా – త్రిపుట

ఎంతో సుందరమైనవి – ధర గిరులపై – నెంతో యందమైనవి = సంతతంబుఁ బరమ – జనకు ప్రేమను దెల్ప – సంతస మందుచు – సరిగ బ్రకటన జేయ = అంతటను బనిఁ బూని ప్రభు న – త్యంతముగఁ బ్రక టించి వసుధ న–నంత మగు శుభవార్తఁ జాటెడు – వింత యగు బోధకుల పాదము ॥లెంతో॥

1. మందమతులగు వారలు – మూర్ఖత్వంబు – నొందు నెల్ల జనంబులు = వందుచుఁ గుందుచు – వన గిరి కందరము – లందు నున్న సకల – మౌ మోటుజన మెరుఁగఁ = పొందుగాఁ ప్రభు యే సొసంగెడు – సుందరం బగు సత్య వాక్యం – బందుకొని చాటించుచుండెడు – అంద మగు బోధ కుల పాదము॥లెంతో॥

2. మదిలోఁ ప్రభుని నమ్మిన – పాపుల నెల్లఁ – తుదిని మోక్ష పదమ్మున = విదితమ్ముగాఁ జేర్చి – ప్రీతిఁ జూపున టంచు – ఇదిగో రమ్మని క్రీస్తు – పద సన్నిధిని జేర్ప = సదయులై శుభవార్తమానము = ముదముననను మదిలోన నిడి కొని – పదిలముగఁ ప్రకటించుచుండెడి – విదితు లగు బోధకుల పాదము ॥లెంతో॥

3. యేసు క్రీస్తు రారాజై – యున్నాఁడనుచు – భాసురంబుగఁ దెల్పుచు = వాసిగాఁ ప్రభు యేసు – వసుధ రక్షకుఁడనుచు – యీ సువార్తను జాటి యిచట నెమ్మదినొంద = దోసకారి జనంబు లందరి – కీ సుమంగళ వార్తఁ దెలుపుచు – దోస మంతయుఁ బాపు మన ప్రభు – యేసుఁ జూపెడు వారి పాదము ॥లెంతో॥

–మేడికాయల సాధువు

## 268 సభకాపరుల కొరకు ప్రార్థించుట

రా – కళ్యాణి (చాయ : పరిశుద్ధాత్మను గోరుము) తా – ఆది

పరిశుద్ధాత్ముఁడ, లెమ్ము నీ – సంఘముపై నీ – వర దీవెనల నుంచుమీ చిరుత కాలపు సభ కా – పరు లొంది నీ యగ్ని – యరుల నెదిరించి చా – టిరి నీదు సత్యంబు ॥పరి॥

1. బలుఁడా యీ కాలంబునన్ – దివారాత్ర – ములు నీదు సేవకులున్ = నలు దిక్కులను దిరిగి – విలసిల్లు నీ వార్త – పలు జనాంగములకుఁ బ్రకటించు చుందురు ॥పరి॥

2. ప్రతిదేశము దిప్పుడు – ఉజ్జీవముఁ బడసిరి నీ బిడ్డలు = అతులుండు నీ పుత్రుఁ – డాజ్ఞాపించిన యట్లే – యతి తీవ్రతను వేఁడ అధిపా మాకొసఁ గుము॥పరి॥



3. పరిశుద్ధాత్మ బలంబును – వాక్యపు ధృతినిఁ – బడసిన బోధకులను = ఇరుల శక్తిని ద్రోసి – నరులను నీ తట్టు – మరలఁ జేసెదువారిఁ – ద్వరలోఁ బంపుము దేవ ॥పరి॥

4. నీ యాత్మ కాంతితోడఁ – బూర్వము వలెనే – డాయంగ మముఁ జేయుమా = యే యడ్డున్నను బాపి – యెలమి నింగిని జీల్చి – దాయుము మము స్వేచ్ఛ – దయచేసి నీ యొద్దఁ ॥పరి॥

5. జను లెల్ల నీ వాక్యపు – శక్తి నెఱింగి – ఘనపరపఁ ద్వరచేయుము = పెను సంఘములు లోక – మున నాటి యిశ్రాయేల్ – జనపు నిద్రను బాపు – జయ మొందు నీ వాక్కు ॥పరి॥

6. ఇల సంఘమున నెడారుల్ – కప్పుము దేవ – తొలఁగించు మాటంకము = అల నీ వాక్యమునకు – నడ్డంబు లేమియు – గలుఁగకుండఁగ నిమ్ము – ఘన సంఘాధ్యక్షుండ– ॥పరి॥

7. నీ సంఘమును నబద్ధ – బోధలనుండి – నిర్మలంబుగఁ గావుమా = గాసిఁ జేసెదు జీత – గాండ్లను బాపి నీ – భాసిల్లు నుద్యాన – వనముగ నుంచుమా ॥పరి॥

– కడియం గాబ్రియేలు

## 269 బోధకులకొరకైన ప్రార్థన

రా – శంకరాభరణము తా – ఆది

అడుగుచున్నా మో దేవ – కడు దయను గావఁ = జెడుగుల మైన మేము ని– న్నడుగుటకు నే బిడియ మొందము = అడుగుఁడి మీ కిడియెద నంచు – నాన తిచ్చిన వాగ్దానమునఁ గని ॥యడుగు॥

1. వేదు కలరఁగఁ గూడి నిను గొని – యాడి యడిగెడు నీదు భక్తులఁ = గోడు గని దయతోడ నెప్పుడు – వీడక నెరవేర్తు వని ని ॥న్నడుగు॥

2. సారె సారెకు నిన్ను విడిచి – ఘోర దురితపు భారమందుఁ = జేరి నిను మఱచితిమి గద మా – క్రూరత నెడ బాపు మని ని ॥న్నడుగు॥

3. దుష్టుడు మాతోడఁ బోరఁగ – శ్రేష్ఠ మగు మానిష్ఠ తోడుత = కష్ట మనక వాని గెల్వఁ – బుష్టిని బుట్టించు మని ని ॥న్నడుగు॥

4. తోర మగు విశ్వాస నిరీక్షణ – కూరిమి విమలాత్మ వరములు = వారక హృదయాంతరంబులc – జేరిచి మము వెలిగించు మని ని ॥న్నడుగు॥

5. మోద మొప్పcగ నీదు వాక్యము – మేదినిపై బోధపరచెడు – బోధ కులపై శోధనంబులు – పొర్లి రాకుండాదరింప ॥నడుగు॥

6. దురితముల చే భరితు లయ్యెడు – నరులపై నీ కరుణc జూపి = గురుతరంబగు మారు పుట్టుక – వరముc గుమ్మరించు మని ని ॥న్నడుగు॥

7. రోగములచే సేగి నొందుచు – జాగు సేయక నినుc దలcచుచు = బాగు గోరుచు నున్న భక్తుల – రోగములు వెడలించు మని ని ॥న్నడుగు॥

8. ధరణిపైని మరణ మయ్యెడు – తరుణమందో కరుణా కలితా = పరమ పురమునందుcజేరి – వర సుఖంబు లనుభవింప ॥నడుగు॥

*–విలియం బెర్రి*

## 270 సేవకులకొరకైన దీవెన

రా – ముఖారి (చాయ : కరుణసాగర)

తా – ఆది

దీవెనల నిడు దేవా నీదు – సేవకై వెడలెడు దీనులపైc = పావనాత్మ నంపుము – పనులలో నడిపింపుము – కేవలంబుగ మా తనువులు నీ – సేవకై యర్పింప గజేయుము ॥దీవెనల॥

1. మాటిమాటికి బాపయుతంబౌ – మార్గమునc జను మనసులc ద్రుంచి = మేటి క్రీస్తుని నామా – మృతముc గ్రోలుచు మేమా – పాటున నాత్మల రక్షణకై – పనులు సల్పcగ బంపుము కృపచే ॥దీవెనల॥

2. దివ్య బోధ లెదను గల్గి – దీనతను రక్షణ మార్గమును = భవ్యముగ బోధింపc – బరమార్థ మెఱిగింప – సేవ్య నేర్పవె దిన దినమును నీ – సేవకాళికి నీ మర్మముల ॥దీవెనల॥

3. దురిత రోగాదులచే మిగులc – తూలి చను మనుజాళికి నీవే = పరమ విశ్రాంతి నిడు – వరదుcడ వంచcగడు – వెరవునను బోధింపంగను నీ – వర ములతో నింపుము దాసులను ॥దీవెనల॥

4. గ్రామ సంఘంబులను బడుల – క్షేమముగc గాపాడి పెంప = ఓ మహాత్మ నీ కృప – తో మమ్ముc గాచి సదా – స్వామి మాలో నీవును నీలో మేము మనగను బ్రోవు మామేన్ ॥దీవెనల॥

*–పంతగాని పరదేశి*



# బాప్తిస్మము

## 271 ప్రభుని బాప్తిస్మము

రా – ముఖారి తా – ఆది

వినరే నరులారా – మనముల – వేడుకలను మీర = మన, రక్షకుcడగు – మరియా తనయుని – మహిమలు చెవులార ॥వినరే॥

1. తన కన్నను ముందు – యోహా – నను నతc డింపొందు = ఘనతర మగును – ప్రవచనముcబ – ల్కెను భూజను లందు– ॥వినరే॥

2. అతcడు యోర్దాను – నదిలో – ఖ్యాతిగ ననుదినమున్ = పాతకులకు బా – ప్తిస్మ మిచ్చు నెడం – ప్రభు వచ్చుటి కరిగెన్ ॥వినరే॥

3. న్యాయము నిలుపుటకై – ప్రభుని వి– ధేయతc గనుపఱచి = శ్రేయ పతి బొం – దెను యోహానుని – చేత బాప్తిస్మంబు ॥వినరే॥

4. పరమండల మపుడు – తెరవం – బడి పావురము గతిన్ = పరిశుద్ధాత్మ శు – భప్రభ లీనుచుc – ప్రభువు మీcద వ్రాలెన్ ॥వినరే॥

5. ఆకాశమునుండి – కలిగెను – ప్రాకటమగు రవము = నా కితcడు ప్రియం – బౌ కుమారుcడా – నంద మొంది రనుచు ॥వినరే॥

6. అంతట మన కర్త – పరిశుద్ధాత్మ బలము కలిమిన్ = సంతసమున మో – క్ష కుశలవార్తను – జాటంగను దొడcగెన్ ॥వినరే॥

7. ఆ నిత్య సువార్త – మన మెద – లో నిడి నమ్మినచో = నానందమయం బమృత మేసు ద–యా నిధి మన కొసంగున్ ॥వినరే॥

*– పురుషోత్తము చౌదరి*

## 272 శిశు బాప్తిస్మము

రా – నాధనామక్రియ తా – ఆట

దేవా శిశువులc దెచ్చితిమి – నీవు – దీవించవీరల – దివ్య కృపమీర॥దేవా॥

1. వీరు పొందిన బాప్తిస్మంబు – గురుతు – వీరు నీవా రన – విశదపరపంగా వీరిపైc గురిపించు దయను – వేగ – వీరికిc గలుగంగ – విజ్ఞాన ధనము ॥దేవా॥

2. నీ పొసఁగు శిశువుల మాకు – దేవ నీవ చేర్చికొనుము – నీవ కాపాడు జీవ మార్గము నందు నిలుపు – నిత్య – జీవంబు దయచేసి – శ్రీ యేసు కఠినన్ ॥దేవా॥

3. విమలాత్మ బాప్తిస్మ మొసఁగి – వీరి – విమలులఁ జేయుము – ప్రీతిని దేవా – క్షమ భక్తిప్రేమ శాంతుల – నొసంగు – శ్రమముల వెలుఁగంగ – సత్య సాక్షులుగా ॥దేవా॥

4. వీరలకుఁ దోడై యుండుము – తండ్రి – వీరలఁ జూడుము – వివిధ మార్గ ముల – వీరు లోకము విడుచు నపుడు – దయను – వీరలఁ జేర్చుము – విమ లానందమున ॥దేవా॥

– పులిపాక జగన్నాదము

## 273 పిన్న పెద్దల బాప్తిస్మము

రా – నీలాంబరి (చాయ : వారు భాగ్యవంతులు) తా – త్రిపుట

యే సొసంగె గొప్ప యాజ్ఞను – తన శిష్యులకును – యేసొసంగె గొప్ప యాజ్ఞను = దాసులునుగఁ జేయ బోయి – ధరణిమీఁది రాష్ట్రములకు – ఆ సను బాప్తిస్మ మిచ్చి – నా సుబోధ నేర్పుఁడనుచు ॥యేసొసంగె॥

1. జనక కుమారాత్మల పేర – బాప్తిస్మ మియ్యఁ – చనుడు మీరు సకల దిశలను = తనయు లైనఁ తల్లులైనఁ – తండ్రులైనఁ బొందవచ్చుఁ – దగిన రీతి దాని నిపుడు – తండ్రియైన దైవ కృపను ॥యేసొసంగె॥

2. బాలు రెల్ల బొందవచ్చును – బాప్తిస్మ మిపుడు – జాలిఁ జూపు క్రీస్తు సెలవున = బాలు రందుఁ బ్రేమ నుంచి – ప్రభువు పిలుచు వారి నెల్లఁ జాల మేలు సేయ గోరి – సకల కాలముల యందు ॥యేసొసంగె॥

3. పొందవలయు బాప్తిస్మము – శుద్ధాత్మ చేత – విందుఁ గలుగు మనుజు లందరు = మంద బుద్ధి విడిచి పెట్టి – మహిమ గల్గు దేవు గొల్వ – నందము గను లేచి రండి – హర్ష పూర్ణు లగుచు మీరు ॥యేసొసంగె॥

– పులిపాక జగన్నాధము



## 274 పెద్దల బాప్తిస్మము

రా – నవరోజు (చాయ : అందమైన క్రీస్తు కథ) తా – అట

ఆచరించుచునున్నాము – ఆ చందము మేము = యే చందమేసు ప్రభు సెల – విచ్చివేంచేసితో పరమండలికి ॥ఆచరించు॥

1. నీ సుభక్తుల్ నిస్తులాపొస్తలుల్ – నీ సెలవున న్నిఖిల భూస్థులుల్ – వాసికెక్కగా గాఁజేయుటకు వ్యాపించిరి కోరి = యోసియ్యోను రాజశాశ్వత – శ్రీసనాధ శ్రితరక్షభాజ – నీ సుదయచే నీ యుద్యోగము – నిత్యంబును బొంది ॥యాచరించు॥

2. భాసురత్వత్సమా చార – వాక్యము విని సదావి – శ్వాసిభాగ్యాభి ముఖ స్వాభావుల నీవేళన్ = భాసమాన పతితపా – వనతాంకిత పాత్ర దరికు – ల్లాసము నెమ్మోములందు – రాజిల్లగం దెచ్చి ॥యాచరించు॥

3. పరిశుద్ధ నాధ్యాత్మ మోక్ష – పారావతమా – వీరి – నిత్తరి – నరుదౌ నీదైవత్వచి – హ్నాముతోడను గూడ = సరవిగా దతియను బొందె దెరగున నీబప్తి స్తోదకములయు – బరిని వ్యాపించియుండుటకు – ప్రార్థించుచు నిన్ను ॥యాచరించు॥

4. పరయానంద వదనము నీ – దరికరాఁగిగోరు వీరి న్నీ – పరమ కృపన్ దీవించి నీ – కరుణా కటాక్షేక్షన్ = స్థిరతఁ బాన్చియాత్మలకు – నీ మహిమ కిరణములు – నెరపు మో అభువాయని – నిన్ను వేడుచు ॥నాచరించు॥

–విలియం డాకన్

## 275 క్రీస్తును నమ్మి బాప్తిస్మము పొంద రండి

రా – రేగుప్తి (చాయ : పాపులారా మీ పనిసరి) తా – ఆది

రండి రండి సువార్తబోధ విన – రారోజనులారా = నిండు మనంబుల కోర్కెలూరగను – నిజరక్షకుఁడగు యేసునిఁ జేర ॥రండి॥

1. పాపము లెడ బాపను యిలకరిగిన – ప్రభువు మహిమ వినుఁడి – మీ మీ – పాపములను దలపోసి హృదయముల – పశ్చాత్తాపపడి = యా పరమగురుని నామముద్వారా – ననుసరించి ముంచదముఁ బొందు ॥రండి॥

2. తన మహిమను బలమును – దైవత్వము తగ్గించుకొని వడి – యప్పుడు తన సేవకుఁడని మదిఁదలపోయని – తగు నీతిని గనుఁడీ = క్రీస్తుండును – బాప్తి స్తు దు యోహానునిచే – మునుకొని యోర్దాన్నదిలో – ముంచుటగని ॥రండి॥

3. మురియుచు క్రీస్తువు యోర్దాన్నదిలో – ముంచబడినరీతి – నిప్పుడు – గరిమెతో క్రీస్తుని నమ్మిన జనములు – గైకొనుటది నీతి = మరువక – స్థిరముగ మీ మనముల నెల్ల –ప్పుడు నరమరవిడి క్రీస్తుని తగఁజేర ॥రండి॥

4. తల్లులు తమ బిడ్డల – కాశీర్వాదము లిమ్మని తేగా – నప్పుడు – చల్లగ బాలుర కాశీర్వాద మొసఁగె ప్రభు విదిగాక = క్రీస్తుఁడు – తొల్లి జనములకు ముంచడ మిచ్చిన – టెల్ల విధులలేదు వేదమున ॥రండి॥

5. అందుచేత వేదమున – బాప్తిస్తుండనఁబడె యోహాను – ఇప్పుడు పొందుగ ముంచువారు బాప్తిస్తులు పొసగగ సరిగాను – మీరలు – నందఱు విన సత్య వేదవాక్యము – సందియములు విడి సాగి వేగమున ॥రండి॥

# ప్రభురాత్రి భోజనము

## 276 ప్రభురాత్రి భోజనము కొరకు సిద్ధపడుట

రా – ఆనందభైరవి (చాయ : ఓ మా తండ్రి) తా – ఏక

మనస! యాత్మ! తేజరిల్లుమా – యలంకరించు – కొనుము పాప మంత వీడుమా = వినుము నేఁడు యేసు నీకు – ఘనముగాను విందుఁ జేసి – నినుఁ దలచి చేరవచ్చె – ఘనుని వెల్గులోని కేగుము ॥మనస॥

1. హృదయ మనెడు తలుపుఁ దట్టుచుఁ – ప్రభు యేసు నిలచి – సదయుఁ డిదిగో నిన్నుఁ బిలుచుచు = ఎదురు జూచుచుండు విభుని – పదయుగమున కెరగి మ్రొక్కి – ముదముతోడఁ జేర్చుకొనుము – సదముల మగు ప్రేమఁ జూపి ॥మనస॥

2. ధరను సర్వ శ్రేష్ఠ భాగ్యముల్ – వరములును ధనము – నరులు బొందు చుందు రుచితము = పరమ రక్షకుం డొసంగు – వరశరీర రక్తములకు ధరణి రత్న రాసులైనఁ – జాలువా మరేవి యైన ॥మనస॥



3. ఎందుఁ గానరాని ప్రేమను – జూపించి నీకై – పొందుగాఁ దన ప్రాణ మిచ్చెను = చిందిన రక్తమును యాగ – మంది నట్టి శరీరంబు – నందముగను రాత్రి భోజ – నంబు నందు సిద్ధపరచె ॥మనస॥

4. యేసు తనదు బల్లమీఁను – సుజీవ మిచ్చు – నెల్ల నష్టములు నశించును = భాసురముగ మోక్షమునని – వాసివై శ్రీ యేసుతోడ – యీ సుభో జనంబు దినుట – కాశీర్వాదముల నొసంగు ॥మనస॥

– రావూరి దావీదు

## 277 ప్రభువు బల్లను సమీపించు యోగ్యతకు ప్రార్థన

రా – భాగేశ్వరి తా – చతురశ్ర ఏక

ఓ దయానిలయా! ప్రభువా! మా –కున్న స్వనీతి – బలముగాక = నీ దయాహృదయంబె నమ్ముచు – నీదగు బల్లను జేరఁదెగించితి ॥మో దయా॥

1. లేదు యోగ్యత బల్లకు దిగువ – లేకిని నేరుకొనఁగనయినన్ = మాదుగతిఁ గరుణించియు నెపుడు మార్పునులేని ప్రభుండవైతివి ॥ఓ దయా॥

2. ఓ ప్రభుండా! కావున మా పా – పోద్భూతంబగు శారీరాత్మల = నీ ప్రియంబగు క్రీస్తుతనువున – నెత్తుటఁ బరిశుద్ధంబగునటుల ॥ఓ దయా॥

3. ఆయన మాలోఁబరగను మే – మాయనలో జీవింపగను = నీ యుగాం తముదాఁ క నేకత – నీతో జీవించులాగుననో ॥ఓ దయా॥

4. యుక్తముగా నాయన మాంసమును – నోరెముగా భుజియింపను దన దగు = రక్తము మేమందఱమును ద్రావను – రాగంబడరఁగ దయ చేయుము ప్రభు ॥ఓదయా॥

– మొలతాటి విద్యానందము

## 278 జీవాహారము

రా – ముఖారి (చాయ : నాకై చీలిన యుగయుగముల) తా – ఆది

జీవాహారము రమ్ము – చిరజీవాన్నము నిచ్చి – జీవిత క్షుద దీర్చుము = జీవనపథములో – చీకటి పడువేళ – జీర్ణించు కొనిపోవు – జీవితాశలఁ బెంచ ॥జీవా॥

1. విందుగృహమునకేగి – వీక్షింతు భ్రమతో నీ – వివిధసుభోజ్యంబులన్ = విచ్ఛిన్నమైన నీ – విమల దేహపు విందు – వికలంబౌ మనసుతో – వినుతించి, తినుచుందు ॥జీవా॥

2. రుధిర ధారలలోన – ఋజువౌ నీ ప్రేమలు – రూపుమాయును పాపము= ఋతద్రాక్ష వల్లీ నీ – రుధిరపానముచేత – ఋణభారములు దీరి – రుచి యించు నా బ్రతుకు ॥జీవా॥

3. భవదీయ స్మరణార్థం – పతితుల శరణార్థం – ఫలియించు యీహోమము= ప్రభువా నాయాత్మలో – ప్రతిబింబమై వెలసి – పానార్పణంబౌను – ప్రతిరక్త బిందువు ॥జీవా॥

4. ఆత్మాంతఃపురములో – ఆంతర్య గదిలోన – ఆరాధింతు నీ నామము = అలనాటి నీ రక్త – నవనిబంధన నేడు – అపురూపమై నాలో – నవతరించును దేవా ॥జీవా॥

–ఏ. బి. మాసిలామణి

## 279 ప్రభు రాత్రి భోజన మాచరించునపుడు దీవెన గోరుట

రా – హుసేని (చాయ :దేవా యాశీర్వదింపుము) రా – త్రిపుట

దేవా దీవించు మిప్పుడు – దీన జనాళిన్ – గావ రా రమ్మెల్లప్పుడు = నీ వరగద్దెచుట్టు – నిజ దాసు లిటులం గూడి – పావన సంస్కారమును – బంచి పాలొందుచుండ ॥దేవా॥

1. మముం గావ నైదు గాయముల్ – బొందిన దేవ – సముంఁడా నీ రక్త కాయముల్ = విమలంపు భక్తి ద్వారా – వీక్షించి మనసులందు – అమిత దుః ఖ మొందుటచే – నలిగిన భక్త జనులన్ ॥దేవా॥

2. నీ రాజ్యమునకు మముం జేర్ప – నిజము మా పాప – ఘోర శాపమ్ములన్ దీర్ప = నోరిమిచే మా కొరకు – దారుణముగ నొందిన – క్రూర మరణమును దలంచి – కుములుచున్న హృదయులను ॥దేవా॥

3. కోరి నినుం గొలుచు భక్తుల – కోరిక లభివృద్ధి – గా రాజిలంజేయు శక్తుల = ధారాళముగ నొసంగు – ధనాత్ముండ నీ దివ్యా – కార మందుండి యీ సం – స్కార సమయమున మమ్ము ॥దేవా॥



4. మా దారిద్ర్యములు బాపనే – పాపభారంపు – మ్రాను నీ దివ్య మూపుననే = గాదిలిచే భరియించి గడి దొంగ లిరువురిలో – బాధ లొందితి వనుచు – బహుగా దుఃఖించు మమ్ము ॥దేవా॥

5. నీ వీ విధంపు మరణముచే – నిజముగా మమ్ము – జీవింపంజేసి నిల్పుటచే = పావనదేవ మే మీ – ప్రభు సంస్కారమ్ము మా మా – జీవాత్మ లాదరణకై – జే మనముగం గైకొనను ॥దేవా॥

– మురారి దావీదు

## 280 ప్రభురాత్రి సంస్కారవిందు

రా – కేదారి (చాయ :సోదరులారా గనుడీ యాశ్చర్యం) తా – అట

చేరి భుజియింపుడీవిందు – యేసు – సిద్ధపరచిన కృపావిందు = తోరణంబగు మేడ గదిలో – జేరి శిష్యుల తోడ సిలువ = భారమున్ మదినెంచి నెరపిన – భావ
గర్భితమైన విందు ॥చేరి॥

1. జీవాహారము దైవసుతుడే – పరమ – జీవజలముల దాత యితడే = జీవనాథుని రక్త – మేనులు – జీవానాహారములు కాగా = చావును దొల గించి మృతులస – జీవులనుగా మార్చువిందు ॥చేరి॥

2. కారుణ్యనిధి యేసు రాజు – నరుల – గావగ బలియైన రోజు = భారమైన సిలువ కెరయై – పాప భారము పరిహరింప = ధారవోసిన పుణ్యరక్తపు – ధారలన్ దలపోయు విందు ॥చేరి॥

3. దాసగణముల బ్రోవనెంచి – రుధిర – ధారలను గార్చిభరించి = భాసు రంబగు నవ నిబంధన – జేసి సంఘ పునాది వేసి = వాసి మీరగ నిత్య జీవము – బోసినట్టి యేసు విందు ॥చేరి॥

4. పాప పరిహారార్థముకై – క్రీస్తు – పడిన ఘోరబాధ కొరకై = యేపు దనరగ స్తుతులుబాడుచు – యేసునాథుని రాకవరకు = ఆపకుండగ సత్ప్రసాదము – నందుకొని బలమొంద రండి ॥చేరి॥

5. విందుతో మొదలిడిన సేవ – యేసు – విందుతో ముగియించె బ్రోవ = విందులోగల మర్మమేదియొ – విపులముగ బోధించు క్రీస్తున్ = డెందమున ధ్యానించి యాయన – యందె నమ్మిక గలిగియుందము ॥చేరి॥

–వి. డి. జాన్ సుందరరావు

# 281 నూతన నిబంధన విందు

రా - భైరవి (చాయ :యేసుక్రీస్తు దొరికెనేని) తా - చాపు

మానవుఁడవై సకల నరుల - మానక నా దోషములఁ - బాపుటకు బలి యైతివే యేసూ - బహు ప్రేమతోడ ॥మానవుఁడవై॥

1. నీదు బలిని నిత్యముగను - నిజముగా ధ్యానించి ప్రేమను - నీదు దివ్య ప్రేమ నొందుటకు - నియమంబు నిచ్చి ॥మానవుఁడవై॥
2. నీవె జీవపు రొట్టె వంటివి - నీవె జీవ జలంబు వంటివి - నిన్ను ననుభ వించుఁడంటివిగా - నిజదేవా యేసూ ॥మానవుఁడవై॥
3. నీ శరీరము రొట్టెవలెనే - నిజముగా విరువంగఁబడెనే - నిన్నుఁ దిను భాగ్యంబు నిచ్చితివే - నా యన్న యేసూ ॥మానవుఁడవై॥
4. మంచి యూట మించి దండి - పంచగాయములలో నుండి - నిత్యజీవపు టూటలు జేసితి - నీ ప్రేమ నుండి ॥మానవుఁడవై॥
5. నిన్ను జ్ఞాపక ముంచుకొనుటకు - నీదు ప్రేమ బలిలో మనుటకు - నిత్య మాచరించుఁడంటివి నీ - నిజభక్తితోడ ॥మానవుఁడవై॥
6. ఎంతో ప్రేమతో బలిగా నైతివి - యెంతో ప్రేమాచారమైతివి - చింతలును నా పాపములు బాప - శ్రీ యేసు దేవా ॥మానవుఁడవై॥
7. నిత్యబలి యగు నిన్నే నమ్మి - నిన్ను ననుభవించి నెమ్మి - నిన్ను నిముడించుకొని నాలో నీ- నిజరూప మొంద ॥మానవుఁడవై॥
8. నేను నీ బలిలోనఁ గలిసి - నేను నీతోఁ గలిసి మెలిసి - నేను నీవలె నుండఁ జేసితివే - నా దివ్య యేసూ ॥మానవుఁడవై॥
9. నీదు శ్రమలను బలిని నిపుడు - నాదు కనులు చూడ నెపుడు - నాదు పాపభారములు దిగునే - నా దివ్య యేసూ ॥మానవుఁడవై॥
10. నీవు బలియై తిరిగి లేచి - నిత్య తేజోరూపు దాల్చి - నిత్యమును నా బంతి నున్నావే - నిజ దేవా యేసూ ॥మానవుఁడవై॥
11. నీవే నీ చేతులతో నిత్తువు - ఈ నీ బలివిందునకు వత్తువు - నిన్ను నిట జూచితిని నా యేసూ! యెన్నఁడును మరవను ॥మానవుఁడవై॥

-మార్తాండ జ్ఞానప్రకాశము



# 282 ప్రభుభోజనమున కాహ్వానము

రా - భైరవి (చాయ :పరిశుద్ధి పరిశుద్ధి పరిశుద్ధి యని) తా - త్రిపుట

మన యేసు మరణస్మా - రణవిందులోఁబాలు - గొనరండు ప్రియులార - వినయమానసులై = మన దోష చయమెల్లఁ - దనమేన ధరియించు - కొనిమనల గావ నా - యన పడిన శ్రమలెంచి ॥మన యేసు॥

1. మరల మన మధ్యకా - పరమాత్ముఁడరుదెంచ - వఱకాయనను మనము - మఱవకుండుటకై - స్థిర భక్తి నద్దాని - జరిగింపవలెనంచు - గురుతరంబగు నాజ్ఞ - నెఱపితాఁ జనెఁగాన ॥మన యేసు॥
2. తినుఁడిది యె నా దివ్య - తనువంచు నొక రొట్టి - యను వ్రచ్చి ప్రభుఁ డిచ్చె- ననుబంధుతతికి = ఘన శ్రద్ధదానిఁగై - కొని మనము - భుజియింప నొన గూడు జిరజీవ - మనుమాన మింకనేల ॥మన యేసు॥
3. ఆ రీతి నిజరక్త - ధారయై వెలయు ద్రా - క్షారసము నిచ్చె నిం - పార గొను డనుచుఁ = గోరి యా మధుధారఁ గ్రోలిన మనకుక్షి - దోరమౌ జీవంపుధార లుద్భవ మొందు ॥మన యేసు॥
4. ప్రభు భుక్తి నెవఁడు దై - వభయంబు లేక య - నుభవించు వానిక - శుభమౌ నా మీఁద = విభవంబు దొలఁగురో - గభయంబు చేకూరు - శుభ మవ్వానికి నెపుడు - లభియింపదని తెలిసి ॥మన యేసు॥
5. మిము మీరె తగురీతి - గమనించి పరిశోధ -నము చేసికొని మీ పాపము లోప్పుకొనుచు = నమితార్తిఁబశ్చాత్తా - పముఁబొంది యీ విందు - క్రమము బాటింప క్షే - మము మీకు సిద్ధించు ॥మన యేసు॥
6. దురితాంధకార భా - స్కరుఁడు సద్గురుఁడేసు - పరమవిందున కిది యను - ప్రాసంబని యెఱిఁగి = [1]ఉరణశాబకరక్త - సరి దంతఃపరిపూతాం - బరులైసత్కార్యత - త్పరులై బంధురమతులై ॥మన యేసు॥

- దాసరి మోజెస్

[1]గొఱ్ఱెపిల్ల రక్త ప్రవాహమున నుదుకబడిన వస్త్రములు గలవారై.

## 283 పరిశుద్ధ సమభాక్త్వము

స్తోత్రార్పణ నర్పింతము – జప – ధూపము వేసి కీర్తింతము = పాత్రుం డైన శ్రీ యేసుఁడు – పరమ – భోజనాంశమైనందున ॥స్తోత్రార్పణ॥

1. కృతజ్ఞతా స్తోత్రంబులన్ – దేవ – కృపార్థంబై చేయుదము = క్షితి నాతండు బలి నియ్యఁగాఁ – పుట్టె – నూతనంపు నిబంధన ॥స్తోత్రార్పణ॥
2. పాపము లన్ని హరించెను – మా – ప్రభు వగు యేసు సురక్తము = ఏపుగ దీనిఁ దలంచుచు – నిఁక – నెన్నఁడు యేసుని భజింతము ॥స్తోత్రా॥
3. చావు నుండి రక్షించెను – స – జీవులలో లెక్కించెను = దేవుని కిఁక నర్పింతము స – జీవార్పణ బలిగను ॥స్తోత్రా॥
4. పుణ్యరక్త శరీరముల – లోఁ పాలొందు మన మందరము = అన్యులము కానేరము – దై – వాన్యోన్యంబు నొందినాము ॥స్తోత్రా॥
5. మరణ శ్రమల స్మరింతము – ప్రభు – తిరిగి వచ్చు పర్యంతము = ధర నా యేసు మరణంబును – యింకఁ చిరకాలంబుఁ జాటింతము ॥స్తోత్రా॥

– సమూయేలు పాక్యనాథము

## 284 *Here, O my Lord, I see Thee face to face*

1 యేసూ, నిన్ జూతు నిందుఁ దే
టగా
అగోచరార్థముల్ నే ముట్టుదున్
కృపన్ నేఁ బట్టుకొందు గట్టిగా
నీ మీఁద వేయుదున్ నా భారము.

2 నే దైవాహార మిందె తిందును
ఆత్మీయ ద్రాక్షపాత్ర త్రాగుదున్
భూభారముల్ నేఁ బారవేయు దున్
క్షమా సౌఖ్యంబు గల్గుఁ గ్రొత్తగా.

3 సంగీత భోజనాల కాలము
ప్రభుండు నాకై బల్ల వేసెను
విందారగించుచున్ నీ తోడి నా
మాధుర్య స్వల్ప మైత్రిన్ బెంచు
దున్.

4 సాయం బీవే, వేరే నా కెందుకు
వేరే చేమీఁద నానుకొనను
ప్రభూ, నిజంబుగా నిదే చాలును
నీ శక్తిలోనె బలం బుండున్

5 పాపంబు నాది, నీతి నీదెగా
నేరంబు నాది శుద్ధి నీదెగా
నీ రక్త నీతియే నా వస్త్రముల్
నా కాశ్రయంబు శాంతస్థితులు

– హోరేషియన్ బోనర్



## 285 క్రైస్తవ ప్రేషితోద్యమము

దేశీయ ప్రేషితోద్యమ గీతి

(చాయ : ఈ సంఘంపు బునాది)

1. శ్రీ రాజిల్లుచు యేసు
క్రీస్తు వేంచేసెను
భారతిని జయించి
ప్రజాళిన్ బ్రోచును!
ఆరాజు శాశ్వితుండు
భూరిదయాళుఁడు
వీరాగ్రేసరుండాజిన్
విజయ ధ్వజంబదే!

2. ఆ హిమాచలమందు
నాటెక్కె మెత్తెను
కాహళ ధ్వనియందుఁ
గ్రందుకొనెనటన్!
సౌహార్ద భావమూని
జనాళిన్ బ్రోచుఁగ
ఆహా యీ యేసుప్రేమ
యాశ్చర్యమైనది!

3. ఆంధ్ర కాశ్మీర వంగ
ఆ సేతువాసులు
ఆంధ్రప్రాయులైయున్న
యరణ్యవాసులున్
బంధ విముక్తులౌచుఁ
ప్రభువైన యేసుని
బంధుర సేవచేయు
వారలయ్యెదరు

4. వీరెల్లఁ క్రీస్తునందు
విశ్వాసముంచిన
ఆ రాజు వీరిన్ శాశ్వ
తానంద సామ్రాజ్య
ధౌరేయులన్ గావించు
ఔర! యీ వార్తను
స్ఫారానందంబుతోడఁ
జాటుదు రెవ్వరు!

5. భేరీ తూరారవాది
గా రక్షావార్తను
దోరంపుఁ గోర్కెఁ జాటు
మో దేశ సంఘమా!
సౌరభ్యమౌ నీ ప్రేమ
సారంబు జూపుము
ధీరతన్ యుద్ధమందుఁ
బోరాడి గెల్వుము

– జాన్ చౌదరి

## 286

*From Greenland's Icy Mountains*

1\. గ్రీన్లాండ్ దేశస్థులును
ఇండియా జనులున్
ఆఫ్రికా ఖండమందు
నివాసులెల్లరు
సముద్ర ద్వీపస్థులు
సువార్త వెలుగు
మాకు నిప్పించుడని
మమ్మును పిల్తురు.

2\. మా దేవుడిచ్చు సుఖ
సుక్షేమ యీవులు
ఒక్కొక్క దేశమందు
విస్తారమైనను
అజ్ఞానులైనవార
లా సత్య దేవుని
గొల్వక వేరువాటిన్
పూజించుచుందును.

3\. సువార్తకాంతి మాకు
ప్రకాశమైనదా
అజ్ఞానులందరికి
దాని మేమియ్యమా
రక్షణ దివ్యవార్త
లోకస్తులెల్లరు
విని మా యేసుమీద
విశ్వాసులౌదురు.

4\. సుక్షేమకరమైన
సువార్త సంగతి
గాలి తరంగములు
వ్యాపింపజేయుడీ
మా సృష్టికర్త రాజు
నిర్దోషి యాయనే
మా యేసు దిగి వచ్చి
యీ లోకమేలును.

–రెజినాల్డ్ హెబర్
అను : జేకబ్ చేంబర్లేస్

## 287

*Jesus shall reign where'er the sun*

1\. శ్రీయేసు రాజ్య ముండును
సూర్యుండు వెల్గు చోటెల్ల
కల్పాంతకాల మౌదాక
ఆ రాజ్యము వ్యాపించును.

2\. నిరంతరంబు ప్రార్థనల్
నిత్య స్తుతుల్ శ్రీయేసుకు
తన్నామము ప్రత్యహము
సుగంధ మట్లు లేచును.

3\. సమస్త దేశ వాసులు
గణింతు రేసు ప్రేమను
శ్రీ యేసు పేరు బాలకుల్
బాల్యంబున నుతింతురు.

4\. యేసుని యీవు లొల్కును
ఖైదికి సంకెళ్లూడును
డాయంగ శాంతి కల్గును
సుభాగ్య మబ్బుఁ పేదకున్



5\. శ్రీ యేసు శక్తి చేతను
స్వస్థంబు గల్గు నెల్లెడన్
దచ్ఛక్తి యున్న మేరలన్
నశించు మృత్యు శాపముల్.

6\. మా రాజు కెల్ల సృష్టియున్
విశేష స్తుతుల్ సల్పుతన్
దూతాళి మళ్లి పాడఁగా
ఘోషించు భూమియు ఆమేన్

–ఐజక్ వాట్స్
అను : జాన్ స్మిత్ వార్డా

## 288

*We have heard the joyful sound*

1\. శుభవార్త వింటిమి
యేసు రక్షించును
ఎల్లవారు విననీ
యేసు రక్షించును
ప్రభు మాట వింటిరా
పర్వతంబుల్ దాటుచు
వార్త ప్రకటింపుడి
యేసు రక్షించును.

2\. స్వరమెత్తి పాడుడీ
యేసు రక్షించును
దైవభ్రష్టు లెల్లరిన్
యేసు రక్షించును
ద్వీపవాసు లందఱు
వినునట్లు చాటుఁడి
దివ్యవర్తమానము
యేసు రక్షించును

3\. ఇహ బాధనుండియు
యేసు రక్షించును
పరభాగ్యమిచ్చును
యేసు రక్షించును
దీనుజను లెల్లరు
భూనివాసులందఱు
ఈ సువార్త వినుఁడీ
యేసు రక్షించును.

– ప్రిసిల్లా జేన్ ఓవెన్స్
అను : జేకబ్ చేంబర్లేస్

# సువార్త

## సువార్త ప్రకటన

## 289 క్రీస్తే పాపుల గతి

రా – మధ్యమావతి తా– త్రిపుట

ఇంక నేమి గతి యున్నది – మానవులారా – యింక నేమి గతి యున్నది – పాపులకోస – మింక నేమి గతి యున్నది = యొకండైనం బుణ్యాత్ముం – దుర్వి లేండని ముందె – ప్రకటించి దావీదు – పల్కె వేదము నందు ॥ఇంక॥

1. ఇల రక్షకుండు లేమిని – గొఱ్ఱెల మంద – లిలం జెల్ల చెదు రాయెను = పులులం బోలిన దైవ – ములు గురువులు పెక్కు – గల రేల వారు పద్ధతి జూప జాలరు ॥ఇంక॥
2. దురితము లణంగింపంగం – బాపుల నెల్ల – దరిం జేర్చి బ్రతికింపగ = పర మేశ్వరుండు తన – వరపుత్రుం డగు క్రీస్తున్ – ధర కంపె నయ్యేసు – శరణుం జొరకయున్న ॥ఇంక॥

– పురుషోత్తము చౌదరి

## 290 తప్పిపోయిన వారిని మేలుకొల్పుట

రా – ఆనందభైరవి తా – త్రిపుట

ఎందుకు మఱచితివి – యేసుని ప్రేమ – ఎందుకు మఱచితివి = ఎందుకు మఱచితివి – పొందితివి నిందలు – సుందర మగునట్టి – సుఖమైన ప్రభు ప్రేమ ॥నెందుకు॥

1. దేవగ్రంథము నీవు – చదువలేదా – భావమున దానిం గైకొనలేదా = సేవక వృత్తులు – సేయక పోతివి – చావరాని చావు – సంపాదించితి వయ్యో ॥ఎందుకు॥



2. చిందెను రక్తము – సిలువపైనిం – పొందెను గష్టము – మేకుల పోట్ల = నెంద ఱెందఱు కల్వ – రీమెట్టపై నతని – నిందించి చంపిరి – నిర్దయులై యకటా ॥ఎందుకు॥
3. పాపేచ్ఛలోనుండి – మరలి వాని – శ్రీ పాదములు బట్టుము ప్రార్థించుము = కాపాడుటకు దయతోం – గనిపెట్టి యున్నాండు – పాపి నీ విభుండైన – ప్రభు మార్గమునం బొమ్ము ॥ఎందుకు॥

–దావీదు చౌదరి

## 291 శాశ్వత ధనము

రా – నాట తా – ఏక

ధరణిలోని ధనము లెల్ల – ధరణిపాలై పోవును = గరిమతోడ నీవు గైకొను – నిరత ముండెడి ధనమును ॥ధరణి॥

1. యేసు నందు నిత్యజీవం – బిపుడు దేవుం డిచ్చును = తీసికొనుము దాని వేగము – దివ్య వరముగ నమ్మికన్ ॥ధరణి॥
2. విడువు నీదు పాపములను – తడవుంజేయుం బోకుమీ = విడువ కున్న నీకుం గల్గు – వేద నాధికంబుపో ॥ధరణి॥
3. పరుల మాటలం బట్టి నీవు – పడకు మోస మందున = నరుల కొఱకు జీవ మిచ్చిన – పరమధాముని నమ్ముమీ ॥ధరణి॥
4. తలంచుకొనుమీ ధరణిలోన – నిలుచు కాల మంతట = విలువలేని యేసు ప్రేమ – విధము చక్కంగ నెఱుంగుచు ॥ధరణి॥
5. దేవ కృపను బోలునట్టి – దివ్య భాగ్య మొకటియున్ = నీవు చూడ బోవు మిత్ర – నేట నెచట వెదకినన్ ॥ధరణి॥

– పులిపాక జగన్నాధము

## 292 పాపము సార్వత్రికము

రా – కేదారగౌళ తా – త్రిపుట

నిజముగాఁ పరిశుద్ధు డొకఁ డీ – నేలపై లేఁడు = [1]వృజినములచేఁ జెడిన మదిని బ –విత్రమూలం బెటుల [2]బొడమును ॥నిజము॥

1. [3]దురిత లతలకు [4]మూలకందము – దుస్స్వభావము దానిఁ గూడిన – నరులలోఁ బరిశుద్ధ విధు లె – న్నటికిఁ గనరావు = [5]నెరవుగా సద్ధర్మములనే [6]తెలిఁగుననుఁ [7]గావింప నేర్తురు – ధరణి లోపల ముసిఁడి చెట్టున – చెఱకు రస ముండునె తలంపగ ॥నిజము॥

2. మనసు క్రియ లన్నిటికి మూలం – బనుచు శాస్త్రము పల్కు మఱి యా – మనసు శుచిగాకున్న నగునే – తనకు క్రియాశుద్ధి = [8]అనిశ మా హృదయము దురిచ్ఛల – [9]నలరి [10]మిధ్యాసక్తి నుండఁగ – ఘనతగల సత్కార్య ముల నిల – మనుజుఁడె [11]ట్లొ నరింపఁజాలును ॥నిజము॥

3. నిరతమును పాపాగ్నిచేతను – గరగుచున్న మనంబులోపల – పరమ ధర్మము భక్తి ఎటువలెఁ – బాదుకొని యుండున్ = నిరపరాధి యొకండు లేఁ డని – నిక్కముగఁ గనవచ్చుచున్నది – పరమ దేవుఁడు క్రీస్తు కృతమునఁ– పాపులను రక్షింపవలయును ॥నిజము॥

– పురుషోత్తము చౌధరి

## 293 పాపుల స్నేహితుడు

రా – మోహన తా – ఏక

పాపులకు సఖుండు – మన ప్రాపు యేసె సుమండి – భువి – పాపులకు సఖుండు ॥పాపులకు॥

1. రండి రండి మిత్రులార – నిండు ధైర్య పడండి వేగమె = దండైన యండ మన – కుండు యేసుండని ॥పాపులకు॥

2. దాహ మణంచు దేవ వాక్యము – దేహధారులార రండి = దేహీ యన విహీనుల – సాహాయ్యము నోహో యని ॥పాపులకు॥

[1]పాపములచేత. [2]పులును. [3]పాపమును తీగలకు [4]వేరు, గడ్డ [5]చక్కగా [6]విధముగా [7]చేయలేరు. [8] ఎల్లప్పుడు [9] సంతోషించి [10] మాయ [11] చేయగలుగును



3. ద్రవ్య మించుక లేని విక్రయ – మయ్యె యీ యేసయ్య రక్తము = చేయలే మయ్య మన – మయ్య దుర్నయ్యముల్ ॥పాపులకు॥

4. నిండు మనసు గలిగియే – సండఁజేర రండి వేగమె = నిండు ప్రియుండు న – ఖండ పురుషుండని ॥పాపులకు॥

5. నింద లన్ని పొంది ప్రభుని – మందలో వెలుఁగొందరే తతిఁ = పొం దుగ నిందలో – నుందు రానందమున ॥బాపులకు॥

## 294 క్రీస్తుని గొప్పతనము

రా – హిందూస్థాని తోడి తా – ఆది

యేసునే సేవింపరండి – మోసపోకండి – ప్రభు = దోసములను బాపు నండి – దొడ్డ ప్రభువండి ప్రభు ॥యేసునే॥

1. దేవుఁ డీతఁడే సుమండి – దిగులుపడకండి – మన = చావు నొంది లేచెనండి – జీవ మితఁడండి – ప్రభు ॥యేసునే॥

2. పాపులను ప్రేమించె నండి – ప్రాణ మిడె నండి – ప్రభు = దాపుఁజేరి వేఁ డ రండి – దయామయుఁడండి – ప్రభు ॥యేసునే॥

3. నరకబాధ నొందె నండి – నరులకొర కండి – ప్రభు = దురితములను బాపు నండి – దుఃఖపడకండి – ప్రభు ॥యేసునే॥

– ఎన్.డి.ఏబెల్

## 295 మానవ పతనము

రా –శంకరాభరణము తా – త్రిపుట

మన మొదటి తల్లిదండ్రులల్ – మాయకు లోనైరి – అన్నలారా = వారి కనుగొనలకు సిగ్గు – గదుర మోములు వంచి – రన్నలారా ॥మన॥

1. తమ నగ్నతను జూడఁ దా మొప్ప లేరైరి – అన్నలారా = కొన్ని – యమరిన మఱ్ఱాకు – లంగంబులను గట్టి – రన్నలారా ॥మన॥

[1] కలుగఁగా [2] ముఖములు.

2. పరమాత్ముఁ డిడు నాజ్ఞఁ – పాలింప లేరైరి – అన్నలారా = పూర్వ – పరి శుద్ధత నెడబాసి – పాపాత్ములై పోయి – రన్నలారా ॥మన॥

3. నరవంశజుల కెల్లఁ – [1]తరలెఁ దద్దురవస్థ – అన్నలారా = క్రీస్తు – మర ణంబు మన పాప – హరణంబుఁ గావించు – నన్నలారా ॥మన॥

–పురుషోత్తము చౌదరి

## 296 నమ్మినవారికి రక్షణ

రా –ముఖారి (చాయ : పాపమా దలఁచు సుమీ) తా – ఆది

నమ్మరె నరులార – యేసుని – సమ్మతిగాఁ జేరి = నమ్మిన వారల నిమ్ముగ బ్రోచును – సొమ్ముగ తను జేర్చి ॥నమ్మరె॥

1. యేసు క్రీస్తుకంటెఁ – పోషకు – లెవ్వరు లేరుసుమీ = దోషుల తన దాసులుగాఁ దీసియు – దోసముఁ బాపు సుమీ ॥నమ్మరె॥

2. నరకము నొందక మీ – రయ్యో – నరకము బాధ సుమీ = న్యాయము కాదుసుమి నరులార – నష్టము మీకు సుమీ ॥నమ్మరె॥

3. తండ్రి కొమరుఁడు విమ – లాత్ముఁడు – త్రైకదేవుండు = తండ్రి వలెను మనలను పాలించును – తండ్రిగ నమ్ముదము ॥నమ్మరె॥

4. ధరణిలో నొకఁడైన – చూడరె – ధన్యుఁడు లేఁడనుచు = దీర్ఘదర్శి దావీదు తెల్పె నిటు – దీనుల కందటికి ॥నమ్మరె॥

5. ప్రభు మన పాపముకై – ప్రాణము – బలిగా – నిచ్చునుగా = పాపము మోసెను మృతియై లేచెను – పాపులఁ బ్రోచుటకై ॥నమ్మరె॥

6. దేవసుతుని రక్తం – అబ్బిన – ద్రోహుల కతిప్రియము = పావన మొనరించును పాపికి నిఁక – జీవనమై యుండున్ ॥నమ్మరె॥

– గెల్లా రామయ్య

[1] కలిగెను



## 297 యేసు క్రీస్తును కొలుచుట

రా – ముఖారి తా – ఆది

యేసు క్రీస్తుని గొల్వ రన్న – యీ జగతిలోన – నెవ్వరు లేరు వాని కన్న = యేసుని వాక్యము – ఎవ్వరి కబ్బునో – దోసము విడి పర – వాసము దొరకును ॥యేసు॥

1. సత్యుఁడు నిత్యుఁడాయ నన్న – యీ సర్వ సృష్టిఁ – జక్కఁగ సలిపి నిలిపె నన్న = వ్యత్యాసము లే –మియు లేకుండఁగ – సత్యుండు చేసెను – సర్వజగం బును॥యేసు॥

2. నిరాకారుఁడు నిశ్చయుఁడన్న – నరుల రక్షింప – నరావతారుఁడై నాఁడన్న = నరుల పాపములుఁ – పరిహరించుట – కొరకై మరియ కొడుకై పుట్టెను ॥యేసు॥

3. పరిశుద్ధవంతుఁ డాయ నన్న – ప్రభు యేసు నందఁ – పాపమే గానఁ బడుట సున్న = పరులను గావను – ధరలోఁ దిరిగెను – నరుల నడుమ బహు – నిరపరాధముతో ॥యేసు॥

4. భేదాభేదములు గాని బోధ – నాథుఁడొనరించె – సాధు లెల్లను సంతోషింప = బాధలుఁబడు స – ద్రిక్తులతోడను – సాదర వాక్కులు – జక్కగ పలికెను ॥యేసు॥

5. మహిలోన మనుజు లెవ్వ రైనఁ – జేయ లేనట్టి – మహిమాద్భుతములఁ జేసె నన్న = మహా రోగులను – మఱి మృతులను మహా – మహుండు స్వస్థుల – మఱి గావించెను ॥యేసు॥

6. వర్ణింప వలనుకాని వాఁడు మన కోసర మతడు – మరణమై మరల బ్రతికినాడు = పరలోకమునకు – మరి వేంచేసిన – పరుఁ డగు క్రీస్తుని – పాదముఁ బట్టుము ॥యేసు॥

7. పరిశుద్ధ దూతల నాదముతో – ప్రభు యేసు క్రీస్తు – ప్రకాశ వస్త్ర మహిమలతోఁ = పరమునుండి బహు – త్వరగా వచ్చును – ధరలో నమ్మిన – నరులను బ్రోచును ॥యేసు॥

8. న్యాయంబు దీర్చు దినము గలదు – నమ్మని వారెల్ల – సాయంబు వెదకినను గనపడదు = సువార్త న్యాయముఁ దీర్చును – నడవడి చొప్పున – నమ్మని పాపుల – నరకము జేర్చును ॥యేసు॥

9. నమ్మండీ నష్టము నొందక – యేసుని నమ్మిన – పొమ్మని చెప్పఁడు సుమ్మండి = ఇమ్ముగఁ గృపతో – నిలలోఁ గాచును – పిమ్మట మోక్ష పురమునఁ జేర్చును ॥యేసు॥

– గొల్లపల్లి నతానియేలు

## 298 యేసునొద్దకు రండి

రా – మధ్యమావతి తా –ఆది

రండి యేసుని యొద్దకుఁ – ప్రియులారా మీరు – రండి యేసుని యొద్దకు = రండి రండి – రయమున బిలుచుచు – నుండెడి రక్షకుఁ – డొసఁగెను బ్రాణము ॥రండి॥

1. మీరు పాపంబులఁ ద్యజించి – యేసుని కడకు – రారే వేగము విశ్వసించి = మీరు వచ్చినను – మిమ్మును ద్రోయఁడు – చేరెడు వారిని – జేర్చును దన దరి ॥రండి॥

2. మీకు బ్రతుకేమి శాశ్వతము – ప్రియ జనులారా – పోకుఁడి యాశించి లోకమును = లోకాశలకును – లొంగుట చేతను – మీకు ఘటిల్లును – మెండగు దుఃఖము ॥రండి॥

3. మీరేల జాలము చేసెదరు – ప్రియులారా వేగ – రారే కదు భాగ్య మొందెదరు = చేర వచ్చి చిర – జీవము నొందుఁ డ – పార ముదంబును– బడయఁగ దేవుఁడు ॥రండి॥

– పులిపాక జగన్నాథము



## 299 యేసునాధ కథా మాధుర్యము

రా – బిలహరి తా – త్రిపుట

యేసు నాథ కథా [1]సుధా రస – మిదిగో పానముఁ జేయరే = దోసకారి జనంబులారా – దురిత భవముల బాయరే ॥యేసు॥

1. ఇహపరంబు లెవనిచే సృజి – యింపఁబడియెనొ చూడరే = అసహాహ యా విభుఁ దవతరించెను – అతని గుణములఁ బాడరే ॥యేసు॥

2. [2]దురిత భరితుల దుష్ట [3]చరితుల– నరయ వచ్చెను జూడరే=స్థిరముగామది నమ్మి యా ప్రభు – కరుణ మదిఁ గొనియాడరే ॥యేసు॥

3. పనికిమాలిన [4]వేలుపుల దెస – పరుగు లెత్తుట మానరే = [5]తనువు మీ కొఱ కిచ్చు క్రీస్తుని – దయకుఁ బాత్రతఁ బూనరే ॥యేసు॥

4. మరణ బలి రక్తమున మన యం –దఱిని బ్రోవను వచ్చెను = కరుణతోఁ బాపులఁ బిలుచు గురు – దరికిఁబోవుద మిచ్చును ॥యేసు॥

5. పరమతత్వ విధాన బోధలు – బాగుగఁ బ్రకటించెను = [6]చిరసుఖాస్పద పదముఁ గోరిన – జీవులకు వినిపించెను ॥యేసు॥

6. మరణ మొందిన కొందఱికిఁ దా – మరలఁ బ్రాణము లిచ్చెను = వర మహాద్భుత కార్యముల ని– ర్ధర ననేక మొనర్చెను ॥యేసు॥

7. కుటిల బుద్ధుల ద్రోచి సజ్జన – గోష్టి నుండుట గోరరే = దిటముగను నెమ్మదిని మీరొం – దుటకుఁ క్రీస్తునిఁ జేరరే ॥యేసు॥

– పురుషోత్తము చౌదరి

---

[1]అమృతము [2]పాపములతో నిండియున్నవారిని. [3]దుర్మార్గమైన ప్రవర్తనగలవారిని [4]దేవతల [5]దేహము. [6]ఎల్లప్పటికిని ముఖకారణమైన

## 300 వచ్చి క్రీస్తును చూడుండి

రా – కాంభోజి తా–ట

రారె యేసుని జూతము – కోరిక దీర – రారె యేసుని జూతము = రారె యేసుని జూడ – రారాజై మన జీవా – ధార కరుణామృత – సారమై యున్నాc డు॥రారె॥

1. సారహీన మగు [1]సం – సారాబ్ధిలోc జిక్కి – భారమనుచు నీత – నేరని వారికి [2]తారకమైన దేవకు – మారుcడు యేసుcడూ [3]రార్చు చుందు టకు – [4]భూరిసహాయ – కారియై చేయూతకుc = గోరి యిచ్చుచు క్షేమ – తీరం బునకుc జేర్చ– దారిc జూపుచు మావి – చారముల్ దొలcగించు ॥రారె॥

2. ఘోరమైన పాప – భారంబు మోయుచు – దారిc గానక తారు – మారు లైన నరులc – గూరిమితో c బిల్చును – [5]నారక బాధ – [6]లూరక దొలc గించుచు – నీరసు లంచు – భారంబు తా మోయుచు = నోరి మధి కముc జూపి – నేరంబు బాపి శృం – గారమైన మోక్ష – ద్వారమై యున్నాcడు ॥రారె॥

3. కారుణ్యుcడును నిర్వి – కారుcడు దురితోప – కారుండు శుద్ధాలం – కారుండౌ యేసుని – నే రీతిగా వింటిమో – యా రీతి మో – [7]క్షారామ మున జూతుము – సార [8]వాక్య – ధోరణిన్ బడి పోదము = దారుణం బగు శ్రమలు – బారుబారుగా నున్న – [9]పోరి దాcటి ప్రభునిc – జేరి సుఖింతము ॥రారె॥

4. ఆ రమ్యపురిన బ్రే – మారగించుచు నిత్య మారోగ్యముకు బొంది – సారెసారెకుc ప్రభుని – [10]నారావముగ స్తోత్రము – [11]చారుతర దే –వా రాధనముc జేతము – నోరార నా – పేరు నే పూజింతుము = దూరస్థులై యున్న – వారలం దన రక్త – ధారోదకముచేc [12]జే – కూరునట్లుగc జేయు

– బేతాళ జాన్

[1]సముద్రమువంటి లోక జీవనము. [2]దాటించునదియై. [3]ఓదార్చుట. [4]గొప్ప [5]ఘోరమైన. [6]ఉచితముగ. [7] తోcటలో. [8] వాక్య ప్రవాహములో. [9] పోరాటము. [10] శబ్దముతో. [11]మనోహరమైన. [12] చేతికి దొరుకునట్లుగ.



## 301 రక్షణాహ్వానము

శ్రీరాగము తా–త్రిపుట

రారో జనులారా – వేగముc గూడి – రారో ప్రియులారా– శాశ్వతమైన –ఘన రక్షణc జేర = [1]సారాసారముల్ = సమ్మతిగాc జూచి – [2]ధీరత్వమునc క్రీస్తు – జేరు దారిc గోరి ॥రారో॥

1. అనుమానము లన్ని – మీరలు మాని – [3]ఆద్యంతము లేని = కనికరము చేత – మనల రక్షింపను – దన జీవము నిచ్చు – ఘనునిc క్రీస్తుని గొల్వ ॥రారో॥

2. మన పాపము లన్ని –మోయను దే – వుని చేc బనిc బూని = మనుజావ తారుcడై – వినుట కద్భుతమైన – పను లెన్నో చేసి సి – ల్వను బడిన ఘనుc జేర ॥రారో॥

3. పాపాత్ము లగు వారి – భారముc [4]ద్రుంచు – బలుడైన యుపకారి = ఓపికతో c దన – దాపుc జేరిన వారి – శాపము తా మోసి – కాపాడు ఘనువేcడ॥రారో॥

4. తన యాత్మకుc గీడు – గల్గించెడు – ఘనత లెల్లను [5]పాదు =[6]తనువు నిత్యము గా – దని యభిమాన – ముసు వీడి మన క్రీ –స్తుని జడ గతిcజూడ ॥రారో॥

5. సకలాంతర్యామి – నిరాకారు – డొకడే యంతట సామి = ప్రకట ముగా మర్త్య – లకునెల్ల మధ్యస్థ – డొకడే క్రీస్తుడు సం – రక్షకుడై యిలుకు వచ్చె ॥రారో॥

– పురుషోత్తము చౌదరి

[1]సారము గలవి, సారములేనివి. [2]ధైర్యముతో. [3] నిత్యమైన. [4] తీసివేయు, పనికిరానివి. [6] శరీరము.

## 302 శుభవర్తమాన ప్రకటన

రా – బ్యాగు (చాయ: యేసుని ప్రేమను నేమారక) తా–ఆది

యేసుని సుచరిత – మెంత పొనరినది – యెవ్వరు విని యెద – రీ జగతిన్ భాసుర నయ మను – బంధము గలిగిన – భక్తుల కిది సౌ – భాగ్యముగా ॥యేసు॥

1. దాసుల మొఱలను – దప్పక వినుచును – ధైర్యము నొసఁగెడి – దాత సుమీ = దోసముల గమిఁ – ద్రోయ బలముగల – దొడ్డ దొరకు నుతి – దూతలచేన్ ॥యేసు॥
2. పాప నరులఁ గని – పావనం బొనర్చను – భార మనని ఘన – బంధు వుఁ డు – ఆ పరమ జనకు – నాజ్ఞఁ బడసి నెరి యాధ్యుఁడిడుమ – లొందె నుయిలన్ ॥యేసు॥
3. సిలువపై నిలచి – చేటు వడుచు మరి – చివరకు జనకుని – చిత్తమునన్ = చెలువగ మనవిని – జేసెను నరులకు శిక్ష తొలఁగుటకు – శ్రీకరుఁడౌ ॥యేసు॥
4. పాప రహిత య – పార మహిమమున– పాత్రమ మరి కుడి – పార్శ్వ మునన్ = పాపులవిషయము – ప్రార్థన మొనర్చెడి – భావము గల హిత – భాస్కరుఁడౌ నా ॥యేసు॥
5. దుషులు ననుఁ గని – దూషణ నుడువులు – దగ్ధము లనక – దూరిన నా = ఇష్టుఁడు వడసిన యిడుమలు దలఁచి = యించుక పగ మది – నెంచను నా॥యేసు॥

## 303 కాలము గతించిపోవుచున్నది

రా – జంఝూటి తా–త్రిపుట

పోయెఁగ పోయెఁగ – కాలము వెళ్లి – పోయెఁగ పోయెఁగ = మాయ సంసార సం – పదఁ గూర్ప మరిగి – యాయు వంతయు వ్యర్థ – మైపోయెఁ దరిగి ॥పోయెఁగ॥

1. ఇలలో నెందరు నీతో – నీడైనవారు = కలఁ గాంచి మేల్కొన్న – గతి మడసినారు ॥పోయెఁగ॥



2. జల బుద్భుదము కంటె – చులకని బ్రదుకు = దలపోసి దీని యా – శలు గొయ్యి వెదకు ॥పోయెఁగ॥
3. ఎన్నాళ్ళు సుఖ పెట్టె – నెరవౌ నీ మేను = కన్ను మూసిననాఁడె – కాటి పాలౌను ॥పోయెఁగ॥
4. మద మత్సరముల వెం–బడి గూడి నీవు = హృదయాభిమానము – వదలు కొన్నావు ॥పోయెఁగ॥
5. చెడు దుర్గుణముల పో – షించుట విడువ = గడబాట్లు నీ కనులు – గానంగలేవ ॥పోయెఁగ॥
6. జవ్వన బలముచే – క్రొవ్వుచు నీవు = నవ్వులాటల ప్రొద్దు – నడిపి యున్నావు ॥పోయెఁగ॥

–పురుషోత్తము చౌదరి

## 304 రక్షణ మార్గము

రా – సౌరాష్ట్ర తా–ఆట

వినరే యేసుక్రీస్తు బోధ – మదిని – గొనరే – యాతని సత్య బోధ – వినిన యేసుని బోధ – విశ్వాసమున మీరు – గొనయెదరు నిజముగ – గొప్ప భాగ్యంబులు ॥వినరే॥

1. దారి దొలఁగియున్న – వారినెల్లను బ్రోవఁ – గోరివచ్చితి నంచు – కూర్మి యేసువు తెల్పె ॥వినరే॥
2. మన పాపముల నెల్ల –మన కొరకు వహియించి – మన యందు దయచేతఁ దన ప్రాణమర్పించి ॥వినరే॥
3. మారు మనసు నొంది – మరల రమ్మంచువే – మారు బిలుచు యేసు – మైత్రిని దలఁచుచు ॥వినరే॥
4. తన యాజ్ఞ గైకొని – తన సేవజేసెడి – మనుజుల కొసఁగును –మనసున నెమ్మది ॥వినరే॥
5. తాను నడచిన త్రోవ – తన జనులు ద్రొక్కును – తానెపుడు చేయును – తగిన సహాయ్యంబు ॥వినరే॥

– పులిపాక జగన్నాధము

## 305 రక్షకుని యొద్దకు రండి

రా – మారువ (చాయ : హలెలూయయని పాడుడీ) తా–ఆట

రండి మానవులారా – రక్షకునిన – మ్మండి వేగము ప్రియులారా = రండి పాపుల బ్రోచుటకు పర – మండలంబును విడిచి యీ భువి –మండలంబున కరుగుదెంచిన– మహాత్మున్ గనుగొని సుఖింపను ॥రండి॥

1. ఇలలో మానవులందరు – పలువిధ పాపా – శలలో మునిగి యుండిరి = తులువయగు సాతాను చెడ్డ – వలను జిక్కినవారలన్ దన – బలముతో విడిపింప బ్రాణము – బలిగబెట్టిన ప్రభుని యొద్దకు ॥రండి॥
2. పరముండు నరులందరికై – మరణంబయ్యె – కరుణతోడను కొరతపై = మరలి మూడవదినమునందున – మహిమతో నా ప్రభువులేచి – తెరవజేసెను మోక్షమార్గము – శరణు జొచ్చినవారలకును ॥రండి॥
3. పాపభారంబు నుండి – విడుదలనొంద – ప్రాపుగోరినవారలు = ప్రాపకుండగు క్రీస్తునాథుని – దాపుజేరి తపంబు జేసిన – పాపభారము దీసి శాంతిని గూర్చు – యా ప్రభు నొద్దకిపుడే ॥రండి॥
4. భావమందున దెలియుడి – మీరలు నిత్య – జీవమార్గము గనుడీ = పావనుండగు క్రీస్తు మిమ్మును – పావనులుగా జేసి నూతన – జీవము నొసంగి పరమున – జేర్చు మిమ్మును నిశ్చయముగా ॥రండి॥

– జి.జాన్ తాతయ్య

## 306 సువార్త

రా – ఆహిరి (చాయ : యేసువంటి ప్రియబంధుడు) తా–ఆది

పాపినినేనని – ప్రభుపదములకడ – ప్రార్థన సేయుము ఓ మనసా – పాపుల మిత్రుడు – ప్రభు యేసునికడ – పాపక్షమాపణ కలదో మనసా ॥పాపిని॥

1. నరుని స్వనీతిచే – దొరుకదు మోక్షము – నరులను జూడకు యో మనసా – ధరనొక పుణ్యుడు – దరచినలేడని – పరమవేదములో గలదో మనసా ॥పాపిని॥





2. జపతపములు మరి – యుపవాసములును – ఉపయోగింపవు ఓ మనసా – నెపముల జెప్పెదు – అపవాదిని విడి – కృపవాదినిగని బ్రతుకో మనసా ॥పాపిని॥
3. మానని ప్రేమచే – మనుజుల బ్రోవగ మానవుడయ్యెను ఓ మనసా మానుగ గల్వరి – మ్రానిపై యేసుడు – ప్రాణము నొసగెను ఓ మనసా ॥పాపిని॥
4. మరణము నొందియు – మరల సజీవుడై – మనుజుల కగుపడెనో మనసా – మరణ బంధముల – బరిమార్చిన ప్రభు – సరిరక్షకు లిక లేరిల మనసా ॥పాపిని॥
5. మార్పును బొందక – మలిన తరుణము – మరల లభింపదు ఓ మనసా – తీర్పుకాలమున తీర్పరి క్రీస్తని – తిరముగ నమ్ముము యేసుని మనసా ॥పాపిని॥

– ఎస్.జె.మోజెస్

## 307 యేసుక్రీస్తు సమాధానకర్త

హే ప్రభుయేసు – హే ప్రభు యేసు – హే ప్రభు దేవసుతా = సిల్వధరా, పాపహరా, శాంతికరా ॥హే ప్రభు॥

1. శాంతి సమాధానాధిపతీ – స్వాంతములో ప్రశాంతనిధీ = శాంతి స్వరూపా, జీవనదీపా – శాంతి సువార్తనిధీ ॥సిల్వధరా॥
2. తపములు తరచిన నిన్నెగదా – జపములు గొలిచిన నిన్నెగదా = విఫలులు జేసిన విజ్ఞాపనలకు – సఫలత నీవెగదా ॥సిల్వధరా॥
3. మతములు వెదకిన నిన్నెగదా – వ్రతములు గోరిన నిన్నెగదా = పతి తులు దేవుని సుతులని నేర్పిన – హితమతి వీవెగదా ॥సిల్వధరా॥
4. పలుకులలో నీ శాంతి కథ – తొలకరి వానగ గురిసెగదా = మలమల మాడిన మానవహృదయము – కలకలాడెకదా ॥సిల్వధరా॥
5. కాననతుల్య సమాజములో – హీనత జెందెను మానవత = మానవ మైత్రిని సిల్వపతాకము – దానము జేసెగదా ॥సిల్వధరా॥
6. దేవుని బాసిన లోకములో – చావుయె కాపురముండెగదా = దేవునితో సఖ్యంబును జగతికి – యీవి నిడితివి గదా ॥సిల్వధరా॥

7. పాపము చేసిన స్త్రీని గని – పాపుల కోపము మండెగదా = దాపున జేరి పాపిని బ్రోచిన – కాపరి వీవెగదా ॥సిల్వధరా॥

8. ఖాళీ సమాధిలో మరణమును – ఖైదిగ జేసిన నీవెగదా = ఖలమయుడగు సాతానుని గర్వము – ఖండనమాయెగదా ॥సిల్వధరా॥

9. కలువరిలో నీ శాంతి సుధా – సెలయేఱుగ బ్రవహించెగదా = కలుష ఎడారిలో కలువలు పూయుట – సిలువ విజయము గదా ॥సిల్వధరా॥

– ఎ.బి. మాసిలామణి

## 308 పాపము

రా – ముఖారి (చాయ : ఉన్నపాటున వచ్చుచున్నాను) తా–త్రిపుట

పాపకూపమునందు – పడి మునిగియున్నావు – పాటింపవది యెందుకు= పాప జన్మము పాపకర్మము – పాపపూరితమైన హృదయము – ఓపరాని భయంకరోగ్రత – శాపములు సమకట్టియుండగ ॥పాప॥

1. పరమాత్మ మీదనే – గురి నిల్పు మని దెల్పు – వరబోధమది నెంచవు = నిరత మును రాత్రియును బవలును – నిరవు ధనమును ఘనము సౌఖ్యము లరయు చుందువు క్షణము నీవా – పరమ ధర్మము సరకుజేయవు ॥పాప॥

2. కనివినంగ నుదగని – పనికిమాలిన క్రియల –దనిసి భ్రమయుచు నుందువు = ఘనుల పెద్దల జననీజనకుల – ననిశమును నిరసించి మెలగెడు వినయరహితంబైన జీవిత – మునకు నేమి ఘటిల్లునోకను ॥పాప॥

3. పెరవారలను బ్రియసో – దరులుగ బ్రేమింప – పరమాత్మపురికొల్పదే – పరులపై ద్వేషంబు పగగొని – పలుతెరంగుల బాధపఱచుచు – ప్రాణహత్య లొనర్చు నీకు – పరమ పదము లభింపసాధ్యమె ॥పాప॥

4. పాప పరిహారార్థ – ప్రాయశ్చిత్తము జేసి –ప్రాణమర్పించె నెవరో = ఆ పరాత్పరు నాశ్రయించుము – శాపభారము బాపిబ్రోచును – మాపు రేపునులేని స్వర్గ – ప్రాప్తికల్గును నిత్యశుభమగు ॥పాప॥

5. పాపభారము క్రింద – పడికుందు మీకునే – పరగనిత్తును శాంతిని – దాపు నకు రండంచు పతితుల – దయను బిలచెడు యేసుక్రీస్తును – పాపి కాశ్రయుడంచు నమ్మి – భక్తితో ప్రార్థించి వేడవే ॥పాప॥



6. శరణీయ వరమోక్ష – పురమందు ఘనసౌఖ్య – పరమానందము లొందుచు = వరుల దూతల – భక్తగణముల – సరసదేవు స్మరించు భాగ్యము– గురుదు నీకిడcగోరి పిలుచుచు – కరము జాపెను – కౌగిలింపవె ॥పాప॥

– పంతగాని పరదేశి

## 309 క్రీస్తు సువార్త

రా – ముఖారి (చాయ : ఉన్నపాటున వచ్చుచున్నాను) తా–త్రిపుట

దారుణ మగు మరణ – వారిధి దాcట నె – వ్వారి శక్యము సోదర = ఘోర మగు కెరటములవలె వి – స్తారముగ నేరములు పైcగొని – పారు చుండునప్పు డద్దరిc – జేరు టెట్లు దారిc గనరే ॥దారుణ॥

1. ఒక్క పెట్టున నెగసి – చక్క వెల్బుద మన నీ – రెక్క లక్కఱకు రావు = ఎక్కడైనను నోడ గనుcగొని – యెక్కిపోద మని తలంచినc – జెక్క నిర్మితమైన యోడ – లక్కఱకు రావేమి సేతుము ॥దారుణ॥

2. మంగళ ధ్వనులతో – శృంగారపురము వె– లుంగుచున్నది ముందట = పొంగి పారుచు మరణ నది త–రంగములc జెలంగుచున్నది భంగపడకుcడి మనకు క్రీస్తు – సువార్తయను పెను నావ యిదిగో ॥దారుణ॥

3. వాద రహితుండైన – యాది దేవుcడు దాని – నాథుం డనం బరcగును = బాధ లొందిన నరుల నందరిc – జేరcదీసిన క్రీస్తు యేసు – నాథుcడే నావి కుc డు క్రైస్తవ – వేదమే చుక్కాని దీనికి ॥దారుణ॥

4. మానవు లందరు – మరణాంబుధిని దాcట – మహనీయ మగు నావ యిదె = దీనిలో నెక్కుటకు ముందే – మానుగ వాక్యమును విని సు – జ్ఞాన మొందినవారు క్రైస్తవ – స్నాన మను పత్రికను బొందరె ॥దారుణ॥

5. విదితంబుగా నిందు – విజ్ఞాన బోదకుల్ – వినిపించుదురు వాక్యముc = గొదగొనిన యాత్మములు తృప్తిc – గొనును బ్రభు భోజనములోనే – హృదయములలో దేవునాత్మ – యెపుడు దీపంబై వెలుంగును ॥దారుణ॥

6. పలువిధ సంగీత – ములతో సాగుచు మనము – నలయ కుండcగc బోదు ము = బలముగల యీ – యలలు దాcటి – పరమ పురద్వారముల వెలుపల – గలిసికొని పరిశుద్ధ జనమును – గడకు మోక్షము చేరుకొందుము ॥దారుణ॥

7. కరుణామయుని సభలోఁ - జొరకపోయిన నిత్య - నరక మంత మందున మరియు నంత్య దినపు బాధలు - విరివిగ వినఁ గోరువారలు - మరణ మొందక మును ప్రత్యక్షీ - కరణ మను గ్రంథమను వినరే ॥దారుణ॥

- రావూరి దావీదు

## 310 యేసు హృదయద్వారమును తట్టుట

రా - భైరవి తా-ఆది

హృదయమనెడు తలుపు నొద్ద - యేసు నాధుండు = నిలచి - సదయుఁ డగుచుఁ దట్టుచుండు - సకల విధములను ॥హృదయ॥

1. పరుని బోలి నిలుచున్నాఁడు - పరికించి చూడ = నతఁడు - పరుఁడు గాఁడు రక్షకుండు - ప్రాణ స్నేహితుఁడు ॥హృదయ॥
2. కరుణాశీలుం డతఁడు గానఁ - గాచి యున్నాఁడు = యేసు - కరుణ నెఱిగి గారవింపఁ - గరము న్యాయంబు ॥హృదయ॥
3. ఎంత సేపు నిలువఁ బెట్టి - యేడ్పింతు రతని = నాతఁ - డెంతో దయచే బిలుచుచున్నాఁ - డిప్పుడు మిమ్ములను ॥హృదయ॥
4. అతఁడు మిత్రుఁడతఁడు మిత్రుం -డఖిల పాపులకు = మిర - లతని పిలుపు వింటి రేని - యతఁడు - ప్రియుఁడగును ॥హృదయ॥
5. జాలిచేతఁ దన హస్తములఁ - జాఁపి యున్నాఁడు = మిమ్ము - నాలింగనము సేయఁ గోరి - యనిశము కనిపెట్టు ॥హృదయ॥
6. సాటిలేని దయగల వాఁడు - సర్వేశు సుతుఁడు = తన - మాట వినెడు వారల నెల్ల - సూటిగ రక్షించు ॥హృదయ॥
7. చేర్చుకొనుఁడి మీ హృదయమున శ్రీ యేసునాధు = నతఁడు - చేర్చుకొనుచు మీ కిచ్చును -చిర జీవముఁ గృపను ॥హృదయ॥
8. అతఁడు తప్పక కలుగఁజేయు - నఖిల భాగ్యములు = మీర - లతని హత్తుకొందు రప్పు - డానందముతోడ ॥హృదయ॥
9. బ్రతుకు శాశ్వతంబు కాదు - పరికించి చూడఁ = గాన - బ్రతికి యుండు కాలముననే - ప్రభుని గొలువండి ॥హృదయ॥

-పులిపాక జగన్నాధము



## 311 *Come, ye people, hear the message*

1. జను లందఱు వినండి
దివ్య సంగతి
తండ్రియైన దేవుఁ డెంత
ప్రేమ చూపెను.
॥ యేసు క్రీస్తు నాకుఁగాను
ప్రాణ మిచ్చెను
తన్నుఁ జేర నన్నుఁ బిల్చెన్
క్రీస్తు వత్తును ॥
2. నరకోటి పాపమందు
మున్గి యుండఁగాఁ
దండ్రి వారలన్ రక్షింపఁ
ద్రోవ చేసెను.
3. మాకుఁ గాను ప్రాణమిచ్చి
మృత్యు వొందను
తన యేక పుత్రు నిచ్చి
పంపె నిలకున్.
4. ఆయనను నమ్మువారు
నాశ మొందక
నిత్యజీవ మొందిసదా
సంతసింతురు.
5. పాపభారము భరించు
పాపులెల్లరు
యేసు మాట వినఁగాను
బాధ తీఱును.
6. చేర రండి, సువిశ్రాంతి
నిత్యసంతుష్టి
మీకు నిత్తు నంచు యేసు
మిమ్ముఁ బిల్చును

-అను : జేకబ్ చేంబర్లేన్

## 312 *The Great Physician*

1. మహా వైద్యుండు వచ్చెను
ప్రజాళిఁ బ్రోచు యేసు
సహాయ మియ్య వచ్చెను
సంధింపరండి యేసున్
॥ మాధుర్యంపు నామము
మోద మిచ్చు గానము
వేద వాక్యసారము
యేసు దివ్య యేసు ॥
2. మీ పాప మెల్లఁ బోయెను
మేలొందుఁ డేసు పేరన్
గృపా సంపూర్ణ మొందుఁడి
యపార శాంతుఁ డేసు.
3. వినుండి గొఱ్ఱె పిల్లను
విశ్వాస ముంచి యేసున్
ఘనంబుగన్ స్తుతించుఁడి
మనం బుప్పొంగ యేసున్
4. ఆ రమ్యమైన నామము
అణంచు నెల్ల భీతిన్
శరణ్యు లైన వారి నా
దరించు నెంతో ప్రీతిన్

5. ఓ యన్నలారా పాడుcడీ
యౌదార్యతన్ సర్వేశున్
ఓ యమ్మలారా మ్రొక్కుcడీ
ప్రియాతి ప్రియుcడేసు
6. ఓ పిల్లలారా కొల్వుcడీ
యౌన్నత్య రాజు నేసున్
తపించువారి దాతయౌ
దయామయున్ శ్రీ యేసున్
7. శ్రీ యేసుకై యర్పించుcడీ
మీ యావజ్జీవనమును
ప్రియంపు దాసులౌచును
రయంబు గొల్వుcడేసున్

– విలియం హంటర్

అను: ఆల్ ఫ్రెడ్ త్యాగరాజు సామర్

# పశ్చాత్తాపము

## 313 పశ్చాత్తాప ప్రార్థన

రా – యదుకుల కాంభోజి తా–ఆది

[1]త్రాహి [2]మాం క్రీస్తు నాథ – దయc జూడ రావే = నేను – [3]దేహి యనుచు నీ పాదములే – దిక్కుగాc జేరితి నిపుడు ॥త్రాహి॥

1. గవ్వ చేయరాని చెడ్డ – కర్మేంద్రియాధీనుcడనై – [4]రవ్వ పాలై నే నెంతో – [5]నెవ్వc బొందితిc – త్రవ్వుచున్న కొలcదిc – పెరుcగుc – దరగదు నా పాప రాశి – యివ్విధమునc జెడిపోతినినే – నేమి సేతు నోహోహోహో ॥త్రాహి॥
2. నీ యందు భయభక్తులు లేని – [6]నిర్లజ్జాచిత్తముc బూని – చేయరాని దుష్కర్మములు – చేసినాcడను = దయ్యాలరాజు చేతిలోc–జేయి వేసి వాని పనులc – జేయ సాగి నే [7]నిబ్బంగిc – జెడిపోయితి నే నయ్యయ్యయ్యో ॥త్రాహి॥
3. నిబ్బర మొక్కించుకైన – నిజము రవ్వంతైన లేక – దబ్బర లాడుటకు ము –త్తా నైతిని = అబ్బురమైన ఘోర పా – పాంధకార కూపమందు – దబ్బున బడిపోతి నయ్యో – దారి చెడి నేనబ్బబ్బబ్బా ॥త్రాహి॥

[1]రక్షించుము. [2]నన్ను. [3]ఇమ్ము. [4]అపకీర్తి. [5]ఆపద. [6]సిగ్గులేనిమనస్సు.
[7]ఈ విధమున.



4. నిన్నుc జేరి సాటిలేని – నిత్యానంద మందcబోవు – చున్నప్పుడు నిందలు నా – కెన్ని చేరినా = విన్నదనము లేకుండ నీ – వే నా మదికి ధైర్యమిచ్చి– యన్నిట రక్షించి తివి నా – యన్న నీకు స్తోత్ర మహోహో ॥త్రాహి॥

– పురుషోత్తము చౌదరి

## 314 దావీదు కీర్తన 51

రా – శంకరాభరణము తా–ఏక

దేవ! దీనపాపిని – ఓ పావన – గావు కృపా బాహుళ్యము చేత ॥దేవా॥

1. ఖలుడనో దేవా! నా నిలువెల్ల పాపంబె = మలినత్వమును బాపి – మాన్య జేయవె తండ్రీ! ॥దేవ॥
2. నీకు కేవలంబు – నీకే విరోధముగ = ప్రాకొని నే ఘోర – పాపం బొనర్చితిని ॥దేవ॥
3. నాయతిక్రమ మెప్డు – నా యెదుట నున్నది = నా యెదను భారంబై – నను ద్రుంచుచున్నది ॥దేవ॥
4. పాపంబులోనే యు – ద్భవించినాడను = పాపంబులోనే గ – ర్భము దాల్చినది తల్లి ॥దేవ॥
5. ఎదయందు సత్యంబే – యెడcగోరు చుందువు = హృదయమందున జ్ఞాన – మొదవ జేతువు నాకు ॥దేవ॥
6. కలిగించు నాలో ని – ర్మల శుద్ధ హృదయంబు = నిలుకడైన మనసు నిలుపు మాంతర్యమున ॥దేవ॥
7. త్రోసివేయకు నన్ను – నీ సన్నిధి నుండి = తీసివేయక నుంచు = మీ శుద్ధాత్మను నాలో ॥దేవ॥
8. నీ రక్షణానంద –మో రక్షకా మరల = చేరదీసి యిచ్చి– స్థిరపరచు నా మనసు ॥దేవ॥
9. కావవే కర్తార – క్తాపరాధమునుండి = కావు నే నుత్సాహ – గానంబుc జేసెద ॥దేవ॥

10. ప్రభువ! నా నోరునిన్ – ప్రస్తుతించుచు సదా = విభవముగఁ గొనియాడ – విప్పు నా పెదవులను ॥దేవ॥

11. కోరువాఁడవు కావీ – వారయ నర్పణలు = కోరిన నర్పింతు – కోటి బలులు నీకు ॥దేవ॥

12. విఱిగిన మనసే నీ – విలసిత యర్పణము= అరయ నలిగిన హృదయ – మతి ప్రియంబౌ నీకు ॥దేవ॥

## 315 ఉన్న విధముననే నీ యొద్దకు వచ్చుచున్నాను

రా – ముఖారి తా–త్రిపుట

ఉన్నపాటున వచ్చు – చున్నాను నీ పాద – సన్నిధి కో రక్షకా = యెన్న శక్యముగాని పాపము – లన్ని మోపుగ వీపుపైఁబడి – యున్న విదె నడలేక తొట్రిలు – చున్నవాఁడను నన్ను దయఁగను ॥ఉన్న॥

1. కారుణ్యనిధి యేసు – నా రక్షకా నీ శ – రీర రక్తము చిందుట = భూరి దయతో నన్ను నీదరిఁ – జేర రమ్మని పిలుచుటయు ని – ష్కారణపు నీ ప్రేమ యిది మరి – వేరే హేతువు లేదు నా యొడ ॥ఉన్న॥

2. మసి బొగ్గువలె నా మా – నస మెల్లఁ గప్పె దో – ష సమూహములు మచ్చలై = [1]అసిత మగు ప్రతి డాగు తుడువను – [2]గసుటుఁ గడిగి పవిత్ర పరపను – [3]నసువు [4]లిడు నీ రక్తమే యని – [5]మసల కిప్పుడు సిలువ నిదె గని ॥ఉన్న॥

3. వెలపట బహు యుద్ధ – ములు లోపటను భయము – కలిగె నెమ్మది దొల గెను = పలు విధములగు [6]సందియంబుల – వలనఁ బోరాటములచే నే – నలసి యిటునటుఁ గొట్టఁబడి దు – ర్బలుఁడనై గాయములతో నిదె ॥ఉన్న॥

4. [7]కడు బీదవాఁడ [8]నం – ధుఁడను దౌర్భాగ్యుఁడను – జెడిపోయి పడి యున్నాను = [9]సుడివడిన నా మదికి స్వస్థతఁ – జెడిన కనులకు దృష్టి భాగ్యముఁ –బడయవలసిన వన్ని నీ చేఁ – [10]బడయుటకు నా [11]యొడ యఁడా యిదె ॥ఉన్న॥

[1]నల్లవి. [2]మైల. [3]ప్రాణములు. [4]ఇచ్చుట. [5]ఆలస్యముచేయక. [6]సందేహములు. [7]మిక్కిలి. [8]గ్రుడివాఁడను. [9]సొమ్మసిల్లిన. [10]పొందుట. [11]కర్త.



5. నీ వాగ్దత్తము నమ్మి – నీపై భారము పెట్టి –జీవ మార్గముఁ గంటిని[1] కేవలంబగు ప్రేమ చేతను – నీవు నన్ను క్షమించి చేకొని – [2]భావశుద్ధి [3]నొనర్చి సంతోషావసరముల నిడుదువని యిదె ॥ఉన్న॥

6. దరిలేని యానంద – కరమైన నీ ప్రేమ – [4]తరమే [5]వర్ణన చేయను = [6]తెరవు కడ్డం బైన యన్నిటి – విఱుగఁగొట్టెను [7]గాన నే నిపు [8]డరుదుగా నీ వాఁడ నవుటకు – మఱి నిజము నీవాఁడ నవుటకే ॥ఉన్న॥

– పురుషోత్తము ఛౌదరి

## 316 పాపపు టొప్పుకోలు

రా – కేదారగౌళ తా–ఏక

దిక్కులేని వాఁడనో ప్రభో – నీ యండఁజేరి – మ్రొక్కి సేవఁజేతు నో ప్రభో = మ్రొక్కి విన్నవించు వారి – యక్కరలను దీర్చు సత్యము – గ్రక్కున నిడి యాదరించు – మక్కువైన దేవ తనయ ॥దిక్కులేని॥

1. ఘోర పాప భరము నెల్లను – మోయుచు నలయు – వారలార రండటంచును = భూరి దయను బిలిచి యున్న – సార వాక్కు లెఱుఁగ కధిక – భార మొంది తుదిని నీ దరిఁ – జేరితి నన్నాదరించుము ॥దిక్కులేని॥

2. బలము లేని వాఁడనో ప్రభో – కేవలము పాప – ములను జేసి యలసితిని ప్రభో = ఇలను నే నొనర్చునట్టి – కలుష జాలములను నీవు – తొలఁగ జేసి యాత్మ కధిక – బలము నొసగి మనుపు మయ్య ॥దిక్కులేని॥

3. పామరుండ నౌట వల్లను నే నెఱుఁగనైతి – క్షేమ మిచ్చు పదవులెల్లను = కామ క్రోధ లోభములను – దీమసమున విడిచి యేసు – నామ మందు విశ్వసించి – ప్రేమను వర్తింపజేయు ॥దిక్కులేని॥

4. వందనం బొనర్తునో ప్రభో – నా డెందమందలి – సందియము లణంచు మో ప్రభో = సందియ మెడబాపి శాస్త్ర –మందు నుందు సార వాక్యానంద పదవు లనుభవింప –డెందము వెలిఁగింప వయ్య ॥దిక్కులేని॥

– చిక్కాల పాలస్

[1]ముఖ్యమైన. [2]మనస్సు శుచిగా. [3]చేసి. [4]శక్యమా. [5]స్తుతి. [6]మార్గము. [7]కనుక. [8]ప్రియముగా.

## 317 పశ్చాత్తాప ప్రేరేపణ

రా - ముఖారి తా-ఆది

పాపము దలంచు సుమీ - పశ్చా - త్తాపముఁ బొందు సుమీ = దాపని యేసుని పాదంబులబడి - పాపము వీడు సుమీ ॥పాపము॥

1. పాపము చేయకు మీ - యేసుని - గాయము రేపకుమీ = పాయక పాపము చేసిన మనసా - కాయఁడు యేసు సుమీ ॥పాపము॥

2. గంతులు వేయకుమీ - యేసుని - చెంతకుఁ జేరు సుమీ = వింతఁగఁ గ్రీస్తుని రక్షణ్యామృత - బిందువుఁ గోరు సుమీ ॥పాపము॥

3. ఈ ధరన్నమ్మకుమీ - ఆత్మకు - శోధన లుండు సుమీ = శోధన మాన్పెడు క్రీస్తును నమ్మి శ్రద్ధగ నుఁడు సుమీ ॥పాపము॥

4. తెగువఁ బోరాడు సుమీ- రిపునకు - బెగ్గిలవద్దు సుమీ = తెగువగు ప్రార్థన ఖడ్గమునుఁ బట్టి - పగతునిఁ గెల్వు సుమీ ॥పాపము॥

5. అంతము వచ్చు సుమీ - రక్షణ - అంతలో వెదకు సుమీ =అంత రంగుఁ డగు క్రీస్తు రక్షకుని - చెంతను జేరు సుమీ ॥పాపము॥

- యెషయా వీరమార్టిన్

## 318 పాపపు టొప్పుకోలు

రా -హరికాంభోజి తా-త్రిపుట

పాపినయ్యా - నేఁ - బాపి నయ్యా - కాపాడ వయ్యా - పాపభారము నుండి - పాపు మయ్యా - నన్నుఁ - పాపభారమునుండి - పాపు మయ్యా ॥పాపి॥

1. కావుమయ్యా - ననుఁ - గావు మయ్య నా - పావ నయ్యా - జీవమైన యేసు - నీ వే నయ్యా నా జీవమైన యేసు - నీవే నయ్యా ॥పాపి॥

2. ప్రాపు నీవు - నా ప్రాపు నీవు న - న్నోపినావు - నా పాలిదైవమా - నన్నుఁ గావు -మో - నా పాలి దైవమా - నన్ను ఁ గావు ॥పాపి॥



3. ఏల వయ్యా - న - న్నేల వయ్యా - మేలియ్య వయ్యా - చాల నమ్మితిఁ గరుణా - శాలి వయ్యా - నేఁ - జాల నమ్మతిఁ గరుణా - శాలి వయ్యా ॥పాపి॥

4. మంటివాఁడ - నే - మంటివాఁడ న - న్నొంటి వీడ కె -న్నంటి కైన ని - న్నంటువాఁడ - నే నె - న్నంటికైన ని - న్నంటువాఁడ ॥పాపి॥

5. శాంతిపరచు - నను - శాంతిపరచు నీ - శాంత మిడుచు నా - సొంత మగు దనుక - చెంత నునుచు - నే నా - సొంత మగు దనుక - చెంత నునుచు ॥పాపి॥

-బేతాళ జాన్

## 319 ఆత్మ వంచన

రా - ధన్యాసి తా-ఆది

ఎఱింగి యెఱిఁగి చెడిపోతివి మనసా - యిఁక నీ దిక్కెవ్వరు చెపుమా = దురితం బిది స - చ్చరితం బిది యని - యెరుక సరకు గొన - కేమియు నీ ॥యెఱిఁగి॥

1. ఇది దేవుని దయ యిది క్రీస్తుని ప్రియ -మిది విమలాత్ముని గుణ మనుచు = ఎదలో ననుభవ - మెఱింగి మరల దు - ర్మదమున దుష్కృత - పదమున బడితివి ॥యెఱిఁగి॥

2. సకలముఁ జూచెడు దేవుని కంటికిఁ - జాటుగ జరిగెడి పని యేది = ఇఁక జెవి గుసగుస - లెల్లను దిక్కులఁ బ్రకటముఁ జేసెడు-ప్రభు వున్నాఁడని ॥యెఱిఁగి॥

3. ఎన్నిమార్లు సిలువను వేయుచుఁ ప్రభు - యేసుని వెతబడఁ జేసెదవు= తిన్నని మార్గము - తెలిసియుండి నీ - కన్నుల గంతలు - గట్టితి వయ్యో ॥యెఱిఁగి॥

4. గద్దించెడు మనస్సాక్షికి గడ - గడ లాడక పోతివి నీవు =హద్దుమీరి దై-వాజ్ఞలు ద్రోయుచు - నెద్దు లాగు పరు - గెత్తితి వయ్యో ॥యెఱిఁగి॥

5. పలువిధ శోధన బాధలలో ఘన - ప్రభు క్రీస్తుడె నీ దిక్కునుకో తాళుచు బశ్చాత్తాపముపడి యిక - జాలించుము కలు - షపు యత్నంబు ॥యెఱిఁగి॥

6. అపరిమిత దయా శాంతులు గల ప్రభు – వనిశము కోపింపఁడు నీపై = కృపా వాగ్దత్తము – లెపుడు దలఁచి నీ – యపవిత్రతఁ గని – హా యని యేడ్వుము ॥ఎటిఁగి॥

– పురుషోత్తము చౌదరి

## 320 పశ్చాత్తాప ప్రేరేపణ

రా – బిలహరి (చాయ : భీకరుండౌ) తా–త్రిపుట

యేసు విభునిఁ దలఁచి మదిలో – ద్వేషము లణఁగింపరే = మోస విశ్వ భ్రాంతు లెల్ల – రోసి పరిహర్షింపరే ॥యేసు॥

1. కామ క్రోధ లోభ మోహా – క్షామ గుణములు మానరే = హేమ రీతిని దేవ కృపలో – క్షేమ మున్నది కానరే ॥యేసు॥
2. సత్యవేద సార మెల్ల – నిత్యము రుచిచూడరే = సత్త లేని దురిత జాలి – బొత్తిగా విడ దీయరే ॥యేసు॥
3. కర్త కర్తయనుచు వేఁడి – వ్యర్థులై చెడి పోకరే = స్వార్ధ చర్య లెల్ల మాని – కర్త యేసుని బోలరే ॥యేసు॥
4. బంధు మిత్రు – శత్రు నెనరు – నిందుఁ జూపఁ బూనరే = యందమైన మోక్ష విభవము – లందుఁ గని హర్షింపరే ॥యేసు॥
5. మోక్ష వైభవ మెదలోఁ దలఁచి – మోసమున బడిపోదురే = కక్షి సాతాన్ ముచ్చు వలలను – హెచ్చుగాఁ దెగఁగొట్టరే ॥యేసు॥
6. సద్దులేకను దేవ సేవ – ముద్దుతో ఁ గొని యాడరే = హద్దు మీరు విమత సాతాన్ – సుద్దులను ద్యజియింపరే ॥యేసు॥
7. బాధ చేసెడి గురుల వీడుచు – బోధకుల దరిఁ జేరరే = నాధు క్రీస్తును నమ్మి మీరలు – సాధులై వర్తింపరే ॥యేసు॥

–డేవిడ్ లైటన్



## 321 పాపి విలాపము

రా – బిలహరి (చాయ : యేసునాధ కథా సుధా) తా–త్రిపుట

ఆదరింపుము యేసువా ని – న్నాశ్రయించితి నా కికన్ లేదు వేరొక యాశ్రయంబని – లెస్సగా మది నమ్మితిన్ ॥ఆద॥

1. నిరతముండెడు పరమ ధనమను – నీతి జీవిత రీతిలో = పెరుగ గోరుచు నిన్ను జేరితి – ప్రేమ జూపుము యేసువా
2. సత్య సంధుడ లోక బాంధవ – సర్వశాంతి సుధాకర = నిత్యజీవ జలంబు లొసగుము – నీతి నిధుల సజీవుడా ॥ఆద॥
3. ముందు వెనుకను దుష్ట శక్తుల – మూక నన్నరి కట్టగన్ = బంధితుండనైతి నా ప – ద్బాంధవ విడిపించుమా ॥ఆద॥
4. పరమ పురమున కరుగ నేరని – పాలసుడనో రక్షకా = కరుణతో నా మొరను గైకొని – కలుషముల నెడబాపవే ॥ఆద॥
5. పరమ ధాముడ వని యెరిగి నీ – శరణు వేడితి నో ప్రభో = తనువు విడిచిన వేళలో నీ – తలుపు నాకై తెరువు మా ॥ఆద॥

– వి.జి.జాన్ సుందరరావు

## 322 క్రీస్తు మోక్ష మార్గము

రా – ఆనందభైరవి (చాయ : దేవుని ప్రేమ ఇదిగో) తా–కురుజంపె

శరణు నా యేసు ప్రభువా – నీవెగా – పరలోకమునకుఁ ద్రోవ = కరుణతో నన్నుఁ గావ – నీ కన్న గర్త యెవ్వఁడు యేసువా ॥శరణు॥

1. పర సుఖము విడిచినావు – కన్యక – మరియగర్భమున నీవు = ధరణి నుదయించినావు – నీ కన్న – దాత యెవ్వఁడు యేసువా ॥శరణు॥
2. పాపభారము క్రిందను – బడి యున్న – పాపాత్ములను నెల్లను = జేఁపట్టి రక్షింపఁగా – నీ కన్న – శ్రేష్ఠుఁ డెవ్వఁడు యేసువా ॥శరణు॥
3. మరణమై లేచినావు – జీవింప – మార్గంబుఁ జూపినావు = పరమహిమ జూపినావు – నీ కన్నుఁ – ప్రభుఁ డెవ్వడు యేసువా ॥శరణు॥

–మిక్కిలి సమూయేలు

## 323 క్రైస్తవ పశ్చాత్తాపము

రా – అఠాణ తా–ఆది

రావయ్య యేసునాథా – మా – రక్షణమార్గము – నీ = సేవఁ జేయ మమ్ముఁ – జేపట్టుటకు ॥రావయ్య॥

1. హద్దు లేక మేము – ఇల – మొద్దులమై యుంటిమి –మా = కొద్ది బుద్ధులన్ని– దిద్ది రక్షింపను ॥రావయ్య॥
2. నిందు వేడుకతోను – మమ్ము – బెందువడక చేసి – మా = గండంబు లన్నియు – ఖండించుటకు ॥రావయ్య॥
3. మేర లేని పాపము – మాకు – భారమైన మోపు – నీవు = దూరంబుగాఁ జేసి – దారిఁ జూపుటకు ॥రావయ్య॥
4. పాపుల మయ్య మేము – పరమ – తండ్రిని గానకను – మా = పాపంబు లన్నియుఁ – పారఁ దోలుటకు ॥రావయ్య॥
5. అందమైన నీదు – పరమానంద పురమందు = మే మందరముజేరి ఆనందించుటకు ॥రావయ్య॥

## 324 పాప పశ్చాత్తాపము

రా – నాధనామక్రియ తా–రూపకము

ఏ ముఖంబుతోడ వత్తు – యేసు నాథనీదు మ్రోల = కావరించి నిన్నుమఱచి – యేక మైతి బామరులతో – నేది దారి నిన్నుఁ జేర – నేమో తెలియదాయెను ॥ఏ ముఖంబు॥

1. నీచ పాప వర్తనంబు – పేచ మెల్లఁ బాపి ముందు = కాచి పెంచి నియము నిష్ఠ – లాచరణము నిలుపుకొరకు – దోషభార మెల్ల బాపఁ – బూచినీ దె నిజముగా ॥ఏ ముఖంబు॥
2. తుట్టతుదకు నిన్ను c జేరఁ – గట్టినాఁడం గంకణమును = వట్టిమాటకాదు నిజము పట్టి – నడుపు పరమ పురికిఁ – బట్టికొనుమునాదు చేయి – మట్టి పాలు కాకమునుపే ॥ఏ ముఖంబు॥

*– జొన్నకూటి దేవదానం*



## 325 పాపి మరలుట

రా – కమాసు (చాయ : భీకరుండౌ) తా–త్రిపుట

నన్ను దిద్దుము చిన్న ప్రాయము – సన్నుతుండగు నాయనా = నీవు – కన్న తండ్రి వనుచు నేను – నిన్ను c జేరితి నాయనా ॥నన్ను॥

1. దూరమునకుఁ బోయి నీ దరిఁ – జేర నైతిని నాయనా = నేను కారు మూర్ఖపు పిల్లనై కా – రడవిఁ దిరిగితి నాయనా ॥నన్ను॥
2. మంచి మార్గము లేదు నాలో – మరణ పాత్రుండ నాయనా =నేను వంచితుండ నైతిని ప్ర– పంచమందున నాయనా ॥నన్ను॥
3. చాల మారులు తప్పిపోతిని – మేలు గానక నాయనా = నా – చాల మొఱల నాలకించుము – జాలిగల నా నాయనా ॥నన్ను॥
4. జ్ఞాన మంతయుఁ బాడుచేసి – కాన నైతిని నాయనా నీవు – జ్ఞానము గల తండ్రి వంచు – జ్ఞప్తి వచ్చెను నాయనా ॥నన్ను॥
5. కొద్ది నరుఁడను దిద్ది నను నీ – యొద్దఁ జేర్చుము నాయనా = నీ – యొద్దఁ జేర్చి బుద్ధి చెప్పుము – మొద్దు నైతిని నాయనా ॥నన్ను॥
6. ఎక్కడను నీవంటి మార్గము – నెఱుఁగ నైతిని నాయనా = నీ – ఱెక్క చాటున నన్ను c జేర్చి – చక్కపరచుము నాయనా ॥నన్ను॥
7 శత్రువగు సాతాను నన్ను – మిత్రు c జేయను నాయనా = యెన్నో సూత్రములు గల్పించెను నా – నేత్రముల కో నాయనా ॥నన్ను॥
8. వాసిగా నేఁ బాపలోకపు – వాసుఁడ నో నాయనా = నీ – దాసులలో నొకనిగా ననుఁ జేసి కావుము నాయనా॥నన్ను॥

*–ముంగమూరి దేవదాసు*

## 326 క్రీస్తును నమ్ముట

రా – ముఖారి (చాయ : సీయోను కన్య) తా–ఆట

నమ్మితి నయ్యా యేసయ్యా నీ పాదములే – నమ్మితి నయ్యా యేసయ్యా = నమ్మితి నయ్య నా – నెమ్మదిలో నిన్ను – నిమ్ముగఁ గృప నాపైఁ – గుమ్మరించుము వేగ ॥నమ్మితి॥

1. పాప భార మనెడు – మోపు మోయఁగ లేక – కాపు నీవె యని నీ – దాపు జేరిన నేను ॥నమ్మితి॥

2. ఆపత్కాలమునందుఁ - బ్రాపు నీవని వేఁడఁ - గాపాడి రక్షించు - కరుణాసముద్రుఁడ ॥నమ్మితి॥

3. ఎన్ని తప్పులు నాలో - నున్న నీ దయ చేత - మన్నించి రక్షించు - మహిత దేవ కుమార ॥నమ్మితి॥

4. దాసుని మొఱ నీవు - వేసారక విని - వాసిగా రక్షించు - పరమ జనక నన్ను ॥నమ్మితి॥

- బుఝ్జారెడ్డి

## 327 పశ్చాత్తాప గీతి

### (దా. కీ. 139)

రా–భూపాళము (చాయ : చింతలేదిఁక) తా - త్రిపుట

దేవ నీవు నన్ను c బరిశో -ధించి బాగుగఁ దెలిసికొంటివి - నీ వెఱుఁగు దువు నేను కూర్చుండుటయును - నే లేచుటయును ॥దేవ॥

1. నాకుఁ దలఁపులు పుట్టినపుడే - నా మనస్సు గ్రహించి నాఁడవు = ప్రాకటంబుగ నా నడక నా పడకను - బరిశీలించితి ॥దేవ॥

2. నీకు నా సమస్త చర్యల - నిజము తెలియును, మాట నాల్కకు = రాకపూర్వము దేవ సర్వముఁ బూర్తిగా - నీకే - తెలియును ॥దేవ॥

3. నా వెనుకను ముందు నుండి - నన్ను నావరించి నీ చెయ్యి = నీవు నాపయి నుంచితివి నా మది కది - కేవల మందదు ॥దేవ॥

4. అరుగుదెంచెద నెచ్చటికి నీ - యాత్మ యొద్ద నుండి యింక నీ = పరమ సన్నిధి నుండి నే నెచ్చోటికిఁ - బారిపోవుదు ॥దేవ॥

5. ఏను వేకువ టెక్కలను ధరి - యించి కడలిలో నున్న నీ చెయి = మానక నడిపించు నీ కుడి చేయియు - మరి నను గైకొను ॥దేవ॥

6. నను సృజించిన తెఱఁగెఱుంగఁగ - నాకు భయ మాశ్చర్య మొదవును = గనుక నీకును నేఁ గృతజ్ఞతాస్తుతులను జెల్లింతును ॥దేవ॥



7. నేను పిండం బైనయప్పుడు - నీవు నను వీ క్షించినాఁడవు = నేను బ్రతుకుట ముందె లిఖితంబాయెను - నీ గ్రంథంబులో ॥దేవ॥

8. నిక్కముగ దేవా నీ తలఁపు - లెక్కువ ప్రియ మగును నాకును = లెక్కకు నెక్కువౌ ॥దేవ॥

- మల్లెల దావీదు

## 328 పశ్చాత్తాపము లేనిదే పరమ భాగ్యము లేదు

రా - అసావేరి తా–ఆట

పాప [1]పశ్చాత్తాప మొందని వారికి - పరమ భాగ్య మేడ నబ్బునే - మనసా = పాపాత్ములకు యేసు - [2]పరమండలము నుండి భూమధ్యమునకుఁ దా వచ్చెను - పాపిష్ఠుల రమ్మని పిలిచెను - నా - [3]ప్రాపుఁ గోరుమని చెప్పెను - మనసా ॥పాప॥

1. ధైర్యమొంది నన్ను దలఁచిన వారికి - పూర్వజ్ఞాన మొనఁగూర్తును - [4]దు -ర్భావ మెల్లను విడఁ దీతును - యేసు - వారి యాజ్ఞ యని యనియెను - మనసా ॥పాప॥

2. బలపడి నాదు నామము గొన్నవారికి - యిల బాంధవుల వైరమందును - సర్వ - కుల జనంబుల క్రోధమందును - స్నేహి - తుల యెడ బాటులు గల్గును- మనసా ॥పాప॥

3. అడిగిన వారికి నొసఁగుదు ననుచును - కడుమోదమున నాజ్ఞాపించెను - తట్టు - తట్టుఁడని బోధించెను - విప్పి - విడబడునని ప్రేమించెను - మనసా ॥పాప॥

4. దోషములన్నియు యేసు నాథుడు తా - మోసికొని సమ్మతించెను - సిలువ - వేసిన వారిని దీవించెను - మోక్ష- వాస సాధన మని తెల్పెను- మనసా ॥పాప॥

- వి.వెంకటస్వామి

[1]మారుమనస్సు. [2]పరలోకము. [3]ఆశ్రయము. [4]చెడ్డ కోరికలు యావత్తు.

## 329 క్షమాపణ వేడుట

రా - కమాసు తా-త్రిపుట

పాపిని కృప జూపవయ్యా - దాపు జేరితిని యేసయ్యా = పాప భారము క్రింద శ్రమపడి - కృంగియున్నాను యేసయ్యా ॥పాపి॥

1. వేష భాషలతోడ నిండి - మోసపోయితిని యేసయ్యా = దోసిలొగ్గి నిన్ను చేరితి - దాసునిగ బ్రోవు యేసయ్యా ॥పాపి॥
2. నీతి లేని నాదు జీవిత - మేల నికనయ్యా యేసయ్యా = నీతి గరపి బ్రోవు మయ్యా - నీతి నిడవయ్యా యేసయ్యా ॥పాపి॥
3. నీదు సిలువలోని ప్రేమ - నెంచదర మౌన? యేసయ్యా = నాదు కలుష మంత బాపి - కనికరింపు మా యేసయ్యా ॥పాపి॥
4. నీదు రక్తధారలేయిల - పాపికాశ్రయము యేసయ్యా = నీతిమంతుల జేయుమయ్యా - నీతిసూర్యుండా యేసయ్యా ॥పాపి॥
5. దాపుగోరినవారలకు నీ - ప్రాపుజూపితివి యేసయ్యా = పాపశాపము బాపి నిత్య - జీవమిడవయ్యా యేసయ్యా ॥పాపి॥
6. శాంతి గోరువార లెల్లనీ - చెంతకరగినచో యేసయ్యా = చింతలెల్ల దీర్చగలవు - శాంతి నొసగెదవు యేసయ్యా ॥పాపి॥
7. పరమరక్షక నీదు ప్రేమ - నెరుగ తరమౌన యేసయ్యా = పరుల మైన మమ్ము బ్రోవ - వేచియున్నావా యేసయ్యా ॥పాపి॥
8. నాదు హృదయము నీదెసుమ్మా - నీవె గైకొనుమా యేసయ్యా = శుద్ధ హృదయము జేసి నను నీ - సుతునిగా జేయు యేసయ్యా ॥పాపి॥

- సిరిపురపు కృపానందము

## 330 పాపమును విసర్జించుట

రా - ముఖారి (చాయ : భయము నొందకుము) తా-అట

ఖండింపవలెను - దుర్గుణములు - ఖండింపవలెను = ఖండింపవలెఁ బాప-ముండఁజూచి యేసు - నండఁజేరి మన - గుండె పదిలముఁ జేసి ॥ఖండింప

1. అంధత్వమునను - రక్షణమార్గ - మందుఁ జేరకయు = ఎందెందుఁ జూచిన - సందులేక పాప -మందు మునిఁగి నరలా - నందమొందక చెడిరి ॥ఖండింప॥
2. ఎందు కీ భ్రమలు - నీ యందుండు - సందేహము వీడు = పొందుగ యేసు సం-బంధు డవై యున్న - నందమైన మోక్ష - మందుఁ జేరుట కొఱకు ॥ఖండింప॥
3. బెదరక నీవు - సాతానుని - నెదిరింపవలెను = కుదురుగ నీ యేసు - చదరునఁ జేరిన - వదరుబోతు లెల్ల - నెదురాడ లేరిఁక ॥ఖండింప॥
4. ఆసింపబోకు - లోకభోగములు - మోసమై యుండు = వాసిగ యేసుని - దాసుఁడవైయున్న - గాసిఁ జెందక మోక్ష - దాసుఁడ వౌదువు ॥ఖండింప॥
5. నమ్మి జీవించు - యేసుని యందు - నెమ్మదిఁ బొందు = రమ్ము యేసుని యొద్ద - సొమ్ము నీకున్నది - సమ్మతించి మదిని - నెమ్మదిగాఁ జూచి॥ఖండింప॥

## 331 మారుమనసుఁ బొందుట

రా - ముఖారి తా-ఆది

మనసా వినవేమే - క్రీస్తునిఁ -గని సేవింపవేమే = అనుదినమున నీ కాయువు క్షీణం - బగుచున్నది గదవే ॥మనసా॥

1. చింతలేల నీకు - వర శ్రీ - మంతుడుండు వరకు = చెంతను జేరక యెంతసేపు నీ - యంతట నుండెదవే ॥మనసా॥
2. లోకాశలకును - నీవు - లోకువై యుండకుము = ఆకాశము నేలెడు మన ప్రభువును - ప్రాకటముగ నమ్ము ॥మనసా॥
3. మాయ సంతలోన - జిక్కి - మాయలఁ బోయెదవు = కాయము స్థిరమని నమ్మకు మీ నీ - ప్రాయము దక్కదుగా ॥మనసా॥
4. రక్షకయని వేఁడు - నీవు - రక్షణకై వేఁడు = రక్షణఁ బొందుట కిదియే సమయము తక్షణమున వేఁడు ॥మనసా॥
5. అందరమును గూడి - యేసుని - మందిరమునఁ జేరి = పొందుగ క్రీస్తుని పొగడుచుఁ బాడుచు - నందునఁ జేరుదము ॥మనసా॥

- బి.కోటయ్య

## 332 పాపి పశ్చాత్తాపము

అపరాధిని యేసయ్యా – కృప జూపి బ్రోవుమయ్యా
నెపమెంచకయె నీ కృపలో – నపరాధములను క్షమించు ॥అప॥

1. సిలువకు నిను నే గొట్టితిని – తులవలతో జేరితిని
కలుషంబులను మోపితిని – దోషుండనేను ప్రభువా ॥అప॥
2. ప్రక్కలో బల్లెపుపోటు – గ్రక్కున పొడిచితి నేనే
మిక్కిలి బాధించితిని – మక్కువ జూపితివయ్యో ॥అప॥
3. ముళ్లతో కిరీటంబు – నల్లి నీ శిరమున నిడితి
నా వల్ల నేరమాయె – చల్లని దయగల తండ్రీ ॥అప॥
4. దాహంబు గొనగా చేదు – చిరకను ద్రావనిడితి
ద్రోహుండనై జేసితినీ – దేహంబుగాయంబులను ॥అప॥
5. ఘోరంబుగా దూరితిని – నేరంబులను జేసితిని
క్రూరుండనై గొట్టితిని – ఘోరంపు పాపిని దేవా ॥అప॥
6. చిందితి రక్తము నాకై – పొందిన దెబ్బలచేత
నిందలు పెట్టితినయ్యో – సందేహమేలనయ్యా ॥అప॥
7. శిక్షకు పాత్రుడనయ్యా – రక్షణ దెచ్చితివయ్యా
అక్షయ భాగ్యము నియ్య – మోక్షంబు జూపితివయ్యా ॥అప॥

–సిరిపురపు కృపానందము

## 333 పశ్చాత్తాపపడుటకుఁ బ్రేరేపణ

రా – ఆనందభైరవి (చాయ : పరిశుద్ధాత్మను గోరుము) తా–అట

పశ్చాత్తాపము బొందుము – జీవమ నీవు – ప్రభుని సన్నిధి కేగుము = పశ్చాత్తాపములేని – ప్రజలెవ్వరికి గాని – నిశ్చయముగ గల్గు – నిత్యమౌ నరకంబు ॥పశ్చాత్తా॥

1. ఎంత పాపవైనను – జీవమ క్రీస్తు – చెంత ప్రార్థనఁ జేయుము = సంతోషమును మన – శ్శాంతిని నొసఁగున – నంతుఁడైన విమ–లాత్ముఁ డాదరించు ॥పశ్చాత్తా॥
2. జారచోర కార్యము – లేవైనను – బారఁదోలును వేగము = నా రాజ్యమును వెదకు – నరు లందఱకు జీవ – ధార లిచ్చెదనని – కోరి కర్త వచించె ॥పశ్చాత్తా॥
3. వినుము ప్రభువు వాక్యము – జీవమ నీవు – గనుము రక్షణ భాగ్యము = తనువు నిత్యముగాదు – నిను నీవె నమ్మకు – వినయ బుద్ధిని గ్రీస్తు – ఘనము వెదుకుము వేగ ॥పశ్చాత్తా॥
4. దిక్కుమాలిన దానవే – జీవమ ప్రభుని – మ్రొక్కి పరమును జేరవే = నిక్కమిది నీ పాప – మెక్కువగా నున్న – మక్కువతో నిన్ను – గ్రక్కున విడిపించు ॥పశ్చాత్తా॥
5. బలములేని దానవే – జీవమ యాత్మ– బలము బొందుము వేగమే = యిలను విద్యాధన – బలముల నమ్మక – కలుష జాలము వీడి – కర కడకేగుము ॥పశ్చాత్తా॥
6. మందపోషకుఁడు క్రీస్తు – జీవమ యేసా – నందపూర్ణుఁడు ధీరుఁడు = వందిత సత్సంఘ – మందుఁ జేరిన సత్యా – నందంబు నిత్యంబు – నొందుచు నుందువు ॥పశ్చాత్తా॥

– మోర్త ప్రకాశము



## 334 *Just as I am, without one plea*

1. ఉన్నట్టు నేను వచ్చెదన్
పాపిష్ఠ న్నీవు పిల్వఁగన్
నీ నెత్రుచేతఁ గడ్గుమా
యో గొఱ్ఱె పిల్ల దేవుఁడా!
2. ఉన్నట్టు నేను వచ్చెదన్
నే నొప్పుకొందుఁ దప్పులన్
నీ మాటతో హరించుమా
యో గొఱ్ఱె పిల్ల దేవుఁడా!
3. ఉన్నట్టు నేను వచ్చెదన్
దుఃఖంబు బాధపర్చఁగన్
బాపంబుఁ జేయనీకుమా
యో గొఱ్ఱె పిల్ల దేవుఁడా!
4. ఉన్నట్టు నేను వచ్చెదన్
యేసూ, కబోది నుండగన్
ఆత్మీయదృష్టి నీయుమా
యో గొఱ్ఱె పిల్ల దేవుఁడా!
5. ఉన్నట్టు నేను వచ్చెదన్
నీ మాట నమ్మునట్టి నన్
మన్నించి చేర్చుకొమ్మయా
యో గొఱ్ఱెపిల్ల దేవుఁడా!
6. ఉన్నట్టు నేను వచ్చెదన్
నీ ప్రేమ నన్నుఁ బిల్వగన్
నీ వాఁడ నౌదు సర్వదా
యో గొఱ్ఱె పిల్ల దేవుఁడా!

– చార్లెట్ ఇలియట్

అను : ఎచ్. హార్స్లు

## 335 *I hear Thy welcome voice*

1. ఓ యేసు, రక్షకా
నీ పిల్పు విందును
కల్వరి పై నా పాపము
నివృత్తి చేసితి.

॥యేసు, వచ్చెదన్
నన్నుఁ జేర్చుము
నన్ నీ రక్తమందున
పవిత్ర పర్చుము ॥

2. నేనైతే పాపిని
నీవే నా ప్రాపపు
నా దోష మెల్ల కడిగి
పవిత్రపర్చుము

3. అశక్తుఁ డనౌ నన్
నీవే స్థాపించుము
విశ్వాస ధైర్య బలముల్
నాలోఁ బుట్టించుము

– లూయిన్ హార్ట్‌సా

అను : జేకబ్ చేంబర్లేన్

## 336 *Saviour sprinkle many nations*

1. యేసు, నీదు జాలివల్ల
లెక్క లేనివారలు
రక్షణంది సంతసిల్ల
నిమ్ము వారి డెందముల్
నీదు సిల్వ వింతవార్తఁ
జాటఁజేసి రాష్ట్రముల్
చూడ నిమ్ము త్రాణకర్త!
నీ కృపా ప్రకాశముల్

2. ఏమియున్ గ్రహింపకున్న
మర్త్య డెంద మాశతో
నిన్నుఁ గూర్చి తృష్ణ గొన్న
యాత్మ యేడ్చు మెందుగా
కోయఁబడ్డ గడ్డి మంచుఁ
గోరునట్లు పాపులు
నీవె రక్షకుండ వంచు
నిన్ సదా యాశింతురు.

3. ద్వీపవాసు లెత్తి కేలు
కోరుచుందు రిప్పుడు
నీదు సేవకాళి నంపి
యాత్మ క్రొంత్త జన్మమున్
ప్రేమదీప్తి జ్ఞానకాంతిఁ
గల్గం జేయు వాక్యము
నిచ్చి గొట్టె పిల్ల కీర్తిన్
వారి నోట నుంచుము

–ఆర్థర్ క్లీన్‌లాండ్ కోన్స్

అను : ఆగ్నెస్ బ. షాడె



# పాపక్షమాపణ

## 337 పాపక్షమ

(దావీదు కీర్తన 32)

రా – ఖరహరప్రియ (చాయ : ప్రభువా పంపుమా) తా–ఆది

తన యక్రమములకు – క్షమా – పణ నొందినవాఁడు = తన పాప ములకు ప్రాయశ్చిత్తము – బును బొందినవాఁడును ధణ్యుండౌ ॥తన॥

1. దేవుని చేత ని – ర్తోషిగఁ – దీర్చఁ బడిన వాఁడు = భావంబున లేశం బయినను గ – పటము లేనవాఁడును ధన్యుండౌ ॥తన॥

2. మునునేని మౌని – నై దిన – దినమున నేనొనం = చిన నా యార్త ధ్వనిచే క్షీణిం – చెను నా యెముకలు సకలం బకటా ॥తన॥

3. రేయి పగలు నా మీఁ – దను నీ చేయి భారమయ్యెఁ = గాయము నందలి సారము వేసవి – కాలంబున నెండిన విధ మాయెను ॥తన॥

4. కప్పుకొనకయే నీ – యెదుటఁ గలుష మెప్పుకొంటి = నొప్పుకొందు నను కొంటి నక్రమ – మోర్పుతోడఁ బాపము మన్నించితి ॥తన॥

5. కావున నీ సంద – ర్శనపుఁ గాలమందు భక్తుల్ = భావము రంజిల నినుఁ బ్రార్థింత్రు ప్ర – వాహంబులు వారలపైఁ బొరలవు ॥తన॥

6. దాగు చోటు నీవే శ్రమలను – దప్పించెద వీవే = వేగ విమోచన గానంబులతో – విడువక నీవే యావరించెదవు ॥తన॥

7. నీ కుపదేశింతు – మార్గము – నీకును బోధింతు = నీ కాలోచన నేఁ జెప్పె దను – నీ మీఁదను దృష్టించి సతంబు,ను ॥దన॥

8. జ్ఞానము లేనట్టి – గుఱ్ఱమ – ట్లైనను ఖరమువలె = నైనను మీరుండకుఁ డని కళ్లెము –తో నెంతో బిగియింపఁబడవలెఁ ॥దన॥

9. కలుగు ననేకములౌ – వేద – నలు కడు భక్తి విహీ = నులకు నమిత కృప దేవుని విశ్వా – సులఁ జుట్టుకొని యుండు నిజంబుగ ॥దన॥

10. సంతోషించుఁడి – నీతి – మంతులార సత్య = స్వాంతులారా మీరంద అత్యంత – సంతోషంబున గానముఁ జేయుడి ॥తన॥

11. జనక తనయ పరిశు – ద్ధాత్మ – కును మహిమము గల్గు = మును పిప్పుడు నెల్లప్పుడు యుగముగ – ములకును దనరారును గాకామేన్ ॥జనకతనయ॥

– మల్లెల దావీదు

## 338 పాపము మీఁది క్రీస్తుని విజయము

రా – అఠాణ తా–అట

యేసుఁడు రాఁగన్ – జేసిన దోషము = నాశన మాయెన్ ॥యేసుఁడు॥

1. చింతలు పోయెన్ – వింతగ నాకున్ = జెంతకుఁ జేర్పఁగ – సంతస మాయెన్ ॥యేసుఁడు॥

2. సిలువను మోసెన్ – గలువరి మెట్టన్ = చెలువుగఁ బాపపు – బలువును దించెన్ ॥యేసుఁడు॥

3. శిరమున ముండ్లున్ – గరమున మేకులున్ = స్థిరముగ నాటఁగ – బరమును జూపెన్ ॥యేసుఁడు॥

4. పదముల మేకులున్ – జెదరఁగ రక్తము = ఎద నిఁకఁ బ్రేమతో – ముదము నొసంగెన్ ॥యేసుఁడు॥

5. రక్షణ జూపెన్ – దక్షుఁడు నాకున్ = పక్షముతో నిఁక – మోక్షము జూపెన్ ॥యేసుఁడు॥

6. రక్తిగ వేఁడన్ – శక్తి నొసంగెన్ = రక్తము జల్లియు – ముక్తిని జూపెన్ ॥యేసుండు॥

7. గురువును నమ్మేదున్ – భారము వెడలెన్ = ధీరునిఁ జేయుచు –దారిని జూపెన్ ॥యేసుఁడు॥

–మిక్కిలి ఫ్రెడరిక్



## 339 *Sinners Jesus will receive*

1. ఎంత పాపి నైనను
యేసు చేర్చుకొనును
అంచు నీ సువార్తను
అంతటఁ జాటించుఁడి
॥హల్లెలూయ హల్లెలూయ
యెంత పాపి నైనను
యేసు చేర్చుకొనున
టంచుఁ బ్రకటించుఁడి॥

2. మెండుగా క్షమాపణన్
పూర్ణ సమాధానము
నెంత పాపి కైనఁ దా
నిచ్చి చేర్చుకొనును.

3. తన దివ్య సిల్వచేఁ
దీసి పాప శాపమున్
నన్ బవిత్రపర్చెను
నాకు హాయి నిచ్చెను

4. ఘోర పాపి నైనను
నన్నుఁ జేర్చుకొనును
పూర్ణశుద్ధి నిచ్చును
స్వర్గమందుఁ జేర్చును

–ఎర్డ్‌మాన్ న్యూమీస్టెర్

అను : అల్లూరి పెదవీరాస్వామి

## 340 *Jesus, keep me near the Cross*

1. సిల్వ చెంత నేసువా
చేర్చి నన్ను నుంచు
కల్వరిన్ స్రవించెడు
కాల్వలో నన్ముంచు.
॥ సిల్వకే సిల్వకే
చెల్లునా విముక్తి
చెల్వ మొప్ప నద్దరిన్
జేర నాకు ముక్తి ॥

2. కంపితాత్ము నంధునై
కానలేక యుండ
సొంపు మీరఁ బ్రోచితి
సూర్యతేజ స్కుండ

3. దేవ గొఱ్ఱె పిల్ల ఈన
దీప్తి నాకుఁ జూపు
నీ వధా ప్రభావముల్
పావనుండ నేర్పు.

4. నే నిరీక్షణంబుతో
నెప్డు వేచి యుందున్
భూ నితాంత వారధిన్
బూని యీది మన్దున్

– ఫ్రాన్సెస్ జేన్‌వేన్ ఆల్‌స్టీన్

అను : ఆల్‌ఫ్రెడ్ త్యాగరాజు సామర్

## 341 *What can wash away my stain ?*

1. దాగు నేది మాపును
వేగ యేసు రక్త ధారే
రోగి కేయౌషధము
బాగుగా నా రక్త ధారె
॥ హా దివ్య రక్తము
ఆ బుగ్గ వినహా
యేదియు లేదుగా
యేసు యొక్క రక్త ధారె ॥

2. పాప పరిహారము
ప్రాపు యేసు రక్త ధారె
శాపపు సంహారము
స్వామి యేసు రక్త ధారె

3. ఇదే నా సుతీర్థము
యేసు యొక్క రక్తధారె
నాదు క్షమాపణము
సాధు యేసు రక్త ధారె

4. నాకు సమాధానము
నాధుఁ డేసు రక్త ధారె
సాకు నేను గానను
జయ యేసు రక్త ధారె

అను : జేకబ్ చేంబర్లేన్

## 342 *Rock of ages, cleft for me*

1. నాకై చీల్పఁబడ్డ యో
నా యనంత నగమా
నిన్ను డాగి యందునఁ
చెను మీరఁ బారెడు
రక్త జలధారలా
సక్తిఁ గ్రోలఁగా నిమ్ము.

2. నేను నాదు శక్తిచే
నిన్నుఁ గొల్లఁజాలను
కాల మెల్ల నేడ్చినన్
వేల క్రతుల్ చేసినన్
నేను చేయు పాపము
నేనె బాపఁజాలను.

3. వట్టి చేయి చాఁచుచున్
ముట్టి సిల్వఁ జేరెదన్
దిక్కు లేని పాపిని
ప్రక్కఁ జేర్చి ప్రోవుము
నా కళంక మెల్లను
యేసునాధ, పాపుము.

4. ఈ ధరిత్రియందున
నేఱు దాఁటునప్పుడు
నాదరించి నీ కడన్
నాకై చీల్పఁబడ్డయో
నా యనంత శైలమా
నన్ను ఁ జేరఁ దీయుమా

– అగస్టస్ మాంటేగు టాప్‌లేడీ
అను : ఎచ్. హార్న్లీ



## 343 *There is a fountain filled with blood*

1. ఇమ్మానుయేలు రక్తము
ఇంపైన యూటగు
ఓ పాపి! యందు మున్గుము
పాపంబు పోవును
॥యేసుండు నాకు మారుగా
ఆ సిల్వఁ జావఁగా
శ్రీ యేసు రక్త మెప్పుడు
స్రవించు, నాకుఁగా ॥

2. ఆ యూట మున్గి దొంగయు
హా ! శుద్ధుఁ డాయెను
నేనట్టి పాపి నిప్పుడు
నేనందు మున్గుదు.

3. నీ యొక్క పాప మట్టిదే
నిర్మూల మౌటకు
రక్షించు గొఱ్ఱె పిల్ల? నీ
రక్తంబె చాలును.

4. నా నాధు రక్తమందున
నే నమ్మి యుండినన్
నా దేవుని నిండు ప్రేమ
నే నిందుఁ జూచెదన్.

5. నా యా యుష్కాల మంతట
నా సంతసం బదే
నా క్రీస్తు యొక్క రొమ్మునన్
నా గాన మిద్దియే.

– విలియం కౌపర్
అను : ఎచ్.హార్న్లీ

# నూతన జన్మము

## 344 నూతన జన్మము

రా – శంకరాభరణము తా–ఏక

పరమ రాజ్యమునకు నరులు – తిరిగి పుట్టవలయు ననుచుఁ = బరమ గురువు యేసు క్రీస్తు – స్థిరము చేసెను ॥పరమ॥

1. వేదశాస్త్ర మెఱిఁగినట్టి – యూదుల యధికారియౌ ని = కోదే మనెడు పరిసయుండు – మదిని దలఁచుచున్ ॥పరమ॥

2. అతఁడు రాత్రివేళఁ ప్రభుని – వెతకి పోయి యెదుట స = మ్మతిని నిలిచి పిలిచి పల్కె – హితవుతోడను ॥పరమ॥

3. బోధకుండ నీవు మోక్ష – నాధుఁడౌ యెహోవ యొక్క = వేద వార్తఁ జెప్పెదవు నీ – బోధ నెఱుఁగుదున్ ॥పరమ॥

4. మఱియు నీవు చేయుచున్న – గురుతు లెవ్వరైన దైవ = వరము లేని యట్టి పాప – నరులు చేయరు ॥పరమ॥

5. అనుచుఁ బరిసయుండు పల్క – వినుచు యేసు కనికరమునఁ = దనకు నిట్లు దెలిపెఁ జాలి – మనసుతోడను ॥పరమ॥

6. క్రొత్త జన్మ మెవ్వఁడైన – నెత్త కున్న మోక్షమమునకు = నెత్తఁబడఁ డటంచు నిజము – క్రీస్తు పల్కెను ॥పరమ॥

7. వినుచుఁ బరిసయుండు ముసలి – జనుఁడు మఱల తల్లి గర్భ = మునను తిరుగనెట్లు బుట్టు – ననుచుఁ బల్కెను ॥పరమ॥

8. అందు కేసు తెల్పె జలము – నందుఁ నాత్మయందు జన్మ = మొంద కున్న మోక్ష రాజ్య – మొంద రనుచును ॥పరమ॥

–తూపిలి రంగయ్య

## 345 *Oh happy day that fixed my choice*

1. హా! యానంద సుదినము
నా యేసున్ నమ్ము దినము
ప్రయాస మెల్ల బోయిన
దయా రక్షణ దినము.
॥భాగ్యమౌ దినము
ప్రభున్ గైకొన్న దినము
భక్తి ప్రార్థన లేసుఁడు
ప్రఖ్యాతి నాకు నేర్పిన
భాగ్యమౌ దినము
ప్రభున్ గైకొన్న దినము ॥

2. ప్రభునితో నిరంతమౌ
నిబంధనఁ జేసికొంటి
నేఁబుట్టితి నింపొందఁగ
విభుని పాదపద్మము.

3. నా యాత్మ, శాంత మొందుము
నీ యేసె నీ యాధారము
భయంబు లేక రక్షణన్
పాలిభాగంబు పొందుము.

4. నే నేసువాఁడ నేసుఁడు
నిత్యంబు నా వాఁ డాయెను
ఇదెంత గొప్ప భాగ్యము
నేనేసు యొక్క మిత్రుఁడన్

5. నేఁ జేసెడి యొప్పందము
ఎల్లెడ నెఱవేర్తును
నేఁ జచ్చు వేళయందును
నీ దయ మెచ్చి పాడుదు.

– ఫిలిప్ డాడ్రిడ్జి
అను: బర్నార్డ్ లూకాస్



## 346 *Blessed assurance - Jesus is Mine*

1. యేసు నావాడని నమ్ముదున్
భాసిల్లు దివ్య సౌభాగ్యము
దాసుఁడ నౌచు పాల్పొందెదన్
నాశంబు లేని సౌఖ్యంబును.
॥ఇదే నా పాట నాసుకథ
యేసుని సదా స్తుతించుట
ఇదే నా పాట నాసుకథ
యేసుని నిత్యం ధ్యానించుట ॥

2. సంపూర్ణ భక్తితో నుండెదన్
పెంపార యేసున్ ధ్యానించెదన్
సొంపైన దూతల్ పాడుచుండన్
ఇంపైన పాటల్ నే విందును.

3. నిండైన భక్తియే నెమ్మది
గెల్చున దేమి యేసుండఁగ
మెండైన దీప్తిన్ బ్రార్థించుచు
దండిగ బ్రేమన్ సుఖింతును.

– ఫ్రాన్సెస్ జేన్‌వేన్ ఆల్స్‌టీన్

## 347 నిత్యజీవానందము

రా – సురటి తా–అట

ఆనంద మగు ముక్తి – యే నా మందిరము = జ్ఞాని మానుగఁ జూచు – దాని సుందరము ॥ఆనందమగు॥

1. పరదేశివలె దేహా – వరణమం దుందున్ – ధరణి కాననముగా – దర్శించు చుందున్ – నెరి దుఃఖసుఖములు – సరిగా భావింతున్ = పరిశుద్ధాత్ముని వేఁడి – పరితృప్తి నుండు ॥నానంద మగు॥

2. బహు శోధనలు నాపైఁ – బడి వచ్చునపుడు – నహితాంధతమము న – న్నడ్డుకొన్నపుడు – నిహబాధ లన్నిన – న్నెదిరించినపుడు = నహహ యేసునివల్ల – నమృతుఁడ నెపుడు ॥నానంద మగు॥

3. ముందు నా మనసు దే–వుని కప్పగింతు–నందరి నస్మత్తు–ల్యముగాఁ ప్రేమింతున్ – సందేహ రాహిత్య – సరణిలో నిల్తుఁ = పొందఁ బోయెడి ముక్తి – భువి యందె గాంతు ॥నానంద మగు॥

– పురుషోత్తము చౌదరి

# క్రైస్తవ జీవితము

## రక్షణానందము

### 348 క్రీస్తునందలి నా యానందము

రా – కళ్యాణి (చాయ : దారుణమగు మరణ) తా–త్రిపుట

నా కింత ప్రోత్సాహా – నందంబుల్ గల్గుట –కే కర్త ఘనమైన – హేతువై యుండు = నాకు గల యున్నత కతమ్మే – నాధుఁ డగును నేను మురియు – శ్రీకరంబగు నామ మేది – సిల్వఁబడ్డ యేసు క్రీస్తే ॥నా కింత॥

1. ఎవరు నా భక్తికి – హితమైనట్టి పునాది – యెవరు నా కంఠంబు – నెత్తెన్ పాటలతో = ఎవరు నా పాపముల – భారము నెత్తుకొని దేవునికి నాకును – చివరకున్ స్నేహంబు కలిపిరి – సిల్వఁబడ్డ యేసు క్రీస్తే ॥నా కింత॥

2. నేను నా విధు లెల్ల – నిశ్చయంబుగ నెఱుఁగ – జ్ఞాన మిచ్చుచునుండు జ్ఞాని యెవ్వారు = వాని యెడల నను యధార్థ – పరునిగాఁ గావించి యవినా – చే నెరవేర్పించు నెవరు – సిల్వఁబడ్డ యేసు క్రీస్తే ॥నా కింత॥

3. ఎవరు నా శత్రువు – నెదిరించి గెల్చిరి – యెవరు నా శోకంబు – నెగురఁ గొట్టిరి = ఎవరు నా హృదయంపు మూర్ఛను – నీడ్చి సేదను దీర్చి మనసు – చివుకు మను గాయంబు మాన్పిరి – సిల్వఁబడ్డ యేసుక్రీస్తే ॥నా కింత॥

4. మరణంబులో నాకుఁ – జిర జీవ మెవ్వారు – మరణంబునకె గొప్ప మరణ మెవ్వారు = విరివిలేని మహిమ సేలు – దరిని నుండఁగ నన్నుఁ జెంతను – స్థిరముగ స్థాపించు నెవరు – సిల్వఁబడ్డ యేసుక్రీస్తే ॥నా కింత॥

5. నన్ను రక్షింప మర–ణం బొందియు సమాధి – నెన్నటికిని గెల్చి – యున్న ప్రభునందు = నున్న విశ్వాంసబె నాకు – నుత్సవంబును గలుగ జేయును –చెన్నగు నా ప్రభు విఁ కెవ్వరు – సిల్వఁ బడ్డ యేసు క్రీస్తే ॥నా కింత॥

–ముంగమూరి దేవదాసు





### 349 రక్షణానందము

రా – కళ్యాణి (చాయ : ఎంతో సుందరమైనవి) తా–త్రిపుట

సంతోషింపరె ప్రియులారా – యేసుని చెంత – సంతసింపరె మనసార = ఎంతో ప్రేమించి య – నంతు డొసగెను సుతుని – వింతగ బ్రతుకువ – సంత శోభను దాల్చె = అంతరంగములో వసించిన – చింత లెల్లను వాడ బారెను – గంతు లిడుచును నూత్నజీవ [1]ల – తాంతములు పూయంగ దొడగెను ॥సంతో॥

1. సిలువలో వలరారిన – యేసునిప్రేమ – ఫలియించె హృది వనమున = కలుష మెల్లను బాపు – కలువరిలో భక్తి – పలవులు చిగిరించి – చెలుని పాద పద్మములు = అలుముకొని యా రాధనంబున – మలయ మారుత వీచికలపై – మలపు గొనుచు సమర్పణంబును – సులలితముగా జేయ దొడగెను ॥సంతో॥

2. పాపతాపము తొలగెను – జీవితపు తు–ఫానులన్నియు నణగెను = ప్రాచీన సర్పము – పగబట్టి పడగెత్తి – పంతమున ననుడాసి – పటువున కఱవంగా = పాప మరణపు విఱుగుడగునా – ప్రభుని యమృత రక్తసారము – ప్రాణ భిక్షను బెట్టెను మరి – పగతుని యోడించె న హాహా ॥సంతో॥

3. యాత్ర పథమున యేసుడు – ప్రకాశింప –రాత్రియె పగలాయెను = నేత్రములు వికసింప – ధాత్రి నా బసలోప –విత్ర వాక్యములో వి– చిత్ర కృపలను గాంచి = గాత్ర వీణను మీటి దేవుని – స్తోత్ర గీతము పాడి పుణ్య – క్షేత్ర పథమున బోవ యేసుడు – మిత్రుడై నడిపింప దొడగెను ॥సంతో॥

4. సిరిసంపదలు యున్నను – లేకున్నను – కఱుణావరములు తరుగవు = పైరు పంటలు గాని – పరువు ప్రతిష్టలు – కఱువైనగానినే – మురియుదు మదిలోన = గిరులపైనను–పరుగు లిడుటకు [4]హరిణ పాదము లొసగె యేసుడు వెఱతునా చింతింతునా క – ల్వరిని ప్రేమలు కురియుచుండగ ॥సంతో॥

–ఏ.బి. మాసిలామణి

[1]పూవులు. [2]గాలికెరటములపై. [3]అడుచు. [4]లేడి.

## 350 రక్షణ పొందిన పాపి

రా – ఆనందభైరవి (చాయ : ఈలాటిదా యేసు ప్రేమ) తా–కురుజంపె

నా యేసు! నా యాత్మ బలమా! – నీదు–గాయంబులే నిలువబలమైన స్థలము = సకల సృష్టి పునాదియపుడే – నాదు – సకల పాపములకై బలియైతి వేసు! = సకల భూమ్యాకాశములను – సమము – గా గతించినcగాని నీ ప్రేమ నిలుచు॥నా॥

1. నా తండ్రి! నీ నిత్య కృపను – నెంచ–నా తరమ? నీ ప్రేమ హస్తముల జూచి = పాతకుల రండంచు బిలిచి – వేగ నీదు కృప రుచి జూపి జీవంబు నిచ్చు॥నా॥
2. దరిలేని లోతైన ప్రేమా! – నీలో – దురిత యెల్లను మునిcగి పోవు = దరిలేని యుచిత కృపc జాటు – నీదు – రక్తంబు నా పాపడాగులను గడిగె ॥నా॥
3. ఈ ప్రేమ సాగరంబున నే – దుమికి – నా ప్రభుని యెదదూరి విశ్రాంతి నొంది = యే ప్రొద్దు సంతసించెదను – నన్ను – నా ప్రాణమును డాయదిcక నరక మొందు ॥నా॥
4. నా శిరముపై నలలురేగి – యిలను – నా సత్తువయు స్నేహితులు నన్ను వీడి= నా సుఖము నా సంతసమును – బోయి – నను నీదు కృప నన్ను విడిపోదు తండ్రీ ॥నా॥
5. నా హృదయమే నిలిచిపోనీ – నాదు శరీరమే కుళ్ళి నీరైన గానీ = ధర పునాదులే కరిగిపోనీ – యేసు – నిరతంబు నీ ప్రేమ నిలుచు నను బ్రోచు॥నా॥

## 351 యేసే రక్షకుcడు

రా – సావేరి తా–త్రిపుట

నీ కన్న నిcక వేరే – వేల్పులు లేరయ్యా – నిజముగా నా యేసువా = నీ కరుణ యను నెనరుచేతను – నీదు సత్య సువార్త ద్వార – ప్రాకటంబుగ నన్నుc బిలిచిన– లోక రక్షక నీకు మ్రొక్కెద ॥నీ కన్న॥



1. నిన్నుc దెలియక మున్ను – నన్య దైవంబుల – ననుసరించిన పాపము = లన్ని పెనగొని నాదు హృదయపుc – గన్ను c గ్రమ్మి ప్రకాశ మియ్యక – యున్న నీ విమలాత్మ వరమున – నన్ను వెలిగిcచిన దయానిధి ॥నీ కన్న॥
2. వదలక నేc జేయు – తుద లేని పాపము – వదలించి ననుc బ్రోచితి = తుదిదినంబునc గలుగు బాధలుc దొలcగ జేయుట నీవ యని నా హృదయమందున నా నిరీక్షణ – పదిలపరచిన భక్త పాలక ॥నీ కన్న॥
3. నీ వాక్యార్థము నాలో – నివసింపc జేసి నీ – సేవకునిగc బ్రోవవే = నీవె సత్యము నీవె జీవము – నీవె మార్గము నీవె ద్వారము – నీవు గాకిం కెవరు లేరు – కావవే నను యేసునాయక ॥నీ కన్న॥

– రావూరి లక్ష్మీనరసయ్య

## 352 యేసు నా రక్షకుడు

రా –ముఖారి తా–అట

వెలుగును రక్షణ కర్తయునగునా – బలమగు దేవుని స్తోత్రింతును = వెరువను నేనిక నెవ్వరికిన్ – వెలుగైన యేసే నా దుర్గము

1. అగాధ చీకటి జలముల నుండి – అఖండమైన వెలుగు సృజించిన = యుగయుగంబుల నేలెడి ప్రభువు – యఘముల బాపి నను వెలిగించును॥వెలు॥
2. నా దీపమును వెలిగించు ప్రభువే – నా దరి చీకటిన్ వెలుగుగ మార్చును = నా దోషము లెల్లను దన కాంతిలో – నాదరముగ కడిగి రక్షించును ॥వెలు॥
3. పలువిధ శోధనల్ నను జుట్టినను – విలువగు సంపద లంతరించినను = వెలుగుదూత నాపై యురులొడ్డిన – నలయక నిత్యము నడచెద వెల్గులో ॥వెలు॥
4. తల్లిదండ్రులు విడచినగాని – యుల్లము భీతిలి భయమందినను = ఎల్ల ప్రజలు నను ద్వేషించినను – ఎడబాయదునా – ప్రియుడగు యేసు ॥వెలు॥
5. క్రీస్తు యేసుడే లోకపు వెలుగని – వాస్తముగ గనుడి ప్రియులార = శాశ్వతంబగు రాజ్యము చేర – సత్వరమాయన వెలుగును బొందరె ॥వెలు॥

–రావి జాన్ సుందరరావు

## 353 క్రీస్తుని బోలియుందును

రా – బేహాగ్ (చాయ : ఇదిగో నీతి భాస్కరుండు) తా–ఏక

నేను క్రీస్తు ప్రభుని జేరి – నేను క్రీస్తువాడ నౌదు = నేను క్రీస్తు సొత్తు గాన – నేను నా సమస్తమును – నాథు దేసు కిపుదు యిత్తు ॥నే॥

1. నేను క్రీస్తు ననుభవించి – నేను క్రీస్తు బోలియుందు = నేను నా స్వరూపమందు – నా ప్రభుండు గానుపింప – నేను నేసులో వసింతు ॥నే॥
2. నేను క్రీస్తునందునుండి – నేను క్రీస్తులో బెరుగుదు = నేను క్రీస్తు దారినడచి – నేను క్రీస్తు మనసు నెపుడు – గానుపఱతు నెల్లెడను ॥నే॥
3. నేను క్రీస్తు సేవజేసి – నేను క్రీస్తు సాక్షినౌదు = నేను క్రీస్తు సాధ నంబె – నేను యనుభవించు రక్ష – ణానందంబు జాటెదెపుదు ॥నే॥
4. నేను ప్రాణమైన నిచ్చి – నేను క్రీస్తుకై బ్రతుకుదు = నేను, క్రీస్తు కలిసియున్న – నాశన తనయుని శక్తి – నేలగూలు నద్భుతముగ ॥నే॥

–సి. రవివర్మ

## 354 *Sing them over again to me*

1. దాపుఁజేరుచుఁ బాడుము
జీవపు మాటలన్
మాధుర్యంబగు గానము
మరలఁ బాడుము
జీవమైన పాటన్
త్రోవఁజూపు మాటన్
॥ సుందర మానందముగన్
సొంపుగఁ బాడుము ॥

2. నిత్యజీవము నిచ్చెడు
నిపుణుఁ డేసుఁడు
సత్యప్రేమ నొసంగెడు
సదయుఁ డేసుఁడు
మితిలేని ప్రేమ
మింటికాకర్షించున్.

3. ప్రచురపర్చుఁ డెల్లడన్
ప్రభుని రక్షణన్
దాచఁగూడని సత్యమున్
పూర్ణ క్షమాపణన్
రక్షకుని చెంత
ఆశతోడ రండు

–ఫిలిఫ్ బ్లిస్

– ఆల్ఫ్రెడ్ త్యాగరాజు పామర్



## 355 *Come to the Saviour*

1. యేసుని జేరఁ వేగము రా
మార్గముఁ జూపి వేదములో
దాపున నుండి క్రీస్తు దయన్
రమ్మని పిల్చును.
॥ సంతసంబు సంతసంబు బల్
పాపశుద్ధి మేము పొందఁగా
యేసుని యొద్దనుండ సదా
మోక్ష పథంబున ॥

2. బాలురమైన మమ్మును దా
నెంతటి ప్రేమతోఁ బిలుచున్
యేసుని స్వీకరించుటకై
వత్తుము వేగమే.

3. నా ముద్దు బిడ్డ రమ్మనఁగా
నాతని ప్రేమ కన్పడఁగా
నాయన నేఁడు నిన్పిలువన్
రానని యందువా? ॥

–జి.ఎఫ్. రూట్

అను : జాన్ అబెర్లీ

## 356 క్రైస్తవ సాక్ష్యము

రా – హిందూస్థాని ముఖారి తా–జుల్వ

సాక్ష్య మిచ్చెద – మన స్వామి యేసు దేవుఁ డంచు = సాక్ష్య మనఁగఁ గనిన వినిన – సంగతులను దెల్పుటయే – సాక్ష్య మిచ్చు కొఱకు నన్ను స్వామి రక్షించె నంచు ॥సాక్ష్య॥

1. దిక్కు దెసయు లేని నన్ను – దేవుఁ డెంతో కనికరించి = మక్కువతో నాకు నెట్లు మనశ్శాంతి నిచ్చినాఁడో ॥సాక్ష్య॥
2. పల్లెటూళ్ల జనుల రక్షణ – భారము నాపైని గలదు – పిల్లలకును బెద్దలకును – బ్రేమతో నా స్వానుభవము ॥సాక్ష్య॥
3. బోధ చేయలేను వాద –ములకుఁ బోను నాక దేల = నాథుఁ డేసు ప్రభుని గూర్చి – నాకుఁ దెలిసినంత వరకు ॥సాక్ష్య॥
4. పాపులకును మిత్రుఁ డంచుఁ – బ్రాణ మొసఁగి లేచె నంచుఁ = బావముల క్షమించు నంచుఁ బ్రభుని విశ్వసించుఁ డంచు ॥సాక్ష్య॥

5. చోరు లైన జారు లనా చారు లైన నెవ్వరైన = ఘోరపాపు లైనఁ క్రీస్తు – కూర్మితో రక్షించు నంచు ॥సాక్ష్య॥

6. పరమత దూషణము లేల – పరిహసించి పలుకు టేల = ఇరుగు పొరుగు వారి కెల్ల – యేసు క్రీస్తు దేవుఁ డంచు ॥సాక్ష్య॥

7. ఎల్లకాల మూరకుండ – నేల యాత్మ శాంతి లేక = తల్లడిల్లు వారలకును – తండ్రి కుమా రాత్మ పేర ॥సాక్ష్య॥

– మల్లెల దావీదు

## 357 మనోసాక్ష్యానందము

రా – శహన (చాయ : సకలేంద్రియములారా) తా–అట

ఇతరుల సాక్ష్యము – లెంతో గలిగియున్న – మరి సాక్ష్యమే మంచిది = మృతిబొందిలేచియు – న్నతమోక్ష రాజ్యాధి – పతియై యున్న యేసు – ప్రభువే మా విభుఁడైన ॥నితరుల॥

1. గురి సిలువ దెస మాకు – స్థిరమై నిలిచియున్న – దురితము తలయెత్తునే = మరి యేసు ప్రక్కలో – చొరఁబారి యందున్న – కరుణారసము గ్రోలు – టెటిఁగి యుండిన చాలు ॥నితరుల॥

2. తలవాల్చుటకు తనకు – స్థలము లే దనునట్టి – పలుకే మా కైశ్వర్యము = బలమిచ్చి యెదిగించు – ప్రభు వాగ్దత్తములే – మా – కిలలో పంచభక్ష్య – ములుగా నుండిన చాలు ॥నితరుల॥

3. బెదరించి సైతాను – కదిలింపలేనట్టి – కుదురైన విశ్వాసము = బొదలుచు మాలో నిం – పొదవుచుండిన చాలు – మదిలో నెమ్మది యిచ్చు – మా యేసు కృప గల్గ ॥నితరుల॥

– పురుషోత్తము చౌదరి

## 358 క్రైస్తవమను యుద్ధము

రా – సురటి తా–త్రిపుట

సిలువ సైనికులారా – నిలువండి వడి లేచి = బలుఁడు యేసుక్రీస్తు – ప్రభు దయ జయ మౌను ॥సిలువ॥

1. రారాజు పంపున – రణము సేయగఁ బూని = ధీరులై నిలువుఁడి – దినము శత్రుల గెల్వ ॥సిలువ॥



2. అతఁడు నిజ ధ్వజ – మత్యున్నతి నొంద = బ్రతి వీరుని గెల్చు – వరకుసేనల నడుపు ॥సిలువ॥

3. మీ స్వీయ బలమున – మీ రానుకొనకయే = మీ స్వామి బలమును – మీరు నమ్మి గెలువ ॥సిలువ॥

4. శత సహస్రము లైన – శత్రుల నెదిరించి = సతతము ప్రభు సేవ – సల్పి ధైర్యము నొంది ॥సిలువ॥

5. దేవుఁ డొసఁగినట్టి – దివ్య కవచముఁ దాల్చి = భావ ప్రార్థనాసి – బట్టి యుద్ధము సేయ ॥సిలువ॥

6. జయశీలు రగు వారు – చారు కిరీట మంది = జయశాలి క్రీస్తు దయ – జనెదరు సద్గతికి ॥సిలువ॥

– జి.మునిస్వామి

## 359 క్రైస్తవ వీరులు

రా – శంకరాభరణము తా–ఏక

వీరుల మయ్యా – జయ – వీరుల మయ్యా – మా = వైరిఁ జంప యుద్ధమాడు– శూరుల మయ్యా ॥వీరుల॥

1. మాంస లోక పి–శాచి – హింసపరచిన – మము = ధ్వంసముఁజేయ పైబడిన – ధ్వజము విడమాయా ॥వీరుల॥

2. పరమ గురు వగు – యేసు – ప్రభువు నాజ్ఞను – బహు = త్వరగఁ బ్రజకుఁ బయలుపర్చు – భటుల మే మయా ॥వీరుల॥

3. అతి దుష్ట ద్రోహులు – మము – వెతలఁ బెట్టిన – నీ =క్షితి సువార్త కొఱకొకింత – సిగ్గు పడ మయా ॥వీరుల॥

4. భూలోక నాథులు – చాల – పోరు సల్పిన – మా = వేలుపునకుఁ బ్రాణ మైనఁ బెట్టువారము ॥వీరుల॥

– ఎ. జెఖర్యా

## 360 క్రైస్తవ లక్షణము

రా – శంకరాభరణము తా–త్రిపుట

యేసు క్రీస్తు మతస్థుఁ డనఁగా – నెటిఁగి మనుఁడీ జగము లోపల = వాసిగాఁ ప్రభు యేసు దాసులె – పరమునందు ని–వాసులగుదురు ॥యేసు॥

1. యేసు క్రీస్తును నమ్మి యాయన – దాసుఁడై వర్తించు నాతఁడె = భాసురంబుగఁ గ్రైస్తవుం డని – ప్రాకటంబుగఁ బరగుచుండును ॥యేసు॥
2. ఎల్ల సమయములందు ధాత్రిని – యేసు నడతలఁ జూచి నడఁచుచు = నుల్లమున రక్షకునిఁ దాల్చిన – యోర్పరియె క్రైస్తవుఁడు సుమ్ము ॥యేసు॥
3. క్రీస్తు నన్ను గొనెను గావున – క్రీస్తువాఁడను నేన టంచును = క్రైస్తవుండు గొల్చు నాతని – వాస్తవమ్ముగ నాత్మ తనువుల ॥యేసు॥
4. రాజులు యాజకులు శుద్ధులు – రాజనందను లనెడు పేళ్లను = రాజ రాజగు దేవుఁ డొసఁగెను – రాజితంబుఁ క్రైస్తవులకును ॥యేసు॥
5. క్షయము లేనిది శుద్ధమైనది – వ్యయము లేనిది నిత్యమైనది = దయను యేసుఁ డొసంగు భాగ్యముఁ – దప్పకుండఁ క్రైస్తవులకును ॥యేసు॥

– మేడికాయల సాధువు

## 361 యేసునకు సాక్షులు

రా – ఆనందభైరవి తా–ఆది

యేసుప్రభుకై – సాక్షులెవరెవరో –ఎవ్వరెవ్వరో యని – యాశతో ప్రభు – వడుగుచున్నాడు = యేసు కొరకై – నిల్చి క్రైస్తవ – యువకులెల్లరు సాక్ష్యమిచ్చుచు – భాసురంబుగ – క్రీస్తు – నెంతో భారతీయులు ప్రస్తుతించరో ॥యేసు॥

1. దేవదర్శన మొంది లేలెండి – ధనజనులకెల్లను – దైవ ప్రేమను గూర్చి దెలుపండీ = పావనుండగు ప్రభుని బోధలు – పాడి రక్షణ మార్గమెల్లను సావధానముతోడ దెల్పరే – సౌలు మారి పౌలెటాయెనో ॥యేసు॥



2. రాయబారుల – మంచు నమ్మండి – రారాజు వార్తలు – రేయిబవలును దెలుప లేలెండీ = పాయకుండగ – యేసు తన విమ – లాత్మ నెప్పుడు తోడ నుంచును – పాపులెల్లరు – యేసు ప్రభుని – పాదములు సేవించి బ్రతుకగ ॥యేసు॥
3. ధీరులై శుభవార్త జాటండీ – దినదినము వాక్య ప్ర – చారమెల్లను చేయ లేలెండీ = చేయవలసిన దెల్ల ప్రభువే – చేయు మీతో – నాత్మరూపున – జయము మీదను – జయమునిచ్చి – జగతిని దగ వెలుగ జేయగ ॥యేసు॥
4. పౌలు మాదిరి బోలి లేలెండీ – పరలోక రాజ్య – ప్రచారమెల్లను జేయలేలెండీ = పలువిధంబుల శ్రమలకోర్చి – ప్రభువు శత్రుల నెల్ల మాడ్చి – సిలువ ధ్వజమును చేతబట్టి – సుస్థిరంబగు సేవ జేయగ ॥యేసు॥

– చెట్టి భానుమూర్తి

## 362 *Onward Christian Soldiers*

1. క్రీస్తు యోధులారా
యుద్ధ మాడుఁడీ
క్రీస్తు సిల్వ మీరు
పట్టి గెల్వుఁడీ
మన రాజు క్రీస్తు
దండు నడ్పును
చూడు మాకు ముందు
క్రీస్తు ధ్వజము.
॥ క్రీస్తు వీరులారా
యుద్ధ మాడుఁడీ
క్రీస్తు ధ్వజ మెత్తి
జయ మొందుఁడీ ॥

2. లోక రాజ్య కీర్తి
వాడిపోవును
క్రీస్తు రాజ్యమైన
నిత్య ముందును
సాతా నాధిపత్య
మాఁగిపోవును
క్రీస్తు దివ్య సభ
జయ మొందును.

3. ఓ జనంబులారా
వచ్చి చేరుఁడీ
జయ కీర్తనంబు
లెత్తి పాడుఁడీ
కీర్తి, స్తుతి, ఘన
మెన్నఁ డుండును
మన క్రీస్తు రాజు
నిత్య మేలును.

–సబీన్ చారింగ్ – కూల్డ్
అను : జేకబ్ చేంబర్లేన్

## 363 *Stand up, Stand up for Jesus*

1. ఓ యేసు భక్తులారా,
మీ రాజు ధ్వజము
గ్రహించి సాహసించి
పోరాడి గెల్వుఁడీ
విశ్వాసులార, రండి
మీ రక్షణార్థమై
ప్రయాసపడ్డ యేసు
విజయ మిచ్చును.

2. మీయం దసూయఁ బట్టి
మీ యాత్మ నాశము
నెన్నండుఁ గోరునట్టి
యనేకు లుందురు
మీ రెల్ల రేసు పేరు
వచించి యాయనే
సర్వాధికారి యంచు
సేవింపవలెను.

3. ప్రచండ మైన దండు
పోరాడ లేచినన్
విరోధి శక్తి కొద్ది
మరీ తెగించుఁడీ
స్వకీయ శక్తిఁగాక
శ్రీ యేసు నామమున్
స్మరించి వానియందు
విశ్వాస ముంచుండీ.

– జార్జి డఫీల్డ్
అను : జాన్ హే

# శోధనలు - పోరాటములు

## 364 నా ఆత్మా, మేలుకొమ్ము

రా – ముఖారి (చాయ : యేసుక్రీస్తుని గొల్వరన్న) తా–ఆది

నా యాత్మ! లెమ్ము! సిద్ధము కమ్ము –నా [1]రాజిఁ బూని –పాయక [2]పోర వలెను నిజమ్ము = వేయి [3]శరంబుల – నేయుచు శత్రు వ – మేయత నిను పడఁ – ద్రోయఁ దెగించెను ॥నా యాత్మ॥

1. వేచి ప్రార్థించి యుద్ధము [4]సలుపు – వీరాకృతి బోరుము – వే జయము కలుగు నని యెంచకుము = ఏంచుచుఁ బ్రతిదిన – మేసట బోరుచు – యాచించి గురు స – హాయము బొందుము ॥నా యాత్మ॥

[1]కత్తి. [2]యుద్ధము చేయవలెను. [3]అంబుల. [4]చేయుము.



2. జయము నొందితి నని తలఁపకుము – సౌఖ్యమునకై స – మయ [1]మపేక్షించి కూర్చుండకుము = నియమిత మకుటము – నీ వొందువరకు – నిర్భర యుద్ధము – నిలువదు నమ్ముము ॥నా యాత్మ॥

3. పోరు పోరాడు నిను మరణము – దేవుని యొద్దఁ – జేరు దనుక వీడకు రణము = శ్రీ రమ్యుని ది – వ్యారామంబునఁ – జేరి సుఖింపఁగఁ – జేకొని నిను విను ॥నా యాత్మ॥

– పంతగాని పరదేశి

## 365 క్రైస్తవ యుద్ధప్రేరణము

రా – శహన తా–ఆది

లేలెమ్ము క్రైస్తవుఁడా – నీలో మేల్కొని – లేలెమ్ము క్రైస్తవుఁడా – నీలో మేల్కొని ॥లేలెమ్ము॥

1. విడువకు యుద్ధము – నుడువకబద్ధము = యొదయుఁడు నీకడ – నుండును బాయఁడు ॥లేలెమ్ము॥

2. విడువకు ధైర్యము – వదలకు కవచము = సదయుఁడు క్రీస్తుఁడు – సత్ఫల మిచ్చును ॥లేలెమ్ము॥

3. బెదరకు మేరికి – వదలకు దారిని = నది యిది కానిది – యాత్మను బెట్టక ॥లేలెమ్ము॥

4. ప్రార్థన సారము – వర్ధిలఁ గోరుము = సార్థక కాలము – వ్యర్థము చేయక ॥లేలెమ్ము॥

5. భావములోనన్ – దేవుని ప్రేమన్ = నీవది వేఁడుచు – నెమ్మదిఁ గూడుచు ॥లేలెమ్ము॥

6. యేసుని సిలువ – నెదుట బెట్టుకో = మోసము నొందవు – యేసుని కాపున ॥లేలెమ్ము॥

– పురుషోత్తము చౌదరి

[1]కోరి. [2]మిక్కిలి మనోహరుని. [3]సుందరమైన తోఁటలో

## 366 క్రీస్తు మనల నెన్నఁడు విడువఁడు

రా – నాట (చాయ : ధరణిలోని ధనము) తా–ఏక

ఏల చింత యేల వంత – యిచట నీకు క్రైస్తవా = పాలకుండు యేసు నీదు – వంత లెల్ల నెరుఁగుఁగా ॥యేల॥

1. తొల్లి నీ వొనర్చినట్టి – దోష మెంతో జూడుమా = కల్లగాదు యేసు క్రీస్తు – చెల్ల చెదరఁ జేసెఁగా ॥యేల॥
2. నీకు కాలు జారినపుడు – నిన్ను లేవనెత్తెఁగా = నీ కలుషముఁ గడిగి వైచి – నిన్ను విమలుఁ జేసెఁగా ॥యేల॥
3. నీకుఁ గల్గు వ్యాధు లన్నా –నెవరు మీరఁ దీర్చెఁగా = ప్రాకటముగ నీకు సకల –పదవు లిచ్చి ప్రోచెఁగా ॥యేల॥
4. యేసు నిన్ను బాగు జేయ – నిచట శ్రమలు బెట్టుగా = వాసిగాను శ్రమలయందు – యేసు పజ్జఁజేరుమా ॥యేల॥
5. నిన్ను తల్లడిల్లఁజేయు – నీ విరోధు లందరిన్ = మున్ను తండ్రి పగిదిఁ దరిమి – పన్నుగాను బ్రోచెఁగా ॥యేల॥
6. సందియంబు లేల నీకు – స్వర్గ నాథుఁ డుండఁగా = అందమైన యీవులిచ్చి – యతఁడు నిన్నుఁ బ్రోవగా ॥యేల॥

– మేడికాయల సాధువు

## 367 క్రీస్తును వెంబడించుట

దేవా! వెంబడించితి నీ నామమున్ – జీవితేశ్వర నా జీవితాశ నీవే = రావె నా భాగ్యమా యేసువా ॥దేవా॥

1. యేసూ! నీదు ప్రేమను నే వింటిని – భాసురంబగు నీ సిలువ నే గంటిని = యేసువాడను నే నంటిని ॥దేవా॥
2. ప్రభో! ప్రారంభించితి ప్రయాణమున్–పరలోక యెరూషలేము పురికిన్ = పావనా జూపుము మార్గము ॥దేవా॥



3. నాథా! ఈదలేను ఈ ప్రవాహమున్ – నీదరిన్ గాన నీ కెరటాలధాటిచే = నావికా రమ్ము నన్ బ్రోవుము ॥దేవా॥
4. స్వామీ! నీదు ప్రేమకు నే సాక్షిని – సంఘమందున నా పొరుగువారికి నీ = సత్య సువార్త నే జాటుదున్ ॥దేవా॥
5. రాజా! నీదు రాజ్యములో జేరితి – రమ్యమౌ రాజ్యమందున నన్ వాడుము = రక్షణానందము గూర్చుము ॥దేవా॥

– ఎ.బి.మాసిలామణి

## 368 క్రైస్తవుని విజయము

రా – ఆనందభైరవి (చాయ : రాజులకు రాజైన) తా–ఖండజాతి ఛాప్

భయమేల క్రైస్తవుండా – నీవిక నపజయమున బ్రతుకనేల = జయ శూరుడగు ప్రభువు – యిలనీకు జయము నిచ్చుచు నుండగ ॥భయమేల॥

1. భూతపీడితుల నెల్ల – విడిపించుదాత – మన రక్షకుండు = సాతాను వల నుండియు – విడిపించిప నీతితో మనుపలేడా ॥భయమేల॥
2. మరణ పాశములనుండి – లాజరును – కరుణతో లేపలేదా = ధరణిమిమ్ముల నూతన – బలముతో – గుఱికి నడిపించలేడా ॥భయమేల॥
3. ద్రాక్షరసముగ నీళ్లను – మార్చిన – మహిమగల రక్షకుండు = అక్షయ సంతసంబు – నిలమీకు దీక్షతో నివ్వలేడా ॥భయమేల॥
4. ఐదు చిన్న రొట్టెలు – మరి రెండు – చిన్న చేపలతోడును = ఐదువేల మందిని – బలపర్చినట్టి రక్షకుడుండగ ॥భయమేల॥
5. విజయకరముగ బ్రతుకను – ప్రభువుండు – నిజవాగ్దత్తము లివ్వ నీ – వృజినము గెలువంగను – ముదముతో నిజముగ నెరవేర్చడా ॥భయమేల॥

– జి.జాన్ తాతయ్య

## 369 *Yield not to temptation*

1. శోధనకు మీరు
చోటియకుꣳడి
ధైర్యము వహించి
పోరాటమును
సాధించెడు వారు
జయించెదరు
సాతానుకు లొంగꣳ
బాపం బగును.
॥ యేసు శక్తిని గోరి
యెల్లకాలము వేꣳడుꣳ
దేసుꣳ డాశతో మిమ్ము
డాసి నడుపును ॥
2. దుర్బుద్ధి కుభాష
మానుండు సదా
పాపాత్ముల పొందు
తప్పించుకొని
శ్రీ దేవుని పేరున్
దూషింపకయు
శ్లాఘించుచు మీరు
వర్ధిల్లుꣳ డిలన్
3. జయించెడువారు
సౌందర్య ప్రభన్
చారు మకుటంబు
ధరించెదరు
ప్రభుండగు యేసు
నిక్కంబు నమ్ముꣳ
డాయనె నిత్యంబు
సాయము నిచ్చున్

– హోరేషియో రిక్మండ్ పామర్

అను : ఆల్ ఫ్రెడ్ త్యాగరాజు పామర్

## 370 *Nearer, my God to Thee*

1. నా దేవ ప్రభువా
నీ చెంతను
సదా వసింపను
నా కిష్టము
ఏవైన శ్రమలు
తటస్థమైనను
నీ చెంత నుందును
నా ప్రభువా
2. ప్రయాణకుండను
నడవిలో
నా త్రోవꣳ జీꣳకటి
కమ్మినను
నిద్రించుచుండꣳగా
స్వప్నంబునందున
నీ చెంతనుందును
నా ప్రభువా.



3. యాకోబు రీతిగా
ఆ మెట్లను
స్వర్గంబుꣳ జేరనుꣳ
జూడనిమ్ము.
నీ దివ్య రూపము
ప్రోత్సాహపర్చꣳగా
నీ చెంతనుందును
నా ప్రభువా.
4. నేనిద్రలేవꣳగా
నా తండ్రి, నే
నీకుం గృతజ్ఞతꣳ
జెల్లింతును.
నే చావునొందꣳగా
ఇదే నా కోరిక
నీ చెంతనుందును
నా ప్రభువా.

– శారా ఫ్లవర్ ఆడమ్స్

అను : బర్నార్డ్ లూకాస్

## 371 *When upon life's billows*

1. జీవితంబు ఘోర కష్టనష్టంబుల్
ఆవరించి నిన్ను దుఃఖపర్చిన
దేవుడిచ్చినట్టి ఈవులెంచుము
నీ వాశ్చర్య మొందెదవు. వానికై.

॥ఎంచుము లెక్కించు మీవులన్
ఎంచిచూడు మేసుదీవెనల్
ఎంచు మెంచు మెంచు మీవులన్
వింత నొందెదవు నీవు వానికై ॥

2. చింతమానసంబు నీకు గల్గినన్
వంతచే భారంబు గల్గ నీయెదన్
సంతసంబుతోడ నెంచుమీవులన్
వింత నొందెదవు నీవు వానికై
3. నాశనంబు జెందు నాస్తి జూడగా
వాసిగా శ్రీ యేసు నీ కొసంగిన
భాసురంపు భాగ్యముం దలంపుమా
యీ సౌభాగ్యమే గదా సదా
యుండు
4. జీవితాదియందు ధైర్య మొందుము
దేవుడుండు నెల్లవార్కి తోడుగ
జీవయాత్ర యందు సాయమియ్య
గన్
దేవదూతల్ నీకు తోడుగా నుండు.

# ప్రార్థన

## 372 ప్రభు ప్రార్థన

రా – ఆనందభైరవి తా–ఏక

ఓ మా తండ్రి నీదు నామము – నిత్య మెన్ను – చుండు గాక సకల లోకము = క్షేమముగను విమలముగను – జెన్ను మిరగఁ బరలోక – ధాముఁడవై వెలయునట్టి – ధన్య సౌజన్యమాన్య ॥ఓ మా తండ్రి॥

1. నీ రాజ్యంబు రా నిమ్ము – నీదు చిత్తము – నేటుగఁ బరలోకమందున = నే రీతిగను జేయఁబడునో – యీ భూలోకమందు నట్టి – దారి బొందఁ జేయవలెను – ధర్మ మూర్తి సత్యవర్తి ॥ఓ మా తండ్రి॥
2. నేటి యాహారంబు మాకుఁ – గరుణఁజేసి – నేటి కిచ్చి సూటి పరచుమి – మేటి మా విరోధి జనుల – మే మెటుల క్షమింతు మటుల – మాటికిని క్షమింప నీవె – మాకు వేరె లేరు సుమ్ము॥ఓ మా తండ్రి॥
3. మమ్ము శోధనమునకు తేకుము – కీడునుండి – మరలఁ జేయు మమ్ము నేమనన్ = ఇమ్మగు బల మహిమ రా – జ్యమ్ములును సర్వకా – లమ్ము నీవే మాదు ప్రార్థ – న నమ్ముఁ జేకొమ్ము ఆమేన్ ॥ఓ మా తండ్రి॥

– విలియం డానన్

## 373 అడుగుడి, మీ కీయబడును

రా – పంతువరాళి తా–ఆది

దాసుల ప్రార్థన – దప్పక యెసఁగెడు – యేసు నాయకుఁడె మా వేల్పు = దోసములు సేయు – దుర్జనుఁడైనను – దోసి లొగ్గఁ బర – వాసి జేయునఁట ॥దాసుల॥

1. జన రహిత స్థల – మున జని వేఁడెడి – మనుజుల ప్రార్థన – వినుచుండున్ = తన పాదము న – మ్మిన సాధూత్తమ – జనులను జూచిన – సంతస మిడునఁట ॥దాసుల॥

[1]సొగసుగ. [2]నివసించువాఁడవు. [3]భాగ్యవంతుఁడా. [4]మంచితనమునుబట్టి మన్నింపబడ దగినవాడా. [5]శ్రేష్టముగ. [6]చక్కపరచుము. [7]గొప్ప



2. మది విశ్వాసము – గూడిన ప్రార్థన – సదయత వినుటకుఁ – జెవు లొగ్గున్ = హృదయము కనుఁగొని – యుచిత సమయమున – గుదురుగ భక్తుల – కోర్కె లిచ్చునట ॥దాసుల॥
3. ముదమున నిద్దరు – ముగ్గురు నొకచోఁ – బదిలముగాఁ దనుఁ బ్రార్థింపన్ = వదలక దానట – వచ్చి యుందు నని – మృదువుగఁ బలికిన – కృత రక్షణుఁడట ॥దాసుల॥

– పురుషోత్తము చౌదరి

## 374 ప్రభు ప్రార్థన

రా – కేదార తా–ఏక

పరము నందుండెడు మా – పరమ జనక నీదు పేరు = పరిశుద్ధం బగును గాక – త్వరగను నీ రాజ్యంబు – ధరకు నరుగు దెంచుఁగాక – పరమునందు నెట్టులనో – ధరణియందు నట్లు నీ చి– త్తంబు నెరవేరుఁగాక ॥పరము॥

1. మా యనుదినాహారము – మాకు నేఁడు దయచేయుము – మా యెడలను దప్పిదములఁ – జేయువారి నైఁచునట్లు = మాయపరాధము క్షమించి – మము శోధనలోకిఁ దేక – మహిని గీడు నుండి నీ స – హాయమున దప్పించుము రా – జ్యమ్ము శక్తి మహిమము నె – ల్లప్పుడును నీవె యామేన్ ॥పరము॥

– మల్లెల దావీదు

## 375 కృప కొరకు ప్రార్థన

శ్రీరాగము (చాయ : కలుగునుగాక దేవునికి మహిమ) తా–అట

ఆలించు దేవా – నా మనవుల – నాలించు దేవా = యాలించు నా దేవ – యన్ని సమయంబులఁ – జాల గనపరచుచుఁ – జక్కని నీ దయ॥ఆలించు॥

1. సకల సత్యభాగ్య – సంపద నీ యందు వికలంబు గాకుండ – వెలయు నెల్లప్పుడు ॥నాలించు॥
2. పలుమారు నీ వొసఁగఁ – బరమ భాగ్యంబులు [1]పొలిసి పోదు నీదు కలిమి కాసంతైన ॥నాలించు॥

[1]నశించుపోదు.

3. నా యఘము లన్నియు – నా తండ్రి క్షమియించు నీ యనుగ్రహముచే – నీ సుతుని కృతమున ॥నాలించు॥

4. నీ యాజ్ఞ లన్నియు – నేను జక్కఁగ సల్ప – నీ యందు నమ్మిక – నెగడించు మనిశంబు ॥నాలించు॥

5. నీ సేవ నొనరింప – నిండుగ నిలలోన – నీ సేవకుని కిమ్ము – నీ శుద్ధాత్మను కృపచే ॥నాలించు॥

– పులిపాక జగన్నాథము

## 376 దైవసహాయము కొరకు ప్రార్థన

రా – నాథనామక్రియ (చాయ : యెహోవా భజన) తా–అట

దేవా సహాయము నిమ్మా – జీవంపు టూటలు ద్రావుట కిమ్మా ॥దేవా॥

1. గడియ గడియకు నెగసెఁ నమ్ము – లెంతో – వడిగా నాపై వచ్చె నరక బాణములు – ఎగతెగని శోధనములు నీవు – పడఁగొట్టి వేగమె –దృఢభక్తి నిమ్మా ॥దేవా॥

2. కోటాన కోటి కష్టములు – నాకు – మాటి మాటికి వచ్చె మరి నికృష్టములు – సాతాను సాధనములు – నేను – దాఁటి నీ రెక్కల – చాటున నుండ ॥దేవా॥

3. దారా పుత్రుల పైన భ్రమలు – నన్ను సారె సారెకు నీడ్చు లోక భాగ్యములు – ఘోరమగు నాత్మకములు – న – న్నీ రీతి భ్రమ పెట్టు ధారుణిలోన ॥దేవా॥

4. మా యావువుదినములు – చెట్టు – చాయవలెఁ దరుగుచు మంటి పాలౌను – చాలు నీ లోకంబు మేలు – మేము – పరలోకరాజ్యము – చేరుట మేలు ॥దేవా॥

5. మంచి మరణం బిమ్ము దేవ – మమ్ము – వచించు – సాతాను వల నుండి కావ నెంచి దూతల నంపినావ – మాకై – పంచగాయములొంద – ప్రభు వచ్చినావా ॥దేవా॥

–మిక్కిలి దేవసహాయము



## 377 క్రీస్తునందలి అభయము

రా – హుసేని తా–అట

నన్ను ౘ గన్నయ్య రావె నా యేసు = నన్నుఁ గన్నయ్య రావె నా ప్రభువా॥నన్ను॥

1. ముందు నీ పాదారవిందము – లందు నిశ్చల భక్తి ప్రేమను = పొంది కగాఁ జేయ రావే నా – డెంద మానంద మనంతమై యుప్పొంగ ॥నన్ను॥

2. హద్దులేనట్టి దురాశల – నవివేకినై కూడి యాడితి = మొద్దులతో నింకఁ కూటమి – వద్దయ్య వద్దయ్య వద్దయ్య తండ్రి ॥నన్ను॥

3. కాలము పెక్కు గతించెను – గర్వాదు లెడఁదెగ వాయెను = ఈ లోక మాయ సుఖేచ్ఛలు – చాలును జాలును జాలు నోతండ్రి ॥నన్ను॥

4. దారుణ సంసార వారథి – దరిఁ జూపి ప్రోవ నీ కన్నను = కారణ గురువు లింకెవ్వరు – లేరయ్య లేరయ్య లేరయ్య తండ్రి ॥నన్ను॥

5. నా వంటి దుష్కరమ్మజీవినిఁ – కేవల మగు నీదు పేర్మిని = దీవించి రక్షింప నిప్పుడే – రావయ్య రావయ్య రావయ్య తండ్రి ॥నన్ను॥

–పురుషోత్తము చౌదరి

## 378 ఆదర్శ ప్రార్థనలు

రా – కమాసు (చాయ : ఇదుగో గొఱ్ఱెల కాపరి) తా–త్రిపుట

కఱుణాపీఠము జేరరే – దేవుని కృపా – చరణ స్థలిని జేరరే = పరలోక జనకుని – వరములు లభియించు – తరుణమౌ ప్రార్థనలో కరములు జోడించి ॥కఱుణా॥

1. హృదయ వేదననొందుచు – యాకోబు తన – మదిలో భయమున గుందుచు= వదల కుండగ ప్రభుని – పదములు సంధించి – సదయుని దీవెన ముదమున నొందిన ॥కఱుణా॥

2. [1]కన్న ప్రేమను యిమ్మని – సోదరి హన్నా – విన్నవించగా దేవుని = అన్ని యెఱిగిన తండ్రి – హన్నాను దీవింప – వన్నె కెక్కిన కొడుకున్ – చెన్నుగా నొందిన ॥కఱుణా॥

---

[1]కన్నతల్లి ప్రేమ.

3. శాప భయమును నేద్చుచు – దావీదు – తన – పాప రూపము జూచుచు = తాపముతో పశ్చా–త్తాపముతో ప్రభుని – ప్రాపు గోరగనే క్ష – మాపణ నొందిన ॥కఋణా॥

4. కాయమున వెత నోర్చుచు – యోధుడు పౌలు – సాయమీ ధర గోరుచు = రోయుచు దన ముల్లు – దీయుమని ప్రార్థించి – వేయిరెట్లుగ కృపయు – ప్యాయముగ నొందిన ॥కఋణా॥

5. దినమంత పని జేయుచు – నాధుడా యేసు – జనుల బాధల మోయుచు = [1]ఇనుడు మరుగౌవేళ – జనకుని కడకేగి – మనసార విశ్రాంతి – యనుభవించిన స్థలము ॥కఋణా॥

6. ఇల బ్రతుకంతయు ప్రార్థన – ప్రభు యేసునకు – సిలువే తన తుది ప్రార్థన = చెలువుగ విజ్ఞాప – నలు జేయుచును మనపై – గలకాలమును దీవె –నలు వర్షించెడి చోటు ॥కఋణా॥

–ఏ.బి. మాసిలామణి

## 379 భక్తుని ఆసక్తి

రా – కాంభోజి (చాయ : చేడియలు గుంపుగూడిరి) తా–అట

యేసు పరలోక నాయక – సువి – శేష సుఫల ప్రదాయక = దోషరహిత ప్ర – క్రాశ స్వయ ఛిద్వి లాస పరమ ని – వాస బుధ దేవ ॥యేసు॥

1. మంచి మనసాక్ష్య మియ్యవే – శ్రమల – నెంచి – కృపల నందియ్యవే = వంచనల – నెడ – లించి మొఱ చిత్త – గించి మిగుల ర–క్షించు మిఁక వేగ ॥యేసు॥

2. నీరసుఁడ నని పోనాడక – యొద్దఁ– జేరి నిర్దయఁ జూడక = సారస త్కృప లూరననుఁ బ్రోచు – వార లెవ్వ రు–న్నారు నీవుఁ గాక ॥యేసు॥

3. కన్నతండ్రి నీ పాదముల్ – పొడ – గన్న వారి హృద్భేదముల్ = అన్ని దొల గునని – యన్న శుభరవం – బెన్ని విన్నాఁడ – నన్నవగు క్రీస్తు ॥యేసు॥

[1]రాత్రివేళ.



4. శంకలను వెడలఁగొట్టవే – లోకా – టంకముల నెత్తి మొట్టవే = యింక నా యఘ – పంకమును గృప – నింక గను నిష్క – ళంకునిఁగఁ జేయు ॥యేసు॥

5. దిక్కు నీవని నమ్మితి – నిన్నే – మ్రొక్క పంతంబుఁ జేసితి = చక్కగా నల పి – శాచి దుర్మోహ – దృక్కణంచి నీ – చక్కిఁ జేర్చు మో ॥యేసు॥

–రాపూరి లక్ష్మయ్య

## 380 సహాయము కొరకు ప్రార్థన

రా – రేగుప్తి (చాయ : ఖండించవలెను) తా–త్రిపుట

నా యేసు నాథా – ననుఁ జూడవే – నా జీవనాధా = నా యేసునాథ మా – నవ పాప మోచక – నీ యనుగ్రహముచే – నిరతంబు భువిలోన ॥నా యేసు॥

1. వింటిని నేను – నా హృదయంబు – వింతఁ బొందఁగను = మింటనుండి నీవు – మేదిని కరుదెంచి – యెంటి నర్పించితి – వొనరంగ నా కొరకు ॥నాయేసు॥

2. నీ యానతులను – నిజముగ మీరి – నే నుంటి మున్ను = నా యెదను గుందుచు– నా పాపముల కొరకు – నీ యొద్దఁ జేరెద – నిజరక్షకుఁడ వనుచు ॥నా యేసు॥

3. నేను నీ నెనరు – రుచి జూచితి – నిది యెంతో తనరు = దీనుఁడ నగు నేను – ధృడ కృతజ్ఞత ప్రేమల్ – గానుపింపఁగ నీ – కడకు వత్తును దేవ ॥నా యేసు॥

4. నే నశక్తుడను – నిను సేవింప – నిత్యంబు ధరను = గానఁ బ్రార్థనఁ బూని – ఘనుఁడ వని నమ్ముచు – నానందమున వత్తు – ననిశంబు నీ దరికి ॥నా యేసు॥

5. దయ చేయు మయ్యా – సత్యాత్మను – దాసుని కిపుడు = దయచేసి శుద్ధాత్మఁ – ద్వరగాఁ గల్గించుము – ప్రియముగ నీ సేవ పెంపుసేయఁగ శక్తి ॥నా యేసు॥

6. నీవు నాతోడ –నెప్పుడు నుండు – నిజ మొనగూడ = నీవు నాతో నుండ – నిర్భయముగ నేను – ద్రోవఁ బోవుదు నీకు స్తోత్రంబు చేయుచు ॥నా యేసు॥

– పులిపాక జగన్నాధము

## 381 'నీవు నన్ను ఆశీర్వదింపని యెడల నిన్ను వెళ్లనియ్యను'

రా – తోడి తా–రూపకము

నిన్ను నేను విడువను దేవ – నీవు నను దీవించు వరకు = నిన్ను నమ్మినవారల నెల్ల – నీవు చక్కఁగ దీవించెదవు ॥నిన్ను॥

1. నేను శత్రువునై యుండంగ – నీవు నాపై నెనరు జూపి = దాన మిచ్చితివి నా కొర కు – దారుఁడౌ నీ ప్రియ పుత్రుని ॥నిన్ను॥

2. త్రోవ దప్పి తిరుగుచుండ – దుడుకునైన నన్ను ఁ గాంచి = ప్రోవఁగోరి మదిని నీవు – త్రోవను బెట్టితివి నన్ను ॥నిన్ను॥

3. నాఁటనుండి నేఁటి వరకు – నాకుఁ గల్గిన శోధనములలో = నేటుగా ననుఁ గాచిన వాఁడవు – నీవు గావా, ఓ నా తండ్రి ॥నిన్ను॥

4. ఇంత కాలము నన్నుఁ గాచి – యింకను నన్ను విడువ వనుచు = సంత సించి మదిని నేను – జక్కఁగ నీ దరి జేరితిని ॥నిన్ను॥

5. నీవు గాక యెవరున్నారు – నేలపైని ననుఁ గాపాడఁ = చేవ లేని నాకు నీవు – చేవ గలుగఁ జేయఁ గలవు ॥నిన్ను॥

6. అడుగు వారి కిచ్చెద నంచు – నాన తిచ్చినావు గాన = నడిగెద నిను సాహాయ్యంబు – నాత్మమై యున్నట్టి తండ్రి ॥నిన్ను॥

7. నాదు ప్రార్థన లన్నియి నీవు – నీదు కృపచే నాలకించి = నీదు సరణిని నిల్పి నన్ను – నేర్పు దనరఁగ రక్షించితివి ॥నిన్ను॥

–పులిపాక జగన్నాధము



## 382 ప్రార్థన

రా – జంఝూటి తా–ఏక

విన రమ్ము యేసు నాధుఁడ నా – మనవి నిప్పుడు = ఘన – మైన నీదు [1]నెనరుచే ననుఁ – గావు మెప్పుడు ॥విన రమ్ము॥

1. ఎక్క డిద్దఱు ముగ్గురు నీ – యొక్క పేరటన్ = జేరు – టెక్కడో నే నక్కడ [2]కే – తెంతు నంటివి ॥విన రమ్ము॥

2. మఱి యెవరు దిక్కు ధరణిలోన – వేఱు లేరుగా = దు– ర్నరుల కెల్లఁ [3]దెరవుఁ దెల్పి – నావు నీవెగా ॥విన రమ్ము॥

3. మరణ మైతి వాహాహా నా – కొరకు సిల్వపై = నీ – కరుణ కల్గె నెంత యీ దు – రాత్ముని నాపై ॥విన రమ్ము॥

4. సకలంబు నీద టంచు మదిని – సంతసించెద = వే –ఱొకని కించు కంతయైన – నుర్వి లేదుగా ॥విన రమ్ము॥

5. కోరితి నినుదారిగ నను – దూరపర్చకు = నీ – [4]కూరిమి నా కొసఁగి నడుపు– [5]మరణావధికి ॥విన రమ్ము॥

6. వినయంబు సద్గుణంబు చిత్త – మునునుఁ గూర్పవే = ఘన – మైన నీతి యనుభవంబుఁ – గలుగఁ జేయవే ॥విన రమ్ము॥

7. దేవ దేవ రావె నిన్ను – సేవఁ జేయుదు = ననుఁ – బావనునిగఁ జేయవె నేఁ పాప నరుఁడను ॥విన రమ్ము॥

–జోనయా బర్డర్

## 383 ఆదర్శ ప్రార్థన

ప్రార్థన వినెడి పావనుడా – ప్రార్థన మాకు నేర్పుమయా ॥ప్రార్థన॥

1. శ్రేష్టమైన భావము గూర్చి – శిష్య బృందముకు నేర్పితివి = పరముడ నిన్ను – ప్రణుతించెదము – పరలోక ప్రార్థన నేర్పుమయ్యా ॥ప్రార్థన॥

2. పరమ దేవుడవని తెలిసి – కరము లెత్తి జంటగ మోడ్చి = శిరమునువంచి – సరిగను వేడిన – సుంకరి ప్రార్థన నేర్పుమయా ॥ప్రార్థన॥

---

[1]ప్రేమచేత. [2]వత్తును. [3]దారి. [4]దయ. [5]చావుమట్టుకు.

3. దినదినంబు చేసిన సేవ – దైవ చిత్తముకు సరిపోవ = దీనుడవయ్యు – దిటముగ కొండను – చేసిన ప్రార్థన నేర్పుమయా ॥ప్రార్థన॥
4. శత్రుమూక నిను చుట్టుకొని – సిలువపైని నిను జంపగను = శాంతముతో నీ – శత్రుల బ్రోవగ – సలిపిన ప్రార్థన నేర్పుమయా ॥ప్రార్థన॥

## 384 *Sweet Hour of Prayer*

1. ఓ ప్రార్థనా సుప్రార్థనా
నీ ప్రాభవంబున్ మరతునా?
నా ప్రభువున్ ముఖా ముఖిన్
నేఁ బ్రణుతింతు నీ ప్రభన్
నా ప్రాణమా సు ప్రార్థనా
నీ ప్రేరణంబుచేఁ గదా
నీ ప్రేమధారఁ గ్రోలుదు
నో ప్రార్థనా సుప్రార్థనా.

2. పిశాచి నన్ను యుక్తితో
వశంబు చేయఁ జూచుచో
నీ శాంతమైన దీప్తియే
నా శంక లెల్ల మానుపున్
నీ శక్తి నేను మరతునా
నా శైలమన ప్రార్థనా
నా శోక మెల్లఁ దీర్చెడు
విశేషమైన ప్రార్థనా.

3. నీ దివ్యమైన రెక్కలే
నా దుఃఖభార మెల్లను
నా దేవుఁ దేసు చెంతకు
మోదంబుఁ గొంచుఁబోవును
సదా శుభంబు లొందను
విధంబుఁ జూప నీవెగా
నా ధైర్యమిచ్చు ప్రార్థనా
సుధా సుధార ప్రార్థనా

4. అరణ్యమైన భూమిలో
నా రమ్యమౌ పిస్గా నగం
బు రంగుగాను నెక్కి నా
చిరగృహంబుఁ జూతును
శరీరమున్ విదల్చి నేఁ
బరంబు బోవు వేళలో
కరంబు నిన్ను మెచ్చెదన్
పరేశు ధ్యాన ప్రార్థనా.

– విలియం వాల్ఫోర్డ్

## 385 *Lord, I hear of showes of blessing*

1. యేసు, నీ సదాత్మ వృష్టి
భక్తు లెల్లవారిపై
నీవు కుమ్మరింపఁగాను
నాపైఁ గుమ్మరించుమీ.
॥ నన్నునున్ , నన్ను నున్
నన్నాశీర్వదించుమీ ॥

2. తండ్రి, నన్ను దాఁటవద్దు
పాపి నంచు వేఁడెదన్
నీ మన్నింపు నీదు కృప
నా కనుగ్రహించుమీ



3. రక్షకా, నన్ దాఁటి పోకు
నేను నిన్ను నమ్మితిన్
నీదు దయ పూర్తిగాను
నాపైఁ గుమ్మరించుమీ.

4. పావనాత్మ, దాఁటి పోకు
నేను గుడ్డివాఁడను
జ్ఞానదృష్టి నాకు నిమ్ము
నాకు దైవ శక్తి నీ.

5. మాఱనట్టి దైవ ప్రేమ.
క్రీస్తు రక్త పుణ్యము
పావనాత్మ ప్రేరణంబు
నిండుగాను బోయుమీ.

6. నన్ను దాఁటిపోక యేసు
నీకు సేవచేయ నా
హృదయంబును బంధించి
నన్నాశీర్వదించుమీ

– ఎలిజబెత్ కాడ్నర్

అను : జేకబ్ చేంబర్లేన్

## 386 *There shall be showers of Blessing*

1. ఆశీరవంబు ల్మామీఁద
వర్షింపజేయు మీశ
యాశతో నమ్మి యున్నాము
నీసత్య వాగ్దత్తము.
॥ ఇమ్మహి మీద
క్రుమ్మరించుము దేవ
క్రమ్మర ప్రేమ వర్షంబున్
గ్రుమ్మరించుము దేవా ॥

2. ఓ దేవ పంపింప వయ్యా
నీ దీవెన ధారలన్
మా దాహ మెల్లను బాపు
మాధుర్యమౌ వర్షమున్

3. మామీఁద కురియించు మీశ
ప్రేమ ప్రవాహంబులన్
సమస్త దేశంబు మీఁద
క్షామంబు పోనట్లుగన్.

4. ఈనాఁడె వర్షింపు మీశ
నీ నిండు దీవెనలన్
నీ నామమందున వేఁడి
సన్నుతిఁ బ్రార్థింతుము.

## 387 *Pass me not, O Gentle Savior*

1. రక్షకా, నన్ మర్వఁబోకు
మొఱ్ఱ నాలించు
అన్యులైనవారిఁ బిల్వన్
మర్వఁబోకు నన్
॥యేసు, యేసు
మొఱ్ఱ నాలించు
అన్యులైన వారిఁ బిల్వన్
మర్వఁబోకు నన్ ॥

2. నీ కృపాసనంబు నొద్ద
శాంత మియ్యుము
పశ్చాత్తాప పడు నిన్ను
నాదరించుము.
3. నీదు పుణ్య మేను నమ్మి
యా శ యింత నిన్
క్రుంగినట్టి నాదు నాత్మc
బ్రోవు ప్రేమతో
4. నాకు సుఖదాత వీవె
జీవదాతవే
యిహపరలములయందు
దిక్కు నీవెగా

- ఫ్రాన్సెస్ జేన్‌వేన్ ఆల్‌స్టీన్

అను : జాన్ అబెర్లీ

# విశ్వాసము

## 388 విశ్వాస ప్రార్థన

రా - సౌరాష్ట్ర (చాయ: మనసానందము) తా - ఆది

విశ్వాసముతో - వేcడెడి వారికి - విశ్వ మంతయును - వీల్పడును = శాశ్వత రాజ్య - థీశ్వరుc డాధ్యుcడు - శాశ్వత మగు నీ - శాసన మి చ్చెను ॥విశ్వా॥

1. బిడ్డలు తండ్రుల - వేడcగ నన్నము - బెడ్డ లిచ్చు వె - ఱ్ఱులు గలరే= దొడ్డ తండ్రి నిలc - దోడ్పా టడిగిన - నడ్డులేక విమ - లాత్మ నొసంగును ॥విశ్వా॥

2. నమ్మకమునc జెడు - నరులను గానము - నమ్మక చెడుదురు - నరులయ్యో= ఇమ్మహి సకల శు - భమ్ములు గలుగును - సమ్మతి వెతకcగ శాశ్వత రాజ్యము ॥విశ్వా॥

3. వెతకెడు వారికి - వెసc గృపc జూపును - గతిc గని వేడం - గాc దెర చున్ = సతతము యేసుని - చక్కని పేరట - హిత మతి వేcడగ - నెంత యు మేలగు ॥విశ్వా॥

4. బల మేమియుc గనc - బడ దాహ నే సలిపెడు భక్తిని - సతి మను చు = నలయకు నేలను - నావగింజ మరి నిలిపినc జెట్టయి - నింగికి నెదుగదె॥విశ్వా॥



5. అవిశ్వాసమున - నతి భీతులచే - నవిసి క్రుంగ నగు - నే మనసా = భువిc బాపాత్ములc - బ్రోచెదు ప్రభు కృపc - జవిc జూడుము నుతి - సల్పుచు వేగమే ॥విశ్వా॥

- ఎ.జెకర్యా

## 389 విశ్వాస ఫలితములు

రా - జంఝూటి తా-అట

విశ్వాస ఫలితములు - విశదమ్ముగా నీకు వివరింతు విను క్రైస్తవా = విశ్వాస వంతునికి - విశ్వమ్ములోపల మ - వశ్యమ్మొదవు క్రైస్తవా ॥విశ్వా॥

1. ఫలములన్నిటిలోన - ప్రాముఖ్యమైనట్టి - ఫలమది పాప క్షమమే = విలువైన యీ ఫలము - గలుగు నరునికి ముక్తి - దొలగ దతనికి క్షేమమే ॥విశ్వా॥

2. దానములలోను ప్ర- ధానమనబడు సమా - ధానమును గల్గించును= మాని తమ్ముగ సమా - ధానమును భువిదివుల - మహితుతో గల్గించును ॥విశ్వా॥

3. నరక పాత్రులమైన - నావంటి నీవంటి - దురిత జీవుల కెల్లను = గౌఅతలన్నియు దీర్చ - నిరత జీవము నియ్య - నిశ్చయమ్మిది చెల్లును ॥విశ్వా॥

4. ముత్తెమ్మునకు వలెనె - మురికి గప్పcగబడిన - చిత్తమును చిత్రవిధిగా = రత్నమువలె మిగుల - రంజిల్లc జేసెడి ప-విత్రాత్మ మనకొదవుగా ॥విశ్వా॥

5. మేరలేని దోష - కారులమై ప్రభుకు - దూరముగc దొలగియున్న = వారమగు నను నిన్ను - చేరంగ బిలిచి కు - మారత్వమొసంగు నన్న ॥విశ్వా॥

6. సేగు క్రియలను జేసి - పోగొట్టుకొన్నట్టి - క్షేమ రాజ్యపు హక్కులన్ = బాగుగ మనకిచ్చి - బాంధవ్య మొనరించు - భగవంతునికి మనకున్ ॥విశ్వా॥

7. విశ్వనాధుని గొప్ప – విశ్రాంతిలోను ప్ర– వేశము నాకు నొసంగుగా = విశ్వాస ఫలము లివి – నీ శాశ్వత రక్ష – ణాశ్రయం బిదియె విడకు ॥విశ్వా॥

– మురారి దావీదు

## 390 విశ్వాసమువలని విశ్రాంతి

రా – మారువ (చాయ : మంగళంబని పాడరే) తా–అట

సందియము వీడవే – నా మనసా యా – నందమున గూడవే = సందియము లింకేల నిను సుఖ– మొందc జేసెడు క్రీస్తు రక్తపు – బిందువులు శుభవార్తవాక్యము – లందుc గని తెలి వొంది బ్రతుకుచు ॥సందియము॥

1. చింత లిcక మానుము – లోకులు దెల్పు – భ్రాంతుల్ బడc బోకుము =ఎంత వింత దురంత పాపము – లంతటను దన రక్తమున గో – రంత లేకయె దుడుచు నని సి – ద్ధాంత మగు ప్రభు వాక్యమును విని ॥సందియము॥
2. పాపములు వీడుము – నీ విcకc బశ్చా – త్తాపమున గూడుము = ఏపు మీరిన యోర్పుతో నొక – పాపి కైన లయంబుc గోరక – పాపులందఱు దిరిగి వచ్చెడు – కోపుc గోరెడు కర్త దరిc జని ॥సందియము॥
3. నేరముల నెంచుకో – యేసుని కరుణా – సారముc దలంచుకో = భార ముల్ మోయుచు శ్రమన్ బడు – వార లందఱు నమ్మి నా దరిc జేర విశ్రమ మిత్తునను ప్రభు – సార వాక్యెలు చక్కcగా విని ॥సందియము॥
4. నిమ్మళము నొందుము – రక్షకుని పలుకు – నమ్మకొని యుండుము = ఇమ్మహిని బాపులకు నై ప – క్షమ్ము జేసి పరాత్పరుని సము – ఖమ్మునందుc చిత్తమ్ముగాc – కాయమ్ము బలియిడు నీప్రభునిc గని ॥సందియము॥
5. ప్రేమ దయా శాంతముల్ – కర్తకు భూషా – స్తోమము లవంతముల్ నీ మొఱ ల్విని యేసునాథ – స్వామి తన రక్తమున బాపముc దోమి ని న్నకళంకుc జేయును నీ మదిన్ దగ నమ్మకొన యిcక ॥సందియము॥

– పురుషోత్తము చౌదరి



## 391 విశ్వాస విజయము

రా – కమాను (చాయ: కొనియాడదరమె) తా–అట

విశ్వాసమే విజయము – విను ప్రియుcడా య – విశ్వాస మపజయము = విశ్వాసాయుతమైన – విసుకని సుకార్యములే – విశ్వాసవంతునికి – విజయ మొసంగును నిజము ॥విశ్వాసమే॥

1. భక్తుc డందు వలననే – బ్రతుకును మరియు – శక్తినొంది నిల్చును = యుక్తముగ వర్తించి – యుర్విని జయించి – ముక్తినొందున టంచు – రక్తిగాc బాడుదును ॥విశ్వాసమే॥
2. మంచి పేరు నొందును – సాతాను నెది– రించి విజయ మొందును = మించిన బాధ ల్స – హించి జయించును – నంచిత మరణము – నానంద ముగcగాంచు ॥విశ్వాసమే॥
3. ప్రవిమల మొందెదము – పాపమునుండి – పరిహరింపcబడుదుము = అవి రతమును మనము – నాశ్చర్యముగ ఘనము – భువియందున్ దివియందున్ – బుధులతో నొందుదుము ॥విశ్వాసమే॥
4. నీతిమంతుల మౌదుము – నిశ్చయము ప్ర– ఖ్యాతి బోధను నేర్తుము = ఆ తండ్రి దత్తముల – నన్ని యార్జించుచు – యాతని సుభద్రములో – ననయ ముందుము నిజము ॥విశ్వాసమే॥
5. పరిపూర్ణ విశ్వాసమే – క్రియలతో నున్న – మరి మంచి విశ్వాసమే = ధరయందున్ బరమందున్ – ధన్యాత్మునిగc జేయున్ – సరగు నద్దానినే – సంపాదించుము ప్రియుcడా ॥విశ్వాసమే॥

– మురారి దావీదు

## 392 *My faith look up to Thee*

1. ఓ దేవ రక్షకా
నే విశ్వాసంబుతో
నిన్ జూతును
నా మొఱ్ఱాలించుము
నా పాప మార్పుము
నన్నింక నీ దరిన్
సదా యుంచు.

2. మూర్ఛల్లు నాత్మకు
బలం బొసంగుము
భవత్కృబుపన్
నాకై చావొందిన
నిన్నెల్లకాలము
ఆసక్తి శుద్ధితోఁ
బ్రేమింప నీ.

3. నే హాని నొందిన
నన్ జింత క్రమ్మినఁ
గాపాడుము
పోఁగొట్టు చీఁకటి
కన్నీళ్లఁ దుద్వుము
దొలంగ నీకునన్
నీ సన్నిధి.

4. నా యాయు వంతమై
మృత్యూగ్ర బాధలు
నన్నొందుచో
సంశయ భీతులు
తొలగఁ బ్రేమతో
నా దేవ, యాత్మకు
మోక్షం బిమ్ము.

– రే పామర్
అను : సి.ఎఫ్. కూడర్

# నమ్మిక - నెమ్మది

## 393 క్రీస్తును ఆశ్రయించుట

రా – శహన తా–కరుజంపె

నీ చరణములే నమ్మితి నమ్మితి – నీ పాదములే పట్టితిఁ బట్టితిఁ బట్టితి ॥నీ చరణములే॥

1. దిక్కిఁక నీవే – చక్కఁగ రావే = మిక్కిలి మ్రొక్కుదు మ్రొక్కుదు మ్రొక్కుదు ॥నీ చరణములే॥

2. ఐహిక సుఖము – నరసితి నిత్యము = ఆహాహా ద్రోహిని ద్రోహిని ద్రోహిని ॥నీ చరణములే॥

3. న్యాయము గాని – నా క్రియ లన్ని = రోయుచుఁ ద్రోయకు త్రోయకు త్రోయకు ॥నీ చరణములే॥

4. భావము మార్చి – నావెతఁ దీర్చి = దేవర ప్రోవవే ప్రోవవే ప్రోవవే ॥నీ చరణములే॥

5. చంచల బుద్ధి – వంచన యెద్ది = ఉంచక త్రుంచవే త్రుంచవే త్రుంచవే ॥నీ చరణములే॥



6. చుట్టుకొని యున్న– శోధన లున్నఁ = పట్టు విడఁ గొట్టవే కొట్టవే కొట్టవే ॥నీ చరణములే॥

7. నాచు పిశాచి – నరుకుట గాచి = కాచుకో దాఁచవే దాఁచవే దాఁచవే ॥నీ చరణములే॥

8. యేసుని తోడ – నెవ్వరు సాటి = దోసముఁ బాపును బాపును బాపును ॥నీ చరణములే॥

## 394 క్రీస్తు ఎన్నటికి విడనాడు వాఁడు కాఁడు

రా – సావేరి తా–ఆది

ఎందు కే చింతించెదవు నా – డెందమా నీ కందమా = యిందాఁక రక్షించినవాఁ – డిఁకను నిన్ను విడువఁబోడు ॥ఎందుకే॥

1. తొల్లి నీ వొనరించినట్టి – దోషమెంతో యరిసి చూడు – చెల్లచెదరై పఱచు తరిని – చెయ్యి పట్టినాఁడు – అల్లుకొనిన నీ దుర్గుణము – లణఁగఁ ద్రొక్కి వేసినాఁడు – తల్లడిల్లజేయు నీ శ–త్రువులఁ దరిమి ప్రోచినాఁడు = నల్లగా దన్నా డా నేఁడు – వద్దు సందేహంబులు వీడు ॥ఎందుకే॥

2. తల యెత్తరాని చోటఁ – గళ లిచ్చి నిలిపినాఁడు–పలుమారు నీ యక్కఱలు – తెలిసి యందిచ్చినాఁడు – బలహీన మపుడు నీకు ని – ర్భయ మియ్య వచ్చెడు వాఁడు – పలు విధంబు లగు బాధలఁ – బారఁ దోలివేసినాఁడు = నెల విప్పుడు లేదన్నాఁడా – నీతో నిఁక సరి యన్నాఁడా ॥ఎందుకే॥

3. ఒక్క నీ తల వెంద్రుక యైన – నూడిపడ దని చెప్పెడు వాఁడు – దిక్కు నీకిక నేనే యని తన – దివ్య వాక్కులఁ దెలిపెడు వాఁడు – చిక్కు లను బెట్టెడు పగవారి – చేత నినుఁ జిక్కింపని వాఁడు – ఇక్కట్టు మెట్టుల దాఁటించుట – కిదిగో యని చెయి యిచ్చెడు వాఁడు = హక్కు లేదన్నాఁడ నేడు – అతఁడు నిను వెలి వేయబో డు ॥ఎందుకే॥

4. యేసు తన రక్తముతో నిన్ను – నెంచి ముందే కొనుచున్నాఁడు – దోసములు వెదలించు [1]విమలా – త్ముండు నీ సాక్షిగ నున్నాఁడు – ఆశతో నీవు గొలిచెడు

[1]పరిశుద్ధాత్మ

తండ్రి – యంతటా గాపై యున్నాఁడు – నీ సురక్షణ జేయు వారు – నినుఁ జుట్టి యున్నా రెల్లప్పుడు = [1]శేషరహితానంద [2]మల్లదె. చేరువగుచున్నది చూడుము ॥ఎందుకే॥

– పురుషోత్తము చౌదరి

## 395 ప్రభుని హత్తుకొనుట

రా – జంఝూటి తా–అట

మనమీ మనుమీ మనస – నీ వనుదినము యేసుని సరస = ఘన ధనముల నీవు రోసి – దేవ – తనయుని కృపఁ దల పోసి ॥మనమీ॥

1. మంకు తనములను విడిచి – నీ – భ – యంకర వేదనకు వెరచి = యింక వడి యేసు కడ కేగి – పాద – పంకజముల యొద్ద దాఁగి ॥మనమీ॥
2. ప్రాకటముగ నొప్పు నట్టి – దైవ వాక్యంబు మనమునఁ బెట్టి = శ్రీ కర నాధుని నమ్మి – ధాత్రి – నీ కలుషమ్ములును జమ్మి ॥మనుమీ॥
3. సృష్టి ప్రభువు నీకు లేఁడ – యతని – యిష్ట – గుణగణమ్ములు బాడ = ఇష్టము తోడను వేఁడి – నీదు – దుష్ట గుణమ్ముల వీడి ॥మనుమీ॥
4. చెంతఁ జేర వల దన్నాఁడ – కడు – వింతెన జనకుఁడు గాఁడా = చింతలు నీకిఁక నేల – బహు – సంతోషమున యేసు పాల ॥మనుమీ॥
5. బిరబిర వరగురు దరికి – నీ వరుగుము దురితముఁ బెరికి = సురిచిరమగు యేసు కరుణ – నీకు – మరణపు తరి నగు నాదరణ ॥మనుమీ॥
6. నిరతమ్ము నాతనిమీఁద – నీదు – దురితముల నునుపరాద = త్వరితమ్ముగ నెమ్మిఁ జూపి – దుష్ట – చరితమ్మును వెళ్లబాపి ॥మనుమీ॥
7. అమలాప్తుఁడు నిను డాయు – నీదు – శ్రమ లన్నియు వెడలఁ జేయు = విమలాత్మను దయచేయ – నీతి – కమలాప్తుని మది కీయ ॥మనుమీ॥
8. అంచితముగ నుతి సేయు – నిన్ ర – క్షించిన కృపా సంస్థాయు = నెంచుచు నాతని విభునిగఁ – గీ – ర్తించుచుఁ బరమ గురునిగ ॥మనుమీ॥

– సి. జేమ్సు

[1]సంపూర్ణమైన [2]అదిగో



## 396 మన రాజగు క్రీస్తు

రా – శంకరాభరణము తా–ఏక

దేవ దాసపాలక రాజా రావే – జీవముల ప్రదాతవై ప్రకాశ మొందఁగా – దేవా దేవా దీన పోషకా ॥దేవ॥

1. లోకబాధ యిరుకు శోధన నుండి – స్వీకరించినావు త్రైకదేవుఁడా స్తోత్రం స్తోత్రం స్తోత్ర మర్పణ ॥దేవ॥
2. దిక్కు లేని పాపికొరకు నీ దేహం – మిక్కుటంపు బాధ కొప్పితివి యక్కటా – జయం జయం జయము నొందఁగా ॥దేవ॥
3. కఠిను లంత కుటిలముజేసి నిన్నుఁ – గట్టి కొట్టి నెట్టి నీకుఁ గొయ్య నెత్తిరా – యిదే నా యెడఁ బ్రేమఁ జూపితి ॥దేవ॥
4. ఇంత యోర్పు యింత శాంతమా నాకై – పంతముతోఁ బాపికొరకుఁ బ్రాణ మియ్యఁగా – పాపిన్ నీదగు దాపుఁ జేర్చవే ॥దేవ॥
5. కలువరి గిరి వరంబున నాకై–తులువను నా కొరకు నిలను సిల్వమోయఁగా – హలెలూయా హలెలూయ హలెలూయ ఆమేన్ ॥దేవ॥

## 397 దేవుఁడు తన పరిశుద్ధులను ఎన్నడు నెడబాయఁడు

రా – శంకరాభరణము (చాయ : మన మొదటి తల్లిదండ్రుల్) తా–త్రిపుట

ఎన్నడు నెడఁబాయ – నే కొలఁది విడనాఁడ – నవిన తండ్రి – నిరత – మన్ని బాధలయందు – నన్ని దుఃఖములందు – నన్ను ఁ బ్రోచు ॥ఎన్నడు॥

1. పాపుల రక్షింపఁ – బ్రాణమిచ్చిన యేసు – బ్రతికి యుండు – తన – ప్రాపు గోరినవారి – భారము తా మోసి – ప్రాపయి యుండు ॥ఎన్నడు॥
2. ఎల్ల కాలంబుల – నేకరీతిగ నుండు – యేసునాధుఁ – డాతఁ – డెల్ల విశ్వాసుల – నెల్ల – వేళలఁ దలఁచి – యేలుచుండు ॥ఎన్నడు॥
3. తనవారి యక్కఱలు – తానెఱిగి యున్నాఁడు – తప్పకుండ – నాతఁ డెనలేని దయఁబూని – వినువారి మనవులు – వేడ్కమీఱ ॥ఎన్నడు॥

– పులిపాక జగన్నాధము

## 398 రేపటిని గూర్చి చింతింపకుము

రా – నాధనామక్రియ తా–అట

జీవమా చింతించకుండు – నిన్నుc – గావ వచ్చిన యేసు కరుణా మయుండు = జీవమా చింతించి – క్షితి మూరె డైన నీ – జీవము కున్నతిc జేసెదవా – కావున నీ చింతా – క్రాంతము వెడలించు – దేవుc డెహోవ నీ –దిక్కని నమ్మి ॥జీవమా॥

1. గగన వీధిని బోవు – ఖగములు దున్నునా – తెగcగోసి కొట్లలో – దాc చునొకో = యగణిత పక్షుల – కాహార మియ్యంగ – బెగడెద వెందుకు – పెంచు ని న్నత డు ॥జీవమా॥
2. పక్షి వృక్షాదుల – పై నింత ప్రేమతో – భక్షణ లిచ్చుచుc – బాలింపcగా = నక్షరములకంటె – హెచ్చుగ నన్నెంచి – యక్షయముగ నేలు – నల్పవిశ్వాసి ॥జీవమా॥
3. మిత్రాయీం బాధల – మేరల దొలcగించి – యిశ్రాయేలుకు – మన్నా – నియ్యలేదా = యాశ్రయమై నీదు – హస్తము విడువక – నీ శ్రమలను బాపి – నిన్నేలునతడు ॥జీవమా॥

*– మిక్కిలి సమూయేలు*

## 399 క్రైస్తవాదరణ

రా – ముఖారి తా–త్రిపుట

భయము నొందకుము – క్రైస్తవ సహోదర యింక – భయము నొంద కుము = భయము నొందకుము హృ – దయ వాసుcడగు క్రీస్తు – దయ నీ తలcపు లెల్ల – రయముగ నెరవేర్చు ॥భయము॥

1. దీవింపcబడెదు – జగమున కిరుకౌ – త్రోవ జను నపుడు = భావ జ్ఞానము వీడ – భయపుc జీcకటి గూడుc – గావున మది యేసు – భావింప గతి జేర్చు ॥భయము॥
2. నీ యాత్మc జూచి – కయ్యము జేయ – డాయు పిశాచి = యా యుద్ధమున బ్రత్య – య మ్మనెదు డాల్బట్ట – నా యెదc గ్రీస్తు స– హాయుcడై గెల్పించు ॥భయము॥

[1]దూతలు (నశింపనివి)



3. జగము నిన్నట్టి – వెన్కకు నీడ్చి– పగc దీరc గట్టి = యెగతాళి గావించు – టెటింగి క్రీస్తుని పిల్వc – దగcబట్టు మపుడు నీ – పగ మాన్పి విడిపించు ॥భయము॥
4. కలుష జాలంబు – మాయా కీట – కముల జాలంబు = గల బావి నీ యాత్మ – గలియకుండcగ యేసుc – దలcచు మప్పుడు నిం జే – తంబట్టి కాపాడు ॥భయము॥
5. శ్రమ దండనముల – శిశు శిక్షించు – జనకు విధముల = సమకూర్చు నీ దేవుc – దమిత ప్రేమను గాంచి – యమలమౌ మతి నోర్చు – మపుడు మేలిడు నీకు ॥భయము॥
6. కన నీదు చటుల – దుఃఖాదు లె – ట్లను వీడు నటులc = గొన దినమున న్యాయ – ముసు దీర్పcగాc క్రీస్తు – చను దెంచి నిత్య జీ –వన కిరీటము నిచ్చు ॥భయము॥

*–విలియం డాసన్*

## 400 క్రైస్తవుల నిర్భయము

రా – ముఖారి (చాయ : మన మొదటి తల్లిదండ్రుల్) తా–అట

యేసునాధుని సేవ – యిపుడు మాకబ్బెను – వెఱవము వెఱవము = యేసు = దాసులతో – బొత్తు – భక్తి మా కమరెను – జడియము జడియము ॥యేసు॥

1. లోక జ్ఞానములోని – లోతుc దెలిసి మేము – లొంగము లొంగము – యేసు = రాకడకొఱకు సంత – సించి యెల్లప్పు – దుండెద ముండెదము ॥యేసు॥
2. దైవజనుల మని – ధైర్యముతో మేము – పల్కెదము పల్కెదము – పాప = భారమంతయు యేసు – ప్రభున కప్పగించి – బ్రతుకుచు బ్రతుకుచు ॥యేసు॥
3. శుభవర్తమానము – సొంపుగా నరులకుc జెప్పెదము జెప్పెదము – లోక = వైభవములను – వాంఛించక యేసుని – పలికెదము పలికెదము ॥యేసు॥

4. నీతికవచంబును – నెనరుతో ధరియించి – నిలిచెదము నిలిచెదము – లోక = ఘాతకుండైన పి – శాచిని యెదిరించి – కట్టెదము కట్టెదము ॥యేసు॥

5. శోక మొందక యేసు – రాకడ కాశించి – రంజిల్లు చుండెదము – దూత = మూంకలతో గూడి – మోద మొప్ప యేసుని – పొగడెదము పొగడెదము ॥యేసు॥

## 401 క్రైస్తవ నిర్భయము

రా – నాధనామక్రియ తా–ఏక

వెరువనేల మనసా – క్రీస్తుని – వేండవే నా మనసా = యిరుకునం బడి యెదు – వేళలోం క్రీస్తుని – చరణము చేరువ – జేరిన సుఖ మది ॥వెరువ॥

1. శోధన కాలమునం – క్రీస్తుని – బోధకు చెవి నిమ్మా = సాధించెదు సా – తానుని వల మరి – ఛేదించెదు నింకం – బెదరకు ॥వెరువ॥

2. పాపపు స్త్రీ వచ్చి – పరిమళ తైలము తాం దెచ్చి = పాప మెడలు నని – తనలో ననుకొని – యేపున క్రీస్తుని – నెలమి భజించెను ॥వెరువ॥

3. గ్రుడ్డివాడు నిలిచి – మార్గము – బడ్డ యేసుని బిలచి = చెడ్డవాడనని – చేయివిడువకు మన – దొడ్డ క్రీస్తు [1]కందోయి నొసంగెను ॥వెరువ॥

4. గాసి బడుచు రోగి – యగు చెలి – యాశచేత వచ్చి = వాసిగ యేసుని – వస్త్రమంటి సుఖ – వాసి యయ్యె ప్రభు – యేసుని కృపచే ॥వెరువ॥

5. లాజరుండు మృతుడై – పదువే – ళ సమాధికి వచ్చి = లాజరా యని – బల్కరుణను బిలువంగ – రాజిల బ్రతికెను – బ్రాణాన్వితుండై ॥వెరువ॥

6. పరిసయ్యునిలోని – భావము – ప్రభు తాం గనుంగొనుచుం = తిరిగి పొమ్ము నీ – దురితము వెడలెను – వెరువకు మని యాదరముగ బలికెను ॥వెరువ॥

[1]రెండు కన్నులు [2]కూడుకొనినవాడు



## 402 దేవుండే మన దిక్కు

రా – ఖరహరప్రియ తా–ఆది

దినదినముకు – దిక్కు నీవే – మా దేవుండా – మమ్ము = కనిపెట్టి కాపాడ నెపుడు – కర్త వీవే కర్త వీవే ॥దినదినమునకు॥

1. పనికిమాలిన వారము – పాపిష్ఠులము నీదు = కనికరమును జూచి కృపతోం – గావు మమ్ముం గావు మమ్ము ॥దినదినమునకు॥

2. పాప మైన లోక మైన పి– శాచక మైన మమ్ముం = భట్టి రక్షింప వచ్చినం – బ్రాపు నీవే ప్రాపు నీవే ॥దినదినమునకు॥

3. కష్టములు – కాని శోధనలు మమ్ముం = జుట్టు కొనంగ నీ కృపనెంతో – చూపుదువే చూపుదువే ॥దినదినమునకు॥

4. నిందలైన దెబ్బ లైన – నీదు నామమున మేము = పొందంబోవు కాలమందుం దండ్రి వీవే తండ్రి వీవే ॥దినదినమునకు॥

5. సత్యమైన వాక్య మిచ్చి – సారమును దెల్పి నీదు = నిత్యజీవ మార్గ మందు – నిలిపితివే నిలిపితివే ॥దినదినమునకు॥

6. ఆసం గొల్పి యాత్మలో నా క్యానుభవ మొందించి నీకు = దాసులమై బ్రతుకునట్లు – ధైర్య మిమ్ము ధైర్య మిమ్ము ॥దినదినమునకు॥

7. విశ్వాస నిరీక్షణ ప్రేమ – లింపుగా మాకు నీవు = శాశ్వతముగం బంపించుమీ – శ్రేష్టముగను శ్రేష్ఠముగను ॥దినదినమునకు॥

– గొల్లపల్లి నతానియేలు

## 403 క్రీస్తు పేరటం బాడుట

రా – ఆనందభైరవి తా–ఆది

పాడుదును క్రీస్తు పేర పదము – నెంతో – వేడుదు నా దివ్యాగురు నివ్విధముం = జూడంజూడ మదిలో నెంతో – వేడుకగా మిాఱె వింత – ఱేడుం బోలినవా డిహ – లేండు లేండందు నహహో ॥పాడుదును॥

1. పెక్కు పాపములలోన మణంగి – నాదు –తక్కువ బుద్ధిచే నందణంగి దిక్కు గానక నుండు వేళ – దిక్కయి చనుదెంచి మరల – గ్రక్కున కరముం జూచి – చక్కికిం జేర్చి ప్రోచె ॥పాడుదును॥

2. మోసపు లోక వాంఛలను - వట్టి - యాశలతోఁ గూడికొన్న కలలు = రోసితిఁ గాన వాని - యేసుతోఁ గూడుకొంటి - వీసమైనను లేమి - లేశము లేదనుస్వామి ॥పాడుదును॥

3. పాయ నెన్నటికిని వాసిగాఁ - బాస - త్రోయను త్రోయను యని చేసెగా = రోయక న న్నావిభుఁడు - సాయమై రక్షించు నెపుడు - నా యనీతి భయములు మాని - యాయనే జయంజయమని ॥పాడుదును॥

4. చాలు చాలు పాపమా నీ చెలిమి - నిత్య - కాలము గలిగించు మృత్యుకలిమి = యేలికైన నాయిమ్మాను - యేలు నాయందు దయను - మేలిమి నగుపరచినట్టి- జాలినేఁ గంటిఁ గాన ॥పాడుదును॥

5. ధరలో దేనికి భయపడను - ఎట్టి - తరుణమైనను చేయి విడను = కరుణామయుండు నన్ను - కరుణ నేర్పరచి మున్ను మరణమందును వాని - శరణం నాశరణమని ॥పాడుదును॥

-అల్లూరి పెదవీరాస్వామి

## 404 కష్టకాలమందు నోదార్పు

రా - ముఖారి తా-కురుజంపె

జడియకుము నే నే యున్నానని - కదు నెనరు వాక్కిచ్చిన యేసుని - యదుగుజాడలు వెంబడించి - నదుచుకొనరాదా - జీవా = యిడుమ లధికము గలిగిన ప్రభుని - కడకుఁ జేరరాదా ॥జడియకుము॥

1. ఇప్పుడు నిను బాధపరచెడి -ముప్పులం దలపోసి తప్పక - గొప్ప ప్రేమార్థంపు శిక్షకు - నొప్పియుండరాదా - నీ = తప్పులన్ విడి ప్రభువు నందు - మెప్పు బొందరాదా ॥జడియకుము॥

2. ఘనము ధనము సౌఖ్యంబు బోయి - వ్య - సనము శోధన మున్న యోబు - మనసు దృఢము చేసి ప్రభుని - మహిమ పరపలేదా - నీ = మనసు దృఢంబటుల జేసి - మహిమ పరపరాదా ॥జడియకుము॥

3. బీద లాజరుండు భువిని - బాధ నొందిన సాదృశ్యంపు - బోధన నీ మానసమున - పాదుకొనలేదా - యతఁ = డాదరింపఁబడిన విధము - మోద మియ్యలేదా ॥జడియకుము॥



4. మున్ను స్తెఫనును రాళ్లతోఁ గొట్టు - చున్న పగతుర కొరకు దేవుని - మిన్ను వైపునఁ జూచి యోర్చి - మన్న నదుగలేదా - నీ = కున్న శ్రమలటు లోర్చఁ బ్రభువు - తెన్నుఁ జూపలేదా ॥జడియకుము॥

5. భక్త జనులను ఖైదుకు నీడ్చి - బాధలు గావించినప్పుడు - శక్తి హీనుల మంచు యేసుని - శక్తి నమ్మలేదా - యా = యుక్తసహాయము దొరకువరకా - సక్తి నుండలేదా ॥జడియకుము॥

- బేతాళ జాన్

## 405 దేవుఁడే మన యాశ్రయము

రా - శంకరాభరణము (దావీదు కీర్తన 46) తా-ఏక

దేవుఁడే నా కాశ్రయంబు - దివ్యమైన దుర్గము = మ - హా వినోదుఁ డాపదల స- హాయుఁడై నన్ బ్రోచును - అభయ - మభయ - మభయ మెప్పు - డానంద - మానంద - మానంద మౌఁగ ॥దేవుఁడే॥

1. పర్వతముల కదిలిన నీ - యుర్వి మారుపడినను = సర్వమున్ ఘోషించుచు నీ - సంద్ర ముప్పొంగినన్ - అభయ - మభయ - మభయ ॥దేవుఁడే॥

2. దేవుఁ డెప్డు తోడుగాఁగ - దేశము వర్ధిల్లును = ఆ - తావు నందు ప్రజలు మిగుల - ధన్యులై వసింతురు - అభయ - మభయ - మభయ ॥దేవుఁడే॥

3. రాజ్యముల్ కంపించిన భూ - రాష్ట్రముల్ ఘోషించిన = పూజ్యుండౌ యెహోవా వైరిఁ-బూని సంహరించును-అభయ-మభయ-మభయ ॥దేవుఁడే

4. విల్లు విఱచు నాయన తెగ - బల్లెము నఱకు నాయన = చెల్లచెదర జేసి రిపుల - నెల్లఁద్రుంచు నాయనే అభయ - మభయ - మభయ ॥దేవుఁడే॥

5. పిశాచి పూర్ణబలము నాతోఁ - బెనుఁగులాడ జడియును = నశించి శత్రుగణము దేవు - నాజ్ఞ వలన మడియును - అభయ మభయ - మభయ ॥దేవుఁడే॥

6. కోటయు నాశ్రయమునై యా- కోబు దేవుఁ డుండఁగ = ఏటి కింక వెరవ వలయు - నెప్డు నాకుఁ బండుగ -యభయ - మభయ - మభయ ॥దేవుఁడే॥

- పంతగాని పరదేశి

# 406 క్రీస్తుని వెంబడించుట

రా – కమాను తా–ఆది

మనసు నిచ్చి వినుమా – మది ననుసరించి చనుమా ॥మనసు॥

1. అరయ యేసు సిలువ – యది – అమరపురికి త్రోవ = ఆ రమ్యమైన త్రోవ – యది యనుసరించినావ – అది యరసి చూచినావ? ॥మనసు॥
2. అది నడచి నడచి పోను – ఆనందమిచ్చి చనును = అది యేసు సిలువ మ్రాను – అది యనుసరింపదగును – అది యందరు చనదగును ॥మనసు॥
3. రక్తమయపు బాట – నీ – ముక్తికదియె యూట = భక్తులందరి యెదుట సద్భక్తి మెరయు పాట – లనురక్తి బాడెదరచట ॥మనసు॥
4. ఎంత పాపమైన – మదికెంత భారమైన = ఎంత దయయోగాని – యది ఎంత కృపయొ గాని – అతి శాంతి నిచ్చులోన ॥మనసు॥
5. సాటిలేనిదారి – మన – స్వామిచూపుదారి = మేటికల్వరిదారి – జనకోటి దుర్గుణహారి – మనకోటకు రహదారి ॥మనసు॥
6. వలదులోకమేల – నీ – వలపు నా కికేల = నిలువుమింక చాలు – నని బిలుచు యేసుమ్రోల – నే గొలుతు కాలమెల్ల ॥మనసు॥

–చెట్టి భానుమూర్తి

# 407 *What a friend we have in jesus*

1. ప్రీతిగల మన యేసుc
డెంతో గొప్ప మిత్రుcడు
మితిలేని దయచేత
హత్తుచుc బ్రేమించును
క్రీస్తునొద్ద మన భార
మంత నప్పగించినన్
శక్తిగల యేసుచేత
మోcత లెల్ల వీడును

2. నీతిగల మన యేసు
ధృతిగల మిత్రుcడు
మృతిc బొంది కృపతో వి
శ్రాంతి కలిగించెను
భీతి నొందుc బాపు లైనc
జింతాక్రాంతులైనను
క్రీస్తు యొక్క దీప్తి చేత
క్రొత్త గతిc జూతురు



3. దయగల మన యేసు
ప్రియమైన మిత్రుcడు
మాయలోకమందు నిజా
శ్రయుcడై కాపాడును
భయ దుఃఖ శ్రమ లాది
మోయరాని బాధలన్
జయ మొప్ప నేర్పి యేసు
స్థాయి వృద్ధిచేయును.

4. ధారుణిలో యేసుగాక
వేరుగొప్ప మిత్రుcడా?
పరలోకమందు యేసే
వీరుడౌ రక్షకుcడు
నారకుల! గావ వేగc
గ్రూర హింసc బొందెను
కరుణించి నిచ్చి ప్రతి
ప్రార్థన నాలించును.

– జోసెఫ్ మెడ్లికాట్ స్ట్రీవెన్

# 408 *Jesus, Lover of my soul*

1. యేసూ, యాత్మ ప్రియుcడా
నిన్ను నాశ్రయించితి
లేవcగాc దరంగముల్
గాలివాన కొట్టcగా
లోకబాధ లన్నిcటన్
నన్ను దాcచు రక్షకా
రేపునకు నడ్పుము
నాదు యాత్మన్ బ్రోవుము

2. దిక్కు లేని యాత్మకు
వేఱె ప్రాపు లేదిcక
ఒంటిగాను విడ్వక
నన్ను నాదరించుమీ
నిన్నె నమ్మి యుంటిని
నీవె నా సహాయము
కాపులేని నా తలన్
కాయుమా నీ నీడను

3. క్రీస్తు నిన్నెc గోరుదున్
దొర్కు నన్ని నీ కడన్
పడ్డ హీను నెత్తుమీ
స్వస్థపర్చు రోగులన్
న్యాయశుద్ధ నామము
నీదె, నేను పాపిని
నేను పాపపూర్ణుcడన్
నీవు ప్రేమారూపివి

4. పాపమెల్ల మాన్పcగా
నీదు ప్రేమ చాలును
మాన్పు నీళ్లు నాయెదన్
శుద్ధి చేయcగా నిమ్ము
నీవు బ్రత్కు టూటవు
త్రాగనిమ్ము నీదరిన్
పుట్టి నాదు నాత్మలో
నెల్ల ప్రొద్దు పారుమీ

– చార్లెస్ వెస్లీ

అను :బి.న్యూవెల్

## 409 *Rest of the weary*

1. మా శ్రమ లన్ని తీర్చితివి
మాకు విశ్రాంతి నిచ్చితివి
మహిమ నీకుఁ గల్గెడును
మిత్రుఁడవైన రక్షకుఁడా!

2. సందియ మంతఁ దీర్చితివి
పూర్ణ విశ్వాస మిచ్చితివి
మహిమ నీకుఁ గల్గెడును
మిత్రుఁడ వైన రక్షకుఁడా!

3. కన్నీళ్లు నీవు తుడ్చితివి
మాకు సంతోష మిచ్చితివి
మహిమ నీకుఁ గల్గెడును
మిత్రుఁడవైన రక్షకుఁడా!

4. నీ చరణంబు నమ్మితిమి
కరుణఁ జూపి బ్రోచితివి
మహిమ నీకుఁ గల్గెడును
మిత్రుఁడ వైన రక్షకుఁడా!

–జాన్ మాన్సెల

అను : బర్నార్డ్ లూకా

## 410 *Art thou weary, art thou languid?*

1. అలసటపడ్డ నీవు
దేవోక్తి విను
రా, నా యొద్ద, సు విశ్రాంతి
పొందుము

2. నేను చూచు గుర్తు లేవి,
వాని కుందునా?
'ప్రక్కఁ గాలుసేతులందు
గాయముల్'

3. రాజుఁబోలి కిరీటంబు
వాని కుందునా
'యుండుగాని ముండ్లచేత
నల్లిరి'

4. నన్ను c జేర్చుకొమ్మనంగc
జేర్చుకొనునా?
'ఔను లోకాంతంబు దాఁక
చేర్చును'

5. వాని వెంబడింతు నేని
యేమి లాభము?
'పాప దుఃఖ కష్టములు
వచ్చును'

6. చావుమట్టు కోర్తునేని
ఏమి యిచ్చును?
'సంతోషంబు సౌఖ్య మింక
మోక్షము'

–జాన్ మేసన్ నీ

# దైవసహాయము - నడిపింపు

## 411 దైవసన్నిధి

రా – యదుకులకాంభోజి (చాయ : తనువు నాదిదిగో) తా–త్రిపుట

ఓ దేవ నేను నీ – దాపున నుండెదన్ – నీ దాపున నుండెదన్ = నా దేవ నను లేపు – నవి సిల్వ శ్రమలైనన్ – నీ దాపున నుండు – నీ సేవకుని పాట ॥ఓ దేవ॥

1. బాటసారి లాగు – నేఁడు భానుఁడు గ్రుంకి – మేటి చీఁకటి గ్రమ్మినన్ = నేటి విశ్రాంతికిఁ – జోటు బండయైనన్ – మాటిమాటికిఁ గలలో సూటిగా నినుఁదలఁతు ॥ఓ దేవ॥

2. ఆకాశ మండల – మార్గంబు నెప్పుడు – నా కీవు చూపించుమా = నీ కూర్మిచే నాకుఁ – జేకూరు నంతయు – లోకేశ్వరా దూత – లే కోరి ననుఁ బిలువ ॥ఓ దేవ॥

3. నీకు స్తోత్రము చేసి యపుడు నా మదిలోని – ప్రాకటంబగు నెనరుతో = భీకరము లైన – శోకంబు లను రాళ్లన్ – నీకు నాలయంబు – నేఁగట్టె దను గర్తా ॥ఓ దేవ॥

4. సంతసంపు రెక్క – లెత్తి నాకమునందు – నెంత పైకి లేచినన్ = వింతగ జ్యోతుల – వితతి మించి నేన – త్యంత మెగసినను నీ – చెంత కేగును బాట ॥ఓ దేవ॥

– మత్తయి సమూయేలు

## 412 దైవసహాయము

రా – మధ్యమావతి (దావీదు కీర్తన 121) తా–ఏక

కొండల తట్టు నేఁ – గోర్కెతోడ నాదు కన్ను లెత్తెద నిప్పుడే = దండియౌ సహాయ మెచటి – నుండి నాకు వచ్చునో – యండయౌ ప్రభునిచే స – హాయంబు కలుగును ॥గొండల॥

1. ఆయన భూమ్యాకాశము – లన్నిటను సృజించెఁగా = యాయన యికఁ దొట్రిల్ల – నీయఁడు నీ పాదముఁ ॥గొండల॥

2. నిన్నుఁ గాపాడు వాఁ డెన్నఁడును గున్కఁడు = పన్ను గ నిశ్రాయేల్ గా - పాడు వాఁడు కున్కఁడు ॥కొండల॥

3. నీకు యెహోవాయే - నిజముగాఁ గాపగు = నీ కుడిప్రక్కను బ్రభుం డు - నీకు నీడగా నగుఁ ॥కొండల॥

4. ధాత్రిఁ బగు లెండ దెబ్బ - రాత్రి వెన్నల దెబ్బయే = మాత్ర మైనను నిన్ను - మార్కొనంగఁ జాలవు ॥కొండల॥

5. ఏ యపాయమును రా - నీయకుండ నా యెహోవ = పాయక నినుఁ గాచును నీ - ప్రాణముఁ గాపాడును ॥కొండల॥

6. మోదంబుతో నిది - మొదలుకొని నిత్యమున్ = నీదు రాక పోకలందు - నిను యెహోవా కాచును ॥కొండల॥

7. జనక కుమారాత్మకును - ఘనత మహిమ కల్గును = మును పిపుడెల్లప్పుడు యుగ - ముల కగుఁ గా కామేన్ ॥కొండల॥

-మల్లెల దావీదు

## 413 యేసు తోడైయున్నఁ జాలును

రా - బిలహరి తా-త్రిపుట

నీవు తోడై యున్నఁజాలు - యేసు - నిత్యము నాకది మేలు = నీవు ధరణినుండు - నీచపాపుల నెల్లఁగావఁ బ్రేమ వచ్చి - ఘన ప్రాణ మిడినట్టి ॥నీవు॥

1. నినుఁ బోలు రక్షకుం డేడి - క్రీస్తు - ననుఁ బోలు పాతకుం డేడి = నిను నమ్ము వారలకు - నీ వొసఁగుచుందువు - తనరఁ పాపక్షమ - దయచేత నిలలోన॥నీవు॥

2. నీ పాటి బలవంతుఁ డేడి - ప్రభు - నాపాటి దుర్బలుం డేడి = కాపాడు చుందువు - కలకాలమును నీవు -నీ పాద సేవకుల - నీనేర్పురంజిల్ల ॥నీవు॥

3. నీవంటి యుపకారి యేడి - కర్త - నావంటి కడు దీనుఁ డేడి = జీవుల కును గల్గు - జీవంబు లిచ్చుచు - జీవాధారము లొసఁగి - జీవులఁ బ్రోచెడి ॥నీవు॥



4. నీవంటి ధనవంతుఁడేడి - యేసు - నా వంటి ధనహీనుఁ డేడి = ప్రోవులై యున్నవి - యీవులు నీయందు - నీవువాని నొసంగి నిరతంబు ననుఁ గావు ॥నీవు॥

- పులిపాక జగన్నాధము

## 414 యేసుని ప్రేమ

రా - ముఖారి తా-ఆది

నీవే నా ప్రియుఁడవు - యేసు ప్రభు - నీవే నా యొడయుఁడవు = నీవే యనాది - దేవ పుత్రుండవు - నీవే లోక మెల్ల - నేర్పుగఁ జేసితివి ॥నీవే॥

1. పరమందు నీకుండు - పరమభాగ్యంబులు - నరకాయత్తుఁడ నైన - నా కొరకు విడిచితివి ॥నీవే॥

2. నీవే ననుఁ బ్రోవ - నెనరు నేతెంచి - నీవొలుక బోసితివి - నీ నల్ల సిలువపై ॥నీవే॥

3. నేనెవరిఁ బ్రేమింతు - నీ కంటె లోకమున - నే నెపుడు మరువను - నీ ప్రేమ నాకర్త ॥నీవే॥

4. నీ సేవ నేఁ గోరి - నిన్నే ప్రతిపరతు - నీ సేవకుఁడ నైన - నే నెట్లు నిను విడుతు ॥నీవే॥

5. సకలంబు నేలెడి - చక్కని రాజవు - సకలాధికారంబు - చక్కఁగం చేయుదువు ॥నీవే॥

6. నీ సేవకుల నెల్ల - నేర్పుగా నేలెదవు నీ సేవకులు పొంద - నిత్య సహాయంబు ॥నీవే॥

- పులిపాక జగన్నాధము

## 415 దేవుని నాశ్రయించుట

రా - కాపి తా-ఆది

ఓ దేవా నన్నుఁ బ్రోవ - నీదె భార మయ్య రావే ॥యో దేవా॥

1. స్వామి స్వామి యన నా భారం - ప్రేమఁ జూపను నీ భారం = పామరుఁ డ నన నా భారం - పాపిం బ్రోవను నీ భారం ॥బో దేవా॥

2. నెనరు తండ్రి యన నా భారం – ననుఁ గనులఁ జూడను నీ భారం = నిన్నే నమ్మ నాదు భారం – నన్నెపుడు కావ నీ భారం ॥బో దేవా॥

3. కరుణ సాగర యన నా భారం – కరుణం జూపను నీ భారం = శరణని వేడను నా భారం – సంతరింప నీ భారం ॥బో దేవా॥

4. మనవి సేయ నాది – భారం తనవిఁ దీర్పను నీ భారం = నిను మది దలఁప గ నా భారం – నన్ను గా వనీ భారం ॥బో దేవా॥

–ఎస్ ఎస్ షేతు

## 416 క్రీస్తు విశ్వాసుల కాశ్రయము

రా – ఖరహరప్రియ (చాయ : మానవుల మేలుకొరకు) తా–రూపకము

నాథ యేసు నాథ క్రీస్తు – నాథ – నేననాథ = సాధు జనులఁ బ్రోచు –సదయు నీ దయ కాదా ॥నాథ॥

1. గతిఁ దలఁపని మూర్ఖచిత్త – గమనుఁడనేఁ గానా = సతతమునను గరుణఁ బ్రోచెడు – గతియ నీవు కావా ॥నాథ॥

2. పాపమందు జననమైన – పామరుండ నేఁగానా = దాపు జేరి వేఁడెద నా – ప్రాపు నీవు గావా ॥నాథ॥

3. కుటిల బుద్ధిగల వాఁడను –క్రూరుఁడ నేఁగానా = కటకట ననుఁ గని కరించు – కరుణ నీది గాదా ॥నాథ॥

4. ఆది కర్త వీవు గావె – యఖిల లోకమునకును = బీదవారి నెల్లఁ బ్రోచు – బిరుదు నీది గాదా ॥నాథ॥

5. సారమైన సత్యశాస్త్ర – సార మీవు గావా = ఘోరమైన పాపి జనులఁ – గోరి పిలువ లేదా ॥నాథ॥

6. జీవ నాధారమైన – త్రోవ నీవు గావా = దేవదేవ యెహవా నా – దిక్కు నీవు గావా ॥నాథ॥

–పసుపులేటి దావీదు



## 417 యేసు మన ఆశ్రయ రక్షకుఁడు

రా – ముఖారి (చాయ : ఉన్నపాటున) తా–త్రిపుట

నాకై చీలిన యుగ యుగముల శిల ముక్తి – నా కిమ్ము శ్రీ యేసువా = లోక రక్షక నన్ను నీ లోపల దాగి – వీఁకతోడను నుండనిమ్ము సద్గుణ శీలా॥నాకై॥

1. చీలఁబడిన నీదు ప్రక్క విడిచి పారు – జాలు జలము రక్తము = చాల నా పాపపు తీర్పు పాపబలమ్ము – చాలు రూపును మాపి నన్నుఁ బావనుఁ జేయు ॥నాకై॥

2. నీదు న్యాయంబగు ప్రామన్య విధులను – నాదు సత్కృతి తృప్తిగా = నాదరింపవు పారమార్థకమైనట్టి – నాదు నాసక్తి బాష్పమును బారిన నాకు ॥నాకై॥

3. నేను జేసిన పాపములఁ ద్రుంప నెవరిని – గాన నేరను యేసువా = దీనుఁడనై వచ్చి నీ మేటి సిల్వను – మానక నే హత్తుకొనియెద సచ్చరిత ॥నాకై॥

4. కట్టఁ బుట్టము లేక పుట్టముకై యాశ – బుట్టి నీ యెడ వచ్చితి = నెట్టి సహాయము లేక నీపై మదిఁ – బుట్టి నీ సత్కృపఁ బొందఁజూచెద నయ్య ॥నాకై॥

5. పరమకల్మషుఁడనై నే నీటి బుగ్గకుఁ –బరుగు లెత్తెద నిప్పుడు = పరమ పావన నన్నుఁ గడుగుము లేకున్న – మరణ మొందుదు నేను ఘోర పాపవిదూర ॥నాకై॥

–తటవర్తి నారాయణస్వామి

## 418 ముక్తిఁ గనుట

రా – భూపాళము (చాయ : మేలుకొనరే) తా–అట

ముక్తిఁ గనరే

ముక్తిఁ గనరే మీ మనంబుల – శక్తిగల రక్షకుని పలుకులు = ముక్తిసాధనములకు మూలము – భక్తిగొని యానంద మొందరే ॥ముక్తి॥

1. పాపభారము క్రింద శ్రమపడు – పాపులారా రండు నేనే = ప్రాపు నెమ్మది మీకిడుదునని – పరమరక్షకుఁ డాన తిచ్చెను ॥ముక్తి॥

2. ఇచ్ఛయించెదు వాఁడు యిచటికి – వచ్చి జీవజలంబు రుచిగా = పుచ్చు కొనుగా కనుచుఁ బల్కెను – సచ్చరితుఁడు మనుష్య పుత్రుఁడు ॥ముక్తి॥

3. ఆకసమునందుండి యిటు దిగి – లోకమునకుఁ జీవము నొసఁగునది = ఈ కడనె యున్న దది నేనను – యేసు ప్రభు వాక్కు మధురాన్నము॥ముక్తి॥

4. నేనె మార్గము నేనె సత్యము – నేనె జీవము నావలననే = గాని యెవఁడును తండ్రి యొద్దికి – రానలవిగాదని వచించెను ॥ముక్తి॥

5. జీవజలము నుద్రావుటకు మీ – భావన లనెడి పాత్ర ముంచుచు = చేవఁ గొని పానించుచు నిరత – జీవమును వెలుఃగొంది బ్రతుకను ॥ముక్తి॥

6. ఎక్కడను యిటువంటి ప్రభువును – మక్కువను వేసారి వెతకిన = చిక్కఁబో డిటువచ్చి జూడుడి – గ్రక్కునను జేసట్టు డిప్పుడే ॥ముక్తి॥

## 419 యేసు నా ఆత్మ ప్రియుఁడు

రా – ఆనందభైరవి (చాయ : యేసు నామమే పావనము) తా–అట

యేసూ నా యాత్మ రక్షకుండ – నన్ను – వాసిగా నీ రొమ్మున నుండఁ = జేసియు జల – రాసులను నీవు – తీసివేయుము – మోసములఁ ద్రోసి ॥యేసూ॥

1. జీవబాధ నే దాఁటుదాఁక – నన్ను – నీవె దాఁచము నా రక్షక = రూపునకు నడ్పి – ప్రోవు మో యేసు – దేవ యాత్మను – జీవమును జేర్చు ॥యేసూ॥

2. ప్రాపు లేని నా యాత్మన్ నీవు – నీదు – దాపునకుఁ జేర్చి ప్రోచి కావు =మో పరమాత్ముఁడా – యోపికతోఁ జూచి – యాపదలఁ బాపి – యాదరించుము ॥యేసూ॥

3. నా నమ్మకము నీ యందున్నది – నీలో –నేను గోరు సాయంబున్నది = గాన నేఁ బ్రాపు – లేని నా తలను – బూని రెక్కల – లోన గప్పుము ॥యేసూ॥

4. యేసు నీవే నాకు సర్వము – నీదు – దాస జనుల లేవనెత్తుము = నీ సుబల మిమ్మో – యేసు రోగులకు – వాసిగాఁ జీకు వారలను నడ్పి ॥యేసూ॥



5. నావంటి ఘోరపాపి యేడి – యేసు – నీవంటి పరిశుద్ధుఁ డేడి = కేవలము సత్య – భావముతో నిండి – నీవు కృపగల – దేవుఁడవు స్వామి ॥యేసూ॥

6. నీదు కృపా బాహుళ్యమందు – యేసు నాదు పాపము గప్పుకొందు = సాదరం బగు – నీదు మాటల – మోదమున శుద్ధి – పాదుకొననిమ్ము ॥యేసూ॥

7. నీవు నిత్యజీవపు టూటవు – నాకు – జీవజలంబు నిచ్చి కావు = మీపు నా యెదలోఁ గావఁగ లేచి – జీవపదవికిఁ ద్రోవ దీయుమా ॥యేసూ॥

– మత్తయి సమూయేలు

## 420 క్రీస్తు కరుణయం దాశ్రయించుట

రా – ముఖారి తా–అట

యేసు కరుణ – యిదియే మా శరణు – యేసు కరుణ ॥

1. యేసుని కరుణ – యిదే మాకు శర ణని – యాసతో నమ్మిన – యధముల కెల్ల ॥యేసు॥

2. ఎన్నిక సేయక – యే పాపి నైనను – మన్నించి బ్రోచెదు – మా దేవుఁడైన ॥యేసు॥

3. పశ్చాత్తాపము నొందు – పాపుల నెల్లను – నిశ్చయముగఁ బ్రోవ నిపుణుఁ డై యున్న ॥యేసు॥

4. దిక్కు లేకున్నటి – దీన జనాత్ములఁ – జక్కఁగఁ బ్రోచెదు – సదయుఁ డైయున్న ॥యేసు॥

–మిక్కిలి సమూయేలు

## 421 యేసు శరణుజొచ్చుట

రా – కేదారగౌళ తా–త్రిపుట

శరణుఁ జొచ్చితి యేసునాథుఁడ – శక్తిహీనతఁ గల్గె నా = దరణ మిమ్మిల నెవ్వఁ బొందితి – దవ్వుసేయక కావవే ॥శరణు॥

1. కరుణఁ జూడుము కన్న తండ్రివి – కల్మషం బెడఁబాపవే = మరణ మొందక మున్ను నన్నిల – మార్పు నొందఁగఁ జేయవే ॥శరణు॥

2. మొరను జెచ్చెర నాలకించుచు – మోము నా దెసc జూపవే = యురు పదంబుల సేవc జేసెద – నుద్ధరించుము కూర్మితో ॥శరణు॥

3. తామస క్రియలందు వాంఛలు– తాకకుండగc జేయవే = క్షేమమైన సువార్త బోధల – సిద్ధపడి – విననీయవే ॥శరణు॥

4. శ్రమలు చాల కల్గి యున్నను – సైcప నేర్పుము సత్కృపన్ = గమిలి పోయెడి మాయ లోకపు – గాంతి నీరస మంచు నీ ॥శరణు॥

–మిక్కిలి సమూయేలు

## 422 మంచికాపరి

రా – కమాసు (చాయ :కొనియాడcదరమె) తా–ఆది

యెహోవ నా కాపరి – యిcకc గొదు వేమి ॥యెహోవా॥

1. పచ్చిక చోట్లలోc – బండc జేయును నన్ను = స్వచ్ఛజలముల కడకుc – జక్క గా నడిపించు ॥యెహోవా॥

2. ఆయన దయతో నా –యా యాసములc దీర్చి = న్యాయమార్గములందు – ననుc బట్టి నడిపించు ॥యెహోవా॥

3. గాఢాంధకార మా – ర్గమున నేc దిరిగినను = గాఢంపు గృపతోడc గరుణించు నన్నెపుడు ॥యెహోవా॥

4. నీవు తోడై యుండ – నిర్భయం బగు నాకుc = కావవచ్చును దుడ్డు – కఱ్ఱయును దండంబు ॥యెహోవా॥

5. నా శత్రువుల నడుమ – నాకు భోజన మొసcగి =యాశ తీరంగc ద–లంటె నూనెను బోసి ॥యెహోవా॥

6. నా గిన్నె నిండెను – నా బ్రతుకు దినములలో = బాగుగా నీదు కృ – పా దయలు వెంటాడు ॥యెహోవా॥

7. పరమానందముతోడc – బ్రభు సన్నిధానమునc = పరిశుద్ధాలయమందే నిరతంబు నివసింతు ॥యెహోవా॥

–మల్లెల సొలొమోను జార్జి



## 423 యేసు సర్వశక్తుడు

రా – జంఝూటి (చాయ :యేసునాధ కథాసుధారస) తా–చూపు

సర్వశక్తుcడ నిర్మలాత్ముcడ – సర్వజనసంరక్షకా – మా = సర్వపాపముc బరిహరింప నీ – సర్వమహిమను విడితివా ॥సర్వ॥

1. నిత్యనాశనమగ్నులగుమా – నిత్యశాపముc బాపి మరి – నీ = నిత్య జీవము మాకునీయను – మృత్యు బాధలు పడితివా ॥సర్వ॥

2. పాపమరణపు బంధకములనుc – దెంపి మము విడిపించుటకు – మా = పాపమును భరించి మాకై – యాపదల పాల్పడితివా ॥సర్వ॥

3. మెట్టుకీబలు దుష్టులనుచే – పట్టి జీవము నిచ్చితివి – కా = బట్టి యిcక నీ కట్టడలలో – దిట్టముగ బలపరుచుమీ ॥సర్వ॥

4. సత్యవిధులలో నడువనే న–శక్తుcడనో రక్షకా – నీ = భృత్యునికి శక్తి నిత్యమిడి నడి – పింపు నీ ఘనసేవలో ॥సర్వ॥

5. నీదు నామము మహిమపరుచను – నాదు జీవితకాలమున – బహు = సాధు నిగ ననుc జేసి సాయము – నాధుcడా నాకీయుమా ॥సర్వ॥

6. ప్రస్తుతము పరదేశినై – ప్రచురంబుcజేతు నీ స్తోత్రముల్ – పర = వస్తు ఘనరాజ్యంబుకొరకై – వాస్తవముగ నిరీక్షింతున్ ॥సర్వ॥

7. ముక్తినుంచి నీవు రాగా – శక్తితోc ప్రభు యేసువా – యా = సక్తితో నినుc గూడుకొని బహు – యుక్తస్తోత్రముల్ జేతుము ॥సర్వ॥

– చదలవాడ జోనా

## 424 యేసు మన యాశ్రయము

రా – సావేరి తా–కురుజంపె

శరణు శరణు యేసు దేవా – నన్ను c – గరుణింపవే నిత్య జీవా = పరమ దేవుని తనూ – భవుcడవై ధరణిలో – నర రూపమైతివి – నరులను రక్షింప ॥శరణు॥

1. దైవోగ్రమునకుc బాత్రుcడను – విమల – భావమునకే నసహ్యుcడను = గావరించిన పాప – కర్ముcడన్ కఠినుcడన్ – జానవలసిన యట్టి స్వామి ద్రోహు డ నయ్య ॥శరణు॥

2. మద మత్సరమ్ములు మెండై - నాదు - మది నాక్రమించెను నిండై = సదయుండ నీ దివ్య - సర్వాజ్ఞలన్ మీరి - విదితముగc బాపముల్ - వేడ్కను జేసితి ॥శరణు॥

3. మోసంబులోc జిక్కి చాల - నేను - దోసంబు చేసితినిల = యేసు నాధుని సిలువ - నేమాత్రమైన నే - నాసతోc జూడని - యన్యాయ పరుcడను ॥శరణు॥

4. నెమ్మ దించుక యైన మదిలో - లేక - గ్రమ్ముకొని యఘము నా యెదలోc = ద్రిమ్మరినై భువిన్ - దిరిగి వేసారcగ సమ్మతము దొరక దో - సర్వేశ నీకంటె ॥శరణు॥

5. నా తండ్రి యో యేసునాధా - నిన్ను - ఘాతcజేసిన దేనుగాదా = నీతిమాలిన పాప - నీచుcడన్ దుష్టుcడన్ - నా తప్పు క్షమియించి నన్నేలి రక్షించు ॥శరణు॥

6. కడుదయా శాంతస్వభావా - నన్ను - దడవుజేయక యేలుకోవా = యొడబడి కుజనులకై - యోర్చియలసటను - బడి జీవమిడినా - ప్రాణ రక్షక కావు ॥శరణు॥

- మిక్కిలి సమూయేలు

## 425 *Master, speak, Thy servant hearth*

1. నాధా! సమయేలు రీతి
నీ యామోద శబ్దము
సేవకుcడ నైన నన్ను
నాతో డాలకింపనీ
నాతో నీవేమందువో
నే నాలించువాcడను.

2. నీ మాట గ్రహించునట్లు
దానిc దేటపర్చుము
నిన్ను వెంబడించునట్లు
నిబ్బరింపc జేయుము
నేను నీదు గొఱ్ఱెను
'బండ నీడలో మేపు'

3. నేను స్వల్పశిష్యుడను -
నన్ నిరాకరింపకు
నిన్నాలింప నెంత యాశ
నీ వెఱింగి యుందువు
ఆత్మ యక్కరల్ తీర్చు
ధన్యుcడన్ నే నౌదును

4. నాధా, నీ శబ్ద మాలింప
నన్ను సిద్ధపర్చుము
నీదుమాట లక్ష్య పెట్టి
నిత్యసేవc జేయనీ
నాతో నీవేమందువో
నే నాలించువాcడనే.

-ఫ్రాన్సెస్ రిడ్లీ హవర్గల్
అను : ఎచ్. హెన్రీ డేవిడ్



## 426 *Down in the valley*

1. నా రక్షకుని వెంబడింతు నన్నిటన్
ఘోరమైన కొండలైన జంకొందను
సురక్షితంబుగాను నేను వెళ్లుదున్
బరమ కిరీట మొందువరకు.
॥యేసున్ నేను ఎన్నc డెన్నడును
ఆసతో నన్నిటన్ వెంబడింతును
భాసురంబౌ ప్రభు వెంట కన్నుల్
మూసికొని యెక్కcడేని వెళ్లుదున్॥

2. నా యేసు తోడ వెళ్లుచుందు
నెల్లడన్
ప్రయాసమైన లోయలైన భయ
పడన్
దయc జూపు యేసు నన్ను వెం
డించుచో
భయ మేల భువనంబులోదగన్

3. నా కాలమెల్ల యేసునందునమ్ము
దున్
భీకరంపు వార్ధియైన నేదాటుదున్
నా కర్తతోడ నెందునైన నేగుదున్
నాక మెక్కితండ్రి c చువరకున్.

-విలియం ఆర్కట్ కషింగ్
అను :ఆల్ఫ్రెడ్ త్యాగరాజు పామర్

## 426 *I need Thee every hour*

1. యేసూ, నా ప్రభువా,
నీ ప్రేమ లేకున్న
నా యాత్మ కేదియు
విశ్రాంతి నియ్యదు.
॥ఒక్కొక్క గంట నేను
నిన్నాశించుకొందు
నీ యాశీర్వాద మిమ్ము
నా రక్షకుcడా॥

2. యేసూ, రేబగుళ్లు
నా యొద్ద నుండుము
నాతో నీవుండిన
నే భయ ముండదు.

3. సుఖంబుc బొందcగా
నిన్నే యాశింతును
దుఃఖంబు నొందcగా
నీవే శరణ్యము.

4. నీ మార్గమందున
నే నడ్వ నేర్పుము
నీ మాట చొప్పున
నన్నున్ దీవించుము.

5. నిన్నే యాశింతును
యేసూ, నా ప్రభువా
నీవంటివాcడనై
నన్నుండc జేయుము.

- ఏనీ షెర్వుడ్ - హాక్స్
అను : బర్నార్డ్ లూరాఫ్

## 428 *Lead, Kindly Light*

1. ఓ దివ్యకాంతి, మబ్బు కమ్మఁగా
నన్నడ్పుము
నాయింటి త్రోవ దప్పిపోతిని
నన్నడ్పుము
నాకాళ్ల జారకుండఁ గాచుచు
ఒక్కొక్క మెట్టు భద్ర పర్చుమా
2. ఇన్నాళ్లు నేను కోరకుంటిని
నీ శరణు
స్వబుద్ధి నమ్మి తప్పిపోతిని
సదా.
నన్నడ్పుము
గర్వము యేలె నా హృదయము
మన్నించు నా గత జీవితము
3. ఇన్నాళ్లుఁ గాచియుంట వింకను
నన్నడ్పుము
నా నష్ట కష్ట దుఃఖ బాధలు
పోఁగొట్టుము
నీవల్ల నేను జయ మొందుచు
నిన్ను స్తుతించి పాడుదున్ సదా

– జాన్ హెన్రీ న్యూమేన్
అను : జేకబ్ చేంబర్లేన్

## 429 *Guide me, O Thou Great Jehovah*

1. నడ్పుమీ, మహా యెహోవా
లోక యాత్ర యందున
నీదు శక్తి నాకు దిక్కు
నన్ రక్షింపఁ జేఁపట్టు
దివ్య మన్నా, దివ్య మన్నా
నా కాహారమై యుండు.
2. ఊటగా స్వచ్ఛజలంబు
బండనుండి పారనీ
అగ్ని మేఘ స్తంభాలచే
నడవిన్ నన్ దాఁటించుఁ
గొప్ప ప్రాపూ, గొప్ప ప్రాపూ
నాకు డాలవు సదా.
3. యొర్దాన్ నది దాఁటు వేళ
భీతు లెల్లఁ బాపుము
మృత్యు శ్రమ లన్ని నన్ను
క్షేమ కానాన్ జేర్చును
స్తుతి గీతి, స్తుతి గీతి
నీ కర్పింతు నిత్యము

– విలియం విలియమ్స్
అను : ఎచ్. హెన్రీ డేవిస్



## 430 *Jesus, still lead on*

1. జీవమార్గమున్
యేసూ, చూపవే
నీవు మాకు ముందు వేగ
వెంట వత్తు మేము వేగ
తండ్రి యింటికే
మమ్ము నడ్పవే
2. హింస కల్గిన
మమ్ము గావుమా
మమ్ము కష్టకాలమందు
నాదరించు భూమియందు
మింటిత్రోవలో
మమ్ము నడ్పవే.
3. సొంత వేదనన్
చింత కల్గినన్
అన్య హింసఁ గూర్చి యేడ్వ
మమ్ములన్ సహింపనిమ్ము
మేము సత్యమున్
చూడ నేర్పవే.
4. మా ప్రవర్తన
చక్కపర్చుమా
మాకు నెట్టి హింసలైన
నీ సహాయ మిచ్చి, నేటి
యాత్రకాఁగానే
తలుపు దీయవే.

–నికొలాస్ జింజెండార్ఫ్
అను : వి. గియోనింగ్

## 431 *He leadeth me, O blessed thought*

1. ఆహా నాకేమానందము
శ్రీ యేసు నాచేఁ బట్టుచు
సహాయుఁడై నాయన్నిటన్
సజీవుఁడై నడుపును.
॥నా దారిఁ జూపును యేసు
నా చేఁబట్టి నడుపును
ఎన్నఁడు నెడబాయఁడు
యేసె నా దారిఁ జూఁపును ॥
2. యేదే స్సుఖంబు లైనన్
సదా విచార మైనను
బాధాంధకార మైనను
ముదంబుతోడ నుందును.
3. చింతేల నాకు నీ దయన్
సంతత మీవు తోడుగాన్
బంతంబు నీచేఁ బట్టుచు
సంతృప్తితో నే నుందును.
4. నా చావు వేళ వచ్చినన్
విచార మొందక ధృతిన్
నీ చేయి బట్టి యేసుఁడా
నీ చారు మోక్ష మెక్కుదున్

–జె ఎచ్ గిల్మోర్

## 432 *Saviour, like a Shepherd lead us*

1. యేసు, మమ్ము నడిపించు
నీదు కాపు కావలెన్
నీవు మమ్మును బోషించు
మమ్ముc జేర్చు మందలోన్
యేసునాధా, ప్రియనాధా!
మమ్ము విమోచించుమా.

2. మమ్ము నాదరించు యేసూ
మాకు పాలకుండవు
పాప మార్గమందు నుండి
ప్రేమతో! దప్పించుమీ
యేసునాధా, ప్రియనాధా!
మొఱ్ఱ నాలకించుమా.

3. బీద పాపు లైన మమ్ము
నీ వంగీకరింతువు
మమ్మును బవిత్రపర్చి
మమ్ము విడిపించుమీ
యేసునాధా, ప్రియనాధా!
నిన్ను నాశ్రయింతుము

4. బాల్యమందు నిన్ను c జేరి
నిన్ను హత్తుకొందుము
ప్రియ రక్షకుండ, యేసూ
నీ ప్రేమc జూపుమా
యేసునాధా, ప్రియనాధా !
మమ్మింకc బ్రేమించుమా.

*అను : జేకబ్ చేంబర్లేన్*

# సహవాసము

## 433 క్రైస్తవానుభవము

రా – శంకరాభరణము　　　　తా–అట

యేసు నామం బెత్తి పాడుదమ = క్రీస్తు దాసులతో c బొత్తుc గూడు దమ ॥యేసు॥

1. ఇహసంబంధుల పొందుc జాలింతమ = మహా – మహుcడౌ దేవుని యాజ్ఞc బాలింతమ ॥యేసు॥

2. శుభవార్తము లన్ని శోధింతమ = యేసువిభు సత్యమిలలోన – నుభవింతమ ॥యేసు॥

3. దోషములను బైటc బెట్టుదము = కపట – వేషభాషలc గ్రుంగc బట్టు దమ ॥యేసు॥

4. మన రక్షకుని పాట్లు మది నెంతమ = మనసు – లోపలి గర్వము లణుపుదమ ॥యేసు॥



5. జనుల నిందల కెల్ల నోర్చెదమ = బోధ – కనిపెట్టి ప్రభు చెంత నేర్చ దమ ॥యేసు॥

6. మానావమానముల్ భరియింతమ = యోర్వ – లేని గుణముల వేరుc బెరుకుదమ ॥యేసు॥

7. పరిశుద్ధాత్మను బొంద నడుగుదమ = బుద్ధి – పరమానందము జాడ నడుపు దమ ॥యేసు॥

8. సకల మానవు లాత్మ సరిచూతమ = యింక – మొక మిచ్చకపు మాట ల్విడిచెదమ ॥యేసు॥

9. దినము ప్రార్థనc జేయ గురి యుంతమ = చెడ్డ – మనసు బద్ధకముపై నెదిరింతమ ॥యేసు॥

10. గురు బోధ స్థలికి బిరబిరc బోదమ = బుద్ధి – తిర ముంచి వాక్యార్థ మెఱు గుదమ ॥యేసు॥

*– పురుషోత్తము చౌదరి*

## 434 క్రీస్తు దాసుల సహవాసము

రా – బేహాగ్　　　　తా–రూపకము

యేసు భక్తవరులతో ని – వాసముందమ – యేసుదాసు లౌదమ ॥యేసు॥

1. దోసములను తీగలన్ని – కోసివేతమ –మిగుల – మోసపుచ్చు నాసలెల్ల – రోసివేతమ – యేసుదాసు లౌదమ ॥యేసు భక్త॥

2. దోసిలొగ్గి ప్రభునివేడ – [1]గాసి పడుదమ – వాసిగాను – యేసుమీద నాసపడుదమ– యేసు – దాసు లౌదమ ॥యేసు భక్త॥

3. జారచోర దుష్కృతములు – పారవేతమ – సత్య – సార మెరుగ బరమ గురుని – జేరు కొందమ – యింక – కోరు కొందమ ॥యేసు భక్త॥

4. [2]ప్రాపు లేనివారికెల్ల దా పొసంగును – యేసు – శాపరాసులన్ని తానే యోపి మోసెను – తండ్రి – దాపొసంగును ॥యేసు భక్త॥

[1]బాధ.　[2]దిక్కు

5. శరణుజొ చ్చు నందరకును – దురిత మెంచక – ఘోర – మరణ బాధలెల్ల దీర్చి– పరమొసంగును – స్థిర – వరము లిచ్చును ॥యేసు భక్త॥

6. లోక భోగముల మదిన్ని – రాకరింతమ – ప్రభు – రాక కెదురు జూడ మన – మేక మౌదమ – ఇపుడె యేక మౌదమ ॥యేసు భక్త॥

– డేవిడ్ లైటన్

## 435 మన బంధువులు

రా – నవరోజు తా–ఆది

యెహోవా మా తండ్రి గాఁడ – యేసుఁడు మా యన్న గాఁడ = మహిమ గల శుద్ధాత్మ యిట్టి – వరుసఁ దెలిపెం గద మాతోడ ॥యెహోవా॥

1. మోక్ష నగరు మా పుట్టిల్లు – ముఖ్య దూతల్ మా స్నేహితులు = సాక్షాత్కారమై యున్నపుడు – లక్ష్యపెట్ట మిహ బాధలకు ॥యెహోవా॥

2. అబ్రాహాము దావీదు మొదలై – నట్టి వర భక్తాగ్రేసరులే = శుభ్రముగ మా చుట్టా లైనన్ – హర్షమిఁక మా కేమి కొదువ ॥యెహోవా॥

3. పేతు రాది సకలాపోస్తుల్ – పేర్మిగల మా నిజ కూటస్థుల్ = [1]ఖ్యాతి సభలో మే మున్నప్పుడు – ఘనతలిక మాకేమి వెలితి ॥యెహోవా॥

4. తనువు బలిపెట్టెను మా యన్న – తప్పు ల్విడఁ గొట్టెను మా తండ్రి = మనసులో సాక్ష్యమిట్లున్న – మనుజు లెట్లన్నను మా కేమి ॥యెహోవా॥

5. పరమ విభు జీవగ్రంథములోఁ – బ్రభుని రక్తాక్షరముద్రితమె = చిరముగా నుండు మా పేరు – చెఱుపు బెట్టెదువా రింకెవరు ॥యెహోవా॥

6. కరములతో నంట రాని – కన్నులకు గోచరము గాని = పరమ ఫలముల్ మా కున్నపుడు – సరకు గొన మిక్కడి లేములకు ॥యెహోవా॥

– పురుషోత్తము చౌదరి

[1]ప్రసిద్ధికెక్కిన



## 436 *In the secret of His Presence*

1. నీదు సన్ని ధానమందు
ఓ నా యేసురక్షకా
నాదు నాత్మ చేరి యందు
నెంత తృప్తి పొందును
ఎంత శ్రేష్ఠమైన బోధ
నేను నేర్చుకొందును
నీతి మార్గమందు నడ్వ
నెంత ధైర్య మొందుదున్!

2. లోక ధనాపేక్షయైన
నన్ను మోసపుచ్చుదు
ఇహ దుఃఖబాధ లెన
నన్ను భయపర్చవు
నా విరోధియైన సాతాన్
నన్ను వెంబడించినన్
నీదు సన్నిధానమందు
యేసు నన్ను దాఁగనీ.

3. యేసు శరణంబువల్ల
కల్గు మధురంబును
నీవు రుచిచూడ వాంఛ
నీకుఁ గల్గి యున్నదా?
యేసు శరణంబుఁ జొచ్చు
మిది నీకు లాభము
ఆయన స్వరూప మిట్లు
నీకుఁ గూడఁ గల్గును.

–హెలెన్ లక్ష్మీ గోరె
అను : జేకబ్ చేంబర్లేన్

# పరిశుద్ధత

## 437 పరిశుద్ధత కొరకు ప్రార్థించుట

రా – రేగుప్తి (చాయ : నా యేసునాధా – ననఁ జూడవే) తా–అట

1. రమ్ము శ్రీ యేసూ – సమ్మతి నాదు – మనమున నిలువ = నిమ్ము నా పెదవుల – నీతి అగ్నిచే నంటఁ – గ్రమ్మర నా నత్తి – వదలి నీ కృపఁ బొంద ॥రమ్ము॥

2. నిన్ను స్తుతింతు – నీ కృప నెపుడు – నెన్ని కీర్తింతుఁ = బన్ను గ నీ కృప ని – న్నెన్నఁ దెరుఁగని నరుల – కన్న యేసన్నా నీ – ధన్య రుధిరమె చాలు ॥రమ్ము॥

3. తరమె యెన్నఁగను –దత్కృపను భూ – నభముల నైనన్ = నిరతము నీ ప్రేమ – నీతి పరిమితిచే – ధరఁ దేజో వాసులకుఁ – గలిగించుఁ – గడు వింత ॥రమ్ము॥

4. భవదీయ కృపను – బాగుగఁ జాటి – భువి నీ చిత్తమును = అవిధి నెం చక తీర్చి – యమిత బలముతోడ – నవగతి నీతి కి – రీటంబు నేఁ బొంద॥రమ్ము॥

5. నేను నీ కొరకే – నిత్యము బ్రతికి – నిన్ను గణుతించి = మానుగ 'భళా' యను – మంచి వాక్యము విని – దీన ప్రభుని సమా– ధానములో నేఁ జేర ॥రమ్ము॥

– యేసుదాసు జీవరత్నము

## 438 పవిత్ర హృదయము కొరకు ప్రార్థన

రా –శంకరాభరణము (చాయ : మన మొదటి తలిదండ్రుల్) తా–త్రిపుట

విమల హృదయ మిమ్ము – విదితంబు నినుఁ గొల్వ – యేసునాథా = నీదు
విమల రక్తము చేత – విశదమౌ యెద నిమ్ము – విశ్వనాథా ॥విమల॥

1. అణఁకువ క్షమశాంత – మధికముగ నాకిమ్ము – ఆత్మనాథా = నీకుఁ బ్రణుతమౌ నా యెద – ప్రభునిపీఠము జేయు – మాత్మనాథా ॥విమల॥

2. నీ చిత్తమే యంచు – నీ పాదములఁ బట్టి – నిల్చియుందు = నిందు – నికరమౌ ప్రకటమౌ – సుకరహృదయ మిమ్ము – మేసునాథా ॥విమల॥

3. భయభక్తు లలరెడు – భావంబు నా కిమ్ము జీవనాథా = నన్ను – లయ జీవములయందు – జయశాలినిగఁ జేయు – మేసునాథా ॥విమల॥

4. పరిశుద్ధ హృదయంబు – పరమేశ నా కిమ్ము – ధరణిమీఁద = నన్ని – తరుణములను నాకా – దరణ మీవే యంచుఁ – దలఁప నాథా ॥విమల॥

5. నీ రూపము నిమ్ము – నినుఁ – బోలి నేనుండ – నిత్యనాథా = నీదు – సారూప్య మెదమీద – సంపూర్తిగా వ్రాయు – సత్యనాథా ॥విమల॥

6. ప్రేమపూరిత హృదయ – మేమరక నా కిమ్ము – ప్రేమనాథా = యెంతో ప్రేమమౌ సుమమౌ – నేమమౌ బ్రతుకిమ్ము – క్షేమనాథా ॥విమల॥

–ఆల్ఫ్రెడ్ త్యాగరాజు పామర్



## 439 పరిశుద్ధత కొరకు ప్రార్థన

రా –నాథనామక్రియ (చాయ : నా యేసునాథా – ననఁ జూడవే) తా–అట

సంపూర్ణ పరిశుద్ధి నిమ్ము– సత్య – సంపూజ్య సర్వజ్ఞ పరిశుద్ధ దేవా ॥సంపూర్ణ॥

1. నిర్మల మనసు రంజిల్ల – నిత్య – పరమానందంబు నా [1]యాత్మలో నెరపు = ధరణి శ్రమల నోర్పు నిమ్ము – పాప – పరితాప మనుదినం బభివృద్ధిపరచి ॥సంపూర్ణ॥

2. విశ్వాస సమృద్ధి నిమ్ము – నాదు – ఈశుండ శ్రీ యేసు ప్రేమ నెంచి సం = తోషంబుగ సేవించుటకు – నీదు – [2]నాశీస్సు దయచేయు దాస పోషకుఁడా ॥సంపూర్ణ॥

3. నాలోఁ గృతజ్ఞత నింపు – నన్ను ఁ – బాలించు ప్రభునికై – బ్రతుకంగ నిమ్ము = చాల తనదు మహిమఁ బొగడి – సర్వ – కాలంబు దన వాక్కుఁ గని పెట్టునట్లు ॥సంపూర్ణ॥

4. నా పాపములె యేసునాథున్ – ఘోర – [3]తాపా నిర్యాణంబు లందింపఁ జేసెన్ = నా పాపములకు దుఃఖింతున్ – దేవ – కాపాడుమీ నన్నుఁ బాపంబునుండి ॥సంపూర్ణ॥

5. పెక్కంత శుద్ధిని బొంది – నేను – ఇక్కట్ల నోడింప శక్తి నందిమ్ము = చిక్కులఁ బడి యుండునపుడు – నీతి – లోకమం దా సక్తి మిక్కుట పరచి ॥సంపూర్ణ॥

6. నీ రాజ్య ప్రవేశ మంది – తండ్రి – యా రాజ్య [4]శుశ్రూష నిల నేర్చునట్లు = పరిశుద్ధాత్మ సహాయ మిమ్ము – యేసు – ధరణి నీవలె నేను [5]వర్తించునట్లు ॥సంపూర్ణ॥

–ఎస్.బి. సైమన్

[1]వ్యాపింపఁజేయు. [2]దీవెన. [3]దుఃఖమును మరణమును. [4]సేవ. [5]చేయుబాగు

# సమర్పణ

## 440 స్వసమర్పణము

రా -యదుకులకాంభోజి తా-త్రిపుట

[1]తనువు నా దిదిగో గై - కొనుమీ యో ప్రభువా నీ - పనికిc బ్రతిష్టించుమీ= దినములు క్షణములు - దీసికొని యవి నీదు - [2]వినతిన్ బ్రవహింపc జే - యను శక్తి నీయుమీ ॥తనువు॥

1. ఘనమైన నీ ప్రేమ - కారణంబున నీకై - పనిచేయc జేతు లివిగో = యనయంబు నీ విషయ - మై సొగసుగాc జురుకు - దనముతో c బరుగెత్త - వినయ పాదము లివిగో ॥తనువు॥
2. స్వర మిదిగో కొనుమీ - వరరాజ నిను గూర్చి- నిరతమ్ము పాడనిమ్ము = మరియు పెదవు లివిగో - మహనీయమైన నీ - పరిశుద్ధ వార్తతో c - బరి పూర్ణముగ నింపు ॥తనువు॥
3. వెండి [3]పసిcడి యివిగో - [4]వీస మైనను నాకై - యుండవలె నని కోరను = నిండైన నీ యిష్ట - నియమంబు చొప్పున - మెండుగ వాడc బరి - మితియౌ జ్ఞానం బిదిగో ॥తనువు॥
4. నా యిష్ట మిదిగో యిది - నీ యిష్టముగc జేయ - నా యిష్ట మిcకc గాదది = నా యిచ్చు యున్నట్టి - నా హృదయ మిదిగో - నీ - కే యియ్యది రాజ -కీయ సింహాసనమౌ ॥తనువు॥
5. ఉన్న నా ప్రేమ నీ - సన్నిధానమున నే - నెన్నcడు ధార వోయన్ = నన్ను నీ వానిగ - నాథా గైకొను మపుడు - చెన్నుగ నీ వశమై - స్థిర ముగ నుండెదc ॥తనువు॥

-ముంగమూరి దేవదాసు

## 441 సమర్పణము

రా -సౌరాష్ట్ర తా-అట

నావన్ని యంగీకరించుమీ - దేవా - నన్నెపుడు నీవు కరుణించుమీ = నావన్ని కృపచేత - నీ వలన నొందిన - భావంబునను నేను - బహు ధైర్య మొందెద ॥నావన్ని॥

[1]శరీరము. [2]మహిమను. [3]బంగారము. [4]కొంచెమైనను.



1. నీకు నా ప్రాణము - నిజముగా నర్పించి = నీకు మీcదుcగట్టి - నీ కొరకు నిల్పెద ॥నావన్ని॥
2. సత్యంబు నీ ప్రేమ - చక్కcగా మదిc బూని= నిత్యంüc గరముల - నీ సేవc జేసెద ॥నావన్ని॥
3. నీ సేవ జరిగెడు - నీయాలయమునకు = నాసచే నడిపించు - మరల నా పదములు ॥నావన్ని॥
4. పెదవులతో నేను - బెంపుగ నీ వార్తc = గదలక ప్రకటింపc - గలి గించు దృఢ భక్తి ॥నావన్ని॥
5. నా వెండి కనకంబు - నా తండ్రి గైకొనుమీ = యావంతయైనను - నాశింప మదిలోన ॥నావన్ని॥
6. నీవు నా కొసcగిన - నిర్మల బుద్ధిచే = సేవc జేయcగ నిమ్ము - స్థిర భక్తితో నీకు ॥నావన్ని॥
7. చిత్తము నీ కృపా - యత్తంబు గావించి = మత్తిల్లకుండcగ - మార్గంబుc దెలుపుము ॥నావన్ని॥
8. హృదయంబు నీ కిత్తు - సదనంబుగావించి = పదిలంబుగా దానిc - బట్టి కాపాడుము ॥నావన్ని॥

-పులిపాక జగన్నాథము

## 442 సమర్పణ గీతము

రా - యమునాకళ్యాణి (చాయ : నన్ను దిద్దుము) తా-త్రిపుట

జీవితాంతము వరకు నీకే - సేవ సల్పుదునంటిని = నీవు నాతో నుండి ధైర్యము - నిచ్చి నడుపుము రక్షకా ॥జీవితాం॥

1. ఎన్ని యాటంకంబులున్నను - ఎన్ని భయములు కల్గిన = అన్ని పోవును నీవు నాకడ - నున్న నిజమిది రక్షకా ॥జీవితాం॥
2. అన్ని వేళల నీవు చెంతనె - యున్న యను భవమీయవె = తిన్నగా నీ మార్గమందున - పూనినడచెద రక్షకా ॥జీవితాం॥
3. నేత్రములు మిరుమిట్లు గొలిపెడి - చిత్రదృశ్యములున్నను = శత్రువగు సాతాను గెల్వను చాలు నీ కృప రక్షకా ॥జీవితాం॥

4. నాదు హృదయమునందు వెలుపట – నావరించిన శత్రులన్ = చెదర గొట్టుము రూపుమాపుము – శ్రీఘ్రముగ నారక్షకా ॥జీవితాం॥

5. మహిమలో నీవుండు చోటికి – మమ్ము జేర్చెదనంటివే = ఇహము దాటినదాక నిన్ను – వీడనంటిని రక్షకా ॥జీవితాం॥

6. పాప మార్గము దరికి బోవక – పాత యాశల గోరక = ఎపుడు నిన్నే వెంబడింపగ – కృప నొసంగుము రక్షకా ॥జీవితాం॥

–సి.డి. శుభామణి

## 443 సంపూర్ణ సమర్పణము

రా –యమన్ (చాయ :భీకరుండౌ) తా–ఆది

శ్రీ యెహోవా నీ కొసంగెద – శ్రేయ మొదవcగ నాదు సంపదc = బాయక నీ సమ్ముఖమ్మున – నే యెడ నివసింతు భక్తితో ॥శ్రీ॥

1. అడcకువతో నీ పాదములcబడి – యొడయుcడా నావెల్ల నీకిడి = తడవు చేయక కొల్తు నిన్ను c – దండ్రి నన్నంగీకరించుమి ॥శ్రీ॥

2. నీవు నా రాజువు నిరతము – నేను నీ బిడ్డను నిశ్చయము = పావనాత్ముని యెదుట నాదు – జీవ మిదుదు సజ్జీవనముకయి ॥శ్రీ॥

3. ప్రభువరా యర్పించుకొందు – భక్తితోడ నన్ను నిందు = శుభప్రదము లగు శక్తులతో నను – సొంపుమీరcగ నింపు స్వామీ ॥శ్రీ॥

4. మహిమస్తుతులు చెల్లు నీ నా – మంబునకు నిత్యంబుగా న = న్నిహ పరంబుc బ్రోచువాcడ – నీవె సుమ్మా లోక రక్షకా ॥శ్రీ॥

–వేశపోగు గుల్బానమ్మ

## 444 జ్యోతిగ మము జేయుము

రా –ఆనందభైరవి (చాయ : గొప్ప దేవ నాకు తండ్రివి) తా–చాపు

జ్యోతిగ మము జేయుమో దేవా – యీ లోకమున నీ ఖ్యాతి నిలుపగ జేయుమో దేవా = జ్యోతిగ మము జేసి మాలో – క్రీస్తు మార్గము బయలు పరచి – నీతి ప్రేమలతోడ హృదయము – నింపి మమునడిపింపు మయ్యా ॥జ్యోతిగ॥



1. మా కుటుంబము లోన నీ వెలుగు – ప్రసరించు నట్లుగ – నాదు బ్రదుకును శుద్ధి జేయుమయ్యా = మా కుటుంబములోని వారలు – మానకను నీ వెలుగు జూపగ – మమ్ము నీ మార్గంబునందున – మనుప పరిశుద్ధాత్మ నిడుమా॥జ్యోతిగ॥

2. సంఘమున నీ కీర్తి కనపడగ – పరిశుద్ధ సహవాసంబులో నను వృద్ధి జేయు మయా = భంగపరచెడి కక్షలన్నిటి – బాధపరచెడి శక్తులన్నిటి – పార దోలగ శక్తినిడి నీ – భక్తి కాంతిని జూపి నాలో ॥జ్యోతిగ॥

3. నిన్ను దెలియని యాత్మ లెన్నెన్నో – మా చుట్టునున్నవి – నీ కొరకు కనిపెట్టుచున్నవయా = అన్నివేళల నీ సువార్తను – అందరికి ప్రకటింప మనసున– నాశనిడి నీ వార్త వెలుగును – అన్ని దిశలకు జాటునట్లుగ ॥జ్యోతిగ॥

4. సమయమును వరముల నొసంగితివి – మా రక్షకా ధన – సంపదను నీవే యొసంగితివి = విమల జీవితమందు వానిని విరివిగా నితరుల కొసంగి – వీర త్యాగార్పణములతో నీ – వెలుగు ప్రసరింపంగజేయను ॥జ్యోతిగ॥

– పి.డి. శుభామణి

## 445 నేను నీ సేవకుcడను

రా – ముఖారి (చాయ :జీవమా చింతించకుండు) తా–అట

నేను నీ వాcడను దేవా – నిక్కంబుగ – నేను నీ వాcడను దేవా = వీనుల నీ ప్రేమ – వివర మాలించుచు – మేను నాత్మయు నిత్తు – మేలొసcగు నీకిపుడు॥నేను॥

1. ఘనుcడ వైన నీవు – గలిగించితివి నన్ను – మనుజ లోకమునందు – నిను నేను సేవింప ॥నేను॥

2. నాకు నవసర మౌన – నానా వస్తువు లిచ్చి – నీ కటాక్షము నన్ను – నిల్పుచున్నది గాన ॥నేను॥

3. నా దోషముల నుండి – నన్ను రక్షింపను – నీదు పుత్రుని ప్రేమ – నిండార నొసగితివి ॥నేను॥

4. నే నఘముల చేత – నిజముగc జావcగ – నీ నెనరుచే నన్ను – నీవు బ్రతికించితివి ॥నేను॥

5. నా తనువు నాత్మయు – నాకుఁ గల్గిన వన్ని – నా తండ్రి యిచ్చితివి – నాకు నీ కృప చేత ॥నేను॥

– పులిపాక జగన్నాధము

## 446 నా సిలువ

రా –బిలహరి (చాయ :హలెలూయ యనిపాడుఁడీ) తా–త్రిపుట

యేసు! నా సిలువ నెత్తి – యిప్పుడు నే – నీ సుమార్గముఁ బట్టితి = నా స్వజనము లనాదరంబునఁ – ద్రోసినను పగజేసిన – నా సమస్తము నీవెగా యిక – నే సరకుగొన నేమియున్ ॥యేసు॥

1. ఎన్ని శ్రమలు వచ్చిన – లోకపు టాశ – లన్ని భిన్నము నొందిన = నన్ను ఖిన్నునిజేయ నేరవు – సన్నుతుండును స్వర్గము – నన్ని నావైయున్న విగ నిఁక – నన్నుఁ గదుపున దెవ్వరు ॥యేసు॥

2. ఆపదల్ ననుఁ జుట్టినఁ – జేరుదు నే – నో పరాత్పర రొమ్మునఁ = బ్రావ కుండవు పతితుఁడై నీ – దాపు జేరిన వానికిన్ – దాప మాపుచు సంతసంబిడి – ధన్యుఁ జేయుదు వీవెగా ॥యేసు॥

3. నినుఁ బ్రేమించెదు తండ్రిని – నా యాత్మా – నిను రక్షించిన క్రీస్తును = గనుమునిన్నుఁ జొ –చ్చిన ప్రియాత్మను – ఘన త్రేకుని నిత్యమున్ – గొనుము రక్షణ, పాపము చిం – తను విడిచి యిం కెన్నఁడున్ ॥యేసు॥

4. విశ్వాస కవచంబును – మేను నిడి – విజ్ఞాపనము చేయుము = శాశ్వతంబగు రాజ్యమునకును – సదయుఁడౌ ప్రభువు నడుపు – విశ్వసితము లభించునట నీ – విన్నపము స్తుతి యౌనుగా ॥యేసు॥

– వంతగాని పరదేశి

## 447 సమర్పణ

రా –యమునాకళ్యాణి తా–అట

సృష్టిపితా – సర్వోన్నతా = సమర్పింతున్ – సర్వస్వమున్

1. భూమి ఆకాశము నీవే – భూధర శిఖరములు నీవే = భూ ప్రజలు నీవారే – బలశౌర్యములు నీవే ॥సృష్టి॥



2. మా వెండి బంగారములు నీవే – మాకున్న వరములు నీవే = మా దేహముల్ – మా గేహముల్ మా జీవితము నీవే ॥సృష్టి॥

3. వెలలేని గాలి వెలుతురులు – విలువైన పాడి పైరులు = వివిధంబులైన దీవెనలు – నీ కరుణా వర్షములు ॥సృష్టి॥

4. పరిశుద్ధ గ్రంథపు పలుకులు – పరలోక తేనె చినుకులు = ప్రభు యేసుని మాటలు – మా వెల్గు బాటలు ॥సృష్టి॥

5. మాదంత నీదే మహా దేవా – మా రాజువయ్యా యెహోవా = మా తనువుల్ మా బ్రతుకుల్ మా యావదాస్తి నీవే ॥సృష్టి॥

6. మేమిచ్చు కాన్క యేపాటిది? యే ప్రేమ నీకు సాటిది? = మోక్ష నాధా యేసుప్రభో – అంగీకరించువిభో ॥సృష్టి॥

7. తండ్రి కుమార శుద్ధాత్ముడా – త్రియేక దేవ స్తోత్రముల్ = దాత వీవే నేతవీవే – దేవాది దేవుండవే ॥సృష్టి॥

–డి.వి.డానియల్

## 448 సమర్పణ ప్రార్థన

రా –ముఖారి తా–అట

కొనుము మా హృదయంబు – లను నీకర్పించెద – మనయము నుతి యించుచు = ఘనముగాఁ గృపచేత మముఁ గా – చినను మే మెంతయు ననర్హుల – మనుచు నీ పాదముల కెరగుచు – ననిశమును నీ కృపఁ దలంతుము ॥కొనుము॥

1. బలహీనులము మేము – బలవంతుఁడవు నీవు – బల మిచ్చి మము నడుపుము = ఇలను మే మిఁక బ్రతుకు దివసం–బులను నీ పద భక్తిచే నెపుడలయ కుండగ మమ్ముఁ గడు ని – ర్మలిన హృదయులఁ జేసి కరుణను ॥కొనుము॥

2. ఘోరారణ్యము భువి వి –చార సంకలితము – భూరి భయంకరము = దారి లేదిఁక నీవు దప్ప – వేరె సాధన మెచటఁ గానము – కోరి మము నందరిని నీదరి – జేరుకొను మార్గమును జూపు ॥కొనుము॥

3. గత వత్సరమున నీ – యతులమౌ కృపచేత – పతితుల మముఁ గాచితి = వతి వినమ్రుల మగుచు మామా – మతులలో నీ ప్రేమఁ దలఁచుచు – మతి విహీనతే వీడి యిఁక నిను – సతతతము సేవింతు మయ్య ॥కొనుము॥

4. ఈ వత్సరంబున – నెవ్వరు మాలోన – పోవుదు రిలను విడిచి = దేవ వారలు భువిని వదలి – పోవు కాలమునందుc దిన్నని – త్రోవలో వారలను సుఖముగc – బ్రోవc దొడ్కొని పోవు మయ్య ॥కొనుము॥

5. మమ్మును విశ్వాస – మార్గమందున దోడ – నిమ్ముగc గొని పోవుచు = నమ్మ నీ ప్రియ సేవకుల బృం – దమ్మునకు సిద్ధంబులగు మకు– టమ్ములను మే మొందుటకు వే – గమ్ముగాc బాత్రులను జేసి ॥కొనుము॥

6. శోధనల యందున – బాధల యందున – నోదార్పు మా కొసcగుము = శోధనలచే మాకు మరియును – శుద్ధమగు హృదయంబు లిచ్చుచు – శోధనల్ ఫలియింపc జేయుము – బాధకమ్ములు గాక యుండc ॥కొనుము॥

7. ఈ లోక దుఃఖము – లెల్ల నేగిన పిదప – నీ లోకమును జేరcగc = పాలుమాలక మేము మామా – పరుగు నెత్తcగు సాయ మిమ్మో – యేలికా నీ కరములను మ – మ్మెపుడు గొని నడువంగ నేర్పు ॥కొనుము॥

8. దురితంబు లెల్లను – గరుణచేc గడిగి నీ – పరమందు మము జేర్పుము = నిరతమును మే మచట నీ కృప – విరివి నెంతయు బొగడుచును మా – కరములను బంగారు వీణెలు – వెరవుగాc గొని మీటుచుందుము ॥కొనుము॥

– మాధవభక్తుల దావీదు

## 449 *Have Thine own Way Lord*

1. నీ చిత్తం బేను – నీ చిత్తంబే
నేను మట్టిని – ఓ కుమ్మరీ!
నీ కోర్కెదీర – నన్ దీర్చుమా
నీకు లొంగెదన్ – ఓ ప్రభువా ॥
2. నీ మార్గంబేను – నీ మార్గంబే
నేడు నన్ను ప–రిశోధించు
శుద్ధిజేయుమో – యేసూ నన్ను
నీ సన్నిధిలో – మోకరింతున్ ॥
3. నీ కోర్కె యేసు – నీ కోర్కెయే
నే గాయంబొంది – అలసితిన్
బాగుచేయు నన్ – ముట్టిప్రభో
నీకే సమస్త – శక్తి నొప్పున్ ॥
4. నీ యిష్టంబేను – నీ యిష్టంబే
నీ యాత్మతోడ –నన్ నింపుమా
నాయందెల్లరు – క్రీస్తున్‌జూడన్
నీ యాధీనంబు – నన్నుంచుకో
5. అప్పుడు నేను – నీ రీతిగాన్
తప్పకజేతు – నో ప్రభువా
ఇప్పుడే నీదు – సేవ జేయున్
అప్పగింతు నా – సమస్తంబు ॥

– ఎ.ఎ. పొల్లార్

అను : ఎం.జే.రామాంజులు



## 450 *Take my life, and let it be*

1. నాదు ప్రాణ మోప్రభో,
నేను నీకర్పింతును.
నాదు చేతు లెప్పుడు
నీదు సేవc జేయనీ
నాదు కాళ్లు లెస్సగా
నీదు త్రోవc బోవనీ
నాదు స్వర మెన్నcడు
నీదు స్తుతిc బాడనీ
2. నాదు నోరు నిత్యము
నీదు బోధc బల్క నీ
నాదు సొమ్ము సొత్తులు
నీకు నిత్తు నెప్పుడు
నాదు కాల మంతయు
నిన్ను c బ్రస్తుతింపనీ
బుద్ధి పూర్వకంబు
నిన్ను నేను కొల్వనీ.
3. సొంత మేలుc గోరక
నీదు కీర్తిc గోరుదు
నాదు నంతరంగము
స్వీకరించి యేలుము
నాదు నిండు ప్రేమను
నీకర్పింతు నెప్పుడు
నన్ను నీదు సొత్తుగా
నీ వంగీకరించుము.

– ఫ్రాన్సెస్ రిడ్లీ హావగ్గల్

అను : జాన్ అబెర్లీ

## 451 నీ చిత్తమే సిద్ధించు ప్రభూ

రా –శంకరాభరణం తా–ఆది

1. సర్వచిత్తంబు నీదేనయ్యా – స్వరూపమిచ్చు కుమ్మరివే = సారెపై నున్న మంటినయ్యా – సరియైన పాత్రన్ జేయుమయ్యా – సర్వేశ్వరా నేరిక్తుండను సర్వదా నిన్నే సేవింతును ॥సర్వ॥

2. ప్రభూ! సిద్ధించు నీ చిత్తమే – ప్రార్థించుచుంటి నీ సన్నిధి = పరికింపు నన్నీదివసంబున – పరిశుభ్రమైన హిమముకన్న –పరిశుద్ధున్ జేసి పాలింపుమా – పాపంబుబోవ నను గడుగుమా ॥సర్వ॥

3. నీ చిత్తమే సిద్ధించు ప్రభూ – నిన్నే ప్రార్థింతు నా రక్షకా = నీచమౌ గాయముల చేతను – నిత్యంబు కృంగి అలసియుండ –నిజమైన సర్వశక్తుండవే – నీ చేతబట్టినన్ రక్షింపుమా ॥సర్వ॥

4. ఆత్మస్వరూప నీ చిత్తమే – అనిశంబు చెల్లు ఇహపరమున = అధికంబుగా నన్నీ యాత్మతో –ఆవరింపుమో నా రక్షకా – అందరూ నాలో క్రీస్తుని జూడ – ఆత్మతో నన్ను నింపుము దేవా ॥సర్వ॥

– ఎ.చార్లెస్ కిన్సింగర్

## 452 *Thy life was given for me*

1. సమృద్ధి జీవము
సంపత్తి నాకుఁగా
సంతప్త మొందుచుఁ
చావును బొందితి
నాకై చావొందితి
నీకై యేమి చేతున్?

2. నెమ్మయిన రాజ్యము
నేనొందు లాగున
నీ నెత్రు కార్చుచు
నీ ప్రాణ మిచ్చితి
నా యాత్మఁ బ్రోచితి
నీకేమి యిత్తును?

3. నీ తండ్రి యింటిని
నీ సింహాసనమున్
నీ గౌరవంబును
నీ వన్ని మానితి
యన్ని త్యజించితి
నీ కేమి త్యజింతున్?

4. నాశంబునుండి నన్
రక్షించుటకును
లెక్కింప శక్యము
కాని విచారమై
నీ శ్రమ లోర్చితి
నీకై నేనోర్తునా?

5. నా పాప మన్నింపున్
రక్షణ్య మార్గము
అక్షయ భాగ్యము
నాశించి తెచ్చితి
నా కన్ని తెచ్చితి
నీకేమి తెచ్చెదన్ ?

– ఫ్రాన్సెస్ రిడ్లీ హావర్గల్

## 453 *I gave my Life for Thee*

1. సంపూర్ణ జీవము
సంపత్తి నీకు గాన్
సంతప్త మొందుచు
చావును బొందితి
నీకై చావును బొందితి
నాకేమి చేతువు?

2. నెమ్మయిన రాజ్యము
నీ వొందులాగున
నా నెత్రు కార్చుచు
నా ప్రాణమిచ్చితి
నా ప్రాణమిచ్చి ప్రోచితి
నాకే మిచ్చితివి?

3. నా తండ్రి యింటిని
నా సింహాసనమున్
నా గారవంబును
నా వెల్లమానితి
నా వెల్లమానివచ్చితి
నీవే మిచ్చెదవు?





4. చెప్పరాని బాధలన్
పొందుచు సిల్వపై
చిందితి రక్తము
చివ్వున బ్రోవను
చింతల నీకై యోర్చితి
చింతల నోర్తువా?

5. నీ క్షమాపణమున్
రక్షణ మార్గమున్
అక్షయభాగ్యమున్
ఆశించి తెచ్చితిన్
నీకై రక్షణ తెచ్చితిన్
నాకేమి యిత్తువు?

– ఫ్రాన్సెస్ రిడ్లీ హావర్గల్

## 454 *I am Thine, O Lord, I have heard Thy voice*

1. నే నీవాఁడనై యుండఁ గోరెదన్
యేసు ప్రియ రక్షకా
నీవు చూపు ప్రేమను గాంచితిన్
నన్ను c జేర్చు నీదరిన్
॥ నన్నుఁ జేర్చు చేర్చు చేర్చు
రక్షకా
నీవు పడ్డ సిల్వకున్
నన్నుఁ జేర్చు చేర్చు చేర్చు
రక్షకా
గాయపడ్డ ప్రక్కకున్ ॥

2. నన్ను c బ్రతిష్ఠపర్చుమీ నాధా
నీదు కృపవల్లనే
నాదు నాత్మ నిన్ను నిరీక్షించు
నీ చిత్తంబు నాదగున్

3. నీదు సన్నిధిలో నిఁక నుండ
నెంత తుష్టి నాకగున్
స్నేహితుని మాటలాడెదన్
సర్వశక్త ప్రభుతో

4. నీదు దివ్య ప్రేమాతిశయము
ఇహ బుద్ధి కందదు
పరమందున దాని శ్రేష్ఠత
నే ననుభవించెదన్

–ఫ్రాన్సెస్ జేన్‌వేన్ ఆల్స్‌టీన్
అను : జేకబ్ చేంబర్లేన్

## 455 *All to Jesus I surrender*

1. యేసుసామి నీకు నేను
నా సమస్త మిత్తును
నీ సన్నిధిలో వసించి
ఆశతో సేవింతును
॥ నా సమస్తము
నా సమస్తము
నా సురక్షకా నీ కిత్తు
నా సమస్తము ॥

2. యేసుసామి నీకె నేను
దోసి లొగ్గి మ్రొక్కెదన్
తీసివేతు లోకయాశల్
యేసు చేర్చుమిప్పుడే.

3. నేను నీవాడను యేసు
నీవును నావాడవు
నీవు నేను నేకమాయె
నీ శుద్ధాత్మ సాక్ష్యము.

4. నీకు నన్ను యేసు ప్రభూ
ఈయనేనె యేగితి
నీదు ప్రేమశక్తి నింపు
నీదుదీవె నియ్యవే.

5. యేసు నీదె నా సర్వాస్తి
హా సుజ్వాలన్ బొందితి
హా సురక్షణానందమా
హల్లెలూయా స్తోత్రము.

అను : ఎం. జి. రామాంజులు

# సేవ - ప్రతిఫలము

## 456 క్రైస్తవ సేవ

రా -సావేరి (చాయ : తనువు నా దిదిగో) తా-రూపకము

సంతసంబున వత్తు - సర్వేశ్వరుని చిత్త - మెంతయు నెరవేర్చను = వంతలు విడి నాదు - నంతరంగము కదుర - నెంతో విశ్వాసమున - వెంట వత్తును బ్రభువా ॥సంత॥

1. సురుచిరమగు మరియ - సూనుని యాజ్ఞలు - శిరమున నిడికొందును = మరియ మనసుతో - మార్తమ్మ కరములతోఁ - బరమ సౌఖ్యముఁ బొంద - భక్తితో సేవింతు ॥సంత॥

2. నారాజు సేవ దు - ర్భరమై బాధగ నున్న - భారంబుగను దోఁచదు = సారెసారెకుఁ దనదు - చక్కని చిఱునవ్వు - వారించి భారమున్ - ధీరత నొస గును ॥సంత॥

3. కారుణ్యమున నాదు - కల్మషమయ హృదయ - భారములను మోసితి = ఆ రాజ్యమునఁగల - యాస్తికై నా చిత్త - మాలసింపఁగ నెత్తి - యందే స్థిరముగ నుంచు ॥సంత॥

4. ఈ యుర్వి నేఁజేయు - సేవకు ఫలములు - నీ చోటఁ గనుఁగొందునే = కాయం బీధర - కర్మలం గరపిన - నా యాస్తి నా హృదయ - మాలో కమున మందు ॥సంత॥

- మొలతాటి విద్యానందము



## 457 క్రీస్తు కొరకు సేవ

రా -ఖరహరప్రియ (చాయ : ప్రభువా పంపుమా) తా-ఆది

శ్రీ యేసుని వేఁడు - మనసా - సేవింపవే నేఁడు = నీ యఘములను బాపియు నిను నెడ - బాయక కడు సహాయము జేసెడి ॥శ్రీ యేసు॥

1. పాపంబులు వీడి - పశ్చా - త్తాపబంబును గూడి - దాపున జేరుము - దయగల ప్రభువు నీ - పాపముఁ బాపియుఁ పాలించును ధర ॥శ్రీ యేసు॥

2. దేవుని మరువకుము - దైవ - సేవను మరువకుము = జీవపుఁ త్రోవను - స్థిరముగ నడువను - పావన మనసును - బ్రాపుగ నిచ్చెడి ॥శ్రీ యేసు॥

3. రక్తము చిందించెఁ - ప్రభువు - రక్తితో నీ కొరకు = రక్తపు టూటల - శక్తిని నమ్మిన - ముక్తి కలుగును - భక్తితో నీవు ॥శ్రీ యేసు॥

4. సిలువయే నీ ఘనము - క్రీస్తు - సిలువయే నీ ధనము = సిలువయే భాగ్యము - తులువల కెల్లను -సిలువ వలననే -కలుగును రక్షణ ॥శ్రీ యేసు॥

- బునమల్ల బెంజమిన్

## 458 సేవ కిదే యుక్త సమయము

రా -సౌరాష్ట్ర తా-అట

ప్రభు సేవ కిదియే సమయంబు - ప్రజల విమల - ఫలముల నొంద నిదియే సమయంబు ॥ప్రభు॥

1. మరణంబు బడయక మున్నే - ఘోర - తరమైన పాపాత్ము - లరసి గుణ పడఁగ - నరక వేదనఁ బాపు కొరకు - దేవుఁ [1]దరిమురి తరి యెంతో- కరుణతో నొసఁగెఁ ॥బ్రభు॥

2. కరుణ గల్గెడి దివసములలో - నీవు - పరమ భాగ్యంబులు - బడయుంగ వచ్చు - మరణం బెరిఁగిన జీవాత్మ - యద్ది - మఱచెదవి ది యెంతో - [2]అరుదై యున్నది నా ॥ప్రభు॥

[1]మంచి. [2]ఆశ్చర్యము.

3. పశ్చాత్తాపం బనెడి తలుపు - మూయఁ - బడుమ దేవుని కరుణా - భాగ్య మను తలుపు - నిశ్చయమంబుగ వేయఁబడు - నెంతో - యాశ్చర్యకరమౌ - నవన మగుపడదు ॥ప్రభు॥

4. సారస్యమైన కార్యములం - జేయ - సమయ మనెడి తలుపు - సరగ మూయబడున్ - [1]వారక మృతి బొందునపుడే - గాక - సార కార్యము లన్ని - జక్కఁగాఁ జేయు ॥ప్రభు॥

5. గత దినంబులకై స్తుతింతున్ - మిగుల - కఠినంబులైనట్టి - గండముల నుండి - ప్రతి దినంబును దప్పించుచు - నెంతో - మితిలేని కృపచేత - బ్రతికించు మనలఁ ॥బ్రభు॥

6. నీతియుతులగు భక్తులారా - మన - పాతకములకుఁ జచ్చి - పరమేశ్వరుని - ప్రీతి మ్రొక్కులు చెల్లించుదము - నూత్న - వత్సరము ప్రభు - స్తుతికై బ్రతుకుదుము ॥ప్రభు॥

## 459 ఎవరు ప్రభుని పక్షమున నున్నారు?

రా -యదుకులకాంభోజి (చాయ :ఎవరు భాగ్యవంతు లౌదురు) తా-ఆది

ఎవరు క్రీస్తు వైపు నున్నారు - ఎవ రేసుని వారు - రాజౌ = దివ్య యేసు ప్రభుని కొరకై - యెవరు సేవ చేయుచు నుందు ॥రెవరు॥

1. నాశనం బగు నాత్మల కెల్ల - నాశ్రయ రక్షకుఁడౌ - క్రీస్తు = యేసును దెల్ప లోకమును - విసర్జించి సేవఁజేయ ॥నెవరు॥

2. లయము గాని యేసు శక్తియే - జయము పొందును - ఆయన = ప్రియమౌ సైన్యమందుఁ జేగి - సయితాను నెదిరించి గెలువ ॥నెవరు॥

3. మరణమందు గూడ మాకుఁ - గరుణఁ జూపిన యేసు నీ కొ = మరులమై మేమందఱము నీ - దరికిఁ జేరి యున్నాము ॥ఎవరు॥

- *టి. గురవయ్య*

[1]సంతతము



## 460 సువార్త ప్రకటన

రా -హరికాంభోజి (చాయ : ఎంతో సుందరమైనవి) తా-త్రిపుట

చాటుఁడి శుభవార్తను - బోధకులారా - చాటుఁడి శుభవార్తను = జాటుఁ డి శుభవార్త - సకల రాష్ట్రములలోఁ - జాటించుఃడని చెప్పె - ధాటిగఁ ప్రభు యేసు ॥జాటుఁడి॥

1. లోకమును ప్రేమించి - లోకరక్షణ కొఱకు - ప్రాకటంబుగ సుతునిఁ - బంపె దేవుఁడటంచుఁ ॥జాటుఁడి॥

2. శత్రువుల రక్షింప - మిత్రుఁడుగా వచ్చి = మైత్రి నసువు నిచ్చి - మరల లేచెన టంచుఁ ॥జాటుఁడి॥

3. ఎట్టి పాపు లైనఁ - బట్టి యేసుని మాట = దిట్టముగ నమ్మినఁ - బట్టుగ క్షమియించుఁ ॥జాటుఁడి॥

4. హృదయ శుద్ధిని గోరి - సదయుఁడగు రక్షకునిఁ = పదిలముగఁ ప్రార్థింపఁ - పరిశుద్ధాత్మ నొసంగుఁ ॥జాటుఁడి॥

5. నమ్మి బాప్తిస్మంబు - నెమ్మిఁ బొందిన మనుజు = లిమ్ముగఁ బొందుదు - రిలను ఘన రక్షణముఁ ॥జాటుఁడి॥

6. ఇందు నందు మికుఁ - బొందుగ నొసఁగును= సందియము లేకుండ సకల భాగ్యము లనుచుఁ ॥జాటుడి॥-

-*పులిపాక జగన్నాధము*

## 461 ఆత్మల సంపాదనము

రా -ముఖారి (చాయ : కరుణసాగర) తా-ఆది

ఆత్మలను సంపాదింపఁ నగు - ఆత్మ బలమున నిది చేయనగు = ఆత్మ సంపాదనముకన్న - నక్షయానందము లేదన్న - యాత్మలను వెదకి రక్షింప నాత్మల కాపరి యాన తిడి ॥నాత్మలను॥

1. ధనముకన్న నాత్మ సంపా - దనము మేలౌ దాని సంపా = దనముఁ గోరి మన రక్షకుఁడు - ధారపోసెను దన రక్తంబు ॥నాత్మలను॥

2. క్షణక్షణము నెందఱో నశింప - జాలిలేద నీవు సుఖింప = అణఁకువతో ననుదిన మొక యాత్మ - నైన రక్షింపఁగ దయ రాదా ॥యాత్మలను॥

3. పరుల యాత్మ విమోచనంబు – ప్రభువు కోరు బహుమానంబు = పరదుఁడౌ క్రీస్తును నీవెట్లు – వట్టి చేతులతో దర్శింతు ॥నాత్మలను॥

4. నీతిమార్గము ననుసరింప – నిత్యమును జక్కఁగ వర్తింపఁ = పాతకులఁ ద్రిప్పెడు సద్భక్తుల్ – జ్యోతులట్లు బ్రకాశించెద రిఁక ॥నాత్మలను॥

5. జీతనాతంబులు లేవని – సిగ్గుపడకు మిది కాదని = ప్రీతితో నాత్మలను గడింప – నీతి మహిమ మకుటంబులునౌ ॥నాత్మలను॥

6. నీ యమూల్య తరుణంబుల – నీ ప్రశస్తదానంబుల = వేయియేల నీ సర్వంబు – విభుని సేవకు నీ వర్పించు ॥మాత్మలను॥

– మల్లెల దావీదు

## 462 యేసును వెంబడించుము

రా –శంకరాభరణము తా–ఆది

జయప్రభు యేసునె వెంబడించుచు – జయముగ నడచెదము – యేసుతో జయముగ వెడలెదము = ప్రియుడగు యేసుని ప్రేమను చవిగొని – పయనము జేసెద మా ప్రభు వెంబడి ॥జయప్రభు॥

1. ఆదరణయు అధికబలమును ఆత్మఖడ్గమును – అవనిలో అందరి రక్షయును = ఆదర్శంబౌ ఆయన వాక్యమే – అనిశము మనకిల మార్గము చూపగ ॥జయప్రభు॥

2. ధర విరోధులు మమ్ము జుట్టగ – దరి జేరెద మేసున్ – ప్రభుని దరిజేరెద మేము = ధాత్రి దురాశల డంబములన్నిటి – మైత్రిని వీడి నడచెద మేసుతో ॥జయప్రభు॥

3. మా ప్రభు జూముము నీదు మార్గపు – మాదిరి జాడలను – నీ దగు = మాదిరి జాడలను = మా పాదములను తొట్రిలకుండగ – మా కిదు బలమును యీ కృపాదినమున ॥జయ ప్రభు॥

4. మా కొరకై నీవు నడచిన– మార్గము జూడగను – మేము మార్గము జూడగను = మా రక్షక నీ అడుగుజాడలు – మరువక విడువక నడువగ కృపనిడు ॥జయప్రభు॥



5. ఇహపరముల నినుగాక ప్రేమతో – ఎవరిని గొలిచెదము? – ఎవరిని ప్రేమింప వశమె? = విహరించెదము యేసుని వెంబడి – మహిమ రాజ్యమున యేసుని గొలువగ ॥జయప్రభు॥

– ఎ. చార్లెస్ కిన్సింగర్

## 463 సువార్త సేవాభారము

రా –ఆనందభైరవి (చాయ : ఎంతో సుందరమైనవి) తా–త్రిపుట

భారమైనది సేవ – మరణము కన్న – భారమైనది సేవ = ఘోరనరకపు దారి – చేరి నడచెడివారిన్ జేరి వారితో – సంప్రదించి ప్రభువును చూపి – ఘోరనరకపు బాధలన్నియు – కూర్మితో వినజెప్పి – మోక్షపు – దారికిని – నడిపించి – యేసుని – దాపునకు నడిపించుదారి ॥

1. దురితదుర్గతి నశియించు వారినిజూచి – పరితాప – మొందవలయున్ = మారమనసు నొంది – చేరి ప్రభునితో కలిసి – ఘోరపాపిని నేనని – వేడి – సిలువ ధ్యానించి = దురితములను – చేయనని తీర్మానములను చేసికొని – రక్షింపబడినది గురుతుగ సాక్ష్యంబునిచ్చుటయే దారి ॥

2. ప్రథమ దశభాగంబుల – ప్రభునకు నిచ్చి – ప్రతిదినము ప్రార్థింప వలెన్ = అధములగు – బీదలకు నాధారముల నొసగి –విధిగ భక్తుల – నాదరించి – సవరించి = ప్రభువు వాక్యము – చదువుకొనుచు – ప్రభుని పాటలు పాడుకొనుచు – ప్రభుని వేదము ప్రచురపరచి – పదిలముగ – జీవించకోరి ॥

3. దేశదేశముల తిరిగి – దేవుని వాక్యము – దేశప్రజలకు చాటవలెన్ = ఆశాదురాశలను – కోసివేసి యేసు – దాసులను జేసి – వెలిగించి తిలకించి = యేసుభక్తుల పదిలపరచి యేసుతో – పరిచయము చేసి – యేసును ధరియింప జేసి – యేసుతో నివసించుదారి ॥

– కేసానపల్లి అబ్రహాము

## 464 దేవుని పనియు, మనుష్యుని పనియు

రా –గౌళిపంతు (చాయ :స్తోత్రము సేయరే సోదరులారా) తా–ఆది

యెహోవయే నా – మహాదేవుఁడని – బహుగ నెఱిఁగి మన నావంతు = సహదాసులతో – మహి నొకఁడనని – సహాయ మిడుటే నీవంతు ။యెహోవ။

1. మితిమితిన దు – రిత సమూహముల – [1]క్షత మొనర్ప మన నావంతు = పతితపావనుని – [2]క్షతజనములో నను – నుతికి కడుగుటె నీవంతు ။యెహోవ။
2. ప్రతిదిన బ్రతుకును – మతి నుంచుచు నిను – స్తుతి యొనర్చుటే నావంతు = క్షితినేఁబడుదు – ర్వెతల నుండ శా –శ్వతముఁ బ్రోచుటె నీవంతు ။యెహోవ။
3. చంచల మతిఁదొల – గించుమంచుఁ బ్రా – ర్థించుచుండుటే నావంతు = అంచి తాత్మనిఁకఁ – బంచి స్థిరతను – బెంచుచుండుటే నీవంతు ။యెహోవ။
4. యేసు సిలువలో – నే సంధించి – గాసి సహించుట నావంతు = భాసురమోక్ష ని – వాసమునకు నను – దీసుకపోవుటే నీవంతు ။యెహోవ။
5. మేటి వార్త నా – బోటి జనాళికి ఁ – జాటించుటయే నావంతు = చాటిన దానిని – గాటముగ మది – నాటించుటయే నీవంతు ။యెహోవ။
6. అనుదిన [3]మబలుఁడ – నని మదినిం గనుఁ – గొని బ్రదుకుటయే నావంతు = ననుఁ [4]బదాబ్జప – జ్జనుఁ జేర్చియు బల – మును గృప నిచ్చుటే నీవంతు ။యెహోవ။
7. ముదముతోడ నీ – తుదిరాక కొఱకు – నెదురు చూచుటే నావంతు = సదమలాత్మచే – హృదయమును సదా – పదిలపఱచునటే నీవంతు ။యెహోవ။

–జుటికె దావీదు

[1]నాశనము. [2]రక్తము. [3]బలహీనుడ. [4]తామరములవంటి పాద సమీపమున.



## 465 లెమ్ము తేజరిల్లుము

రా –కళ్యాణి తా–ఆది

లెమ్ము తేజరిల్లుము నీకు – వెలుగు వచ్చియున్నది = ఇమ్ముగ ప్రభుని మహిమ – ఇదిగో నుదయించె నీపై ။లెమ్ము။

1. జనములు నీదు వెలుగునకు – జనుదెంచెదరు గనుమ = తనర నీ యుదయ కాంతికి – తరలి రాజులు వత్తురు ။లెమ్ము။
2. సముద్ర వ్యాపారంబు – సరిత్రిప్పబడు వీవైపు = అమరుగ జనుల యైశ్వ – ర్యము వచ్చు నీ యొద్దకు ။లెమ్ము။
3. గొంజి దేవదారు సరళ – వృక్షాలు నాలయమునకు = ఎంచి తేబడు నాపాద – క్షేత్రము గొప్పగజేతు ။లెమ్ము။
4. నిత్యమౌ కాంతితోడ – నిన్ను వెలుంగజేతు = నిత్య సంతోషమునకు – నిన్ను కారణముగ జేతు ။లెమ్ము။
5. ఎంచంగ నొంటరిగాడె – ఎసగు వేయిమందియై = ఎంచంగ దగని నాడె – ఎంతో బలమగు జనమగును ။లెమ్ము။

– తూలూరి ప్రకాశము

## 466 కఱుణాయుత కార్యములు

రా –మోహన తా–ఆది

కఱుణాయుతం బౌకార్యములు – కనబడవలెగాదా మనలో – అనవరతము మన బ్రతుకు ప్రభునికై = అంకితమగునటు – నలవరచుకొనగ ။కఱుణా။

1. పొరుగవాని ప్రేమింతము మనము – కొరతలన్ని యిక దీరును మనకు – తరుగుపడ్డదా గుణమది మనలో = త్వరితగతిని సవరించుకొందమిక ။కఱుణా။

2. కుంటి గ్రుడ్డి కుష్ఠ రోగులెందరో – కంఠమెత్తి ఘోషించుచు నుండ – ఇంటగుడిచి సుఖియించుట న్యాయమ = వంటబట్టదది స్వార్థ పరత్వము ॥కఋణా॥

3. పండువంటి కాపురంబు మనది – దండిప్రభుడు దయచేసెను మనకది – బండు లోడలౌ ఓడలు బండ్లౌ = ముండ్ల కిరీటము ముందు బెట్టుకొని ॥కఋణా॥

4. మనుజులందు గలవు రెండు తెగలు – వినుము పుచ్చుకొనెడువారి దొక తెగ – మనసు దీర నిచ్చువారిదొక తెగ = గనుమ మనస నీవెందుగలవొ యిక ॥కఋణా॥

5. కఋణ రసము మాకుప్రభువా – కలుగను కృప నిమ్మా యెపుడు – అరమర లేకను అన్ని సమయముల = నందర ప్రేమను జూడగ నడుపుమ ॥కఋణా॥

–జొన్నకూటి దానియేలు

## 467 *Sowing in the morning*

1. రేపు మాపు గూడరమ్యు మైన గింజల్
ప్రీతితోను జల్లి వేచియుందము
కాపుతోడ నుండి దాపు నుండు
పంట
ఏపు మీరఁ పంటఁకోసి కొందము
॥పంట పండగన్ కోసికొందము
కంట నీరు పోవఁ కోసికొందము ॥

2. సందియంబు లేల స్వామి సేవ
యందు
వందనంబు తోడ విత్తుచుందము
కొందలంబు లేక కష్టవృత్తి చేసి
యందరంబు చేరి యానందింతము

3. ప్రేమ విత్తనంబుల్ క్షేమయంకు
రంబుల్
ప్రీతిన్ కాల మెల్ల ప్రాంతమం
తటన్
సేమ మొప్ప నాటినాయకుండు
రాఁగన్
నిండు పంటఁ కోసం గూర్చుకొం
దము.

– కె. షా

అను : ఆల్‌ఫ్రెడ్ త్యాగరాజు పామర్



## 468 *Rescue the perishing, care for the dying*

1. పాపము వలనఁ చెడినవానిఁ
ప్రేమతో వెతకి రక్షించుఁడు
తప్పినవానిని ద్రోహిని మీరు
యేసుని యొద్దకు రమ్మనుఁడు.

॥పడినవారికిఁ జూపుఁడు త్రోవ
యేసు పాపాత్ములన్ రక్షిం
చును॥

2. నీతిని కోరక యల్లాడువాని
యేసు రక్షించుటకై కాచును
ప్రేమతో వారినిఁ బిలుచుకొండి
యేసును నమ్మిన రక్షించును.

3. పాపవిషంబు మనస్సున దాగి
గుణము పూర్తిగఁ జెఱిపినన్
యేసుని ప్రేమ యనుకిరణంబు
దాని గుదుర్చును పూర్ణముగా.

4. చెడినవారిని రక్షింపఁ బొండి
యేసుఁడు శక్తిని మీ కీయఁగా
మోక్ష మార్గంబునడిపించుండి
వారిని రక్షింప యేసు వచ్చెన్

–ఫ్రాన్సెస్ జేన్‌వేన్ ఆల్‌స్టీన్

అను : జేకబ్ చేంబర్లేన్

## 469 *To the work ! To the work ! !*

1. జాగ్రత జాగ్రత
యేసుఁ డిట్లు పిల్చున్
నేఁడు పో పనిచేయి
నాదు వనములో
ఆయనే ముందు వె
ళ్లి మా త్రోవ చూపున్
కాగ జాగ్రతతో
పని చేయుదుము.
॥ పని చేయి, పని చేయి
కోరుచు కాచుచు
నూయేసు వచ్చు మట్టుకు ॥

2. జాగ్రత జాగ్రత
నీతి నాశించెడు
వారి నందరిని
తృప్తిపర్చెదము
యేసు సిలువ నె
త్తి మాధ్వజముగ
రక్షణ యుచితం
బని చాటింతుము.

3. జాగ్రత జాగ్రత
వచ్చి పోరాడుడీ
దుష్ట సాతాను రా
జ్యంబు పాడగును
యేసు నామ ప్రఖ్యా
తిని శ్లాఘింపుడీ
ఆయన రక్షణ
యుచితంబగును.

4. జాగ్రత జాగ్రత
యేసు శక్తి నిచ్చున్
గెల్చువారికి జీ
వ కిరీటం బగున్
మోక్షానందములో
నివసించువారై
రక్షణ యుచితం
బని పాడెదము

అను : జేకబ్ చేంబర్లేన్

## 470 *Go, preach my Gospel*

1. చాటించుఁడి మనుష్యజాతి కేసు
నామము
చాటించుఁడి యవశ్య మేసు
ప్రేమ సారము
జనాదులు విశేష రక్షణసునాదము
విను పర్యంతము.
॥చాటుదము - చాటుదము
చాటుదము - చాటుదము
చాటుదము - చాటుదము
శ్రీ యేసు నామము ॥

2. కన్నీళ్లతో విత్తెడువార లానందం
బుతో
నెన్నఁడు గోయుదు రనెడి వాగ్ద
తంబుతో
మన్నన గోరు భక్తులార నిండు
మైత్రితో
మానవ ప్రేమతో
॥చాటుదము - చాటుదము
చాటుదము - చాటుదము
చాటుదము - చాటుదము
చక్కని మార్గము ॥

3. సమీపమందు నుందు నేమో
చావుకాలము
సదా నశించిపోవువారి కీ
సుభాగ్యము
విధంబుఁ జూపఁగోరి యాశతోడ
నిత్యము
విన్పించుచుందము.
॥చాటుదము - చాటుదము
చాటుదము - చాటుదము
చాటుదము - చాటుదము
సత్య సువార్తను ॥



## 471 *Must I go and empty handed*

1. ఒడ్డుచేరి నీ యెదుట
నిల్చునపుడు రక్షకా
ఒక్క యాత్మనైన తేక
సిగ్గుపడిపోదునా.

॥ ఒక్క యాత్మనైన నేను
రక్షింపక యేసువా
వట్టి చేతులతో నిన్ను
దర్శించుట తగునా ॥

2. ఆత్మలందు వాంఛలేక
సోమరులై కాలమున్
వ్యర్థపరచు వారానాడు
చింతతోడ నిల్తురు.

3. యేసువా! నా స్వరక్షణ
నిశ్చయంబు యైనదే
ఐనఫలితంబుజూడ
కష్టపడనైతినే.

4. కాలమెల్ల గడ్చిపోయెన్
మోసపోతినేనయ్యో
గడ్చినట్టి కాలమైతే
ఏడ్చినను రాదది.

5. భక్తులారా! ధైర్యంతోడ
లేచి ప్రకాశించుడీ
ఆత్మలెల్ల యేసుయొద్ద
చేరునట్లు చేయుడి.

# క్రైస్తవ జీవితయాత్ర

## 472 ధన్యతలు

రా -భైరవి తా–ఆది

వారు భాగ్యవంతు లౌదురు – భూ లోకమందు – వారు భాగ్యవంతులౌదురు = [1]చారు శుభవార్తా [2]రవంబు –గోరి యాకర్ణించి భక్తి – మీరఁ దెలిసికొనిన యట్టి – [3]ధీరు లెవ్వ రెవ్వరో ॥వారు॥

1. వారు నడుచు మార్గమందున – [4]సుక్షేమ రాజి – వారి ననుసరించు నెందును= తేరి చూడ రాని [5]దే – దీప్యమాన దివ్యసత్య – భూరి తేజ మాజనములఁ – బొలుపు మీరఁ జుట్టుకొనును ॥వారు॥

[1]సొగసైన. [2]ధ్వని. [3]బుద్ధిమంతులు. [4]యోగ్యమైన సుఖరాశి. [5]చక్కగాప్రకాశించునది. [6]సొగసు.

2. విమోచకుని నామమందున - దజ్జనంబుల - విశ్రుతానందంబు ప్రాణముల = [1]అమందముగ హెచ్చరించు -నతని నీతి రీతిc దజ్జ - నముల కోర్కె వృద్ధి బొం - దంగc జేయు [2]సంతతంబు ॥వారు॥

3. నరులపై బిశాచమును - నిందా స్థాప - నంబు జేయంగలేదు = [3]పరగు - ప్రకాశమును = బ్రాపు నైన సర్వే - శ్వరుcడు బలము రక్షయు [4]న- వారితముగ మనకు నిచ్చు ॥వారు॥

4. వరగుణ ప్రశస్తులారా - క్రైస్తవులారా - వన్నె మీర మీ రాజు = [5]సురుచిరముగ శాశ్వతముగc - పరిపాలించు మీ దేవుcడు - నిరతముగను జీవించు - నీతి భరిత చిత్తుcడగుచు ॥వారు॥

*- విలియం డాసన్*

## 473 సుబోధ

రా -మోహన తా-ఆది

వద్దు మనస - బుద్ధి కురుచ = పెద్దలకుc బెద్ద పరి - శుద్ధుc డగు క్రీస్తు తా - దిద్దు నినుc బ్రేమ సరి - హద్దులను మీరcబో ॥వద్దు॥

1. చెడ్డ తలcపు - లడ్డి నిలుపు = మెడ్డెలకు నెడ్డెయగు - గడ్డు సాతాను నకు - మెడ్డుకొని దొడ్డ ప్రభు - బిడ్డవలె నడుపు మిcక ॥వద్దు॥

2. నింద పాలు - బొంద మేలు = పొందుగను అందముగ - ముందు నీ యందు వెలుc - గొందు ప్రభు సుందర ని -బంధనలు మరిచ పో ॥వద్దు॥

3. ఆశ బెట్టు - యేసు తట్టు = దోసములు వాసి చనc - జేసి నను మోసి కొను- యేసు నిజ దాసులను - బాసి యుండకు మిcక ॥వద్దు॥

4. బెందు పడకు - నిందు విడకు దండి గల తండ్రి యొడ - యుందు యేసుండు నీ - యండ నుండcగ నీ - గుండె దిగు లేల యిcక ॥వద్దు॥

5. పట్టు విడకు - దిటము సెడకు = నెట్టుకొని ముట్టడిగc - జుట్టుకొను కష్టముల - బిట్టు విడcగొట్టు ప్రభు -తట్టు కనిపెట్టు మిcక ॥వద్దు॥

---

[1]చురుకుగా. [2]ఎల్లప్పుడు. [3]వ్యాపించు. [4]అడ్డులేకుండ. [5]చక్కగా.



6. మంచి గుణము - లెంచికొనుము = వంచనల మించి గ - ర్వించి నీ దు ర్భావముc - ద్రుంచు ప్రభు నొద్ద గురి - యుంచి ప్రార్థించు మిcక ॥వద్దు॥

*-పురుషోత్తము చౌదరి*

## 474 యేసుకొరకే జీవింతును

రా-ముఖారి తా-ఆది

యేసుని కొరకై యిల జీవించెద - భాసురముగ నే ననుదినము = దోసములన్నియు బాపెను మోక్ష - ని వాసమున ప్రభు జేర్చునుగా ॥యేసుని॥

1. నాశనకరమగు గుంటలోనుండియు - మోసకరంబగు యూబినుండి = నాశచే నిలపై కెత్తెను నన్ను పి - శాచి పథంబున దొలగించెన్ ॥యేసుని॥

2. పలువిధముల పాపంబును జేసితి - వలదని ద్రోసితి వాక్యమును - కలుషము బాపెను కరుణను బిలిచెను - సిలువలో నన్నాకర్షించెను ॥యేసుని॥

3. అలయక సొలయక సాగిపోదును - వెలయగ నా ప్రభు మార్గములన్ = కలిగెను నెమ్మది కలువరిగిరిలో - విలువగు రక్తము చిందించిన ప్రభు ॥యేసుని॥

4. శోధన బాధలు శ్రమలిల కల్గిన - ఆదుకొనును నా ప్రభువనిశం = వ్యాధులు లేములు మరణము వచ్చిన - నాధుడే నా నిరీక్షణగున్ ॥యేసుని॥

5. బుద్ధి విజ్ఞాన సర్వసంపదలు -గుప్తమై యున్నవి - ప్రభునందు = అద్భుతముగ ప్రభు - వన్నియునొసగి -దిద్దును నా బ్రతుకంతటిని ॥యేసుని॥

6. అర్పించెను దన ప్రాణమునాకై - రక్షించెను నా ప్రియ ప్రభువు= అర్పింతును నా యావజ్జీవము - రక్షకు దేసుని సేవింప ॥యేసుని॥

7. ప్రభునందానందింతును నిరతము - ప్రార్థన విజ్ఞాపనములతో = విభుడే దీర్చునుయిలనా చింతలు - అభయముతో స్తుతియింతు ప్రభున్ ॥యేసుని॥

8. యౌవన జనమా - యిదియే సమయము యేసుని చాటను రారండి= పావన నామము - పరిశుద్ధ నామము - జీవపు మార్గము - ప్రచురింపన్ ॥యేసుని॥

*-రావి జాన్ సుందరావు*

## 475 మంచి క్రైస్తవుల గుణములు

రా –ఆనందభైరవి (చాయ : వారు భాగ్యవంతులు) తా–అట

వారె మంచి క్రైస్తవులు గదా – యీ లోకమందు – వారె మంచి క్రైస్తవులు గదా చేరునట్లు చేయుడి. = పారమార్థమైన క్రీస్తు – సారవాక్య మనుభవించు – వారి దారి గోరి జేరి – భూరిసుఖముc బడయునట్టి ॥వారె మంచి॥

1. కపట వేష భాష లెల్లను – తొలంగc ద్రోచి – విపుల భక్తి నిపుణు లగుచును= లపితములు నసత్యములును – శపధములును లేక దేవ – కృప మనంబులోన వెలిగి – యుపరిభాగ మరయునట్టి ॥వారె మంచి॥
2. నమ్మకంబు సుస్థిరంబుగా – మనంబులోన – సమ్మతంబు గలిగి మెండుగా = క్రమ్ము కొనెడి శ్రమలయందు – సొమ్మసిలక ప్రభుని పా – దమ్ములందు బుద్ధి నిలిపి – నెమ్మది గలవార లెవరో ॥వారె మంచి॥

## 476 యేసు భాగ్యదాత

రా –రేగుప్తి తా–ఆది

యేసుని సేవింప దయచేసితివి – ప్రేమస్వరూప – యేసుని = దాసులనందరిని దరి జేర్చుటకును –వాసికెక్కి పరవాసము చేసెడి ॥యేసుని॥

1. ఆదియందు భూమ్యాకాశంబుల – శక్తి ఆత్మ నింపార సృజించిన ॥యేసుని॥
2. శత్రువులగు జనసంఖ్యను బొడగని – మిత్రుడగుచు దనమేను నొసంగిన ॥యేసుని॥
3. పాపులెల్ల దనప్రాపుగోరుకొని – దాపుగరండని దయచేc బిల్చెడి ॥యేసుని॥
4. సకల శుభంబులు చక్కగ నిచ్చుచు సకలభక్తులను సమముగc జూచెడి ॥యేసుని॥
5. తన్ను నమ్ముకొని యున్న దీనులకు – దన్నుగ[1] నుండెడి సన్నుతుడగుమా ॥యేసుని॥

[1]ప్రాపుగ.



6. చక్కని గుణములు లెక్కలేక తన – చక్కని యాత్మను చిక్కగcబట్టిన ॥యేసుని॥
7. లోకమంతయును లోcబడుచుండcగ – నేక ప్రభువై యేలుచుండుమా ॥యేసుని॥

–పులిపాక జగన్నాధము

## 477 ఇహలోకము విశ్రాంతి లేనిది

రా –శుద్ధకాంభోజి (చాయ : విజయంబు విజయంబు) తా–కురుజంపె

ఏది నా విశ్రాంతి – యీ లోకమందు – నే దిక్కు గనుcగొన్న – లేదు సుఖ మెందు = [1]మేదురా [2]మోద ని – [3]త్యోదగ్ర మోక్ష పుట – భేదమున చొరకున్న–లేదు సుఖ మెచట ॥నేది॥

1. కష్టములు తెరతెరలు – గా వచ్చిన మదాత్మ – దృష్టి దప్పక యోర్చి – తీరమంద వలయున్ = స్పష్టమగు నా త్రోవ – పయనంబు తుద ముట్ట – శ్రేష్ఠ మగు నా యిల్లు చేరు నందాక ॥నేది॥
2. కోరింద పొదచుట్టు – కొనియుండ నిమ్ము నేc – గోర నిచట గులాబి – కుసుమ శయనంబు = నేరీతినైన నా – యేసు రొమ్మునc జేరి – భూరిసుఖ మొందెద వి– చార మిcక నేల ॥నేది॥
3. యేసుప్రియ మించు కే – నెటిcగి కన్గొను వేళ – నా సంతసము నిండు – పాసి చనె వెతలు = భాసురంబుగ మంచు – పగిదిc దళ తళలాడc – జేసె నా కన్నీళ్లు – చింత లెడcబాపి ॥యేది॥
4. ఉండునే సందియము – లుండునే దుఃఖములు – గండములు ఢీయను చు బైకి రాc గలవే = మెండుగా మధురమై – యుండు మోక్షము నాకుc – దండ్రితో గడియ సే – పుండిననుc జాలు ॥నేది॥
5. నడుము పై నొక సంచి – బడెకట్టె చేతిలో – నిడికొనుచు శత్రువుల – పుడమి వే గడుతున్ = నడుదారి కరుకు నె – న్నక వేగ రక్షింపc – బదుదునని పాడి చని – పరమసుఖి నౌదు ॥నేది॥

– పురుషోత్తము చౌదరి

[1]దట్టమైన. [2]సంతోషముచేత. [3]గొప్పదియైన

## 478 విజ్ఞాని విసుగు

రా –శుద్ధకాంభోజి (చాయ : విజయంబు) తా–జంపె

విసుకదే ప్రాణంబు – విజ్ఞాని కిలను – పొసగు వైరాగ్యంబు – పుట్టదే – తలను = అసదు గానట్టి క – ష్టానుభవమే గాని – యసదృశానంద ఫల – మొసగుఁ నది యేది ॥విసుకదే॥

1. మును పేది యుండెనో – వెనుక నదియే యుండు – మునుపు వెనుకకు మధ్య – మున నున్న దదియే = నొనరంగఁ గ్రొత్తయై – యుత్పన్నమగు నట్టి – ఘనకార్య మొక్కటియుఁ – గానంగరాదు ॥విసుకదే॥

2. ధరణి మీఁదికి దిగం – బరుఁబగుచు నేతించు – మరణ మప్పుడు దిగం – బరుఁడగుచుఁ బోవున్ = నర్రుడు పుట్టినఁడు – సరెకెద్దియును తేఁడు – మరణమగు నాఁడొక్క – సరకుగొనిపోఁడు ॥విసుకదే॥

3. ఒక తరము పోవు మరియొక తరము జనుదెంచు – సకల వంశము లిట్లు – సమసిపోవుచుండు = నిఁక వారి పేర్పెంపు – లెచ్చోట నేమాయె – నొకండైన చెప్పుటకు నుర్విలో లేఁడు ॥విసుకదే॥

4. ఏటివంకలు దీర్చ – నెవ్వాని కలవి ము – న్నీటి మూఁకుడు సేయ – నేర్పరి యెవండు = మోటైన మనసు వం– పులు దీర్చు గురు వెవఁడు కోటి ధనమిచ్చినను – కుంభినిని లేఁడు ॥విసుకదే॥

5. ధరణిలో నరరూపు – దాల్చి పాపుల కొఱకు – మరణమై లేచు స – ద్గురు డైన యేసు = చరణాబ్జముల సేవ – సారమిది యొక్కటే – పరమ ఫలమిదు సుఖ – ప్రాప్తి యొనరించున్ ॥విసుకదే॥

– పురుషోత్తము చౌదరి

## 479 క్రైస్తవ యాత్రికుఁడు

రా –తోడి (చాయ : వారు భాగ్యవంతు) తా–ఆది

ఇందులేదు నిలుచు పట్టణం – క్రీస్తు యాత్రికులకు – నిందు లేదు నిలుచు పట్టణం ॥బిందు॥

1. పాదుకొన్న లౌకికునకు – బహుళదుఃఖ మిది మఱి సొం – పై దగు మేల్ చోటు వెదకు – భక్తుఁడ వెత నొంద కెప్పు ॥డిందు॥



2. మాకు నిల్లి దైన దుఃఖ– మౌకదా వచ్చు పురము – దాకొనంగ వెదకె దము – ధైర్య మిచ్చు నిదియె మాకు ॥ఇందు॥

3. మనము యాత్ర వారి వలెనే – ఘనత విశ్రమంబులేక – కినుక నీలోక మునను – గ్రింది వన్ని వదలు దాము ॥ఇందు॥

4. మిగుల యాత్ర పరులవిశ్ర –మించు సౌఖ్య వాసమా –ఖగము వలెనే టెక్కలున్న – నెగిరి నిన్నుఁ జేరుకొందు ॥ఇందు॥

5. సద్దు నాయాత్మ నణంగ –వద్దు తగిన వేళగామి – యొద్ది కతని తలఁపు జేతుఁ నొసఁగు విశ్రమం బతండె ॥ఇందు॥

–జె. ఈ. షార్కీ

## 480 లోకము క్రీస్తుకు సాటిరాదు

రా –మారువ తా–ఆది

లోకము వారెల్ల – లోకువఁ జూచిన – [1]లోపము నీకేమిటి = ప్రాకట ముగఁ గ్రీస్తు – పతిత పావన మూర్తి – నీకోసమై ముక్తి – [2]నిలయము గట్టంగ ॥లోకము॥

1. [3]దరిలేని [4]దురిత[5]దు – స్తర [6]పారావారము – దాటించు వారెవ్వరు – భీకరమైన – నరకాగ్ని బెట్టు [7]బం – ధుర దేవకోపాగ్ని – మరలించు వారెవ్వరు – చంచల బుద్ధి = స్థిరపరచి [8]పరమార్ధ – మెఱిఁగించి చిరముక్తి – గురి దెల్పు వారెవ్వరు – ఈ ధరలోన = నరరూపుఁ దాల్చి నీ – కొఱకై జీవన మిచ్చు – [9]కరుణాబ్ధి క్రీస్తుఁడు – వరదుఁడై యుండంగ ॥లోకము॥

2. మాటి మాటికిఁ బాప – మార్గమునఁ జనుచుండ – మది ద్రిప్పు వారెవ్వరు – సైతానుని – తాటించి మరి వాని –[10]కేటించి యభయ హ– స్తము నిచ్చు వారెవ్వరు – మృత్యువు ముల్లు = మీటించి సుఖమాత్మ –నాటించి తన [11]యోర్మి – చాటించు వారెవ్వరు – యెరుషలేము = బైట కల్వరిమెట్ట– పై మేను బలియిడిన – [12]మేటి క్రీస్తుని నామా – మృతము నీకుండంగ ॥లోకము॥

---

[1]కొదువ. [2]ఇల్లు. [3]గట్టులేని. [4]పాపపు. [6]దాటశక్యముగాని. [7]సముద్రము. [7]విశేషమైన. [8]వాస్తవము. [9]దయాసముద్రుడైన [10]వేరుపరచి. [11]ఓర్పు. [12]శ్రేష్టమైన.

3. హృదయ సంతాపదుః- ఖ దురంతమగు చింత - ల్వదిలించు వారెవ్వరు - నెమ్మది నిచ్చి - పదిలమ్ముతో మోక్ష - పద మిదుగో యంచు - పదమను వారెవ్వరు - ఎన్నడు నిన్ను = వదలి వెయ్య మంచు - మృదువాక్యములు తెల్పి - ముద మిచ్చు వారెవ్వరు నింకొక నాఁడు = సదయుఁడై క్రీస్తుఁడు - చనుదెంచి నిను ముక్తి - [1]సదనస్థునిగఁ జేయు శాస్త్రోక్త మిటులుండ ॥లోకము॥

- పురుషోత్తము చౌదరి

## 481 లోక సౌఖ్యత్యజనము

రా -పున్నాగ తా-త్రిపుట

చాలును లోక భోగములు - చాలును = చాలును మీనమును బట్టు - గాలమైయున్న భోగములు ॥చాలును॥

1. ఎండమావులే నీరనుచు = మెండుగఁ బరుగిడు జింక కుప - ముండనై బలహీను నైతిఁ ॥చాలును॥
2. బూరుగ పండారగింపఁ = గోరి కాచికొని యున్నట్టి - కీరసామ్య మైతి నయ్యో ॥చాలును॥
3. దీపపు దీప్తి నాశించి = యూపిరి విడు పురుగు రీతిఁ - బాపపు భ్రమచే నట్లయితిఁ ॥చాలును॥
4. పూలతో ఁటయందుఁ బెరుగు = బూరుగ వృక్షంబునై నే - మేలునకు మూలముగాన నైతిఁ ॥చాలును॥
5. చల్లిన వితనము ట్జంపు = చౌట భూమి వలె నేఁ గాఁగ - సత్యము నిష్ఫలమయ్యె నకట ॥చాలును॥
6. మాయ సంత నైతి యేసు = నాయక నన్విడక మార్పు - జేయుమి నెన రుంచి నాపైఁ ॥చాలును॥
7. తొల్లి నన్ రప్పించినట్టి = చల్లని సువార్త తేజ - ముల్లమందు నుండఁ జేయ ॥చాలును॥

[1]స్థానమందు ప్రవేశించినవాని.



8. మంచు పోల్కె ననుఁ జేయుటకై = ముంచుమీ నీ రక్తాంబుధిలోఁ - బెంచుమి నీ వాక్సారము చేఁ ॥చాలును॥
9. చెడ్డ బిడ్డ నయ్య నేను = దొడ్డ రక్షకుండ వీవు - అడ్డులేక నన్నుఁ బ్రోవు॥చాలును॥

- బేతాళ జాన్

## 482 క్రైస్తవ యాత్ర

రా -బిలహరి తా-అట

పదరే సోదరులార - పంమపురిఁజేర - మధుర జీవాధార - పదవిచేకూర = తుది మొదలును ఆపద - రేబగలు లేని - సదనంబునకు జేర - సదయు డేసునిఁ గూడి ॥పదరే॥

1. ఎన్ని దినములు బ్రతుక - నేమి సౌఖ్యంబు - అన్ని విధముల జూడ -నధిక కష్టంబు = కన్ను మూసిన నాఁడు - మన్ను పాలౌదుము - మున్ను జాగ్రత్తనొంద- కున్న నష్టము గల్గుఁ ॥బదరే॥
2. ధరణి బ్రతుకును గోర - మరణ భయంబు - దరిలేని చింతలఁ - దగిలి నిత్యంబు = పరి పరి విధముల - పరుగు లెత్తుట లేల - నిరతంబును సువార్త - సరణిఁ గన్గొని వడిగఁ ॥బదరే॥
3. ధనము సంపాదించి - ఘన మదిక మున్న - తనువే సతము గాదు - అను భవము సున్న = ఇనుఁ డెంద మావు-లను గోర నేపాటి - తనివి దీరు నిచ్ఛో- టను నా పాటే దీరుఁ ॥బదరే॥
4. పరలోక మార్గం - బిరుకై గన్పడును జొరగా సంకటములు - నెరిజుట్టుకొనును = పరమ జనకుని కృపా - వరము తోడుగ నున్న - వెరపు నొంద మింక - సరకు సేయుము పద ॥బదరే॥
5. ఇహ స్నేమముల మన - కిఁకఁజాలుఁ జాలు - బహు దినంబులు సేయంఁ - బడె నేమి మేలు = మహిమ దూతల స్నేహ - మమరు నచ్చట - మనకు అహహా యేసుని జూడ - నధిక సంతోషంబు ॥పదరే॥
6. మనల తోడ్కొని పోవ - ఘనుఁడు యెహోవా - యనంబు తన శుద్ధా - త్మను నిచ్చి కావ = నెనలేని యడ్డంకు - లను దాఁటింపను గృప - గనుపర్చి తోడుగ - నునిచె వేగము గూడి ॥పదరే॥

7. భక్తులై యున్నట్టి - బంధు మిత్రాదుల - రక్తి గుణముతో - రంజిల్లc గనినన్ = ముక్తి రాజ్యంబుల - మురువుతోడ సర్వ - శక్తుని మహిమ నా - సక్తితోc జూతము ॥పదరే॥

- విలియం డాసన్

## 483 జీవితయాత్ర

రా–ముఖారి తా–ఆది

పరదేశుల మో ప్రియులారా మన = పుర మిదిగా దెపుడు - నిజముగc ॥బరదేశుల॥

1. చిత్రవస్తువులు - చెల్లెడి యెకవి - చిత్రమైన సరిత - లోకము ॥బరదేశుల॥

2. సంత గొల్లు క్షమ - సడలిన చందం = బంతయు సద్దణcగున్ - నిజముగc ॥బరదేశుల॥

3. స్థిర మని నమ్మకు - ధర యెవ్వరికిని = బరలోకమె స్థిరము - నిజముగc ॥బరదేశుల॥

4. మేడలు మిద్దెలు - మేలగు సరకులు = పాడై కనcబడవే - నిజముగc ॥బరదేశుల॥

5. ధర ధాన్యంబులు - దరగక మానవు = పనిపాటలు పోయె - నిజముగc ॥బరదేశుల॥

6. ఎన్ని నాళ్ళు - మన - మిలలో బ్రతికిన = మన్నై పోవునుగా - దేహము ॥పరదేశుల॥

7. వచ్చితి మిచటికి - వట్టి హస్తములc = దెచ్చిన దేదియు లే - దు గదా ॥పరదేశుల॥

8. ఎట్లు వచ్చితిమి - యీ లోకమునకు = అట్లు వెళ్లవలయున్ - మింటికిc ॥బరదేశుల॥

9. యేసు నందు వి- శ్వాసం బుంచిన = వాసిగ నినుc జేర్చున్ -బరమున ॥బరదేశుల॥

10. యేసే మార్గము - యేసే సత్యము = యేసే జీవముగా - నిజముగ ॥బరదేశుల॥

- గొల్లపల్లి నతానియేలు



## 484 లోక విసర్జనము

రా - బిలహరి (చాయ : ఎందుకు మరచితివి) తా–త్రిపుట

పోపోవే యో లోకమా - చాలిcకcజాలు - నీ పొందు మే మొల్లము = పాపేచ్ఛలున్నంత- సేపు నొపcగ రాని - వేపాట్లు బెట్టితి - వీపట్ల నను వీడి ॥పోపోవే॥

1. సకలేంద్రియ వ్యాప్తులు - నీ సేవ బా - యక చేయు దివసంబులు = ఇc క దీరి పోయె బ్రా - మికము జూపకు మిపుడు - ప్రకటమ్ముగc గ్రీస్తు - పద భక్తి మా కబ్బెc ॥బోపోవే॥

2. నీ రాజు బహుమానము - గంటిమి ఘోర - నరకాంబుధి తీరము = దారి దొలcగి నిన్ను c - జేరి దుcఖముల వే - సారి తిప్పుడు క్రీస్తు - సదయుcడై ననుcబిల్చెc ॥బోపోవే॥

3. ఎఱ జూపి బలు మీనము - బట్టెడు వాని - కరణి వస్తుల రూపము = బొరి జూపి లోభము - బుట్టించి ననుcబట్టి - పరిమార్చితివి యింక - మరి యేమున్నది చాలుc ॥బోపోవే॥

4. ఎండమావుల తేటలు - నీ విచ్చెడు - దండైన యిహ సుఖములు = కండ గర్వముచే నీ - యండc జేరితిcగాని - నిండు నెమ్మది దయా - నిధి క్రీస్తు డిపు డిచ్చుc ॥బోపోవే॥

- పురుషోత్తము చౌదరి

## 485 భక్తుని వృద్ధాప్యము

రా -సావేరి (చాయ : ఉన్నపాటున వచ్చు) తా–అట

సకలేంద్రియములారా - చాల మీ పని దీరె - నిcక నన్ను విడిచిపోవు టకు వేళయ్యెన్ = [1]చకిత [2]మృగ శాబకము పోలిక - నకట మీచేc జిక్కి తిని మీ -రి క దొలంగుcడు యేసు నా ర - క్షకుcడు వచ్చెను నన్ను - గావను ॥సకలేంద్రియములారా॥

1. పంచేంద్రియములారా - బల ముడిగె మీ కిపుడు - వంచన సేయ మీ - వశముగా దిcకను = మించి మీ రెదిరింపలేరు ద- లcచి చూడుcడు దేవ కృపలో - నుంచి ననుc గదలింప మీకది - కొంచెమగు పని కాదు నుండి ॥సకలేంద్రియములారా॥

---

[1]భయపడి. [2]లేడిపిల్ల.

2. శ్రవణేంద్రియము నీదు – శక్తి తగ్గుచు వచ్చె – వివిధవార్తలు దవిలి – విను చుంటి వెంతో = చెవుదు నీకిపు డనుసరించెను – చేవ తణిగెను జరిగి పొమ్మికఁ– సవినయంబుగ యేసు క్రీస్తుని – శబ్ద మాలించెదను సుఖ మది ॥సకలేంద్రియములారా॥

3. కనులారా మీ వెల్గు – క్రమముగ [1]క్షీణించె– మును జూచు చూడ్కిలో – ముసు కయ్యె నిఁకను = ఘనముగల దేవుని కుమారుఁడు – తన కృపాసన మిపుడు జూపను – మనసులోపలి కన్ను విప్పెడి – దినము లివె చనుదెంచెఁ జూడుఁడు ॥సకలేంద్రియములారా॥

4. రసనేంద్రియము నీ [2]నీ –రసకాల మిదె వచ్చె – విసుకని మాటలనువెదజల్లి నావు = పసఁ దరిగి ముది వైతి విపు డో – రసనమా యిఁకఁ దీరె నీ పని – [3]వెసను నే నిపు దేసుకరుణా – రసముఁ గ్రోలుచుఁ బ్రొద్దుఁ బుచ్చెద ॥సకలేంద్రియములారా॥

5. తను వాద్యంతము మూయఁ – దగిన త్వగింద్రియమా – నిను సోకునట్టి వ – న్నియు గ్రహించితివి = మునుపుగల నీ జిగిబిగియు నణం – గెను గదా వ్రేలాడెఁ దిత్తులు – చనుము నీ వెందైన నేనే – సుని స్వరూపముఁ దాల్ప బోయెద ॥సకలేంద్రియములారా॥

6. ఘ్రాణేంద్రియమ నీవు – కడు వాసనలఁ దగిలి – ప్రాణానిలము చేతఁ – బ్రబలితి విఁకను = నాణెమైనవి విడును దుర్గం ధముల బాల్పడఁ బోదు విఁక నా – [6]త్రాణపతి యగు క్రీస్తుచేతను – బ్రాణ మర్పింతును సుఖింతును ॥సకలేంద్రియుములారా॥

7. కడు దవ్వు పయనంబు – నడిచి వచ్చితి నింక – నిడుపు లే దా త్రోవ – నికటమై వచ్చెన్ – నడుమ నడుమ నడ్డుపడియెడ – నిడుమ లన్నియు గడిచిపోయెను – జడుతు నా మృతి నదికి నా నా – వికుఁడు వచ్చెను నన్నుఁ గావను ॥సకలేంద్రియములారా॥

8. వెనుకఁ దీరిన మార్గ – మున కంటె ముందుండి – కనుపించు నా త్రోవ – కఠినమై యుండు = ఘన తరంగ ధ్వనుతో భీ – కర మరణ నది పాఱు చున్నది – క్షణము మాత్రమె దాని పని యా – వెనుక నావలి యొడ్డు జేరెద ॥సకలేంద్రియములారా॥

[1]తగ్గెను. [2]క్షీణదశ. [3]శీఘ్రముగా. [4]రక్షణాధికారి. [5]దూరము. [6]ఆపదలు.



9. ఈ సంసారంబునం – దేమి సౌఖ్యము గలదు – ఆశ మాత్రమె గాని – యది చిరము గాదు = యేసు క్రీస్తుఁడు తండ్రి దేవుఁడు – భాసురం బగు నిర్మలాత్మయు – దాసులకు దమ దివ్య మగు కృప – జేసి నిత్య నివాస మిత్తురు॥సకలేంద్రియములారా॥

– పురుషోత్తము చౌదరి

## 486 భక్తుని జీవితప్రయాణము

రా –యదుకులకాంభోజి తా–ఆది

పైనమై యున్నా నయ్యా నీ – [1]పాదాంబుజముల సన్నిధికిఁ ప్రభు యేసు నాతో నుండవే నీవు = దీనుఁడ భవ [2]దా – ధీనుఁడ ననుఁ గృప – తో నడిపించు మె – దుట నదె సింహ – [3]ధ్వానముతో మృతి వచ్చు చున్నది – దాని [4]భయోత్పా – తము దొలఁగింపవె ॥పైనమై॥

1. [5]సరణిలో నేఁబోవునపుడు – శ్రమ లెన్నెన్నో చనుదెంచి నా – పరుగు కడ్డముగా నిలుచునేమో = మరణపు ముళ్లను – విరుచుటకును ద – ద్దురవస్థలు వెసఁ – దొలఁగించుటకును – గరుణానిధి నా – సరస నుండుమీ–[6]శరణాగతునకు – మరి దిక్కెవ్వరు ॥పైనమై॥

2. దేవా నీ [7]దక్షిణ హస్తముతో – దీనులను బట్టెద వెరవకుఁ దను – నీ వాగ్దాత్తమున కిది సమయంబు = ఆ వచనము నా – జీవాధారము – దైవము తల్లియుఁ దండ్రియు దాతవు – నీవే సర్వము – నిను నమ్మితి నా– త్రోవ ప్రయాణము – తుదముట్టించుము ॥పైనమై॥

3. పొందుగా నీ భక్తియందు – డెంద మానందించు నపుడు – సందియము లెన్నెన్నో చనుదెంచి = తొందర [8]నిడు – నా – త్రోవను [9]తద్గా –ఢాంధత మిశ్రమ – లణఁగించుటకై – సుందరమగు [10]రవి – చందంబున – నా ముందట నడువవె – ముదమునఁ బ్రభువా ॥పైనమై॥

[1]పద్మములవంటి పాదముల యొక్క. [2]నీకు లోబడినవాడను. [3]సింహగర్జనము. [4]భయమువలన కలుగు ఉపద్రవములు. [5]త్రోవ. [6]శరణుజొచ్చినవానికి. [7]కుడిచేయి [8]కలిగించుము. [9]ఆ గొప్ప కటిక చీకటియందుండు. [10]సూర్యుని.

4. కాలం బయ్యెను రారమ్మనుచు – [1]నీల మేఘాకృతితో వచ్చి – కాలదండము [2]జిరజిర ద్రిప్పుచు = చాల [3]భయానక – లీలన్ మృత్యువు – [4]మ్రోల న్నిలిచిన – వేళను [5]దాలిమి – దూలి చనుం గా – బోలు [6]భవత్కరు– ణాలింగన సుఖ – [7]మత్తఱి నొసఁగవె ॥పైనమై॥

5. నీ దివ్య రూపధ్యానంబు – నిర్మలాత్మాంతర సౌఖ్యంబు – నా దేవుని ప్రేమామృత సారంబు = నీ దాసుని కవి – నిరత మొసంగుచు – నా దారిని గల – సేదలు దీర్పను – నాదియు మధ్యము – నంతము లేని పు – నాదులుగల నీ – [8]సౌధము జేర్పవె ॥పైనమై॥

6. ఎండమావుల [9]కీడైనట్టి – యిహ సౌఖ్యములు త్వరగాఁబోవు నీ – నిండు దరుగని నిత్యానందంబు = దండిగ నీయం –దుండిన వారి క– ఖండామృత సౌ – ఖ్యము లిచ్చెదవట – తండ్రీ భవ దు – త్తమ దాసుల నీ – వుండిన చోటనె – యుంచుము చాలును ॥పైనమై॥

– పురుషోత్తము చౌదరి

## 487 *Whither pilgrims, are you going ?*

1. పరదేశి, పుణ్యక్షేత్ర
యాత్రఁ బోవుచుందువా?
యేసు నాజ్ఞ తల పోసి
మోక్ష మొందఁ బోదును.
కొండ లెక్కి యేళ్లు దాఁటి
మోక్ష రాజ్యమ్ చేరుదాఁక
ముందు పోవుచుందును.

2. ఒంటిగాను బోవుదువే
నీకు భయ ముండదా?
లేదు నాకు భయమేల?
స్వామి నన్నుఁ గాచును ;
మోక్ష రాజ్యం చేరుదాఁక
యేసు నాకుఁ దోవచూప
ముందు పోవుచుందును.

3. పరదేశి, మోక్షమందు
నీకు లాభ ముందునా?
నిత్యానంద సువిశ్రాంతి
యందు నుండు లాభము.
జీవనది నీళ్లు త్రాగి
యేసుతో సదా వసింప
ముందు పోవుచుందును

4. పరదేశి, నీతో నేను
యాత్ర చేయ వచ్చునా?
రమ్ము నాతోఁ గూడ రమ్ము
యేసు నిన్ను రమ్మనెన్
మార్గాయాసమైన నేమి
మాకు మోక్షం చిక్కు వేళ
సువిశ్రాంతి కల్గును.

అను : బర్నార్డ్ లూకాస్

---

[1]కారుమబ్బుల ఆకారముతో. [2]గిరగిరమని. [3]భయమును కలిగించునట్టి. [4]ఎదుట. [5]ఓర్పు. [6]నీ కరుణచేత నన్ను కౌగలించుకొనగా గల్గు సౌఖ్యమును. [7] ఆ సమయమునకు. [8]గృహమును. [9] సమానమైనట్టి



# క్రైస్తవ నిరీక్షణ – ఆనందము

## 488 క్రీస్తునందు ఆనందించుట

రా –బిలహరి (చాయ : విజయంబు విజయంబు) తా–అట

ఘనమైన క్రీస్తు కృపఁ – గనుగొంటి నిపుడు – ఘనుఁడు తన మహిమచేఁ – గాఁచి పెంచెను నన్ను ॥ఘనమైన॥

1. ఆపదలలో మునిఁగి – యడలుచుండఁగ నన్నుఁ – జేపట్టెను చింత – చే జెడకు మనుచు – వేపాకు కన్న నిది – వెగటైన నా జిహ్వ – తీపుగా నొనరించి – స్థిరపరచె నిపుడు ॥ఘనమైన॥

2. ఘనమైన యాపదల – కడలిలోఁ బడి యున్న – ఘనుఁడు నా దెసఁ జూచి – మనసు నొచ్చుకొనియె – కనికరముచే నిన్నుఁ గరుణింతు నిప్పుడె – వెనుకఁ జూడక తనదు – వెంట రమ్మనెను ॥ఘనమైన॥

3. కుల గోత్రములు వీడి – కుటిలంబు దిగనాడి – వలబద్ద చేఁపవలె – వదల కని పలికెన్ – సిలువపై నసు విచ్చి – బలహీన మెదలించి – వలవలను కన్నీరు– వల పోసినాఁడు ॥ఘనమైన॥

4. పర్వతములపైఁ గట్టు – పట్టణమువలె నిన్ను – నుర్విలో నుంచితి – నుచి తంబుగాను – సర్వజనులకు వెలుఁగు –సాక్షిగా నీవుండి – గర్వింప వలదనుచు ॥ఘనమైన॥

5. సదమలం బగు జ్ఞాన – సరణి యిదె నా మాట – ముదముతో నమ్మినను – మోక్ష మొసఁగెదను – కదిసి సాతాను బలు – కాడిక్రిందను బడిన – విదలించి నరకమున – వేతునని పలికెన్ ॥ఘనమైన॥

–యేసుదాసు నర్సయ్య

## 489 మనశ్శాంతియే మహా భాగ్యము

రా –సౌరాష్ట్ర తా–అట

మనసానందముఁ బొందుట కన్నను – మరి యే భాగ్యము గల దన్న = అనుమానము లిఁక – సఖిల సుఖంబులు – దిన మొక గడికొక – తీరై యుండును ॥మన॥

1. దిటముగఁ బ్రార్థన యను ఖడ్గముఁ గని – తిరుగు పిశాచము వెఱ చన్న = పటుదీప్తులు గల – ప్రభు శాస్త్రోక్తులు – బహు సంశయ పం – కము నింకించును ॥మన॥

2. సాధు జనోత్తమ క్రైస్తవ సంగతి – సమకూడిన మేలౌ నన్న = శోధన లన్నిటి – స్థిరముగ నోర్చెడి – శుభమతి కన్నను – సుఖమే మున్నది ॥మన॥

3. తనువున దానను వానికి దురితము – దగిలెడు విధిఁ గనవలె నన్న = యొనర గ క్రీస్తుని – వధ్యాస్తంభముఁ – గని విశ్వాసముఁ – గట్టిగఁ బెంచిన ॥మన॥

4. క్షమయును స్నేహము ప్రభుకడ నేర్చిన – శత్రువు లింక భువి లేరన్న = సమదృష్టి జగ – జ్జనుల గనుంగొను – సత్క్రైస్తవులకు – సాధన మనఁ దగు ॥మన॥

5. పరమదయానిధి క్రీస్తుని బలమునఁ – బాప భరంబులు విడు నన్న = పరిశుద్ధాత్ముని – బంధుత్వంబున – అరమర చీఁకటు – లన్నియుఁ దొలఁ గును ॥మన॥

–పురుషోత్తము చౌదరి

# 490 క్రీస్తునందు ఆనందించుట

రా –ముఖారి తా–త్రిపుట

మా యేసు క్రీస్తుని – మఱుఁగు గల్గెనురా = నా యాత్మ ఘనరక్షా – [1]నగమ నెక్కెను రా ॥మా యేసు॥

1. ముందు నాలో పాప – ములు జూడఁ బడెరా దెందము తా నన్ని – టిని నొప్పుకొనెరా = యందుకై బలు దుఃఖ మాత్మఁ జెందెనురా –సందేహములు [2]వీడు – జాడఁ గన్గొనెరా ॥మా యేసు॥

2. సువిశేష బోధనా – చెవు లాలించెనురా – అవివేక [3]శాస్త్రోక్తు –లంటు వీడెనురా = [4]నవసత్క్రైస్తవ [5]గోష్ఠి – భువి నా కబ్బెనురా – వివిధము లగు [6]వేల్పు – ల్విష మైరిగదా ॥మా యేసు॥

3. బాధగురువుల మోము – ల్బహు [7]లజ్జఁబడెరా – [8]గాఢ మంత్రము లన్ని – [9]కడగండ్లయి చెడెరా = శోధించి నాయాత్మ – శుద్ధిగోరెనురా – సాధించి ప్రభుక్రీస్తు – శరణుఁ జొచ్చెనురా ॥మా యేసు॥

[1]కొండ. [2]విడిపోవు. [3]శాస్త్రంపుమాటలయెక్క. [4]నూతనమైన. [5]సహవాసము. [6]దేవుళ్లు. [7]సిగ్గు [8]చిక్కైన. [9]బాధకరములు.



4. మతిలోని లోఁతు మ – ర్మము గానఁబడెరా – మితిలేని ఘనపాప – మే నిండు కొనెరా = హితముగా తన జీవ – మిచ్చె క్రీస్తుఁడురా – మృతిచేత మన పాప – [1]వితతి గొట్టెనురా ॥మా యేసు॥

5. కులగోత్రముల బుద్ధి – కుటిలంబుఁ దెగెరా – బలవత్పిశాచ శృం ఖలము విఱిగెనురా = సిలువ మోసినవాని – చిర సౌఖ్యోన్నతిరా– నెలవుగ నాలోన – నిలచి యున్నదిరా ॥మా యేసు॥

6. తనపోల్కె నొరులఁ గ – న్గొనఁ బ్రేమయ్యెనురా – మనసు దేవునికి న – ర్పణ సేయఁ బడెరా = ఘన కృపశాంతులు – గొనెను నెమ్మదిరా – మనసు మార్పడి మోక్ష – మహిమ గన్గొనెరా ॥మా యేసు॥

– పురుషోత్తము చౌదరి

# 491 పరమభాగ్యము కొరకు ఎదురుచూచుట

రా –శ్రీరాగము తా–అట

యేసును చూచుట యెన్నటికో పర – వాసుఁడ నగుట యెన్నటికో = భాసురముగ నా – పరమ జనకు సిం – హాసనమున దూ – తాదుల మధ్యను ॥యేసును॥

1. బలితంబగు పైశాచిక బంధన – పాశము వదులుట యెన్నటికో = [2]సలలితముగ నా – సద్గురు పాద – స్థలమున కరఁగుట యెన్నటికో ॥యేసును॥

2. ధాత్రిఁ గష్ట దుఃఖాబ్ధిని మన మింక – ధాటిగ దాఁటుట యెన్నటికో = మైత్రితోడఁ బర మాత్ముని చెంతను – మనసు [3]తీర – మను టెన్నటికో ॥యేసును॥

3. కాంచనమకుటము కనకపు వీణెయు – ఘనముగఁ దాల్చుట యెన్న టికో = [4]యంచితముగ హాలె – లూయా పాటల – నానందించుట యెన్నటికో॥యేసును॥

4. శోధన బాధల నీ ధరఁ బొందక – శోకము గెల్చుట యెన్నటికో = సాధూత్తమ జన – సాంగత్యమ్మున – సంతస మొందుట యెన్నటికో ॥యేసును॥

[1]సహవాసము [2]చక్కఁగా. [3]బ్రతుకుట. [4]ఆశ్చర్యకరముగా.

5. నీతి రహిత పైశాచిక భటగణ - నిందలు బాయుట యెన్నటికో = ఖ్యాతిగ శ్రీ పర - మాత్మునిని కొలువున - గట్టిగc గుదురుట యెన్నటికో ॥యేసును॥

6. [1]జరయు వ్యాధి సంశోక మరణములు - జొరని చోటుండుట యెన్న టికో = పరిశుద్ధతయును - బరమానందము - ప్రబలు పదము జేరు టెన్నటికో ॥యేసును॥

## 492 పరలోక నిరీక్షణ

రా -కమాసు (చాయ : చూచుచున్నాము నీవైపు) తా-త్రిపుట

[2]వేచియుంటిమి నీ తట్టు - యేసువమేము - వేచి యుంటిమి నీ తట్టు = భాసురcబుగ మహిమన్ - [3]భాసిల్లురాకకై - నాశతో కరములు - చాచుచు నీవైపు ॥వేచి॥

1. కూడుచుంటిమి యిచ్చట - వేడుకగల - కూటంబులలో - కూర్మితో = [4]గోడులేనిపరమ - కూటంబులలో భక్త - కోటులతో గూడి - పాడుచునిన్ - స్తుతియింప ॥వేచి॥

2. నమ్మియుంటిమి నీ యొక్క - నమ్మకమైన - [5]నెయ్యంపు వాగ్దానములన్ = ఇమ్ముగ [6]దివికేగి - నెమ్మి [7]నెలవులు గట్టి -మమ్ముట దోడ్కొని పోవన్ = నమ్మబల్కిన మీకై ॥వేచి॥

3. [8]వెఱచుచుంటిమి యిచ్చట - తరుచుగగల్గె - కరుకైన స్థితిగతులలోన్ = కరువువేదన భీతి - మరణ దుఃఖములేని - పరమపురమున జేరి - మురియు టెప్పుడొ యంచు ॥వేచి॥

4. నిత్యంబు [9]విలసిల్లెడి - [10]నిశ్చలమైన - శృంగార స్వర్గంబున = ముత్యాల ద్వారమున - నిశ్చింతపోవుచు - బంగారువీధుల - సంచరించుట యెపుడో ॥వేచి॥

5. రంగుగు [11]క్షయధనముల - [12]సంగడిజేరి - భంగంబు పడుచుంటిమి = దొంగలుదోయని - చిమ్మటకొట్టని - తుప్పయిన పట్టని - యక్షయ ధనమునకై ॥వేచి॥

-బూల జాన్

[1]ముదిమి. [2]కనిపెట్టి. [3]ప్రకాశించు. [4]దుఃఖము. [5]ప్రేమగల. [6]పరలోకము. 7నివాసములు. 8భయపడుచుంటిమి. 9ప్రకాశించెడి. 10కదలని. 11నశించెడి. 12స్నేహము. 13నశింపని



# మరణము - పునరుత్థానము

## 493 క్రైస్తవునిమరణము

రా -అఠాణ తా-అట

జీవము పోవగన్ - దేవుని సన్నిధి - జీవుడు చేరున్ ॥జీవము పోవగన్॥

1. పుష్పము రాలగన్ -బాష్పము లేలన్ = బుష్పమువాడిన - [1]బుష్కల ఫలమగున్ ॥జీవము పోవగన్॥

2. [2]నిధన మొందగ - నిద్దుర పోవుటే = రోదనముండదు - బాధముగించెన్ ॥జీవము పోవగన్॥

3. [3]నష్టము భావమై కష్టము దీరున్ = ఇష్టముతో ప్రభు - యింటను జేర్చును ॥జీవము పోవగన్॥

4. పరమున జొరగన్ - హర్షమునొందన్ = మరణము గెల్చిన - సర్వదా జీవించున్ ॥జీవము పోవగన్॥

5. యేసుcడు లేచెన్ - దాసుcడు లేచున్ = [4]భాసుర గృహమున - వాసము చేయున్ ॥జీవము పోవగన్॥

- బర్నార్డ్ లూకాస్

## 494 భూస్థాపనము

రా -అసావేరి తా-చాపు

నిదురc బోయినట్టి - నీ పాద సేవకుని-సదయుcడగు తండ్రి - చక్కగా దాచు = సదమలంబగు లోకమున నీ - సదనమందునc జేర్చి శుద్ధుల - వదల కెప్పుడు వారితో నీ - పదయుగంబుల సేవcగోరుచు ॥నిదురc॥

1. ఇతcడీలోకమందు - నీవొసంగిన పని - హితమతి నొనరించె - యేసుని కృపను = సతతమును బాపంబుతోడను - జాల యుద్ధ మొనర్చి బ్రదుకను - నతిముదంబున నీకు నిరతము - నుతు లొనర్చెడు నాశcబూనుచు॥నిదురc॥

[1]అధిక. [2]మరణము. [3]చెడుపులేకుండ. [4]ప్రకాశమైన.

2. సన్నిధిఁ జేరిన - సకల వరభక్తుల - కన్నీరు దుడుతువు - కరుణ మీరంగ = నిన్ను నమ్మినవారి నడువడి - నీవు తేటగ నెఱింగా వారికి - జెన్ను గను దీర్చె దవు న్యాయము - సన్నుతింపగ సజ్జనావన ॥నిదురఁ॥

3. మరణ కాలంబున - ధరలోఁ క్రీస్తుని సిలువ - దిరముగఁ జూచిన - నరులందఱు = వరదుఁడగు రక్షకుని దయచే - జిరపురము నిక్కముగఁ జేరుచు-గరము నేర్తురు ప్రేమ నచ్చటఁ - దరతరంబులు గడుచుచుండగ ॥నిదురఁ॥

4. పరిశుద్ధుఁడగు దేవ - పాదసన్నిధిలోనఁ - బరిపూర్ణానందము - పొదు కొని యుండు = నరక బలములు చెరుపనేరవు - పరమ జనకుని సుతుల నెమ్మదిఁ - జిరదయాళుఁడు గాచు వారల - నిరతమును దన యాత్మ బలమున ॥నిదురఁ॥

5. యేసునాధుని నమ్మి - యిలను విడిచినవారు - భాసిల్ల లేతురు - ప్రభుశక్తి నిలను = భాసురంబగు దేహములు తన - దాసు లందఱి కిచ్చి మోక్షని - వాసులముగాఁ జేసి వారల - యాస దీర్చును మాటఁ దప్పక ॥నిదురఁ॥

- పులిపాక జగన్నాథము

## 495 విశ్వాసి పునరుత్థానము

రా -యదుకులకాంభోజి (చాయ : ధరణిలోని ధనము) తా-రూపకము

మరణమునకు విజయ మేది - మరణ మోడిపోయెరా = మరణ మొంది యేసు ప్రభువు - మఱల బ్రతికి లేచెరా ॥మరణ॥

1. క్షయమందు విత్తఁబడి య -క్షయమునందు లేచురా = ప్రియుడు క్రీస్తునందు మృతులు - పెం పొసంగు ధన్యులు ॥మరణ॥

2. లౌకిక దేహము విడి పర - లోక దేహి యగునురా = భీకర యోర్దాను యేసు ప్రేమతో దాఁటించురా ॥మరణ॥

3. ధరణి దుఃఖ బాధ లన్ని - ధరణియందె విడుతుము= పరమ దేవుని దుందునట్టి - పరదైసునకుఁ బోదుము ॥మరణ॥



4. గగన వీధినండి యేసుఁ - గ్రక్కున వేం చేయురా = జగతి సర్వ మృతుల నొక్క - క్షణములో బ్రతికించురా ॥మరణ॥

5. బూర రావ మాలకించి - భూమి యెల్ల వణఁకురా = వారధిలో మృతులు జీవ - ధారులై లేచెదరురా ॥మర॥

6. భక్తులు విశ్వాసమునకు - ఫలము నొందఁ బోదురు = మూర్తి కిరీటము ధరించి - రక్తితో జీవింతురు ॥మరణ॥

7. కరుణలేని మరణమునకు - వెరవకుండ నుండుఁడి = మరణవిజయుఁడైన ప్రభుని - చరణములు నుతించుఁడీ ॥మర॥

-తూలూరి కొర్నేలియస్

## 496 పునరుత్థాన దినము

రా -పంతువరాళి (చాయ : ఇదుగో గొర్రెలకాపరి) తా-చాపు

లేచు దినము వచ్చును - మృతు లెల్ల నికఁ - లేచు దినము వచ్చును = వేచి యిల నున్నట్టి - విమలు లెల్ల నడుపు - లేచి ప్రభుని నెదురు - కొందు రానందముతో ॥లేచు॥

1. యేసు మేఘారూఢుండై - యిలకు దిగ - వాసిగ దూత లపుడు = భాసురంబుగ బాకా - పై నినాదము సేయ - గ సమాధుల నిద్రగాంచు జనులెల్లరు ॥లేచు॥

2. కడబూర ధ్వని సేయఁగ - మడిసిన వారు - తడవు సేయక లేతురు = ఎడతెగక ప్రభు నొద్దఁ - గదు సంతసంబుతో -విడువక యుందు రా - విమల లోకమునందు ॥లేచు॥

3. ఘన మహిమన్ బ్రభువు రాఁగన్ - గడలి యపుడు - తన యందుండెడి శవములన్ = ఘనముగఁ గాననము - దనయందుండెడు మృతులన్ వినయంబుతో దెచ్చి - విభుని కప్పగింప ॥లేచు॥

4. అరయంగ నీతిపరు లా - నందమున న క్షర దేహులై వెలయుచున్ =జిరత రానందంబు - బరలోకమున నెపుడు - స్ఫురిత జీవను లగుచుఁ - బరమ సుఖ మొందుదురు ॥లేచు॥

5. కరుణ లేని సమాధీ – నిరతము నన్నుఁ – జెరపట్టి యుంచగలవే = వరదుండు క్రీస్తుండు – వర దూత సేనలతోఁ – బరివేష్టితుఁడై యదిగో – నరుదెంచుచున్నాఁడు ॥లేచు॥

6. మరణమా నీ ముల్లేది – నరులను నింక – వెఱపించు చుండగలవే = మరణ సంహారుండు – మహిమతో నరుదేరన్ – మరణం బడుగుబడి య – మర త్వంబిఁక నుండున్ ॥లేచు॥

7. మరణంబు నొందలేదా – ప్రభు యేసు నీ – చెఱయందు నుండలేదా = పరమేశు తనయుండు – మరణ సమాధులన్ – పరిపూర్ణముగ గెల్చి – చెఱను జెరగపట్టెను ॥లేచు॥

8. మంగళములు పాడరే – క్రీస్తుకు జయ – మంగళములు పాడరే = మంగళములు పాడి – మంగళ ప్రదుఁడైన – శృంగార రాజునకు = సంగీతంబులతోడ మంగళములు పాడరే ॥లేచు॥

– మేడికాయల సాధువు

## 497 *When the trumpet of the Lord shall sound*

1. అంత్య దినమందు దూత
బూర నూదు చుండగా
నిత్యవాసరంబు తెల్లవారగా
రక్షణందుకొన్నవారి
పేళ్లు పిల్చుచుండగా
నేను కూడ చేరియుందునచ్చటన్
॥నేను కూడ – చేరియుందున్
నేను కూడ – చేరియుందున్
నేను కూడ – చేరియుందున్
నేను కూడ – చేరి యుందు నచ్చ
టన్॥

2. క్రీస్తునందు మృతులైన
వారు లేచి క్రీస్తుతో
పాలుపొందునట్టి యుదయంబునన్
భక్తులార కూడిరండి
యంచు బిల్చుచుండగా
నేను కూడా చేరియుందు నచ్చటన్.

3. కాన యేసుసేవ ప్రత్య
హంబు చేయుచుండి నే
క్రీస్తునద్భుతంపు ప్రేమచాటున్
కృప నొందు వారి పేళ్లు
యేసు పిల్చుచుండగా
నేను కూడ చేరియుందునచ్చటన్



## 498 *Safe in the arms of Jesus*

1. యేసుని చేతులందు
యేసుని రొమ్మునన్
నాకు నభయమందు
అందె పరుండెదన్
కీర్తన వింటివా?
నా మన మందునుండి
పొందు సుఖం బహో!
॥ యేసుని చేతులందు
యేసుని రొమ్మునన్
నాకు నభయమందు
యందె పరుండెదన్ ॥

2. యేసుని చేతులందు
మిక్కిలి క్షేమము
జేరెడ నింక నాక
ఏ దుఃఖ బాధలైన
నచ్చోటఁ జేరవు
పాపపు భీతిబాధ
లంటవు నన్నటన్
కన్నీరు సందియంబుల్
కొన్ని దినా లిటన్

3. యేసె నా యాశ్రయంబు
నాకై చావొందెఁగా
గొల్గోతయందు నుండు
నా గురి సర్వదా
చీఁకటి దాఁటుదాఁక
నోర్పుతో నుండెదన్
జేరెద నుండెదన్
మంచును నమ్మెదన్

– ఫ్రాన్సెస్ జీన్‌వేన్ ఆల్స్‌టీన్

అను : పి. షూల్టె

## 499 *There's a land that is fairer than day*

1. రవికాంతిని మించినదౌ
ఒక దేశము దూరమున
వరభక్తులు చూచెదరు
తండ్రి యాశ్రయ మిచ్చునటన్
॥ అహహా త్వరలో
మేము చేరుదు మా స్థలమున్
అహహా త్వరలో
మేము చేరుదు మా స్థలమున్ ॥

2. దుఃఖబాధలు లేక సదా
పూర్ణశాంతినిఁ బొందుచును
పరిశుద్ధుల కీర్తనలు
అందు నెప్పుడు బాడుదుము.

3. ప్రేమ సాగరుఃడౌ జనకున్
మాకు నిచ్చిన మేలులకై
మా కృతజ్ఞత జూపుచును
నిత్యమున్ స్తుతి యించెదము

అను : జాన్ అబెర్లీ

## 500 *For all the saints*

1. సద్భక్తితోడ సాక్షులై నిత్య
విశ్రాంతి నొందు వారిఁ జూడఁగా
శ్రీ యేసు నామమున్ స్తుతింతుము
హల్లెలూయా !
జేయు

2. పోరాటమందు వారి దుర్గమౌ
శ్రీ యేసు సంరక్షించు శైలము
అంధత్వ మందు జీవకాంతియు
హల్లెలూయ!

3. ఓ యోధులారా! ధైర్యశాలురై
పూర్వులఁ బోలి యుద్ధ మాడుఁడీ
జీవ కిరీటంబు మీ కబ్బును
హల్లెలూయా !

4. ఓ దివ్యసభ ! స్నేహభావులు !
అన్యోన్య సహవాసమున్

నమ్మిక గల క్రీస్తువారలు!
హల్లెలూయా !

5. మోక్షంబుఁ జేరి భక్తు లెల్లరు
పిత్రు పుత్ర శుద్ధాత్మలన్ సదా
విజయ గీతితో ఁ గీర్తింతురు
హల్లెలూయా !

– విలియం వాల్షాం హో
అను : ఎచ్. హెన్రీ డేవిస్

# పరలోకానందము

## 501 క్రీస్తు మోక్ష ద్వారము

రా –తోడి తా–అట

శృంగార ద్వారంబు – మా యేసు మోక్ష – మార్గంబున కెంతో – శృంగార ద్వారము ॥శృంగార॥

1. పాలును దేనెయుఁ – బారెడి కానాను – ప్రదేశ భూములకుఁ – బ్రవేశ పెట్టు ॥శృంగార॥
2. యెరూషలేమాలయ – పరిశుద్ధ స్థలమందు – పరిశుద్ధ జనులుగ – బ్రవేశ పెట్టు ॥శృంగార॥
3. అత్యంత పరిశుద్ధ – స్థలమందు మమ్ము – నిత్యంబు యాజ –కులగాను జేర్చు ॥శృంగార॥
4. ఇరుకైన నేమది – సరియైన ద్వారంబు – సంకటంబైనను – సౌఖ్యాన జేర్చు ॥శృంగార॥

– తూపిలి యోహాను



## 502 గుమ్మములారా, మీ తలలు పైకెత్తుకొనుడి

రా –ముఖారి తా–ఆది

ఎంతో శృంగార మైనది – యేసుని చరిత – మిది యెంతో వేడ్కె యున్నది – మోక్ష ప్రవేశ = మంతటఁ దేజో – వంతుఁడు క్రీస్తుఁడు – చెంతను [1]దూతా – శ్రితజన పఙ్క్తులు – వింతగ నుడువఁగ – [2]సంతత నవ్య వ – [3]సంతము గల్గియ – నంతజీవ [4]రస – వంతఫలోప [5]వ – నాంతర ములు ద – త్ప్రాంత బునగల – పరమపురమునకు = [6]సంతసమున జనె – జయశబ్దముతో ॥ఎంతో॥

1. తెరచి మూయంగ రానట్టి – ద్వారములారా మీ – శిరము లెత్తుకొని యుండు డి – యనాదిగ నుండు – వర [7]క వాటములారా మీరే – యెత్తంగఁ బడుఁడీ = [8]సురచిన మహిమ – [9]స్ఫురణలుగల మీ – దొరతన పరిశు–ద్ధుల [10]కరు లగు భీ – కర [11]దురితాత్ముల దురమునఁ [12]జిదిపి య–పరిమిత [13]బల జయ – [14]బిరుదాంకితు డై – చిరముగ నూతన – యెరుసలేమ పుర – పరి పాలనఁ [15]ద – త్పరుఁడై యిదిగో [16]నెరవుగ వచ్చెను – నిజ భక్తులతో ॥ఎంతో॥

2. సుందర [17]మందానిలమందు–[18]జీవ సంజీవా–నందసౌఖ్య [19]ప్రదమై యుండ – రేబగ లంటని – మందిర వాసులప్పుడు – జయజయశబ్దములఁ = బొందుగఁ గ్రీస్తుని – పొగడుచుఁ బాడుచు – నందఱు పరమా – నందంబునఁ జె – న్నొంది తనందరి – కిందగు రాజుగ – వందనములు తగ – వరుస నొనర్చుచు – నందముగా ప్రభుఁ – జెందిన భక్తుల–[20]బృందములకుఁ దగు – విందు లొనర్చిరి = పొందిక కలిగెను – భూమికి ముక్తికి ॥ఎంతో॥

---

[1]దూతలును నమ్మికొనినవారును. [2]నిత్యమైన. [3]నూతనమైన వసంతరుతువు. [4]రుచి. [5]తోటలు మొదలైనవి. [6]సంతోషముతో. [7]తలుపులారా. [8]సుందరమైన. [9]శాంతి. [10]శత్రువులైన. [11]యుద్ధమునందు. [12]సంహరించి. [13]బలమును జయమునుగల. [14]నామముచేత ప్రకాశించువాడు. [15]మిక్కిలి ఆశగలవాడు. [16]చక్కగ. [17]చల్లనిగాలి. [18]జీవము కలిగినటువంటవి, జీవము ఇచ్చునటువంటివి. [19]ఇచ్చునది. [20]సమూహములు.

3. ములపైఁ బెట్టి–[2]కళ లీను [3]ధవళ వస్త్రములు–గట్టంగ నిచ్చి = [4]చెలువుగ మరి వా –రల చేతుల లో– పల విజయార్థపు – [5]బర్ణము లొసఁగి స– కల దూతలు భ – క్తులతో గూడి వి – మల పీఠము ముం –గల నిలువంబడి – [6]పొలువగఁ దమ దే – వునకును గ్రీస్తున – [7]కెలమిని స్తోత్రము – బలఘన [8]మనిశము = కలుగును గాకని – పలికి నుతించిరి ॥ఎంతో॥

4. పరిశుద్ధవంతు లప్పుడు – శాశ్వతానంద – భరితులై వీణెలు ధరియించి – పాటులు బాడుచును – గురురాయఁడైన తమ ప్రభుని – గుణములు వర్ణించి = కరుణను నీ ర – క్తముచే మము నం – దఱి ధరణింగల – నరవంశస్థుల – తరములలో నుం – డరుదుగ దేవుని – కొఱకుఁగదా మముఁ – గొనియుంటిని యని – మురువుగ నిఁక దే – వుని – కొఱకుఁగదా మముఁ – గొని యుంటిని యని – మురువుగ నిఁక దే – వుని సముఖంబున – దొరలను నర్చక వరులఁ జేసితివి = ధర నేలుదు మిఁక – సరియని మ్రొక్కిరి ॥ఎంతో॥

– పురుషోత్తము చౌదరి

## 503 పరలోక భాగ్యము

రా –జంఝూటి తా–ఏక

పరములోన బరములోనఁ – పాప మేమి లేదుగా = నరయ దానిఁ గోరు వారి – కాశ యిందు లేదుగా ॥పరములోన॥

1. [9]వృద్ధ సర్ప మనెడు వాని – సుద్దు లందు లేవుగా = సద్దులేని చోట నెపుడు – స్వామి సేవ గల్గుగా ॥పరములోన॥
2. ఎల్ల రోగ శ్రమలు మనకు – నీ స్థలంబులోనెగా = కల్లగాదు క్రీస్తు మనకుఁ – గంటి నీళ్లు దుడుచుఁగా ॥పరములోన॥
3. అంధకారమైన కార్యము – లా స్థలమున లేవుగా = సందె వెలుఁగు వెలుగు నట్లు – స్వామి సన్నిధి యుండుఁగా ॥పరములోన॥
4. దొంగవాని వలన మనకు – దోపు లేమి లేవుగా = యంగలార్పుఁ దీర్చి క్రీస్తుఁ – ఆశ్రయముగ నిల్చుఁగా ॥పరములోన॥
5. అన్నపానములందు మనకు – నాశ యేమి లేదుగా = కన్న తండ్రి కన్న మిగుల – ఘనుని ప్రేమ గల్గుగా ॥పరములోన॥

– గొల్లపల్లి నతానియేలు

[1]చక్కగా. [2]ప్రకాశములు ఇచ్చు. [3]తెల్లవి. [4]బాగుగా. [5]ఆకులు. [6]చక్కగా. [7]లెస్సగా. [8]నిత్యము. [9]ప్రాచీన



## 504 పరిశుద్ధుల ప్రకాశత

రా –మారువ (చాయ : నీ కన్న యిక వేరె) తా–త్రిపుట

పరిశుద్ధి పరిశుద్ధి – పరిశుద్ధి యని వినఁ – బడు పుర మదిగో – పద పదరే ప్రియులారా = పరమేశ్వరుని చేతఁ – బరిపాలనముఁ గల్గి – చిరమై భాసురమై – సు – స్థిరమై సుందరమైన ॥పరిశుద్ధి॥

1. [1]రవితోను [2]కుముదబాం – ధవుతోను మఱి దీప –[3]చ్ఛవితోను దాని కవ –సర మింతలేదు = [4]అవిరతమునఁ గ్రీస్తుఁ – డందుండుఁ [5]ప్రభతో [6]సం – స్తవమై [7]వైభవమై యు – త్సవమై వెల్గుచు నుండుఁ ॥పరిశుద్ధి॥
2. గొొదయైన మఱియే యా – పదయైన దగయైన – మొదలే లేకుండు న ప్పుర వాసు లందు = మృదు జీవోదకము ల – ర్మిలి నిరంతర మిచ్చు – గుదురుగ నెదురుగఁ – గూర్చుండి యువరాజు ॥పరిశుద్ధి॥
3. ప్రభు కృపాసనములో పలినుండి ప్రవహించి – శుభమైన నది యుండి సుఖమిచ్చు నచట = నుభయ తీరములందు – నుండు వృక్షములు సౌ – రభదీప్త శుభములై – రక్షా ఫలము లిచ్చు ॥పరిశుద్ధి॥
4. జననంబు మరణంబు – సంసార సుఖబాధ – లనుభవించుట గల్గ – దా పురమునందు = ముసు నీతి కొఱ కాప – దను బొందు తనవారి – కనునీ ళ్లన్నియు దుడుచు – మన దేవుఁ డందుండి ॥పరిశుద్ధి॥
5. వెలకంద రాని ని – శ్చలమైన ఘన జీవ – [8]విలపత్కిరీటము – ల్గల వప్పుర మునఁ = బిలిచి నప్పుడె విభుని – పెండ్లి విందున కేగు – కుల బంధువులకు ని – చ్ఛల నిచ్చు దేవుఁడు ॥పరిశుద్ధి॥

– పురుషోత్తము చౌదరి

## 505 మోక్ష నివాసము

రా –అసావేరి (చాయ : ఇప్పటి నరులారా) తా–త్రిపుట

పరిశుద్ధం పరిశుద్ధం – పరిశుద్ధం బయిన యా = పరమ కానానున – కరుగున దెపుడో ॥పరిశుద్ధం॥

1. పరిశుద్ధమయిన యా – యెరుషలేము పురము – వర పద్మరాగంపు – స్థిర పునాదులతోడ = పరిధవిల్లు సువర్ణ ప్రహరియు గోడలు – నురురత్న – ద్వారంబు – లదిరిగ గల వహహ ॥పరిశుద్ధం॥

[1]సూర్యుఁడు. [2]చంద్రుఁడు. [3]శాంతి. [4]శాశ్వతముగా. [5]శాంతి. [6]స్తోత్రములతో నిండినది. [7]భాగ్యముగలది. [8]ప్రకాశమానమైన.

2. ఆ నీతిపురమున - నాకాశమున వెల్గు - భానుండు శశి కానఁ - బడఁ బోవు దేదీప్య = మానంబై విలసిల్లు - మానిత గొఱ్ఱెయ - దానికి జ్యోతియై తనరుచుండు నహహ ॥పరిశుద్ధం॥

3. శృంగారమైనట్టి - బంగారు వీధులలో - చెంగు చెంగున దాఁటు - శ్రేష్ఠ సమయంబున = మంగళ ప్రదమైన - మహిమ రాజ్యమునందు - రంగైన ప్రభుయేసు - రాజున్ దర్శింతును ॥పరిశుద్ధం॥

4. తళతళ మెఱసెడు - ధవళంపు టంగీలు - కళ లీనుచుండంగ - గాఢ్ధార ధరియించి = భళిర భళిర యంచు - భక్తాళితో నెపుడు - నెళవుగా నుందుము - నిజ రక్షకుని చెంత ॥పరిశుద్ధం॥

5. భూరి వీణెలు చేతఁ - బొల్పుగ ధరియించి - సారెకు మీటుచు - సంగీత ములు బాడి = శ్రీ రాజా నీకు జో - హారంచు ప్రభు యేసు -పేరఁ గీర్తింతురు - ప్రియ భక్తులందఱు ॥పరిశుద్ధం॥

6. కరములు జోడించి - శిరముల్ క్రిందికి వంచి - వరపీఠమును జుట్టి - తిరుగు దూతలఁగూడి = పరిశుద్ధం పరిశుద్ధం - పరిశుద్ధమని నేను - పరమ సంగీతంబు - బాడుచుండెద నాహా ॥పరిశుద్ధం॥

-తూలూరి కొర్నేలియస్

## 506 పిల్లల మోక్షగానము

రా -ఆనందభైరవి (చాయ : ఓ మా తండ్రి నీదు నామము) తా-ఆది

మహిమ మహిమ మహిమ యనుచును - శిశువులు [1]ని- ర్మల [2]వినోద ధ్వనులు నిలుతురు = అహహ మా [3]యఘంబు లెల్ల - నణఁచె వీని నామమనుచు - బహు విధంబులైన పాట - ల్పాడుచు నాడుచు వేఁడుచు గూడుచు ॥మహిమ॥

1. [4]శత సహస్ర సంఖ్య మించి - బాల [5]సం - చయము ప్రభుని గద్దె చుట్టున = [6]నతులితంబు లైన కాంతి - [7]గతుల నమర మింటఁ బాడ - నీతీరు నెవరు దెచ్చి రచటి - కేగతిఁ దాఁగూడి మ్రోగఁగ సాగిరి ॥మహిమ॥

[1]పవిత్రమైన. [2]ఇంపైన. [3]పాపములు. [4]నూరువేలు. [5]సమూహము. [6]పోల్చ శక్యముకాని. [7]స్థితులయందు.



2. వింతయైన [1]మతులు జేయఁగా - నెవఁడు తనదు -విలువలేని [2]నల్లఁ జల్లగ= [3]సమసెనో యఘంబు లట్టి - జనకుఁడైన ప్రభువు నెదుట - నమల [4]కోమంలబులైన - యాటలఁ బాటల [5]మీటుచుఁ జాటుచు ॥మహిమ॥

3. తాము ప్రభుని కృపను మిగులను - జూచి యతని - దయను లోక మందు వేడ్కను = ప్రేమఁజెంది యిపుడు గొఱ్ఱె - పిల్లయైన ప్రభువు నెదుట - దాము మోద [6]మలర నిలిచి - వేమరు దామెల్ల నా మోముఁ బ్రేమించి ॥మహిమ॥

-విలియం బెర్రి

## 507 పరమ యెరుషలేము

రా -బంగాళారుురి (చాయ : వెరువనేల మనసా) తా-ఆది

పరమేదేశ మిదిగో - నూతన - యెరూస లేమదిగో- సోదర = తిర మగు పురమది - దివ్య సుందరము - తరముగాదు త - ద్దయు వర్ణింపగ ॥బరమ॥

1. ద్వాదశ రత్నములా - [7]ప్రోలుపు - నాదులుగా నుండు సోదర = యాదట దీరక - నాణి ముత్తియ వి - నోదద్వారముల - నమరి వెలయు ॥బరమ॥

2. శుద్ధ సువర్ణమున - నెంతో - శుద్ధి మార్గముండు - సోదర = శుద్ధు లెల్ల బరి - శుద్ధ గానముల - శుద్ధుని నెప్పుడు - స్తుతి యొనరింతురు ॥బరమ॥

3. పరమ జనకు సముఖం - బచ్చట - నరులతోడ నుండన్ - సోదర = నరులు దేవుని - నరులై యుందురు - పరమాత్ముఁడు దన - వారలతో నుండును ॥బరమ॥

4. కన్నీరుండదుగా - దేవుఁడు గన్నుల దుడుచునుగా - సోదర = యెన్నఁగ మరణం - బిక నుండదు మరి - చెన్నుగ భేదము - శీఘ్రము దొలఁగును ॥బరమ॥

[1]మనస్సులగల వారిగా. [2]రక్తము. [3]నాశనమాయెను. [4]మృదువులు. [5]వాద్యములు వాయించుచు. [6]సంతోషము విస్తరించునట్లుగా. [7]పట్టణము.

5. పరమపురమునందు – దేవుని– కిరవొకటుండదుగా – సోదర = పరమ జనకుడును – గొఱ్ఱె పిల్లయును – మురువుగ నొక మ– ందిరమై యుందురు ॥పరమ॥

6. రవి చంద్రులతోడన్ – నిజముగ – నవసరముండదుగా – సోదర = యవిరతముగ యే – సువె ఘనతరవై – భవమై ప్రభతో – బరగుచు నుండును ॥పరమ॥

7. సంతతంబిచ్చోట – సాధులు – స్తుతి సేతురు దేవున్ – సోదర = యతులితంబుగా – హర్షమకుటమును – సతతము దాల్తురు – స్వామి సన్నిధిని ॥పరమ॥

8. ఆఁకలియుండదుగా నిజముగా – నాకుల ముండదుగా – సోదర = ప్రాకటముగ జీ – వ జలంబచ్చట – నీకు నొసంగును –నిరతము వరదుఁడు ॥పరమ॥

9. ప్రభు సన్నిధినుండి – పారును – శుభనది సుఖ మియ్యన్ – సోదర = యుభయ తీరముల – నుండు – తరులు సౌ – రభ దీప్తిని శుభ – రక్షణ ఫలమిదు ॥పరమ॥

– మేడికాయల సాధువు

## 508 పరలోకపు విందు

రా –జంఝూటి తా–ఏక

విందు పరమందుఁబెండ్లి – విందు పరమందుఁ – బొందు జనుల డెందములా – నందము నొందు ॥విందు

1. సత్య సంధుఁ డైన యేసు – సామికి సభకు = నిత్య ప్రధానము యెహోవా – నిర్ణయించెను రండు ॥విందు॥

2. నీతి కనికరములతోడ – నినుఁ బ్రధానము = ప్రీతిగా నొనరించితినని –పిలచె సత్యము రండు ॥విందు

3. ఎన్నఁడు విడనాఁడను నే – నెంత మాత్రము = నిన్నెడఁబాయ నను మాట – నిజము దత్తము రండు ॥విందు॥

4. పరమ నగరు ద్వారములు – తెరువఁబడినవి = గురుతరమణి తోరణమును గూర్పఁబడినవి రండు ॥విందు॥



5. నిత్యజీవ పదార్థములు – నిండి యున్నవి = సత్యమచట మనము చేర – సర్వము మనవి రండు ॥విందు॥

6. దూత లంత యేసు ప్రభుని – ప్రీతిఁ జేయను = నూతన సంగీతములను – జేతురు వినను రండు ॥విందు॥

–బేతాళ జాన్

## 509 పరలోక వర్ణన

రా –శహన (చాయ : మన మొదటి తల్లిదండ్రుల్) తా–చాపు

చక్కని పరలోక – సంబంధులతో గూడి – సంతోషించుట యెన్నడో = మిక్కిలి ప్రియమైన – తండ్రి దేవుని యెదుట – మ్రొక్కి పాడుట యెన్నడో॥చక్కని॥

1. నిత్యమ్ము విలసిల్లు – నిజరత్నపునాదు – ల త్యుత్తమ పురమున = ముత్యాల ద్వారముల – ముదముతో బోవుచు – నృత్యమెప్పుడు చేతుమో ॥చక్కని॥

2. పన్నెండు ద్వారముల – పరమపురమును నా – కన్నుజూచుట యెన్నడో=చెన్ను మీరఁగ – భక్తశ్రేష్ఠులతోఁగూడి –సన్నుతించుట యెన్నడో ॥చక్కని॥

3. పరిశుద్ధదూతలతోఁ – ప్రభుయేసు మరల యీ – ధరకేతెంచుట యెన్నడో = పరిపూర్ణులతోఁ గూడి – బహుమానమును బొంది – మురియు చుండుట యెన్నడో ॥చక్కని॥

4. మహిమకిరీటము – ధరియించియున్న యా – మహితు నిగను టెన్నడో=అహహా యా ప్రభునితో – మహిమపరచబడి –మహికేతెంచుట యెన్నడో ॥చక్కని॥

5. పాపశరీరముఁ బాసి – ప్రభుని యొక్క – రూపునొందుటయెన్నడో = పాప మరణ దుఃఖ – మీ యాపదల కెడ – బాపు నొందుట యెన్నడో ॥చక్కని॥

6. రమ్మురమ్ము యేసు – మమ్ము నీ పురముకొని – పొమ్ము వేగమునే = ఇమ్మహికష్టములనుండి – నెమ్మది ని – త్యమ్ము నిమ్ము వేగమే ॥చక్కని॥

– చదలవాద జకర్యా

# 510 మోక్ష వర్ణన

రా –శహన తా–త్రిపుట

దేవదేవుని గొప్ప పురము పరలోకానందముక్రైస్తవ జీవితము= యా పురము ॥దేవ॥

1. దేవుని పురము – దేదీప్య కరము = జీవ మందిరము జేగీయ గృహము ॥దేవ॥
2. పరిశుద్ధ పురము – పరమార్థ కరము = పరమ మందిరము – పరదైసు పురము ॥దేవ॥
3. ఆనంద పురము – ఆది నిరంతరము = కాన దుస్తరము – ఘన మనోహరము ॥దేవ॥
4. శృంగార పురము – సుర చిర కరము = బంగారు మెరము – ప్రభల భాసురము ॥దేవ॥
5. వైభవ పురము – వంద్య మప్పురము = సౌభాగ్య కరము – స్ఫటిక మందిరము ॥దేవ॥
6. కెంపు పాండురము – కీర్తి బంధురము – ఇంపౌ నగరము – ఇదియే సుస్థిరము ॥దేవ॥
7. క్షుదలేని పురము – సుక్షేమ కరము = ముదము విస్తరము – రొదలు దుస్తరము ॥దేవ॥
8. ఆశ్చర్య పురము – ఆశ్రయ కరము = నిశ్చయపరము – నిజదేవ పురము ॥దేవ॥
9. మాణిక్య పురము – మణుల గోపురము = వీణెల స్వరము – విన మనోహరము ॥దేవ॥
10. సూర్యభాసురము – చొరనట్టి పురము = కార్య మబ్బురముఁ గావించు గరము ॥దేవ॥
11. సీయోను పురము – శ్రేయస్సాగరము = మాయ విధురము – మరి సంపత్కరము ॥దేవ॥
12. ఇచ్చు నిబ్బరము – యెరుషలేం పురము = మెచ్చొ నబ్బురము –మెరయు మా పురము ॥దేవ॥

– తూపిలి దానియేలు



# 511 మోక్షాపేక్ష

రా –జంఝూటి (చాయ : ధరణిలోని ధనములెల్ల) తా–ఆది

ఏదియది యేదియది – యేదిరా మన దేశము = పాదుకొన్న లౌకికునకు – బహుళ దుఃఖ పాశము ॥ఏదియది॥

1. సిలోమను కొలను గల – జీవన ప్రదేశము = పాలు తేనె లొల్కు నట్టి – పరమ కానాన్ దేశము ॥ఏదియది॥
2. ఆయతమై యున్నదది –యమర జనుల కోసము = సీయోనను పేరుగల – శ్రీకరుని నివాసము ॥ఏదియది॥
3. జీవ ప్రవాహములు గల – జీవుల స్వదేశము = కేవల పరిశుద్ధమైన కెరుబుల స్వదేశము ॥ఏదియది॥
4. యేసు జన స్వాస్థ్య మిదే – యిశ్రాయేలు దేశము = మేసయ్య యను రాజుసదా – మృతములిడు దేశము ॥ఏదియది॥
5. కోరికలు దీరునట్లు – గొబ్బుననేఁ బోదురా = చేరి సౌఖ్యమొంద మదిని – స్థిరతఁ బూని యుంటిరా ॥ఏదియది॥
6. మరణమును యొర్దాన్ నది – మధ్యమందు గంటిరా = తరుణమునేఁ గాచి దాని – దాటిపోవ నుంటిరా ॥ఏదియది॥
7. కాలు ధరను నిల్వదది – కండ్లుఁబడు దాకరా = మేలుకొని యుంటిరా – మేర దాట లేకరా ॥ఏదియది॥

– మిక్కిలి సమూయేలు

# 512 మోక్ష రాజ్యము

స్వంతంత్ర రాజ్యం ప్రభురాజ్యం స్వామి యేసు ఘన సామ్రాజ్యం = స్వకీయ రాజ్యంమన రాజ్యం – సమాధానముగల రాజ్యం ॥స్వతంత్ర॥

1. ఆద్యంతము లేనిది యీ రాజ్యం – అక్షయ విమల సదా సుఖరాజ్యం = చోద్యము వచింప సుందర రాజ్యం – సురుచిర నీతియు గల రాజ్యం ॥స్వతంత్ర॥

2. మన దేవుని సహవాసము కలుగున్ – మరణ దుఃఖ బాధలు మరి తొలుగున్= యెనలేని కాంతియై ప్రభు వెలుగున్ – కనలేమిక చీకటి తొలుగున్ ॥స్వతంత్ర॥

3. సూర్యు నెండవడ గాలియు నైనన్ – సోకదు తన ప్రజలకు నింతైనన్ = ఆర్యసహాయం బాకలియైనన్ – అటనుండవు దాహములైనన్ ॥స్వతంత్ర॥

4. నీతిమంతులట నూతన గీతం – ప్రీతిగ పాడుచు ప్రభుని సమేతం = దూతల బోలి వసింతురు నిరతం – జ్యోతులవలె వెలుగుదురు సతం ॥స్వతంత్ర॥

5. జీవ వృక్ష ఫలముల దినిపించున్ – జీవ జలంబుల మరి ద్రావించున్ = దేవుడె మన కన్నీటిని దుడుచున్ – దేవతలందరి పయినుంచున్ ॥స్వతంత్ర॥

– ఈ.డి.నిత్యానందము

## 513 *When all my labours*

1. శృంగార దేశము చేరఁగానే
నా దుఃఖ బాధలన్నియుఁ బోవున్
యేసుని యొద్దను నిత్యమునే
నుండుట మిక్కిలి యాశ్చర్యము
॥ ఇదే నాకు ఆనందము
ఆనందము, ఆనందము
నేను ఆయనను జూచుటయే
ఇదే నాకుఁ బరమానందము॥

2. అమితమైన కృపవలన
నన్ను స్వర్గంబునఁ జేర్చుదురు
అచ్చోటనుండి యేసుని గాంచి
స్తుతి కీర్తనలు పాడుదును.

3. నేను ప్రేమించు స్నేహితులును
అక్కడఁ జూచి సంతోషింతును
నాయేసు ముఖము చూచుటయే
నిత్యము నాకది యానందము.

4. ఆ స్వర్గ సౌఖ్య మొందువరకు
కండ్లతోఁ జూడక పోయినను
యేసుని మాటలు గైకొనుచు
నాత్మతోఁ జూచి సంతోషింతును

– చార్లెస్ హోమర్ గాబ్రియేల్

# క్రైస్తవ కుటుంబము

## 514 కుటుంబారాధన

రా –కురంజి తా–ఆది

దేవర బ్రోవుమా – దీన కుటుంబమున్ = దీవెన లొసగుచు – ధాత్రిని నడుపుమా ॥దేవర॥

1. పావనమగు స్వ – భావము నిమ్మా = పాలించర మా – పాలిటిదైవమ ॥దేవర॥

2. యేసు ప్రభువ మా – యింటికి శిరసువై = వాసముజేయు మా = యందున నిలువుమ ॥దేవర॥

3. అనుదిన భోజనం – బనుగ్రహించి మా పనిపాటులలో – ప్రక్కను నిలువుమ ॥దేవర॥

4. పిల్లల పెద్దలన్ – బెంచుమ ప్రేమతో = నెల్ల సమయముల – యందున గావుమ ॥దేవర॥

5. అణకువ త్యాగము – నతిధి సత్కార్యముల్ = గణుతించుచు నిను – గొలుతుము దేవ ॥దేవర॥

6. నీ పరిశుద్ధత – నేర్పుము యేసువ = కాపరి వీవై – కాయుము మమ్ము ॥దేవర॥

7. క్రైస్తవ జీవము –క్రమముగ నొందుచు = ప్రస్తుతింతుమో – ప్రభువా బ్రోవుమ ॥దేవర॥

– చెట్టి భానుమూర్తి

## 515 క్రీస్తును గృహమున ప్రతిష్టించుట

రా –శహన (చాయ : విజయగీతముల్ పాడరె) తా–త్రిపుట

ప్రభువుగన్ ప్రతిష్టింపరే – గృహమున క్రీస్తున్ – ప్రభువుగా ప్రతిష్టింపరె = విభవమొందగ నతని – శుభమౌ నామము ధర సౌ – రభమును వెదజల్లగ – ప్రబలమౌ ప్రేమన్ – ప్రభుని యెడ గనపర్చరె ॥ప్రభువు॥

1. పూర్ణ ప్రేమను జూపరే – గృహమున క్రీస్తుకు – పూర్ణ ప్రేమను జూపరే = పూర్ణ హృదయముతోను – పూర్ణయాత్మతో – మరి ప్ర – పూర్ణ శక్తితో జూపరే – క్రీస్తునిలో సం –పూర్ణులగుటకు సాగరె ॥ప్రభువు॥
2. భక్తితోడను గొల్వరే – గృహమున క్రీస్తున్ – భక్తితోడను గొల్వరే = ముక్తినాథుడు తన స్వ – రక్తమీయను మనకై – రిక్తుడాయెను జూడరే – ముక్తిదాతను నా – సక్తితో గొనియాడరే ॥ప్రభువు॥
3. నమ్మకస్థులై యుండరే – గృహమున క్రీస్తుకు – నమ్మకస్థులై యుండరే = అమ్మహాత్ముని నామ – మిమ్మహిన్ దగజాటన్ – నమ్మె మిమ్మును జూడరె – సమ్మతిన్ గ్రీస్తున్ – నమ్మకంబుగ జాటరె ॥ప్రభువు॥

–సి. విజయ చార్లెస్

## 516 క్రైస్తవ గృహము

రా –బిలహరి (చాయ : యేసునాధ కథా సుధారసము) తా–త్రిపుట

యేసుక్రీస్తుని దాసులారా – మీ సుతులకును నేర్పరె = ఆశతో యెహోవ యాజ్ఞల – నభ్యసింపగ జేయరే ॥యేసు॥

1. పిల్లలెప్పుడు ననుసరింతురు – తల్లిదండ్రుల నడతలన్ = ఎల్ల విషయము లందు మాదిరి – పిల్లలకు గనుపర్చరే ॥యేసు॥
2. మోదమిచ్చు కుటుంబ ప్రార్థన – నేదినంబును మానక = ఆదివారపు బడికి బిడ్డల – నాదరముతో బంపరే ॥యేసు॥
3. యేసునాధుని బోలు నాయకు – డే జగంబున లేడని = యేసు కే నిజ శిష్యులగుటకు – నేర్పరే యౌవనులకు ॥యేసు॥



4. యేసు సౌశీల్యమును వారికి – వాసిగా బోధింపరే = పసితనముననె వారి హృదయము – యేసురూపము దాల్చును ॥యేసు॥
5. యేసుక్రీస్తులొ నిలిచి వారలు – యేపుమీర ఫలింపగా = యేసు వాక్యము వారి యెదలలో – నాశతోడను నాటరే ॥యేసు॥

పి.విజయ చార్లెస్

## 517 మాదిరి కుటుంబము

రా –ఖరహరప్రియ (చాయ : ప్రభువా పంపుమా) తా–ఆది

యెహోవ యందు – భక్తి – బహుగ గలిగియుండి = మహిమాధ్యుని మార్గంబులయందు – గృహముల నడుపు నరులే ధన్యులు ॥

1. దేవుని యందలి – భయము – దీనుల దీవించున్ = నీవు నీ జేతుల కష్టార్జితమును – నిత్యము ననుభవంతువు నిజముగ ॥
2. ఉల్లమలర భార్య – ద్రాక్షా – వల్లివలె ఫలించు = పిల్లలొలీవ మొక్కల చందము – పెంపొందుదు రెంతయు సొంపుగను ॥
3. దేవుని భక్తియే – నీ కిల – దీర్ఘాయువు నిచ్చుఁ = గావున నీ పిల్లల పిల్లలను గాంతువు ప్రభు కృపతోఁ వెలగుదువు ॥

–వేశపోగు గుల్బానమ్మ

## 518 క్రైస్తవుని ప్రతిజ్ఞ

రా –యమునా కళ్యాణి (చాయ : జీవితాంతమువరకు) తా–త్రిపుట

నేనును నా యింటివారును – నీతి సూర్యుని గొలుతుము = దీనమనసును గలిగి దేవుని – దివ్యసేవను జేతుము ॥

1. అనుదినంబును – ప్రభుని దలచుచు – అలయకను ప్రార్థింతుము = అనవరత మా ప్రభుని చిత్తము – ననుకరింతుము పనులలో ॥
2. వేదవాక్య పఠనమందు – విసుగు – జెందక నుందుము = ఆదరంబున దైవ చిత్తము – ననుసరించుచు నడుతుము ॥
3. ఆశతోడను ప్రభుని దినమును – నాచరింతుము మరువక = విసుకు జెందక నాలయమునకు – పిన్న పెద్దల దెత్తుము ॥

4. సంఘ కార్యక్రమములందు - సహకరింతుము ప్రతీతో = భంగ పరచెడి పనులన్నిటి - కృంగదీసెదమనిశము ॥

5. ప్రేమతోడను పొరుగువారిని - ప్రియులుగను భావింతుము = క్షమయు స్నేహము నేర్చి ప్రభుకడ - శాంతితో జీవింతుము ॥

6. శక్తిగొలది శరీరబలమును - శ్రమను క్రీస్తుకు నిత్తుము = భక్తితో హృదయమును పూర్తిగ - ప్రభునికే యర్పింతుము ॥

7. చిన్నవారలు దైవరాజ్యపు - చిఖుత వారసులంచును = అన్నివేళల వారి వృద్ధికి - మిన్నగ దోడ్పడెదము ॥

8. పెద్దవారలు దైవజనులని - పేర్మితో భావింతుము = శుద్ధుడగు ప్రభు క్రీస్తు మనసును - శ్రద్ధతోడను జూపుచు ॥

9. జీవితంబున ప్రభుని ప్రేమా - శ్శీసులను ప్రసరింతుము = దివ్యజ్యోతుల రీతి వెలుగుచు - దివ్యసన్నిధి నుందుము ॥

-ఏ. చార్లెస్ కిన్సింగర్

## 519 క్రైస్తవ గృహము

రా -కాంభోజి తా-ఆది

రమ్ము రమ్ము మా యింటికి తండ్రీ రమ్ము రమ్ము ॥

1. జగములగన్న ప్రేమ గర్భుడవు - జగములకావల నుందువె నీవు = సరగ రమ్ము నీ బిడ్డలగృహమును సందీపనంబు జేయ ॥రమ్ము రమ్ము॥

2. సంతస ప్రేమాశాంతంబుల నిశాంతంబై యీ గృహ = మెల్లప్పుడు - సంతత స్వర్గవాసరూపమై - సమృద్ధి పొందునటుల ॥రమ్ము రమ్ము॥

3. అనలజ్వాల సపర్యలు వదలి - యనిలపక్ష సంచరణమువదలి = అనయము నీ గృహవాసివి నీవై - యాశీర్వదించునటుల ॥రమ్ము రమ్ము॥

4. నీ ఘననామోచ్చరణము చేత - నీ గృహమెల్లను పావనమై నీ = యాగప్రేమ మర్మంబులు జగతి -బాగుగ దెలియునటుల ॥రమ్ము రమ్ము॥

-ఇ.జి. ఆనందము



## 520 క్రైస్తవ గృహము

రా -శంకారాభరణము (చాయ : ఎందుకు మరచితివి) తా-త్రిపుట

ఎంతో రమ్యంబైనది భూతలమందు - ఎంతో మాన్యంబైనది = చెంత జేరి యేసు వింత పాదాబ్జముల - సంతసంబున పూజసల్పు క్రైస్తవ గృహము ॥ఎంతో॥

1. పిల్ల లొలీవ మొక్కలై - బల్లల చుట్టు - ఎల్లప్పుడు ఆడుచున్ = నుల్లమందున యేసు చల్లని వాక్యంబున్ - నెల్ల వేళల దలచి నుండుచుండెడి గృహము ॥ఎంతో॥

2. తల్లిదండ్రు లైక్యత - దనరుచునుండి - దాక్షిణ్య నిధుల జిల్కి = ఎల్లప్రేమామృత మెల్ల వారల కొసగి - కల్లోలములు వీడి - నుల్లసిల్లెడి గృహము ॥ఎంతో॥

3. పొరుగువారల మైత్రిని - పొందుగ గోరి - పొలుపారు నీతిన్ దనరు = నురుతరనాత్మ వరముల పైని గురిపించు- వరదాత యేసున్ - ప్రార్థించు క్రైస్తవ గృహము ॥ఎంతో॥

4. శోధనల నన్నింటిని సర్వదా పైచి - శోభిల్లు విశ్వాసమున్ - మోద మొందగ యేసునాథు నందున నిల్పి సాదరంబుగ సాక్ష్యమిడెదు క్రైస్తవ గృహము ॥ఎంతో॥

5. వ్యర్థ ఖర్చుల మానుచు- వర్ధిల్లు కొలది సర్దుకొని జీవించుచున్ = వృద్ధి నొందెదు వేళ శ్రద్ధాభక్తులతో డా - ఇద్ధరిత్రిని దశమభాగ మొసగెదు గృపము ॥ఎంతో॥

- ఎం.ఆనందము

# క్రైస్తవ యువజనులు

## 521 ఉత్సవ గానము

రా –యమునా కళ్యాణి తా–చతురశ్ర ఏక

యేసుతో ఠీవిగాను పోదమా! అడ్డుగా వచ్చు వైరి గెల్వను – యుద్ధనాదంబుతో బోదము ॥యేసుతో॥

1. రారాజు సైన్యమందు చేరను – ఆ రాజు దివ్య సేవచేయను = యేసు రాజు ముందుగా ధ్వజము బట్టి నడువగా – యేసుతో ఠీవిగాను వెడలను ॥యేసుతో॥
2. విశ్వాస కవచమును ధరించుచు – ఆ రాజు నాజ్ఞ మదిని నిల్పుచు = అనుదినంబు శక్తిని బొందుచున్నవారమై – యేసుతో ఠీవిగాను వెడలను ॥యేసుతో॥
3. శోధనలు మనల చుట్టివచ్చినా – సాతాను అంబులెన్ని తగిలినా = భయములేదు మనకిక ప్రభువు చెంత నుందుము – యేసుతో ఠీవిగాను వెడలను ॥యేసుతో॥
4. ఓ యువతి యువకులారా చేరుడి – శ్రీ యేసురాజు వార్త చాటుడి = లోకమంత యేకమై యేసునాధు గొల్వను – సాధనంబెవరు నీవు నేనెగా ॥యేసుతో॥

–ఏ. సి. కిన్సింగర్

– పి.డి. శుభామణి

## 522 మేలుకొలుపు

రా –భూపాలము తా–ఆట

మేలుకొని యిక లేచి యేసుని –మేలులన్ వేనోళ్ల బాడరే = బాలబాలికలారా చాలా పాడరే – వేలపాడరే ॥మేలు॥

1. పక్షి గణములు కూడి దేవుని – ప్రేమ నెల్లను పొగడుచున్నవి = బాపహరుడగు క్రీస్తు చెంతకు – పారుమా – రక్షణ కోరుమా ॥మేలు॥



2. అరుణరాగము వెల్లి విరిసెను – ఆకసంబున – జుక్కలణగెను = తరుణ ముననే లేచి దేవుని కెఱగుమా – దీవెన కరుగుమా ॥మేలు॥
3. తెల్లవారెను లోకమెల్లను – తెలివిగొని మున్ముందు దేవుని = తల్లి దండ్రియు – గురుడవీవని దలచుచూ – తగధ్యానించుమా ॥మేలు॥
4. జగములెల్లను జంతుజాలము – ల గణితంబగు జీవులెల్లను = సొగసున న్వేనోళ్ల బొగడుట జూడుమా – నీవును పాడుమా ॥మేలు॥
5. నీతి భాస్కరుడుదయమాయెను – నూతనోజ్జీవన మొసంగను = సతత మాతని దాపున న్వసియించుమా – తగ జీవించుమా ॥మేలు॥ – చెట్టి భానుమూర్తి

## 523 యువజనులు క్రీస్తునందు సంతోషించుట

రా –సారంగ (చాయ : పుట్టె నేసుడు నేడు) తా–ఝుంపె

దేవాది దేవాత్మజా – మమ్ము– దీవించు ప్రభురాజా = దేవాదిదైవ మానుషాభవ్య – దేదీప్యగుణతేజా ॥దేవాది॥

1. చెదరిన నీ గొఱ్ఱెల – కదుపు – వెదుకవచ్చితివియ్యల = సదయా హృదయాభ్యుదయా సాధు – జన నిత్య పరిపాలా ॥దేవాది॥
2. దురితాలవాలమునం బుట్టు – నరకీటముల మన్నా = కరుణారసమనిశము మాపై – విరcజల్లవే చల్లగా ॥దేవాది॥
3. నరకంబు నిధియొడ్డున – మేము – దిరుగుచు పడబోయిన = తఱి నీ వెఱcగి త్వరగా మమ్ము – మరలించి నావన్నా ॥దేవాది॥
4. యేసు నీ దాసులము – నీకు – దోసిలి యొగ్గినాము = దోషా రోషా భ్యాసములను – దూరముc దొలcగించుము ॥దేవాది॥
5. ప్రాణేశ నీ సిలువc – జిందు – శోణితంపు విలువ = త్రాణకరము స్థిరము దాని – దర్శించుటే జీవము ॥దేవాది॥
6. బాలుర మజ్ఞులము – మమ్ము బాలింపవే నిత్యము = నీ లోపలి జాలి మాకు – నిజముగాc జూపించుము ॥దేవాది॥
7. ఆనందమగు నీ కృప – మేము – ధ్యానించుటకు నేర్పుమా = జ్ఞానోజ్వలము బలము శిశువుల – మైన మా కవి యిమ్ము ॥దేవాది॥

– పురుషోత్తము చౌదరి

## 524 క్రైస్తవ యువజనులారా క్రీస్తు కొరకు నిలువండి

రా –బేహాగ్ తా–ఆది

భారత క్రైస్తవ – యువజనులారా – ప్రభుకై నిలువండీ – భారతరక్షక – భటవరులారా – ప్రభువును జూపుటకై లెండి – ఫలితము గనరండీ ॥భారత॥

1. బాలప్రాయమున మీరలెల్ల – భక్తి జీవితాసక్తిపరులై – అలయోసేపును బోలినవారై – బలతర సామర్థ్యము జూపి – ఫలితముగనరండీ ॥భారత॥
2. శోధనాధికము చుట్టునున్న – సకల యాశలును – నెట్టుచున్న – బాధించుచు మరి సాధించెడి యా – సైతానుని గెలువగ లెండి – ఫలితము గనరండీ ॥భారత॥
3. నమ్మకంబు మదియందు బూని – నేర్పుతోడ ప్రభు సేవజేయ – రమ్మిదె యేసుని రక్షణ సేవకు – రాజితమగు – జీవమునొందన్ – ఫలితము గనరండీ ॥భారత॥
4. విజయ కాంక్షగలవారలెల్ల – వినయ భూషణాసక్తిపరులై – నిజమగు క్రైస్తవ నీతిని జూపి – నిరతముగ వెలుగుదు రండీ – నిజమిది గనుగొనుడీ ॥భారత॥

– చెట్టి భానుమూర్తి

## 525 ధైర్యమునకుఁ బ్రేరేపణ

రా –యదుకులకాంభోజి (చాయ : యేసుని భజియింపవే మనసా) తా–ఆది

దానియేల్వలె సాహసించుడి – యొంటరిగా నిల్వ – దానియేల్వలె సాహసించుడి = దానియేల్వలె సాహసించుచు – జ్ఞానులై దృఢ కార్యముఁ గలిగి – దీనులై యా దృఢ కార్యం బిఁకఁ బూని తెల్పను సాహసించుడి ॥దానియేల్॥

1. నిక్కమగు కార్యమునందు నిలిచి – దైవాజ్ఞ లెలఁ గ్రక్కున గైకొను జనములగాంచి చక్కఁగ వారిని ఘనపర్చుచు – సంతతము నెనరుఁ పించుచు– మిక్కిలి దానియేల్సంఘమును – మెచ్చుచు నంగీకరించుఁడీ ॥దానియేల్॥



2. ధారుణిపైని నగరములలో – మరణించిరిగా కదు – శూరులనఁబడువా రనేకులు = వారు దానియేల్సంఘమును గని – కోరి యేకీభవించినమది – వారలే ప్రభుదేవుని భట పరి – వారమనఁబడి యుందురు నిజ మిఁక ॥దానియేల్॥
3. కాన నీ సువిశేషమను జెండ పైకెత్తుఁడీ సై – తానుని నెదిరించను రండి = దీనిని దీని శ్రేణులను యు – ద్ధానికి రారమ్మని పిలిచి – దానియేల్సంఘము పక్షమునఁ – బూని జయధ్వనులనుఁ జేయుటకై ॥దానియేల్॥

–బూదాల లైమన్

## 526 యేసువలె జీవించుట

రా –ముఖారి (చాయ : యేసు కరుణ) తా–అట

యేసువలెను – ఇల నేనుండెదను – యేసువలెను ॥

1. శుద్ధుడనై బ్రతుకు – బద్ధుడనంచును = శుద్ధుడనై యుండ – శ్రద్ధ జూపుదు నేను ॥యేసువలెను॥
2. భరియింపవలసిన భారంబుల్గల వెన్నొ = భరియింప మిక్కిలి బలశాలినై నేను ॥యేసువలెను॥
3. సాధింపవలెనెన్నొ – సాహసకార్యంబుల్ = సాధింపధైర్యాన – సాగి పోవుదు నేను ॥యేసువలెను॥
4. ధాత్రి నెల్లరతోడ – మైత్రినేనెరపుచు = శత్రులకునుగూడ – మిత్రు దనై నేను ॥యేసు వలెను॥
5. ఒరుల చింతలదీర్తు – నుల్లాసమున గూర్తు = పరమ ప్రేమతో నెపుడు – పైకి జూతును నేను ॥యేసువలెను॥
6. నా దివ్యజనకుడు – నాకు ననుదినమును = బోధింప వాక్యంబు బుద్ధితో నేర్తును ॥యేసువలెను॥
7. వినిసంతసంబున – ఘనుని యాజ్ఞలనెల్ల = వెనువెంట జేసెద – వినయంబున నేను ॥యేసువలెను॥

– పి.విజయ చార్లెస్

## 527 యువజనులకు క్రీస్తు ఆహ్వానము

ఓ క్రైస్తవ యువకా – నిజమంతయు గనుమా = నీ బ్రతుకంత మారుటె మేలు – కోరుము జీవమునే ॥ఓ॥

1. పాపపు చీకటి – బ్రతుకేలా – శాపపు భారము నీకేలా = పావన ప్రభుని పాదము జేరిన – జీవము నీకగుగా ॥ఓ॥

2. భయపడి వెనుకకు పరుగిడక – బలమగు వైరిని గెలిచెదవా = బలుడగు ప్రభుని వాక్యము నమ్మిన – గెలుపే నీదగుగా ॥ఓ॥

3. మారిన జీవిత తీరులలో – మానుగ నీ ప్రభుసేవకురా = మహిమ కిరీటం మన ప్రభు సేవలో – ఘనముగ నీకగుగా ॥ఓ॥

– బొంతా నతానియేలు

## 528 బాలల ప్రవర్తన

రా –యదుకులకాంభోజి (చాయ : సంతసంబగు క్రిస్మస్) తా–అట

బాలకా నీ వర్తనము గా – పాడుకొని జీవింపరా మేలులుకుఁ బలు కీడు లకునదె – మూలమనిగమనింపరా ॥బాలకా॥

1. తప్పినడువకు మెన్నడేని – తల్లిదండ్రుల యానతి – తప్పిపోయిన సుతుఁడు పడిన – తిప్పలు నీ వెఱుఁగవా? ॥బాలకా॥

2. గోలచేయుచుఁ బెద్దలనుగని – మేలమాడుట తగదురా – బాలురా యెలిషాను నవ్వి – ప్రాణగొడ్డమునొందరే ॥బాలకా॥

3. పరులకెగ్గొనరింపఁబోకుము – దొరలునదినీ మీఁదనే – పరునికై హామాను నిల్పిన – కొఱఁత నతఁడే వ్రేలఁడే ॥బాలకా॥

4. కట్టఁడి కార్యంబుతుదకుఁ – బట్టి కుడుపకపోదురా – మిట్టిపడిన రాణి యెజెబె – లెట్టులీల్గెనొ తెలియదా? ॥బాలకా॥



5. వగవకుము పరధనముఁగనియది – తెగులులేని బాధరా – సుగతిగనెనె యాహాబుతా – శునకముల కాహారమై? ॥బాలకా॥

6. అనృతంబులాడకుము దే – హాంతమైన నేమిరా? – అనృతము చేనని యాతన – యాలితో సహకూలఁడే ॥బాలకా॥

7. కోపమునకాస్పదమునీయఁ – గోరకుము మదినెన్నడు – కోప జ్వాలలు పెంచికయ్యిను – గోడు చెందడె హంతయై ॥బాలకా॥

8. తులువల జత గూడిమాడి – చెలిమిచేయుట తగదురా – పలువల సాంగత్యమున రెహ – బాము భంగము నొందఁడే ॥బాలకా॥

9. బాలుడా నీ తరుణ హృదయము – ప్రభున కప్పగింపరా – శీల సౌష్ఠవ మొదవునీ కా – శీస్సులును జేకూరురా ॥బాలకా॥

–దాసరి మోజెస్

## 529 *I want to be like Jesus*

1. శ్రీ యేసురీతిగాను
ప్రేమింపఁ గోరుదున్
నే నుండఁ గోరుదున్
కోపంబులేనివాఁడు
శాంతుండు నాయనే
నా స్వామి యొంటిగాను
ప్రార్థించునప్పుడు
ఆయన తండ్రితోను
మాట్లాడుచుండెను.

2. శ్రీ యేసురీతిగాను
నే నుండఁ గోరుదున్
దూషింబఁబడఁగాను
దీవించుచుండెను
శ్రీ యేసురీతిగాను
ప్రేమింపఁ గోరుదున్
నా చెలికాండ్ల మేలు
నేఁ గోరు చుందును

3. శ్రీ యేసురీతి గాను
నేనుండఁ గోరుదున్
నావంటి చిన్నవారిన్
ప్రేమించి పిల్చును.
శ్రీ యేసురీతిగాను
నేనిప్పు డిచ్చుటన్
నీ రీతిగాను యేసూ
న న్నుండఁ జేయుమీ

అను : బర్నార్డ్ లూకాస్

## 530 *O Chirstians leagued together*

1. ఓ క్రీస్తు భక్తులారా
నీతి నిమిత్తము
పోరాడ కవచంబు
ను ధరించుడి
శక్తుండు సైన్య ప్రభు
వు, శాంతిరాజుకు
అపారసేవ జేయ
అర్పణ యైతిమి.
॥జోహారు, రక్షకుండ!
నీ మార్గమందున
విజయగృహ దైవ
పురంబు బోదుము ॥

2. పదండి ముందుకంచు
నాదంబు చేయుడు
స్వార్థంబు గెల్వవలె
సాగిపోదము
హర్షంబులేని యాత్మ
లెన్నెన్నొ చూడుడు
ఈ ఘోరయుద్ధమున
కందరి గూర్చుడు.

3. క్రీస్తే మా నాయకుండు
అటంచు దెల్పగ
మా హృదయంబునందు
సంతోష శాంతిసేద లు కల్గునప్పుడు
సిల్వధ్వజము!
ఈ లోకమేలులన్ని
దీవెన నొందును.

## 531 *Be not swift to take offence*

1. రేగత్వరపడకు
ఓర్చుకో
కోపి గోదుజెందును
ఓర్చుకో
నీ కన్యాయమయినను
కన్ను లెర్రజేయకు
శాంత మొందు మెప్పుడు
ఓర్చుకో.

2. ఎవ్వఁడేని తిట్టిన
ఓర్చుకో
మేలుఁజేయు కీడుకు
ఓర్చుకో
లోకమందు సుఖము
కొంతసేపు నుండును
కోపమేలఁ జేతువు?
ఓర్చుకో.

3. నీవు కీడునొందఁగా
ఓర్చుకో
ప్రతి కీడుఁ జేయకు
ఓర్చుకొనియుండుము
అంత సరియగును
నీకు జయముండును
ఓర్చుకో.

అను : బర్నార్డ్ లూకస్

# క్రైస్తవ బాలలు

## 532 యేసునకు స్తుతి

రా –ముఖారి (చాయ : దినదినమునకు దిక్కు నీవే) తా–ఆది

చేతులెత్తి వందనములు –చేతు మిపుడే యేసు నీకు = రాతిరి పగ లందు మమ్ముఁ – బ్రీతితోఁ గాపాడు యేసు ॥చేతు॥

1. సుఖమైనట్టి నిద్ర మమ్ము – నొందఁజేసి రాత్రియందు = సకల మేలు లంద జేయు – స్వామి యేసుక్రీస్తూ నీకుఁ ॥జేతు॥

2. అన్నవస్త్రములను మాకు – నన్ని వేళలందు నిచ్చి = కన్న తండ్రివలెను బెంచు – చున్న యేసుస్వామీ నీకే ॥చేతు॥

3. విద్యా బుద్ధులన్ని యిచ్చి – వింత వింత వరము లిచ్చి = పెద్దల దయలోనుమమ్ముఁ – బెంపారఁ జేయు మేసయ్యా ॥చేతు॥

4. చిన్నవారి స్నేహితుడుగ – నున్న యేసుస్వామీ నీకు = ఎన్నో వేల స్తోత్రంబులు – నిలలో నెపుడు కలుగుగాక ॥చేతు॥

– నరెళ్ల సమూయేలు సుబ్బయ్య

## 533 స్తుతి గానము

రా –జంఝూటి (చాయ : పరములోన బరములోన) తా–చాపు

చిన్నబిడ్డల విన్నపముల – నెన్నడైన త్రోయక – పన్నుగ విను కన్న తండ్రిని– సన్నుతింప జేరరే ॥చిన్న॥

1. భూమి మీద మానవునిగా – స్వామి ఉండినప్పుడు – ప్రేమతో అనేక మంది – పిల్లల దరి జేర్చెను ॥చిన్న॥

2. చెంత జేర్చి చిన్న పిల్లల – చేతులుంచి వారిపై – ఎంతో దయతో నాశీర్వ – దించె యేసు వారిని ॥చిన్న॥

3. చిన్న పిల్లల పోలికలను – ఎన్నోమార్లు బోధలో – ఎన్నుకొనుటలో మనయం– దున్న ప్రేమ దెలిపెను ॥చిన్న॥

4. పాట పాడి ప్రభుని పేర –కోటి స్తుతుల నియ్యరే – చాటుగను బాహాటముగను – మేటి ప్రభుని వేడరే ॥చిన్న॥

## 534 యేసు నామమునకు జయము

జయం జయం హల్లెలూయ – జయం జయ మిప్పుడే = ప్రభు యేసు నామమునకు – జయం జయ మిప్పుడే ॥జయం॥

1. ఓహో మిత్రులారా మీరు – జ్ఞానమును పొందుడీ = స్నేహమార్గం ముక్తిమార్గం– జీవమార్గం ఆయనే ॥జయం॥

2. ఆలస్యమేలనో పాపి – రమ్ము యేసు నొద్దకు = ఆత్మమూర్తి రక్షణ మూర్తి – యేసు ప్రభు వాయనే ॥జయం॥

3. రేపు అను చింతలను – బాపి యేసు నమ్ముఁడీ = రూపు మాపు అనక యేసు– దాపు జేరుఁ డిప్పుడే ॥జయం॥

– ఎబిలిన్ ప్రీష్టి

## 535 బాలల విన్నపము

రా –కురంజి (చాయ : పరమ తండ్రి నిన్ను) తా–ఆది

బాలకుల విన్నపము లాలించు రక్షకా = పాలనంబు సేయుమా పరమ పోషకా॥

1. బాలలారా రండియంచు – బిలిచిన యేసూ = చాలనమ్మి జేరితిమి – సరగ బ్రోవుమా ॥

2. మందబుద్ధి చేత నిన్ను – మరచి యుంటిమి = సుందరాప్త నీదయ మా – యందు జూపుమా ॥

3. చదువు వేదవాక్య సరణి – నడువ నేర్పుమీ = మదిని బోధకుల సుబోధ – మరువనీకుమీ ॥



4. ప్రకటితమగు నీదు ప్రేమ – యనుభవించుచు = ఇకను నిన్ను సేవ జేతు – మఖిలకాలము ॥

5. పుడమి నీదు సిలువ కృపను – పుణ్యులగుచును = కడను నీదు మహిమ జేర – గరుణజూపుము ॥

## 536 బాల ప్రార్థన

రా –జంఝూటి తా–జుల్వ

రాజా నా దేవా నన్ను గావ రావే – ప్రభు ॥రాజా॥

1. తల్లి గర్భంబు బయలు – వెళ్లిన దినమునుండి = కొల్లగా సేవింపఁ – జల్లనైన మోక్ష మియ్య ॥రాజా॥

2. బాలప్రాయమునుండి – బ్రతికిన కాలమంత = నీలాగు జీవించి – నిత్యమైన మోక్ష మొంద ॥రాజా॥

3. మాకొఱకై వచ్చి – మా పాపములకు మాయ = లోకములోన మృతికి – లోనై లేచితి వయ్య ॥రాజా॥

4. దండి ప్రభుండు యే – సండఁ జేరఁగ మాకు = నిండు వేడుకతోను – నిత్య మోక్షంబు నియ్య ॥రాజా॥

– జి. పెద సమూయేలు

## 537 యేసునాధా, రమ్ము

రా –శహన తా– ఏక

యేసునాధా రారారా – మా – జీవనాధా రారారా ॥

1. దోసములు బాప నీవు – వాసిగ జన్మించినావు ॥యేసు

2. నీచులను ప్రేమించి – నీ కరుణఁ జూపినావు ॥యేసు॥

3. నీతిలేని వారి కెల్ల – నిత్యజీవ మిచ్చినావు ॥యేసు॥

4. పొందరాని కష్టములను – బొంది యుంటివి తండ్రి ॥యేసు॥

5. లోకపాపమును జయించి – లోకుల రక్షించితివి ॥యేసు॥

6. వేడుకతోడ మేము – వేఁడుకొందుమో తండ్రి ॥యేసు॥

–ఫిలిప్ బెంజమిన్

## 538 బాల ప్రార్థన

రా –ముఖారి తా–త్రిపుట

పిల్ల నైన నన్నుc జూడుమీ – ప్రియ మైన యేసు – పిల్ల నైన నన్ను c జూడుమీ = చల్లని రక్షకుcడ వనుచు – సత్య వార్తc దెలుపుచుండ– నుల్ల మందు నిన్ను నమ్మి– కల్ల లేక వేcడుకొందుc ॥బిల్ల నైన॥

1. నిన్ను నమ్మి యున్నవాcడను – ఘన దేవ తనయ – నన్ను దాcచు నీ నీడను = తిన్నని హృదయంబు నాకుc – జెన్నుగా నొసంగి యిపుడు – సన్నుతింప నిమ్ము – నన్ను – సాధు వైన నిన్ను c దలcచి ॥పిల్లనైన॥
2. ప్రేమచేత నొప్పుచుంటివి – ప్రేమా స్వరూప – ప్రేమలోన నడచు చుంటివి = ప్రేమ లేని నన్నుc బ్రోవc – బ్రేమచేతc బ్రాణ మిచ్చి– ప్రేమc జూపు మనుచు నన్నుc బ్రీతి చేత బోధింపc ॥బిల్ల నైన॥
3. పరమ జనకు చిత్త మెప్పుడు–పరమేశ పుత్ర – బిరబిరగను జేయcగా నిమ్ము= కరుణ మీర నాత్మచేత –వరవరంబు లొసcగి నాకు – నరులలోన నిన్ను c గొలువ – ధరణిమీcద నన్ను నిలుపc ॥బిల్లనైన॥
4. బలము మీర నన్ను నిలుపుము – తుల లేనివాcడ – బలము గల్గు నీదు చేతుల = నిలను నీకు ఫలము లిచ్చి – యెలమి నిన్ను గొప్పc జేయ – సలలిత ముగ – నడువ నిమ్ము – చక్కని నీ మార్గమందుc ॥బిల్లనైన॥

– పులిపాక జగన్నాథము

## 539 ఉదయ ప్రార్థన

దేవ కావవే – నేడు మమ్ములన్ = నీవెరాత్రి కాచినావు – నీకు స్తోత్రము॥దేవ॥

1. ఆపదలు మమున్ – అంటకుండను = కావుమయ్య నేడు నీదు – కఋణ తోడను ॥దేవ॥
2. నేటి కార్యముల్ – నేడె చేయగా = సూటియైన త్రోవ మాకు – చూపుమోప్రభో ॥దేవ॥
3. చెడ్డ కార్యముల్ – చేయకుండను = దొడ్డబుద్ధి నిచ్చి మమ్ము నుద్ధరించుము దేవ ॥దేవ॥



## 540 సాయంకాల ప్రార్థన

దేవకావవే – రాత్రి మమ్ములన్ = నీవె నేడు కాచినావు – నీకు స్తోత్రము॥దేవ॥

1. ఆపదలు మమున్ – అంటకుండను = కాపుగాచి మంచి నిద్ర – కలుగ జేయుమీ ॥దేవ॥
2. పండియుండగా – పాము తేలులున్ = గండములను తొలగజేసి – కాయుమో ప్రభో ॥దేవ॥
3. దుష్ట స్వప్నముల్ – దొంగ భయమును = కష్టములను తొలగజేసి – కాయుమో ప్రభో ॥దేవ॥

## 541 మంచి సమరయ్యుడు

రా –శంకరాభరణము(చాయ :వినరె మనుజులారా క్రీస్తు డిలనుజేయు) తా–ఆది

ఒక్క మనుజు – డెరుషలేమునుండి – యెరికొ పట్టణమునకు = ముక్కు వతో వెడలుచుండె – కొంత ధనముతో ॥ఒక్క॥

1. మార్గమందు – దొంగలతని – పట్టికొట్టి దోచుకొనిరి = మూర్ఛపోవు నట్లు గొట్టి – విడిచి వెళ్లిరి ॥ఒక్క॥
2. అపుడు నొక్క యాజకుండు – వచ్చి జూచి ప్రక్కగాను = కపటముతో వెళ్లె వాని నాదరింపక ॥ఒక్క॥
3. వెనుక నొక్క లేవియుండు – వచ్చి జూచి యోర్వలేక = గన్నులారా జూచి – పోయె గరుణలేకను ॥ఒక్క॥
4. పిదప సమరయుండు వచ్చి –బదిలముగను జూచి వాని – నాదరించె గరుణతోడ – భేదమెంచక ॥ఒక్క॥
5. నూనె ద్రాక్షరసము పోసి – గాయములను గట్టి వాని – ఘనమగు వాహనముమీద – నూరు చేర్చెను ॥ఒక్క॥
6. అటువలెను మనము కూడ – కష్టములలో నుండువారి = కష్టములను జూచి యాదరింపవలయును ॥ఒక్క॥

– జి.జాన్ తాతయ్య

## 542 ధన్యులయిన పిల్లలు

రా -ముఖారి తా-త్రిపుట

వారు ధన్యు లైన పిల్లలు - భూలోకమందు - వారు ధన్యులైన పిల్లలు= కోరి విచారమును ప్రభుని - సార వాక్య మెదను బెట్టి - వారి వారి కితరులైన - వారికిని విధేయులైన ॥వారు॥

1. అన్నదమ్ములందు నెటులను - తనతోడ నాడు - చున్న యితరులందు నటులను = భిన్న మెంచ కొక్కరీతిఁ - దన్నుఁబోలె ప్రియ మొనర్చి - తిన్నని బడియందు నేర్చు - చున్నవార లెవ్వరో ॥వారు॥
2. ఒకఁడె తండ్రి యతఁడు దేవుఁడు - మన కందరకును - సకల సుఖములిచ్చు నెప్పుడు = అకట మన మిఁకను జగడము - లాడఁదగదు ప్రభుని రీతి - నొకని నొకఁడు ప్రియము చేసి - యుండుద మని తలఁచుచుండు ॥వారు॥
3. మంచి మేలు లనుభవింపఁగఁ - గరుణించి దేవుఁ - డెంచి మనల నిచటఁ గూర్చెఁగ = వంచనలఁ ద్యజించి కనిక - రించి యొకనినొకఁడు మది స - హించి మంచి క్రియలతో వ - ర్తింప నిశ్చయింతు రెవరో ॥వారు॥
4. ఆకసమున నున్న దేవుఁడు - మన మనసు రాక - పోక లన్ని చూచు నెప్పుడు = ఏకముగా హృదయములు వి - వేకమున వెలుంగఁ జేసి - ప్రాకాటముగఁ బ్రభుని యాజ్ఞ - గైకొనియెడి వార లెవరో ॥వారు॥

- జాన్ హే

## 543 ఆదర్శుల ననుకరించుట

రా -హిందూస్థాని ముఖారి (చాయ : సాక్ష్యమిచ్చెద) తా-జుల్వ

అనుకరించెద - నే - ననుదినమును బాలుఁ డేసు = ననువుగాను జ్ఞానమునం - దును వయస్సునందును దే - వుని ప్రేమను మానవుల ద - యను బెరిగిన బాలుఁడేసు ॥ననుకరించెద॥

1. పరదేశంబున వసించి - పరమాత్తుని మదిఁ దలంచి = దురితమును జయించిన స - చ్చరింతుఁడైన యోసేపు ॥ననుకరించెద॥



2. తల్లి యానతి నెరవేర్చి - తమ్ముని కష్టములఁ దీర్చి = యెల్లకాలముందు కీర్తి - నిల గడించిన మిర్యాము ॥ననుకరించెద॥
3. పాలు మరచినది మొదలు - ప్రభు సేవా సంపదలు = ఆలయమునఁ బూనిన సు - బాలకుండు సమూయేలు ॥ననుకరించెద॥
4. శత్రువులను బరిమార్చి - మిత్రులకు జయంబొనర్చి = స్తోత్రగీతములు రచించిన - సుందరుండౌ దావీదు ॥ననుకరించెద॥
5. పరులకు న్యాయంబుఁ దీర్పఁ - బ్రజలకు క్షేమంబుఁ గూర్పఁ = పరమ వివేకంబుఁ గోరి - ప్రభు నడిగిన సొలొమోను ॥ననుకరించెద॥
6. యజమానుని కుష్ఠుఁ గాంచి - స్వజనుల దేవుని గురించి = నిజ సాక్ష్య మిడి సన్మా - నించిన హెబ్రీయ బాల ॥ననుకరించెద॥
7. అపవిత్ర రాజ భోజ - నాదుల విడి దైవ పూజఁ = గపట మింత లేక చేసి - ఘనత నొందిన దానియేలు ॥ననుకరించెద॥
8. ప్రార్థన కూటమునఁ జేరి - ప్రత్యుత్తర మపుడె కోరి = సార్థకముగఁ బేతురుని - సమాచార మిడిన రొదే ॥ననుకరించెద॥
9. భక్తిభయములందుఁ బెరిగి - బహు ప్రదేశములను దిరిగి = శక్తి కొలఁది సంఘ పరి - చర్య నొనర్చిన తిమోతి ॥ననుకరించెద॥ - మల్లెల దావీదు

## 544 దేవుఁడు మంచివాఁడు

రా -బిలహరి తా-ఆది

దేవుఁడు బలే మంచివాఁడు - ధరణిని బాలించువాఁడు = ఈవుల నిచ్చువాడు - నెల్లరిని గాచువాఁడు ॥దేవుఁడు॥

1. తండ్రి వంటివాఁడు మనకు - ధరణిని బోషించువాఁడు = దండ్రి ప్రియుఁడు నందరికిఁ - దగినవాని నొసగువాఁడు ॥దేవుఁడు॥
2. అన్నవస్త్రములనే గాక - యన్నింటిని నిచ్చువాఁడు = మన్ననతోఁ బ్రోచు వాడు - మనతో నెప్పుడు మెలఁగువాఁడు ॥దేవుఁడు॥
3. కష్టబాధలందు మనలఁ - గనికరముతోఁ గాచువాఁడు = దుష్టమనసు తీసివేసి - యిష్టముతో నుండువాఁడు ॥దేవుఁడు॥

## 545 క్రైస్తవానందము

రా -మోహన తా-ఏక

హల్లెలూయ - నీ - కల్లెలూయ = చల్లఁగా రమ్మిప్పు డేసు ॥హల్లెలూయ॥

1. ఒప్పుకొందుము - మాదు - తప్పిదంబులన్ = ముప్పులో నుండి మమ్ముఁ - దప్పించు మయ్యా ॥హల్లెలూయ॥
2. పిల్లల మయ్యా - బీద - పిల్లల మయ్యా = చల్లని నీ నామమును - సన్నుతింతుము ॥హల్లెలూయ॥
3. వందనమయ్యా - నీకు - వందన మయ్యా = యందముగ మమ్మును నీ - యందు నిల్పుమా ॥హల్లెలూయ॥
4. ఆడుచుందుము - మేము - పాడుచుందుము = వేడుకతోఁ గూడి నిను - వే డుకొందుము ॥హల్లెలూయ॥

## 546 చిన్న పిల్లలను నిషేదింపవద్దు

రా -సురటి (చాయ : ఆనందమగు ముక్తి) తా-ఆది

ఆ చిన్న వారిలో నేనుండి యున్న - నహాహా మా యేసును - నేఁ జూచి యుందు ॥నా చిన్న॥

1. ప్రభు యేసు ప్రపంచమం దుండినపుడు - పసి బాలకులఁ బిల్చి ప్రార్థించె ననెడు - ప్రాచీన కథను నేఁ జదువుచున్నప్పుడు = వారిలో నే నున్న - నెంతో బాగుండు ॥నా చిన్న॥
2. ఆ కరుణ కరము నా తలపైని వ్రాలి -యాకాశ బాహువు నా చుట్టు నిలిచి య - నేక బాలకుల రానిమ్మను జాలి = తోఁ గర్త పిలుపు విన - నాకెంతో మేల్మి ॥యా చిన్న॥
3. ఇ కమీఁదఁ బ్రార్థన ద్వారా దర్శింతున్ - బ్రకటిత ప్రభు ప్రేమ పంచి యియ్యమందు న- మ్మకముతో యేసుని వెదకుచు నుందు = సుఖ లోకమందునఁ - జూచి వినుచుందు ॥నా చిన్న॥
4. శుద్ధుల కొఱకు రాజ్యము నేలన్ - సిద్ధము చేయఁ బ్రభు యేసు వెళ్లెన్ -ముద్దు పాపలు వత్తు రందున విను మ=శ్రద్ధ సేయకు వారి-దాకాశ రాజ్య ॥మా చిన్న॥

- తూపిలి యోహాను



## 547 యేసును అనుకరించుట

రా -శంకరాభరణము (చాయ : దేవుడే నా కాశ్రయంబు) తా-ఏక

1. యేసుబోలి మంచిబుద్ధి - యెంతో ప్రేమగలిగినే - నేసు గోరినట్టి పనుల - నెపుడు చేయగోరుదున్ = దయయు శాంతమమరినట్టి - తనదు నడత దలచుకొనుచు ॥యేసు॥
2. యేసు చిన్నబాలుడై యీ - ధరను దిరిగినప్పుడు - ఎల్లరతని మంచి గుణము - లెంచి ప్రేమ జూపిరి = దయయు, శాంతమమరినట్టి - తనదు నడత దలచుకొనుచు ॥యేసు॥
3. పిట్టలందు - పూవులందు - ప్రీతిజూపె నేసుడు - అల్పజీవులైన, తండ్రి- యన్నిజేసెనంచును = దయయు, శాంతమమరినట్టి - తనదు నడతదలచు కొనుచు ॥యేసు॥

-పి.విజయ చార్లెస్

## 548 *Blessed are the Sons of God*

1. దేవపుత్రులందఱు
ఎంతో భాగ్యవంతులు
పాప మరణాదులు
పరిహారమాయెను.
॥ నేను నట్టివారితో
పాలు పొందవలెను ॥
2. వారు క్రీస్తువల్లనే
ఐరి నీతిమంతులు
స్థిరమైన నెమ్మది
భక్తులందరొందిరి.
3. తండ్రి యొద్ద పిల్లలు
నిర్భయాళులౌదురు
వారు కూడ దేవునిన్
చేర భయపడరు.
4. వారి కెట్టి కష్టముల్
హానిచేయ నేరవు
వారికిన్ నిజంబుగా
శ్రమ యుపయోగము
5. ఇహమందు కరుణ
చావువేళ నెమ్మదిది
పరమందు భాగ్యము
వారికిన్ సంపూర్ణము.

అను : జాన్ స్మిత్ వార్డా

## 549 క్రీస్తునందు బాలలు ఒక్కటే

రా –యదుకులకాంభోజి (చాయ : తనువు నాదిదిగో) తా–త్రిపుట

ఏ దేశస్థులమైన – ఏ జాతి మనదైన –యేసులో మన మొక్కటే = ఏకమై బాలల మెల్లరమును తండ్రి – నెంతో స్తుతించుచు నెప్పుడు బాడుదము ॥ఏ॥

1. పలు దేశములలోన పన్నుగ దేవుని – ప్రార్థించెడి బాలలం = పరమ తండ్రీ మాలో – ప్రతివారి దీవించు – బహుగా నీ దినమనుచు – బ్రతిమాలి వేడుదము ॥ఏ॥
2. బహు దేశములలోన –పలువిధములగు పనులు – పరగజేసెడి బాలలం – ప్రభుడే యేసుని కొఱకే – ప్రపంచమంతటిని– బాగుచేయను మిగుల – ప్రయాసపడుదము ॥ఏ॥

– సి.విజయ చార్లెస్

## 550 యేసు నా కొరకు ప్రాణమిచ్చెను

కల్వరియున్నంత దూరం వెళ్లెను – నా కొరకు నా కొరకు – కల్వరి యున్నంత దూరం వెళ్లెను – నా ప్రియ రక్షకుడు ॥

1. తన రక్తమెంతో ధారపోసెను – పోసెను పోసెను – తన రక్తమెంతో ధారపోసెను – నా ప్రియ రక్షకుడు ॥
2. నా పాప శాపమంత క్రీస్తు బాపెను – బాపెను – బాపెను – నా పాప శాపమంత క్రీస్తు బాపెను – నా ప్రియ రక్షకుడా ॥
3. చావును జయించి మరల లేచెను – లేచెను లేచెను = చావును జయించి మరల లేచెను – నా ప్రియ రక్షకుడు ॥
4. తన యాత్మతోడు సమకూర్చెను –కూర్చెను కూర్చెను = తన యాత్మతోడు సమకూర్చెను – నా ప్రియ రక్షకుడు ॥
5. నీతి త్రోవయందు నన్ను నడ్పును – నడ్పును నడ్పును = నీత్రి త్రోవ యందు నన్ను నడ్పును – నా ప్రియ రక్షకుడు ॥



6. మరల వచ్చి తన యొద్ద చేర్చును – చేర్చును చేర్చును = మరల వచ్చి తన యొద్ద చేర్చును – నా ప్రియ రక్షకుడు ॥
7. శృంగారమైన మోక్షం నాకు చూపెను – చూపెను చూపెను = శృంగార మైన మోక్షం నాకు చూపెను – నా ప్రియ రక్షకుడు ॥

– ఎవిలిన్ ప్రీస్ట్

## 551 ఏలపాట

రా –శంకరాభరణము తా–అట

కన్యా గర్భమున బుట్టి – కరుణగల్గు బాలుఁడవైన – కన్యా సుతుండ నిన్నే నమ్మితి – నో యేసునాథ – కన్ను లెత్తి మమ్ముఁ జూడుము ॥కన్యా॥

1. బాల ప్రాయమున నేను – బాగుగా నీ పాద సేవఁ జాలజేసి యున్న వాడనుగా – యో యేసు నాథ – చాల దయతో మేలు చేయుమి ॥కన్యా॥
2. ఇంపైనట్టి మరియ తనయ – యిహము పరము నేలు బాల – సొంపుగా నీ ప్రాపే గోరితి – నో యేసునాథ – చెంపఁ గొట్టి బుద్ధి చెప్పుము ॥కన్యా॥
3. తుంటతనము చేత జగము – తంటాచేసి తిరుగుచుంటి – నంటిన మాయల బాధల – నో యేసు నాథ – యంటుఁ బాపి జంటజేయుము ॥కన్యా॥
4. మింట నుండి నీవు వచ్చి – మంటి పైని బాలుఁడ వగుచుఁ – గంటి కింపుగాను నడిచితి – వో యేసు నాథ – కానుపర్చి తోవు త్రోవను ॥గన్యా॥

– మిక్కిలి దేవసహాయము

## 552 అభినయ క్రిస్మస్ గీతము

బాల యేసుని జూడరే కరు – ణాల వాలని బాడరే = కాల పూర్ణత జూచి దేవుడు – కొమరుడై జన్మించెనే ॥బాల॥

1. దూతలారా రండి రండి – బేతలేమున బుట్టిన = నూతనాద్భుత శిశువు జూచి – స్తోత్రగీతముల్ పాడరే ॥బాల॥
2. గొల్లలారా రండి రండి – గొప్ప యుత్సవ మొందరే = ఎల్ల జనులకు రక్షణంబని – యంతటను చాటించరే ॥బాల॥

3. జ్ఞానులారా రండి రండి – కానుకల నర్పించరె = దీనులను రక్షించ దేవుడు – మానవుండై బుట్టెను ॥బాల॥

4. భక్తులారా రండి రండి – భజన పాటలు పాడరే = ముక్తిరాజగు యేసు ప్రభు మన – మధ్యనే జన్మించెను ॥బాల॥

5. లోకుందరు రండి రండి – ఏకమై కీర్తించరే = శ్రీకరుండౌ యేసు క్రీస్తుడు – శ్రీ లొసంగగ వచ్చెను ॥బాల॥ – చెట్టి భానుమూర్తి

## 553 చిన్న పరలోకము

(చాయ : ఎంత చక్కని యేసు పుట్టె మనకు)

1. చిన్న పరలోకమన్న మన హృదయం = అన్న యేసన్న అందున్న సమయం ॥చిన్న॥
2. చిన్న పరలోకమన్న మన గృహము = అన్న యేసన్న అందున్న దినము ॥చిన్న॥
3. చిన్న పరలోకమన్న – మన స్నేహం = అన్న యేసన్న అందున్న నాటన్ ॥చిన్న॥
4. చిన్న పరలోకమన్న మన సంఘం = అన్న యేసన్న – అందున్న కాలం ॥చిన్న॥ – ఓగిరాల గాబ్రియేలు

## 554 *Jesus Gentle Saviour*

1. చిన్నవారి ప్రియ – యేసు రక్షకా
మాదు విన్నపంబు – నాలకింపుమా

2. మా ప్రవర్తనందు – జక్కపర్చుము
నీతి మార్గమందు – నడువజేయుము.

3. ఇంక పెక్కుమంది – చిన్న బిడ్డలు
నిన్ను నమ్మునట్లు – దయజేయుము

4. నిన్ను వెంబడించి – యెల్లకాలము
నీదు సముఖమందు – సంతసింతుము.



## 555 బాలల జన్మ దినోత్సవము

రా – కమాసు (చాయ : ఎంత చక్కని యేసు పుట్టె మనకు) తా – త్రిపుట

ఆశీర్వాదము నీయుమ – మా పరమజనక – యాశీర్వాదము నీయుమ = ఆశలుదీరంగ – నాయు వొసంగుచు – వాసిగ కరుణను – వర్ధిల్ల బిడ్డకు ॥ఆశీర్వాదము॥

1. యేసు పెరిగిన యట్టులే – నీ దయయందు – ఈసు బిడ్డను పెంచుము = వాసిగ మనుజుల కరుణయందున బెరుగ – భాసుర వరమిచ్చి – బాగుగ బెంచుము ॥ఆశీర్వాదము॥
2. నెనరు మీరగ మోషేను –నెమ్మదియందు – తనర బెంచినట్లుగ =ఘనముగ నీ శాంతి – సంతసములయందు – తనర నీ బిడ్డను – తగురీతి బెంచుము ॥ఆశీర్వాదము॥
3. ఏ రీతి సమూయేలును – నీ సన్నిధిలో –నేపుగ బెంచితివో = యారీతి నీ బిడ్డ నాత్మ స్నేహమునందు – కోరి బెంచుము ప్రభువ – కోర్కెలూరగ వేగ ॥ఆశీర్వాదము॥
4. సత్య విశ్వాసమునందు – చక్కగ బెరుగ – శక్తి యొసంగినడ్పుమా = సత్య వాక్యమునందు – సరగను వర్ధిల్ల – నిత్యము నీ కృప – నిచ్చి బ్రోవుమ ప్రభువ ॥ఆశీర్వాదము॥
5. భక్తి ప్రేమల నీ బిడ్డ – బాగుగా బెరుగ – శక్తినీయ మా ప్రభువ = ముక్తి పథంబున ముద్దుగ నడువంగ – యుక్తజ్ఞానము నిచ్చి – యుద్ధరించుమ ప్రభువ ॥ఆశీర్వాదము॥ –తూలూరి ప్రకాశము

## 556 *We are but little Children*

1. నే బీద చిన్న పిల్లను
నా బుద్ధి స్వల్ప మయినది
నా దివ్య యేసు కొఱకు
నే నేమి చేయగలను?

2. నిత్యంబుఁ చిన్న పనులు
నే చాలఁ జేయవచ్చును
నా చిన్న తప్పు లన్నియు
నే చక్క పెట్టవచ్చును.

3. మనస్సునందు కోపము
వేమాఱు పుట్టునప్పుడు
నా కన్ను లెఱ్ఱఁ జేయక
నే నోర్చు కొనవచ్చును.
4. నే తిన్నగాను నడ్చుచు
ఇల్లంత వెలిఁగించుచు
నా యేసుకై యుల్లాసముఁ
బుట్టింపవచ్చు నెప్పుడు
5. నే నెంత చిన్న పిల్లను
నా కుండు చిన్న బాధకు
నే తాలి ప్రేమ స్తోత్రము
లర్పించుచుండఁగలను.

–సెసిల్ ఫ్రాన్సెస్ అలెగ్జాండర్

అను : బార్నర్డ్ లూకాస్

## 557 *Jesus bids us shine*

1. "ప్రకాశించుడి" యను నాజ్ఞను
ప్రభువైన యేసు మన కిచ్చెను
ప్రేమ యను దివ్వె వెలిఁగింతుము
నీవు నీ యింటన్ నేను నా
యింటన్
2. "ప్రకాశించుఁడి" యను నాజ్ఞను
ప్రభువైన యేసు మన కిచ్చెను
దురితాంధకారమున్ హరింతము
నీవు నీ యింటన్ నేను నా
యింటన్
3. "ప్రకాశించుఁడి" యనునాజ్ఞను
ప్రభువైన యేసు మన కిచ్చెను
భక్తి యను దివ్వె వెలిఁగింతము
నీవు నీ యింటన్ నే నా
యింటన్.

–ఎమిలి హంటింగ్టన్ మిల్లర్

అను : బార్నర్డ్ లూకాస్

## 558 *Jesus loves me, this I know*

1. యేసు నన్ను ఁ బ్రేమించి
దాసు నన్ను ఁ బిల్చెను
ఈ సత్యంబు బైబిలు
తేటగాను దెల్పెను.
॥ యేసు ప్రేమించును
దాసుల నందఱిన్
ఆ స్వామి వేదమే
ఈ సత్య మిచ్చెను ॥
2. బాలురమౌ మమ్మును
బాగుగాఁ బ్రేమించును
శక్తిలేనివారము
బలవంతుఁ డేసుఁడు.
3. బుద్ధిలేని వారికిఁ
తాను బోధపర్చును
శుద్ధిలేని వారిని
శుద్ధిఁ జేసి బ్రోచును.

– అన్న బార్ట్‌లెట్ వార్నర్

అను : జేకబ్ చేంబర్లేన్

# విశేష సమయములు

## వివాహము

## 559 మంగళార్చన

రా –ముఖారి (చాయ : కానా పురంబులో) తా–కురురుఝంపె

మంగళము క్రీస్తునకు – మహిత శుభవార్తునకు – మంగళము త్రిత్వస – మాన్వితునకు = మంగళము దూత జన – మకుట మగు ప్రభువునకు – మంగళము వేదాంత – మాన్యునకును – జయ మంగళము – సదా శుభ మంగళము ॥జయ॥

1. కానాకుఁ జనుదెంచి – కల్యాణమును మహిమ – గా నొనరప్పను నీరు – గాంచి ద్రాక్షా = పానముగ మార్చి నీ – ప్రథమాద్భుత ప్రతిష్ఠ – భూనుతుఁడ తెల్పితివి – మానితముగా ॥జయ॥

2. నీకు సంఘమునకు – నిత్యమైన వివా – హైకత్వమునకుఁ దగు – నెచ్చరికగాఁ = గైకొనెడి నీ సేవక వరుల పరిణయము నీ కరుణచే ధరను నిముడుగాక ॥జయ॥

3. ప్రేమానుబంధమునఁ – బెనగి యీ దంపతులు – వేమారు నీ మహిమ – వెదకి భువిని = కామాదులను గెల్చి – కైవల్య పురమునకు – క్షేమ మగు కృపనిచ్చి – చేరనిమ్ము ॥జయ॥

4. ఆదికాలము నాబ్ర – హాము శారా లెంతో – నీ దయలో బ్రతికి యిల – నెగడినట్టు = ఈ దీన దంపతులు – గాదిలిచే బ్రతుకుటకు – నీ దయారసమొస గు – మక్షయుండా ॥జయ॥

5. సంతానము గాంచి – సద్భక్తిలో బుద్ధి – మంతులై క్రైస్తవ – మతము నందు = అంత్యపర్యంతంబు – నణుఁకువగఁ బెంచ నా – ద్యంత రహితుండ స– హాయ మిమ్ము ॥జయ॥

6. కర్తయైన క్రీస్తు – కరుణయు దేవుని – పరమపూర్ణ ప్రేమ – ప్రబలము గను = సురుచిరం బగు పరి – శుద్ధాత్మ నైక్యత – కలుగుcగాక దంప – తుల కనిశము ॥జయ॥

– బేతాళ జాన్

## 560 దైవాశీర్వాదము

ప్రభు మార్గములయందె – భయభక్తి నిందు – శుభరీతి నడిచే – పురుషుండే ధన్యుండు ॥ప్రభు॥

1. అపుడు నీచే కష్టం – బారగించుదువు – ఎపుడు ధన్యుడవు నీ – కిలమేలౌ గాక ॥ప్రభు॥

2. నెలవు ప్రక్కలనున్న సఫలమౌ ద్రాక్షతీ – గెల పోలి నీ భార్య – ఫలమిచ్చును గాక ॥ప్రభు॥

3. పిల్లలిప్ప మొక్క – పెంపువలె నీదు – బల్లజుట్టుకొని శో – భిల్లుదురు గాక ॥ప్రభు॥

4. ప్రభున కిదిగో భీతి – పడువాడీరీతి – విభవంపు దయనొంది – వికసించునుగాక ॥ప్రభు॥

5. ప్రభు సీయోనునుండి – ప్రశస్త కృపను – ప్రబలంబుగా నిచ్చి – బ్రతికించునుగాక ॥ప్రభు॥

6. అరయ బ్రతికెడు రోజు – లన్నిట నీవు – యెరుషలేము క్షేమంబు – నెపుడు జూచెదవు ॥ప్రభు॥

7. నీదు పిల్లల పిల్లలు – నిజమిశ్రాయేలు – మీది క్షేమముజూచి – మోదమొందెదరు ॥ప్రభు॥

8. తండ్రి కుమార శుద్ధాత్మునకు – మహిమ – మెండై యుగయుగములం దుండుగా కామేన్ ॥ప్రభు॥

– బేతాళ జాన్



## 561 వివాహము

రా – సురటి (చాయ : కూడికొని యున్నాము) తా – త్రిపుట

కోరుకొని యున్నాము – యేసు ప్రభూ – కోరుకొని యున్నాము =[1]సార కల్యాణ గుణమణి – సన్నిధి నీ సన్నిధిని ॥కోరుకొని॥

1. [2]చారు వివాహో – త్సవము ఘనముగc జేయc – గోరి దర్శన మి – చ్చితివి గనుకc = గూరిమితో నిది – గో యీ పెండ్లికి మాకుc – గారవు చుట్టము – గా నిన్ను యేసూ ॥కోరుకొని॥

2. కరములు జోడించి – పరస్పర ప్రమాణ – [3]భరము మోసిషిన యీ దం–పతుల మీcద = వర కరుణైక్యతకు [4]భ – వదను గ్రహ కిరీట –ము రచించి [5]తద్బంధ – మును నీవే దీవింపc ॥కోరుకొని॥

3. చనువొప్ప వారు క్రై– స్తవ జాగరూకత – లను దమ తమ వంతు – లుభవించి = [6]మొనసి సంసార భర – మును జులకన పర్చు –కొను తదాత్మల [7]మే – ళన నీవు దయచేయc ॥కోరుకొని॥

4. ఘన విశ్వాస ప్రా –ర్థన కోరికలయందుc – దనర నొకరి కొకరు – దయc జూపుచు = నొనర కుటుంబంబు – నురువు నొదింపంగ మనసారc దత్సంత – తిని గాన దయచేయc ॥కోరుకొని॥

– విలియం డాసన్

## 562 మంగళము

రా – ఆనందభైరవి (చాయ : మంగళము క్రీస్తునకు) తా – కురుఝంపె

కానాపురంబులోc గడు వింతగా నీరు – జానుగా ద్రాక్షరసమును జేసి = పానముగc బెండ్లిలో – బాగుగా నిచ్చిన – దీన రక్షక బెండ్లి – దీవించుమీ॥కానా॥

1. రావయ్య పెండ్లికి – రయముగా నో యేసు – ఈవు లియ్యcగ వచ్చు – హితుని బోలి = కావు మీద్వంద్వమును – ఘనమైన కృపచేత – భావమాలిన్యంబుc – బాపి యిపుడు ॥కానా॥

[1]ఉత్తమమైన. [2]సౌందర్యము. [3]భారము. [4]నీదు. [5]దాని కట్టుట. [6]సిద్ధపడి. [7]ఐక్యపు.

2. దయ నుంచు మయ్య యీ – దంపతులమీఁద స –దయుఁడవై కాపాడు – తం(డ్రి వలెను = నియమంబుగా వీరు – నీ చిత్తమును జరిపి – భయము లేకుండ గ – (బతుక నిమ్ము ॥కానా॥

3. ఒప్పు మీరఁగఁ జేయు – నొప్పందము వీర – లెప్పుడును మదిలోన – నిడికొనుచును = దప్పకుండఁగ దాని – నిప్పుడమిలో నెపుడు – గొప్పగా నెరవేర్ప – గూడ నుండు ॥కానా॥

4. చక్కఁగా నెగడింప – సంసార భారంబు – నెక్కు వగు నీ యాత్మ – నిపు డొసంగి = నిక్క మగు సరణిలో – నెక్కువగ నడిపించి – (క్కు నను దీవించు – కరుణానిధీ ॥కానా॥

5. పిల్లలను నీవొసఁగఁ – (బియముతో నో దేవ – పెల్లుగా బోధింప – వెరవు జూపు = మెల్ల వేళలలోన – నిరుకు మార్గము నందు – జల్లఁగా నడిపింప – శక్తి నిమ్ము ॥కానా॥

– పులిపాక జగన్నాథము

## 563 వివాహము

రా – జంఝూటి తా – ఆది

మానవుల మేలు కొరకు – జ్ఞానియైన దేవుఁడు = మానుగఁ కల్యాణ పద్ధతి – మహిని నిర్ణయించెగా ॥మానవుల॥

1. కానాయను నూరిలో మన –కర్త చూచెఁ బెండ్లిని = పానముగను (ద్రాక్షరసము – దాన మొసఁగెఁ (బీతిని ॥మానవుల॥

2. యేసూ వీరిద్దరిని – ఏకముగాఁ జేయుమీ = దాసులుగను జేసి వీరి దోసము లెడబాపుమీ ॥మానవుల॥

3. కర్త వీరలకు భార్య – భర్తల (పేమంబును = బూర్తిగ నీ విచ్చి వీరిఁ బొందుగాను నడుపుమీ ॥మానవుల॥

4. భక్తియు విశ్వాస (పేమలు – భావమందు (వ్రాయుమీ = ముక్తి సరణి వెదక వీరి భక్తి మిగులఁ జేయుఁమీ ॥మానవుల॥



## 564 దైవాశీర్వాదము

రా –శంకరాభరణము తా – ఆది

దేవర నీ – దేవెనలు – ధారళముగను వీరలపై = బాగుగ వేగమె దిగనిమ్ము – పావన యేసుని ద్వారగను ॥దేవర॥

1. దంపతులు దండిగ నీ – ధా(త్రిలో వెలయుచు సంపదలన్ = సొంపుగ నింపుగ పెంపగుచు స – హింపున వీరు సుఖించుటకై ॥దేవర॥

2. ఈ కవను నీ కరుణన్ – ఆకరువరకును లోకములో = శోకము లేకయె యేకముగాఁ – (బాకటముగను జేకొనుము ॥దేవర॥

3. ఇప్పుగిది నెప్పుదును – గొప్పగు (పేమతో నొప్పుచు దా = మొప్పిన చొప్పునఁ దప్పకను – మెప్పుగ (బతుకగఁ బంపు కృపన్ ॥దేవర॥

4. తాపములు పాపములు – మోపుగ వీరిపై రాకుండగాఁ = గాపుగఁ (బాపుగ దాపునుండి – యాపద లన్నియుఁ బాపుచును ॥దేవర॥

5. సాధులుగన్ జేయుటకై – శోధనలచే నీవు శోధింపగాఁ = కదలక వదలక ముదమున నీ – పాదము దాపునఁ బాదుకొనన్ ॥దేవర॥

6. మెండుగ భూమండలపు – గండములలో వీరుండగను = తం(డ్రిగ దండిగ నండనుండి – వెండియు వానిని ఖండించవే ॥దేవర॥

7. ఇద్ధర వీరిద్దరును – శుద్ధులై నిన్ను సేవించుటకై = (శద్ధతో బుద్ధిగ సిద్ధ పడన్ – దిద్దుము నీ (ప్రియ బిడ్డలుగాన్ ॥దేవర॥

8. వాసిగ నీ దాసులము – చేసిన యీ మొఱల్ దీసికొని = మా సకలేశ్వర నీ సుతుఁడౌ – యేసుని పేరిటఁ (బోవు మామేన్ ॥దేవర॥

–అల్లారి పెదవీరాస్వామి

## 565 *O Perfect Love*

1. మానవ జ్ఞానంబును మించినట్టి
మాధుర్య మౌ సంపూర్ణ ప్రేమ
మా,
మక్కువ దంపతులఁ బ్రేమ ముట్టి
చక్కని యైక్యమందుఁ జేర్చుమా
2. మాధుర్య మౌ సంపూర్ణ ప్రేమ
మా, నీ
మోద మొసంగి సర్వ శీలము
భక్తి విశ్వాస నీతి న్యాయములఁ
బరంగఁ జేయ వీరిన్ జేర్చుము
3. దుఃఖంబు గెల్చు నానందంబుతో
డఁ
కష్టంబు లోర్చు సమాధానము
రాఁబోవు నిత్యజీవమును పొంద
ప్రాభవ మిమ్ము వీరి కేసువా.

–డోరతి ఫ్రాన్సెస్ గుర్నీ
అను : ఆల్‌ఫ్రెడ్ త్యాగరాజు పామర్

## 566 *The voice that breathed o'er Eden*

1. ఏదేన్ వనంబునందు
ఆది వివాహమున్
విధించినట్టి వాక్కు
వర్ధిల్లు నిప్పుడున్.
2. పవిత్ర కల్యాణంబున్
పదిలపర్చుచు
దైవ త్రిత్వంబు నేఁడున్
దీవింప వత్తురు.
3. సంతాన వరమును
సంతోష ప్రేమయు
వింతైన యైక్యత్వంబు
నెంతయు నిత్తురు.
4. ఆదామునకుఁ దండ్రీ,
హవ్వ నొ సంగితి
వాదరముగ నీమె
నీ ధన్యున కిమ్ము
5. నీ ఱెక్క క్రింద వీరిఁ
బరిగ్రహించుచు
వైరి తంత్రంబునుండి
దూరంబుఁ జేయుము.
6. ఈ రీతిన్ బ్రత్కి యంత
క్రీస్తేసు పెండ్లికి
వీరిద్దరును జేరి
బరంగఁ జేయుమి.

–జాన్ కెబిల్
అను : ఆల్‌ఫ్రెడ్ త్యాగరాజు పామర్





# గృహప్రవేశము

## 567 దేవా! మా యింటిని దీవింపుము

రా –ఆనందభైరవి (చాయ :పోపొమ్ము ఓ లోకమా) తా – త్రిపుట

దేవా, మా గృహంబును – సదయుండవై – దీవించుటకు రారమ్ము = నీవె యిద్దానిని నెఱదాతవగుచు స – ద్భావముతో నిచ్చితివి – బహుమానముగ మాకు ॥దేవా॥

1. మా యింటి యజమానుండ – వీవెసుమ్మి – మా యింటి ప్రభుఁడ వీవె = పాయక మా యింట – భవదీయాభీష్టంబె – శ్రేయోదాయకమగుచు – సిద్ధిం చెడును గాక ॥దేవా॥

2. మా యాస్తిపాస్తులన్ని – మా కబ్బె భవ – దీయానుగ్రహ బలముచే = నీయాననవ్వాని – నీ యలఘు సేవకై – న్యాయముగ నర్పింప – నీయవె ఘన బుద్ధి ॥దేవా॥

3. నీవిచ్చు ధననిధులైన – మా బిడ్డలు – కేవలము నీ దాసులై = భావివానిరి మణుల – లేవనుద్భాసిల్ల – నీవెవారిని భృశము–ప్రోవుమాయువొసంగి ॥దేవా॥

4. రేపుమాపీ గృహునఁ బ్రోక్తములగుచు –దీపించు ప్రార్థనముల = లోపరహితంబులుగా – ధూపధూమములట్లు – నీ పాదయుగళి స – మీపింప నిమ్మెపుడు ॥దేవా॥

5. ఏ రోగమును నెపుడేని – మా మందిరపు – ద్వారంబు చొరనీయక = ఆరోగ్యభాగధే – యంబిచ్చి మమ్ములను – భూరికృపబ్ధివై – పోసింపుమను దినము ॥దేవా॥

6. ఇరుగుపొరుగు వారలతో – సమాధాన – పరతవసింపను నేర్పి = కొఱగాని కలహములు – త్వరపెట్ట నవ్వాని – భరియింపఁదగు సహన – భావంబు మా కిమ్ము ॥దేవా॥

7. బీదసాదల కెల్లరకు – మా గృహమెప్పు – డాదరణాస్పదమై యుండ = నీ దానాసారంబు – నెఱవర్షించిన కొలఁది – నౌదార్యగుణము మా – యందుఁ బెంచుము సొరిది ॥దేవా॥

8. నక్కలకు బొరియలుండు – దివి పక్షులకుఁ – జక్కని గూళ్లునమరు = నొక్కింత [1]యిక్కనా – కెక్కడలేదనిన – చక్కని నరసుతమా –సదనంబు నకు రమ్ము ॥దేవా॥ – దాసరి మోజెస్

## 568 గృహ ప్రవేశము

రా –శ్రీరాగము (చాయ :ఆలించు దేవా) తా – అట

దీవించు దేవా – నీ బిడ్డలను దీవించు దేవా = దీవించుమీ గృహము – దేవపుత్రుల మంచి – స్థావరంబుగ వెలసి – సత్యకాంతుల బరుప ॥దీవించు॥

1. నీవే యీ గృహమునకు – నిత్యతలపతివంచు – నేవేళ నీ మనసు – నెరిగి జీవింపగ ॥దీవించు॥

2. సంభాషణలవేళ – సన్నిహితుడా నీకు – సంబరంబును – గూర్చు సద్వాక్కులను బలుక ॥దీవించు॥

3. భోజన సమయమున – భూరి ప్రేమతో నిన్ను– పూజ్యుండౌ యతిథిగ పూజసల్పుచు బిలువ ॥దీవించు॥

4. ఇరుగుపొరుగులనెల్ల – పరవారివలెగాక – పరమాత్మనీసుతుల – వలె జూచి ప్రేమింప ॥దీవించు॥

5. అనుదిన ప్రార్థన – లందు శ్రద్ధాభక్తు – లను జూపి క్రైస్తవ – యనుభవంబుల నొంద ॥దీవించు॥

6. క్రైస్తవగృహ విధులీ – గృహమున నెరవేర – విస్తారమగు కృపను –వీర లందరి కొసగి ॥దీవించు॥

7. ఆయురారోగ్యంబు – లాత్మైశ్వర్యములిచ్చి – ఈ యూర వీరు నీకింపగు సాక్ష్యము నియ్య ॥దీవించు॥ – పి.పి. శుభామణి

[1]ఇల్లు



# దాతృత్వము

## 569 పుచ్చుకొనుటకన్న ఇచ్చుట ధన్యత

రా –మిశ్రమ తా – ఆది

ఇలఁ పుచ్చుకొనుట కన్న – నెంతో యిచ్చుటయే ధన్య మన్న = తులలేని భక్తి మీర – చెలువైన రక్తి దీర – నలలారు కూరిమితో మరి పేరి మితో – మెలంగినచో – నెలమిని బ్రభుఁ డిడుఁ బలు దీవెనల ॥నిల॥

1. పొడగాంచి చుక్క జ్ఞానులు –కరము – నడిచి నడచి కానుకలు = నిడి బాలనృపునిమ్రోల – పడి మ్రొక్కి మోడ్చి కేలఁ – గడు నిత్యభాగ్యమును సౌభాగ్యమును – గడించికదా – వెడలి రమందానందముతోడ ॥నిల॥

2. మును పేద విధవ చాల – భక్తి – నొనరంగ గుడి చందాలఁ = దన జీవనంబై యుండు –నెనరాని కాసులు రెండు – మనసార నర్పించె సమర్పించె – మనశ్శాంతిన్ – గని యెసు క్రీస్తుని వరముల బడసె ॥నిల॥

3. తనయ నీదు హృదయంబు – నాకి – మ్మనె దేవుఁడె యనయంబు = మన సొప్పి మన కానుకల – మారాడక మన సకల – మును నీయఁ గావలయున్ బ్రభుడాయవలెన్ –మనం బలరన్ – సణుగక గొణుగక వర్ధిలు కొలఁది ॥నిల॥

– మల్లెల్ల దావీదు

## 570 దాతృత్వము

రా –నవరోజు (చాయ :యేసుక్రీస్తు దొరికితేను) తా – ఆది

ఇయ్యుడి మీకియ్యబడునని – ఇయ్యగల శ్రీ యేసు ప్రభువు = నెయ్యముతో తన – శిష్యవితతికి – నయముమీర జెప్పినట్లు ॥ఇయ్యుడి॥

1. మొదట పరముని నంతునియ్యరే – సదమల హృదయంబుతోడ = సదయుడగు మన పరమతండ్రి – ముదమతోడ నంతయు నిచ్చున్ ॥ఇయ్యుడి॥

2. శక్తికొలది నియ్యవలెనని – భక్తులందరితోడ జెప్పె = భక్తితోడ ప్రభుని సేవకు– శక్తికొలది నియవలెను ॥ఇయ్యుడి॥

3. కొంచెముగ విత్తెడివారు – కొంచెము సమకూర్చెదరు = హెచ్చువిత్తెడి వారికిలను – హెచ్చు ఫలములు నిండుగ దొరుకున్ ॥ఇయ్యుడి॥

4. సంతసంబుతో నిచ్చెడివారి నెంతో దేవుడు కృపతో బ్రోచున్ = వింతగా దీవెనలతోడ – అంతయు దయచేసి బ్రోచున్ ॥ఇయ్యుడి॥

5. యేసు కృపను ఎరిగిమనుడి – యేసు మార్గమునందు నడువుడి= దాసుడై ధనమంత విడిచె – నీచులకొరకిలను మున్నె ॥ఇయ్యుడి॥

6. పరమనిధులను నింపుకొనుడి – పరమ దేవుని ప్రేమను గనుడి = పరమ నిధులలో చిమ్మెటుండదు – దొంగలసలే లేరుసుమండి ॥ఇయ్యుడి॥

– జి.జాన్ తాతయ్య

## 571 దశమ భాగము

రా –హిందుస్థాని తోడి తా – రూపకము

దశము భాగము లెల్ల దేవునివి – ధారాళముగ నియ్య సమకూడుఁడి = పశువులు పైరులు దేవునివి – పసిఁడి లోహపుగనులు దేవునివి భాగ్యభోగ్యము లెల్ల దేవునివి – భావించి కానుకలను నియ్యుఁడి ॥దశమ॥

1. దేవునివి దొంగిలించెదరా – దేవదేవుని మోసపుచ్చెదరా = భావించి మది నెంచి భయము నెంచి – ప్రార్థింపఁ దలవంచి ప్రభు భాగమున్ – దేవాలయంబును పూర్ణంబుగా – దేదీప్యముగా నుండ సమకూర్చుఁడీ ॥దశమ॥

2. పరిశుద్ధ దేవుని మందిరముఁ – పరిపూర్ణముగాను యోచించుఁడీ = పరిశుద్ధ భాగము విడఁదీయుఁడీ – పాడిపంటలు నాస్తి దేవునిని – పదియవ భాగంబు దేవునివి – పరమాత్మ దీవెనలను బొందుఁడీ ॥దశమ॥

3. ప్రథమ ఫలంబులు దేవునివి – విదితంబుగా నీయ మది నెంచుఁడీ = సదమల హృదయములను బొందియుఁ – ప్రథమ భాగము నెల్ల విడఁదీసియు – ముదమున దేవునికర్పించుఁడీ – సదయు దీవెనలొంద సమకూర్చుఁడీ ॥దశమ॥

4. ఆకసపు వాకిండ్ల విప్పుదును – అధిక కృపలను గుమ్మరించుదును = మీ కష్టఫలములను దీవింతును– భీకర నాశంబుఁ దొలఁగింతును – మీ కానంద దేశ మిత్తు నని – శ్రీకరుం డెహోవా సెల విచ్చెను ॥దశమ॥



5. దినభోజనం బిచ్చు దేవునిని– ఘన సౌఖ్యముల నిచ్చు దేవునిని = వినయంబుతో మదిని ధ్యానించుచు – దినభోజనంబులను భాగించుచు = మానక దేవుని కర్పించు డీ – ఘనసేవ జయమొందు పని బూనడీ ॥దశమ॥

– కూచిపూడి రాజరత్నము

## 572 ఔదార్యము

రా –కాంభోజి తా – రూపకము

స్తుతియు మహిమయు నీకె – క్షితికిన్ దివికిన్ నీటి –వితతికిన్ కర్తవై –వెలయు మా దేవా = ప్రతి వస్తువును మాకు బహుమతిగా నిచ్చు– హితుఁడా మా ప్రేమ నీ – కెట్లు చూపుదుము ॥స్తుతియు॥

1. పసిఁడి వర్ణపు టెండ – భాగ్య ధారల వాన – విసరు మంచి గాలి – విరియు పుష్పములు = రస మొల్కు పండ్లు నీ– రమ్య ప్రేమన్ జాటున్ – బ్రసరించు కో తలో – పల నుందు వీవు ॥స్తుతియు॥

2. నెమ్మదిగల యిండ్లు – నిజసౌఖ్య కాలములు – ఇమ్మహి ఫలియించు – నైశ్వర్యాధికముల్ = ఇమ్ముగ గలిగిన – హృదయులమై వంద – నమ్ములు ఋణపడి యు –న్నాము నీకు ॥స్తుతియు॥

3. దురితంబు లొనరించి – దౌర్భాగ్య స్థితి నున్న – ధరణికి నీ పుత్రున్ – ధర్మంబు జేసి = నరుల కీ ధర్మమున – కొరఁత దీర్చెడు సర్వ – వరము లమర్చిన – పరమోపకారి ॥స్తుతియు॥

4. జీవంబు ప్రేమను – జేవఁ గల్గించెడు – పావనాత్మను మాకై – పంపితివి = దీవెన లేడు రె – ట్లావరింపను మమ్ము – నీ విమలాత్మ వా – నిని గుమ్మ రించు ॥స్తుతియు॥

5. నరులకు విమోచ – నము గల్గె పాపంబుల్ – పరిహార మాయెఁ గృ – పాసాధనముల్ = దొరికె మోక్షాంశంబు – స్థిరమాయె మేము నీ – కొరకేమి తేగలము – పరిపూర్ణ జనకా ॥స్తుతియు॥

6. మాకై వాడుకొనెడి – రూకల్ వ్యర్థం బగును – నీకై యప్పుగ నిచ్చు – నిఖిల వస్తువులు = శ్రీకరంబగు నిత్య – శ్రేష్ఠ ధననిధియై పై – లోకంబు నందుండు – లోపంబు లేక ॥స్తుతియు॥

7. జీవంబు వస్తువులు – శ్రేయస్సు దాన స్వ– భావంబు శక్తియు – భాగ్యంబులు = నీవలననే లభ్యమై వెలయుచున్నవి – నీ వాసమే మాకు – నిత్యానందంబు ॥స్తుతియు॥

– ముంగమూరి దేవదాసు

## 573 క్రైస్తవ దాతృత్వము

రా –శంకరాభరణము (చాయ :యేసునామంబెత్తి పాడుదమ) తా – అట

దాతృత్వమును గలిగి పెరుగుదమ = ధనము – ధాత్రి దేవుని దంచు నెఱుగుదమ ॥దాతృ॥

1. శక్తికొలఁది కాన్కలర్పింతమ = మన – భుక్తినుండి కొంతఁ దీయుదమ ॥దాతృ॥
2. సంతోషముగ నియ్య సాగుదమ = మన – స్వంతటితోఁ జేయ నేగు దమ ॥దాతృ॥
3. గర్వఘనములు వీడి యర్పింతమ = యుర్వి – సర్వ మాయనదంచు నేర్పింతమ ॥దాతృ॥
4. సంఘ సేవకు సొమ్ము సమకూర్తమ = క్రీస్తు – సంఘ యక్కఱ లన్ని తీర్చుదమ ॥దాతృ॥
5. ప్రతియాదివార మిది మది నుంతమ = దీని ప్రతి సంఘస్థుఁడు చేయ బోధింతమ ॥దాతృ॥
6. విధిఁ దలఁచి దుర్బలుల రక్షింతమ = సంఘ – విధవాళి దానముతో దర్శింతము ॥దాతృ॥
7. దిక్కులేని జనుల దీవింతమ = వారి – యక్కఱలలో మేలుఁ గావింతమ॥దాతృ॥
8. పుచ్చుకొనుటకంటె నిచ్చుదమ = మఱల – నిచ్చు తండ్రికి స్తుతుల నిచ్చెదమ ॥దాతృ॥
9. వెదజల్లి యభివృద్ధి పొందుదమ = మోక్ష – పదవు లను భవింపఁ బరుగిడుదమ ॥దాతృ॥
10. వర్ధిల్లిన కొలది చెల్లింతము = లోక – వ్యర్థ ఖర్చులనెల్ల మళ్లింతమ ॥దాతృ॥

– మోర్త ప్రకాశము



## 574 క్రైస్తవ దాతృత్వము

రా –నాధనామక్రియ (చాయ :భజన చేయు విధము) తా – అట

ఇచ్చునట్టి విధము తెలియండి – ప్రియులారా మీరు – హెచ్చు పొందు విధము ఇది నుండి = పుచ్చుకొనుట కన్న నెప్పు – డిచ్చుటయే కడు ధన్యత యని – హెచ్చరించి చెప్పలేదా – యేసు ప్రభు వపొస్తలులకు ॥నిచ్చు॥

1. శక్తికొలఁది దాన మీయుండి – సోదరులార – భక్తికొలఁది పరుల కీయుఁడి= శక్తి లేదని సాకు చెప్పక – సణగ కేమియు సరగ శ్రద్ధా – సక్తితో పేదలకు నిచ్చుట – యుక్త మని భావించి మదిలో ॥నిచ్చు॥
2. నీతిబోధలు చేయువారికి – బోధకులైన – నిఖల పాలకులైన వారికి = ఆతురముతో నీయవలెనని – యనుభవముగల మీరలెల్లరు – చేతులార నీయు దయ్య – ప్రీతి తోడును వారవార ॥నిచ్చు॥
3. ఆలయ కృత్యములు జరిగించు –యాజకుఁ డెపుడు – నాలయంబువలన జీవించు = ప్రాలుమాలక పనిని జేయఁ బరఁగ మీ యర్పణలఁ గాన్కల – బలవంతము లేక మీరు పలువిధంబు నియ్య వెదకుడి ॥నిచ్చు॥

–బన్యన్ జోసఫ్

## 575 క్రైస్తవ దాతృత్వము

రా –సౌరాష్ట్ర (చాయ :మనసానందము బొందుటకన్నను) తా – ఆది

సంతోషముతో నిచ్చెడు వారిని – నెంతో దేవుఁడు ప్రేమించున్ = వింతగ వలసిన –దంతయు నొసంగును – వినయ మనసుగల – విశ్వాసులకును ॥సంతోషముతో॥

1. అత్యాసక్తితో నధికప్రేమతో – నంధకార జను లందఱకు = సత్య సువార్తను – జాటించుటకై – సతతము దిరిగెడు – సద్భక్తులకు ॥సంతోషముతో॥
2. వేదవాక్యమును వేరు వేరు గ్రా – మాదుల నుండెడు బాలురకు = సాధులు ప్రభుని సు – బోధలు నేర్పెడి – సజ్జన క్రైస్తవోపాధ్యాయులకు ॥సంతోషముతో॥

3. దిక్కెవ్వరు లేకుండెడి దీనుల – తక్కువ లన్నిటిఁ దీర్చుటకై = నిక్కపు రక్షణ – నిద్ధరలో నలు – ప్రక్కలలోఁ బ్రక – టించుట కొఱకై ॥సంతోషముతో॥

4. ఇయ్యండీ మీ కీయం బడు నని – యియ్యంగల ప్రభు యే సనెను = ఇయ్యది మరువక – మదిని నుంచుకొని – యియ్యవలెను మన – యీవుల నిఁకను ॥సంతోషముతో॥

5. భక్తిగలిగి ప్రభు పని కిచ్చుట బహు – యుక్త మటంచు ను –దారతతో = శక్తికొలఁది మన భుక్తి నుండి యా – సక్తితో నిరతము – నియ్య వలెను ॥సంతోషముతో॥

– మోచర్ల రాఘవయ్య

## 576 *We give Thee but Thine own*

1. మేమిచ్చు కానుకల్
నీవే మాకిచ్చితి
మా యాస్తియంత ప్రభువా
నీ దానమే గదా.

2. నీ వుచితంబుగా
మా కిచ్చువాడవు
అన్యుల కుచితంబుగా
మేమిచ్చుచుందుము.

3. సర్వత్ర బీదలు
అన్నంబునొందరు
కన్నీళ్లు రాల్చు ప్రజలు
అనేకులుందురు.

4. ఈలాటివారికి
సహాయమిచ్చుట
దూతలు చేయు సేవకు
సమానమగును.

5. పోషించి బీదలన్
రక్షించి పాపులన్
అందరిన్ సంరక్షించుట
శ్రీ యేసు కార్యమే.

6. నా బీదవారికి
నీవిచ్చు దానము
నా కిత్తువను వాక్యము
శ్రీ యేసు చెప్పెను.

– విలియం వాల్షా హౌ



# కృతజ్ఞతార్పణల పండుగ

## 577 ఉత్సవ కీర్తన

రా –జంఝూటి తా – ఏక

పరమ తండ్రి నిన్ను మే మీ – పరస కాలము = స్వరము లెత్తి యింపు గాను – స్మరణఁ జేతుము ॥పరమ॥

1. నిరుపమాన దేవ నిన్ను – నిరత ప్రేమతో = హరువుగా నుతింతు మేము – హర్ష రవముతోఁ ॥బరమ॥

2. అవని సంభ్రమములలోన – నవఘళించము = అవసరముగ నీదు పలుకు నవధరింతుము ॥పరమ॥

3. వేయి నాళ్లు లోకమునను – వెలయుకంటెను = శ్రేయ మొక్కనాఁడు నిన్ను – సేవ జేయుట ॥పరమ॥

4. ఉచితమైన నీ గృహమున – నచల భక్తితో = రుచిరమైన నీదు ప్రేమ రుచినిజూతుము ॥పరమ॥

5. మనసునందు సత్యబోధ – మనస్కరించుచు = మనెదు తరిని విడము నీదు – ఉనికిపట్టును ॥పరమ॥

6. గొరియ పిల్ల యొక్క ప్రేమ –గూర్చి భక్తితోఁ = గొరత లేక చేతు మెపుడు – గొనబు గానము ॥పరమ॥

7. శాంతజలము నొద్ద మమ్ము – శాంతి పరచుము = సంతతమును నీవు మమ్ము – సంతరించుము ॥పరమ॥

8. దినము లన్ని మేము నిన్ను –దీన మనసుతో = వనరు మాని సంతసమున – వినతి చేతుము ॥పరమ॥

–యెషయా వీరమార్టిన్

## 578 కృతజ్ఞతార్పణలు

రా –హిందూస్తాని కన్నడ తా – తి్రశజాతి ఏక

నీ ధనము – నీ ఘనము – ప్రభు యేసుదే – నీ దశమ భాగము నీయ – వెనుదీతువా ॥

1. ధరలోన ధనధాన్యముల నీయగా – కరుణించి కాపాడి రక్షింపగా పరలోక నాధుండు నీకీయగా – మరి యేసు కొరకీయ వెనుదీతువా ॥
2. పాడిపంటలు ప్రభువు నీకీయగా – కూడు గుడ్డలు నీకు దయచేయగా వేడంగా ప్రభు యేసు నామంబును – గడువేల ప్రభుకీయ నో క్రైస్తవా ॥
3. వెలుగు నీడలు గాలి వర్షంబులు – కలిగించె ప్రభు నీకు ఉచితంబుగా! వెలిగించ ధరపైని ప్రభు నామము – కలిమికొలది ప్రభున కర్పింపవా ॥
4. కలిగించె సకలంబు సమృద్ధిగా – తొలగించె పలుబాధ భరితంబులు బలియాయె నీ పాపముల కేసువే – చెలువంగ ప్రభుకీయ చింతింతువా ॥

– బొంతా సమూయేలు

## 579 కృతజ్ఞతార్పణల పండుగ

రా –ముఖారి తా – ఆది

ఏది సఖుడ – యేది నీ – మదిని జేసికొనిన ప్రతిన యేది నీవొసంగు కాను – కిదియె తరుణమిాయరమ్మ ॥

1. అన్న వస్త్రంబు లిచ్చి – యాలు బిడ్డల ననుగ్రహించి యన్ని వస్తువుల నిచ్చి – యున్న నా కెదురుకాను ॥కేది॥
2. వ్యాధి బాధలొందినపుడు – శోధనంబు లడరినపుడు ఏది యెప్పుడవసరం బది – యొసంగి యాదిరించితి ॥ఏది॥
3. మనసు శాంతిలేక నీవు – మదిని బొగలుచుండ జూచి కనని వినని ప్రేమ జూపి – కనికరించినట్టి ప్రభుని ॥కేది॥
4. పాపమందు పడినాడు – దాపుజేరి నిలుపలేద? కాపరివలె నిన్ను గాచి యోపికతో నడుపలేద ॥ఏది॥
5. ఏమి దాచినావో సఖుడ! – ఏమి తెచ్చినావు నేడు ? నీ మనసు నిండ ప్రేమయున్న – నదియే నాకు వేనవేలు ॥ఏది॥

– చెట్టి భానుమూర్తి



## 580 ప్రథమ ఫలములు

రా –శంకరాభరణము (చాయ : యేసుని ప్రేమను ఏమారకను) తా – ఆది

సార్వజగతికి సంరక్షకుడు –స్వామి యెహోవాయే గాద = ధారుణీ స్థలిని ధనధాన్యములను ౕ – దొలి దానము – తనకీయగరాదా ॥సార్వజగతికి॥

1. ఆదామును ప్రభు ప్రథమ ఫలంబుగ – ఆదర్శముగాౕ మనకిడెగా = ఆది సంభవుని కతి మోదంబున – సేద్య ఫలంబులు – తేవలదా ॥సార్వజగతికి॥
2. కానుకలీయరె మానితులారా – కన్యకుమారుని భజియింపన్ = మానవ పునరుత్థాన మహిమలో – మన ప్రథమ ఫలంబతడౌర ॥సార్వజగతికి॥
3. ఉభయజగాల సర్వోన్నతు డాయనే – శుభకరు డన నొప్పును గాదె = ప్రభుని పేర మిా పరమోత్తమమౌ ప్రథమ ఫలాదులు యిటతేరె ॥సార్వజగతికి॥

–బందారు సుజ్ఞానము

## 581 కోౕత యజమానుౕడు

రా –బిలహరి (చాయ : యేసు నాధ కథా సుధారస మిదిగో) తా –త్రిపుట

కోౕత యజమానుండ స్తోత్రముౕ – గూర్మితో నొనరింతుము = ప్రీతి మిార గ మాదు పొలములు – పెరిగి పండెను గావునౕ ॥కోౕత॥

1. నీదు సేవకులైన వారలు – నిండు మోదముౕ నొందుచు = నీ దయ నొక యే టి గ్రాసము – నీ దినంబున గాంతురు ॥కోౕత॥
2. విత్తుకాలము కోౕతకాలము – విమలమైన తలంపులు = చిత్తమునౕ బుట్టించి మాకతి క్షేమ మొసౕగితి రక్షకా ॥కోౕత॥
3. వేసవిని భువి మేము నాటిన – విత్తనం బతిరమ్యమై = భాసురంబగు పచ్చ మొక్కయి – బయలువడె నిది చిత్రము ॥కోౕత॥
4. జల సమాధిని వెడలి చక్కౕగ – బలముతో నీ గింజలు = బలుౕడు దేవుని శక్తి చేతను – బాగుగను ఫలియించెను ॥గోౕత॥

5. ఆ ప్రకారమె నీదు నామము – నందు కాలము చేసి = యా ప్రజలు దేహములు మహిమను – నందఁ జేయుము రక్షకా ॥కోఁత॥

6. కోఁత కార్యమువల్ల గూడను – కూర్మిచే నీ బిడ్డలు = నీతులను నేర్వంగఁ జేయుము – ప్రీతిగల మా రక్షకా ॥కోఁత॥

7. దూత లంత్య దినంబునందున – కోఁత గోయుదు రంతట = నా తరుణ మున గురుగు లన్నియు – నగ్నిలోఁ బడవైతురు ॥కోఁత॥

8. లోకమందలి గాలి వానల – లోను మే మిఁక నుండక = నాకమందున దండ్రి మింటను – నేకముగ జీవింతుము ॥కోఁత॥

9. నీవు నేర్పిన యట్లే మే మిల – నిన్నుఁ బ్రతిదినమందును = జీవనోపాయంపు భుక్తిని – దేవ, వేఁడఁగఁ జేయుమీ ॥కోఁత॥

10. మేఇన నేఁ బోషించు నన్న – పానములనే వేఁడక = జానుగా నాత్మలకునౌ భో – జనము వేఁడఁ నీయుమీ ॥కోఁత॥

11. వసుధ నినుఁ బ్రార్థించు జన జీ – వంపు రొట్టెవు నీవెగా = అనువు నాదరణంబు భుక్తిని – యగుము మా కిల నెప్పుడున్ ॥గోఁత॥

– కడియం గాబ్రియేలు

## 582 వందనార్పణము

రా –హరికాంభోజి తా –ఆది

నుతి సేయను లేవే – యో మనసా – నుతిఁజేయను లేవే = క్షితిని దివిని – హితమతిఁ బ్రోచెడి – సుతుని జనకుని – శుద్ధాత్మునిఁ ద్రైకుని ॥నుతి॥

1. సూర్యుని కాంతి – సొంపగు పంటలు – సుకాలక్షేమముల్ – శోభిలు గేహమున్ = ఆర్య సాంగత్యము – నైశ్వర్యముల నిల – ననుభవింపవె నీవా – యాద్యుని పేర్మిని ॥నుతి॥



2. దురితము లందె – దుర్గతి నున్న నీ – కురుతర ప్రేమను – బరమార్థ మీయను = వరపుత్రు నొసఁగఁడె – వందనీయుఁడు ప్రభు – మరిమరి మ్రొక్కు మా – పరమోపకారిని ॥నుతి॥

3. జీవము జ్ఞానము – జీవము నొసంగెడు – పావనాత్మను నీకై – పంపిన దేవు డు = కేవల దోష స్వ –భావము మార్చఁడె – సేవ జేయుమ నీవా – పావనమూర్తికి ॥నుతి॥

4. కరములు పదముల్ – కనకాదు లన్నియు – స్వరమును చిత్తము – స్థిరమగు ప్రేమయు = మరి నీదు హృదయము – పరమాత్ము సేవకై – పరిపూర్ణముగ నిచ్చి – ప్రణుతించు మాయనన్ ॥నుతి॥

– వంతగాని పరదేశి

## 583 కోఁత పండుగ

రా –శంకరాభరణము తా –ఆది

యెహోవ సన్నిధిని – నీ స్తోత్రగానముతో = మహోపకారునకు – మానుగ నర్పణ సమర్పించుఁడి ॥యెహోవ॥

1. ప్రభు వడుగు నర్పణలు – ప్రేమ కృతజ్ఞతలు = అభయ ప్రధానములు – విభునకు నియ్యుఁడు విరివిగను ॥యెహోవ॥

2. రిక్తహస్తములతో – రావలదు సన్నిధికి = భక్తవత్సలునకు – శక్తికొలఁది మీ రర్పించుఁడి ॥యెహోవ॥

3. శృంగారాలయ మీలలోఁ – పొంగారఁ గట్టుటకు = బంగారు వెండి యును – బాగుగ నియ్యుఁడి ప్రభుపేర ॥యెహోవ॥

4. వరుమానములచేత – వాంఛింప వలదండి = గురు నాజ్ఞ చొప్పునను – విరివిగ హృదయము లర్పించుఁడి ॥యెహోవ॥

5. యెహోవ జనులారా – యియ్యుండి మనసార = యెహోవ యిచ్చి నది – యేసున కర్పణ చెల్లింతము ॥యెహోవ॥

– గుంజా వెంకటరత్నము

# ఆలయ ప్రతిష్ఠ

## 584 ప్రభువా నిన్ను స్తుతింతుము

రా –యదుకులకాంభోజి (చాయ : తనువు నాదిదిగో) తా –త్రిపుట

స్తుతియింతుమో ప్రభువా – శుభమౌ నీ దినమున – పరిశుద్ధమగు నీ నామము = గతకాలమున నీవు – పతితుల మగు మాకు – అతిదయతోఁ జేసిన – యన్ని మేలులు దలఁచి ॥స్తుతి॥

1. ఎన్న శక్యముగాక – యున్న మహిమతో వెలుఁగు – చున్న నీ పద సన్నిధిన్= సన్నుతాత్మా మేము – ఆత్మతో సత్యముతో – నిన్నారాధించుతము యీ – చెన్నౌ నీ గృహమందు ॥స్తుతి॥

2. ఇచట నీ వాక్యము – నుచితరీతిని చాట – నీ సేవకుల నందఱిన్ = శుచియౌ నీ యాత్మతో – పరిపూర్ణముగ నింపి – ప్రచురింపను శక్తి – నధిక ముగ నిమ్ము॥స్తుతి॥

3. భక్తితో నీ జనులు – యుక్తముగ నిను వేఁడ – శక్తి వారి కిమ్మెపుడు = ముక్తి కోసము నిన్నా – సక్తితో ప్రార్థింప – రక్తితో విని వారి – కానందమును గూర్చు ॥స్తుతి॥

4. జనక కుమారాత్మ – లను దేవ నీ కెప్పు – డెనలేని స్తుతి కల్గును = ఆనయము మేమిలలో – కొనియాడుటకు నిన్ను – ఘనుఁడా దీవెన మాపై – కుమ్మరింపుము వేగ ॥స్తుతి॥

–బి.ఇ. దేవరాజు

## 585 ఆలయ ప్రతిష్ఠ

రా –శంకరాభరణము (చాయ : రండి యుత్సహించి) తా –ఆది

ఈ గుడియందు ప్రవేశింపన్ – యేసుని బిలువగ రారండి = ఆయన రానిదె దీవెనలు – ఆశీర్వాదము లరుదగును ॥ఈ గుడి॥

1. ఆకా శము మన దేవునికి – అత్యున్నత సింహాసనము = పాదములకు యీ – భూమియును – పీఠముగా నొప్పును సుమ్ము ॥ఈ గుడి॥

2. ఆయన సన్నిధి కాంతియె యీ – ఆలయమంతట నిండుకొనన్ = ఆయన యాత్మ సహాయమున – ఆరాధనలను జరుపుటకై ॥ఈ గుడి॥



3. నిర్మలమైన సువార్తను బో – ధింపగ సాయము జేయుటకు = బోధకు లైన సువార్తికుల – బోధను నాటగ జేయుటకు ॥ఈ గుడి॥

4. ప్రార్థన విశ్వాసాయుతమౌ – భక్తిని నేర్పెడి నిలయముగ = భక్తులు దేవుని సన్నిధిలో – బాగుగ స్థిరపడ జేయుటకు ॥ఈ గుడి॥

5. ఈ పట్టణమున వెలుగుటకు – ఈ ప్రజలందరి రక్షణకు = ఈ గుడి యీ సభ బలపడుచు – సాగుచు వృద్ధిని జెందుటకు ॥ ఈ గుడి॥

6. బాప్తిస్మము నిర్ధారణలు – ప్రభు భోజన సంస్కారములు = బాగుగ జరుగుచుండుటకు – భక్తిని పెంపొందించుటకు ॥ఈ గుడి॥

7. తండ్రి కుమార శుద్ధాత్మకు – తావుగ నీ గుడియుండుటకు = త్రేకుని దీవెన వర్షములు – దీనిపై నిరతము కురియుగాక ॥ఈ గుడి॥

–సి. ఎం. రఫాయేలు

## 586 మందిరార్పణము

రా –యదుకులకాంభోజి (చాయ : పైనమైయున్నాను) తా –ఆది

యెహోవా నీ మహిమ స్తవము – యేసుని సుందర మందిరము – ఇది యెంతో నిత్య శుభకరము = సాహసమున క్రై – స్తవాళి తోడను – స్నేహ మమర నీ – శిష్యులు నిపు డీ – గేహమునకు భ –క్తిని జేరిరి నీ – బాహు బలముఁ గ – న్పడ దీవించుము ॥యెహోవా॥

1. ఆకాశము నీ సింహాసన మగు – నవని నీ యడుగుల పీఠముగ – నమరు దేవ నీ కెవ్వరు సాటి = నీ కొర కొక మం – దిర మొనరించుట – కీ [1]కుంభినిలో – నేరికి శక్యము – ప్రాకటమైనను – నీ [2]సద్భక్తా – నీకంబులె నీ – [3]నికేతనంబులు ॥యెహోవా॥

2. పరమండలంములం దుండి నీ – కరుణఁ జల్లి యీ యాలయము – పైని సుప్రకాశ మంపవె = తరతరముల క్రై –స్తవ సముదయములు – విరివిగ నీ మం – దిర భరితములై – చిరకాలము నీ – సేవ యొనర్పను – వరముల నిమ్మని – [4]నెరి బ్రార్థింతుము ॥యెహోవా॥

---

[1]భూమియందు. [2]యోగ్యమైన భక్తుల యొక్క సమూహములు. [3]గృహములు. [4]బాగుగా.

3. అందముగాను నిందులో ని – న్నారాధించు ప్రియభక్తుల – దెందములే నీ మందిరములు గా = ముందొనరించుచుఁ – బొందుగ నలు దెస– లందు నుండు [1]నర – బృందంబులు దమ – సందియములు విడి – సద్గతిc బొందుట కిందురాను నీ – వింక నొనర్పుము ॥యెహోవా॥

4. పతితాత్ములైనట్టి నరుల – పాప రోగాదులకు మందు – వెదకువారి గృహమున నుండున్ = హితవుగ క్రీస్తుం – డీ గృహపతియై – ప్రతి పాపున కును – సతతంబును వా –గ్వితతిని బిలుచును – వినయముతోc దన – క్షత రక్త మహౌ – షధ మిడి ప్రోవను ॥యెహోవా॥

5. ధారుణిలో దుర్మార్గుల – పేరైన గుడారంబులలోc – జేరియుండు దాని కంటెను = పేరిమిగల యీ – నీ సద నాంగణ – ద్వారపాలక – త్వము మా కబ్బిన – భూరి భాగ్య పరి – పూర్ణులమై వి– స్తార శాంతి మది – సౌఖ్యమొందుదము ॥యెహోవా॥

– పురుషోత్తము చౌదరి

## 587 మందిరార్పణము

రా –కమాసు (చాయ : ఇదిగో గొఱ్ఱెలకాపరి) తా –అట

ఆలించు మా ప్రార్థన – మా రక్షకా – యాలించు మా ప్రార్థన = నాలింతు వని నమ్మి – యాసక్తి వేcడెదము – మేలైన దీవెనలు – మెండుగాc గురిపించి॥యాలించు॥

1. ఈ సదన మర్పింతుము – మా ప్రియ జనక – నీ సుతుని దివ్యాఖ్యను = నీ సేవకై మేము – నెనరుచే నొసcగు ని – వాసము గైకొని – వర కరుణచే నిప్పు ॥డాలించు॥

2. ఇందుc గూడెదు భక్తుల – డెందము లనెడు – మందిరంబుల నాత్మచే = పొందుగ నివసించి – పూర్ణుcడ వగు దేవ – యంద మైన సుగుణ – బృందంబుతో నింపి ॥యాలించు॥

3. ఇచ్చట శుభవార్తను – విచ్చల విడిగ – వచ్చి వినెదు పాపులc = జెచ్చెర రక్షించి – యిచ్చి శుద్ధాత్మను – సచ్చరిత్రులc జేసి – సాంద్ర మగు కరుణచే ॥నాలించు॥

[1]సమూహములు. [2]సమూహముచేత. [3]గాయపురక్తమనెడి గొప్ప యౌషదము. [4]ముంగిలి.



4. నభము నేలెడి తండ్రి – యిచ్చోటను – శుభవార్త బోధించెదు = ప్రభు యేసు సేవకులు – సభకు మాదిరు లగుచు – సభ వృద్ధి నొందింప – శక్తి వారల కిచ్చి ॥యాలించు॥

5. చుట్టు నుండెదు నూళ్లలో – శుభ వాక్యంబు – దిట్టముగc బ్రకటింపc గc = పట్టు గల్గెడివారి – బంపి యిచ్చటనుండి – దట్టమగు నీ ప్రేమc – దగినట్లు తెలిపించి ॥యాలించు॥

– పులిపాక జగన్నాథము

# ఆదివారపు బడి

## 588 సంఘపు బడి ప్రాముఖ్యత

రా –హరికాంభోజి తా –ఆది

సఖులారా సంఘంపు బడి – సంభంబునకు నారుమడి = సుఖజీవమిట గన్గొనుడి – చోద్యంపు కథలను వినుడి ॥సఖులారా॥

1. విద్యార్థులకు బోధంబు – వినుడొజ్జలకు మోదంబు = పద్యాలు కీర్తనంబు ల్బడయంగ నిదితరుణంబు ॥సఖులారా॥

2. మేలౌ గుటుంబములకు – మితిలేని సంఘములకు = జాల ప్రదేశంబులకు – సన్మార్గమొదపు నెలవు ॥సఖులారా॥

3. పసిబిడ్డలను రావించి – పరిష్వంగమును గావించి = వెసcబ్రేమతో దీవించి విభుడంపె నిది భావించి ॥సఖులారా॥

4. ఆబాలగోపాలముగ – నా చంద్ర తారకముగ = బైబిలును యుక్తముగc – బఠియింప దగుcచిత్రముగ ॥సఖులారా॥

5. మన జిహ్వలకు మధురంబు – మన యంఘ్రులకు దీపంబు = మన చేతులకు ఖడ్గంబు – ఘనపావన వేదంబు ॥సఖులారా॥

6. శుభవర్తమానంబు విని – సొంపొంద రక్షణ గని = ప్రభు సంఘమున జేరుకొని – పరులన్ రక్షించుడి చని ॥సఖులారా॥

7. ధరణిలో బడులూరూర – స్థాపింపబడి పెంపార = బరమాత్ముని మన సారc – బ్రార్థింతము హితులారా ॥సఖులారా॥

– మల్లెల దావీదు

# స్త్రీల సమాజములు

## 589 బైబిలు స్త్రీల సేవ

రా –తోడి (చాయ : ఘనదేవుని తనయుండ) తా –రూపకము

మన దేశంబున క్రీస్తు – సువార్త వ్యాపించుటకు – మార్గంబు స్త్రీలంచు – మరువకమ్మ – పనిబూని ప్రభుకొరకు – పరదేశంబులయందు – ఘనురాంద్రు చేయుపనుల్ – వినలేదమ్మా? ॥

1. సాటియైనటువంటి – సాయంబవై పతికి – లోటులేకుండ నెపుడు – లోబడు మమ్మ = పాటుపడి నీ సుతుల – భయభక్తితో పెంచి – నాటుము మదిలోన బోధ – నమ్ములమ్మ ॥
2. అన్నపానములందు నలవాటులందు నీ – పన్యులకు మాదిరి – వగుదు వమ్మ = నిన్ను నీ పనుల గమ – నించి పరీక్షించు –చున్నవారింట బైట – నున్నారమ్మ॥
3. ఘనుఁడౌ దేవుని వాక్య – మును జదివియో వినియో – దిన మేకాంతముగ ప్రార్థించు మమ్మ = నినువలెను నీ పొరుగు – నెలఁతుల ప్రేమింపవలె – వినుమ దూషింపక దీ – వించు మమ్మ ॥
4. పనులెన్నో నీ కున్న – ప్రభు యేసు శుభవార్త దినమున కొక్కరికైన – దెల్పుమమ్మ – ఒనరంగా నేఁడాది – కొక యాత్మనైన నిక = నెనరుతో రక్షింప నేర్చుకొమ్మ ॥
5. ఎల్లసేవకుల కొర = కెల్లప్పుడు ప్రార్థింప – తల్లుల సమాజమునకు – చెల్లు నమ్మ – పల్లెలో శుభవార్త – ప్రభవింపవలెనన్న – తల్లులే మంచి సా – ధనములమ్మ॥

– మల్లెల దావీదు

# విశ్వాస ప్రమాణము

## 590 అపోస్తలుల విశ్వాస ప్రమాణము

రా –జంఝూటి (చాయ : దుష్టుల తలపున) తా –ఆది

పరలోక భూలోకంబులకును – బ్రభువును సృష్టికర్తయునౌ = పరమ శక్తుఁ డౌ తండ్రి దేవుని – భక్తితో నమ్ముచు నున్నాను ॥పరలోక॥



1. ఆయన యద్వితీయ సుతుండౌ – నా యేసుని నమ్ముచు నుందు = నాయన పరిశుద్ధాత్మ వలనఁ గ – న్యా మరియమ్మకు జన్మించెఁ ॥బరలోక॥
2. పొంతి పిలాతు అధికారంబునఁ – బొంది సిలువ బాధను మృతుఁడై = యంతట భూస్థాపనముఁ జేయఁబడి – యదృశ్య లోకమునకు దిగెను ॥పరలోక॥
3. మరి మూఁడవ దినమునఁ జనిపోయిన– మనుజులలో నుండియు లేచి = పరలోకంబున కెక్కి తండ్రి కుడి – పార్శ్వంబునఁ గూర్చున్నాఁడు ॥పరలోక॥
4. అక్కడ నుండి బ్రతికియున్న జను–లందరిఁ జనిపోయినవారిఁ = జక్కంగను విమర్శించుటకును – జను నని నమ్ముచునున్నాను ॥పరలోక॥
5. పరిశుద్ధాత్మను నమ్ముచు నుందును – పావన సార్వత్రిక సభను = ధర నైక్యతఁ బాపక్షమఁ బునరు – త్థాన సుజీవము నమ్ముదు నామేన్ ॥పరలోక॥

– మల్లెల దావీదు

## 591 అపోస్తలుల విశ్వాస ప్రమాణము

రా –నాథనామక్రియ (చాయ :శరణు శరణు యేసు) తా –రూపకము

త్రైక దేవుఁడ యెహోవ – దేవు – నే నమ్మి సేయుదు సేవ – దేవ = పరలోక భూలోక – ముల నెల్లఁ బుట్టించి – పాలించు తండ్రి దే – వుని నమ్మెదను నేను ॥త్రైక॥

1. శ్రీ దేవసుతుఁ డేసు క్రీస్తే – యేక – చిరజీవ నాథుండు నాకే – దేవ = కన్య మరియమ్మ గ– ర్భమున జన్మించిన – కరుణగల దేవునిఁ – గూర్మితో నమ్మెదఁ ॥త్రైక॥
2. పొంతి పిలాతు కాలమున – యేసు – పొంది శ్రమలను సిలువమీద – దేవ = కొట్టఁబడి చనిపోయి – పెట్టఁబడి భూమిలో – మూఁడవ దినమందు – మృతి గెలిచి లేచెను ॥త్రైక॥
3. పరలోకమున కెక్కె యేసు – క్రీస్తు – పరమతండ్రికిఁ గుడివైపు = దేవ సింహాసనముమీఁద – స్థిరముగాఁ గూర్చుండి – యున్నాఁడు చిరన్యాయ – కర్తయై యున్నాఁడు ॥త్రైక॥

4. అక్కడనుండి ప్రభు యేసు – వచ్చు – నిక్కముగఁ దీర్పుఁ దీర్చుటకు – దేవ = మరణ మొందినవారికి – బ్రతికి యున్నవారికి – న్యాయంబుఁ దీర్చును – న్యాయవంతుఁడు యేసు ॥త్రైక॥

5. శుద్ధాత్మ దేవుని నేను – మన – శుద్ధితో నమ్మి కొల్చెదను – దేవ = శుద్ధ సంఘంబు పరి – శుద్ధుల సహవాస –మును నమ్మెదను నిత్య – మును నేను నిజ మిది ॥త్రైక॥

6. పాపక్షమాపణను నేను – ఎంతో బలముగా నమ్మెద నిలను – దేవ = ఈ శరీరముపోయి – యంత్యదినమున మరల – లేచునని తిరముగా – వాసిగా నమ్మెదఁ ॥త్రైక॥

7. నిత్యజీవము నమ్మెదను – నేను నిజముగా శ్రీ యేసు పేర – దేవ = నిత్యుండు తండ్రి దే – వుఁడు కుమారుండును – ఆత్ముండు సత్యుండు – త్రైకుఁడౌ దేవుండు ॥త్రైక॥

– మార్తాండ జ్ఞాన ప్రకాశము

## 592 *The Creed*

1. విశ్వాకాశము లాదులను
సృష్టించిన విభుఁ డగు పరమ
ఈశుఁడు సర్వశక్తుఁ డగు ॥
భాసుర తండ్రిన నమ్ముదును ॥
నమ్ముదును నే నమ్ముదును ॥

2. పరిశుద్ధాత్ముని మూలమున
మరియ కన్యకా గర్భమున
ధరియింప బడి పుట్టిన శ్రీ
గురు ప్రభుయేసును నమ్ముదును
నమ్ముదును నే నమ్ముదును ॥

3. పొంతి పిలాతుని కాలమున
నెంతో శ్రమపడి సిల్వఁబడి
వింతగ మృతి భూస్థాపనయు
పొంది యధోతుల మందెనని ॥
నమ్ముదును నే నమ్ముదును ॥

4. మూఁడవనాఁడు మృతి నుండి
వడిగాఁ బునరుత్థానుండై
చూడఁగ బరమున కేతెంచె
నాధుని కుడియెఁడ గూర్చుండెన్॥
నమ్ముదును నే నమ్ముదును ॥

5. అక్కడ నుండి యిహమునకు ఁ
గ్రక్కున వచ్చి సజీవులకు
నిక్కము న్యాయముమృతులకును
జక్కగఁ దీర్చెడు నని మదిని ॥
నమ్ముదును నే నమ్ముదును ॥
నమ్ముదును నే నమ్ముదును ॥

6. పరిశుద్ధాత్ముని నమ్ముదును
నమ్ముదును నే నమ్ముదును
పరిశుద్ధాత్ముని నమ్ముదును
నమ్ముదును నే నమ్ముదును ॥





7. పరిశుద్ధ పరచంబడిన
సర్వసాధారణ సంఘం
పరిశుద్ధుల యన్యోన్య మగు
పరిశుద్ధ స్నేహము కల వంచు ॥
నమ్ముదును నే నమ్ముదును ॥

8. మహికర్మ పరిహారమును
దేహ పునరుత్థానము
బహుళము నిత్య జీవమును
మహిమ యనంతమై వెలయు నని ॥
నమ్ముదును నే నమ్ముదును
ఆమేన్॥

–ఎస్ .వి. సైమన్

# మట్టలాదివారము

## 593 మట్టలాదివారము

రా –శంకారాభరణము (చాయ :యేసుని ప్రేమను) తా –ఆది

యేసువ జయముతో – యెరుషలేమున – ప్ర –వేశము జేసిన యో ప్రభువా = వాసిగ బొగడగ – వసుధను జనులు – విజయము జేసిన యో ప్రభువా ॥యేసువ॥

1. మట్టలు బట్టియు – బట్టలు బరచియు – గట్టిగఁ బాడగ యో ప్రభువా = అట్టహాసముతో – అశ్వము నెక్కడ – అణఁకువఁ గార్దభ మెక్కిన ప్రభువా ॥యేసువ॥

2. పిల్లలు పెద్దలు – పలుకేకలతోఁ – బలికి నుతించగ యో ప్రభువా = చల్లగ వానిని – సరియని యొప్పి – సంతోషించిన యో ప్రభువా ॥యేసువ॥

3. కొందరు వారిని –తొందరఁ జేయగ – కూర్మిని దిద్దిన యో ప్రభువా = అందరు మానిన – అరచును రాళ్లని – ఆనతి నిచ్చిన యో ప్రభువా ॥యేసువ॥

4. యెరుషలేం కొరకై – యోరిమి జూపియు నేడ్చిన దయగల యో ప్రభువా = యెరుషలేమందున – యాలయ మంతను – శుభ్రపరచిన యో ప్రభువా ॥యేసువ॥

5. మా కొఱకై తన - ప్రాణము బెట్టిన - మాన్యుడవీవె యో ప్రభువా = మా కొరకై ధర - మరణము గెల్చిన - మహిమ స్వరూపుడ యో ప్రభువా ॥యేసువ॥

6. మాదు మనస్సును - హృదయము నాత్మను - నీదిగ గైకొను మో ప్రభువా = సాదర వాక్కులు - చక్కఁగఁ బలికియు - నాదరించుమము నో ప్రభువా ॥యేసువ॥

- బన్యన్ జోసఫ్

## 594 మట్టలాదివారము

రా -హిందూస్థానితోడి తా -ఆది

యేసుప్రభువు యెరూషలేము - ప్రవేశించిన విధము = భాసురముగ తన మహిమ చూడగా - జేసెను ఆ దినము ॥యేసు॥

1. భారవాహక గార్ధభమెక్కి - బాహాటముగాను = బయలుదేరెను జేజేలనగా - ప్రియమొప్పగతాను ॥యేసు॥

2. గట్టి పాడుచు - గంతులు వేయుచు - అట్టహాసముతో = కొట్టుచు కరతాళములను పెద్దగా - కూరిమి చూపిరిగా ॥యేసు॥

3. పిల్లలు పెద్దలు మెల్లగ బోవుచు - ఉల్లాసముతోను = చల్లని ప్రభువని జయములు గొట్టిరి - సంతోషముతోను ॥యేసు॥

4. కొందరు మూర్ఖులు - తొందర చేయుచు - ముందుకు వచ్చిరిగా = అందరు మానిన - అరచును రాళ్లని - అపుడా ప్రభువనగా॥యేసు॥

5. చిగురుటాకు చెట్ల కొమ్మలను - సొగసుగ మార్గములో = బాగుగ పరిరచిరి - భక్తిని చూపిరి - సాగుచు జనులంతా ॥యేసు॥

6. యెరూషలేము - గతిగని ప్రభువు - ఏడ్చెను ఎలుగెత్తి = మరియు యెరుషలేం దేవాలయమును - పరిశుభ్రత చేసె ॥యేసు॥

7. మనలోనున్న పాపము లెల్ల - మనుపును ఆ ప్రభువే = ఘనకృపశాంతులు - గల్గించియు మరి- ననయము బ్రోచునిలన్ ॥యేసు॥

- గేరా ప్రేమయ్య



## 595 మట్టలాదివారము

రా -మోహన తా -ఆది

మనోవిలసితంబౌ - దినంబు - మహిమాన్వితంబు = అనంతజగతీమనోహరంబు - ఘనాదిప్రభుయశః ప్రకాశకంబు ॥మనో॥

1. మందమారుతములందము నొసగగ - డెందములకు నానందము నిడగా = సుందర పక్షుల సుమధురగానము సుఖావహంబై శోభించెనుగా ॥మనో॥

2. అరుణభాస్కరుని కిరణాకరము - ధరదిక్తటముల దరిజేరెనుగా = ధరా వలయమాఖర భానునిచే ధగద్ధగీయంబై వెల్గెనుగా ॥మనో॥

3. పులుగిల కిలకిల కలరవములతో - పొందుగ గలసిన భూరి రవంబు = లలితమనోహరశ్రావ్యమ వినుమా - తలపన్ దానికి కారణమేమో ॥మనో॥

4. రయమున నొలీవ నగంబుగనుమా - రభసయుక్తమగు జనమును గనుమా = జయంజయంబను జయ ధ్యానంబులు -వియదంతము జనమ్రోగుట వినుమా ॥మనో॥

5. ప్రసన్నవదనుడు - భానుతేజుడు -అసంఖ్యజనగణ పరివృతబలుడు = ప్రసితరాసభాసీనుడు యేసుడు - అసమ శాంతితో - నరుదెంచెనహో ॥మనో॥

6. జయములు బాడెదు బాల చయముతో - సాత్వికుడై రాసభంబు నెక్కి = జయోత్సవంబుతో సర్వేశ్వరుడు - చనిరాహృదయము సమర్పించె దము ॥మనో॥

- ఇ.జి. ఆనందము

# పరిశుద్ధ సిలువ పండుగ

## 596 సిలువ ఘనత

రా -ముఖారి తా -ఆది

సిలువేకదా చింతసదామహా - సిలువేకదా - మనకమోఘము - వెలలేని యాత్మ సంభోగము - విలసత్పరమ ద్రవ్యభాగ్యము - గుణత్యాగము ననురాగము మహా ॥సిలువే॥

1. సిలువ బోధకు చెవినొగ్గుమా - చెలువముగొన నాత్మ నొగ్గుము వల్ల నొప్పు నీకు సౌభాగ్యము - ఆత్మారోగ్యము నెంతో శ్లాఘ్యము ॥సిలువే॥

2. చంపెనిందు ప్రభుని కర్తను - సంపాదించె నర విముక్తుని జెంపారు నానందమసూక్తిని - ననురక్తిని నిత్యముక్తిని మహా ॥సిలువే॥

3. పాపదావాగ్ని సంతుప్తులు - స్వపుణ్యదుర్మద వ్యాప్తులు నీ పేరు నమ్మిన దీప్తులు - సుఖ ప్రాప్తులు సర్వ తృప్తులు మహా ॥సిలువే॥

4. రంగొప్ప దీని ప్రసంగము - మంగళగీతసారంగము అంగీకార హృత్పద్మ భృంగము - రక్షశృంగము పాపభంగము మహా ॥సిలువే॥

5. భయములేదని చాటుచున్నది - ప్రియయేసు వేడుకొమ్మన్నది - దయ జూపు నీ కనుచున్నది - నిక్కమైనది చక్కనైనది మహా ॥సిలువే॥

6. చేరవచ్చిన వారి భారము - ఘోరమైనను తద్విచారము ఆరూఢిపరమార్థ సారము - సువిచారము సదాచారము మహా ॥సిలువే॥

7. ఘనమైన రక్షక ధ్యానము మనల ముక్తికి జేర్చువైనము - జనకృపాసుధా పానము దూతగానము తేజోమానము మహా ॥సిలువే॥

8. ఇన్ని దినము లూరకుంటిమి - యిపుడే రక్షణ కనుగొంటిమి - కన్న తండ్రిని గొల్వకుంటిమి - కానకుంటిమి యెరగకుంటిమి మహా ॥సిలువే॥

- రావూరి రంగయ్య

# సర్వ పరిశుద్ధుల స్మరణ

## 597 ఘనమగు పరిశుద్ధులు

రా -కళ్యాణి (చాయ : ఎంతో సుందరమైనవి ) తా -త్రిపుట

ఎంతో ఘనమగువారలు - పరిశుద్ధులు - ఎంతో వినదగువారలు = సంతసంబుగ వార -త్యంత ప్రేరణతోడ - సొంతవారిని సహా - సొంతంబుగ విడచి = చెంతజేరిరి యేసు ప్రభుని - చింతలేకను వెంబడించి - వింత పనులను జేసి బ్రతికిరి - అంతమువరకును నడచిరి ॥ఎంతో॥

1. పేతు రపోస్తలుండు - అతని సోదరు - దతి ప్రియు దండ్రెయయు = నీతి నియమములందు - ప్రీతితో బ్రదుకుచు - చేతి పనులయందు - శ్రద్ధతో నుండుచు = ఖ్యాతి నొందిన యోహాను - అతని యన్న యాకోబుతోను - ప్రతి దినంబును కలిసి యుండుచు - భక్తి ప్రభువును వెంబడించిరి ॥ఎంతో॥



2. ఆస్తి నిచ్చిన బర్నబా - ఆస్తిపరుడ - పోసలులతో జేరెన్ = స్వస్థబుద్ధి తోడ - ఆస్తివాడుట యెట్లో - క్రీస్తు సేవకొరకు - ఖర్చుపెట్టుట యెట్లో = వాస్తవముగ నేర్పినాడు - ఆస్తిగలవారలకు నెల్ల - ప్రస్తుతంపు ఆస్తిపాస్తులు - ప్రభువు పనికియ్యవలెనని ॥ఎంతో॥

3. సంఘమును హింసించిన - సంఘాభిమాని - సంఘ నాయకుడు పౌలు = సంఘముల నెన్నిటినో - చక్కగను స్థాపించి - సంఘముల కుత్తరముల్ - సమయానుకులముగ = సంఘ కాపరులకును సహా - సరియగు సలహాల నిచ్చి- సంఘములను ప్రభువు కొరకై స్థాపించి నిలుపలేదా ॥ఎంతో॥

4. కన్యయైన మరియమ్మ - ధన్యురాలు - కన్యలకు తల్లులకున్ను = అన్యులకు అందరికి - ఆదర్శముగ నుండ - సన్యాసిను లెందరో -స్వామిని సేవించ = కన్యకలుగ నిలుచువారలు - కఠినవ్రతములతోడ నుండి - ధన్యులగు పరిశుద్ధులతో - దైవసన్నిధి నుండ జూపెను ॥ఎంతో॥

5. మగదాలయూరి మరియ - మహినినున్న - మగువలలో కెల్లను = భగవంతుడై నట్టి - ప్రభువు యేసునుజేరి - నగము నెక్కెను తన - సొగసైన మార్పుచే = సొగి మొదట సమాధికడకు - స్వామిదర్శనమొంది మొదట- వేగవెళ్లి శిష్యులకును - వెదకి సాక్ష్యమియ్యలేదా ॥ఎంతో॥

6. మత్తయి మార్కులను వారు - మతమునందు - అతినిష్ఠగలవారలు = మత్తయి యూదులకై తన పుస్తకమును వ్రాసె - మార్కు గూడను తన సు-వార్తనందరి కిచ్చె = వాస్తవంపు జీవితమును - వరుసగాను గలిగియుండ - క్రీస్తు ప్రభువును వెంబడించగ - క్రొత్తలోకము జూపగలిగిరి ॥ఎంతో॥

7. చూచననేగాని- నమ్మనని - పేచిపెట్టి నతోమయు = చాచి చేయి చూచి చక్కగ నమ్మెను - చూడకుండనె లూక - వైద్యుండు నమ్మెను = యీ చొప్పున వీరలిద్దరు - నీచజనులకెల్లరకు తము - బ్రోచు ప్రభువును జూపుచుందురు - బ్రోదిగా ప్రతిదినమునందును ॥ఎంతో॥

8. ప్రభువా నీ పరిశుద్ధుల - బ్రతుకునందు - మా భాగ్యమునున్నదిహా = ప్రభువా వారి బ్రదుకు - ప్రబలమైన సేవ - విభవంగాగని - విజయంబు గాంచుచు = సభను యే రాణింపజేసి - సఫలముగ సేవించి బ్రతికి - ప్రభువ వారితో నేలునట్లు - యభయమియ్యు మాకు దేవా ॥ఎంతో॥

- బన్యన్ జోసఫ్

# మితానుభవము

## 598 మద్యపానములోని మోసము

రా –నాదనామ క్రియ (చాయ : భజనజేయు విధము దెలియుండి) తా –అట

మద్యపాన ప్రియులు గాకుండి – ప్రియులార మీరా– మత్తులోనే మునిఁగి పోకుండి = మద్యపానము చేయువారికిఁ – దథ్యముగఁ బ్రాప్తించుఁ గీడులు – కొద్దియైనను రుచిని జూడఁగఁ – గోరఁ దగ దని తలఁచుకొనుఁడి ॥మద్య॥

1. రక్త మంతయుఁ జెడును సుమ్మండి – ప్రియులారా మీరు – శక్తిహీనులగుదురిల నుండి = శక్తిహీనులె గాక మతి మీ – భక్తి దొఁలగి పోవునండి – ముక్తిమార్గము దెలియదండి – ముందు గతికి హీనమండి ॥మద్య॥
2. బుద్ధిబలములు కొద్ది వౌనండి – ప్రియులారా మీరు – మొద్దు లగుదురనియు నమ్మండి = హద్దు మిరుచుఁ ద్రాగువారికిఁ – గొద్దికాలమె జీవమండి – శ్రద్ధగల్గి మద్యపానము = రద్దు చేయుట తగినదండి ॥మద్య॥
3. మచ్చునకును త్రాగఁబోకుండి – ప్రియులార మీరీ – తుచ్ఛమైన పనులు వీడుండీ = హెచ్చుగాఁ దిని త్రాగువారికి–వచ్చు రోగము కుదురదండి – చచ్చుటకు నిది హేతువని మదిఁ – గచ్ఛితముగను దెలిసికొనుఁడి ॥మద్య॥
4. ఆలుబిడ్డల మేలుఁగోరుండి – ప్రియులారా వారి –మేలుఁ గోరినఁ ద్రాగఁ బోకుండి = మేలు లెతింగి పిలుచు క్రీస్తుని – జాలిచూపులు దెలిసికొనుఁడి– కాలయాపనఁ జేయకుండి – కర్త యేసని నమ్ముకొనఁడి ॥మద్య॥
5. ఘన ధనములు నిలువఁబోవండి – ప్రియులార నీచ – తనము మీకు మూల మౌనండి = తనవిఁదీర్చుదు మద్యమండి – ఘనుల కొంపలు గూల్చునండి – ఘనముగాఁ బ్రభువాక్యసారము– వినయమతితోఁ గ్రోలరండి ॥మద్య॥

–నేలటూరి బూకర్

# క్రైస్తవ వైద్యశాలలు

## 599 క్రీస్తు అనుగ్రహించు స్వస్థత

రా –మిశ్రమ (చాయ : శరణు జొచ్చితి) తా –ఆది

పరమ వైద్యుఁడ భారతీయుల – వ్యాధి బాధలఁ బాపుమా = పరుల కుపచారం బొనర్చుట – పరమ విధియని చూపుమా ॥పరమ॥



1. ప్రేమతో వైద్యులును దాదులు – పెంపుఁ బొందఁగజేయుమా = గ్రామ రోగులఁ గాంచి వారికి – క్షేమమును దయ చేయుమా ॥పరమ॥
2. భరత ఖండము నందు వైద్యపు – బదులను నెలకొల్పుమా = పరఁగ నీవే వైద్య శాలలఁ – బాలనంబు సల్పుమా ॥పరమ॥
3. కుఁటి గ్రుడ్డి మూఁగ సొలలఁ –గూర్మితో దర్శించుమా = యంటు రోగుల యాశ్రయముల – నంటి పరామర్శించుమా ॥పరమ॥
4. లెక్కలేని గర్భవతుల – యక్కఱలను దీర్చుమా = దిక్కు లేని బిడ్డలకు నీ – దీవెనల సమకూర్చుమా ॥పరమ॥
5. యంత్రశాలల గనులయందు – నలయు వారలం బ్రోవుమా = మంత్ర తంత్రము లందుఁ జిక్కు న– మాయకులను గావుమా ॥పరమ॥
6. గ్రామ వైద్య సేవఁ జేసెడి – ఘనులఁ బరిపాలించుమా = గ్రామవాసులఁ గూల్చు వ్యాధులఁ – గాంచి నిర్మూలించుమా ॥పరమ॥
7. దురభిమాన మూఢ భక్తిని – ద్వరగ దూర పరచుమా = మరియు శుచిచే రోగములు మటు – మాయ మగు నని కరపుమా ॥పరమ॥
8. దేహశుద్ధిని జిత్తశుద్ధిని దేశ జనులకుఁ గూర్చుమా = దేహములఁ బర శుద్ధ మగు నీ – దేవళములుగ మార్చుమా ॥పరమ॥

– మల్లెల దావీదు

# సంవత్సరాద్యంతములు

## 600 సంవత్సరాంత్య ధ్యానము

రా –బిలహరి (చాయ : కొనియాడదరమె నిన్ను) తా –ఆది

ధ్యానింప నే చిత్తమా – వర్షాంతమున – ధ్యానింపనే చిత్తమా= ధ్యానించ వాసక్తి – జ్ఞానంబుఁ గలిగించు – జ్ఞాన స్వరూపుఁడు – జ్ఞానాత్మచే నీకు ॥ధ్యానింపవే॥

1. అరయ నీ తలఁపుల – నఘము లగుపడు నీకుఁ – పరిశుద్ధుఁ డీక్షింప బహుగా గనుపడుచుండు ॥ధ్యానింపవే॥

2. పరికింపఁ బలుకులఁ – పాప మగుపడు నీకు – పరిశుద్ధుఁ డరయుఁ గ – న్పడకుండు నే యది ॥ధ్యానింపవే॥

3. క్రియలను జింతింప – మయిల గనపడు గాన – భయ మొంది నమ్మికను – బదవే క్రీస్తుని దరికి ॥ధ్యానింపవే॥

4. దేవుని ఘన ప్రేమ – దినదినముఁ దలపోయ – నీవు పొందఁగ వచ్చు నిక్కమైన శుద్ధి ॥ధ్యానింపవే॥

5. స్మరియింప నీలోన – వర రక్షకుని పాట్లు – భరియింప నోపుదువె – పాప మొక నిమిషంబు ॥ధ్యానింపవే॥

6. హృదయంబు విమలాత్మ – సదనంబుఁ గావింపఁ – పదవే శ్రీఘ్రంబుగఁ – పరమ జనకుని కడకు ॥ధ్యానింపవే॥

7. దేవుని సేవింపఁ – దిరముగ నాశించి – దేవాత్మ కొర కీవు – దినము దేవుని వేఁడ ॥ధ్యానింపవే॥

– పులిపాక జగన్నాథము

## 601 సాంవత్సరిక కృతజ్ఞతార్పణము

రా –గుల్ రోజు (చాయ : దేవదాస పాలన) తా –ఏక

వందనం బొనర్తుమో ప్రభో ప్రభో – వందనం బొనర్తుమో ప్రభో ప్రభో = వందనంబు తండ్రి, తనయ, శుద్ధాత్ముఁడా – వదనంబు లందు కో ప్రభో ॥వందనం॥

1. ఇన్ని నాళ్లు ధరను మమ్ముఁ బ్రోచియుఁ – గన్న తండ్రి మించి యెపుడు గాచియు = ఎన్నలేని దీవెన – లిడు నన్న యేసువా–యన్ని రెట్లు స్తోత్రము లివిగో ॥వందనం॥

2. ప్రాత వత్సరంపుఁ బాప మంతయుఁ – బ్రీతిని మన్నించి మమ్ముఁ గావుము = నూత నాబ్దమునను నీదు – నీతి నొసఁగు మా –దాత క్రీస్తు నాథ రక్షకా ॥వందనం॥



3. దేవ మాదు కాలుసేతు లెల్లను – సేవకాళి తనువు దినము లన్నియు నీ వొసంగు వెండి, పసిడి – జ్ఞాన మంత నీ – సేవకై యంగీకరించుమా ॥వందనం॥

4. కోఁతకొరకు దాసజనము నంపుము – ఈ తరి మా లోటుపాట్లు దీర్చుము = పాతకంబు లెల్ల మాపి – భీతిఁ బాపుము – ఖ్యాతి నొందు నీతి సూర్యుఁడా ॥వందనం॥

5. మా సభలను పెద్దజేసి పెంచుము – నీ సువార్త జెప్ప శక్తి నీయుము = మోసపుచ్చు నంధకార – మంతఁ ద్రోయుము –యేసు కృపన్ గుమ్మరించుము ॥వందనం॥

– మత్తయి సమూయేలు

## 602 క్రొత్త వత్సరము

రా –రేగుప్తి (చాయ : హలెలూయ యని పాడుడీ) తా –అట

ఘనదేవ ప్రియ తనయుండా – జగద్రక్షా –వినుతి జేతుము నీ మహిమన్ = ఘనతరంబుగ – గత సంవత్సర – దినము లన్నిట మాకు నీభువి – ఘనసుఖము లొనరించి మరి –నూతనపు వత్సర మొసగినందుకు ॥ఘనదేవ॥

1. అధిక ప్రేమలొసఁగుము – యేసు ప్రభు – కుదురుగ నీ వత్సరము = ప్రథమ దినమున – మమ్ము నందరి – ముదముతో నిచ్చటకుఁ జేర్చితి – ప్రబలమగు సంగీతస్తుతులను – మిగులబొందుము యేసు రక్షక ॥ఘనదేవ॥

2. అంచితముగ నిచ్చటన్ – గూడిన సభలో – స్త్రీలన్ బురుషుల బిడ్డలన్ = మంచి మార్గమునుంచి నీ – యత్యంత ప్రేమతోఁ గావు మిలను – చంచలులు గాకుండ నీ కృప – లుంచి మము రక్షించుమో ప్రభు ॥ఘనదేవ॥

3. దీవించు ప్రభుయేసువా – సువార్తికులన్ – సావధానముగా భువిలో = భావమందున నీపదంబుల – సేవ బాగుగఁ జేయుచున్ నీ – జీవజల వాక్యంబులన్ ధర ధీరతనుఁ బ్రకటింపఁ జేయుము ॥ఘనదేవ॥

4. పరముండ ధర నీ సభలన్ – నూతనముగ – స్థిరపర్చి బలపర్చుము = సరసముగ నాశీర్వచనము – ల్విరివిగా నొసంగుచున్ నూ – తన సహోదర ప్రియుల సమితిని – మరియుఁ జేర్చుము నీ సభలలో ॥ఘనదేవ॥

5. కరుణాళ యీవత్సరము – క్రైస్తవ బడుల – ధరణిబ్రబలఁ జేయుమా = సరిగ నుపాధ్యాయులందరి – మరి మరీ దీవించు ప్రభువా – స్థిరముగా పరమార్థములు బా – లురకు గరపుచునుండఁ జేయుము ॥ఘనదేవ॥

6. భాసురంబుగ పరలోక – ప్రకాశుఁడా – దాసబృందములన్ గావు = వాసిగా నరలోకము నని –వాసులగు మీ దాసులందరి – దోషరాసిని ద్రోసి నీ కృప – జూపుచును రక్షించు మనిశము ॥ఘనదేవ॥

– గొల్లపల్లి అంద్రెయ్య

## 603 క్రొత్త సంవత్సరము

రా –కాంభోజి తా –త్రిపుట

క్రొత్త యేడు మొదలు బెట్టెను – మన బ్రతుకునందుఁ = క్రొత్త మనసు తోడ మీరు – క్రొత్త యేటఁ బ్రభుని సేవఁ – దత్తర పడకుండఁ జేయు–టుత్తమోత్తమంబుఁ జూడఁ ॥క్రొత్త॥

1. పొంది యున్న మేలు లన్నియుఁ – బొంంకబు మీఱ –డెందమందు స్మరణ జేయుఁడీ = యిందు మీరు మొదలు బెట్టు – పందెమందుఁ గెల్వ వలయు – నందముగను రవినిఁబోలి – నలయకుండ మెలయకుండఁ ॥క్రొత్త॥

2. మేలు సేయఁ దడ వొనర్పఁగా – మీరెఱుఁగునట్లు – కాలమంత నిరుడు గడ చెఁగా = ప్రాలుమాలి యుండకుండ – జాల మేలు సేయవలయుఁ – జాల జనముల కిమ్మాను – యేలు నామ ఘనతకొఱకుఁ ॥క్రొత్త॥

3. బలము లేని వార మయ్యును – బల మొంద వచ్చుఁ – గలిమి మీఱఁ గర్త వాక్కున = నలయకుండ నలగకుండ మోద మొంది – బల మొసంగు సర్వవిధుల –నెలమి మీ రొనర్చుచుండఁ ॥క్రొత్త॥



4. ఇద్ధరిత్రి నుండు నప్పుడే – యీశ్వరుని జనులు – వృద్ధిబొందఁ జూడ వలయును = బుద్ధి నీతి శుద్ధులందు – వృద్ధినొంద శ్రద్ధఁ జేయ – శుద్ధు లైన వారిలోఁ ప్ర – సిద్ధు లగుచు వెలుఁగ వచ్చుఁ ॥క్రొత్త॥

5. పాపపంక మంటినప్పుడు – ప్రభు క్రీస్తు యేసు – ప్రాపుఁ జూరి మీరు వేఁడ గా = నేపుమీఱఁ దనదు కరుణఁ – బాప మంతఁ గడిగివేసి – పాపరోగ చిహ్న లన్ని – బాపివేసి శుద్ధిఁ జేయుఁ ॥క్రొత్త॥

–పులిపాక జగన్నాథము

# వీడ్కోలు

## 604 ప్రభువు మీతో నుండుగాక

రా –తిలక్కా మోద్ (చాయ : యేసునాథకథా) తా –ఆది

దైవప్రేమ మనలనెపుడు బంధించుగా – దివిని భువిని దీన జనులను దిరముగా కాపాడుగా ॥

1. పరమతండ్రి గద్దెముందట ప్రార్థనల్ మరిజేతుము – పలు విధముల మార్గములలో ప్రభువే తోడైయుండుగా ॥దైవ॥

2. నిత్యప్రభువు సత్యసేవను నిరతమును మదినుంతుము – నిలిచియుందుము క్రీస్తుకొరకై నిత్యసేవక జనముగా ॥దైవ॥

3. మనము విడిచి వెళ్లునపుడు మదిని కల్గును వేదన – మనసు హృదయము కలిసియుండగ మరల గలియుదు మెచ్చటో ॥దైవ॥

4. జనక తనయ పరిశుద్ధాత్మకు జయము మహిమయు ఘనతయు – ఆదినుండి యిపుడు యెపుడు అవని పరమున జెల్లుగా ॥దైవ॥

– ఎ.చార్లెస్ కిన్సింగర్

## 605 వీడ్కోలు శుభములు

రా –శంకరాభరణము తా –ఆది

స్తోత్రము సేయరే – సోదరులార మన – యాత్మలతోఁ దండ్రిన్ = ధాత్రిని మన పర – మాత్ముని వాక్కులు – స్తోత్రములోఁ గలిపి ॥స్తోత్రము॥

1. ఇచ్చట ప్రేమల – కిదియే కడవరి – వచ్చియున్న దేమో = అచ్చట మన మం – దఱముఁ గలిసికొని – యానందింతుముగా ॥స్తోత్రము॥

2. ఎక్కువ ప్రేమలు – చక్కని స్తోత్రము – లక్కడ మన మంత = మిక్కిలి ప్రియు డు – దేవుని కిడుదుము – ఒక్క మనసుతోను ॥స్తోత్రము॥

3. కన్నీ రుండదు – చావు కష్టము – లెన్నటి కుండవుగా = కన్నను మన శృం – గారపు బ్రతుకు – లెన్నఁదరము గాదె ॥స్తోత్రము॥

4. వాగును వీణెలు – సాగును పాటలు – సతతముగా నచట = రాగము లెంతో – రమ్య మై యుండును –బాగింతన లేము ॥స్తోత్రము॥

5. మరల నిచటఁ గూ – దుదుమో లేదో – మన మందరము = త్వరలో మున పర – లోకపు దండ్రి – తోడ నుందు మేమో ॥స్తోత్రము॥

6. గొఱ్ఱెపిల్ల రక్తము – విలువచ్చట – గొప్పది గాంతుముగా = గురుతరమగు మన దేవుని ప్రేమను –కూర్మితో జూతుముగా ॥స్తోత్రము॥

7. పరమ తండ్రితోఁ – ప్రభుయేసునితోఁ – బరిశుద్ధాత్మునితో = స్థిరముగనుందుము – మరి దూతలతోఁ – బరలోకమునందున్ ॥స్తోత్రము॥

– గొల్లపల్లి నతానియేలు

## 606 *Blest be the tie that binds*

1. స్నేహంపు బంధమా
శుభంబు నొందుమా
సత్క్రైస్తవ సావాసము
స్వర్గంబుఁ బోలును

2. ప ంశు పాదముల్
ప్రార్థించి కొల్తుము
భయ, నిరీక్షణాశలు
ప్రార్థన లొక్కటే

3. ఒండొర్ల బాధలన్
ఓదార్చు కొందుము
ఒలికెడి కన్నీటితో
ఒప్పు మా స్నేహము

4. వియోగ కాలము
విచారమైనను
వీలౌ మరలకూడుట
విజయ మైత్రితోన్

– జాన్ ఫాసెట్

అను : ఏ.బి. మాసిలామణి



## 607 *God be with you till we meet again*

1. ముందు కందరును జేరను
ఎందు బోయినన్ గాపాడి
తొందరల్మ తేమ్మిరాక
బంధుఁడేసు నిన్ను గావుతన్
॥యేసుని సన్నిధి
నేకమైగూడుదాఁక
దాసుని ధీరతన్
దైవపిత నిన్ను గావుతన్ ॥

2. ఱెక్క నీడ నిన్ను ఁ జెర్చుచు
మిక్కుటంపు ప్రేమఁజూపిఁ
చిక్కులాప తిల్లకుండ
మక్కువన్ ప్రభుండుగావుతన్

3. నాఁడు నాడాహారమిచ్చుచు
వేడుకన్ గౌగిటఁ జేర్చి
కీడులందు నిన్ను గాంచి
తేడునిన్నుఁ బ్రోచికావుతన్

4. చావు యొక్క భీతిలేకను
జీవమార్గమందుఁ దోడై
రేవుఁజేరుఁదాక బ్రోచి
పావనుండు నిన్ను గావునన్

–జెర్మియా ఇ. రేంకిన్

# జాతీయోత్సవములు

## 608 మాతృదేశ సేవ

రా –హిందూస్థాని (చాయ : శ్రీ యెహోవా నీకొసంగెద) తా –ఆది

దేశసేవఁజేసి దేవ – దాసులై వర్ధిల్లుఁ డిలలో = మోసమార్గములను వీడి – యేసుని నిజదాసు లగుఁడి –దోసములను వీడి దేవ – దాసులై వర్ధిల్లుఁ డిలలో ॥దేశ॥

1. దేశ బంధువు యేసువే మన – దేశ రక్షకుఁ డాయనే = దేశ మంత యేసు మనసుతో – నాశతో సేవించుడి ॥దేశ॥

2. నీతి న్యాయంబులు గలిగియు – నిష్ఠలందు మెలఁగియు = నిత్య ప్రేమ చూపి యేసు – నిష్ఠ లేక మేలు లేదు ॥దేశ॥

3. వినయశక్తి నెంతగా వివ – రించిన బోధించిన = విశ్వ విభుండౌ యేసు వినయ – విధము లేక మేలు లేదు ॥దేశ॥

4. ప్రేమఁ గలగి పరమ సత్య – ప్రేమ సేవఁ జేయుఁడి = ప్రేమమూర్తి యేసుక్రీస్తు – ప్రేమలలో వర్ధిల్లుఁ డిలలో ॥దేశ॥

5. ఆసేతు హిమాచల ప – ర్యంతమున్ దిగంతము = లేకముగను దివిని భువిని – నేలు రాజు యేసుఁడే ॥దేశ॥

– మార్తాండ జ్ఞాన ప్రకాశము

## 609 జాతీయ గీతము

జనగణ మన అధినాయక జయహే

భారత భాగ్యవిధాత

పంజాబ సింధు గుజరాత మరాట

ద్రావిడ ఉత్కళ వంగ

వింధ్య హిమాచల యమునా గంగ

ఉచ్ఛల జలధి తరంగ

తవశుభనామే జాగే తవశుభ ఆశిషమాగే

గాహే తవ జయ గాథ

జనగణ మంగళ దాయక జయహే

భారత భాగ్య విధాత

జయహే జయహే జయహే

జయ జయ జయ జయహే

# ఆశీర్వచనములు

## 610 ఆరాధన ముగింపు

రా –భీంప్లాస్ తా –త్రిపుట

ప్రభువా మమ్మునుదీవించి – పంపుము నీ కృపనందించి అభినందన ములఁ జేకొనుమా – విభవము మహిమోన్నతి కీర్తి యుగయుగములకు నీకగుతన్ ॥ప్రభువా॥

1. పగతురఁ బ్రేమించెడు శక్తిన్ – తగఁబొరుగును జూచెడి రక్తిన్ మిగులందయ చేయుము దైవ – జగదేక కుమారా కీర్తి –యుగయుగములకు నీ కగుతన్ ॥ప్రభువా॥

2. గుడిలో వినిన నీవాక్యము మా – గుండెలఁ బదిలము జేయఁగను గుడిబయటను నా చారములో – నడువగఁ దోడ్పడుమో కీర్తి యుగయుగము లకు నీ కగుతన్ ॥ప్రభువా॥

3. క్రైస్తవ మైత్రిని సంఘములో – విస్తరణము జేయఁగనిమ్ము నేస్తవ భావము లోకములో – నెరపఁగ దయఁగనుమో కీర్తి యుగయుగములకు నీ కగుతన్ ॥ప్రభువా॥

– మొలతాటి విద్యానందము

## 611 త్రైక దేవ మహిమ

రా –జంఝూట (చాయ : వినరమ్మ యేసునాధుడ) తా –ఏక

మహిమ నొప్పు జనక నీకు – మహిత సుతునకు = మహిమ గలుగు శుద్ధాత్మకును – మహా యుగములు ॥మహిమ॥

1. లోక సృష్టి మునుపు నిన్ను – నాకసేనలు = ప్రాకటంబుగా నుతించెఁ బ్రజ్ఞ మీరంగ ॥మహిమ॥

2. సకల సృష్టివలన దేవ – సకల యుగముల = సకల మహిమ గలుగు నీకు – సకల కాలము ॥మహిమ॥

–యెషయా వీరమార్టిన్

## 612 దైవాశీర్వాదము

రా –పంతువరాళి తా –అట

కలుగుcగాక – దేవా – కలుగుcగాక – కలుగుcగాక మా – కిలలో నిప్పుడు – విలువ లేని దయ – గల నీ దీవెన ॥కలుగు॥

1. తనయుని కరుణయుc – దండ్రి దేవు దయ – తనరు నాత్మ కృప తప్పక మాకుc ॥గలుగు॥
2. మనమున భక్తులు– మరువక యైక్యము –ఘనముగc బెంపcగ – ఘన సహాయము ॥కలుగు॥
3. ఇట్టి యైక్యమును –యేసునితో మరి – గట్టిగc బెంచిన – ఘన సౌఖ్యంబు ॥కలుగు॥

–పులిపాక జగన్నాథము

## 613 స్తుతిగానము

రా –రేగుప్తి తా –రూపకము

దీవెనతో సెలవిమ్ము కర్తా – మాకు నీ –దీవెనతో సెలవిమ్ము కర్తా = దీవించి క్షేమంపు – టీవులను దయచేసి – జీవ పోషణవార్త – భావమున సమకూర్చి ॥దీవెనతో॥

1. లోకమున నిన్ను వేcడుకొని – మేము నీ – లోకమున కొనియాడుకొని = శ్రీకరం బగు దివ్య – లోకంబులోc జేరి –యేకముగ స్తోత్రములు – నీకుc జెల్లింపcగ ॥దీవెనతో॥
2. స్తుతి పితృ పుత్ర శుద్ధాత్మ – శుభ మిచ్చు – స్తుతి పితృ పుత్ర శుద్ధాత్మ = స్తుతియించును సర్వ – క్షితి దివ్య సైన్యంబు – లతులితంబగు దేవుcడని నిన్ను స్తుతియించు ॥దీవెనతో॥



## 614 ముగింపు పాట

రా –శ్రీరాగము తా –అట

పంపుము దేవా – దీవెనలతో c – పంపుము దేవా = పంపుము దయ చేతc – పతిత పావన నామ – పెంపుగ నీ సేవc – ప్రియమొప్ప నొనరింపc ॥బంపుము॥

1. మా సేవ నుండిన – మా వెల్తు లన్నియు = యేసుని కొఱకు నీ– వెసcగ క్షమియించుచుc ॥బంపుము॥
2. వినిన సత్యంబును – విమలాత్మ మది నిల్పి = దినదినము ఫలములు –దివ్యముగ ఫలియింపc ॥బంపుము॥
3. ఆసక్తితో ని – న్ననిశము సేవింప = భాసురంబగు నాత్మ – వాసి కెక్కcగ నిచ్చి ॥పంపుము॥

–పులిపాక జగన్నాథము

## 615 ముగింపు స్తుతి

రా –భీంప్లాస్ తా –త్రిపుట

మా దేవునకును స్తోత్రములు – మహిమయు జ్ఞానము నామీదన్ = మాదు కృతజ్ఞతగల స్తుతియు – న్మతి ఘనతా శక్తియు బలమున్ యుగయుగములకును గల్గునుగాక ॥ఆ...మెన్॥

– మొలతాటి విద్యానందము

## 616 *Lord ! dismiss us with Thy blessing*

1. కర్తా మమ్మును దీవించి
క్షేమమిచ్చి పంపుము
జీవాహార వార్త నిచ్చి
మమ్మును పోషించుము.

2. ఇహ నిన్ను వేడుకొని
బహుగా స్తుతింతుము
పరమందు చేరి యింక
సోత్రము చెల్లింతుము.

– జాన్ ఫాసెట్

## 617 *Praise God from whom all blessings flow*

1. మేళ్లన్ని యిచ్చు దేవునిన్
స్తుతించు సర్వ సృష్టియున్
స్తుతించు మోక్ష సైన్యముల్
పితృ పుత్ర శుద్ధాత్మలన్

– తామస్ కెన్

అను : సి. జేమ్సు

## 618 *Doxology*

1. పితృ పుత్ర శుద్ధాత్మలై
మేళ్లన్ని యిచ్చు దేవుని
స్తుతించు సర్వ లోకమా
స్తుతించు దివ్య సైన్యమా

## 619

1. పితా, సుతా, వరాత్మక !
త్రియేక దేవ నామక !
నిరంతరంబు స్తోత్రము
ఘనంబు నీకే స్తోత్రము

## 620

1. స్తోత్రించుడి సృష్టికర్తన్
తండ్రి గొప్ప ప్రేమను
మన యాగమైన గొర్రెన్
పైని రాజు యాజకున్
ముక్తియూట యైనవాని
జీవకర్తయౌ దేవున్
ఏక దేవుడౌ యెహోవన్
పాడు డేకమౌ హృదిన్

## 621

యెహోవ నిన్ను ఆశీర్వదించి కా – పా – డుగా – క
యెహోవ తన సన్నిధి ప్రకాశింప జేసి – నిన్ను కరుణించుగాక
యెహోవ – నీ – మీద తన సన్నిధి కాంతి నుదయింపజేసి – నీకు
సమాధానము కలుగ జేయుగాక
ఆమెన్ – ఆమెన్ – ఆమెన్ –ఆమెన్ – ఆమెన్ – ఆమెన్ – ఆమెన్

–వై.వందనం విల్సన్





## 622 *Praise to the Lord, the Almighty*

1. ప్రియమైనట్టి నా యాత్మ
స్తోత్రంబు చెల్లింపు
మహిమ శక్తులుగల నా తేని
మన్నింపు
కూడుడిట
వీణెల గానమున
సన్నుతు లొసంగ రండి.
2. సర్వము వింతగ పాలనచేయుచు
నిన్ను
గరుడ విహగ పక్షము లందిడి
మిన్ను
నొరయగా
నడిపి సుఖముగా
నిత్యంబు
గాచిన ప్రభు నుతింపు.
3. ఎంతో చమత్కృతిగా నా
యాత్మ! నిన్ సృజించి
క్షేమ మారోగ్యము నెసగగా
నడిపించి
కష్టములో
బొదివి తెక్కలతో
బ్రోచిన ప్రభునుతింపు
4. అందరు గాంచెదులాగు నీ
స్థితి దీవించి
యాకసమందున నుండి కృపన్
గురిపించి
ప్రేమతో
జూచు నాతండెవ్వడో
శక్తు నా ప్రభు నుతింపు
5. సకలాంతః కరణంబులతోడ
నుతింపు
ఆయన నామ ప్రసిద్ధి

గీర్తింపు
వెలుంగులో
నా బ్రహామ్ సంతతితో
ప్రభునుతింపుమి – ఆమేన్

–జె.నియాండెర్

## 623 *In the cross of christ I Glory*

1. క్రీస్తు సిల్వ నాకు గొప్ప
యౌను, నేనుతింపుదు
సచ్చరిత్రు కాంతి యొప్ప
దాని జుట్టి యుండును
2. నాకు నే విచారమైన
భీతి యైన కల్గినన్
సిల్వ రూప మెందునైన
సంతసింప జేయునన్

3. మోక్ష సూర్య దైన కాంతి
నాదు త్రోవ బుట్టగా
సిల్వనుండి కల్గు శాంతి
దాని నింపు చేయుగా

4. లాభ, లోభ, మోగు, బాగు
శుద్ధి యౌను సిల్వచే
సంతసంబు శాంతి జాగు
లేక కల్గునప్పుడే, ఆమేన్.

– జాన్ బౌరింగ్

## 624 *Come holy spirit, God and Lord*

1. దేవుండవైన యాత్మ! రా
నీ వారి నీవు ప్రీతిగా
నీ సత్కృపావరంబు నీ
నీ ప్రేమ గుమ్మరింపుమీ.

2. సమస్త భూ జనంబులు
సద్దేవు విశ్వసింపను
నీ దివ్య వాక్య కాంతితో
నిత్యంబు వారి బిల్తువు.

3. దేవా! విశుద్ధ తేజమా!
జీవంపు వాక్య మిమ్మయా
మా తండ్రియంచు బిల్వను
మా దేవుదెల్పి నేర్పుము.

4. దుర్బోధ చేయువారిని
దూరంబునందు నుంచుమీ
మా యేసుక్రీస్తు డొక్కడే
ఓదార్చు బోధ కుండిలన్.

5. ఓ దివ్య ప్రేమ! యూరటా
మోదంబుతోడ మమ్ముల
నీదైవ సేవ చేయనీ
నాథుండ!! హింస లోర్వనీ

6. జీవించి యున్న జచ్చినన్
జీవాత్మముక్తి పొందగన్
మా కిమ్ము నీ బలంబును
నమ్మిక గట్టి బర్చుము, ఆమేన్

– మార్టిన్ లూథర్

## 625 *Deck thyself with joy and gladness*

1. ఆత్మ! శృంగారించు కొమ్ము
పాప గుహ వీడి పొమ్ము
వెల్గులోని కింకరమ్ము
తేజరిల్లు మీ దినము
"రక్షణాధి కారవిందు
నీకు జేయ బోవుముందు
భూదినంబు లేలు తేడు
నిన్ను జేర వచ్చు నేడు"

2. పెండ్లి కూతురెట్లు భర్త
నట్లు ప్రేమ జూపుకర్త
నాయ నెంతో జాలిగుండె
తోడ దల్పు దట్టు చుండె
"నా ప్రియుండ! వేగరమ్ము
ముద్దు బెట్ట నిమ్ము నన్ను"
అందు హృదయంబుతోడ
యేసునాద నాహ్వానించు.



3. శ్రేష్ఠ వస్తువుం గ్రయంబు
జేయ గొండ్రు బల్ధనంబు
సర్వ శ్రేష్ఠమౌ వరంబు
లిచ్చు చుంటి యుచితంబు
కాకయున్న నీ శరీర
రక్తముల్గొనంగ నీర
రాసులైన గనులైన
జాలునా మరేవియైన?

4. నిశ్చలంపు బ్రేమ నిన్ను
చీల్చి భూమికంటె నన్ను
మాకునైత్వదీయ ప్రాణ
మిచ్చినాడ వట్లు గాన
ఆమేన్.

చిందబడ్డ నీ శరీర
రక్త బిందు లింపుమీర
రాత్రి భోజనాన మాక
నంత ప్రేమ పెంచుగాక

5. యేసు! జీవ భక్తమైన
నీదు బల్ల గంటినైన
వ్యర్థ నష్టతల్ల ఖింప
నీకు, దీననే నశింప
భూమి మీద బోలె మింట
నిన్ను గూడి త్రాగి తింటి
కీసు భోజనంబు నందు
నీదు ప్రేమ జూపుమందు,

– జె. ఫ్రాంక్

## 626 *Got Ist die Lie be*

1. దేవుండు ప్రేమ
రక్షించె నన్ను
దేవుండు ప్రేమ
ప్రేమించెనన్
॥ రెట్టించి పాదుదున్
దేవుండు ప్రేమ
ప్రేమించెనన్ను
నటంచును ॥

2. నన్నొందె జావు
సైతాను భీతి
నన్నెందె జావు
నా జీతము.

3. నాకై సుయేసు
నాయప్పు దీర్ప
నాకై సుయేసు
చావొందెను.

4. నన్బిల్చినాడు
వాక్యంబుచేత
నన్బిల్చినాడు
శుద్ధాత్మచే.

5. ఈ ప్రీతి వాక్కు
నాయాత్మ భుక్తి
ఈ ప్రీతి వాక్కు
నా పానమున్

6. ఓ దివ్య ప్రేమ!
నా ముక్తిధార!
ఓ దివ్య ప్రేమ!
ఓదార్పునన్.

7. నిన్నే స్తుతింతు
నో నిత్యప్రేమ!
నిన్నే స్తుతింతు
నెల్లప్పుడున్.

– ఎ.రిస్పీ

# రెండవ అనుబంధము

## 627

ప॥ అంధుడా రావా అరమరయేల అడుగోయేసయ్య! అయ్యో అడుగో యేసయ్య...

1. నీతిసూర్యుడు నిర్మలజ్యోతి – నిను వెలిగింపను నరుదెంచె
ఖ్యాతిగ సిలువలో కరములు జూచి – కన్నీనరొలుకుచు నినుపిలిచె...॥అ॥

2. మరణపుశక్తిని మార్కొనియేసు – మరణమునుండి జయ
మొందే పరమందలి తండ్రియు దూతలుగని – కరములెత్తి
జయధ్వనులిడిరె ॥అ॥

3. ధైర్యముచెడెను సృష్టికిని ఆ – దైవ మరణమును తిలకించా
ధైర్యము చెడెను – అధికారులకును – దాతను చేరను గతినంబా ॥

4. లోకపు జ్ఞానము వ్యర్థమని – యిక శోక మొందడి దినములని
జాగినయేల యేసును చేరి – జయమని పాడుము అభయమని ॥

5. పావనయేసుని పదముల చేరుము – పాపములను తొలగించు
నిదే జీవము నిచ్చును భావము మార్చును – దేవ దేవుని
కరుణ యిదే ॥అ॥

6. హల్లెలూయ పాటలు పాడుదము – ఆనందముతో ప్రభు
చాటుదము అలరాకడకై తలలెత్తుదము –ఆ ప్రభురాగా వెళ్ళుదము ॥అ॥

## 628

ప॥ ఆనందమానంద మాయెను – నాదు ప్రియకుమారుని యందు
॥మహదానం॥

అ॥ప॥ నా తనయునిమాట వినండి – శద్ధ మొక్కటి
యా మేఘములో ఉద్భవించెనద్భుతముగ ॥మహదానం॥

1. ప్రేమించుచున్నావు నీతిని – దుర్నీతిని ద్వేషించినావు – నీవు –
అందుచే నీ తోటి వారికంటె – ఆనందతైలముతో తండ్రి
నిన్ను అధికంబుగా నభిషేకించెను ॥మహదానం॥



2. అంత్యదినముల యందున – ఆ వింతకుమారునిద్వారా –ఈ
మానవులతోడ మాట్లాడెను – సర్వమునకు తండ్రి తనయుని వారసునిగా
నియమించెను ॥మహదానం॥

3. తనయుండె ఆ తండ్రి మహిమ – ఆ తత్వంబు రూపంబు తానె
ఆ – మహాత్మ్యమైనట్టి – మాటలచేత – సమస్తమును నిర్వహించు అందరిలో
అతి శ్రేష్ఠుండాయే ॥మహదానం॥

4. నీవు నాదు కుమారుడవు– నిన్ను ప్రేమించి కన్నాను – నేను –
నేడు దండిగ తనయుని ముద్దాడుడి నిండుగ వాని నాశ్రయించుడి రండి
రండి ధన్యులు కండి ॥మహదానం॥

5. విజ్ఞాన సంపద లెల్లను – ఆ సుజ్ఞానిలో గుప్తమాయెను– ఆ
సంతోషమును పరిశుద్ధత – సమాధానము నీతి శక్తియు
విమోచనమాయెను ॥మహదానం॥

6. అందరికన్న నీవెంతనో – అతి సుందరుడవై – యున్నావు నీవు –
నీ పెదవుల మీద పోయబడి – నిండి యున్నది దయారసము
నిన్నాశీర్వదించును తండ్రి ॥మహదానం॥

7. దివ్యరారాజై కుమారుడు – ఒక వెయ్యివర్షాలు పాలించును
మహా – అంతములేని రాజ్యమేలును – యెందరు జయంబు
నొందుదురో అందరును పాలించెదరు ॥మహదానం॥

## 629

పల్లవి : ఆనంద యాత్ర – ఇది ఆత్మీయ యాత్ర
యేసుతో – నూతన –యెరుషలేము యాత్ర ॥

1. యేసుని రక్తము – పాపముల నుండి విడిపించును
వేయినోళ్ళతో – స్తుతించినను – తీర్చలేము ఆ రుణమును ॥ఆనంద॥

2. రాత్రియు – పగలును – పాదములకు రాయి తగలకుండ
మనకు పరిచర్య చేయుట కొరకు – దేవదూతలు మనకుండగ ॥ఆనంద॥

3. కృతజ్ఞత లేనివారు - వేలకొలదిగ కూలినను
కృపా వాక్యమునకు - సాక్షులమై - కృప వెంబడి కృప పొందెదము॥ఆనంద॥

4. ఆనందం - ఆనందం యేసుని చూచె క్షణం ఆసన్నం
ఆత్మానంద భరితులమై - ఆగమనాకాంక్షతో సాగెదన్ ॥ఆనంద॥

# 630

ప॥ ఆనందం - ఆనందం - దినదినం ఆనందం
యేసురాజు నా స్వంతమాయెనే - యీ లోకమందు
స్వంతవాడాయెనే నా మదిలో స్వంతమాయెను (2)

అ॥ప॥ ఆ....ఆనందమే - పరమానందమే - ఇది నా గొప్ప భాగ్యమే
॥యీ లోకమందు॥

1. తొలి బాల్యవయసులో - నన్ను గుర్తించినాడు
దూరంపోయిన కనుగొన్నాడు (2) - తన ప్రాణమును
నాకర్పించి - జీవం పొందుకొనుమని చెప్పెను ॥ఆ..ఆనందమే॥

2. ఏ స్థితిలోనైనా ప్రభు ప్రేమతో - నన్ను విడువక కాపాడును
నన్ను నమ్మి యిచ్చిన బాధ్య - తను ప్రభువు
వచ్చువరకు - కాచుకొందును ॥ఆ...ఆనందమే॥

3. ప్రభువు వచ్చుదినమున - తనచేయి చాచిప్రేమతో
పిలిచి చేర్చుకొనును - ప్రభువు సమూహమందు
అచ్చటాయనతో ఆడిపాడి సంతోషించెదన్ ॥ఆ..ఆనందమే॥

# 631

ప॥ ఇదిగో నీ రాజు వచ్చుచుండె - సీయోను కుమారి
సంతోషించు - యెరుషలేం కుమారి ఉల్లసించు ॥ఇదిగో॥

1. నీదురాజు నీతితో దోషమేమియు లేకయే
పాపరహితుడు ప్రభు - వచ్చు చుండె ॥ఇదిగో॥



2. రక్షణగలవాడుగ - అక్షయుండగు యేసుడు
ఇచ్చతోడ యెరుషలేం - వచ్చు చుండె ॥ఇదిగో॥

3. స్వాతికుండు యీభువిన్ - అత్యంతమగు ప్రేమతో
నిత్యరాజు నరులకై - వచ్చుచుండె ॥ఇదిగో॥

4. దీనవరుడు నీ ప్రభు - ఘనత కలిగిన దేవుడు
ప్రాణమీయ పాపులకై - వచ్చుచుండె ॥ఇదిగో॥

5. ఇలను గాడిదనెక్కియే - బాలుర స్తోత్రములతో
బలుడగు నీ ప్రభు - వచ్చుచుండె ॥ఇదిగో॥

6. దావీదు కుమారుడు - దేవుడు పాపులకు
జయగీతములతో - వచ్చుచుండె ॥ఇదిగో॥

7. యేసుని ప్రేమించుచు హోసన్న పాడెదము
యేసుడిల వచ్చుచుండె - హల్లెలూయ ॥ఇదిగో॥

# 632

ప॥ ఇదియే సమయంబు రండి యేసుని జేరండి -
ఇక సమయము లేదండి - రండి రక్షణ నొందండి

1. పాపులనందరిని - తన దాపున చేర్చుటకై
ప్రాణము దానముగా తన ప్రాణము నిచ్చెనుగా
మరణపు ముల్లును విరిచి - విజయము నిచ్చెనుగా ॥ఇక॥

2. రాజుల రాజైన యేసు రానై యుండేనుగా
గురుతులు జరిగెనుగా - మీరు సరిగా చూడండి
తరుణముండగానే - మీరు తయ్యారవ్వండి ॥ఇక॥

3. బుద్ధి లేని కన్యకలవలె - మొద్దులుగానుంటె
సిద్దెలలో నూనెపోసి - సిద్ధపడకపోతే
తలుపులు తట్టినను - మీకు తెరువడు సుమ్మండి ॥ఇక॥

4. వెలుపటనుంటేను మీరు వేదన నొందెదరు -
తలుపులు తట్టినను - మీకు తెరువడు సుమ్మండీ
మిమ్మును ఎరుగను - మీరెవరో పొమ్మనును ॥ఇక॥

5. సందియ పడకండి – మీరు సాకులు చెప్పకను
గురుతులు జరిగెనుగా – మీరు సరిగా చూడండి
మరణ దినమూ మన – మెరుగము సుమ్మండీ ॥ఇక॥

6. సందియ పడకండి –మీరు సాకులు చెప్పకను
గురుతులు జరిగెనుగా – మీరు సరిగా చూడండి
మరణ దినమునూ మన – మెరుగము సుమ్మండీ ॥ఇక॥

7. జాలము చేయకను – మీరు హేళన చేయకను
కులము స్థలమనుచూ – మీరు కాలము గడువకనూ
తరుణముండగానే – మీరు త్వరపడి రారండి ॥ఇక॥

## 633

ప॥ ఈ జీవిత ఈత – ఈదలేకున్నాను
నా చేయి పట్టుకో నా యేసునాధా
అ॥ప॥ గాలి తుఫానులకు గలిగే తరంగముల
గొట్టబడుచున్నాను గదా నా దేవా ॥ఈ॥

1. సారహీనమగు సంసారాబ్దిలోన సాగలేకున్నాను
సాయంబురావా – సారాకరుణారసధారలే నా కొసగుము
సాగిపోవను ముందుకు శక్తి నాకిమ్ము

2. సంఘసంబంధముగ శాంతి లేకపోయె – సమానతత్వంబు
సమసిపోయె – సోదరులే నాకు శత్రువు లయ్యిరి
సమాధానము నొసగ సరగున రావా ॥ఈ॥

3. బయట పోరాటములు – భయపెట్టుచుండెను – బంధువులందరు
బహుదూరులైరి – భార్యపుత్రాదులచే బాధలెన్నో గలిగె
బాధలన్నియు బావ బహుత్వరగ రావా ॥ఈ॥

4. రాజ్యముపై రాజ్యంబు రంకె వేయుచుండె – రాష్ట్రముపై
రాష్ట్రంబు రగులుచుండె – రాజులకు రాజువై రయమున
రావయ్య – రాజ్యమేలను ధరణిలో రమ్ము రమ్ము ॥ఈ॥



5. సైతాను చెలరేగి సమయం – బిక లేదని – సింహపురీతిగా
గద్దించుచుండె – సంకెళ్ళతో వచ్చి సైతానుని బంధించి
సమాధానరాజ్యం – స్థాపించరావా ॥ఈ॥

6. మొదటి జామయ్యెను మీరింక రారయ్యో – రెండవజామున
జాడలేదె – మూడవ జామయ్యె మీరింకా రారయ్యో
నాలుగవ జామున నడచివస్తున్నారా ॥ఈ॥

7. పెండ్లికుమారుండ ప్రభువైన క్రీస్తుండ – పెండ్లిసంఘము
నాత్మయు బిలుచుండె – పెండ్లివిందులో నేను పెండ్లి
వస్త్రముతోను – హల్లెలూయ యని ఆనందింతున్ ॥ఈ॥

## 634

ప॥ ఎల్ల వేళలందు – కష్టకాలమందు
వల్లభుండా యేసున్ స్తుతింతున్
ఎల్లను నీవే నాకెల్లడల వల్లపడదె వివరింప ॥

1. విమోచకుడా – విమోచన నీవే
రక్షకుడవు – నా రక్షణ నీవే ॥ఎల్ల॥

2. సృష్టికర్తవు – సహాయము నీవే
ఇష్టుడ నీవు – త్రిత్వము నీవే ॥ఎల్ల॥

3. జ్ఞానము నీవే – నా పానము నీవే
దానము నీవే – నా గానము నీవే ॥ఎల్ల॥

4. జ్యోతియు నీవే – నా నీతియు నీవే
ఆదియు నీవే – నా అంతము నీవే ॥ఎల్ల॥

5. నిత్యుడ నీవే – నా సత్యుండ నీవే
స్తోత్రము నీవే – నా నేత్రము నీవే ॥ఎల్ల॥

6. జీవము నీవే – నా దేవుడు నీవే
పావన మీవే – నా కావలి నీవే ॥ఎల్ల॥

7. కాంతియు నీవే– నా శాంతియు నీవే
సంతస మీవే– నా కంతయు నీవే ॥ఎల్ల॥

## 635

పII ఎవని అతిక్రమములు మన్నింపబడెనో
పాపపరిహార మెవడొందెనో వాడే ధన్యుండు

1. యెహోవాచే నిర్దోషిగా తీర్చబడియు
ఆత్మలో కపటము లేనివాడే ధన్యుండు IIఎవనిII
2. మౌనినైయి యుండి దినమెల్ల నే జేసినట్టి
ఆర్తధ్వనిచే నా యెముకలు క్షీణించెను IIఎవనిII
3. దివారాత్రులు నీ చేయి నాపై బరువైయుండ
నా సారము వేసవిలో ఎండినట్లాయె IIఎవనిII
4. నేను నా దోషమును కప్పుకొనక
నీ యెదుట నా పాపమును ఒప్పుకొంటిని IIఎవనిII
5. నీ సన్నిధి నా పాపముల నొప్పుకొనగా
నీవు నా దోషమును మన్నించితివిగా IIఎవనిII
6. కావున నీ దర్శనకాలమందు
భక్తిగలవారు నిన్ను ప్రార్థించెదరు IIఎవనిII
7. విస్తార జలప్రవాహము పొర్లినను
నిశ్చయముగ అవి వారి మీదికి రావు IIఎవనిII
8. నాకు దాగుచోటు నీవే శ్రమలోనుండి
నీవు నన్ను రక్షించెదవు నాదు దుర్గమా IIఎవనిII
9. విమోచన గానములతో నీవు నన్ను
ఆదరించి నాకుపదేశము చేసెదవు IIఎవనిII

## 636

పII ఎంతజాలి యేసువా యింతయని యూహించలేను IIఎంతII

1. హానికరుడ హింసకుడను –దేవ దూషకుడను నేను
అవిశ్వాసినైన నన్ను ఆదరించినావుగా IIఎంతII
2. రక్షకుండా నాకు బదులు – శిక్ష ననుభవించినావు
సిలువయందు సొమ్మసిల్లి – చావొందితి నాకై IIఎంతII



3. ఏమి నీ కర్పింపగలను – ఏమిలేని వాడనయ్య
రక్షణంపు పాత్రనెత్తి – స్తోత్రమంచు పాడెదా IIఎంతII
4. నీదు నామమునకు యిలలో – భయపడెడి వారి కొరకై
నాధుడా నీవిచ్చు మేలు – ఎంతగొప్ప దేసువా IIఎంతII
5. నేను బ్రతుకు దినములన్ని – క్షేమ మెల్లవేళలందు
నిశ్చయముగ నీవు నాకు – ఇచ్చువాడా ప్రభూ IIఎంతII
6. నాదు ప్రాణమునకు ప్రభువా – సేదదీర్చువాడ నీవు
నాదు కాపరివి నీవు – నాకు లేమి లేదుగా IIఎంతII
7. అందరిలో అతి శ్రేష్ఠుండా – అద్వితీయుడగు యేసయ్యా
హల్లెలూయా స్తోత్రములను – హర్షముతో పాడెదా IIఎంతII

## 637

పII ఎంతదూరము మోయించెదరు స్వామి
కింత సిలువనెత్తి నుంతైన దయేలక IIఎంతII

1. ఒంటిగా ప్రార్థించి యుపవాసములు జేసి
కంటి నిదురలేక కలతజెందిన ప్రభుని IIఎంతII
2. సొమ్మునాశించి గురున్ అమ్ముకొన్న యూద
నమ్మించి మీకిచ్చె నిమ్మానుయేలును IIఎంతII
3. కరములు జోడించి కడకు గేత్సెమనిలో
పరమ తండ్రిని వేడు నిరపరాదిని పట్టి IIఎంతII
4. పిరికి పిలాతుని బెదరించి యదలించి
యెరుషాలేం వీధుల నేసుని ద్రిప్పుచు IIఎంతII
5. ఒడలలసి నా ప్రభువు తడబడుచుండగా
ఘడియ ఘడియకు తిట్టి గట్టిగ కొట్టుచు IIఎంతII
6. కలువరి గిరివరకు సిలువ మోయలేక
అలసిన ప్రభుజంప నాలస్యమును చేసి IIఎంతII
7. యేసు నీకొరకై నే నేడ్చుటకంటెను
దోషినని గ్రహించి దోసిలొగ్గుటె మేలు IIఎంతII

## 638

ప॥ ఎందుకో నన్నింతగా నీవు – ప్రేమించితివో దేవా
అందుకో నా దీన స్తుతిపాత్ర – హల్లెలూయ యేసయ్యా

1. నా పాపము బాప – నరరూపివైనావు
నా శాపము మాప– నలిగి వ్రేలాడితివి
నాకు చాలిన దేవుడవు నీవే – నా స్థానములో నీవే ॥హల్లె॥

2. నీ రూపము నాలో – నిర్మించియున్నావు
నీ పోలికలోనే – నివసించుచున్నావు
నీవు నన్ను ఎన్నుకొంటివి – నీ కొరకై నీ కృపలో ॥హల్లె॥

3. నా శ్రమలు సహించి – నా ఆశ్రయమైనావు
నా వ్యధలు భరించి – నన్నాదుకొన్నాము
నన్ను నీలో చూచుకున్నావు – నను దాచియున్నావు ॥హల్లె॥

4. నీ సన్నిధి నాలో – నా సర్వము నీలో
నీసంపద నాలో – నా సర్వస్వము నీలో
నీవు నేను ఏకమగువరకు – నన్ను విడువనంటివే ॥హల్లె॥

5. నా మనువులు ముందే – నీ మనస్సులో నెరవేరే
నా మనుగడ ముందే – నీ గ్రంథంబులో నుండె
ఏమి అద్భుత ప్రేమ సంకల్పం – నేనేమి చెల్లింతున్ ॥హల్లె॥

## 639

1. ఓ మానవుండ నీ గతి యేమౌనో తెలియునా
యేమేమి చేయుచుంటివో తప్పించుకొందువా?.... ॥ఆహా॥

ప॥ ఆహా..ఆ...అంత్యతీర్పు నందున ...యేసూ నీ రక్షకుడే
మహాభయంకరమో ...సింహంబుగా నుండు

2. లోకాలు పుట్టినప్పటినుండి మృతులైన
ఏ కులజుడైన నాటికి – తీర్పులో నిలచును ॥ఆహా॥

3. మృతులైన ఘనులు హీనులు – యేసయ్య యెదుటను
ప్రతివారు నిలిచియుందురు బ్రతికిన రీతిగనే ॥ఆహా॥



4. గ్రంథాలు విప్పబడగ – గ్రంథాలలో వారి
గ్రంథంబు బట్టబయలై – పొందుదురు తీర్పును ॥ఆహా॥

5. నరులెల్ల క్రియలచొప్పున – మరి తీర్పు పొందుదురు
మరణము మృతుల లోకము – గురియౌను యగ్నికి ॥ఆహా॥

6. ఈనాడు నీవు కూడను – యేసుని విడిచినచో
ఆనాడు నీవు కూడాను – అందుండి ఏడ్చెదవు ॥ఆహా॥

7. దేవుని జీవగ్రంథము – దేవుడు తెరచును
ఎవ్వాని పేరందుండదో – వాడగ్నిలో బడును ॥ఆహా॥

## 640

ప॥ ఓ యేసు నీ ప్రేమ ఎంతో మహనీయము
ఆకాశతార పర్వత సముద్రముల కన్న గొప్పది

1. ఆగమ్య ఆనందమే – హృదయము నిండెను
ప్రభుని కార్యములు గంభీరమైనవి ప్రతి
ఉదయ సాయంత్రములు స్తుతికి యోగ్యములు ॥ఓ యేసు॥

2. సంకట సమయములో – సాగలేకున్నాను – దయచూపు
నామీద అని నేను మొరపెట్టగా – వింటినంటివి
నా మొర్రకుముందె – తోడనుందునంటివీ (2) ॥ఓ యేసు॥

3. మరణాంధకారపు – లోయనే సంచరించన
నిరంతరమేసు – నాదు కాపరియై – కరములిచ్చి
నన్ను గాయుచు నడుపు – కరుణగల ప్రభువు (2) ॥ఓ యేసు॥

4. కొదువలెన్ని యున్న – భయపడ నే నిపుడు – పచ్చిక –
బయలులో పరుండజేయును – భోజన జలములతో
తృప్తిపరచును – నాతో నుందు నేను (2) ॥ఓ యేసు॥

5. దేవుని గృహములో – సదా స్తుతించెదను – సంపూర్ణ
హృదయముతో సదా భజించెదను – స్తుతి ప్రశంసలకు
యోగ్యుడేసు – హల్లెలూ ఆమెన్ (2) ॥ఓ యేసు॥

## 641

ప॥ ఓ సంఘమా – సర్వాంగమా – పరలోకరాజ్యపు ప్రతిబింబమా
మెస్సయ్యను – ఎదుర్కొనగ – నీతినలంకరించి సిద్ధపడుమా
ఓ సంఘమా – వినుమా

1. రాణి ఓఫేరు అపరంజితో – స్వర్ణ వివర్ణ వస్త్రధారణతో
వీణావాద్యతరంగాలలో – ప్రాణేశ్వరుని ప్రసన్నతతో
ఆనంద తైలాసుగంధాభిషేకము – నొందితివే సువాసనుండా ॥ఓ॥

2. క్రీస్తే నినును ప్రేమించెనని – తన ప్రాణాలర్పించెనని
స్వస్థపరచే నిర్దోషముగా – ముడత కళంకము –లేనిదిగా
మహిమ యుక్తంబుగా – నిలువగోరె యేసువా
సహించుతావా తీర్పునాడూ ॥ఓ॥

3. చీకటిలోనుండి వెలుగునకు – లోకములో నుండి వెలుపలకు
శ్రీకర్త గుణాతిశయములను – ప్రకటించుటకే పిలచెనని
గుర్తించుచుంటివా క్రియలను గంటివా – సజీవముగా నున్నావా ॥ఓ॥

4. వ్యభిచారులు నరహంతకులు – పోకిరి చేష్ఠల డాంబికులు
అబద్ధజనకుని యాసనము – యెజిబెలు నీ మధ్య నివసించెనా–
కృపావరములు – ఆత్మల భారములు ఉజ్జీవదాహము కలదా ॥ఓ॥

5. చల్లగనైనా వెచ్చగనూ ఉండిన నీ కది మేలగును
నులివెచ్చని స్థితి నీకుంటే – బయటకు ఉమ్మబడెదవేమో
నీ మనస్సు మార్చుకో – తొల్లిప్రేమ కూర్చుకో
ఆసక్తితోడ రక్షణ నొందు ॥ఓ॥

6. కడపటి బూర మ్రోగగానే – కనురెప్ప పాటున మారుదువా
వడిగా మేఘాసీనుడవై – నడియాకాశము పోగలవా
గొఱ్ఱెపిల్ల సంఘమా క్రీస్తు రాజు సంఘమా – రారాజు
నెదుర్కొనగలవా ॥ఓ॥



## 642

ప॥ కఠిన హృదయమా – కరుగవ దేవుని గడువులు
గని వినవా – దెబ్బలు గలిగిన లోబడవా

1. ఎన్నో గడువులు – ఎన్నోమారులు ఎన్నో గడువులు – దొరికినను
కన్నుమూసికొని – కదలుచునుందువు కనికర కరమునుగని మానవా ॥కఠిన॥

2. సృష్టికర్తకు –మ్రొక్కెదవా! తన సృష్టిని గొని – పూజించెదవా
సృష్టికర్త విరోధి దయ్యముల చేష్టలెల్ల – మంద్రించెదవా ॥కఠిన॥

3. నీరము రక్తముగా – మారినను భారముగా క– ప్పలు పేలు
జోరీగలు గొప్ప–తెగులు వచ్చిన గుణపడెనా – ఫరోరాజు!

4. దద్దురులై – బొబ్బలు పొక్కినను హద్దులేక – పిడుగులు పడిన
గ్రుద్దినట్లు – వడగండ్లు కురిసినను – గుణపడెనా – ఫరోరాజు ॥కఠిన॥

5. మిడుతల – దండులు చెలరేగి యామిగిలిన – వాటిని మ్రింగినను
వడివడితడబడు – నంధకారమే వచ్చిన గుణపడె – నా రాజు ॥కఠిన॥

6. ఘోషపెట్టి – దేశమెల్లనేడ్వగ గుంపులుగా జ్యేష్టులు చావ
రోషముతో – వెంటబడి నశించిరి దోషముకై – దుఃఖముపడిరే ॥కఠిన॥

7. నష్టము కష్టము కలిగినను మరి నరులును – దేవుడె చెప్పినను
ఇష్టపడవు – రక్షింపబడుటకై ఇరుకుపడిన – నిరుకున జెడిన ॥కఠిన॥

8. పాపప్రతాపము – నెరుగుదువ దాని శాపము తాపము – నెరుగు
దువా పాపము నొకపరి – బట్టితివా అది పట్టుబడి – కఠినపరచు ॥కఠిన॥

9. లోలోపలన – న్యాయమబద్ధములోపము కలిగిన – మోసములో
కాలయాపనచేయ – నుపాయములేల? వేషధారణయేల ॥కఠిన॥

## 643

ప॥ కల్వరిలోని శ్రేష్టుడా – కరుణభరిత సింహమా
కన్ను భ్రమించు ప్రభువా – సిలువలోని మిత్రుడా ॥కల్వరి॥

1. స్తుతికి పాత్రుండగువాడా – దూతలతో వేంచేయువాడా
సుదతి మరియ పుత్రుడా – సిలువలోని మిత్రుడా ॥కల్వరి॥

2. పాపులకై వచ్చినవాడా – ప్రేమగల్గిన రక్షకుడా
పాదములపై బడితిమి – సిలువలోనిమిత్రుడా ॥కల్వరి॥

3. దీవెనలు నిచ్చువాడా – వసుధ కేతెంచినవాడా
నీవే సుంకరలాప్తుడవు – సిలువలోని మిత్రుడా ॥కల్వరి॥

4. ఐదు రొట్టెలు మరి రెండు – చేపలతో నైదువేల
జనుల పోషించిన తండ్రి – సిలువలోని మిత్రుడా ॥కల్వరి॥

5. నీళ్ళను రసముగ మార్చితివి – నీళ్ళమీద నడచితివి
మేళ్ళనొసగు మాదాతా – సిలువలోని మిత్రుడా ॥కల్వరి॥

6. రోగులను బాగుచేయువాడా – గ్రుడ్డికి నేత్రములిచ్చితివి
అనాథుల నాయకుడా – సిలువలోని మిత్రుడా ॥కల్వరి॥

7. హల్లెలూయ కర్తుడా – యెల్లరు కొనియాడువాడా
బలముతో వచ్చు రాజా – సిలువలోని మిత్రుడా ॥కల్వరి॥

# 644

ప॥ కుమ్మరీ ఓ కుమ్మరీ – జగదుత్పత్తిదారీ
జిగటమన్నై నా వంక – చల్లగ చూడుమయ్యా......

1. పనికిరాని పాత్రనని – పారవేయకుమా – పొంగిపొరలు
పాత్రగా జేసి – నన్ను నింపుమా – సువార్తలోని పాత్రలన్నీ –
శ్రీ యేసున్ పొగడుచుండ – సాక్షిగ నుండు
పాత్రగజేసి – సత్యముతో నింపుము తండ్రి ॥కుమ్మరీ॥

2. విలువలేని పాత్రన్ నేను కొనువారు లెరెవ్వరూ –
వెలలేని నీదు రక్తంబుతో వెలుగొందు పాత్రగజేసి
ఆటంకములనుండి తప్పించి నన్ను – ఎల్లప్పుడు కావుమయ్యా – ॥కుమ్మరీ॥

3. లోకాశతో నింజి ఉప్పొంగుచు మార్గంబునే తప్పితిన్
మనుష్యేచ్ఛలన్నియున్ – స్థిరమనుచు నే మనశ్శాంతి కోల్పోతిని
పోగొట్టుకొన్న పాత్రయనుచు – పరుగెత్తి నను పట్టితీ
ప్రాణంబు నాలో ఉన్నప్పుడే – నీ పాదంబుల్ నే పట్టితిన్ ॥కుమ్మరీ॥



# 645

ప॥ క్రైస్తవకర్షక – కదిలిరావయ్యా
కన్నులు తెరచి – కానవేమయ్యా
అ॥ప॥ కోతకాలము – గతించిపోయె
గ్రీష్మకాలముకూడ – జరిగిపోయె ॥క్రైస్తవ॥

1. మనుష్యకుమారుడైన క్రీస్తుయేసు మంచివిత్తనమును –
విత్తెమున్న భూలోకంబనెడు – పొలంబునందున
వాక్యంబనె విత్తనంబు విత్తెను ॥క్రైస్తవ॥

2. ఆదిమ క్రైస్తవ – బోధకుల వేదనతోను – వాక్యంబు విత్తె
రోదనతోను – రక్తంబును గార్చి ప్రాణంబులను
దానంబుజేసిరి ॥క్రైస్తవ॥

3. చల్లిన వాక్యము – ఫలియింపను తొలకరి వర్షము –
గురిపించెను విలువైన ఫలములు – ఫలియించువరకు
కడవరి వర్షము – కొరకు వేడుదం ॥క్రైస్తవ॥

4. పొలములు – తెల్లబారె – తేరిచూడు కాలము చాల –
గతించిపోయె కోతయజమా – నుడైన క్రీస్తుని
కోతవారిని – పంప కోరివేడుదం ॥క్రైస్తవ॥

5. శత్రువగు – సాతానుకూడా చెడ్డవిత్తనాలు – చల్లిపోయె
గోధుమల మధ్య – గురుగులు కూడ ఘోరంబుగాను
పెరుగుచుండెను ॥క్రైస్తవ॥

6. కన్నీళ్ళతో విత్తు – క్రైస్తవుడా కలవర మొందెద
వెందులకు సంతోషముతో – సంగీతాలతోను
సాగిపోవుదుము – ఆగిపోకను ॥క్రైస్తవ॥

# 646

ప॥ క్రైస్తవుండా కదిలిరావయ్యా కలుషాత్ములకు యీ
సిలువశక్తిని జాటవేమయ్యా – యెండవానలనియు జడిసి
ఎంతకాలము మూలనుందువు – కండలను ప్రేమింతువేమన్నా
ఈ మంటికండలు ఎంత బెంచిన మంటికేనన్నా ॥క్రైస్తవ॥

1. వసుధలో ప్రజలెల్లరు యేసు – వాక్యంబు వివక్షుద్బాధకొని
వాంఛించుచుండగను – మిషనులెల్లను మిషలచేత
మిట్టిపడుచు వాదములతో – యేసు బోధను విడచినారన్నా
నీవెంతకాలము – వారిచెంత నుందువోరన్న ॥క్రైస్తవ॥

2. సత్యవాక్యము సంతలోదులిపి బోధకులు దొరల
బత్యములపై భ్రాంతులు నిలిపి – చిత్రమగు అనుకూల
బోధలు చేసి బ్రజలను మోసగించు సూత్రధారుల
జేర రాదయ్యా సుఖభోగమిడిచి సత్యవాక్యము
చాట రావయ్యా ॥క్రైస్తవ॥

3. శక్తిహీనుడనందు వేమయ్యా – సౌజన్యమగు శుద్ధాత్మశక్తిని
పొందుకొనుమయ్యా భక్తిహీనత పారద్రోలు భ్రష్ట
మనస్సు – బయలుపరచు శక్తికలుగు సువార్త చాటుదువు
సువార్త చేయ జయమొంది ఆత్మలను రక్షించెదవు ॥క్రైస్తవ॥

4. నీతికై భక్తాదిపరులెల్ల – నిజవిశ్వాసము నిలుపుకొన
పోరాడిరే – చాలకత్తిపోటులు రాళ్ళదెబ్బలు కరకు గల
రంపములు కోతలు బెత్తములు కొరడాల దెబ్బలు – పైబడి
చీలి దేహము వాలలాడెను రక్తము భువిపై ॥క్రైస్తవ॥

5. ఆది సంఘము నార్పుటకు నెంచి ఆ దుష్ట నీరో అధిపతి
చెలరేగి గర్వించి ఆదిక్రైస్తవ భక్తుల స్థంభముల గట్టి
తారుపూసి అగ్నిని ముట్టించి కాల్వంగ ఆ సంఘ మెచ్చె
అధిపతి అప్పుడె నశియించె ॥క్రైస్తవ॥

6. దూతలకు లేనట్టి పరిచర్య – ఓ ప్రియ సఖుండా ఖ్యాతిగా
నీ కిచ్చె గ్రంథంబు – భీతియేల తినుము గ్రంథము – తేనెవలె
మధురముగ నుండున – జ్ఞానము నీకబ్బునో హితుడ
జ్ఞానంబునొంది స్వామిని సేవించుమో సఖుండా ॥క్రైస్తవా॥



# 647

ప॥ కృపామయుడా నీలోన (2)
నివసింపజేసినందునా ఇదిగో నా స్తుతుల సింహాసనం నీలో

1. ఏ అపాయము నా గుడారము సమీపించనీయక
నా మార్గములన్నింటిలో నీవే ఆశ్రయమైనందున ॥కృపా॥

2. చీకటి నుండి వెలుగులోనికి – నన్ను పిలిచిన తేజోమయా
రాజ వంశములో – యాజకత్వము చేసెదను ॥కృపా॥

3. నీలో నిలచి ఆత్మ ఫలములు – ఫలియించుట కొరకు
నా పైన నిండుగా – ఆత్మ వర్షము క్రుమ్మరించు ॥కృపా॥

4. ఏ యోగ్యత లేని నాకు జీవ కిరీట మిచ్చుటకు
నీ కృప నను వీడక – శాశ్వత కృపగా మార్చెను ॥కృపా॥

# 648

ప॥ గగనము చీల్చుకొని యేసు – ఘనులను తీసికొని –
వేలాది దూతలతో భువికి వేగమె రానుండె

1. పరలోక పెద్దలతో– పరివారముతో కదలి
ధరసంఘ వధువునకై – తరలెను వరుడదిగో ॥గగనము॥

2. మొదటగను గొఱ్ఱెగను – ముదమారగ వచ్చెను
కొదమసింహపురీతి – కదలెను గర్జనతో ॥గగనము॥

3. కనిపెట్టు భక్తాళీ – కనురెప్పలో మారెదరు
ప్రథమమున లేచెదరు – పరిశుద్ధులు మృతులు ॥గగనము॥

# 649

ప॥ గీతం గీతం జయ జయగీతం చేయితట్టి పాడెదము
అ॥ప॥ యేసురాజు లేచెన్ హల్లెలూయ జయమార్భటించెదము

1. చూడు సమాధిని మూసినరాయి దొరలింపబడెను – అందు
వేసిన ముద్ర కావలినిల్చెను నా – దైవ సుతుని ముందు ॥గీతం॥

2. వలదు వలదు యేడువవలదు - వెళ్ళుడి గలిలయకు - తాను
చెప్పిన విధమున తిరిగి లేచెను - పరుగిడి ప్రకటించుడి ॥గీతం॥

3. అన్న -కయపవారల సభయు అదరుచు పరుగిడిరి - ఇంక
భూతగణముల ధ్వనిని వినుచు - వణకుచు భయపడిరి ॥గీతం॥

4. గుమ్మముల్ తెరచి చక్కగ నడువుడి - జయవీరుడు రాగా
మీ వేళతాళ వాద్యముల్ - బూరలెత్తి ధ్వనించుడి ॥గీతం॥

# 650

ప॥ చూడుము గెత్సెమనే - తోటలో నా ప్రభువు
పాపి నాకై వి-జ్ఞాపన చేసెడి - ధ్వని వినబడుచున్నది
పాపి నీకై విజ్ఞాపన చేసెడి - ధ్వని వినబడుచున్నది

1. దేహమంతయు నలగి - శోకము చెందినవాడై
దేవాది దేవుని - ఏకైక సుతుడు పడు వేదనలు నా కొరకే ॥

2. తండ్రి ఈ పాత్ర తొలగున్ - నీ చిత్తమైన యెడల
ఎట్లయినను నీ - చిత్తము చేయుటకు నన్నప్పగించితివనెను ॥

3. రక్తపు చెమట వలన - మిక్కిలి బాధనొంది
రక్షకుడేసు - హృదయము పగులుగ - విజ్ఞాపనము చేసెనే ॥

4. ముమ్మారు భూమిమీదపడి మిక్కిలి వేదనచే - మన యేసు
ప్రభువు - తానే వేడుకొనెను - పాపుల విమోచన కొరకే ॥

5. ప్రేమామృత వాక్కులచే - ఆదరించెడి ప్రభువు - వేదన
సమయమున - బాధపరచెడి వారి కొరకు ప్రార్థన చేసెనే ॥

6. నన్ను తనవలె మార్చెడి - ఈ మహా ప్రేమను త-ల-చి
తలచి హృదయము కరుగగ - సదా కీర్తించెదను ॥చూడు॥

# 651

ప॥ జయ జయ యేసు జయయేసు - జయజయ క్రీస్తు జయక్రీస్తు
జయజయరాజా జయరాజా - జయజయస్తోత్రం జయసోత్రం ॥జయ॥

1. మరణము గెల్చిన జయయేసు - మరణము ఓడెను
పరమ బలమొసగు జయయేసు - సమాధి ఓడెను జయయేసు ॥జయ॥



2. సమాధి గెల్చిన జయయేసు - సమాధి ఓడెను జయయేసు
క్షమించుము నను జయయేసు - అమరమూర్తివి జయయేసు ॥జయ॥

3. సాతాను గెల్చిన జయయేసు - సాతాను ఓడెను జయయేసు
పాతవి గతియించె జయయేసు - దాతవు నీవే జయయేసు ॥జయ॥

4. బండను గెల్చిన జయయేసు - బండయు ఓడెను జయయేసు
బండలుదీయుము జయయేసు - అండకు ఓడెను జయయేసు ॥జయ॥

5. ముద్రను గెల్చిన జయయేసు - ముద్రయు ఓడెను జయయేసు
ముద్రలు జీల్చుము జయయేసు - ముద్రించుమునను జయయేసు॥జయ॥

6. కావలిగెల్చిన జయయేసు - కావలి ఓడెను జయయేసు
సేవలో బలమును జయయేసు - జీవమునీవే జయయేసు ॥జయ॥

7. దయ్యాల గెల్చిన జయయేసు - దయ్యాలు ఓడెను జయయేసు
కయ్యము కలిగిన జయయేసు - అయ్యో నీవే జయయేసు ॥జయ॥

# 652

ప॥ జయ విజయమని పాడుదమా - జయ విజయుడగు యేసునకు
అపజయమెరుగని దేవునకు జయస్తోత్రం స్తుతిచేయుదమా ॥

1. ఇహమందు పలు ఆపదలు ఎన్నో కలిగినను
నా హస్తములు పట్టుకొని వడివడిగా నన్ను నడిపించును ॥

2. మహా దయాళుడు యెహోవా నన్నిల కరుణించి
నా పాపముల అన్నింటి మన్నించి మలినము తొలగించును ॥

# 653

ప॥ జీవితమంత నీ ప్రేమగానం ప్రణుతింతుము యేసుదేవా
ప్రచురింతు మేము - నీ కీర్తిన్ - ఆనందగానంబుతో ॥జీవిత॥

1. సర్వసమయుములలో నీ స్తుతిగానం - ఎల్లవేళలయందు
నీ నామధ్యానం - మాకదియే మేలు - ఈ జీవితమున - స్తుతియింతు నా
రక్షకా ॥జీవిత॥

2. సృష్టినంతటిని నీ మాటచేత – సృజియించితివిగా
మా దేవ దేవా – నీ ఘనమగు మహిమన్ – వర్ణింపతరమా –
స్తుతియింతు నా రక్షకా ॥జీవిత॥

3. కలుషాత్ములమైన మా కొరకు నీ – విలువైన ప్రాణంబు
నర్పించితివిగా–కల్వరిగిరిపై చూపిన ప్రేమన్–స్తుతియింతు
నా రక్షకా ॥జీవిత॥

4. పరిశుద్ధమైన నీ సన్నిధిలో– శాశ్వతమైన నీరాజ్యంబులో
ప్రేమతో నన్ను చేర్చుకొంటివిగా –స్తుతియింతు నారక్షకా ॥

## 654

ప॥ తరతరాలలో, యుగయుగాలలో, జగజగాలలో
దేవుడు ....దేవుడు....యేసే దేవుడు ఆ....ఆ...ఆ...ఆ..
హల్లెలూయా–హల్లెలూయా – హల్లెలూయా – హల్లెలూయా

1. భూమిని పుట్టించకమునుపు – లోకము పునాది లేనపుడు ॥దే॥
2. సృష్టికి శిల్పకారుడు – జగతికి ఆదిసంభూతుడు ॥దే॥
3. తండ్రి కుమార ఆత్మయు – ఒకడై యున్నా రూపము ॥దే॥

## 655

ప॥ దయచేయుము పాపక్షమా – దయచేయుము పాప క్షమా –
యేసుని రక్తము – రక్తము వల్లనే ॥

1. తుడుపుము పాపపుడాగులు – తుడువుము పాపపుడాగులు ॥యేసు॥
2. అనుగ్రహించు జయంసదా – అనుగ్రహించు జయంసదా ॥యేసు॥
3. ఇమ్ము నిజసమాధానము – ఇమ్ము నిజసమాధానము ॥యేసు॥
4. పరమపురిని జేరనిమ్ము – పరమపురిని జేరనిమ్ము ॥యేసు॥

## 656

ప॥ దేవుడు మనకు ఎల్లప్పుడు తోడుగనున్నాడు (3)

1. ఏదేనులో ఆదాముతో నుండెన్ – హానోకుతోడ నేగెను
దీర్ఘ దర్శకులతో నుండెన్ – ధన్యులు దేవుని గలవారు ॥తోడుగ॥



2. దైవాజ్ఞను శిరసావహించి – దివ్యముగ నబ్రాహాము – కన్న
కొమరుని ఖండించుటకు – ఖడ్గము నెత్తినయపుడు ॥తోడుగ॥

3. యోసేపు ద్వేషించబడినపుడు – గోతిలో త్రోయబడినపుడు
శోధనలో చెరసాల యందు సింహాసన మెక్కినయపుడు ॥తోడుగ॥

4. ఫరోరాజు తరిమిన యపుడు – ఎఱ్రసంద్రపు తీరమున
యొర్దానునది దాటినపుడు – ఎరికో కూలినయపుడు ॥తోడుగ॥

5. దావీదు సింహము నెదరించి – ధైర్యాన చీల్చిన యపుడు
గొల్యాతును హతమార్చినపుడు – సౌలుచే తరుమబడి నపుడు ॥తోడుగ॥

6. సింహపుబోనులో దానియేలు– షద్రకు మేషాకబెద్నెగో
అగ్ని గుండములో వేయబడున్ – నల్గురుగా కనబడినపుడు ॥తోడుగ॥

7. పౌలు బంధించబడినపుడు – పేతురు చెరలోనున్నప్పుడు
అపోస్తలుల విశ్వాసులు – హింసింపబడిన యపుడు ॥తోడుగ॥

## 657

ప॥ దేవునికి స్తోత్రము గానము – చేయుటయే మంచిది
మనమందరము స్తుతిగానము– చేయుటయే మంచిది

1. యెరుషలేము యెహోవాయే – కట్టుచున్నవాడని (2)
ఇశ్రాయేలీయులను పోగుచేయువాడని ॥దేవుని॥
2. గుండె చెదరిన వారిని – బాగుచేయువాడని
వారి గాయములన్నియు – కట్టుచున్నవాడని ॥దేవుని॥
3. నక్షత్రముల సంఖ్యను – ఆయనే నియమించును
వాటి కన్నియు పేరులు – పెట్టుచున్నవాడని ॥దేవుని॥
4. ప్రభువు గొప్పవాడును – అధిక శక్తి సంపన్నుడు
జ్ఞానమునకు ఆయనే –మితియు లేనివాడని ॥దేవుని॥
5. దీనులకు అండాయనే – భక్తిహీనుల కూల్చును
సితారాతో దేవుని – స్తుతులతో కీర్తించుడి ॥దేవుని॥
6. ఆయన ఆకాశమున్ – మేఘములతో కప్పును
భూమి కొరకు వర్షము –సిద్ధపర్చువాడని ॥దేవుని॥

7. పర్వతములలో గడ్డిని – పశువులకు మొలపించెను
అరచు పిల్లకాకులకును – ఆహారము తానీయును ॥దేవుని॥

8. గుఱ్ఱముల నరులందలి – బలము నానందించడు
కృప వేడు వారిలో – సంతసించువాడని ॥దేవుని॥

9. యెరుషలేము యెహోవాను – సీయోను నీ దేవుని
కీర్తించుము కొనియాడుము – ఆనందించువాడని ॥దేవుని॥

10. పిల్లల నాశీర్వదించియు – బలపరచు నీగుమ్మముల్
మంచి గోధుమపంటతో – నిన్ను తృప్తిగనుంచును ॥దేవుని॥

11. భూమికి తన యాజ్ఞను –ఇచ్చువాడు ఆయనే
వేగముగను దేవుని – వాక్యము పరుగెత్తును ॥దేవుని॥

12. వాక్యమును యాకోబుకు తెలియచేసినవాడని
ఏ జనయు కీలాగున – చేసి యుండ లేదని ॥దేవుని॥

## 658

ప॥ దేవుని వారసులం – ప్రేమ నివాసులము
జీవన యాత్రికులం – యేసుని దాసులము – నవయుగ
సైనికులం – పరలోకపౌరులము హల్లెలూయ –నవయుగ

1. దారుణ హింసలలో –దేవుని దూతలుగా
ఆరని జ్వాలలో – ఆగని జయములతో – మారని ప్రేమ
సమర్పణతో – సర్వత్ర యేసును కీర్తింతము ॥దే॥

2. పరిశుద్ధాత్మునికై – ప్రార్థన సలుపుదము
పరమాత్ముని రాక – బలము ప్రసాదింప – ధరణిలో ప్రభువును
జూపుటకై సర్వాంగహోమము జేయుదము ॥దే॥

3. అనుదిన కూటములు – అందరి గృహములలో
ఆనందముతోను ఆరాధనలాయో– వీనులవిందగు పాటలతో
ధ్యానము చేయుచు మరియుదుము ॥దే॥



4. సజీవ సిలువ ప్రభు సమాధి గెలుచుటచే
విజేత ప్రేమికులం – విధేయ బోధకులం – నిజముగ రక్షణ
ప్రబలుటకై – ధ్వజముగ సిలువను నిలుపుదము ॥దే॥

5. గోధుమ గింజవలె – క్రీస్తుడు చావగను
నాధుని మరణములో – శాశ్వత జీవమును – నిధులుగ పండించి
లేవగను – మాధుర్య రక్షణ లభియించెను ॥దే॥

6. హతసాక్షుల కాలం – అవనిలో చెలరేగ
గతకాలపు సేవ – గొల్గొత గిరి – భీతులలో బహురీతులలో
నూతన లోకము కాంక్షింతుము ॥దే॥

7. ప్రభువును చూచుటకై – ప్రజలందరు రాగ
విభు మహిమను గాంచ విశ్వమే మముగోర – శుభములు
గూర్చుచు మాలోన –శోభిల్లుయేసును జూపుదము ॥దే॥

## 659

ప॥ దేవుని స్తుతియించుడి – ఎల్లప్పుడు
దేవుని స్తుతియించుడి ॥దే॥

1. ఆయన పరిశుద్ధ ఆలయమందు – ఆయన సన్నిధిలో ఆ ఆ ॥దే॥
2. ఆయన బలమును ప్రసిద్ధి చేయు – ఆకాశవిశాలమందు ఆ ఆ ॥దే॥
3. ఆయన పరాక్రమ కార్యమున్ బట్టి – ఆయనప్రభావమును ॥దే॥
4. బూరధ్వనితో ఆయనన్ స్తుతించుడి – స్వరమండలముతో ఆ ఆ ॥దే॥
5. సన్నతంతుల సితారతోను – చక్కని స్వరములతో ॥దే॥
6. తంబురతోను – నాట్యముతోను తంతి వాద్యముతోను ఆ ఆ ॥దే॥
7. పిల్లనగ్రోవులు చల్లగనూది – ఎల్లప్రజలు జేరి ॥దే॥
8. మ్రోగుతాళములతో ఆయనన్ స్తుతించుడి–గంభీర తాళముతో ఆ ఆ ॥దే॥
9. సకల ప్రాణులు యెహోవాను స్తుతించుడి – హల్లెలూయా
ఆమెన్ ఆ ఆ హల్లెలూయా ఆమెన్ ఎల్లప్పుడు ॥దే॥

## 660

ప॥ దొరుకుతావురా సహోదరా! దొరుకుతావురా; నీవు
తరిమి తరిమి కీడుచేయ – పరుగులెత్తినగాని తుదకు ॥దొ॥

1. చిన్న చూపు చూచి తమ్ముని– కన్నెఱుంగక చంపినగాని
అన్న కయీను దేవుని – హస్తమునకు దొరికిన రీతిగా ॥దొ॥

2. వరములొందిన తమ్ముని – జంప–వలయునని పంతముగబట్టి
నరకవచ్చిలోబడి యేడ్చిన – దురిత చరితుని యేశావువలె ॥దొ॥

3. భక్త దావీదును బట్టి – ప్రాణము దీయగ దలచిన తన
శక్తితో తరిమిన రాజగు –సౌలు దొరికినరీతిగాను ॥దొ॥

4. విగ్రహమునకు మ్రొక్కని దైవ – పిల్లల నగ్నిలోపడవైచి
ఆగ్రహించిన నెబుకద్నెజరు – గడ్డిమేసి దొరికిన విధముగ ॥దొ॥

5. క్రైస్తవులను బట్టి కొట్టి – ఖైదులో వేయదలచినను
వాస్తవమగు వెలుగును జూచి –ప్రభుని చాటిని పౌలుబోలి ॥దొ॥

6. కీడుచేయబోకు మెపుడు – కీడు నీకే కీడు కీడు
కీడు చేసినమేలుచేసి – కీడును జయింపకపోతే ॥దొ॥

7. మాటలు కుదిరితే మాటలు – కోటలు కుదురును నీకు
మాటలలో లోటుంటే – నోటిమాట తప్పకుండ ॥దొ॥

8. దొంగతనము వ్యభిచారమునకు – లొంగి శాపగ్రస్తులునై
దొంగిలించిన దశమభాగమే – లొంగుట కారణమని తుదకు ॥దొ॥

9. కొంతయిచ్చిన దశమభాగ – మంత యిదియని తప్పుకున్న
కొంతయిచ్చిన కయీనువలె – కొంతయిచ్చిన అననియవలె ॥దొ॥

10. చెడుగుచేసి బదులు దానిని – చేసినారని చెప్పమన్న వడిగ
దేవుని న్యాయమనెడి – పరమత్రాసులో నిలువండి ॥దొ॥



## 661

ప॥ నడిపించు నానావ – నడిసాంద్రమున దేవా
నవజీవన మార్గమున – నాజన్మ తరియింప ॥నడిపించు॥

1. నా జీవిత తీరమున – నా యపజయ భారమున
నలిగిన నా హృదయమును – నడిపించు లోతునకు
నా యాత్మ విరబూయ – నా దీక్ష ఫలియింప
నా నావలో కాలిడుము – నా సేవ జేకొనుము ॥నడిపించు॥

2. రాత్రంతయు శ్రమపడినా – రాలేదు ప్రభు జయము
రహదారులు వెదకినను – రాదాయెను ప్రతిఫలము
రక్షించు నీ సిలువ – రమణీయ లోతులలో
రతనాలను వెదకుటలో – రాజిల్లు నా పడవ ॥నడిపించు॥

3. ఆత్మార్పణ చేయకయే – ఆశించితి నీ చెలిమి
అహమును ప్రేమించుచునే – అరసితి ప్రభు నీ కలిమి
ఆశ నిరాశాయే – ఆవేద నెదురాయే
ఆధ్యాత్మిక లేమిగని – అల్లాడె నావలలు ॥నడిపించు॥

4. ప్రభు మార్గము విడచితిని – ప్రార్థించుట మానితిని
ప్రభు వాక్యము వదలితిని – పరమార్థము మరచితిని
ప్రపంచ నటనలో – ప్రావీణ్యమును బొంది
ఫలహీనుడనై యిపుడు – పాటింతు నీమాట ॥నడిపించు॥

5. లోతైన జలములలో – లోతున వినబడు స్వరమా
లోబడుటను నేర్పించి – లోపంబును సవరించి
లోనున్న ఈవులలో – లోతైన నా బ్రతుకు
లోపించని యర్పణగా – లోకేశజేయుమయ ॥నడిపించు॥

6. ప్రభు యేసుని శిష్యుడనై – ప్రభు ప్రేమలో పాదుకొని
ప్రకటింతును లోకములో – పరిశుద్ధుని! ప్రేమకథ
పరమాత్మ ప్రోక్షణతో – పరిపూర్ణ సమర్పణతో
ప్రాణంబును ప్రభు కొరకు – పానార్పణము చేతు ॥నడిపించు॥

## 662

ప॥ నమ్మవద్దు – నమ్మవద్దు ఈ మాయలోకం – నమ్మవద్దు
ఇది – ఆశజూపి మోసం జేయు – ఈ మాయలోకం గనుక ॥నమ్మ॥

1. మిమ్మునుగన్న తల్లి యేది – మిమ్మునుగన్న తండ్రియేడి
నాతోడబుట్టిన తోడులు యేరి – వార్ని
కాటికి మోసిన కోటప్ప లేరి – గనుక ॥నమ్మ॥

2. మీరు కట్టిన యిండ్లు ఏవి మీరు – కట్టిన కోటలు
ఏవి – కొట్టి తిన్న పొట్టలు ఉన్నవా?
మెట్టలు పల్లాలవ్వక మానునా – గనుక ॥నమ్మ॥

3. మీరు త్రవ్విన బావులు ఏవి – మీరు త్రాగిన నదులు ఏవి
ఏరులు ఎండకుండునా? కారులు మరచెడకుండునా – గనుక ॥నమ్మ॥

4. మీరు కట్టిన బట్టలు – ఏవి – చుట్టి త్రాగిన చుట్టలు ఏవి –
కట్టినబట్ట మట్టికెకదా? చుట్టిన చుట్ట అగ్గికి కదా – గనుక ॥నమ్మ॥

5. మనం మట్టినుండి తీయబడితిమి – మట్టితో పుట్టబడితిమి – ఎట్టి
బ్రతుకు బ్రతికినగాని కట్టెకాటికి పదపదరన్నా – గనుక ॥నమ్మ॥

6. యేసు ప్రభుని నమ్మండిప్పుడే – మోసపోకుడి ఈ ధరణిలో –
ప్రయాసపడి భారమును మోసెడి ఓ ప్రజలారా – గనుక ॥నమ్మ॥

## 663

1. నరకమనునది – నిరంతముండునయో
ఆ ఘోరనరకము –నందు పాపులు బాధపడుదురయో
మరియు నగ్ని పురుగులందున –కొరుకు చుండును తరుగులేకను
ధరణికాదిది దరియుకాదు – మరణమెదకిన దొరకదందున ॥న॥

2. గప్పు గప్పున రగులుచుండునయ్యో – ఆ ఘోరనరకము
నిప్పులెగయుచు – పొంగుచుండునయ్యో మబ్బువలె పొగ
పైకిలేచును – అబ్బా! అబ్బాని యేడ్చుచుందురు బొబ్బలిడు
దురు అడ్డమొచ్చెడి – అబ్బలెవరు కానరందున ॥న॥



3. నోరులెత్తి కొట్టుకొందురయ్యో – ప్రభు యేసు క్రీస్తును
నమ్మనందుకు నొచ్చుకొందురయ్యో – పురుగు చావదు
అగ్ని ఆరదు కొరుకుచుందురు – పండ్లు పట పట తిరిగితిరిగి
చూచుచుందురు –పరుగులెత్తక యేడ్చు చుందురు ॥న॥

## 664

ప॥ నాదు జీవమాయనే – నా సమస్తము
నా సర్వస్వము యేసుకే – నాదు జీవము
నాదు దైవము దివి దివ్య తేజము

1. కృంగినవేళ భంగపడినవేళ – అద్దరికి చేర్చెను
చుక్కానిలేని నావవలె నేనుండ అద్దరికి చేర్చెను
ఆత్మతో నింపెను ఆలోచన చేసెను ॥నాదు॥

2. సాతాను ఖైదీనై కుములుచున్న వేళ
విడిపించే శ్రీ యేసుడే – రక్తమంత కార్చి
ప్రాణాన్ని బలిచేసి – విమోచన దయచేసెను
సాతానుని అణగద్రొక్క అధికార బలమిచ్చెను ॥నాదు॥

3. కారుమేఘాలే క్రమ్మినవేళ – నీతిసూర్యుడు నడుపును
తుఫానులెన్నో చెలరేగి లేచిన –నడుపును నా జీవితనావ
త్వరలో దిగివచ్చును – తరలిపోదుము ప్రభునితో ॥నాదు॥

## 665

ప॥ నా నిమిత్తమాయన – మహిని శ్రమలు పొందెను
ఘనధనముల రోసెను – అనుమతించె చావుకు

1. నా నిమిత్తమె (3) మరణ మాయెను
తన జీవమును నాకు – బలిగా ధారపోసెను ॥నా నిమి॥

2. గొఱ్ఱెపిల్ల రీతిగా – గొప్ప శాంతి జూపెను
ఉర్వినంత మోపినన్ –యోర్చె మౌనవృత్తిని ॥నా నిమి॥

3. అతడు దోషమెరుగుడు – అతడు కపటమెరుగడు
అయినను దేవుడు – అతని నలుగగొట్టెను ॥నా నిమి॥

4. అతడు యిలను పొందిన - అధిక దెబ్బలవలన్
క్షితిని నాకు కలిగెను - స్వస్థత మది రూఢీగా ॥నా నిమి॥

5. రోగముల్ భరించెను - వ్యసనములు వహించెను
బాగుగా నొత్తిడిన్ - బాధలన్ సహించెను ॥నా నిమి॥

6. గాయములను పొందెను - కాయమంత నొచ్చెను
హేయమైన నిందలన్ - ఎలమిలో సహించెను ॥నా నిమి॥

7. ఎదిగె నాయన - మన యెడల దీన వృత్తిని
సదనులమగు ప్రీతితో - సరకు చేయమైతిమి ॥నా నిమి॥

8. తన యనుభవమున్ - మనల దోషరహితులన్
చేయ నుద్దేశించెన్ - ప్రాణమర్పించెను ॥నా నిమి॥

## 666

ప॥ నా ప్రాణప్రియుడా యేసు రాజా
అర్పింతును నా - హృదయార్పణ
విరిగి నలిగిన ఆత్మతోను హృదయపూర్వక ఆరాధనతో - సత్యముగా

1. అద్భుతకరుడా ఆలోచన - ఆశ్చర్య సమాధాన ప్రభువా
బలవంతుడా బ..హు ప్రియుడా
మనోహరుడా మహిమరాజా - స్తుతించెదన్ ॥నా ప్రాణ॥

2. విమోచన గానములతో - సౌందర్య ప్రేమ స్తుతులతో
నమస్కరించి ఆరాధింతున్
హర్షింతును నే పాడెదను - నా ప్రభువా ॥నా ప్రాణ॥

3. గర్భమున పుట్టిన బిడ్డలన్ - కరుణింపక తల్లి మరచునా
మరచినగాని నీవెన్నడు
మరువవు విడువవు ఎడబాయవు - కరుణ రాజా ॥నా ప్రాణ॥

4. రక్షణాలంకారములను - అక్షయమగు నీ యాహారమున్
రక్షకుడా - నా కొసగితివి
దీక్షతో నిన్ను వీక్షించుచు - స్తుతింతును ॥నా ప్రాణ॥



5. నీ నీతిని నీ రక్షణను - నా పెదవులు ప్రకటించును
కృతజ్ఞతాస్తు ...తుల తోడ
నీ ప్రేమను నే వివరింతును - విమోచకా ॥నా ప్రాణ॥

6. వాగ్దానముల్ నాలో నెరవేరెన్ - విమోచించి నా కిచ్చితివే
పాడెదను ప్రహర్షింతును
హల్లెలూయ - హల్లెలూయ ॥నా ప్రాణ॥

## 667

ప॥ నా ప్రియ యేసునిపై ఆనుకొని - అరణ్య మార్గమున
నడుచుటయే - ఆనంద జీవితము ॥నా॥

1. లిల్లిపుష్పం షారోనురోజ - పరిశుద్ధమైన మాదు తండ్రి
పూర్ణరూప సౌందర్యుడే- కీర్తింపతగిన దేవ ॥నా॥

2. కన్యకలు ప్రేమించుదేవ - నా ప్రభునామము పరిమళమే
యేసుని వెనుక వచ్చితిమి - నన్ను ఆకర్షించెను ॥నా॥

3. ప్రేమధ్వజ మెగురుచుండగ - ప్రియునిసముఖము కలుగుటచే
జల్దరు వృక్షము క్రింద కలిగెను - ప్రియుని ఆదరణ ॥నా॥

4. నిద్రించు రాత్రిసమయమునందు - నిత్యం నా ఆత్మ మేలుకొని
నా తలుపు నొద్ద నిలచిన - యేసుని ప్రేమించెదన్ ॥నా॥

5. అగ్నిజ్వాల యేసుని ప్రేమ - మరణమువలె బలవంతమైనది
నీటి ప్రవాహమువలన - ఆప్రేమ చల్లారదు ॥నా॥

6. దీనస్థంభము వలె దిగివచ్చును -దేవకుమారుడు మహిమతో
ఘనులైన వారి రథమువలె పై కెగిరిపోదును ॥నా॥

## 668

ప॥ నా సంకటంబులన్నియు తీరిపోయె
సంహారదూత నన్ను దాటిపోయె

1. గొఱ్ఱెపిల్ల విలువైన రక్తములో
కడుగబడి నేను రక్షణ బొందితిన్ ॥నా సంక॥

2. ఫరోకు నేనింక దాసుడను కాను
పరమకానానుకు హక్కుదారుడను ॥నాసంక॥

3. మారాను మధురముగ మార్చినాకు
బండను పగులగొట్టి దాహం దీర్చెను ॥నా సంక॥

4. మనోహరముగ నున్న కానాన్ రాజ్యమే
అదే నాకు స్థిరమైన అవకాశము ॥నా సంక॥

5. ఆనందమే పరమానందమే
కానాన్ జీవితము నాకు ఆనందమే ॥నా సంక॥

6. అరణ్యజీవితమున యేసు నాయకుడు
ప్రతిదినం నూతనమన్నా ఆయన యిస్తాడు ॥నాసంక॥

7. నా బలము నా ఆశ్రయము
నా రక్షణ యేసయ్య – హల్లెలూయా ॥నా సంక॥

# 669

ప॥ నీ చేతితో నన్ను పట్టుకో – నీ ఆత్మతో నన్ను నడుపు
శిల్పిచేతిలో శిలను నేను – అనుక్షణము నన్ను చెక్కుము

1. అంధకార లోయలోన – సంచరించిన భయము లేదు
నీ వాక్యమ శక్తిగలది – నాత్రోవకు నిత్యవెలుగు ॥నీ॥

2. ఘోరపాపిని నేను తండ్రి – పాప యూబిలో పడియుంటిని
లేవనెత్తుము శుద్ధిచేయుము – పొందనిమ్ము నీదు ప్రేమను ॥నీ॥

3. ఈ భువిలో రాజు నీవే – నా హృదిలో శాంతినీవే
కుమ్మరించుము నీదు ఆత్మను – జీవితాంతము సేవచేసెదన్ ॥నీ॥

# 670

ప॥ నే యేసుని వెంబడింతునని – నేడేగా నిశ్చయించితిని – నే వెను
దిరుగన్ – వెనుకాడన్ – నేడేసుడు పిల్చిన సుదినం ॥నే యే॥

1. నా ముందు శిలువ – నావెనుక లోకాశల్ – నాదే దారి – నా
మనస్సులో ప్రభు – నా చుట్టు విరోధుల్ నావారెవరు– నా
యేసుని మించిన మిత్రుల్ – నాకిలలో గానిపించరని ॥నే యే॥



2. కరువులైనను – కలతలైనను కలసిరాని
కలిమిలేములు – కలవరంబులు కలిగిననూ
కదలనింకా కష్టములైనా – వదలను నాదు నిశ్చయము ॥నే యే॥

3. శ్రమయనను బాధలైనను – హింసయైన
వస్త్రహీనత – ఉపద్రవములు ఖడ్గములైన
నా యేసుని ప్రేమనుండినను – యెడబాపెటివారెవరు ॥నే యేసు॥

# 671

1. పరమజీవము నాకు నివ్వ – తిరిగి లేచెను నాతో నుండ
నిరంతరము నన్ను నడిపించును – మరల వచ్చి యేసు కొని పోవును ॥యేసు॥

ప॥ యేసు చాలును – యేసు చాలును
యే సమయమైన యే స్థితికైన
నా జీవితములో యేసు చాలును

2. సాతాను శోధనలధికమైన – సొమ్మసిల్లక సాగి వెళ్ళెదను
లోకము శరీరము లాగినను – లోబడక నేను వెళ్ళెదను ॥యేసు॥

3. పచ్చిక బయలులో పరుండజేయున్ – శాంతి జలము చెంత
నడిపించును – అనిశము ప్రాణము తృప్తిపరచున్ – మరణ
లోయలో నన్ను కాపాడును ॥యేసు॥

4. నరులెల్లరు నన్ను విడిచినను – శరీరము కుళ్ళి కృశించినను
హరించినన్ నా ఐశ్వర్యము – విరోధివలె నన్ను విడచినను ॥యేసు॥

# 672

ప॥ పాడెద దేవ – నీ కృపలన్ – నూతన గీతములన్
స్తోత్రము చెల్లింతున్ (2) ఆ..ఆ..ఆ...(2)

1. భూమి పునాదులు వేయకముందే యేసులో చేసితివి
ప్రేమ పునాదులు వేసితివి దీనుని బ్రోచితివి
ఈ దీనుని బ్రోచితివి ॥పా॥

2. ప్రవిమల రక్తము కలువరి సిలువలో కలునకు నిచ్చితివి
ప్రేమకృప మహదైశ్వర్యములతో పాపము తుడిచితివి
నా పాపము తుడిచితివి ॥పా॥

3. పాపము శాపము నరకపు వేదన మరి తొలగించితివి
అపరాధములచే చచ్చిన నన్ను ధర బ్రతికించితివి
నన్ను బ్రతికించితివి ॥పా॥

4. దేవుని రాజ్యపు వారసుడనుగా క్రీస్తులో చేసితివి
చీకటి రాజ్యపు శక్తుల నుండి నను విడిపించితివి
చెరవిడిపించితివి

5. ముద్రించితివి శుద్ధాత్మతో నను భద్రము చేసితివి –
సత్యస్వరూపి నిత్యనివాసి సొత్తుగా చేసితివి
నీ సొత్తుగా చేసితివి ॥పా॥

6. అన్యుడనై నిన్ను ఎరుగక యున్నను ధన్యుని చేసితివి
ప్రియ పట్టణ పౌరుల సేవింపను వరముల నొసగితివి
కృప వరముల నొసగితివి ॥పా॥

# 673

ప॥ ప్రజలమే వేగమె రారె – నిజదైవమును కనుగొనరె ॥
అ॥ప॥ ప్రతివాడు మోక్షము జేర – ప్రభు యేసు వార్తను వినరె ॥

1. పాపాత్ములనబడు వారి – భారంబు దీయనుగోరి
ప్రభుయేసు జూపినదారి – పరమందు సుఖమిడుదారి ॥ప్రజ॥

2. ఏ జాతివారలనైనన్ – యే దేశవాసులనైనన్
యేమైన బేధము లేక – యేసయ్య బ్రోచునువేగ ॥ప్రజ॥

3. పాపాత్ములే తన సుతులు – ప్రభు యేసునికి స్నేహితులు
నీ పాపమెల్లను బోయెన్ – నీకింక మోక్షము కలుగున్ ॥ప్రజ॥

4. ప్రయాసపడి భారమును – మోసెడు ఓ ప్రజలారా
ప్రభుయేసుక్రీస్తే మీకు – విశ్రాంతి నిచ్చునురండి ॥ప్రజ॥

5. యేసయ్యగాకను వేరే – యెవరైన లేరిక రారే
దోషంబులలెల్లను బాపి – ఆశీర్వదించునుగాచి ॥ప్రజ॥



# 674

ప॥ ప్రభు ప్రేమ తొలికేక – హృదయంలో ప్రతిధ్వనియించే
పాపక్షమా యేసునిలో – శరణు నొసంగుచు కనిపించే

1. పాపవికారము పొడసూప – జీవితవిలువలు మరుగాయె
ఫలితముగా లోకములో – బ్రతుకుటయే నాగతియాయె
పలువురిలో కనబడలేకా – దాహముతో నేనొంటరిగా
బావికని పయనింప – నాదుని దర్శనమెదురాయే
పావనుడు దాహముతో – జలమును ఇమ్మని ననుగోరె ॥ప్ర॥

2. జాతిని చూడని నేత్రముతో –పాపము శోకని హృదయముతో
జాలిని చాటించుచునే – తాకెను నామది వేదనతో
జాప్యము చేయక తెమ్మనియే – దాచుకొనిన నాపాపమును
జడియచునే తెలిపితిని –ప్రభు వెరిగిన నా నిజస్థితిని
జయమొందె నాతనువూ – సరిగ నుడితవని ప్రభు తెలుపా

3. దేహమునే నాసర్వముగా – భావించుచు మది పూజింపా
దినదినము జీవితమూ – చావుగ మారిన కాలములో
దేవునిగా నా బంధువుగా – మరణప్రవాహము ఛేధించి
దరిజేర్చి దీవించి – నూతన జన్మ ప్రసాదించే
దయ్యాల కుహరమును – స్తుతి మందిరముగ రూపించే ॥ప్ర॥

4. పాపము దాగును నాబావి –లోతును చూచినదెవరు
పోరాటవాటికయౌ – నా బ్రతుకును ఎరిగినవారెవరు
పాపికిని పాపమునకునూ – భేదము చూపిన వారెవరూ
పాపిని కాపాడుటకు – సిలువను మోసిన వారెవరూ
ప్రకటించె దైవకృప – తెరచెను జీవన జలనిధులు ॥ప్ర॥

5. ఘటముతో వెడలితి నొంటరిగా – పితరుల త్రానజనములకై
కనబడెను బావికడ – రక్షణయూటల ప్రభుయేసు
కుండను వీడి పరుగిడితి బావిని చేకొని హృదయములో
ఘనమైన శుభవార్త – ఆతృతతో ప్రజలకు తెలుసా
గ్రామప్రజా కనుగొనిరి – విశ్వవిమోచకుడగు యేసున్ ॥ప్ర॥

# 675

పII ప్రభు యేసుని వదనములో నా దేవుని రాజ్యములో
పరికించిన శుభదినము గమనించిన యాక్షణము
పరలోకముకై చిరజీవముకై - ప్రార్థించెను నా హృదయం

2. దిశలన్నియు తిరిగితిని నాపాపపు దాహముతో
దౌష్ట్యములో మసలుచును దౌర్జన్యము చేయుచును
ధన పీడనతో మృగ వాంఛలతో దిగజారితి చావునకు

3. యేసు నీరాజ్యములో భువి కేతెంచెడి రోజు
ఈ పాపిని క్షమియించి జ్ఞాపకముతో బ్రోవుమని
ఇల వేడితిని విలపించుచును ఈడేరును నా వినతి ॥ప్రభు॥

4. పరదైసున ఈ దినమే నా ఆనందముతోను
పాల్గొందువు నీవనుచు వాగ్దానము చేయగనే (2)
పరలోకమె నా తుది వూపిరిగా పయనించితి ప్రభుకడకు
ప్రభు యేసుని వదనములో నా దేవుడు కనిపించె ॥ప్రభు॥

# 676

పII ప్రభువా! నే నిన్ను నమ్మి నిన్నాశ్రయించినాను
నరులేమి జేయగలరు భయమేమిలేదు నాకు

1. గర్విష్ఠులైనవారు - నాతో పోరాడుచుండ
ప్రతిమాట కెల్లవారు - పరభావ మెంచుచుండ
ప్రభువా నా ప్రక్కనుండి - నన్ను తప్పించినావు ॥ప్రభు॥

2. నేనెందుపోదుమన్నా - గమనించుచుండువారు
నా వెంట పొంచియుండి - నన్ను కృంగదీయ నెంచ
ప్రభువా! నా ప్రక్కనుండి - నన్ను తప్పించినావు ॥ప్రభు॥

3. పగబూని వారు నన్ను - హతమార్చ జూచియున్న
మరణంబునుండి నన్ను కడువింత రీతిగాను
ప్రభువా! నా ప్రక్క నుండి - నన్ను తప్పించినావు ॥ప్రభు॥



4. జీవంపు వెల్గునైన - నీ సన్నిధానమందు
నే సంచరించునట్లు - నే జారిపోకుండ
ప్రభువా ! నా ప్రక్కనుండి - నన్ను తప్పించినావు ॥ప్రభు॥

5. నన్నాదుకొంటి నీవు - నన్నాదరించినావు
కొన్నావు నీవు నన్ను - మన్నించినావు నీవు
ఎన్నాళ్ళు బ్రతికి యున్న - నిన్నే సేవింతు దేవా!

# 677

1. ప్రేమామృతధారలు చిందించిన యేసుకు సమమెవరు?
ఆ - ఆ - ఆ ప్రేమయెత్తానై నిలచి - ప్రేమవాక్కులనే బలికి
ప్రేమతో ప్రాణము బెట్టి - ప్రేమనగరికి చనియె ॥ప్రేమా॥

2. నిశ్చలమైన ప్రేమజీవికి - యిలలో తావేది
ప్రేమ ద్రోహులేగాని - ప్రియమున చేరరు వాని
చేరిన చెలికాడగురా - సమయమిదే పరుగిడరా ॥ప్రేమా॥

3. ఎంత ఘోరపాపాత్ములనైన -ప్రేమించునురారా
పాపభారముతో - రారా - పాదములపై బడరా
పాపుల రక్షకుడేసు - తప్పక నిను రక్షించున్ ॥ప్రేమా॥

4. ఇంత గొప్ప రక్షణను - నిర్లక్ష్యము చేసెదవేల?
రక్షణ దిన మిదియేరా - తక్షణమే కనుగొనరా
ఇదియే దేవుని వరము - ముదమారగ జేకొనుము ॥ప్రేమా॥

# 678

పII ప్రియయేసు నిర్మించితివి - ప్రియమార నా హృదయం
ముదమార వసించునా - హృదయాంతరంగమున

1. నీ రక్త ప్రభావమున - నా రోత హృదయంబును
పవిత్రపరచుము తండ్రీ - ప్రతిపాపమును కడిగి ॥ప్రియ॥

2. అజాగరూకుడనైతి - నిజాశ్రయమువిడిచి
కరుణారసముతో నాకై - కనిపెట్టితివి తండ్రి ॥ప్రియ॥

3. వికసించె విశ్వాసంబు - వాక్యంబును చదువగనె
చేరితి నీదుదారి - కోరి నడిపించుము ॥ప్రియ॥

# 679

ప॥ మణులు మాణిక్యములున్నా – మేడమిద్దెలు ఎన్నున్నా
మదిలో యేసులేకున్నా – ఏది ఉన్నా అది సున్నా ॥మణు॥

1. చదువులెన్నో చదివివున్నా – పదవులెన్నో చేస్తున్నా
విద్యవున్నా బుద్ధివున్నా – జ్ఞానమున్నా అది సున్నా ॥మణు॥

2. అందచందా లెన్నున్నా – అండములపై కూర్చున్నా
సుందరుడు ప్రభులేక యున్నా – అందమున్నా అది సున్నా ॥మణు॥

3. రాజ్యములు రమణులు ఉన్నా – శౌర్యములు వీర్యము
లున్నా – బలము ఉన్నా – బలగమున్నా ఎన్నివున్నా అవి సున్నా ॥మణు॥

4. పూజ్యుడా పుణ్యాత్ముండా – పుణ్యకార్య సిద్ధుడా
దానధర్మము జపము తపము – యేసులేనిది అదిసున్నా ॥మణు॥

# 680

ప॥ మధురం మధురం మధురం – యేసునాధ కథ మధురం ॥మన॥

1. మధురమే మన ప్రభు యేసుని నామం – మానవాళికదే
మాధుర్యమనామం – పాపిని బ్రోచెడి పావన నామం పరమున జేర్చే
పరిశుద్ధనామం ॥మన॥

2. మారని దేవుని మాటయే మధురం – మదిలోదలచిన కలతను
దీర్చున్ – ఎదలో బాధను బాపున్ నిరతం – నమ్మిననరులకు
నెమ్మది నిచ్చున్ ॥మ॥

3. పగలురేయి ప్రార్థించుటే మధురం పరిశుద్ధుల సహవాసమే
మధురం – అపోస్తలుల సద్బోధయే మదురం – మధురాతి
మధురం పరిశుద్ధ రుధిరం ॥మ॥

4. జుంటితేనెయ ధారలకంటే – కమ్మనిది ప్రభు క్రీస్తుని
వాక్యం – ఆదియందు ఆ వాక్యమే ఉండెన్ – వాక్యమే
ప్రియప్రభు యేసుగ మారెన్ ॥మ॥



5. అందరిలో అతిసుందరుడతడు – ఆది దేవుని ఏకైక సుతుడు
ఆశ్చర్యకరుడా ఆలోచన కర్త – అవతరించె భువిన్ అందరి కొరకే ॥మ॥

6. యేసే క్రీస్తుగ నెరిగిన మేము – పరుగిడితిమి పాపము నుండి
దూరం పొందితిమి ఆత్మానందభాగ్యం ప్రకటించుటే
మా ప్రధానధ్యేయం ॥మ॥

# 681

ప॥ మార్గము చూపుము ఇంటికి – నా తండ్రి యింటికి
మాధుర్య ప్రేమ ప్రపంచము – చూపించు కంటికి (2)

1. పాప మమతలచేత పారిపోయిన నాకు – ప్రాప్తించెక్షామము
పశ్చాత్తాపము నొంది తండ్రి క్షమగోరుచు – పంపుము
క్షేమము – ప్రభు నీదు సిలువముఖము చెల్లనినాకు పుట్టించే ధైర్యము

2. ధనమే సర్వంబనుచు సుఖమే స్వర్గంబనుచు – తండ్రిని వీడితి
ధరణీభోగములెల్ల బ్రతుకు ధ్వంసముజేయ – దేహి
నినుచేరితి – దేహి అని నీవైపు చేతులెత్తిననాకు దారినిజూపుము ॥మా॥

3. దూరదేశములోన బాగుండుననుకొనుచు – తప్పితి మార్గము
తరలిపోయిరి నేను నమ్మినహితులెల్ల – తరిమే దారిద్ర్యము
దాక్షిణ్యమూర్తి నీదయ నాపై కురిపించి – ధన్యుని జేయుము ॥మా॥

4. అమ్ముకొంటిని నేను అధముడొకనికి నాడు – ఆకలిబాధలో
అన్యాయమయిపోయె పందులు సహవెలివేయ – అలవడెను
వేదన – అడుగంటె అవినీతి మేల్కొనియె మానవత
ఆశ్రయము గూర్చుము ॥మా॥

5. కొడుకునే కాదనుచు గృహమే చెరసాలను – కోపించి
వెళ్ళితి – కూలివానిగనైన నీ యింట పనిచేసి – కనికరమే
కోరుదు – కాదనకు నా తండ్రి దిక్కెవ్వరును లేరు –
క్షమియించు బ్రోవుము ॥మా॥

6. నా తండ్రి ననుజూచి పరుగిడుచు ఏ తెంచి – నాపై బడి ఏడ్చెను
నవజీవమును కూర్చి యింటికి తోడ్కొనివెళ్ళి నన్ను
దీవించెను – నా జీవిత కథయంత యేసు ప్రేమకు ధరలో
సాక్ష్యమై యుండును ॥మా॥

# 682

ప॥ యెహోవా నా బలమా యథార్థమైనది నీ మార్గం
పరిపూర్ణమైనది నీ మార్గం ॥యెహోవా॥

1. నా శత్రువులు నను చుట్టినను – నరకపు పాశములరికట్టినను
వరదవలె భక్తిహీనులు పొర్లిన – వదలక నను
ఎడబాయని దేవా ॥యెహోవా॥

2. మరణపు టురువులు మరువక – మొరలిడ ఉన్నతదుర్గమై
రక్షణ శృంగమై తన ఆలయములో నా మొరవినెను
అదిరెను ధరణి భయకంపముచే ॥యెహోవా॥

3. నా దీపమును వెలిగించువాడు – నా చీకటిని వెలుగుగ
జేయున్ జలరాసులనుండి బలమైన చేతితో – వెలుపల
జేర్చిన బలమైన దేవుడు ॥యెహోవా॥

4. పౌరుషము గల ప్రభు కోపింపగ పర్వతముల పునాదులు
వణకెను తన నోటి నుండి వచ్చిన అగ్ని – దహించివేసెను
వైరుల నెల్లను ॥యెహోవా॥

5. మేఘములపై ఆయన వచ్చును – మేఘములను
తన మాటుగ జేయును ఉరుముల మెరుపుల మెండుగ జేసి
అపజయమిచ్చును అపవాదికిని ॥యెహోవా॥

6. దయగలవారిపై దయచూపించును – కఠినుల యెడల
వికటము జూపును గర్విష్టుల యొక్క గర్వము నణచును
సర్వము నెరిగిన సర్వాధికారి ॥యెహోవా॥

7. నా కాళ్ళను లేడికాళ్ళగ జేయును – యెత్తైన స్థలములో
శక్తితో నిలిపి రక్షణ కేడెము నాకందించి – అక్షయముగ
తన పక్షము జేర్చిన ॥యెహోవా॥

8. యెహోవా జీవము గల దేవా – బహుగ స్తుతులకు
అర్హుడ నీవు అన్యజనులలో ధన్యతజూపుచు – హల్లెలూయా
స్తుతిగానము జేసెద ॥యెహోవా॥



# 683

ప॥ రమ్మనుచున్నా డేసురాజు – రండి సర్వ – జనులారా

1. ఇల్లువాకిలి లేనివారలు – ఇహాన నమ్మదగనివారలు
తన రాజ్యము మీకిచ్చును యేసు

2. కరవుచే కృశించుచున్న మరణించుచున్న ప్రజలారా
ఆకలిదప్పులు తీర్చును మీకు రండి సర్వజనులారా ॥రమ్మను॥

3. ముండ్ల మకుటము ప్రక్కన గాయము – పాదహస్తములలో
గాయములు– పొందిన ప్రభువే పిల్చెను మిమ్ము రండి
సర్వజనులారా ॥రమ్మను॥

4. రయమున ప్రియులారా కూడి – రండి పరీక్ష చేయండి
భరించును మీ భారములన్నియు రండి సర్వజనులారా ॥రమ్మను॥

# 684

ప॥ రమ్ము ! నీ తరుణమిదే – పిలచుచున్నాడు
నీ ప్రభువైన – యేసు నొద్దకు

1. జీవితమంతయు – వ్యర్థముగను దుఃఖముతోను
గడుపుటయేల – వచ్చి ఆయన శరణు జొచ్చినచో
వాంఛతో నిన్ను –స్వీకరించున్ ॥రమ్ము॥

2. కట్టిన యిల్లు – ధనధాన్యములు కనబడు బంధుమిత్రులును
గూడు విడిచి – నీవు పోయినచో – వెంటనీతో రారెవరు ॥రమ్ము॥

3. అందము మాయ – అస్థిరమే – దాని నమ్మకుము మోసగించును
మరణము ఒకనాడు వచ్చును మరువకు – నీ ప్రభువును ॥రమ్ము॥

4. మిన్ను క్రిందన్ – భూమి మీదన్ – మిత్రుడేసు నామముగాక
రక్షణ పొందు – దారిలేదు రక్షకుడేసే – మార్గము ॥రమ్ము॥

5. తీరని పాపవ్యాధులను – మారని నీదు – బలహీనతల్ ఘోర
సిలువలో – మోసితీర్చెన్ – గాయములచే బాగుపడన్ ॥రమ్ము॥

6. సత్యవాక్కును నమ్మి రమ్ము – నిత్యజీవనమును నీకిచ్చున్
నీ పేరు జీవపుస్తకమునందు నిజముగ ఈనాడే – వ్రాయున్ ॥రమ్ము॥

## 685

ప॥ రండి రండి యేసుని యొద్దకు రమ్మనుచున్నాడు
ప్రయాసపడి భారము మోయువారలు
ప్రభుని చెంతకు పరుగిడి వేగమే

1. యేసుని పిలుపు వినియు నింక –యోచింపరేల
అవనిలో అగచాట్లపాలైన అబ్బదుశాంతి ఆత్మకు నిలలో ॥రండి॥

2. కరువు రణము మరణము చూచి కలుగదు మారుమనస్సు
ప్రవచనములు సంపూర్ణములాయెను యూదులు తిరిగి చ్చుచున్నారు ॥రండి॥

3. ప్రభుయేసు నీ కొరకై తనదు – ప్రాణము నిచ్చెగదా
సిలువను రక్తము చిందించియును
బలియాయెను యాఘనుడు మనకై ॥రండి॥

4. యేసుని నామమునందే పరమ – నివాసము దొరకును
ముక్తిని పాప విమోచనమును
శక్తిమంతుడు యేసే యిచ్చును ॥రండి॥

5. నేనే మార్గము, నేనే సత్యము – నేనే జీవమును
నేను గాకింకెవరు లేరని యెంచి చెప్పిన యేసుని వద్దకు ॥రండి॥

## 686

ప॥ రేయింపగలు నీ పదసేవే – యేసు ప్రభువా – చేయుటమేలు
సాటిలేని దేవుడ నీవె – నాదు కోట కొండయు నీవె

1. పరమపురిలో వరదా నిరతం – దూతగణముల స్తుతులను సల్పి
శుద్ధుడ పరిశుద్ధుడనుచు – పూజనొందె దేవుడ నీవె ॥రేయి॥

2. జిగటమన్నే మానవులంతా – పరమకుమ్మరి ప్రభుడవు నీవే
సృష్టికర్తను మరచి జనులు – సృష్టిని పూజించుట తగునా ॥రేయి॥

3. పెంటకుప్పలనుండి దీనుల – పైకిలేపు ప్రభుడవు నీవే
గర్వమణచి గద్దెలు దింపి– ఘనులనైనా మేపవ గడ్డి ॥రేయి॥

4. నరుల నమ్ముట కంటె నిజముగ – నీదు శరణం శరణం దేవా
రాజులను ధరనమ్ముటకంటె – రాజరాజవు నాకాశ్రయము ॥రేయి॥



5. అగ్నివాసనసంటకుండా – అబెద్నగోలతో నుండి నదేవా –
దానియేలును సింహపుబోనులో – ఆదుకొన్న నాధుడనీవె ॥రేయి॥

6. పరమగురుడవు ప్రభులకు ప్రభుడవు – వరము చేర్పు పదము నీవే
అడుగుజాడల నడచిన – హనోకు – పరముచేరె ప్రాణముతోడ ॥రేయి॥

7. మృతుల సహితము లేపినావు – మృతినిగెల్చి లేచినావు
మృతులనెల్ల లేపేవాడవు – మృత్యువును మృతిలేపినావు ॥రేయి॥

## 687

ప॥ లేచినాడురా – సమాధి గెలిచినాడురా – యేసు
లేచినాడురా – సమాధి గెలిచినాడురా

అ॥ప॥ లేతునని తా జెప్పినట్టు – లేఖనములలో పలికినట్లు ॥లేచి॥

1. భద్రముగ సమాధిపైని – పెద్దరాతిని యుంచిరి భటులు
ముద్రవేసి రాత్రియంత నిద్రలేక కావలియున్న ॥లేచి॥

2. ప్రభువు దూత పరమునుండి – త్వరగ దిగి రాతిని పొర్లించి
భళిర దానిపై కూర్చుండె – భయము నొంద కావలివారు ॥లేచి॥

3. ప్రొద్దు పొడవకముందే స్త్రీలు సిద్ధపరచిన సుగంధములు
శ్రద్ధతోడ తెచ్చి యేసుకు – రుద్దుదామని వచ్చిచూడ ॥లేచి॥

4. చూడవెళ్ళిన స్త్రీలను దూత – చూచి యపుడే వారితోడ
లేదు గలిలయ ముందుగ పోతున్నాడు – అపుడె లేచినాడని ॥లేచి॥

5. చచ్చిపోయి లేచినాడు – స్వామిభక్తు లకగుపడినవాడు
చచ్చినను నను లేపుతాడు – చావు అంటె భయపడరాదు ॥లేచి॥

6. నేను చేసే పనులనెరుగు – నేను నడిచే మార్గమెరుగు
నేను చెప్పు మాటలెరుగు – నేనుబ్రతికే బ్రతుకునెరుగు ॥లేచి॥

7. నేను లేచిన యేసునందు – మానక మదినమ్ము కొందు – తాను
నాలోయుండినందున – దయను జేర్చును మోక్షమందు ॥లేచి

8. పాపభారము లేదు మనకు మరణ భయము లేదు మనకు
నరకబాధ లేదు మనకు – మరువకండి యేసుప్రభుని ॥లేచి॥

9. యేసునందే రక్షణభాగ్యం – యేసునందే నిత్యజీవం
యేసునందే ఆత్మశాంతి – యేసునందే మోక్షభాగ్యం ॥లేచి॥

10. పాపులకై వచ్చినాడు – పాపులను కరుణించాడు
పాపులను ప్రేమించానాడు – ప్రాణదానము చేసినాడు ॥లేచి॥

# 688

ప॥ వెండి బంగారములకన్న – యేసుని కలిగియుండెదము
వెలగల బూషణములకన్న – యేసుని కలిగియుండెదము

1. అడవిరాజు తన పిల్లలను – లేమి కలిగి ఆకలిగొనును
దేవుని ఆశ్రిత జనులకు ఎప్పుడు – మేలులు కొదువై యుండవుగా ॥వెండి॥

2. మన ప్రభువుండు మహదేవుండు – ఘనమహోత్యము గలరాజు
రక్షణ కర్త ప్రధానకాపరి– ఆయన మేపెడి గొఱ్ఱెలము ॥వెండి॥

3. వారి గుఱ్ఱములు రథములను – బట్టి జనులు గర్వించెదరు
మనమైతే మన దేవుని నీతి – న్యాయములను శ్లాగించెదము ॥వెండి॥

# 689

1. సర్వకృపానిధియగు ప్రభువా – సకల చరాచర సంతోషమా
స్తోత్రము చేసి స్తుతించెదము – సంతోషముగ నిను పొగడెదము ॥సర్వ॥

ప॥ హల్లెలూయ హల్లెలూయ హల్లెలూయ హల్లెలూయా
హల్లెలూయ యని పాడెదను ఆనందముతో నేను సాగెదను

2. ప్రేమించి నన్ను వెదకితివి – ప్రీతితో నన్ను రక్షించితివి
పరిశుద్ధముగ జీవించుటకై – పాపిని నన్ను కరుణించితివి ॥సర్వ॥

3. అల్పకాల శ్రమలనుభవింప – అనుదినము కృపనిచ్చితివి
నాథుని అడుగుజాడలలో – నడుచుటకు నను పిలిచితివి ॥సర్వ॥

4. మరణ శరీరము మార్పునొంది – మహిమ శరీరము
పొందుటకై – మహిమాత్మతో నన్ను నింపితివి – మరణ భయములను
తీర్చితివి ॥సర్వ॥



# 690

ప॥ సర్వమేసు వే నాకు సర్వమేసు వే – సర్వదుఃఖ పరిహార –
సర్వమేసు వే – జీవమన్ – సజీవమున్ – సర్వమేరసునికి
దాయమే భావశుద్ధి – భాగ్యమొసగు భాస్కరుండేసుడే

1. సర్వమేసు వే నాకు సర్వ సర్వమేసువే
మాయలోకమందు మాకు – మాన్యుడేసుడే –
మా యాయువు కాలమందు – జీవమందు శోధనన్
నింద బాధలందు – విజయ మొసగు వంధ్యుడేసుడే ॥సర్వ॥

2. పావనాత్ముడే – యేసు వరంధాము – డే
పావనచరితుండు యేసు – పతితపావనుడే
పావమున్ హరించు పరమ – పావనుండు యేసుడే
పంచగాయ – మొందిన – పరమావతారదుడేసుడే ॥సర్వ॥

3. ఘోరపాపినే – నేను ఘోరపాపినే
ఘోరపాప నిర్యాణంబు – లందింపజేసెన్
పారగా నీ జీవరక్తం – గోరిమమ్మునందరిన్
పాపమిత్రులుగా చేయ – ప్రావుగోరియుంటిమి ॥సర్వ॥

# 691

ప॥ సాగిలపడి మ్రొక్కెదము – సత్యముతో – ఆత్మతో
మనప్రభు యేసుని – ఆ ఆ ఆ ॥సాగి॥

1. మోషేకంటే శ్రేష్ఠుడు – అన్ని – మోసములనుండి – విడిపించున్
వేషధారులను ద్వేషించున్ – ఆశతో – మ్రొక్కెదము ॥సాగి॥

2. అహరోనుకంటె శ్రేష్ఠుడు – మన ఆరాధనకు పాత్రుండు
ఆయనే ప్రధాన యాజకుడు – అందరము – మ్రొక్కెదము ॥సాగి॥

3. ఆలయముకన్న – శ్రేష్ఠుడు – నిజ – ఆలయముగ తానే యుండెన్
ఆలయము మీరేయనెను – ఎల్లకాలము మ్రొక్కెదము ॥సాగి॥

4. యోనాకంటె శ్రేష్ఠుండు – ప్రాణ – దానముగా తను అర్పించెన్
మానవులను విమోచించెన్ – ఘన పరచి మ్రొక్కెదము ॥సాగి॥

5. సొలోమోనుకన్న శ్రేష్ఠుడు – సర్వజ్ఞానమునకు ఆధారుండు
పదివేలలో అతిప్రియుండు – పదిలముగ మ్రొక్కెదము ॥సాగి॥

6. రాజులకంటే శ్రేష్ఠుండు యాజకులనుగా మనలను చేసెన్
రారాజుగ త్వరలో వచ్చున్ – రయముగను మొక్రెదము ॥సాగి॥

7. అందరిలో అతి శ్రేష్ఠుండు – మనకందరికి తానే ప్రభువు
హల్లెలూయకు పాత్రుండు – అనుదినము మ్రొక్కెదము ॥సాగి॥

## 692

ప॥ సీయోను పాటలు సంతోషముగను పాడుచు సీయోను వెళ్ళుదము

1. లోకాన శాశ్వతానందమేమియు – లేదని చెప్పెను ప్రియుడేసు
పొందవలె నీ లోకమునందు – కొంతకాల మెన్నో శ్రమలు ॥సీ॥

2. ఐగుప్తును విడిచినట్టి మీరు – అరణ్యవాసులై యీ ధరలో
నిత్యనివాసము లేదిలలోన – నేత్రాలు కానానుపై నిల్పుడి ॥సీ॥

3. మారానుపోలిన చేదైన స్థలముల – ద్వారా పోవలసియున్న
నేమి – నీరక్షకుండగు యేసే నడుపును – మారని తనదు
మాట నమ్ము ॥సీ॥

4. ఐగుప్తు ఆశల నన్నియు విడిచి – రంగుగ యేసుని
వెంబడించి పాడైన కోరహు పాపంబుమాని –విధేయులై విరాజిల్లుడి ॥సీ॥

5. ఆనందమయ పరలోకంబు మనది – అక్కడనుండి
వచ్చునేసు సీయోను గీతము సొంపుగ కలసి – పాడెదము
ప్రభుయేసుకు జై ॥సీ॥

## 693

ప॥ స్వచ్ఛంద సీయోనువాసి – సర్వాధికారి కస్తూరిపూ రాసి
అ॥ప॥ వర్తమాన భూత భవిష్యత్కాలవాసి – అల్ప ఓమేగ
తానే – అద్యంతము మన యేసే ॥స్వ॥

1. ఇదిగో నేనొక నిబంధనను – అద్భుతముగ జేతున్
నీ ప్రజలందరి యెదుట – పరిశోధింపజాలని మహా – పనులెల్ల
ప్రభు – వే – లెక్క లేని అద్భుతముల్ – మక్కువతో చేయువాడు ॥స్వ॥



2. సంగీతనాదములతోడ – సీయోనుపురము – సొంపుగను చేరితిమి
శాశ్వత సంతోషము – మా శిరములపై వెలసెన్ – దుఃఖము
నిట్టూర్పును పోయెన్ – మిక్కిలి ఆనందము కల్గెన్ ॥స్వ॥

3. నీలముల పునాదులు వేసి – నీలాంజనములతో
మాణిక్యమణులతో – సువర్ణ సునీయములతో
సూర్యకాంతముతో – ప్రశస్త రత్నములతో
ప్రవిమలముగా – నిను కట్టెదను ॥స్వ॥

4. సుమముల హారము – సంతోషానందతైలము నీవె
స్తుతి వస్త్రమును నీ – వే – ఉల్లాస వస్త్రంబు నీవే
విడుదలయు నీ వే – హితవత్సరము విముక్తి
ఆత్మాభిషేకము నీ వే ॥స్వ॥

5. జలములలో బడి దాటునపుడు బలమై యుండెదను
నీతోడై యుండెదను – నదులలో బడి వెళ్ళునప్పుడు
నీపై పొరపు – అగ్ని మధ్యను నడిచినను
జ్వాలలు నిను కాల్చగలేవు ॥స్వ॥

6. ఇత్తడి తలుపులు – పగులగొట్టెద – నినుప గడియలను
విడగొట్టెదను నేను – అంధకారస్థలములలో నున్నట్టి నిధులను
రహస్యములో మరుగైన – ధనమును నీ కొసంగెదను ॥స్వ॥

7. గర్భమున పుట్టినది మొదలు – తల్లి ఒడిలోన
కూర్చుండినది మొదలు – నేను చంక పెట్టుకున్న నాదు ప్రజ
లారా – ముదిమి వచ్చు వరకు నిన్ను – ఎత్తి కొనువాడను నేనే ॥స్వ॥

## 694

ప॥ స్తోత్రం చెల్లింతుము – స్తుతిస్తోత్రము చెల్లింతుము
యేసునాధుని మేలులు – తలంచి (2) ॥స్తోత్రం॥

1. దివారాత్రములు కంటిపాపవలె కాచి (2)
దయగల హస్తముతో – బ్రోచి నడిపించితివి (2) ॥స్తోత్రం॥

2. గాఢాంధకారములో కన్నీటి లోయలలో
కృశించిపోనీయక – కృపతో బలపరచితివి ॥స్తోత్రం॥

3. సజీవయాగముగా – మన శరీరము సమర్పించి
సంపూర్ణ శుద్ధినొంద – శుద్ధాత్మను నొసగితివి ॥స్తోత్రం॥

4. సీయోను మార్గములో పలుశోధనలు రాగా
సాతాన్ని జయించుటకు – విశ్వాసము నిచ్చితివి ॥స్తోత్రం॥

5. సిలువను మోసుకొని సువార్తను చేపట్టి
యేసుని వెంబడింప – ఎంత భాగ్యము నిచ్చితివి ॥స్తోత్రం॥

6. పాడెద హల్లెలూయా – మరనాత హల్లెలూయా
సద పాడెద హల్లెలూయ – ప్రభు యేసుకు హల్లెలూయా ॥స్తోత్రం॥

# 695

ప॥ సిలువ చెంత చేరినాడు కలుషములను కడిగివేయు – పౌలు
వలెను సీలవలెను సిద్ధపడిన – భక్తులజూచి

1. కొండలాంటి బండలాంటి మొండి హృదయములను
మండించు – పండియున్న పాపులనైన – పిలచుచుండె పరము చేర ॥సిలువ॥

2. వందగొఱ్ఱెల మందలో నుండి ఒకటి తప్పి ఒంటరియాయె
తొంబది తొమ్మిది గొఱ్ఱెల విడిచి – ఒంటరియైన గొఱ్ఱెను వెదకెన్ ॥సిలువ॥

3. తప్పి పోయిన కుమారుండు – తండ్రిన విడచి తర్లిపోయె
తప్పు – తెలిసి తిరిగిరాగ తండ్రియతని జేర్చుకొనియె ॥సిలువ॥

4. పాపిరావ పాపము విడచి పరిశుద్ధుల విందుల జేర – పాపుల
గతిని పరికించితివా – పాతాళంబె వారి యంతము ॥సిలువ॥

# 696

ప॥ సిలువ మోసినావా – శ్రమలకోర్చినావా – యేసునాధా
సత్యజీవం స్వర్గమునకు దారి ॥

అ॥ప॥ ఆహా – నాదోషములే – మహావేదన బెట్టెనా – మోక్ష
రాజా – సర్వసత్య సంపూర్ణ ప్రదీప

1. రాతియంతటను – రోదనముచే – గెత్సెమనే వనమందు – గడిపి
గొప్ప వేదనముతో – ప్రార్థింపగ తండ్రిని – ప్రాణనాధా
రక్తధారల్ – నాకై రాల్చినావా ॥సిలువ॥



2. కత్తుల్ గుదియలతో వచ్చినారా – కట్టికొట్టుచు నిన్ –
దిట్టినారా కండ్లగంతల్ కట్టి – కొరడాలతోను గొట్టి కఠినులంతా
ముండ్లమకుట మౌదుల మొత్తినారా ॥సిలువ॥

3. కొయ్య నెత్తి – కల్వరిగిరి వరకు మొయ్యమనుచు నిన్ – మరిమొత్తినారా
మూర్ఖులందరు నీదు – మోముపై నుమియు
చున్ – మోక్షనాధా యెరుషలేం – పురవీధుల త్రిప్పినారా ॥సిలువ॥

4. జీవజలముల్ – జీవమునిచ్చే దేవ – దాహమాయెన – ధరయందు
నీకు – చేదు కలిపినట్టి – ద్రాక్షారసమునిచ్చి – ద్రాగనునిరా
దాహము తీరెన – నీకు తండ్రి ॥సిలువ॥

5. పంచఖండంబు – ప్రజలన్ రక్షింప – పంచగాయంబులను పొంది
తుదకు – అప్పగింతున్ తండ్రి – ఆత్మనిదిగో యనుచు – జెప్పి
నాధా ఆత్మకై అర్పణనిచ్చినావా ॥సిలువ॥

6. మరణమై నీవు మరిలేచినావా – మరణపుముల్లన్ – మరివిరిచి
నావా –మాకు విజయంబిచ్చి – మోక్షపురికి మరలనరిగినావా
హల్లెలూయ మళ్ళీవచ్చెదవా? ॥సిలువ॥

# 697

1. అందాల తార అరుదెంచె నాకై అంబర వీధిలో
అవతారమూర్తి యేసయ్య కీర్తి అవనిజాటుచున్
ఆనందసంద్ర ముప్పొంగెనాలో అమరకాంతిలో
ఆది దేవుని జూడ ఆశింప మనసు పయనమైతిని ॥అందాల॥

2. విశ్వాసయాత్ర దూరమెంతైన – విందుగదోచెను
వింతైన శాంతి వర్షించెనాలో – విజయపధమున
విశ్వాలనేలేడి దేవ కుమారుని – వీక్షించు దీక్షతో
విరజిమ్మె బలము ప్రవహించె ప్రేమ విశ్రాంతి నొసగుచున్ ॥అందాల॥

3. యెరుషలేము రాజనగరిలో యేసుని వెదకుచు
ఎరిగిన దారి తొలగినవేళ యెదలో కృంగితి
యేసయ్యతార యెప్పటివోలె యెదురాయె త్రోవలో
ఎంతో యబ్బుర పడుచు విస్మయ మొందుచు యేగితిస్వామి కడకు ॥అందాల॥

4. ప్రభు జన్మస్థలము పాకయేగాని – పరలోక సౌధమే
బాలుని జూడ జీవితమంత పావనమాయెను
ప్రభుపాదపూజ దీవెనకాగ ప్రసరించె పుణ్యము
బ్రతుకే మందిరమాయె అర్పణలే సిరులాయె ఫలియించె ప్రార్థన
॥అందాల॥

– ఎ.బి.మాసిలామణి

# 698

రా.. తిలక్కామోదు తా–ఆది

మధుర మధర మధురసేవ – యేసు ప్రభు సేవ

1. దేవదూతకును లేని దైవజనుని సేవ – దేవసుతుని సంఘ సేవ దివ్యమౌ సువార్త సేవ ॥మధుర॥
2. పరిశుద్ధాత్మ ప్రోక్షణముచే ప్రజ్వరిల్లుసేవ – పరిమళించువాక్య సేవ ప్రతిఫలించు సాక్ష్య సేవ ॥మధుర॥
3. ప్రభుని పేర ప్రజల యెదుట ప్రవచనాల సేవ – ప్రజల పేర ప్రభుని యెదుట ప్రార్థనలువచించు సేవ ॥మధుర॥
4. భాగ్యభోగనిధులు లేని భారభరితసేవ – బాష్పసిరులలోన మెలగి బాధలను వరించు సేవ ॥మధుర॥
5. సిలువమూర్తి కృపలు జాట సిగ్గుపడని సేవ – సిలువనిందలను భరింప శిరమువంచి మురియు సేవ ॥మధుర॥
6. లోకజ్ఞానియపహాశించు శోకమూర్తి సేవ – లోకులను దీవించు సేవ లోకమును జయించు సేవ ॥మధుర॥
7. దైవజనుడ మరవకోయి దైవపిలుపునోయి – దైవనీతివదలకోయి దేవుడు దీవించునోయి ॥మధుర॥

– ఎ.బి.మాసిలామణి



# 699

ప॥ రాగము – ద్విజావంతి జయజయవంతి మిశ్రమము తాళం – ఆది
యేసు నామమే పావనము – ప్రభు
యేసే రక్షణ కారణము – మను
జాళి పాపము తీరగా – మర
ణాబ్ధి తీరము చేరగా – శ్రీ
యేసు మాకు దారిగదా

1. స్వామి యేసు మాలో – తన
ప్రేమ నిలుపగా – యెన
లేని ఈ విగా – తన
మేను బలినిడ లేదా ॥యేసు॥

2. పాప ఘోర తాప – తతి
బాపి కరుణతో – చెయి
జాపి ప్రేమచే – తన
ప్రాపు మనకిడ లేదా ॥యేసు॥

3. రక్త సిక్త బాట – మన
ముక్తి పథముగా – అను
రక్తిజూపగా – మన
పాలి రక్షకుడాయెగదా ॥యేసు॥

4. చావు గెల్చి మాకు – తన
జీవమొసగగా – మము
కాయువాడుగా – ఘన
దేవుడితడగు గాదా ॥యేసు॥

5. దారి కానరాని – కడు
ఘోరవనములో – నడ
యాడు వేళలో మము
చేరబిలిచిన వాడుగదా ॥యేసు॥

6. ఎన్నరాని రేడు - మము
కన్న సుతులుగా - చే
కొన్నవాడుగా తన
పేరు మనకిడి లేదా ॥యేసు॥

7. నేడు యేసురాజు - మన
తోడు నడువగా - కొని
యాడి వేడుచు - దివి
సీమ నిలుతుము వేగ ॥యేసు॥

- సాల్మాన్ రాజు

## 700 దేవుడు లోకమును నెంతో ప్రేమించెను

ప॥ దానమిచ్చెను ధరణికి దేవుడు ప్రేమతో తన ప్రియ తనయున్ లోకమునెంతో ప్రేమించెన్ - కుమారునియందు విశ్వసించు వారిని రక్షింపగ నెంచి ॥దానమిచ్చెను॥

1. దూతలు అరాతిరియందున-ఖ్యాతిగా శుభవార్తదెల్పిరిబెత్లేహేంపట్టణమందున ప్రభుయేసు బుట్టెను రక్షకుడాయన - రయమున జూడుడి॥దానమిచ్చెను॥

2. ప్రాణమియ్యను పాపులకొరకై -ప్రేమతో ప్రభుయేసు వచ్చెను దేవునిమహిమను విడిచి-మానవుడయ్యెను మనవంటి వాడుగా-మహిలోనబుట్టెను ॥దాన॥

3. చేర్చుకొను డీ మీ హృదయములన్ - ప్రీతితో ప్రభు యేసు రక్షకుని పాపికి పరిహారము మరియు-పరిశుద్ధ జీవితం పరలోక ఆనందం-ప్రభుయేసుడిచ్చును ॥దానమిచ్చెను॥

4. హల్లెలూయ పాడుదాము - దేవుని యమూల్య ప్రేమకై యేసు మన కిచ్చి నందుకై మన రక్షణ కొరకై హోసన్న పాడుదం ॥దాన॥

- రెవ. కొంగర సామ్యేల్ సంజీవి

## 701 క్రీస్తు అవతారము కొరకు స్తోత్రము

ప॥ స్తోత్రము జేతుము పాత్రుడ వీవే రాత్రిలో మా ప్రియ తండ్రీ
స్తోత్రము లివె గొనుమా మా స్తోత్రము లివే గొనుమా ॥స్తోత్ర॥



1. లోకము నెంతో ప్రేమించి- ప్రాకటముగ రక్షింపగ క్రీస్తును - వీరితో మా కొరకిచ్చి నందుకై ॥స్తోత్ర॥

2. ధనవంతుండగు మా ప్రభువు ధనికులుగా మము జేయను దీనుడుగా నిల అవతరించి బహు ధన్యులుగా మము జేసి నందుకై ॥స్తోత్ర॥

3. పాపులమగు మము ప్రేమించి - పాపము పరిహరింపగా తాపమెంచక సిలువ నొంది నీ దాపుకు మమ్మును జేర్చినందుకై ॥స్తోత్ర॥

4. ఒప్పుగ క్రిస్మసు నందున మెప్పుగ మా కొరకిచ్చిన చెప్ప శక్యము గాని వరముకై గొప్పగు మా స్తుతులందు కొనుము జై ॥స్తోత్ర॥

- రెవ. కొంగర సామ్యేల్ సంజీవి

## 702 క్రైస్తవ సంఘమా! లెమ్ము తేజరిల్లుము !!

ప॥ లెమ్ము తేజరిల్లుము నీకు - వెలుగు వచ్చి యున్నది యేసుని మహిమ నీపై - ప్రకాశముగ నుదయించె ॥లెమ్ము॥

1. యేసే యీ లోకమునకు - వెలుగై యున్నానని చెప్పెన్ యేసుని నమ్మువారు వెలుగులో నడుచువారు ॥లెమ్ము॥

2. అంధకార మందుండి - బంధింప బడినవారిన్ ఆశ్చర్యమైన వెలుగు - నందించి వినోదించెన్ ॥లెమ్ము॥

3. దాత ప్రభు యేసుని నమ్మి - నీతిగా నడుచువారు జాతి భేదములు లేక - జ్యోతుల వలె నుందురు ॥లెమ్ము॥

4. మనుజులు మీ సత్క్రియలను - జూచి బహు సంతోషించి మనసార పరమ తండ్రిన్ - మహిమ పరచెదరు ॥లెమ్ము॥

5. జనములు నీ వెలుగునకు పరుగెత్తి వచ్చెదరు రాజులు నీదు ఉదయ కాంతికి వచ్చెదరు ॥లెమ్ము॥

## 703 యువజనులకు పిలుపు

చాయ: ఉదయామ్మాయెను

యువజనులంతా – యేసుని పేరిట – యేకము కావలెను భువిలో
యేసుని –ప్రేమను జాటను – బూని కదలవలెను ॥యువ॥

1. యేసే మాదిరి – యేసే రక్షకు – దేసే దేవుడని వాసిగ యేసుని జాడలో
నడువగ నాశతో బూనుదము ॥యువ॥
2. ప్రార్థన జేతుము – ప్రతి దినమును మన పరమ తండ్రి కిలలో సార్థకముగ
సహవాస తండ్రితో – సతతము జేయుదము ॥యువ॥
3. దేవుని వాక్యము త్రోవకు వెలుగది – భావము మార్చునని జీవము నొందగ
దినదినమున నొక భాగము జదువుదము ॥యువ॥
4. సంఘము యేసుని శరీరమేయని –సేవకు బూనుదము సంఘపు క్షేమమే
మదిలో నిడుకొని – సాయము జేయుదము ॥యువ॥
5. సేవను జేసి సాక్ష్యము నిచ్చి– యేసుని జూపుదము యే విధముననో
యేసుని యొద్దకు ఆత్మల నడుపుదము ॥యువ॥

–రెవ. కొంగర సామ్యేల్ సంజీవి

## 704

ఛాయ: సిలువ మోసినావా–శ్రమలకోర్చినావా పరమ రక్షకుండు – పతిత పావనుండు
భూమి యందు లేరులేరయ్య యేసయ్యేగాని – వేరే లేరయ్య యేసయ్యేగాని

1. బోధలు చేసినవారు మాదిరి జూపిన వారు భూమియందు లేరులేరయ్య
యేసయ్యే గాని వేరే లేరయ్య యేసయ్య గాని
2. జాలి జూపినవారు – మేలు చేసినవారు – భూమి యందు లేరులేరయ్య
3. వెలుగు నున్నవారు వెలుగు జూపినవారు – భూమి యందు లేరులేరయ్య
4. రోగం బాపిన వారు –బాగు చేసినవారు – భూమి యందు లేరులేరయ్య
5. పాపం తీసినవారు – పాపిని బ్రోచినావారు – భూమి యందు లేరులేరయ్య
6. ప్రేమ జూపినవారు – ప్రాణం బెట్టినవారు భూమి యందు లేరు లేరయ్య



7. సిలువను మోసినవారు – శ్రమల నోర్చినవారు భూమి యందు లేరు లేరయ్య
8. క్షమను జూపినవారు – శాంతి నిచ్చినవారు భూమి యందు లేరు లేరయ్య
9. రక్తం కార్చినవారు – ముక్తిని జూపినవారు భూమి యందు లేరు లేరయ్య
10. మరణం బొందినవారు – మరల లేచినవాడు భూమి యందు లేరులేరయ్య
11. మళ్ళీ వచ్చేవారు – మోక్షము నిచ్చేవారు భూమి యందు లేరు లేరయ్య

– రెవ.కొంగర సామ్యేల్ సంజీవి

## 705

యేసు ప్రభువు సిలువ మీద – ఏడుమారులు – ఆశతోడ బల్కెను – భాసురంపు
పల్కులు – దాసజనులు దలపోయదండి ధైర్యమిచ్చును

1. తండ్రీ వీరు చేసేదేమో – తెలియకున్నారు – దండింప వద్దని దయతోడ
వేడెను – నిండు జాలి శత్రువులపై మెండు తాల్మి జూపెను
2. చూడు నీవు పరమునందు – నేడే యుందువు తడవేల నాతోడ – నని తెల్పె
దొంగతో కడుదీనత వేడ పాపిని కరుణ తోడ గాచెను
3. అమ్మాయిదిగో నీ కుమారుడంచు తల్లితో నెమ్మితోయో – హానును – నమ్మకంపు
– శిష్యుని – ఇమ్ముగా మరియమ్మ తల్లిగా – సమ్మతితో జూపెను
4. చెప్పరాని తాపమొంది గొప్ప బాధచే – దప్పిగొనుచు న్నానని దండి కేక
వేసెను – దప్పి బాధ తీర్చలేక చేదు చిరక నిచ్చిరి
5. నాథా దేవ నాదు చేయి – నేల విడిచితి – నన్నేల వీడితి వని కేక వేసెను –
బాధలెంతో హెచ్చుకాగా బహుగా విలపించెను
6. సకల వరుల రక్షణంబు – సిలువ యందున – సమకూడె గావున – స్వామి
యొక్క కార్యము – ఇక సమాప్తమైనదంచు వీకతో ప్రకటించెను
7. తండ్రీ నాదు ఆత్మ నీకు నిండు ప్రేమతో అప్పగించుచున్నాని చెప్పి ప్రాణం
వీడెను – మెండు శాంతి తోడ యేసు మెల్లగా నిద్రించెను

– రెవ .కొంగర సామ్యేల్ సంజీవి

# 706

ఛాయ: మద్యపానము దరికి బోకండి

స్త్రీల మైత్రిలో చేర రారమ్మా–శ్రీ యేసుప్రభుని శ్రేయ మొప్పుగ కొలువ రారమ్మ
స్త్రీల సేవను ప్రేమతో గొని చాలా దయతో చేర దీసి మేలు చేసి యాదరించిన
యేసు పేరట సేవచేయును ॥స్త్రీల మైత్రితో॥

1. భక్తురాండ్రగు స్త్రీల పరిచర్యన్ – ప్రభు యేసు ధరలో మక్కువ తో
యంగీకరించెనుగా శక్తి గల యా రక్షకుండు – యెక్కువగు యాదరణ జూపి
తక్కువగు మన స్త్రీల స్థితినిల యుక్తముగ బహు యుద్ధరించెను॥స్త్రీల మైత్రితో॥

2. స్త్రీలు అందరు సేనగా చేరి – స్థిరమైన మైత్రిలో – మేలుగా రక్షకుని
గొనియాడె – వీలుగా మన దేశమునకు పాలు మాలక సేవ చేసి – చాలగా
మన యేసు ప్రేమను చక్కగా ప్రత్యక్షపర్చును ॥స్త్రీల మైత్రిలో॥

3. దక్షిణిండియా సభలో నున్నట్టి – స్త్రీలంత గూడి – ఏకమగు సహవాసమందుండి
– దీక్షతో ప్రార్థనల యందు – సేవ యందు సాక్ష్యమందు – రక్షకుండగు
యేసు శక్తిని స్పష్టముగ నిలచాటి చూపకు ॥స్త్రీల॥

– రెవ .కొంగర సామ్యేల్ సంజీవి

# 707

ఛాయ :నేను నీ వాడను దేవ నిక్కంబుగా దేవ వేడుచు నుంటిమి – స్త్రీల మైత్రిని –
దేవ వర్ధిల్ల జేయుమీ

1. స్త్రీ మైత్రిలో జేరు స్త్రీల నందరి కృపతో చాల దీవెనలిచ్చి చక్కగా నడిపించు ॥దేవా॥

2. ప్రార్థనలయందు – ప్రభువుసేవయందు సార్థకముగ నీకై సాక్ష్యమిచ్చుట యందు ॥దేవా॥

3. మాటయందును మరియు – మేటి కార్యములందు తేట క్రైస్తవ బ్రతుకు – చాటి చూపుట కొరకు ॥దేవా॥

4. పరిశుద్ధ వివాహ పవిత్రతను ఎరిగి మరణాంత మగుదనుక స్థిరముగ జీవించ ॥దేవా॥



5. పిల్లలందరిన్ ప్రభువు భయమునందున బెంచ తల్లులందరి కెపుడు – తగు సాయమియ్యను ॥దేవా॥

– రెవ .కొంగర సామ్యేల్ సంజీవి

# 708

పల్లవి :అసతోమా సద్గమయా తమ సోమా జ్యోతిర్గమయా మృత్యోర్మా
అమృతంగమయా – సదయా ప్రియ యేసయ్యా సరి – రిగ – గమ – మద
స గమదనిస – గమదనిస – గమదనిస ॥అసతోమా॥

1. నీవే నా స్వర్గమయా – నీవే నా మార్గమయా – నీవే నా జ్యోతివయా – నీవే
నా నీతివయా సరిగ – రిగమ – గమద – మదని – దనిస గమదనిస
గమదనిస ॥అసతోమా॥

2. నీవే నా సత్యమయా – నీవే నా జీవమయా నీవే నా సర్వమయా – శ్రీ
యేసయ్యా– శాంతిమయా సరిగ – రిగమ – గమద – మదని – దనిస
గమదనిస – గమదనిస – గమదనిస ॥అసతో॥

– ఆచార్య ఆరార్కేమూర్తి

# 709

తూర్పు నుంచి పడమర – ఉత్తర దక్షిణ దిశలు యేసురాజు పరిమళ –
సువాసనలు గుబాళించెను ॥తూర్పు॥

1. మహిమ ఘనత శక్తులెల్ల మహారాజు యేసు వశము యేసు నందే ...కృపా
పుష్పరాసుల వసంత శోభ..... ॥తూర్పు॥

2. హల్లెలూయ పాటలకు...ఉల్లము ఝల్లని పొంగును రారె యేసునిరక్షణ కోరే
.. భూ ప్రజలారా .. ॥తూర్పు॥

– ఆచార్య ఆరార్కేమూర్తి

## 710

దేవా నా దేవా నన్నేల విడిచితివి నన్ను రక్షింపవు – నా మొరను వినవేల ॥దేవా॥

1. బదులేల చెప్పవు – అది బాధలో వున్నాను – మానవుడనే – కాదు దేవా దేవా – నా దేవా మంటి పురుగును దేవా ॥దేవా॥
2. ప్రజలెల్ల నన్ను చూచి – పరిహాస మాడెదరు – నాకు దూరము కాకు దేవా – నాదేవా – నన్ను విడువకుమో దేవా ॥దేవా॥
3. భాషాను వృషభము బలమైన సింహాలు – వన్య మృగములు నన్ను వెంటాడే దేవా – నాదేవా నన్ను విడువకుమో దేవా ॥దేవా॥

– ఆచార్య ఆరార్కేమూర్తి

## 711

బ్యూలా దేశము నాది సుస్థిరమైన పునాది – కాలము స్థలము లేనిది సుందర పురము – నందనవనము ॥బ్యూలా॥

1. స్పటిక నది తీరము నాది అన్నిటిలో ఘనం అనాది – అపశృతి లేని రాగములు అలరెడు పురము యేసుని వరము ॥బ్యూలా॥
2. జీవ వృక్ష ఫల సాయము నాది దేవుని మహిమ స్పర్శవేది – మరణం బాధేలేనిది – అమరుల పురము మంగళకరము ॥బ్యూలా॥

– ఆచార్య ఆరార్కేమూర్తి

## 712

మనసా మనసా నీకిది తెలుసా–మానవ జీవిత వరసా – మానని జీవి రభస ॥మనసా॥

1. ప్రేమామయుడు – యేసుని శుభకర నామమందు మోక్షము దొరుకును – విశ్వసించి పరలోక ప్రేమను – నిత్యము పొందుట నీ విధియే ॥మనసా॥
2. పాప శాప భారములన్నిటిని – పారద్రోల వ్రేలాడే సిలువపై – పుణ్య రక్త ధారలు కార్చిన – గణ్యుడు యేసే నీ శరణ్యం ॥మనసా॥

– ఆచార్య ఆరార్కేమూర్తి



## 713

యేసు ప్రభు నీ చరణం నా ఆత్మకు శరణం ॥యేసు॥

1. నీ ప్రేమ కథా శ్రవణం నీ శుభ నామ స్మరణం – నా జీవన తరుణోపాయం నాయాత్రకు నిరపాయం ॥యేసు॥
2. నీ దివ్య సిలువ మరణం నానవ్య జీవ కిరణం – నీ శాంతి కాంతి నిలయం – నా హృది నీ దేవాలయం ॥యేసు॥

– ఆచార్య ఆరార్కేమూర్తి

## 714

యేసుని వదనము అందమని–యేసునివచనము మధురమని–యేసుని చరణమే శరణమని – యేసు చెంతకు వచ్చితిని – హల్లెలూయా... (4) హల్లెలూయని పాడితిని

1. యేసుని సిలువే విలువయని – యేసుని రక్తమే విజయమని – యేసే పునరుత్థానమని – వాసిగ యేసుని నమ్మితిని ॥హల్లె॥
2. పాపిని నను రక్షించెనని – శాపము బాపిన దేవుడని – పరమునకు నను చేర్చునని త్వరపడి యేసును చేరితిని ॥యేసు॥

– ఆచార్య ఆరార్కేమూర్తి

## 715

తంబుర నాద స్వరముల తోడ తగు విధిని నిను భజన చేతు అంబరంబున కెగెసే పాటలు హాయిగ పాడెద పాడెద

1. సితార స్వర మండలములతో – శ్రీకర నిను భజన చేతు –ప్రతి దినమున నీ ప్రేమ గాధను – ప్రస్తుతించి పాడెద పాడెద
2. మృదంగ తాళ ధ్వనులతో – మృత్యుంజయ నిను భజన చేతు –ఉదయ సాయంత్రముల యందు – హోసన్నా యని పాడెద పాడెద

3. పిల్లన గ్రోవిని చల్లగ నూది – ఉల్లమలర నిను భజనచేతు – వల్లభుడనిను ఎల్లవేళల– హల్లెలూయా యని పాడెద పాడెద

– ఆచార్య ఆరార్కేమూర్తి

# 716

మందార మకరంద మాధుర్యమున దేలు – మధుపమా నా హృదయ మా

1. యేసు పదముల వ్రాలి – అమృతధారను గ్రోలి – ఆనందమున తేలుమా(2) పరమ సింహాసనముపై కిగయుమా ॥మందార॥
2. నిర్మల మందాకిని వీచికలో తూగు (2) రాజహంసా నా మానసా హంసా యేసు వాక్య తరంగ, డోలికపై వూగి హాయిగా విహరింపుమా – మోక్ష సంధాయకుని వరియించుమా ॥మందార॥
3. లలిత రసాల పల్లవా – ఖాదియై వెలుగు కోయిలమ్మ – హృదయ విహంగమా – యేసు తరు శాఖపై – ఏపుగా కూర్చుండి – జీవ ఫలములన్ – భజింపుమా – రక్షకుని ప్రేమ గీతి పాడుమా ॥మందార॥
4. పూర్ణేందు చంద్రిక స్ఫురితమై వెలుగొందు – చకోరమా – నా జీవనా పతాకమా – యేసు వెలుగులు చిందు – భాసురంబగు విందు పరమార్థమునూ చూపెనే – వెన్నెల – కరుణామృతము కురిసెనే ॥మందార॥

– ఆచార్య ఆరార్కేమూర్తి

# 717

యెరుషలేము – యెరుషలేము – గుమ్మములు – ఆధ్యాత్మిక మర్మములు – యేసు రాజు వరములు – అందలి వివరములు ॥యెరు॥

1. గొర్రెల గుమ్మము – మత్స్యపు గుమ్మము – పాత గుమ్మము – లోయ గుమ్మము
2. తూర్పు గుమ్మము – కారాగారపు గుమ్మములివిగో చూడండి
3. ఎఫ్రాయిము గుమ్మము – మిఫ్కాదు గుమ్మము – నెహెమ్యా ఆ గుమ్మాలను మరమత్తు చేసెను
4. పెంట గుమ్మము – ధార గుమ్మము – నీటి గుమ్మము – గుర్రపు గుమ్మము– గుమ్మాలన్నిటి భావము నెమ్మదితో తలపోయండి – గుమ్మములారా యేసుకు – కోరి స్వాగతమీయండి

– ఆచార్య ఆరార్కేమూర్తి



# 718

కరుణానయనాలలో – అరుణకిరణాలు నా యేసు చూపులు – నవజీవ కణాలు

1. యేసు అడుగిడిన చోటు పుణ్యయాత్రా స్థలము – యేసు లేని లోటు ఎటుల పూరించగలము ॥కరుణ॥
2. యేసు రుధిర ధారలలో– దివ్యాతి దివ్య శక్తి కలదు – యేసు రాకడతోనే – శ్రమలకే సెలవు ॥కరుణ॥
3. ప్రభు యేసు స్వరతరంగాలు – పాడినవి విజయ గీతములు – పరమపురి దరి చేరువారు – పయనమై వున్నారు ॥కరుణ॥

– ఆచార్య ఆరార్కేమూర్తి

# 719

యేసుని భజియింపవే మనసా భాసమాన తేజుని – ఘన రక్షకుని ॥యేసు॥

1. ధిమికిట ధిమికిట దివ్య మృదంగా తకిట తకిట యని తాళము వేయుచు ॥యేసుని॥
2. బిలహరి సారమతి కాంభోజి – బృందాన సారంగా కదంబము– రాగస్వర రంజితమై – ఆ ...ఆ దేవుని రాజ్యము కరుణామృతమెలుకగా ॥యేసుని॥
3. రాగం తానం పల్లవి రస మాధురి సుమ వల్లరి – యేసుపద పద్మములపై కొలపోసి తలపోసి తరియించుము ॥యేసుని॥

– ఆచార్య ఆరార్కేమూర్తి

# 720 వచ్చిచూడుడి

(చాయ: పరిశుద్ధ పరిశుద్ధ ప్రభువా)

వచ్చి చూడుము అన్నా –పరక్రీస్తు నిపుడే – హెచ్చైన శుభములు నిచ్చునదతడే

1. యేసే మన రక్షకుడు – యేసే దేవుండు – వాసిగ రక్షింప వచ్చినా డిలకు
2. మనలను రక్షింప – మరణంబు నొంది – తనకు తానేలేచి ఘనుడయ్యెను నేసు
3. మేము జూచితిమి–ఆ స్వామిని నిజము–ప్రేమగలవాడతడు ఈమాట వినుము
4. ఇహమున గనలేము – ఇట్టి రక్షకుని బహు మంచివాడతడు ప్రభువైన క్రీస్తు
5. ఇతడే మన దేవుండు వినుము ఓ యన్నా క్షితిలోను మనకు సద్గతి యితడే యన్నా

– స.సా. సుబ్బయ్య

## 721

(పాట చాయ: పాపి కాశ్రయుడవు నీవే)

1. ఇంత చింత – ఇంత దుఃఖమేలనయ్యా – అయ్యా – మేలనయ్యా – నీ – చింత విడిచి – సొంతముగ నిటు – జెప్పవయ్యా
2. వేయి మణుగుల బరువున్నది నా – వీపునయ్యా అయ్యా – వీపునయ్యా నే – మోయజాలను ఈ నా బరువు – మూపుననయ్యా
3. తప్పుమాటలెన్నో – నేను చెప్పితినయ్యా – అయ్యా చెప్పితినయ్యా – నేను చెప్పజాలని పాపములెన్నో – చేసితినయ్యా
4. కల్లుసారా త్రాగితి నేను – పెల్లుగాను – అయ్యా – పెల్లుగాను నా యిల్లు ఒళ్ళు గుల్లయ్యె మెల్లగాను
5. అయ్యో అయ్యో ఈ నా బరువు – అణచి వేయునయ్యా – అణచి వేయు – ఇక – చెయ్యమయ్యా – వీలుంటే సహాయమయ్యా ॥

– స.సా. సుబ్బయ్య

## 722 యౌవనస్థుల భజన కీర్తనలు

వలయాకారముగా నిలువబడి అభినయము చేయుచు పాడవలెను

(చాయ = స్తోత్రము చేయరే – సోదరులారా)

రమ్ము రమ్ము ఓ పరిశుద్ధాత్మా –మమ్ముల మరువకను–ఇమ్మహిలో మా తోడు నీవు యని – హితముగ వేడుగను

1. దోసిలొగ్గి నిను వేడుచుండగా – యేసునామమునను – నీ శుభములకై కాచియుండకా – దాసుల మొర వినను
2. శిరముల వంచి కరముల మోడ్చి – మొరలు బెట్టగాను – పరమ వరములను – దుర దుర మాపై – గురిగింపు మికను
3. మోకరించు నిను వేడుచుండగా –మోదము చూపుచును – నీకే మ్రొక్కుచు బ్రతిమిలాడగా – ఏకమనస్సుతోను ॥
4. యేసు నామమున లేచి నిలబడి – ఎంచుచు మేలులను – వాసిగ భజనలు చేసి నుతింతుము – నీ సహాయమునను

– స.సా. సుబ్బయ్య



## 723 శ్రీ యేసునాథ కథక్రమము

రాగము = కళ్యాణి తా = అట

(చాయ = ఎంతో సుందరమైనవి ధరగిరులపై)

(ఆధ్యాత్మ రామాయణము చదివిన రీతిని చదవవచ్చును)

శ్రీ యేసు చరితమిదియే స్నేహితులారా – చెలిమితో నాలింపరే

ఇయ్యుర్విలో ప్రభువు – హితవుగ జేసిన కార్యంబులన్నిటిని – క్రమముగ దెలియరే నేయమొప్పగ అనుదినంబును – నేర్చుకొనుచును అనుసరించిన శ్రేయ మొసగును యేసు చరితము శ్రద్ధతో గమనింపరారే ॥శ్రీ॥

– స.సా. సుబ్బయ్య

1. బయలు దేరెను దేవుడు – భూమికి దన్ను బ్రత్యక్షపరచుకొనను జయమొప్ప దూతలు – జగతికి వార్తలన్ – రయముగ దెచ్చిరి రాత్రి సమయమున ప్రియముగా బెత్లేమునందలి – పేదగొల్లలు బోయి జూచిరి – నయముగా పూజించి హృదయా – నంద మొందిరి – ప్రభుని జూచి ॥శ్రీ యేసు॥
2. జ్ఞానులేగిరి యంతట ప్రభువగు శిశువున్ – మానుగజూడనంత పూని బంగారు సాంబ్రాణి మొదలైనట్టి – కానుకలతో వారు – ఘన–మర్యాదలతోను –దీన బాలుని – జూడవచ్చిరి –దివ్యమగు – ఒంటెలను ఎక్కి – శ్రీసుతుని సేవించివెళ్ళిరి – శ్రీఘ్రముగ స్వస్థానములకు ॥శ్రీ యేసు॥
3. హేరోదు చంపఁజూచె – ఆ శిశువును రారాజు అని యెరుగక – కోరి బెత్లేహేము చేరి రెండేండ్ల బాలుర నందరిని సంహరించి కడదేర్చ భూరిదేవుడు అద్భుతముగ – పారిపోయి ఐగుప్తునకు – క్రూర రాజు – మరణమొందగ – చేరెను నజరేతు గ్రామము ॥శ్రీ యేసు॥
4. మన దేవుడీ భూమికి – వచ్చినపుడే – నను పేరు పెట్టుకొనెను వినయముతో ప్రభువు – వింత బాలునిగా పెరిగను – ధరలో నజరే – తను చిన్న గ్రామమున చనువుగా పస్కాకు వెళ్ళెను – సరిగ పన్నెండేండ్ల వయస్సున– ఘనుల నడిగెను– ప్రశ్నలెన్నో కడు విస్మయ మొందవారలు ॥శ్రీయేసు॥

5. యోర్దాను నది యొద్దను స్నానము పొందె యుక్త వయస్సు – నందున శుద్ధ హృదయుడు పిదప, శోధనలో జయించి ఇద్దరిలో సేవనింపు మీరగజేయ – బుద్ధి గల శిష్యులను నలుగురిన్ – బేతబరలో పిలిచి వారితో – ఒద్దికతో కానాకు వెళ్లెను – ఒనరగ కళ్యాణమునకై శ్రీ యేసు॥

6. ఇరువై యేడవ వర్షమున – పస్కా కొరకై యెరుషలేముకు వెళ్ళెను పరిశ్రమపరచెను – ప్రభువు దేవాలయమున్ – సరిగ నెనిమిది నెలలు– సదయు దక్కడ గడిపి–వెరువకను సమ – రయుల ప్రాంతము – కరిగి సమరయ స్త్రీని కనుగొని – సరగ గలలైయ కేగి ప్రభువు స్వస్థపరిచె ప్రధాని కొమరున్ ॥శ్రీయేసు॥

7. ఇరవై యెనిమిదవ యేటన్ – మార్చి నెలలో – యెరుషలేముకు వెళ్ళెను – మరువక పూర్వము – మంచి పండుగ జరిపి– సర గబేతస్థలో – స్వస్థపరచి రోగిన్ – తిరిగి నజరేతునకు బోయి – గురువుగా గ్రంథమును జదువ – పరిహసించిరి స్వంత వారలు – ప్రభువు ఇతడనిదెలియ నేరక॥శ్రీ యేసు॥ ఆరంభించెను ప్రభువంత – సువార్త సంచారము గలిలయలో నంతకోరిక

8. పెర్నహూం జేరి – తిబెరై సరస్సు తీరమున శిష్యులన్ చేరబిలిచిన పిదప – భూరి దయతో కుష్ఠరోగిని బొలువు మీరగ పక్షాయువు (4) – ఘోరముగ వ్యాధులను మాన్పి – మేర లేని కీర్తి నొందెను ॥శ్రీ యేసు॥

9. రెండవ యాత్రను జేసెను యేసుడు తిరిగి – మండు వేసవి యందున దండి ప్రేమను తన పన్నెండు మంది నొక్క కొండ మీదను గూర్చి – గొప్ప బోధను జేసి నిండు దయతో పిదప నధిపతి దండిదాసుని బాగుజేస్తు వెండియున్ నాయీను విధవకు – దండిమేలు నొసంగి వచ్చెను ॥శ్రీ యేసు॥

10. పిదప సీమోను యింట – యేసు ప్రభువు – ప్రియముగా భుజించెను సదయుడు తిబెరయు – సరస్సు తీరమున కేగి – ముదమొప్పనుపమానముల జెప్పి బోధించి – పిదప సంద్రపు పొంగునణిపి – వదలగొట్టి సేనదయ్యము – తుదకు యాయిార్–కుమారి తెను – ముదముతో బ్రతికించె ప్రభువు ॥యేసు॥

11. మూడవ యాత్రను జేసెను – కపెర్నహోం వ – ముఖ్య స్థానముగా జేసి – వేడుకన్ శిష్యులన్ వివిధ స్థలముల కంపి – గోడు జెందక గొబ్బున నడవికి వెళ్ళి ఆేడు అయిదే –వేల ప్రజలకా – నాడు రొట్టెలు పంచిపెట్టి – చూడవింతగా – సముద్రముపై – గోడు జెందక నడిచి వెళ్ళెను ॥శ్రీ యేసు॥



12. విరోధ మెక్కువయ్యె – యేసు ప్రభువని – వింత బోధలు వినగానే – పరలోకపు రొట్టె ప్రభువు తానే యనగా – తర్కించ మొదలిడిరి తమలో తామే జనులు – మరియు పెద్దలవాడుకలను – వెరువకన్ ఖండించగా నా – యరుల మనస్సున ద్వేషభావము – పెరిగెనుక – పెర్నహోమున ॥శ్రీ యేసు॥

13. ఇరువై తొమ్మిదవ యేటన్ – ఏప్రెల్ నెలలో అరిగె నుత్తర దిక్కున – ధర తూరు సీదోను – సురోఫినికే స్త్రీతోను – పరముడుమాట్లాడి – కరుణ జూపి వెనుక తిరిగి వచ్చె దెకపోలిలో – జరిపి కొన్ని యద్భుతములను సరస్సు దరిని – నాల్గువేలకు తిరిగి యాహారంబు పెట్టెను ॥శ్రీ యేసు॥

14. కైసరియ ప్రాంతమున – యేసు ప్రభువు – తన శిష్యులతో వెళ్ళిన – ఆ సమయములోను – యేసు మహాత్మ్యమున – భాసురంపు మహిమ – ప్రత్యక్షపరచిన –దోసిలొగ్గి – యేసు శిష్యులు – అసుమాహాత్మ్యంబు కనుచు – ఆ స్థలమున జేరి నిత్యము – వాసమును జేయంగగోరిరి ॥శ్రీ యేసు॥

15. తిరిగి వచ్చువేళను – యేసుడు తన – మరణవార్తను జెప్పెను సరగున తన ముఖ్య – స్థానంబు జేరి – పరమ బోధలెన్నో విరివిగా జేసెను – ధరను గొప్పతనముయేదో – పరులు క్షమించుటననేమో – సరిగ జెప్పి గలలియాను – స్వామి యేసు విడిచి వెళ్ళెను ॥శ్రీయేసు॥

16. యెరుషలేమున కేగెను – అక్టోబరులో పరిశుద్ధ పండుగకై – పరమ బోధలు జేసె – పర్ణశాలలనాడు – ధర జీవజాలమేదో – సరిగా వివరించెను – మరియు లోకపు వెలుగు యేదో – పరమ స్వాతంత్ర్యము యేదో గురుతుఁ జెప్పగ – రాళ్ళనెత్తిరి – కరుకు యూదులు మత్సరముచే ॥శ్రీ యేసు॥

17. కడువరి సారి వెళ్ళెను – గలిలయ్యాకు – గద్దించ ప్రియులిద్దరిన్ తడవు సేయక యేసు – తన శిష్యులతో గూడి – కడు చేరువలో నున్న – ఘన పెరయాలో జేరి పుడమిలో తన శిష్యులందరు – పూర్ణమనస్సుతో జేయు విధులను – కడునెనరున జెప్పి వారల – కభయ హస్తము నిచ్చి పంపెను ॥శ్రీ యేసు॥

18. యెరూషలేమున కేగెను మార్గములోనే మరియమార్తల జూరెను సరగన్ మార్గమునందే – స్వస్థపరచి యందుని – పరిసయ్యులను వింత – పరచి బోధలు జేసి – వరముడు ప్రతిష్ట పండుగ తరుణమునత – న్నెరుక – పరుచగా అరులు తన్ను పట్ట జూడగా నందకుండగ దాటిపోయెను ॥శ్రీ యేసు॥

19. పెరయా పరిచర్య యందే – యేసు ప్రభువు పెక్కు బోధలు జేసెను పరిసయ్యులు జూచెడి – పరిశుభ్రతను గూర్చి – ఇరుకుద్వారము గూర్చి – హితముగ బోధించి – పరమ విందు దొరికెననియు – సిరిని గూర్చిన కథలు చెప్పి – సిరిని గూర్చిన కథలు చెప్పి – ధరను విశ్వాసమును పెంచను – తగిన బోధలనెన్నో జేసెను ॥శ్రీ యేసు॥

20. బేతనియకు వెళ్ళెను – యేసుడు పిదప బ్రతికించెను లాజరును ఖ్యాతిగ నెఫ్రాయిాం – కుష్ట రోగుల బ్రోచి – ప్రీతిగా న్యాయాధిపతి సుంకరి పరిసయ్యుల – సతిపతుల పరి త్యాగము ధర చంటిపిల్లల నాశీర్వాదము – పేతురుకు ప్రత్యుత్తరము అతి ప్రేమతో వివరించి చెప్పెను ॥ శ్రీయేసు॥

21. చేసె యేసునాథుండు యెరూషలేము – చివరగా ప్రయాణము వాసిగ యెరికోకు – వచ్చి యంధుల బ్రోచి – జూచి జెక్కయ్యను వాసిగ దర్శించి – యేసు మీనా – లయపదేశము జేసి తుదకు బేతనియలో – భాసురముగ మరియచే నభి – షేకమొందెను – మరణమునకై ॥శ్రీ యేసు॥

22. ముప్పదవ సంవత్సరము – ఏప్రెల్ నెలలో గొప్ప పస్కా ముందుగా ఒప్పుగా వాహనము నెక్కి జయధ్వనులతో – గొప్ప సముహాముతో గొబ్బున నరిగెను చెప్పజాలని సంతసముతో – శిష్యులుండగ యేసునాథుడు – గొప్ప చింతలో మునిగె నాపురి – ముప్పునొందును సరిగ ననుచును ॥శ్రీ యేసు॥

23. సోమవారము రోజున – యేసు ప్రభువు – శపించెనొకచెట్టును స్వామి ఆ దినమున – సరిగ గుడికి వెళ్ళి – పామరులందరి పారదోలిన వెనుక ప్రేమతో రోగులను స్వస్థ పరచి మటంచు బోధలు చేయ నరులు – తామసముతో నిండుకొనుచు – ఏమి జేతు మటంచు సణిగిరి ॥శ్రీ యేసు॥

24. మంగళవారము – చెట్టును యేసు మరల జేచె వి – చారమున సంగతి దెలియక శాస్త్రులు ప్రశ్న ప్రసంగములతో ప్రభుని భంగ పుచ్చ జూడ – రంగు మీరగ మూడు ప్రశ్నలు – రయముగా నుపమానములతో భంగపరచెను వారి యుక్తులు – ప్రభువు పరిసయ్యులను చూచి ॥శ్రీ యేసు॥

25. మోదమొందెను యేసుడు చందా వేయు – బీద విదవను జూచెను ఆదరించెను ప్రభువు మేదిని హెల్లేనియులన్ – యూదజనులంత విరోధించగా ప్రభుని బోధపరచెను యెరుషలేము – మేదిని నాశనము అగునని –ప్రోదిగా లోకాంత వార్తలు – ఆదినముననే చెప్పి వేసెను ॥శ్రీ యేసు॥



26. బుధవారము రోజున – శిష్యుల తోడ – బూర్ణ విశ్రాంతి నొందె – సదయుతన్ గురువారము సంస్కారమును ఇచ్చి – పదిలంబుగా నేసు పరమబోధలు జేసెన్ – ముదముతో తన ప్రియుల కొరకై –ముఖ్యముగ బ్రార్థించి పిదప – సదయుడేసుడు గెత్సెమందున – శత్రువులచే పట్టు వడియె ॥శ్రీ యేసు॥

27. శుక్రవారము నందున యేసు ప్రభువు – పెక్కు శ్రమల నొందెను – అక్రమముగ యూదు – లన్యాయ నేరముల్ – పెక్కు మోపికడకు – పెద్ద నేరస్థుడని – మిక్కుటంపు నీచమైన మ్రానున వ్రేలాడదీసి – పెక్కు బాధలు పెట్టి చంపిరి – ప్రక్కలో బల్లెంబు గుచ్చిరి ॥శ్రీ యేసు॥

28. శనివారము రోజున – యేసు దేహము – సమాధిలో నుండెను – ఘనుడు ఆదివార – మాన సమాధిని విడచె – తనకు తానే యూపి– రినిపోసి – కొన వచ్చె – తన ప్రియులకు అప్పుడప్పుడు కనబడుచు యాదరణ నిచ్చెను – పునరుత్థానుడు యేసు నలుబది – దినములకు – ర్యంతమవనిన్॥శ్రీ యేసు॥

29. మగ్దలేనెమరియకు –మొదటనే యేసు – మరువక కనబడెను – ఇద్దరిలో ప్రభువు – ఇతర స్త్రీలకు పిదప – అద్దినమందున నెమ్మాయి శిష్యులకును – బుద్ధి తెలిసిన పేతురుకు పరి – శుద్ధ తోమా యితర శిష్యుల యొద్ద లేనపుడుండినపుడును ఒద్దికతో కనబడెను ప్రభువు ॥శ్రీ యేసు॥

30. గలిలయలో కనబడెను – ఏడుగురికి – ఘనతిబెరై సరస్సు యొద్ద – తలచి యే ॥శ్రీ యేసు॥

31. బేతనియకు వెళ్లెను. కడువరిసారి – బ్రియ శిష్యులతోడను – ప్రీతిగ వారితో – ప్రియ మొప్ప మాట్లాడి – చేతులెత్తి యటనా – శీర్వదించుచు వారిన్ – భూతలంబును విడిచి యేసు – ఖ్యాతిగ పైకెక్కి పోవగ – దూతలిద్దరు వచ్చి చెప్పిరి దుఃఖపడవద్దంచు వారిన్ ॥శ్రీ యేసు॥

32. పరలోకమున నున్నాడు – ఇప్పుడు మనకై – ప్రార్థన చేయుచున్నాడు తిరిగి వచ్చును ఈ ధరకు యేసుక్రీస్తు నరులందరికి తీర్పు – సరిగా చేయును త్వరలో – మురువుగా తన భక్తులందరి పరమునకు గొనిపోవ సరగన్ – పరమదూతలు పరివృతుండై – అరుగు చున్నాడదియు వినుడి॥శ్రీ యేసు॥

33. ధరలో యేసును నమ్మండి – త్రిత్వము పేర – వర బాప్తిస్మము నొందండి – సరిగ మీరలు క్రీస్తు సంఘము నందున జేరి – పరిశుద్ధ వర్తనతో అరమరలేకను దిరిగి – చిరసుఖములను బొందరండి – పరమ కరుణా – కరుడు యేసుడు – ధర పరములందతడు మనకా దరణ జూపెడు దండి దేవుడు॥శ్రీ యేసు॥

## 724 నిశ్చితార్థం

రాగము :ఆనందభైరవి చాయ : కానాపురంబులో

పల్లవి : కళ్యాణ – శోభతో – కలకాల – ప్రేమతో
కరుణాంత – రంగుడు – కరుణజూప = కరుణాల – వాలుని
కమనీయ – సేవలు – కలవరము – లేకుండ – చేయుమెపుడు

1. నిశ్చయ – తాంబుల – మిచ్చి పుచ్చుకొనుట – నిక్క
మంచు – ప్రభువు – నిర్ణయించె = నిశ్చయించిన యేసు
నీడవలె వెంటాడి – నిరతంబు – తోడుగ – నిలుచు – మీదో ॥కళ్యాణ॥
2. సంసార – జీవితము – సంగీత – కచ్చేరి – సరిగను – పదనిసల
సాకీలతో = స్వరపేటికలు – రెండు – సప్తస్వరలొకటిగా
సంసార – కచ్చేరి సాగునటుల ॥కళ్యాణ॥
3. అపశ్రుతు – లు కలిగించు – అష్టమ స్వరంబు – అప్పుడప్పుడు
పలుకు – నా స్వరంబు = అండగోరుము – యేసు – దండి –
పండిత – గురువు – గండములు – తొలగించు గాత్రములకు ॥కళ్యాణ॥
4. మధురాను – భూతుల – మధురిమల – హృదివీణ – మృదు
మధుర –రాగాలు మీటునటుల = తీగ తెగిపోకుండ –
తియ్యని అనురాగ – రాగములు – పాడగను – రయము మీర ॥కళ్యాణ॥
5. తీగ తెగిపోయిన – తీగసరిచేయుట – మీ తరము
కాదని – యెరిగి యెపుడు = తండ్రి సుత శుద్ధాత్మ – త్రియేక
దేవుడు – సరిచేసి – దీవించు – ధన్యులనగ ॥కళ్యాణ॥

– బోంద్ల సైమన్

## 725 పెండ్లి ప్రధానం

రాగము = జంఝూటి తా –ఆది

చాయ = మానవుల మేలు కొరకు

పల్లవి : మానితమౌ – కార్యములను – మాన్యుడేసే – చేయును =
మానుగ వివాహ స్థితిని – మహిని సంకల్పించెగ



1. పెండ్లి – కార్యక్రమములలో – ప్రధానమే – ప్రధానము = పెండ్లి – ఘనము
– అన్నిటను – పొన్పు నిష్కంళంకము ॥మాని॥
2. రిబ్కా మరియ కన్నియలకు – జరిగె ప్రధానంబులు =
రమ్యముగను – జరుగుచుండె – నాటినుండి – నేటికి ॥మాని॥
3. క్రీస్తు – వరుడు – సంఘ – వధువున్ – బెండ్లి –యాడు
పరమున = కల్వరందు – సంఘమునకు – ప్రధానంబు – జరిగెను॥మాని॥
4. వెండి బంగారు నగలు – వెలగల – వస్త్రంబులు = పెండ్లికూతురాదులకు –
వెసగనిత్తు – రీ దినం ॥మాని॥
5. తల్లికి – ముత్తవ్వలకు – తగిన రీతి – ప్రేమతో = తప్పక
వస్త్రములు – పెండ్లి కొడుకు – వారలిత్తురు ॥మాని॥
6. తండ్రి సుత – పరిశుద్ధాత్మ – త్రియేక దేవ స్తోత్రముల్
తరగనట్టి దీవెనలను – తండ్రి వీరి – కొసగుమా ॥మాని॥

– బోంద్ల సైమన్

## 726 జన్మదిన వార్షికము

రాగము = ముఖారి తా –త్రిపుట

చాయ : ఉన్నపాటున వచ్చుచున్నాను

పల్లవి : సన్నుతింతును దేవ – నీ సన్నిధానమున – సన్నుతింపగ జాలను = సకల
మేలులు – సర్వకృపలను – సిలువ విలువల – ప్రేమ నొసగి – కలుషములు
– కడుగంగ నాపై – కరుణజూపిన – కరుణమూర్తి

1. గతకాలమందును – కాని చేతల జేసి – వెతలలో పడియుంటిని =
స్థితిని మరచి – నాదు మనవులు – మరల అడుగుచుండగ – మదిని రోయని
నాదు పాపము – కడిగి శుద్ధుని జేసినందుకు ॥సన్ను॥
2. పిండాకృతిలో నుండ – దండినాథుడ – నాదు –గండములు – తొలగించితివి
= బండవంటి బ్రతుకు బాటలో – గుండె బరువులు దించి అండగ – ఉండి
నాబ్రతు – కెండ కుండగ – జీవజల బుగ్గలను ద్రాగుచు ॥సన్ను॥

3. ఆయు – రారోగ్యములు – ఆనంద – సౌఖ్యములు – అనుగ్రహించిన నా విభుడు = అనుక్షణంబు – అన్ని విధముల – ఆపదలు కలిగినను ద్రోలి – అండ – దండగ ఉండి నన్ను – ఆదరించిన దేవ సుతులు ॥సన్ను॥
4. తల్లిదండ్రులు – అన్న – దమ్ములు – అక్కలు – చెల్లెండ్ర – తో బుట్టువులన్ = యెల్ల విధముల – కృపలోసంగగ – ఉల్ల సింపగ – ఉర్వియందున – యెల్లరికి – సువార్త – జాటుచు – యెలమి సాక్షిక యిలను నిలుపగ ॥సన్ను॥
5. నూతన – వత్సరమందు – నీతి మార్గము విడువక – నీతి సూర్యుడ – నడుపుమయా = రోతవంటి – పాత బ్రతుకును పాత వత్సరమందు వదలి – నీతి – న్యాయము– కరుణ – శాంతులు – నూతననాబ్దిలో – నొసగు తండ్రి ॥సన్ను॥
6. జన్మనిచ్చిన తండ్రి – జన్మదినంబున – జననీ జనకుల గావుమయా జవము – జీవము – నవబలంబును – పక్షిరాజున కొసగి నటులే = మేమతో – హృదయమును – తృప్తితో – నింపి బ్రోవుము నీతో బ్రతుకుచు ॥సన్ను॥

– బోండ్ల సైమన్

## 727 వివాహ వార్షిక దినము

రాగము = ముఖారి తా –త్రిపుట
చాయ : యేసు నన్ను ప్రేమించినావు

పల్లవి : దేవా – దీవించుమా దంపతులన్ – దయతో – నీవు దీవించు మెల్లప్పుడు

1. పెండ్లి – అయినది – మొదలు – పలు దీవెనలు – తోడ – దీవించుచు బ్రోచితివి – అటులే – ఈ వత్సరమునందు – ఆశీస్సు – లందించి ఆనందింపగ – జేయుమయా ॥దేవా॥
2. సంసార యాత్రలో – సంతాన ప్రాప్తిని – సకల – సంపద – లొసగితివి ఒసగి = సంతోష – సౌఖ్యముల – సమకూర్చి – సతతంబు స్వామి – వీరల కొసగుమయా ॥దేవా॥
3. సంకట – స్థితులందు – భంగ – పాటులయందు – బహు ధైర్య – ముల నిచ్చితివి = ఇచ్చి – నీ బాహు బంధముల – బంధించి రక్షించి – భోగ – భాగ్యము – లొసగితివి ॥దేవా॥



4. ప్రేమాను – రాగముల – సిలువ వృక్షము – నందు – అంటు కట్టబడి వీరల్ = తుదకు – ప్రేమ – బంధములతో – బంధింపబడి నీలో – బహుగ – ఫలియించునటుల ॥దేవా॥
5. ఆత్మీయ – శరీర – ఆకలి – దప్పుల – యందు – ఆదరణ – తృప్తి నొసగి = ఆత్మ శక్తితో నింపి – నడిపించు – నీ త్రోవన్ – నిలిచి – నివసింపగ జేయన్ ॥దేవా॥
6. ఇహలోక – పరలోక – ఈవులన్నియు నిచ్చి – ఈ కవనున్ దీవించుము = కడకు – కడు దీవెనలు – బొండ – కుటుంబ – సభ్యు లమై – కృప జూపి – బ్రోవు మేస ॥దేవా॥

– బోండ్ల సైమన్

## 728 షష్ఠి పూర్తి ఉత్సవము

రాగము = బిలహరి తా –త్రిపుట
చాయ : దేవ సంస్తుతి చేయవే మనసా

పల్లవి : సృష్టి కరతా – స్తోత్రములుఁ జేతు – ఈ షష్ఠివత్సర
పర్వదినమునఁ జేరి పూజింతుఁ = సృష్టములతో ఈ మానవుని
నీ స్వరూపము – నీ పోలికతో – సృజనాశక్తితో – నీవే సృజియించి
నీ సృష్టిపయిన పాలన అభివృద్ధి – లొసగితివి – నీ కృపల –దలచుచు॥సృష్టి॥

1. గర్భవాసిని – యయినది – మొదలు – గర్భమందు – పెంచిన దేవా = గర్భమందే – నన్ను యెరిగితివి – నా తల్లి గర్భము – నందే నను ప్రతిష్ఠ జేసితివి – నీ కృపల దలచుచు ॥సృష్టి॥
2. శైశవ – బాల్య – యౌవ్వనములు – వైవాహిక – జీవితము నొసంగి = భార్యభర్తల – బంధమును వేసి – భవ బంధములు గల –బిడ్డలను – దానముగ – నొసగితివి – నీ కృపల దలచుచు ॥సృష్టి॥
3. విద్యాబుద్ధులు – బలసౌఖ్యములు – వద్య గొరియ పిల్ల రక్షణ – మధ్యాకాశ – మార్గములు తెలిపి – ఈ వ్యర్థలోకపు – వ్యర్థ జీవిత మార్గములు విడుచు – నీ కృపల – దలచుచు ॥సృష్టి॥

4. ఆయు – రారోగ్యబుల నిచ్చి – హాయి – ఆనందంబుల నిచ్చి
అన్ని సుఖబోగంబులిచ్చితివి – ఈ అవనియందు – అన్ని ఆశీస్సుల – నొసగితివి
– నీ కృపల – దలచుచు ॥సృష్టి॥

5. మానవుని – ఆయుష్కాలంబు – మాయమౌ – ఆవిరివంటిదియౌ –
మరుక్షణము – మటు – మాయమౌ పోవు – మానవుని జీవం –
పరమపురమున – ప్రభుతో నుండుటకు – నీ కృపలదలచుచు ॥సృష్టి॥

6. కష్టకాలములందు – కర్తగా – కాచి బ్రోచిన – కన్నతండ్రి –
నష్టములు కలిగినను – నిలిపితివి – నా బ్రతుకు బాటలో –
తోడునీడా – కాచిబ్రోచితివి ॥సృష్టి॥

7. శేషకాలపు శ్రేష్టత లెరిగి – స్వామి యేసుని సేవలు చేయను =
అంకితంబు జేతు నా బ్రతుకు – ప్రభు సేవ కొరకు –
కట్ట కడవరి – శ్వాస మట్టునకు – ఆ కృపల దలచుచు ॥సృష్టి॥

– బోండ్ల సైమన్

## 729 యవ్వన సమాజము సవాలు

చాయ : రాజాధి రాజ రారా

పల్లవి : రారండి – యువతి – యువకులారా – లేలెండి
సిలువదారిపోవ = రారాజు – యేసు రాజు రాజ్యం –
రయముగాను – వచ్చునంచు చాట ॥రారండి॥

1. ఓ ............మారుతున్న నేటి – సమాజంబులో – ఓ ...మారనట్టి
యేసు శక్తి చూపను = మారుమనస్సు పొంది నీవు వేగ – మార్గ
దర్శి యేసు దారిపోవ – మానవాళి – మనస్సు వెల్ల మార్చి –
మంచి సమాజంబును – నిర్మింపన్ ॥రారండి॥

2. ఓ.........ప్రేమ లేని – నేటి సంఘజీవికి – ఓ ....ప్రేమమూర్తి – యేసు
ప్రేమ జూపుచు = ప్రేమ శ్రేష్టమైనదంచు చాటి – ప్రేమ దారి
యెల్లరకును జూపి– ప్రేమధార గ్రోలి నీవువేగ – ప్రేమధార – గ్రోలుదంచు
చాట ॥రారండి॥



3. ఓ.......రక్షణంపు – మార్గమేమో తెలియక –
ఓ .......పాప రోగగ్రస్తులైన– పాపులన్ = పరమ వైద్యు
డేసు చెంతకేగ – పాప రోగమెల్ల – పోవునంచు – భక్తితోడ – చాటి
చెప్పి నీవు – ముక్తి దారి– చూపవేగరండి ॥రారండి॥

4. ఓ........శాంతి – క్రాంతి లేని – లోకవాసికి – ఓ .....శాంతి – క్రాంతి యేసే
నంచు – చాటుచు = భ్రాంతిలోకమందు ప్రీతి వీడ –
విశ్రాంతి నిచ్చు విశ్వనాధుడంచు – క్రాంతి హృదయమందు నింపి నీవు –
నిశాంతమందు – తుదకు జేరవేగ ॥రారండి॥

5. ఓ........నూతన – శతాబ్దం – నడుగుపెట్టిన – ఓ .....నవత – యువత –
నూతనోత్సవంబుతో – దివ్యయేసు – రక్షణంపు – వార్తన్ – నవ్యపద్దతులతో–
నీవు చాటన్ – నిదురబోవు – లోక వాసులెల్లన్ – నిదురలేపి – మేలుకొలుపు
పాడన్ ॥రారండి॥

– బోండ్ల సైమన్

## 730

చాయ : ఓ దేవ నేను నీ దాపున

పల్లవి : శ్రీయేసు నీ పాద – సేవ చేయుట
ఎంతో శ్రేయంబు చేకూర్చును
నా యేసు నీ పాద సేవ చేయుటచే
నా ఆయాసములన్నియు – అంతరించును ప్రభువా ॥శ్రీ యేసు॥

1. ఘోర పాపిని నేను – నేరంబులను చేసి
దారి తప్పిన ద్రోహిని – కారుణ్యమయుడవే
కరుణించి కాపాడి – దారిలో నన్నుంచి
దరి చేర్చుము తండ్రి ॥శ్రీ యేసు॥

2. దోసకారిని నేను – దోసంబులజేసి
దోసిలొగ్గితి ప్రభువా – దాసుండనో యేసు
నాథా నీదయచేత – దోసంబులనుబాప
దాసునిగ జే కొనుము ॥శ్రీ యేసు॥

3. సాతాను శక్తులను - సంధించి జయమొంది
సంతరిల్లిన యేసువా - నీతోనే నేనుండి
నిన్నే సేవించెద - సాతాను నోడింప
శక్తి నియ్యుము ప్రభువా ॥శ్రీ యేసు॥

4. అలనాడు శిష్యులను ఆదరించియు నెంతో
అభయమిచ్చిన యేసువా - ఇల నే దీనుడనయ్య
అలముకొని యున్నట్టి - కలుష భారములెల్ల
తొలగజేయుము తండ్రి ॥శ్రీ యేసు॥

5. నాదు జీవితమెల్ల - నీదు సేవకే నేను
ధారవోయిదు నా ప్రభువా
నాథా నారక్షకా నా సర్వస్వము నీవే
నీ పాద సేవయే - నా జీవితాశయము ॥శ్రీ యేసు॥

6. నీ కొరకే జీవించి - నిన్ను సేవించుచు
నీకొరకే మరణింతును - నీకే నా యాత్మను
నిజమొప్పనర్పించి నీ సన్నిధిలో నేను
నిత్యముందును ప్రభువా ॥శ్రీ యేసు॥

7. ఇదియే నా తుదియాశ - ఇదియే నా తుది కోర్కె
ఇదియే నా తుది ఆశయము - హృదయంబు
నీ కిత్తు పదిలంబుగ నేను - సదయుండా
నిరతంబు అందే నివసింపుము ॥శ్రీ యేసు॥

- రెవ.జి.టి. మార్కు

# 731

రాగము = భాగేశ్వరి తా -ఆదితాళం

పల్లవి : నీ నీడలో - బ్రతుకు సాగాలని
నీ బాటలో - నేను - నడవాలని
ప్రభూ - నా జీవితాశ - నెరవేరునా - నెరవేరునా

1. మతిలేక బ్రతికాను - గతిలేని బ్రతుకు
క్షతిలారని వెతలన్ని - సంప్రాప్తమాయె
హితమైన నీ వాక్య - భోజ్యంబులోనే
హితుడా నీ ప్రేమ - రుచి చూచినాను ॥నీ నీడలో॥

2. బాంధవ్యమనులోక - బంధాలలోనే
బందీగ ఉన్నాను - పొందాను వ్యధను
బలియైన అలనాటి - నీ ప్రేమ జూచి
బరువాయె మనసంత - శరణంటి నిన్ను ॥నీ నీడలో॥

3. కన్నాను నీప్రేమ - కల్వరిలోనే
విన్నాను నీ బోధ - వేదంబులోనే
నన్నాదుకొనువారు - విశ్వాస లేరు
ఉన్నావు నీవే - విమోచింప నన్ను ॥నీ నీడలో॥

- రెవ.బి. హెన్రీ

# 732 పశ్చాత్తాపము

పల్లవి : యేసు ప్రభువా నన్ను గావ
జీవదాయక నన్ను బ్రోవ (2)
మనసా వాచా కర్మణా నే పాపజీవిని పాపిని (2)

1. కరుణ సాగర కరములెత్తి - కరుణ కొరకు కాచుకొంటిని (2)
మనసా వాచా కర్మణా నే పాపజీవిని పాపిని ॥యేసు॥

2. సిలువ చెంత చేరితిపుడు - విలువ తెలిసి తిరిగి చేరితి (2)
మనసా వాచా కర్మణా నే పాపజీవిని పాపిని ॥యేసు॥

3. పాప పంకిల భార బ్రతుకును - పారద్రోలి పవిత్రపరచు (2)
మనసా వాచా కర్మణా నే పాపజీవిని పాపిని ॥యేసు॥

4. మధుర సేవ - నీదు సేవ జీవితాంతము చేసి తీరెద (2)
మనసా వాచా కర్మణా నీ సేవ చేసి తరించెద ॥యేసు॥

5. నీదు సాక్షిగా నేను మారగా - నీదు ప్రేమను పంచుము (2)
పరలోక నివాసమునకు - పరగ నన్ను చేర్చుకొనుము ॥యేసు॥

- రెవ.డా. యన్.జాన్ యస్.డి.రాజు.

## 733

*'Jesus the very Thought of Thee'*

1. యేసు ప్రభో నా ప్రాణమా
నా స్వామిన్ జూడగా
విశేష మాధుర్యంపును
వేగంబె బొందుదున్

2. నీ సన్నిధాన ప్రాప్తముల్
భాసిల్లు రీతిగా
నే జూడ నాదు జీవము
నిశ్చింతన్ బొందుగా

3. ఏ రీతిన్ నీదు ప్రేమను
వర్ణింప సాధ్యమా
నీ ప్రేమలోనే నేర్చెదన్
కృపాబ్ధి సూర్యుడా

4. యేసు మా ప్రేమ శైలమా
మర్త్యాంబ సూనుడా
వాసిగ నీకే చెల్లును
వేలాది స్తోత్రముల్

– అనువాదం : ఎ.ఎం. పామర్

## 734

*'I am not worthly Holy Lord'*

1. నే పాత్రుడంచు కోరను
నీ పాద సన్నిధి
నీ దివ్య వాక్కు మాత్రమే
నా కాంక్ష యేసువా

2. పాపిష్టి నాదు యాత్మను
కాపాడి తీర్చుమా
నా పాపమున్ క్షమించుచు
నీ చెంత జేర్చుమా



3. నేనర్హుడంచు నీ దరిన్
గానంగ నుందునా?
శుద్ధీకరించు రక్తమున్
సిద్ధించు పాపికి

4. యేసూ నీ రక్త ధారలు
భాసిల్లుచుండగా
వేసారి నాదు దీక్షయే
సుక్షేమ రీతిగా

అనువాదం : ఎ.ఎం.పామర్

# లంబాడ పాటలు

## 735

పల్లవి: లాలియో లావికేనీయో – ఓ బాళ యేసున దేవేరో
బేటకేనియో – కుంవ్యారి మరియారి – పేటేమా
హుయోఛ – ఊ బాళ యేసు – హుంస్సేతి ఝూంకరోచ

1. అపణేన బలారోచ ఉ యేసు దేవ ఆపణ్ పాప ధోంప కేరోచ
గల్గోత గట్లాపర్ ఓ యేసు దేవేన సిల్వాపర్ లట్కాదినే ॥లాలియో॥

2. అబజ అబజ ఆయోవాళోఛ
ఊ యేసు దేవ ఆపణేసేన లేజాయోవాళోఛ
బాపున దల్లదేనాక – ఓ యేసు దేవర వాటెమ చాలజోని ॥లాలియో॥

## 736

పల్లవి: మరియారి పేటేమా యేసు హుయోచ – సారి జగేన
రక్షణ దినోచ – ద్వకియారో ద్వకసే ఆచ్ఛోకిదోచ
ఆనందల్లేతి మన భరదీనోచ

1. బారే వర్సెమ యేసు బోధా కేరోచ – ఆందెవున టూంటెవున
ఆఛ్ఛో కీదోచ – ఆనందల్లెతి మన భరదీనోచ ॥మరి॥

2. బారవర్సతి యే ద్వకేమా రూంజన్న – యేసు దేవేరో సేలా ఛిపన
దీటిజన్నా – ఛీపీయా ద్వక మారో ఆఛ్ఛో వేగోచే
ఆనందల్లెతి మన భరతదీనోచ ॥మరి॥

## 737

పల్లవి: సామలోరే బంజార భాయిరే – సే జాగ అపణేన ఆశీఛ
యేసు సేనె మళోజెర వాసు – కత్ర కత్రాయికో ఖుశీఛ

1. ఖుశీతీ అపణ్ బడన్ జామాతో
శాంతితి ప్రభువు అపణేన చలావజనా
గట్లా మాయి – ఝూడేమాయి ॥2॥ ఢిలో ఘెగే కాడుచూ ॥సామ॥

2. ఖుశీతి అపణ నికళా జనా – శాంతితీ అపన్ గర్‌ది మారా జానా
ఝూడ ఝూడే – బమ్మోయి బమ్మోయి ॥2॥
ఘెగ్ కాడన్ కడిబోలుచూ బోలుచూ ॥సామ॥

3. వేల భావెటిమా దేవెర్ వెలెర్‌నయి – చలీయావుంచూ ప్రభుర్
ప్రేమెర్ వాసు – ఝూడ ఝూడ ధపె& మేలన్
హత ధెపడ్ ధెపడన్ రమ్మచు రమ్ముచు ॥సామ॥

## 738

పల్లవి: యేసువ దల్లేమా లేలోర గ్వారో – ఓరే సిలువారే వేలాన
దేకలోరే – సిలువపర్ రేడో జకోలోయి
ఈ జగతిరె పాపెన దోయో

1. తూ టాంగేతి పాపేన కీదోజన్నా
ఓరే టాంగేమా చీలానే మారలీదో ॥యేసున॥

2. తూ హతేతి పాపేన కీదోజన్నా
ఓరే హంతేమా చీలానే మారలేదో ॥యేసున॥

3. తూ ఛాతితి పాపేన కీదోజన్నా
ఓరే ఛాతిమా బరచితి మారలీదో ॥యేసున॥

4. తూ మాతేతి పాపేన కీదోజన్నా
ఓరే మాతేమా పాక డినె మేలలీదో ॥యేసున॥



## 739

పల్లవి: ఆయో యేసు జగేమా – హూయో మరియారి పేటేమా
లాయో ఆననందేనీ జగేమా
ఏగ్వార లోకో లేలోసే యేసున దల్లేమా ॥ఆ॥

1. యూదయ బేత్లేహేమాయి – గావడీరే కోటమేమా
హూయో యేసు బాళారెనాయి
ఏ జగేమా లేలోసే యేసున దల్లేమా ॥ఆ॥

2. పరమేతి సోజా ఆయో – ప్రభు యేసు హుయోచ కేగు
పాపిలోకో యేసున దేకో – ఏ జగేమా లేలోసే యేసున దల్లేమా ॥ఆ॥

3. పాపిరె పాపేనె ధోయో – రోగే దరద అచ్చోకిదో
భారీ దయాతి భరో యేసు – ఏ జగేమా లేలోసే యేసున దల్లేమా ॥ఆ॥

4. పాపి ఘూకన్ ఓపలేన – ప్రభురకన్నే యావజన్నా
ఓరే పాపేనే దోనాకీయా – ఉప్రభు యేసు ఓనే ఆనందేతి భరదియే ॥ఆ॥

## 740

పల్లవి: హల్లెలూయ గీదబోలా – హరఘాడి దీవెన ధావుంకరా
ఆ....హల్లెలూయా.....హల్లెలూయా.......హల్లెలూయా

1. సరీసైన్యమెన మోటో బాస్యాఛజకో దేవెన ధావుంకరా
సరీ సంద్రెవచెతి సుకో వాటేమా– చలాయో దేవెన ధావుంకరా ॥హల్లె॥

2. అస్మానే ఉంప్రెతి – మన్నానదీనోజకో దేవేన ధావుంకరా
భాట వాచె మాయితీ మీటో పాణి దీనోజే దేవెన ధావుంకరా ॥హల్లె॥

## 741

పల్లవి: గామె గామెర మాంయి – టాండె టాండెర మాంయి
ఉంచ కరరెచా మారె యేసుర వాత – మాలంకరరెచా
మారె యేసుర వాత

1. వాడ వాడర మాంయి – బజా బజరేర మాంయి
మల్కె మల్కేర మాంయి – పుంచ కరరెచ
వుంచ కరరెచా మారె యేసుర వాత
మాలం కరరెచా మారె యేసర వాత ॥గామె॥

2. గట్లా గట్లార మాంయి – బాగ బాగేర మాంయి
జునె ఘరుంకన – జునె ధాబుంకనె
వుంచకరరెచా మారె యేసర వాత
మాలం కరరెచా మారె యేసర వాతే ॥గామె॥

3. పాపిన దెకతాణిన్ – పక్కన సర్‌కో కోని
రోగిన దేక తాణిన్ – రోతా పడోకోని
ధంయి బలాయి చే మారె యేసుర వాతె
బాగు కరనాకి మారె యేసుర వాత ॥గామె॥

# 742

పల్లవి: యేసు రాజు రాజేరో రాజ – ఫరన ఆవుంకేగో
ఫరన ఆవుంకోగో – ఫరన్ ఆవుంకేగో
హోసన్నా జయము – హోసన్నా జయము
హోసన్నా జయం అపణేన

1. సంద్రేమా చాలజనా – ఓ వాగేమా చాలజానా
దరఛేని యేసుజ సోపత ॥2॥ హుంస్సితి గీద బోల ॥యేసు॥

2. జీవేరో రోగ రతో – ఊ దెల్రటీ రోగరతో
యేసుతోన ఛిపతాణిన్ ॥2॥ జీవ ణేతి భరదియ ॥యేసు॥

3. హల్లెలూయ గీదబోల – హరఘడి హల్లెలూయ గీదబోల
యేసు రాజు అపణేరో దేవ ॥2॥ ఫరన ఆవుంకేగో ॥యేసు॥

# 743 కృతజ్ఞతాస్తుతి

దేవ యెహోవ – ప్రేమ స్వరూప – జీవ ప్రదాత ప్రభో ॥

1. దినదినమున నన్నెనరుతో గాచెడి – ఘనుడవు నీవెగదా= గానము చేసెద
ననిశము నిన్ను – ఘనత మహిమ కలుగ ॥దేవ॥



2. సుందరమగు భూమ్యాకాశంబుల – చందము మదినెంచ= నందలి సూర్యుని,
చంద్రుని, చుక్కల – యందము నే గాంతున్ ॥దేవ॥

3. గాలిని నీటిని సూర్యుని రశ్మిని – పూలను ఫలములను= మేలుల గూర్చగ
సృజియించిన నీ – జాలిని స్మరియింతన్ ॥దేవ॥

4. ప్రేమించుటకై తలిదండ్రులను – ప్రియమగు గృహములను ఇమ్ముగ భోజన
పానాదులను – కూర్మిని గూర్చితివి ॥దేవ॥

5. పాపపు కూపములోనికి జారి – వా పోవుచు చే నుండన్ = ప్రాపుగ యేసుని
కాపుగ నిచ్చిన – కృపకై వందనముల్ ॥దేవ॥

6. జనకసుతాత్మా త్రియేకుడ దేవ – ఆనయము స్తుతిమహిమ ఘన ముగ నీకు
యుగ యుగములను కలుగునుగాక ఆమెన్ ॥దేవ॥

– సి.ఎ.జె.ప్రసాదరావు

# 744 పశ్చాత్తాపము

నీ చెడుతనమును మానకుకొని మారుమనస్సు నొంది
ప్రభువును వేడుకొనుము అ॥క్యా॥ 8:22
యేసు ప్రభువ! నేనింతకాము వృథాజేసితి, నా జీవిత మంతటిన్ –
అయ్యయ్యయ్యో ॥యేసు॥

1. నాయిష్టమే – నా సౌఖ్యమే – నా సొగసే – నా స్నే హమే
ఇవియే నాకే – ఘనమంటిని – అయ్యో , మూర్ఖుడనై

2. నీ వొసగిన – దేహంబును – నీవరములన్ – నీజ్ఞానమున్
నీ సేవకై – వాడనైతి – ప్రభువా – మన్నింపుమా

3. నీవు గాక – వేరెవ్వరు – దిక్కె నాకు – లేరంచును ఇపుడే
నేను – గ్రహించయించితి – ప్రభువా – గ్రహియించితి

4. నీ శ్రమలే – నీ సిలువె – నీ రక్తమే – నీ త్యాగమే
ఇవియే నాకు – శరణ్యము – ప్రభువా – రక్షణ్యము

5. చాలునిక – లోకాశలు – చాలునిక నా యిష్టము
ఇపుడే నేనీవెంట వత్తున్ ప్రభువా చేర్చుకొనుమా ॥

– సి.ఎ.జె.ప్రసాదరావు

## 745 పశ్చాత్తాపము

"ఇక మీదట నీ కుమారుడ ననిపించుకొనుటకు యోగ్యుడనుకాననెను" లూకా15:21

నిను తండ్రి యని బిలువ నేతగనో దేవా ! నిను రానీయక హృదయమును మూసికొంటిన్ – పనికిమాలిన మార్గమున నడచుచుంటి

1. నోటితోడనె నే నిన్నొప్పుకొనుచుంటిన్ – మాటలోనే కాని మదిలోన లేదె – పాటింపకుంటినిన్ బ్రతుకులోనయ్యో॥
2. నిన్ను వలె పొరుగువానిని – సరిగానెంచు – మన్న యాజ్ఞను నేను మన్నించలేదె – అన్నీ నాకేకావలె ననుచుంటినయ్యా॥
3. నీ వాక్య పఠనంబు నీ నామధ్యానం – బేవేళ నామదికి వెగటుగదోచె నీ వాక్యమన చెవులు వినవాయెనయ్యో॥
4. పరిశుద్ధుల సహవాస భావమేలేదు ఇరుగు పొరుగుల చెలిమి యిసు మంతలేదు – పరుల దూరము బెట్ట పరువంటినయ్యో॥
5. సాతాను వలలోబడి చలియింపలేక – ఏతావుగనలేక నిలులైతి నకటా – నా తండ్రీ యిక దిక్కు నాకెవరులేరే॥
6. నిన్ను నమ్మకొంటినిక నీవాడనౌదు – నను ముట్టి, లేపి జ్ఞానము, జీవ మిచ్చి – మనసును, హృదయమును మార్చుము దేవా

– సి.ఎ.జె.ప్రసాదరావు

## 746

రాగం : మిశ్రనటభైరవి　　　　తాళం : త్రిశ్రగతి

పల్లవి: అలసి సొలసి పోతిని – సేదదీర్చవా ప్రభూ!
ప్రశాంత జీవ జలముల – త్రాగనిమ్ము నిండుగ॥

1. దూరభారము లను నేను – పారజూడకుండ బోవ
గాలివాన సంభవింప – గుండెలోన గుబులు గలిగి॥
2. ముందు వెనుక జూడక – చెంగు చెంగు మంచు నెగుర
గుందురాయి కాలుదగుల – గుండెలోన గుబులు గలిగి॥
3. లోతుపాతు లెరుగక – ఎదురుగాను ఈదబోవ
గొంతుదాక మునిగిపోవ – గుండెలోన గుబులు గలిగి॥





4. మంచి చెడుగు లెంచక – కొంటెగాను సంచరించు
ఇంటివారె రోసివేయ – గుండెలోన గుబులు గలిగి ॥
5. కీడు మేలు లందున –మేలు మార్గమందు బోవక
కీడు సంభవింపగానె – గుండెలోన గుబులు గలిగి॥
6. జీవమరణమందలి – జీవమేమొ గానలేక
మరణ మెదురుపడిన వేళ – గుండెలోన గుబులు గలిగి ॥

– సి.ఎ.జె.ప్రసాదరావు

## 747

1. రమ్ము యెహోవారమ్ము ప్రభో – క్రమ్ముము నాదు హృదయమును= నా ప్రార్థనకు నీ చెవియొగ్గి – నామనవిని నాలకించుటకై ॥రమ్ము దేవ॥
2. విరివిగ వలచితి లోకమును – దరితము లెన్నోచేతిని భరింపలేని భారమును – హరింపజేసి రక్షింపన్ ॥రమ్ముదేవ॥
3. తలచితి నాదు పాపములన్ – తలచితివాని ఫలితములన్ తలంపుకే మది చెదరినది – తొలగింప నన్నాదురిత స్థితిన్ ॥రమ్ముదేవ॥
4. కరములు చాచి పిలుచుచుండన్ – త్వరపడి రమ్ము సహాయపడన్= మొరాలకించుము చెవియొగ్గి – బిరాన నను విడిపించుటకై ॥రమ్ముదేవ॥
5. నా రక్షకుండు విమోచకుడై – ఆనంద సంతోషముల నిచ్చు నా దేవునిన్ నే చూచుటకు – నేడే యాసించుచు వేచియుంటిని ॥రమ్ముదేవ॥
6. శుద్ధమగు హృదయంబును – సుస్థిరమగు విశ్వాసమును నిశ్చలభక్తిని నాయందున – నూతనముగా పుట్టించుటకు ॥రమ్ముదేవ॥
7. మలిపితి నీపై నామనసున్ – నిలిపితి నీపై నమ్మికను చలించ కుండగ కాపాడన్ – పాలింప రమ్ము పరమ తండ్రీ॥రమ్ముదేవ॥
8. కురిపించుము నీయాత్మన్ నా పై – వర్షించుము నీ కృపన్ నాపై=తరింప జేయుము నాతనువున్ – స్మరించెదను నిను నిరతమున్ ॥రమ్ముదేవ॥

– సి.ఎ.జె.ప్రసాదరావు

## 748 ప్రార్థన

"అడుగుడి మీకియ్యబడును. వెదకుడి మీకు దొరుకును" మత్తయి 7:7

వేచియుంటి నేసయా – ఆశతోడ నీకొఱకు ॥వేచి॥

1. ఆశ్రయించి అడుగు వారికి – అక్కరలను దీర్చెడి
ఆశ్రయంబు నీవె యనుచు – అభయ మిడితి గావున ॥వేచి॥
2. పట్టుదలతో నుపవసించి= ప్రార్థనలను సల్పెడి
భక్తున్ దర్శించి నీదు – శక్తినిత్తు గావున ॥వేచి॥
3. వ్యాక భావ మెరుగలేక – ఆత్మ నంపీ దెలుపమనగ
వాక్య భోజనంబు నిచ్చి జీవమిత్తు గావున ॥వేచి॥
4. కుమిలికుమిలి నీరసిల్లి – నలిగి విరగే గానలేక
కూర్మితోడ వెదకి వెదకి – విమోచింతు గావున ॥వేచి॥
5. మనస్సునందు శాంతిలేక – మార్గమేమి గానలేక
గాంచి బ్రోవుమనుచే వేదన్ – శాంతి గూర్తు గావున ॥వేచి॥
6. చెడ్డమనసు ప్రేరణమున – చెడ్డపనుల జేయబూన
శుద్ధమనసు నంపి నన్ను – అడ్డగింతు గావున ॥వేచి॥

– సి.ఎ.జె.ప్రసాదరావు.

## 749 క్రీస్తు పునరాగమునము

"ప్రభువు ఆగమనము సమీపించుచున్నది... యాకో 5:8

1. నీరాక సమీప్యమంచు – నేనిపుడే గుర్తించియుంటి నీరాక కొఱకై నా జీవితంబు నా యత్త పరచుము నా యేసు ప్రభో॥
2. నీరాక నిజమయ్య ప్రభువా – నేడో, రేపో, మరి యింకెపుడో= ఏ వేళనైన, ఆమర్మమును, నే – మది దలచ కృప నిమ్మో ॥యేసు ప్రభో॥
3. నీభీతి లేశంబులేక – ఎన్నెన్నో పాపాలుజేయ = వెనుకాడకుంటిన్, మితిమీరి పోతిన్ – నను నిలిపి స్థిరపరచుము॥యేసు ప్రభో॥
4. నా దీపమున నూనెలేదు – నా బ్రతుకున వెలుగేలేమి లేదు= సబ్భక్తి నూనె



శుద్ధాత్మా కాంతి – నా కొసగి వెలిగించుము ॥యేసు ప్రభో॥

5. కడబూర మ్రోగేటివేళ – మేఘాలు నిను మోయు వేళ = పరలోక వరుడా ఓ గొఱ్ఱెపిల్లా – నీ యొద్దకు నన్నెత్తుము ॥యేసు ప్రభో॥
6. విశ్వాస సంఘంబులోన – నీ జీవ గ్రంథంబులోన = నే జేర్పబడగ, ముద్రింపబడగ – రక్తముతో ముద్రించుము ॥యేసు ప్రభో॥
7. నిత్యుండ సర్వాధికారీ – నీ కొఱకు కనిపెట్టుచుండ= మోకాళ్ళు వంచి ప్రార్థించుచుండ – నీ యాత్మను నా కొసగుమ ॥యేసు ప్రభో॥
8. సర్వాంగ కవచంబు దాల్చి – వాక్యంబను ఖడ్గంబుబూని = సైతాను తోడ పోరాడుచుండ – బలమిమ్ము జయమిమ్ము ॥యేసు ప్రభో॥
9. నీ తీర్పు దినమందు రాజా – నీతి మంతుల సంఘమందు= నేనుండగలుగ కొనియాడగలుగ – నీతి వస్త్రము నిమ్ము ॥యేసు ప్రభో॥
10. నేనన్ని సమయంబులందు – నేనన్నికాలంబులందు = నీతోడగలిసి, జీవించగులగ – అనుభవము కలిగించుము ॥యేసు ప్రభో॥

– సి.ఎ.జె.ప్రసాదరావు

## 750

రా: శంకరాభరణం తా : త్రిశ్రగతి

పల్లవి: ..........లే లెమ్ము అంతరాత్మ లేచి త్వరగా సిద్ధపడుమా

1. యేసు ప్రభువు భూజనులను – తీర్పుతీర్చు తరుణమయ్యెన్ కడబూరను ఊదగనే – మేఘంబుపైన ప్రభువు వచ్చున్ మోక్షంబునకో, నరకంబునకో నిర్ణయించే తీర్పు తీర్చున్ ॥
2. నిర్లక్ష్యముగా, నిర్భయముగా – ఎంతకాలము నిదురింతువు, సర్వాధికారి ప్రభువగు – న్యాయాధికారి, యేసువచ్చున్, జీవంబునకో, మరణంబునకో – నిర్ణయించే తీర్పు తీర్చున్ ॥
3. దైవభీతి, భక్తిలేక – ఎంతకాలము జీవింతువు – దైవదూతల్, జీవ గ్రంథం తెరచి నీ క్రియలు తెలియ చదువన్ – పై కెత్తుటయో, దిగవిడు చుటయో నిర్ణయించె తీర్పు తీర్చున్ ॥

4. మరణించినన్, జీవించినన్ – ప్రతివానికి తీర్పుగలదు – దూతలతో భక్తావళితో – ఆర్భాటముగాను ప్రభువు వచ్చున్ – పరమ పథమో, అథోపథమో – నిర్ణయించే తీర్పు తీర్చున్ ॥
5. దేవుని గొఱ్ఱెపిల్లయై – యేసు క్రీస్తు వరుడై వచ్చున్ వధువైన క్రీస్తు సమయమున – పెండ్లాడనై ప్రభువచ్చున్, పెండ్లి విందో, త్రోయ బడుదో – నిర్ణయించే తీర్పు తీర్చున్॥
6. ఇపుడైన నీ పాపములను – పరిహరింపమని వేడుమా – ఇష్టదైనను మారుమనస్సు పొందిన యెడల రక్షణగలదు – కిరీటమో అగ్ని జ్వాలలో – నిర్ణయించే తీర్పు తీర్చున్ ॥

– సి.ఎ.జె.ప్రసాదరావు

# 751

రాగము : మిశ్రజంఝూటి తా: ఆది

పల్లవి: క్రీస్తులో మనమొక – నూత్న సమాజము క్రీస్తు నిగలిగి
నడచుటె మనవిధి॥

1. దేవుని వాక్యము నమ్ముట వలన
దేవుని వలన కలిగిన వారము
దేవుని ఆత్మను బొందుట వలన
దేవుని రాజ్యపు వారసులం
దేవుని ప్రతినిధులం॥

2. పాత స్వభావము విడచుట వలన
పాతాచారముల్ వదలుట వలన
నూతన జన్మను నొందుట వలన
నూత్న సమాజపు సభ్యులము
క్రీస్తు సంబంధులము ॥

3. క్రీస్తుని బోలి నడచుట వలన
క్రీస్తుని మనసును నొందుట వలన
ఓర్పును, త్యాగము, చూపుటవలన
క్రీస్తు సువార్తను చాటుటకు
క్రీస్తున సేవకులం॥

4. చీకటినుండి వెలుగుకు మనలను
పిలిచిన దేవుని గుణాతిశయములు
ప్రకటన చేయగ నేర్పరచెన్
దేవుని సొత్తగు ప్రజలనుగా
యాజక సమూహముగా॥

– సి.ఎ.జె.ప్రసాదరావు

# 752

రాగం : శంకరాభరణం తా : ఆది

పల్లవి: దయగల మా ప్రభువా – కరుణామయ యేసు భయభక్తులతో
నీ మార్గములో జీవింప తోడ్పడుమా

1. నీ వాక్యము నెల్లపుడు – వినువానిగనే గాక నీ వాక్యాను సారముగా – జీవింప తోడ్పడుమా ॥
2. "ప్రభువా" యని పిలువగనే – ప్రభు రాజ్యము దొరకదు ప్రభువ దేవుని చిత్తముగా – జీవింప తోడ్పడుము ॥
3. నీ ధర్మశాస్త్రము నెల్లన్ – అనుసరింప గలవాడనై నీతిమంతుని నెంచబడన్ – జీవింప తోడ్పడుమ ॥
4. నీమాటలు పాటించి – స్థిరమగు పునాది వేయు బుద్ధిగలవానిని బోలి జీవింప తోడ్పడుమా ॥
5. ఇతరుల రక్షణ కొఱకు – నిరతము కృషిసల్పుచును ఇతరుల యెడ నీ వలనే – జీవింప తోడ్పడుమ ॥

– సి.ఎ.జె.ప్రసాదరావు

## 753

యేసు క్రీస్తను – జీవ వాక్యమా నన్ను నడుపుమా – మోక్షపదమున ॥

1. ఆదినుండి తండ్రితో – కలిసియున్న వాక్యమా
పరిపూర్ణమైన – సంతోషమొంద
సహవాస మొన గూర్చుమా ॥

2. లోకమునకు వెలుగవై – తేజరిల్లు వాక్యమా
జీవంపు వెలుగు – ప్రసరింప జేసి
కనువిప్పు కలిగించుమా॥

3. సత్యమైన వాక్యమా నిత్యమైన వాక్యమా
వాక్యంబు నెపుడు – గైకొంచు నటచే
పరిపూర్ణ స్థితి నిమ్మయా॥

4. ప్రాణమే యర్పించిన – ప్రేమయైన వాక్యమా
మరణంబు నుండి – జీవంబు నొందే
పరమున్ ప్రసాదించుమా ॥

5. మంచి చెడుల నెల్లను – ఎంచి చూపు వాక్యమా
వంచించు ఆత్మన్ – ఖండించి గెలవన్
శుద్ధాత్మ బలమిమ్మయా ॥

6. సజీవమై. శక్తియై – వాడియైన వాక్యమా
ప్రాణాత్మలందు – శోధించి, వెదకి
సంపూర్ణ స్థితి నిమ్మయా ॥

– సి.ఎ.జె.ప్రసాదరావు

## 754

పల్లవి:ఓ నీతి సూర్యుడా క్రీస్తేసు నాధుడా
నీ దివ్య కాంతిని నాలో నుదయింప జేయుమా,
ప్రభూ నన్ను వెలిగించుమా॥

1. "నేనే లోకానికి – వెలుగై యున్నా" నని
"మీరు లోకానికి – వెలుగై యుండా" లని
ఆదేశించినావు గాన – నాలో నుదయించుమా,
ప్రభూ నన్ను వెలిగించుమా ॥



## 755

అద్భుతమైన నీ కృపలో మమ్ము మలచుము ఓ ప్రభూ
అనంతమైన నీ కృపలో మమ్ము మార్చుమో ప్రభో
మమ్ము మార్చుము

1. ఎన్నో అఘముల నెరిగి చేసితిమి
తిన్నని మార్గము తొలగి తిరిగితిమి
కానరాని క్రియలెన్నో చేసి
మనసున శాంతి లేదాయను ॥అద్భుత॥

2. స్వనీతియే మాకతిశయమాయను
సత్క్రియలే మా కాస్పదమాయెను
మతి లేని క్రియలతో మేము అలసి యుంటిమి
పతితులమై కృపన్ వేడితిమి ॥అద్భుత॥

3. కలువరిలో మా కలుషము బాపితివి
సిలువలో బలియై ప్రేమను చూపితివి
విలువను కూర్చి మమతల నొసగె
పలువిధ కృపలను ఇచ్చితివి

4. నీ కృపయే మా భయమును తీర్చెను
పాపము బాపి మా కభయము నిచ్చెను
నీ కృపయే మాకాధార మాయెను
మా దోష భారము తొలగించెను ॥అద్భుత॥

– రెవ.జి.యస్.సువర్ణరాజు

## 756

సమృద్ధి జీవము క్రీస్తునిలో పొందుండి ప్రియులారా
ప్రవహించుచున్నది జీవ నది త్రాగుడి ప్రభుపేర
యేసే నిత్య జీవము యేసే జీవ మార్గము
యేసే నిజదైవము నమ్మినవారికి పరలోకము

1. జీవుల కన్నులు ప్రభువైపు – చూచాను ఆహారము కొరకు
ప్రేమతో దయచేయును ప్రభువు – కోరినవరములను

2. జీవన ఊటలు హృదయములో - ప్రవహింపచేయను ప్రభు యేసు
జీవన దాత మనచెంత - జీవితకాలమంత

3. ఎండిన ఎముకలు బ్రతికెగద - నిండగు జీవ శరీరముతో
లేచిరి మృతులు ప్రభువు పిలువ - జీవన సాక్షులుగ

4. మరణమె మరణించెను చూడు - సిలువలో యేసుని మరణముతో
లేతురు మృతులు ఒక దినము - మహిమ శరీరముతో

5. క్రీస్తు శరీర సహజములో - క్రీస్తులో పోలినడిచెదము
ప్రభుభోజన సంస్కారములో - జీవము పొందెదము

- రెవ. జి.రాజరత్నం

# 757

ఆత్మనొసగుమయా పావనాత్మ నొసగుమయా
శుద్ధాత్మ దేవా - శుభముల దాత
ఉజ్జీవ మీయుమయా ॥ఆత్మ॥

1. సీయోను గిరిపైన - ఉన్నత గృహమందు ॥2॥
నీ ఆత్మ వరముల నొందిన శిష్యుల
అనుభవ మీయువయా ॥ఆత్మ॥

2. యొర్దాన్ తీరమున - పావుర రూపమున ॥2॥
నీ సుతుడేసుకు - ప్రభవించితివే
ఆ యాత్మ నొసగుమయా ॥ఆత్మ॥

3. జీవన యాత్రలో ఎన్నెన్ని అవధులున్నా ॥2॥
పునరుత్థాన శక్తితో నింపి నవజీవ మీయుమయా ॥ఆత్మ॥

4. ఈ మా సంఘములో - ఐక్యత సమకూర్చి
పరిశుద్ధాత్మ - శక్తితో నింపి - పావన పరచుమయా ॥ఆత్మ॥

- బిషప్ దైవాశీర్వాదం గోవాద



# 758

రానిమ్ము దైవ రాజ్యం
భువిలోన యేసునాధా
నీ శాంతి సాధనముగా
మార్చుమా నను నీ చేతిలో ॥రా॥

1. నీ నీతి రాజ్యపు అవధులలో
కన్నీటి ఊటలు ప్రవహింప నీకు
నీ నీతి న్యాయం పాలించని నిరతం
నీ శాంతి రాజ్యం ఈనాడె మాకిడుమా ॥రా॥

2. అకాల చావులు కాన రానీకు
ఆకలి కేకలు వినరానీకు
దైవ మానవ ధర్మం వసించ నిరతం
నీ ప్రేమ రాజ్యం ఈ నాడె మాకిడుమా ॥రా॥

3. యువతీ యువకుల నిరాశలు
నిట్టూర్పు నిస్పృహ రానీకు ఆదరి
విముక్తి స్వప్నం ఫలించును నిరతం
పావన రాజ్యం ఈ నాడేమాకిడుమా

- బిషప్ దైవాశీర్వాదం గోవాద

# 759

దినమంతా ప్రభు స్తుతియింతు
అనయము యేసుని భజయింతు
అనిశము దేవుని ఆరాధింతు -2
తనవు మనసు అర్పణచేతును ॥దిన॥

1. నా అంతరంగమా - నా సమస్తమా
పరిశుద్ధ దేవుని స్తుతియించుమా
ఆయన చేసిన ఉపకారములను -2
దేనిని నీవు మరువకుమా -2 ॥దిన॥

2. నీ దోషముల క్షమించు వాడు
నీ సంకటముల తానే కుదుర్చున్

నీ ప్రాణమును మరణము నుండి -2
తానె తప్పించి, విమోచించువాడె -2 ॥దిన॥

3. నీ ప్రార్థనలకు చెవియొగ్గు వాడు
నీ మొఱలను తానాలకించును
నీ శ్రమలన్నిట ఆసన్నుడుగా
నిను కాపాడును కరుణించున్ ॥దిన॥

## 760

సమృద్ధి జీవమా - సంపూర్ణ ప్రేమయా
సజీవ వాక్యమా - మా యేసు దైవమా
హల్లెలూయా - హల్లెలూయ
హల్లెలూయా - హల్లెలూయ

1. తీరని వ్యాధితో - దరినెవ్వరు లేక
మారని వ్యధలతో - నిరీక్షణ లేమితో
కోనేటి దరిని - కనుగొంటివి నను
మరణము బాపి - జీవము నిచ్చితివి ॥సమృద్ధి॥

2. పాపపు దాహముతో - లోకపు మోహములో
శాపమే జీవితమై - ముఖము చూపలేక
తాపపు వేళలో - బావికి పరుగిడి
ప్రభునే గాంచి - జీవజలం పొందితి ॥సమృద్ధి॥

3. అంధుడనైతిని - చీకటి బ్రతుకులో
వీధుల తిరుగాడితి - జీవన లేమితో
పరిపూర్ణ ప్రేమతో - కరమునుచాపి
వెలుగును నొసగి - జీవమునిచ్చితివై ॥సమృద్ధి॥

4. ఎంతో వ్యయపరచితి - స్వస్థత నొందుటకై
చెంతకు రార్వెరూ - నా స్థితిగమనించి
కరుణామయుని - చెంగునితాకి
వితను గాంచితి - నవజీవ మొందితి

వెరి. రెవ. జి. యస్. సువర్ణరాజు



## 761

ప॥శ్రీ యేసుని స్తోత్ర గీతం కలసి పాడుదమా
సంపూర్ణ జీవితమునకు సాగిపోవుదమా
సంఘమా ముందుకు సాగుమా
జీవిత యాత్రలో దేవుని సేవలో

1. అపోస్తలుల జీవితం హతసాక్షుల అనుభవం
కావాలి జీవిత ఆదర్శము
కలిగి యుండాలి స్థిర విశ్వాసము
యేసు వైపు చూచుచు సిలువ భారం మోయుచు
సాగించు నీ యాత్రిక పయనము॥సంఘమా॥

2. ఇంటింట ప్రార్థన - ప్రతి సంఘారాదన
మరచిపోవద్దు ప్రభు సంస్కారము
కలసి ధ్యానించు దేవుని వాక్యము
అవయవాలు ఎన్నున్నా ఒక్కటే శరీరం
సాగించు సమసమాజ జీవనం ॥సంఘమా॥

3. కపట సాక్షులు ఎందరో
క్రీస్తు దేవుడు కాదని
పలుకు తియ్యని తేనె బోధలు నమ్మకు
పూర్వనమ్మిక నుండి ఎన్నడు తొలగకు
ప్రాథమిక పాఠాలతోనే కాలమంత గడపకు
సాగించు ప్రగతి పథమున జీవితం॥సంఘమా॥

4. క్రియలు లేని నమ్మిక సాగించకు నీవిక
పొరుగు వాని ప్రేమించు నీవలె
శత్రువులను మన్నించు ప్రభువలె
అవసరములో ఉన్నవాని ఆదుకొనేటే న్యాయము
సాగించు ఈ ధర్మ కార్యము ॥సంఘమా॥

5. ప్రభుని వార్త ప్రకటన
ప్రజల కొరకై నివేదన
నీ ధ్యేయం కావాలి సంఘమా
ఈ భారం నీదే గమనించుమా
త్రియేక దైవం అందించు సాయం
సాగించే ప్రభుని వార్త మహోద్యమం॥సంఘమా॥

– రెవ.జి.రాజరత్నం

## 762

శరణం శరణం నా ప్రియ యేసు
చేరితి నీ దరినీ నా దేవ ॥శరణం॥

1. ఎన్నో అఘము నొసరించితినీ
కన్నులే కానక చరియించితిని
మన్నించుటకే పాత్రుడనుకాను
కనికరపూర్ణుడా కృపనే చూపుమా ॥శరణం॥

2. చెడుగులతో జత చేసితిని
అడుగులు తడబడి నడయాడితిని
ఇడుముల పాలై పతనము నొందితి
కడకే నా దరి శరణని చేరితి ॥శరణం॥

3. రక్షణ నొసగి పావన పరచి
అక్షయ భాగ్యము నొసగితివి
మోక్షపదమ్మున నను నడిపితివి
రక్షకుడా గైకొనుమా వందనం ॥శరణం॥

4. నమ్మితి నయ్యా నీ చరణంబుల
నెమ్మది నొసగుము నా మదికి
నమ్మిన వారికి ఆదరమిచ్చెడి
సమ్మతుడా నా సదముల విభూడా॥శరణం॥

వెరి. రెవ. జి. యస్. సువర్ణరాజు



## 763

నీవుంటే చాలును యేసయ్య – కొదువేది లేదయ్య
నీ కంటె ఘనమైన వారు – ఎవరు లేరయ్య
నా వంటి దీన పాపికి శరణం నీవయ్య ॥నీవుంటే॥

1. సర్వము తెలిసిన వాడవు – సర్వబలమున్న వాడవు
సర్వం తానైనవాడవు నీవే యేసయ్య ॥2॥
అన్ని కాలాలలోన ఉన్నాను అను వాడవయ్య ॥నీవుంటే॥

2. సకల సిరి సంపదలున్న – శక్తి సామర్థ్యములున్న
ఎన్నున్నా అన్నీ సున్నా – నీవు లేకున్న ॥2॥
కలిగినది కొంతైన ఎంతో తృప్తి నీవున్నా ॥నీవుంటే॥

రెవ. జి. రాజరత్నం

## 764

ఆ.....ఆ......ఆ.....
నా హృదయం స్థిరమాయె
స్తుతి గానము నే చేసెదను
నా ఆత్మయు స్థిరమాయె
ప్రభు యేసుని నే పాడెదను ॥నా॥

1. నీ కృప ఎంతో ఎ–త్తైనది
నీ సత్యం బహు ఘనమైనది
నీ కృపలో, నింపగ నన్ను
సరి చేయుము నా జీవితము॥2॥ ॥నా హృదయం॥

2. వ్యధలెన్నో నను చుట్టినను
తుదకు మరణమే చేరినను
విడువను ప్రభువా, నీ సన్నిధిని
విడనాడను నీ పెన్నిధిని ॥2॥ ॥నా హృదయం॥

## 765

సోదరులంతా ఐక్యతా కలిగి
నివసించుట ఎంత మేలు
నివసించుట ఎంత మనోహరం
అ॥ప॥ మనోహరం ఎంతో మనోహరం
సోదరులైక్యత మనోహరం

1. తలపైన పోసిన పరిమళ తైలము
ఎంత మనోహరం – పరిమళం – ఎంత మనోహరం
అహరోను గడ్డము మీదుగ అంగీల అంచువరకు
జారెడు తైలం మనోహరం ॥మనో॥

2. సీయోను కొండలమైన వర్షించు హిమము
ఎంత మనోహరం – హిమము – ఎంత మనోహరం
హెర్మోను కొండనుండి ప్రవహించు మంచు వంటి
ఐక్యత ఎంత మనోహరం ॥మనో॥

3. దివినుండి వచ్చిన దైవకుమారుడు
ఎంత మనోహరం – యేసు – ఎంత మనోహరం
సహవాస జీవితాన – ఆ ప్రభుని దీవెన వాన
ఎంత మధురం మనోహరం ॥మనో॥

## 766

వరనామమే యేసు వరనామమే
శుభనామమే క్రీస్తు శుభనామమే
వరనామమే శరణు వరనామమే
శుభనామమే శరణు శుభనామమే

1. ఉన్నాను అనువాడు వరనామమే
ఎన్నడూ మారడు వరనామమే
దేవుడు మనతోడు వరనామమే
నిన్న నేడు ఎపుడు వరనామమే ॥వర॥



2. సర్వ శక్తి దేవ వరనామమే
చూచుచున్న దేవ వరనామమే
సైన్యముల కధిపతి వరనామమే
ఆద్యంతముల కాంతి వరనామమే ॥వర॥

3. దవళవర్ణుడు యేసు వరనామమే
పరలోక తేజస్సు వరనామమే
నీతి సూర్యుడు యేసు వరనామమే
సాటిలేని యేసు వరనామమే ॥వర॥

బిషప్ దైవాశీర్వాదం గోవాడ

## 767

మార్గం సత్యం జీవం నీవే
ఆది ఆధారం అంతం నీవే ॥మా॥

1. భాగ్యం నీవే భారం నీవే
భారం నీవే భాష్యం నీవే
వాక్యం నీవే వసంతం నీవే
విజయం నీవే విమోచన నీవే ॥మా॥

2. పాలన నీవే పోషణ నీవే
ప్రబలం నీవే ప్రసాదం నీవే
ప్రార్థన నీవే ఫలితం నీవే
పునీతం నీవే ప్రకాశం నీవే ॥మా॥

3. శరణం నీవే శ్రావ్యం నీవే
సహనం నీవే స్వాంతన నీవే
సదనం నీవే సఫలం నీవే
సకలం నీవే సర్వం నీవే ॥మా॥

## 768

ఎల్లకాలములో – ఎల్లవేళలలో
దేవా నిన్ను నే – స్తుతింతు
తండ్రియు నీవే – తల్లియు నీవే, బంధువు నీవే
నిన్ను నే స్మరియింతు
ఆదియు నీవే – అంతము నీవే జ్యోతియు నీవే
నిన్ను నే కీర్తింతు
కష్టములోను నష్టములోను దుఃఖములోను
నిన్ను నే సేవింతు

## 769 దైవ నరావతార సప్త ఫలములు

1యెహాను 3,4,5 అధ్యాయాలు

ఛాయం :ఏమి జన్మంబు ఏమి జీవనము

పల్లవి: దేవుడే – అవతారుడాయెను – సంపూర్ణ మానవ శిశువుగానే జన్మమాయెను= దైవ వక్తలు ఏళ్ళ తరబడి దైవ రాకను భువికి తెలుపగా – దేవ దూతల గాన మూలాకాశ మంగళా హారతులతో॥దేవుడే॥

1. భువిని కన్య మరియాంభ గర్భమున – బెత్లెహేమనెడు దావీదు పట్టణమందున – పన్నుగా నరపుత్రుడై – యా పశువులశాలలో జన్మమొందెను – పొత్తిగుడ్డల చుట్టబడియు – పశుల తొట్టెలో పరుండ బడెను ॥దేవుడే॥
2. పాపహరుడై జన్మమెత్తెను – పాపులను బ్రోవ ప్రాణ బలినే చేయవచ్చెను – ప్రాణ బలిచే తండ్రి ప్రేమను పుడిమిలో ప్రత్యక్ష పర్చెను – పాప ప్రాయశ్చిత్తమై తన శాంత ఫలమునే మన కీయవచ్చెను ॥దేవుడే॥
3. సాతాను క్రియలు – మోస కృత్యములు – హతమార్చుటకు యా దివ్య సుతుడుగా నవతరించెను – భూతములు పిశాచి పీడితులందరిని రక్షింప వచ్చెను – వాస్తవంబుగా లోకమందు పిశాచినే లయ పర్చవచ్చెను ॥దేవుడే॥
4. జీవమియ్యను జన్మమెత్తెను – సంపూర్ణ జీవము మానవులకు తాను తెచ్చెను – దైవ జీవమే తానటంచు దృఢముగా సెలవిచ్చియుండెను – దేవ జీవమే మనకు నియ్య బాల శిశువై జన్మమెత్తెను ॥దేవుడే॥



5. రక్షకుడుగా నవతరించెను – మన పక్షమున తా శిక్షలన్ని భరింపచ్చెను – రోగములలో వ్యాధులందు – శోధనలు మరి కీడులందు లెట్టి కాలము నందైన దండి రక్షకుడై యుండ ॥దేవుడే॥
6. సత్యదేవుని ఎరుగునట్లును – మానవులంతా నిత్య తండ్రిని తెలసుకొనుటకును – తానే దేవుని రూపమై – తన దివ్య జ్ఞాన వివేకములను బోధలందు మనకు నిచ్చి – తండ్రి ప్రేమను మనకు చూపను ॥దేవుడే॥
7. దేవుని వాక్యమే శరీరమాయెను – దైవ పరిపూర్ణ తింతే క్రీస్తు నందే నివాసమాయెను – దైవ పూర్ణుడైన క్రీస్తుని కృపయు సత్య సంపదలతో ఆత్మ రూపమందే నిత్య నివాసుడై యుండ వచ్చెను ॥దేవుడే॥

*– గోవాడ దేవమణి*

## 770 క్రైస్తవ జీవిత సూత్రములు

పల్లవి: సామాన్యమటండే – సత్క్రైస్తవులై
జీవించుట – పరిపూర్ణులై జీవించుట॥సామాన్య॥

1. మారు మనస్సు కలిగియుండ వలెను – మూఢగుణములు మానవలెను మోస కృత్యములు విడువవలెను – మహిని క్రీస్తునే సేవించవలెను॥సామాన్య॥
2. గాలి ధూళి సైతాను పూజలు – పలు వతా మాయ పూజలు సలలితీముగా శారీర క్రియలు మానవలె లోక భోగము లెల్ల ॥సామాన్య॥
3. తండ్రి దేవుడని విశ్వసించాలి – కుమారుడేసుని కృపను నమ్మాలి – పావనాత్ముని మదిని నమ్మాలి – పరిశుద్ధ త్రిత్వమునే నమ్మియుండాలి ॥సామాన్య॥
4. దశాజ్ఞాలను సరించాలి – దైవ వాక్కులను మదినంచాలి – దేవ యేసుని పోలి నడవాలి – దైవ గ్రంథమునే పఠించుచుండాలి ॥సామాన్య॥
5. శిలువ గుర్తు నొందు విశ్వాసులంతా – సిలువ క్రీస్తుని విశ్వాస మందు – సిగ్గు నొందక భువిలో నొప్పుకొనుచు – చావుదనుక సాక్షమిచ్చుచుండాలి ॥సామాన్య॥
6. దేవుని బిడ్డలమై – బ్రతుకు చుండాలి – దైవ రాజ్యము నొంది యుండాలి – దేవ యేసుని దేహమవ్వాలి – దేవుని నిత్యము ప్రార్థించుచుండాలి ॥సామాన్య॥

*– గోవాడ దేవమణి*

## 771 శత్రువులు – చింతలందు ప్రార్థన
(దా॥కీ॥3)

పల్లవి:దేవా నను బాధించువారు లేచి యున్నారు – భువి యందు శత్రువులు నను చుట్టియున్నారు – అవనిలో బహు గేలి సేయుచు నన్ను చాటుచున్నారు. ॥దేవా॥

1. నీవే నాకు కేడముగాను – నా తల నెత్తిన బలశూరుడవని నా – అతిశయ కారణ భూతుడవని నీ శరణని నమ్మితి కరుణతో బ్రోవవే ॥నా దేవా॥
2. కంఠమెత్తి నే మొరలిడునపుడు – మింట నుండి నాకభయ మిచ్చితివి సందెట నన్ను చేర్చియుంటివి ఒంటరినై నీ కడ నుండగా ॥నా దేవా॥
3. నేను పండి నిద్రించుచుండగా – వేన వేరు శత్రువులు చుట్టగ నను – పన్నుగా గాచి నను దీవించితివి – వనయము నిను నే స్తుతియింతును ॥నా దేవా॥
4. వ్యాధులు – బాధలు, శోధనలు బహు – వ్యాకులములు పలు నను క్రమ్మియుండగా – మేదిన – దయయని నమ్మితిని నన్ను ఆదరమున నీ దయ చూపించిన ॥నా దేవా॥
5. జనక సుత శుద్ధాత్మకు మహిమయు – ఘనతయు స్తోత్రము నిరతంబును అనయముగా నీకే చెల్లును – తరములు నీకు మహిమౌ గాక ॥నా దేవా॥

– గోవాద దేవమణి

## 772 పరిశుద్ధాత్మ కొరకు ప్రార్థన

పల్లవి: పరిశుద్ధాత్మ, పావన రూపుడా – నిత్యడవగు ఓ దేవా – నిరతము నీ సంఘములో నుండెడు – పరమోన్నత జ్వాల

ఆది యందు నగాధ జలములందల్లాడిన దేవా – మేది నీ భక్తుల ఈవుల నొలగుచు సాక్షులనుజేసిన దేవా ॥పరి॥

1. ఆది భక్తులందరిని నడిపిన ఆత్మయౌ దేవ – సాధులగు ప్రక్తల బోధలు మాకిచ్చిన దేవ= ఆ మహా శూరత అతి ధైర్యంబులు – అతులిత జ్ఞానము తగు వివేకములొసంగిన దేవ – అనయము తెలియు – ఘన భయభక్తుల మా కిడిన దేవా ॥పరి॥



2. పెంతెకొస్తున భువికరుదెంచిన ప్రేమాయౌ దేవా – పరమునుండి ప్రత్యక్షుడవైతివి పొందిన భక్తులకు ప్రవచన వరములు పలు విధ భాషలు పరమాద్భుతములు పరగ నొసంగిన దేవా – పోయుము నీ కృప వరములతో ఇపుడు నీ సభ బలపడగా ॥పరి॥
3. ఆత్మ వరంబులు – ప్రేమా ఫలములు దయ చేసిన దేవా – ఆత్మ జ్ఞానము నీతి ఫలంబులు తేటగ మాకిమ్ము = నవ జీవతము నిర్మల భక్తియు నిత్య జీవము – నిహమున నే నమ్ము – నిరతమున సంఘములో మేము వరములతో పెరుగన్ ॥పరి॥
4. [1]ఆరుచున్నవి నీదు సంఘములు ఆత్మయౌ దేవా – ఓర్పుతో మా సంఘంబులందుండి నేర్పుతో నడిపించు ఎండిన శల్యములను గుమి గూర్చి – ఎలమిలి జీవింపను చేయు – పోయుము నీ సత్యాత్మతో – సభలో నుజ్జీవము నొంద ॥పరి॥
5. ధన్య మరియ నావేశించి ప్రభు యేసుని మా కిచ్చి పుణ్య బోధలు దివ్యాద్భుత జీవితమును చూపి – ఘనుని సిలువ మరణ పునరుత్థానారోహణ ఫలములు చూపి పన్నుగ మాతో నజ సహకారియై జీవింపగ జేసి

– గోవాద దేవమణి

## 773 దైవ రాజ్యపు జీవితము ధన్య జీవితము

పల్లవి: ధన్య జీవిత మరయ రండి – మాన్యుడేసుని జీవిత నుండి – ఘనుడేసు బోధించెనండి – దివ్యమైన కొండ నుండి ॥ధన్య॥

1. ఆత్మయందు దీనులైన వారలే బహు ధన్యులండి – దైవ రాజ్యము వారిదటంచు – ప్రభుడు యేసే తెల్పినాడు సుండి॥ధన్య॥
2. పాపపశ్చాత్తాపంబొంది – పరగ దుఃఖము నొందెడు వారలు – ప్రభుని వలన నాదరణ నొంది పరమ సంతోషమున చేరెద రండి – ఇల సాత్వికులే ధన్యులండి దైవ సుతుడు సెలవిచ్చెనండి – నిహ లోకము స్వతంత్రించుకొని ధన్యులై జీవించెద రండి ॥ధన్య॥

3. నీతి యందు ఆకలి దప్పులను మతిలో కలిగిన విచారముల నుండి – తృప్తి తీర దీవెనలండి – కీర్తనలతో జీవించెదరండి ॥ధన్య॥
4. కనికరము గలవారే ధన్యులు – కనికరమునే పొందుదురండి – కరుణ గల శ్రీ యేసుని వలెనే కనికరమునే చూపుదు రండి ॥ధన్య॥
5. శుద్ధ హృదయములు ధన్యులటంచు – శుద్ధుడగు శ్రీ యేసుని – సుబుద్ధి తోడ వారు దేవుని నిత్యము దర్శించెద రండి ॥ధన్య॥
6. శాంతిని నెలకొల్పెడి వారు – కాంతిగల దేవుని పుత్రులు – కాంతితో దేవుని స్వరూపము – నొంది భువిలో పెరుగుచుందురు ॥ధన్య॥
7. నీతి కొరకై హింసలొందెడి – నాయకులే బహు ధన్యులండి – దైవ రాజ్యము వారిదటంచు – ప్రభువు క్రీస్తే తెల్పెనండి ॥ధన్య॥
8. నిందలు అబద్ధపు చెడ్డ – వాదులు మీరి – హింసలైన మెండుగా మీ పైబడి యున్న – దండిగా యానందించండి ॥ధన్య॥
9. ఉప్పుసారము గలిగి మీరు జీవిత మరయ రండి – ఒప్పు మీరా ప్రభుని వలెను – తప్పకను జీవించ రండి ॥ధన్య॥
10. దీపముల వలె లోకమందు దివ్య వెలుగును చూప రండి దైవ వెలుగే మీ యందుండు దివ్యలై ప్రకాశించండి ॥ధన్య॥
11. సత్య జీవిత మరయ రండి – సత్క్రియలనే చేయరండి – సుప్రకాశమైన వెలుగు – లోకమందు చూపరండి ॥ధన్య॥

– గోవాద దేవమణి